శ్రీ

# ఆంధ్రసాహిత్య
# పరిషత్పత్త్రిక.

రెండు నెలల కొకసారి ప్రకటింపఁబడును.

(Journal of the Telugu Academy.)

సంపుటము. ౨౪ { యువనామసంవత్సరము. చైత్రవైశాఖమాసములు. } సంచిక ౧.



కాకినాడ:

కొత్తపల్లి సూర్యారావుచే పరిషత్కార్యాలయమునఁ

బ్రకటింపఁబడినది.

చందా, పోష్టువ్యయములతో సంవత్సరమునకు రు. ౩-౦-౦.

విడిసంచిక రు ౦-౮-౦.

1935.

# వి ష య సూ చి క.

శ్రీరస్తు.

# సింహాసనద్వాత్రింశిక.

ప్రథమభాగము.

## కొఱవి గోపరాజకవికృతము.



కా కి నా డ:

ఆంధ్రసాహిత్యపరిషత్తువారిచేఁ బ్రకటింపఁబడినది.

1936.

వెల రు 0-12-0.

కాకినాడముద్రాక్షరశాల, కాకినాడ.

# ఆంధ్రసాహిత్య
# పరిషత్పత్త్రిక.

కా కి నా డ.

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

సంపుటము ౨౪. { యువనామసంవత్సరము. చైత్రవైశాఖములు. } సంచిక ౧.

## సప్తమవిజయాదిత్యుని రెండునూతన తామ్రశాసనములు.

— రాళ్లబండి సుబ్బారావుగారు, ఎం. ఎ. ఎల్. టి; ఎం. ఎ. యు. యస్. —

---

తూర్పుచాళుక్యవంశమునకుఁజెందిన యీరాజుతామ్రశాసనములు (రెండు జతలు) తూర్పుగోదావరిజిల్లాలోని ర్యాలిగ్రామమున 1924 వ- సంవత్సరమున క్షత్త్రియు లొకరు తమయింట మట్టిని త్రవ్వుచుండఁగా వెలువడినవి; వానిని మద్రాసు ప్రభుత్వపు శాసనశాఖవారు జిల్లాకలెక్టరుగారిమూలమునఁ దెప్పించుకొని వారి 1924—25 సం॥రపు నివేదికలో సంక్షిప్తముగా వానినిగుఱించి సూచించిరి. వారియనుమతితో మాస్నేహితు లగుడాక్టరు మ. చిలుకూరి నారాయణరావు, ఎం. ఎ. ఎల్. టి పి. హెచ్. డి. గారు, ఈశాసనములను బరీక్షించి, పాఠములను వ్రాసి 1926 వ సంవత్సరమున "ఆంధ్రేతిహాసపరిశోధకమండలివారి" సభలో నుపన్యసించిరి. తర్వాత నాంగ్లమున హిందూదేశశాసనావళి యనుపత్త్రికయందు సవిస్తరముగఁ బ్రకటింపనిశ్చయించిరి. కాని యేలొకో యింతవఱకు నీశాసనద్వయ మెందును బ్రకటింపఁబడలేదు. ఈనడుమ మఱికొన్ని శాసనముల పాఠములతోపాటు వీనినిగూడ నా కంపిరి. ఇదివఱలో నీరాజుయొక్క పాములవాక తామ్ర

శాసనమును, ఆంధ్రేతిహాసపరిశోధకమండలి వారి త్రైమాసికపత్రికలో (రెండవ సంపుటము, 277—289 పుటలు) నేను ప్రకటించి యుండుటచేత, వీనినిగూడ నాంగ్లమున, ఆమండలివారి పత్రికయందుఁ బ్రకటింప నిశ్చయించి, యాంధ్రమున మహారాజశ్రీ జయంతి రామయ్యపంతులు, బి. ఎ. బి. యల్. గారి కోరికపైని "ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక"యందుఁ బ్రకటించుచున్నాను. డాక్టరు నారాయణరావుగారు నాకుఁ బంపిన వారిచిత్తువ్యాఖ్యానమునందును, వారిపాఠములందును దగుసవరణలను జేసి నేనీవ్యాసమును వ్రాసితిని. వారికిని, నామిత్రులగు శ్రీ రామయ్యపంతులుగారికిని, నాకృతజ్ఞతాపూర్వకానేకవందనముల నర్పించుచున్నాఁడను. నాయొద్దనున్న రెండుజతలశాసనముల ముద్రలను బరీక్షించి, పాఠములను సంస్కరించి, పాఠకుల యుపయోగార్థమై ఛాయాముద్రలసహాయమునఁ బాఠములను బ్రకటించుచున్నాను. ఈశాసనములయొక్క రాగిరేకులు ప్రస్తుతము చెన్నపురి వస్తుప్రదర్శనశాలయందుఁ గలవు.

2. శాసనముల వర్ణన:—మొదటిజత (C. P. No. 8 of 1924-25) యందలి రాగిరేకులు $9\frac{3}{4}''$ పొడవును, $5\frac{1}{4}''$ వెడల్పును గలిగియుండఁగా రెండవజత (C. P. No. 9 of 1924-25) యందలిరేకులు, $10\frac{1}{4}''$ పొడవును, $5''$ వెడల్పును గల్గియున్నవి. మొదటిజత (కడియము, ముద్రసహా) 354 తులములయెత్తును, రెండవజత (కడియము, ముద్రసహా) 315 తులముల యెత్తును నున్నవి. రేకులమీఁద నున్నయక్షరము లఱిగిపోకుండుటకై, వానియంచులు కొంచెము పైకెత్తఁబడియున్నవి. కనుకనే యక్షరములు స్పష్టముగాఁ గన్పట్టుచున్నవి. రేకులయెడమభాగమున అంచువద్ద మధ్యనొకరంధ్రమును దానిలోనుండి యొకకడియమును, ఆకడియపుటంచులు కలిసినచోట నొకరాజముద్రయుఁ గలవు. రంధ్రముయొక్క వ్యాసము $\frac{3}{4}$ అంగుళమును రాజముద్రయొక్క వ్యాసము 3 అంగుళములు నున్నవి. రెండుజతలశాసనముల ముద్రికలమీఁదను, క్రిందివిధమునఁ జాళుక్యచిహ్నములు చెక్కఁబడియున్నవి :—

(1) చామరము, సూర్యుఁడు, ఛత్రము, అర్ధచంద్రుఁడు, చామరము.
(2) శంఖము, డమరు.
(3) శ్రీత్రిభువనంకుశ (చాళుక్యలిపితో)
(4) అంకుశము.
(5) పొడుగగు కాఁడగలపద్మము, ఎడమవైపు పునకుఁజూచుచున్న వరాహము, ఖట్వాంగము.

రెండుశాసనములును దూర్పుచాళుక్యవంశమునకుఁ జెందిన రాజరాజ నరేంద్రుని సవతితమ్ముఁడగు సప్తమవిజయాదిత్యుని వై యున్నవి. మొదటిశాసనమున సర్వలోకాశ్రయవిష్ణువర్ధన విజయాదిత్యదేవ యనియు, రెండవశాసనమున సర్వలోకాశ్రయ విష్ణువర్ధనమహారాజ యనియుఁ బేర్లు కనఁబడుచున్నవి.

రెండుశాసనములలోని దానములును రాజుయొక్క 12 వ రాజ్యసంవత్సరమున, ఉత్తరాయణపుణ్యకాలమున, పంపనభట్టోపాధ్యాయునకే యీయఁబడినవి. ఈరెండుదానశాసనములను ముత్తయభట్ట రచించెను. పట్టయ చెక్కెను. రెంటియందును నైదేసి రేకులు గలవు. రెండింటిముద్రికలమీఁదను "శ్రీత్రిభువనంకుశ" యనుబిరుదము పూర్వచాళుక్యలిపితోఁ జెక్కఁబడియున్నది. శాసనములభాష చాలభాగము సంస్కృతము. దానముచేయఁబడిన గ్రామముల సరిహద్దులు మాత్ర మాకాలపు తెలుఁగుభాషలో (ఆంధ్రమహాభారతమునందలి తెలుఁగుభాష వలె నున్నది) వర్ణింపఁబడినవి. ఈరెండుదానశాసనములును రాజుయొక్క 12వ రాజ్యసంవత్సరకాలమునఁ జేయఁబడినవి. ఈరాజు మహాభారతమును దెనిఁగింపఁజేసిన రాజరాజనరేంద్రుని సవతితమ్ముఁడుగ వర్ణింపఁబడుటచేతను, ఆతనితర్వాతఁ దనకొడుకగుశక్తివర్మ యొకసంవత్సరము పరిపాలించి చనిపోయినతర్వాతఁ దాను రాజ్యమునకు వచ్చియుండె నని శాసనములనుబట్టి తెలియుచుండుటచేతను నితర చాళుక్యశాసనములనుబట్టి రాజరాజుయొక్క రాజ్యకాలము క్రీ. శ. సం 1061 లో నంతమయ్యె నని తెలియుచుండుటచేతను, ఆంధ్రసాహిత్యపరిషత్తువారి రెండవ శక్తివర్మ తామ్రశాసనమునుబట్టి యతఁడు క్రీ. శ. 1061 సం. ములో పట్టాభిషిక్తుఁడై యుండె ననియు నీశాసనమునుబట్టి యీతఁ డొకసంవత్సరము రాజ్యమేలె నని తెలియుచుండుటచేతను నీరాజుయొక్క రాజ్యప్రారంభసంవత్సరము క్రీ. శ. 1062 అనియు నీదానశాసనములకాలము క్రీ. శ. 1072 అనియుఁ దేలుచున్నది.

—:శాసనములలోని విషయములు:—

ఈరెండుశాసనములలోని విషయములును రాజరాజువలెకును, ఇదివఱలో నేనుప్రకటించిన యీరాజుయొక్క పాములవాకతామ్రశాసనములోని విషయములను, బోలియున్నవి. అనఁగా, నిందలి మొదటి 48 పంక్తులును సరిగా, ఆశాసనపు మొదటిభాగమున నొక్కభాషతో, నొక్కలిపితోఁ గనఁబడుచున్నవి. వంశక్రమము, కాలములు సరిపోవుచున్నవి. మఱియు, నీరాజుయొక్క వంశక్రమ

కాలనిర్ణయములు శక్తివర్మ, విమలాదిత్యుఁడు, రాజరాజు, మొదలగురాజులతామ్ర శాసనములలో వర్ణింపఁబడినవానితో సరిపోవుచున్నవి. వంశక్రమమిట్లున్నది :—

చంద్ర, బుధ, పురూరవ, ఆయు, నహుష, యయాతి, పూరు, జనమేజయ, ప్రాచీశ, సైన్యయాతి, హయపతి, సార్వభౌమ, జయసేన, మహాసేన, ఈశానక, క్రోధానక, దేవకి, ఋభుక, ఋక్షుక, మతివర, కాత్యాయన, నీల, దుష్యంత, భరత, భుమన్యు, సుహోత్ర, హస్తి, విరోచన, అజమిల, సంవరణ, సుధన్వ, పరిక్షిత్, భీమసేన, ప్రదీపన, శంతను, విచిత్రవీర్య, పాణ్డురాజ, పంచపాండ, వాభిమన్యు, పరీక్షిత, జనమేజయ, క్షేమక, నరవాహన, శతానీక, ఉదయనులును, దర్వాత 59 రాజులును అయోధ్యాసింహాసనము నేలిరి. అప్పు డావంశమునకుఁ జెందిన విజయాదిత్యరాజు దక్షిణాపథమును జయించుటకయిబయలుదేఱి, త్రిలోచనపల్లవుని దఱిమి, దైవయోగమున మరణించెను. అప్పుడు రాజ్య మల్లకల్లోల మయ్యెను. ఆసమయమున గర్భవతి యగురాజుభార్య, పురోహిత మంత్రిసహాయమున ముదివేము గ్రామమును (ఇది కడపజిల్లాలోని పెద్దముడియము గ్రామమని కొందఱమతము) చేరి, యం దొక బ్రాహ్మణుఁడగు విష్ణుభట్టసోమయాజిచేఁ బోషింపఁబడి, తనకుఁ గల్గిన మగశిశువునకు విష్ణువర్ధనుఁ డని పేరిడెను. ఆతఁడు పెద్దవాఁడై తనతల్లివలన నంతయుం దెలిసికొని, చాళుక్యగిరి కేగి, నందాదేవి నారాధించి, కుమారనారాయణమాతృగణములఁ దృప్తిపఱిచి, రాజచిహ్నములగు శ్వేతాతపత్త్రము, శంఖము, పంచమహాశబ్దములు, జాడా, ఢక్కా, వరాహలాంఛనము, పింఛ, కుంత, సింహాసనాదులను గైకొని, కదంబ, గంగాదిరాజుల నోడించి, సర్వదక్షిణాపథము నేలెను. ఆతనితర్వాత నాతనికొడుకు విజయాదిత్యుఁడు రాజ్య మేలెను. తర్వాత నాతని కొడుకు పులికేశి మహారాజు రాజ్య మేలెను. తర్వాత నాతనికొడుకు కీర్తివర్మయుఁ, దర్వాత నాతనికొడుకు సత్యాశ్రయవల్లభేంద్రుఁడును (రెండవపులికేశి మహారాజు) రాజ్య మేలిరి. ఈతనితమ్ముఁ డగు కుబ్జవిష్ణువర్ధనుఁడు 18 సం॥లు వేంగిదేశము నేలెను. ఆతనికొడుకు జయసింహుఁడు 33 సం॥లు, ఇతనితమ్ముఁ డింద్రరాజు 7 దినములు నితనికొడుకు విష్ణువర్ధనుఁడు 9 సం॥లు నితనికొడుకు మంగియువరాజు 25 సం॥లు, నితనికొడుకు రెండవజయసింహుఁడు 13 సం॥లు, నితనితమ్ముఁడు మూఁడవవిష్ణువర్ధనుఁడు 37 సం॥లు, నితనితమ్ముఁడు కొక్కిలి ½ సం॥ రాజ్య మేలిరి. మూఁడవవిష్ణుని కొడుకు విజయాదిత్యుఁడు 18 సం॥లు, నితనికొడుకు నాల్గవవిష్ణువు 36 సం॥లు, నితనికొడుకు రెండవవిజ

యాదిత్యుఁడు 48 సం॥లు, నితనికొడుకు కలివిష్ణువర్ధనుఁడు 1½ సం॥మును రాజ్యమేలిరి. ఈతనిపెద్దకొడుకు గుణకవిజయాదిత్యుఁడు 44 సం॥ములును రాజ్యమేలిన తర్వాత, రెండవకొడు కగు విక్రమాదిత్యుని కొడుకు మొదటి భీమరాజు 30 స॥లు రాజ్యమేలెను. తర్వాత నీభీమరాజుపుత్రుఁడు నాల్గవవిజయాదిత్యుఁ డాఱుమాసములును, నీతనికొడుకు అమ్మరాజు 7 సం॥లును రాజ్యమేలిరి. అమ్మరాజు తమ్ముఁడగు రెండవభీముఁడు యుద్ధమల్లుని దేశమునుండి తఱిమివేసెను.

కాని పాములవాకశాసనమునం దీసందర్భమున నిట్లున్నది:—అమ్మరాజు కొడు కగు విజయాదిత్యుని దఱుమఁగొట్టి తాడపరాజు (ఇతఁడు కలివిష్ణువర్ధనుని మూఁడవకొడు కగుయుద్ధమల్లుని కొడుకు) ఒకమాసము రాజ్య మేలెను. ఆతనిని జయించి చాళుక్యభీమతనయుఁ డగు విక్రమాదిత్యుఁడు 11 మాసములు రాజ్యమేలెను. తర్వాత, తాడపరాజుకొడుకు రెండవయుద్ధమల్లుఁడు 7 సం॥ములు పరిపాలించెను. అతనిని దేశమునుండి వెడలఁగొట్టి, అమ్మరాజు తమ్ముఁడగు రెండవ భీముఁడు 12 సం॥ములు రాజ్యమేలెను. తరువాత భీమరాజు కనిష్ఠపుత్రుఁడు దానార్ణవుఁడు 25 సం॥లు రాజ్య మేలెను. తరువాత భీమరాజుపెద్దకొడుకు దానార్ణవుఁడు 3 సం॥లు రాజ్య మేలెను. తరువాత వేంగిదేశము 27 సం॥ లరాజకముగా నుండెను. తరువాత దానార్ణవునికొడుకు శక్తివర్మ శత్రువులనుజయించి 12 సం॥లు భూమిని బాలించెను. తరువాత నతనితమ్ముఁడగు ముమ్మడిభీమరాజు 7 సం॥రములు పరిపాలించెను. తరువాత నతనిపెద్దకొడుకు రాజరాజు 41 సం॥లు రాజ్యమేలెను. తరువాత విమలాదిత్యునికి (ముమ్మడిభీమునకు) చోళవంశపురాణి యగు మేడవ మహాదేవివలనఁ బుట్టిన విజయాదిత్యరాజు తన సవతిసోదరుఁడగు రాజరాజు లేని కాలమున వీరలక్ష్మిని (వేంగిరాజ్యమును) బట్టుకొనియెను. తరువాత విజయాదిత్యుఁడు తనకొడు కగుశక్తివర్మను రాజ్యమునం దుంచెను. అతఁ డొక సంవత్సరము రాజ్యమేలి చనిపోఁగా విజయాదిత్యుఁడు ధర్మసంస్థాపనమునకై రాజ్యమును రక్షించునిమిత్తము తనభుజశక్తిచే భూమినిరక్షించెను. (తరువాత నతని సద్గుణములు వర్ణింపఁబడెను.) ఈరాజు కలియుధిష్ఠిరుఁడు, సర్వలోకాశ్రయుఁడు, శ్రీవిష్ణువర్ధన, మహారాజాధిరాజ, రాజపరమేశ్వర, పరమభట్టారక, పరమబ్రహ్మణ్యాది బిరుదములు గలవాఁడు. ఈవీరవిజయాదిత్యమహారాజు గుద్దవాడి విషయమందలి రాష్ట్రకూటప్రముఖులను, కుటుంబినులను బిలిచి, మంత్రి, పురోహిత, సేనాపతి, యువరాజదౌవారికులయెదుట నిట్లాజ్ఞాపించెను.

పౌనదోవవాస్తవ్యుఁడును, వేదవేదాంగమీమాంసాశాస్త్రములం దుత్తీర్ణుఁడును, పరాశరగోత్రీయుఁడును, పంపనార్యుని మనుమఁడును, కేశవునికొడుకును నగుపంపనభట్టోపాధ్యాయునకుఁ దన సంతాన బలాయురారోగ్యైశ్వర్యాభివృద్ధికై యుత్తరాయణకాలమున మావిండేరుగ్రామమును సర్వవిధములైన పన్నుల నుండి తప్పించి, దానమీయఁబడెను. ఇది తెలియఁబడునుగాక. దానమీయఁబడినగ్రామమునకుఁ దూర్పున కూడ్ల, దక్షిణమున కడముంగ, పశ్చిమమున సంపనియ, ఉత్తరమున కోరుమిల్లిగ్రామములు సరిహద్దులు. (రెండవజత శాసనమునఁ జేయఁబడిన దానముగూడ నీపంపనార్యునికే చేయఁబడెను. కాని దానగ్రామము పేరు కృంచయ. దానికి సరిహద్దులు. తూర్పునవీరవిజయాదిత్య బ్రహ్మాధేయం, దక్షిణమున పచ్చురపల్లి, పశ్చిమమున పాదరపల్లి, ఉత్తరమున ద్రాక్షారామము-మొదటిజతయందుఁ దెలుపఁబడిన దానగ్రామమునకు వలె నీశాసనమునందు దానముచేయఁబడిన యగ్రహారమునకుఁగూడ నతివివరముగ సరిహద్దులాకాలపు తెలుఁగుభాషయందు వచనరూపమునఁ దెలుపఁబడెను.) ఈశాసనములయాజ్ఞప్తి పంచప్రధానులు. శాసనములను రచించిన కవి ముత్తయభట్టు. శాసనములను లిఖించినవానిపేరు పట్టల. ఈరెండుశాసనములును రాజుయొక్క 12 వ రాజ్యసంవత్సరమునఁ జేయఁబడినట్లు తెలుపఁబడినది.

—:శాసనముల లిపి, భాష:—

శాసనముల లిపి తూర్పుచాళుక్యలిపి లేక వేంగిలిపి యనుప్రాచీనపు తెలుఁగులిపి. ఈశాసనములు 11 వ శతాబ్దపువగుటచేత లిపి యవస్థాంతరమును బొందినది. ఈశతాబ్దపు తూర్పుచాళుక్యశాసనములలోనెల్లవానియందును నిట్లే యగపడుచున్నది. ఇందలివింతయక్కరములు "ర, డ" ఇవిరెండువిధము లగురూపములను బొందియున్నవి. ఇట్టిలిపితోనే నన్నయభట్టు రచియించిన యాంధ్రమహాభారతము వ్రాయఁబడినదని యెఱుంగునది. భాష:- రెండుశాసనములలోని భాషయు సంస్కృతమే. కాని దానగ్రామములయొక్క సరిహద్దులను, దెలుపుచోటుల మాత్రము 11 వ శతాబ్దపు తెలుఁగుభాష వాడఁబడినది. ఈపద్ధతియే యాకాలపు శాసనములలో సాధారణముగా నవలంబింపఁబడుచుండెను. శాసనములలోని తెలుఁగుభాగములనుబట్టి యాకాలపుఁ బదములు, వ్యాకరణపద్ధతులుఁ దెలియుచున్నవి. శాసనములభాషయందున్న సమాసము లిప్పటితెలుఁగుప్రయోగములకు బహువిరుద్ధముగా నున్నవి. ఈశాసనములందును, రాజరాజుని సందంపూండి

శాసనములందునునన్నయభట్టుయొక్క యాంధ్రమహాభారతమునందును గలసమాసము లొక్కరీతిగా నున్నవి. మచ్చునకీక్రిందియుదాహరణములు చూడఁదగును.

(1) నందంపూణ్డిశాసనము.

పూర్వతః ఇయ్యూరియుం బిల్లెమపెద్దపూణ్డియుఁ బొలగరుసున పల్లమున కొణ్డియగుంటసీమా.

(2) ర్యాలిశాసనము (రెండవజత.)

పూర్వతః క్రుందదిపళువ తూపుఁన కట్టయు వీరవిజయాదిత్యబ్రహ్మదేయమున పొలగరుసు ధాకరోమి యయువాడ పొలగరుసునుం గూడిన ముయ్యాలికుట్రసీమా.

(3) ర్యాలిశాసనము (మొదటిజత.)

పూర్వతః మాముణ్డెటి పొలమునుఁ గూడ పొలమునుం గోరుమిల్లిపొలమునుం గూడిన ముయ్యాలికుట్రున నుండి దక్షిణమించి పోయిన ముండకోలియసీమా.

(4) ఆంధ్రమహాభారతము. ఆదిపర్వము. IV-215.

పరలోకవిధులు వెలయఁజేసె, బాంధవులయు బ్రాహ్మణులయుఁ దోడ భానునిభుఁడు.

ముయ్యాలికుట్టు, కుట్రు, రేవ, ఎంగట్ట, పొలగరుసు, క్రయ్య, వ్రంత, ముండకోలి, మొదలగుపదము లిప్పుడు ప్రయోగించుట లేదు. వీనియర్థములు వింతగానుండును.

—— శాసనముల ముఖ్యత. ——

ఈశాసనములలోని వంశక్రమమును, ఆకాలపు టితరచాళుక్యశాసనములలోని వంశక్రమమును, రాజరాజనరేంద్రునివఱకు నొక్కవిధముగానే వర్ణింపఁబడినవి. కాని యీశాసనములందు విజయాదిత్యుఁడు వేంగిరాజ్యమును దనభుజశక్తిచే సంగ్రహించె నని చెప్పఁబడినది. మఱియు, నట్లు చేసిన తరువాత నాతని కొడుకు శక్తివర్మను సింహాసనముపై నెక్కించె ననియు, నాతఁ డొక్కసంవత్సరము రాజ్యముచేసి చనిపోయిన తరువాత ధర్మసంస్థాపనమునకై తనయొక్క భుజశక్తిచే వీరలక్ష్మిని గైకొని రాజ్యమునుస్థాపించె ననియుఁ జెప్పఁబడినది. ఇదివఱలో నేను బ్రకటించినట్టి యీరాజుయొక్క పాములవాక తామ్రశాసనమున వేఱొకకథ గలదు. రాజరాజు 12 సం॥లు రాజ్యమేలినతరువాత విజయాదిత్యుఁ డాతనిరాజ్యమును బట్టుకొనె ననియు, శాలివాహనశకము 952 లేక క్రీస్తుశకము1030 సంవత్సర

మున విజయాదిత్యుని పట్టాభిషేకమహోత్సవము జరుపఁబడెననియు, వర్ణింపబడి నది. దీనినిబట్టి, క్రీ॥ సం॥రము 1019 రాజరాజుయొక్క మొదటిపరిపాలన సంవత్సర మనియు, ప్రాయశః విమలాదిత్యుని చిట్టచివరిపరిపాలనాసంవత్సర మనియుఁ, దేలు చున్నది.

విమలాదిత్యుని రణస్థపూడితామ్రశాసనమునుబట్టి యాతఁడు క్రీ. సం. 1011 మే నెలలో పట్టాభిషిక్తుఁ డయ్యె ననియుఁ దెలియుచున్నది : పాములవాక, నం దంపూడి, కోరుమిల్లి, చిత్తూరు, చెల్లూరు తామ్రశాసనములనుబట్టి యతఁడు 7 సం॥లు మాత్రమే రాజ్యమేలినట్లు తెలియును. ఈహేతువుచేత నతనిరాజ్య ము 1018 లో నంతమయ్యె ననియు, నాసంవత్సరముననే యాతనికొడుకు రాజ రాజనరేంద్రుఁడు రాజ్యమునకు వచ్చె ననియు, దేలుచున్నది. అయినచో నీవిజ యాదిత్యుని పాములవాకశాసనమునఁ జెప్పఁబడినట్లు రాజరాజు 12 సం॥రములు (1018 మొదలు 1030 వఱకు) రాజ్యమేలి తర్వాత విజయాదిత్యునిచే నోడిం పఁబడె ననియుఁ దేలును, గనుక, నాతనిపట్టాభిషేకము 1030 లో జరిగియుండవ చ్చును. కాని యీవిషయము లన్నియు నీర్యాలిశాసనములలోఁ జెప్పఁబడియుం డలేదు. ఇంతియేకాక రాజరాజు 41 సం॥ములు పరిపాలన చేసినతరువాత, (అనఁ గా క్రీస్తు 1061 సం॥ న విజయాదిత్యుఁడు రాజ్యమును బలాత్కారముగా సంగ్ర హించి తనకొడుకు శక్తివర్మను సింహాసన మెక్కించి యాతఁ డొక సంవత్సరము రా జ్యముచేసి చనిపోఁగాఁ దానే రాజ్య మేలె నని చెప్పఁబడినది. ఆకాలమున రాజ రాజు కొడు కగు రాజేంద్రచోళుఁడు రాజ్యమునకు రావలసియుండఁగా విజయా దిత్యుఁడు బలాత్కారముగాఁ దానిని సంగ్రహించెను. బహుశః యిట్లులుగావించి యుండుట కిది రెండవసారియై యుండును. పాములవాక శాసనమునందుఁ జేయఁ బడిన దానములనుబట్టి విజయాదిత్యుఁడు రాజ్యమును ప్రథమమున బలాత్కార ముగాఁ దీసికొనియుండును. కాని వెంటనే సవతియన్నగా రగురాజరాజుచే నోడింపఁబడి యుండును. అప్పుడు రాజరాజు యొక్క పరిపాలనానంతరము వఱ కును వేచియుండి రాజ్యమును దిరిగి లాగుకొని యుండును. అనఁగా మొదటి సారి రాజరాజుపరోక్షమందును, రెండవసారి రాజరాజు చనిపోయిన తర్వాతను, రాజ్యమును సంగ్రహించియుండును. రెండవసారి సంపాదించినరాజ్యము స్థిర ముగఁ దనస్వాధీనమునం దుండుటచేతను, మొదటిసారి తాను సంపాదించి యేలి నది స్వల్పకాల మగుటచేతను శాసనములయం దీవిధమున వర్ణింపఁబడియుండును.

మొదటిజతనుండి పాఠములు.

(C. P. No. 8 of 1924-25)

మొదటిరేకు, రెండవప్రక్క.

1. శ్రీధామ్నః పురుషోత్తమస్య మహతో నారాయణస్య ప్రభో ర్నాభీపంక
రుహా ద్బభూవ జగత
2. స్స్రష్టా స్వయంభూ స్తతః జజ్ఞే మానససూను రత్రి రితి య స్తస్మాన్మునే రత్రిత
స్సోమో వంశకర
3. స్సుధాంశు రుదిత శ్శ్రీకంఠచూడామణిః తస్మా దాసీ త్సుధాసూతే ర్బుధో
బుధసుత స్తతః తస్మా
4. త్పురూరవానామ చక్రవర్తీ సవిక్రమః తస్మా దాయు స్తతో నహుష స్త
తో యయాతి శ్చక్రవర్తీ త
5. తః పురు రితి చక్రవర్తీ తతో జనమేజయో శ్వమేధత్రితయస్య కర్తా తతః
ప్రాచీశః తత స్సైన్య
6. యాతి స్తతో హయపతి స్తత సా(స్సా)ర్వభౌమ స్తతో జయసేన స్తతో
మహాయోమ స్తస్మా దైశానకః
7. తతః క్రోధానకః తతో దేవకి స్తస్మా దృభుకః తస్మా దృక్షుకః తతో మతివర
స్సత్రయాగయాజీ
8. సరస్వతీనదీనాథః తతః కాత్యాయన స్తతో నీల స్తతో దుష్యంతః తత్పు
త్రః గంగాయమునా
9. తీరే యదవచ్ఛిన్నం నిధాయ యూపాన్ క్రమశః కృత్వా తథా శ్వమేధా
(ధో)న్నామ మహాకర్మ్మా చరత ఇతి యోల
10. భత తతో భరతా ద్భుమన్యు స్తత స్సుహోత్ర స్తతో హస్తీ తతో
విరోచన స్తస్మా దజమిల స్తత స్సంవ
11. రణః తస్యాథ తపనసుతాయా స్తపత్యా శ్చ సుధన్వా తతః పరీక్షి త్తతో
భీమసేనః తతః ప్రదీపనః
12. తత శ్శంతను స్తతో విచిత్రవీర్య్యః తతః పాణ్డురాజః పుత్రా స్తస్య చ
ధర్మ్మజభీమార్జ్జుననకులసహ
13. దేవాః పంచేంద్రియవ త్పంచ స్యు ర్విషయగ్రాహిణ స్తత్ర యేనాదాహి
విజిత్య ఖాణ్డవ మధోగా
14. ణ్డివినా వజ్రిణం యుద్ధే పాశుపతాస్త్ర మనకరిపో శ్చాలాభి దైత్యో న్న
హూన్ ఇంద్రార్ధాసన

రెండవ రేకు, మొదటిప్రక్క.

1. మధ్యరోహి జయినా యత్రాలి(ల)కేయాదికాన్ జిత్వా స్వైర మకారి వంశ విపినచ్ఛేదః కురూణాం
2. విభోః తతోర్జునా దభిమన్యు స్తతః పరీక్షిత్ తతో జనమేజయః తతః క్షే మక స్తతో నర
3. వాహనః తత శ్శతానీక స్తస్మా దుదయనః తతః ప్రభృతి ష్వవిచ్ఛిన్నసంతానే ష్వయోధ్యాసింహాసనాసీనే ష్వేకోన్న
4. షష్టిచక్రవర్తిషు గతేషు తద్వంశ్యో విజయాదిత్యో నామ రాజవిజిగీషయా దక్షిణాపథం గత్వా త్రిలోచనప
5. ల్లవ మధిక్షిప్య దైవదురీహయా లోకాంతర మగమత్ తస్మిన్సంకులే పురో హితేన వృద్ధామాత్యైశ్చ సా
6. ర్ధ మంతర్వత్నీ తస్యమహాదేవీ ముదివేమునామాగ్రహార ముపగమ్య తద్వా స్తవ్యేన విష్ణుభట్టసో
7. మయాజినా దుహితృనిర్విశేష మభిరక్షితా విష్ణువర్ధన న్నందన మసూత సా తస్య కుమార
8. స్య మానవ్యసగోత్ర హారీతిపుత్ర ద్విపక్షుక్రమోచితాని కర్మాణి కారయి త్వా త మవర్ధయ
9. త్ సచ మాత్రా విదితవృత్తాంత స్స న్నిర్గత్య చలుక్యగిరౌ నందాం భగ వతీం గౌరీ మారాధ్య కుమారనా
10. రాయణమాతృగణాం శ్చ సంతర్ప్య శ్వేతాతపత్రైకశంఖపంచమహాశబ్దపా లికేతనపఢక్కా వరా
11. హలాంఛనపింఛ కుంత సింహాసన మకరతోరణకనకదణ్డగంగాయమునాదీని స్వకులక్రమాగతా
12. ని నిక్షిప్తానీవ సాంబ్రాజ్యచిహ్నాని సమాదాయ కదంబగంగాదిభూమిపా న్నిర్జిత్య సేతునర్మదామ
13. ధ్యం సార్ధసప్తలక్షం దక్షిణాపథం పాలయామాస తస్యాసీ ద్విజయాదిత్యో విష్ణువర్ధనభూపతేః
14. పల్లవాన్వయజాతాయా మహాదేవ్యా శ్చ నందనః తత్సుతః పులకేశివల్ల భః తత్పుత్రః కీర్తివర్మా

రెండవ రేకు, రెండవ ప్రక్క.

1. తస్య తనయః శ్రీమతాం సకలభువనసంస్తూయమాన మానవ్యస గోత్రాణాం హారీతిపుత్రాణాం కౌశి
2. కీవర ప్రసాదలబ్ధ రాజ్యానాం మాతృగణపరిపాలితానాం స్వామిమహాసేన పాదానుధ్యాతానాం భగ
3. వన్నారాయణప్రసాదసమాసాదితవరవరాహలాంఛనక్షణక్షణవశీకృతారాతి మణ్డలానాం
4. అశ్వమేధావభృథస్నానపవిత్రీకృతవపుషాం చాలుక్యానాం కుల మలంక రిష్ణో స్సత్యాశ్రయవల్లభేంద్రస్య
5. భ్రాతా కుబ్జవిష్ణువర్ద్ధనో ష్టాదశవర్షాణి వేంగీదేశ మపాలయత్ తదాత్మజో జయసింహవల్లభ స్త్రయ
6. స్త్రింశతం తదనుజ ఇంద్రరా జస్స ప్తదినాని తత్సుతో విష్ణువర్ద్ధనో నవవర్షాణి తత్సూను ర్మఙ్గియువరాజ
7. పంచవింశతిం తత్పుత్రో జయసింహ స్త్రయోదశ తదవరజః కొక్కిలి ష్షణ్మా సాన్ తస్య జ్యేష్ఠో
8. భ్రాతా విష్ణువర్ద్ధన స్త ముచ్చాట్య సప్తత్రింశతం అబ్దాన్ తత్పుత్రో విజయా దిత్య భట్టారకో
9. ష్టాదశ తత్పుత్రో విష్ణువర్ద్ధన ష్షట్త్రింశతం తత్తనయో నరేంద్రమృగరాజ శ్చా ష్టాచత్వారింశతం త
10. త్పుత్రః కలివిష్ణువర్ద్ధనో ధ్యర్ద్ధవర్షం తత్సుతో గుణగవిజయాదిత్య శ్చతుశ్చ త్వారింశతం తద్భ్రాతుర్విక్ర
11. మాదిత్యస్య తనయ శ్చ(శ్చా)లుక్యభీమ స్త్రింశతం తత్సుతః కొల్లభిగణ్డ విజయాదిత్యః షణ్మాసాన్ తత్సూ
12. ను రమ్మరాజ స్స ప్తవర్షాణి తం యుద్ధమల్లం పరిహృత్య దేశాత్ పిష్ట్వే తరేషామపి శాత్రవాణాం క్ష్మా మమ్మ
13. గాజానుజరాజభీమో భీమ స్సమా ద్వాదశ రక్షతి స్మ సత్పుత్రయో ర్దశ రథప్రతిమస్య తస్యాభీ
14. మస్య రామభరతోపమయోః కనీయాన్ దానార్ణవాఖ్యనృపయో రథ పంచవింశత్యబ్దా

మూడవరేకు, మొదటిప్రక్క.

1. నరక్ష దవనీతల మమ్మరాజః ద్వైమాతురోమ్మనృపతే ర్దాననృపో రాజభీమ
నృపతనయః విద్యా

2. కలాపచతుర శ్చతురంతమహీం చుపా త్సమాస్త్రిస్రః అనుదానార్ణవా దాసీద్దై
వదుశ్చేష్టయా తతః సప్తవిం

3. శతివర్షాణి వేంగీభూమి రనాయికా అత్రాంతరే దాననరేంద్రసూను శ్రీశక్తి
వర్మ్మాణ సురరాట్సధర్మ్మా

4. యశ్శౌర్యశక్త్యా వినిహత్య శత్రూ న్సద్వాదశాబ్దా న్సమరక్షదుర్వ్వీం తస్యా
నుజః పాలితవా నథా

5. బ్దాన్ గాం సప్తసప్తాబ్ధివిలంఘికీర్త్తిః శ్రీరాజచాలుక్యకులప్రదీప స్తేజోనిధి
మ్మణ్మ్మడిభీమభూ

6. పః తస్య శ్రీమా న్నాత్మజో రాజరాజో రాజత్తేజ రాజవంశాగ్రగణ్యః సై
కాంచత్వారింశతం వత్స

7. రాణాం క్షోణీరక్షా దక్షిణో రక్షత్స్మ అపిచ విమలాదిత్యా చ్ఛోడాన్వయై
కలత్స్మ్యా

8. శ్చ మేడవమహాదేవ్యాః అజని(జ)యశ్రీనిత్యో విజయాదిత్యో నరేశ్వరస్తు
త్యః పరోక్షే

9. రాజరాజస్య భ్రాతుర్ద్వైమాతురస్య యః పర్యగ్రహీ న్మహీంరాజ్యశ్రియం
వీరశ్రియాయుతః గృహీ

10. త్వా స్వసుతే స్నేహాత్ రాజ్యం శ్రీశక్తివర్మ్మణి న్యస్తం తస్మిన్ ధరా మేకం
సంరక్ష్యా బ్దం దివం గతే అప్రాప్తా

11. నుభవే సుతే విధివశాత్ ప్రాప్తాభినవ్య విచ స్వర్గ్గం త్యక్తరుచి స్సుఖేషు
విజయాదిత్యాధిపః పార్థవత్

12. ఆసీనే విబుధైః కులక్రమాగతై రాప్తైరలం బోధితో ధర్మ్మం స్థాపయితుం
కథంచి దకరోత్ బుద్ధిం ధరా

13. రక్షణే నిర్జ్జేతుం ద్విషతాం భయం కలిమలన్నిర్ధూయ ధర్మ్యాన్స్థరం
సన్ధాయాయుగవర్తన న్నిజభుజే సం

నాళ్లవరేవు మొదటిప్రక్క.

౧౮ పుటకెదురుగ.



నాళ్లవరేవు రెండవప్రక్క.

౧౯ పుటకెదురుగ.



అయిదవ రేకు మొదటిప్రక్క.

౧౫ పుటకెదురుగ.



మూఁడవరేకు, రెండవప్రక్క.

1. స్థాప్య వీరశ్రియం దేవ శ్శ్రీకరవాలభైరవనృపే సక్తే ధరాం రక్షితుం పృథ్వీ
కామదుఘా భవత్కృతయుగ స్పర్ధాని
2. తో భూ త్కలిః ఉచ్చైర్విర్జ్జనాదితనిజై రపయోరుహాగ్రే యోభూపతి ర్వి
ధృత కార్మ్ముకఖడ్గచక్రః యుద్ధే విడం
3. బయతి గర్జ్జితపాంచజన్యం శౌరిం స నన్దకసుదర్శనశార్ఙ్గచాపమ్ భీమంగదా
యా న్ధనుమహేంద్రసూనుం కు
4. న్తాయుధే యో నకులన్తథైవ హయాధిరోహే సహదేవముచ్చై ర్వ్విద్వేష్ట్వ
జేతారి రపి ప్రజేతః కల్పానోకహపుష్ప
5. వ త్కవిజనైః కర్ణ్ణావతంసీకృతో రాజశ్శ్వేతసితాతపత్రరుచిరా భూపై శ్శిరో
భిర్ద్ధృతా శ్రీభిశ్చన్దనచర్చ్చికేవ హ్యా
6. దయే లిప్తా సుధాంశుప్రభే వాశాచక్ర మలంకరోతి ధవలాకీర్త్తిర్య్యదీయా
భృశం యే యాతా భరతాదయ
7. స్సుకృతినో యద్వంశజా భూభృత స్సతావత్రప్రతిపాదితార్జ్జితధనాస్సత్యై
కవాచః పురా తే ప్రా
8. యేణ యుగానురూపగుణినః కాలేకలా వప్యహో సత్యైకస్థిరధీ స్సదర్ప్పిత
ధనో యస్సోమ
9. వంశోత్తమః యస్సత్యవాక్ స్వచరణార్ప్పితచక్రి భీమసేనోపమర్ద్దితరిపు
క్షితిపాలలోకః ధర్మ్మోర్జ్జవ
10. యః కలియుధిస్థిరనామధేయః శ్రీవిష్ణువర్ద్ధననృపో జ్జనకీర్త్తిలోలః సస
వ్వర్ల్లోకాశ్రయశ్రీవి
11. ష్ణువర్ద్ధనమహారాజాధిరాజో రాజపరమేశ్వరః పరమభట్టారకః పరమ
బ్రహ్మణ్యో మాతా
12. పితృపాదానుధ్యాతో శ్రీవీరవిజయాదిత్యదేవః * గుద్దవాడివిషయనివాసినో
రాష్ట్రకూట
13. ప్రముఖాన్ కుటుంబిన స్సమాహూయ మంత్రిపురోహితసేనాపతియువరాజ
దౌవారిక

---

* రెండవజత శాసనములో (నాల్గవ రేకు, మొదటిపెడ ఆఖరుపంక్తిలో) ఈసందర్భమున రాజుపే రివ్వఁబడలేదు. తక్కిన విషయము లన్నియు సరిసమానములుగనే యున్నవి. (దాని ఛాయాపటము చూడుఁడు)

నాల్గవ రేకు, మొదటిప్రక్క.

1. *సముక్షమిత్థ మాజ్ఞాపయతి ఆసీ త్పితామహో యస్య పితామహసమ
ద్యుతిః పంపనార్య
2. ఇతిఖ్యాతో వేదవి త్సర్వశా స్త్రవిత్ తస్మా దజని సత్సేవ్యః కేశవః కేశ
వోపమః అధీతవే
3. దవేదాంగ స్సర్వశాస్త్రార్థతత్వవిత్ తస్మాత్ శ్రీమా నశేషేణ పీత్వా
వాఙ్మయవారిధిమ్ ఉ
4. దితో దక్షిణాశాయా మగస్త్య ఇవ యో మునిః ఇష్ట మిష్టం యతో లోక
శ్శాస్త్రతత్వం సము
5. జ్వలం సలక్షణం సమాదత్తే రత్నం రత్నాకరాదివ తస్మై పొసుదోవవాస్త
వ్యాయ
6. వేదవిదే వేదాంగపారగాయ మీమాంసాశాస్త్రగురవే పరాశరగోత్రాయ
షట్కర్మ
7. నిరతాయ పంపనభట్టోపాధ్యాయనామ్నే అస్మ త్సంతానబలాయురారో
గ్యైశ్వర్యాభి
8. వృద్ధ్యర్థం పవిత్రారాయణనిమిత్తే మానిక్కేలునామగ్రామ స్సర్వకరపరిహారే
ణ సర్వన
9. మస్యాం దత్త ఇతి విదిత మస్తు వః అ స్యావధయః పూర్వతః కూడ్లః దక్షి
ణతః కడము
10. గ్గ పశ్చిమతః సంపనియ ఉత్తరతః కోరుమిల్లి అస్యైవ క్షేత్రసీమానః పూ
11. ర్వతః మాప్రక్కేటిపొలమునుం గూడ్లపొలమునుం గోరుమిల్లిపొలమునుం
గూడి

---

* ఈపంక్తి, రెండవజతశాసనములో నాల్గవ రేకు, రెండవప్రక్క, రెండవపంక్తిగా నీయఁబడినది. తర్వాతవిషయములు రెండింటియందును వేఱుగానున్నవి. శాసనాంతమునఁ గల "అస్యోపరి న కేనచిత్ బాధా కరణీయా" అనుపదములు మొదలు ఆఖరువఱకుఁ దిరిగి రెండుజతలశాసనముల లోని విషయములు సరిపోవుచున్నవి. రెండవజత (C. P. No. 9 of 1924-25) నాల్గవ రేకు రెండవప్రక్కనున్న విషయములును, ఐదవ రేకు మొదటిప్రక్కనున్న విషయములును నీక్రింద ఛాయాముద్రల సహాయమునఁ గూడఁ జూపఁబడినవి.

### నాల్గవ రేకు, రెండవ ప్రక్క.

1. సముయ్యాలికుట్రున నుణ్డి దక్షిణమించి పోయిన ముణ్డకోలియసీమ, ఆగ్నేయ
2. తః కూడపొలములోని కడములకోలిపడుమటి కొమ్ముచుంగహాముక్కునయుమా
3. వృణ్డేటి పొలమునుంగూడిన ముయ్యలికుట్ర సీమా దక్షిణతః మావృణ్డేటి కా
4. శ్రేనివనము దక్షిణమున ఎంగట్టుపాదలసీమా నైరృత్యతః కుణ్ట్రులోపుగాంగల
5. పొలమునకు సంపనియు పొలగరుస సీమా పశ్చిమతః కోరుమిల్లినా
6. రనపెద్దిరిచేని మొల్లిమొనణ్డి తూర్పింగంచి వచ్చిన నారనపడంగవు
7. లచేననుణ్డి ఉత్తరమించి పోయినకోరుమిల్లిపొలగరుస సీమా వాయవ్య
8. తః కోరుమిల్లిపొలములో నుత్తరమించి పోయిన అడ్డపుంద్రోవ దక్షిణము
తలయు
9. సీమా ఉత్తరతః అడ్డపుంద్రోవ దక్షిణము తలనుణ్డి తూర్పింగంచి పోయిన
కోరుమి
10. ల్లిపొలమును మావృణ్డేటిపొలము నడిమి అవ్వుఱుగడ్డలలోని పల్లమసీమా
11. ఐశాన్యతః కోరుమిల్లిపొలగరుసును మావృణ్డేటి పొలగరుసునునడిమిఅ

### ఐదవ రేకు, మొదటి ప్రక్క.

1. వ్వుఱుగడ్డలలోని పల్లముననుణ్డి దక్షిణమించిపోయిన కోరుమిల్లిపొలము
2. న మొల్లి మొన నైరృతిమూలయు సీమా* అస్యోపరి న కేనచిత్ బాధా
కరణీయా
3. యః కరోతి సపంచభిర్మహాపాతకై స్సంయుక్తో భవతి తథోక్తం వ్యాస
మునినా ష
4. ష్టిం వర్ష సహస్రాణి స్వర్గే మోదతిభూమిదః ఆక్షేప్తాచానుమంతా చ తాన్యేవ
5. నరకే వసేత్ ఆజ్ఞప్తిః పంచప్రధానాః కవి రిహ ముత్తయభట్టః లేఖకః
6. పట్టలః శ్రీమద్విజయరాజ్యసంవత్సరే ద్వాదశే దత్తమిదం శాసనమ్.

---

* ఇక్కడనుండి చివరవరకు రెండుజతల శాసనములలోని విషయములు నొక విధముగానే సరిపోవుచున్నవి.

## రెండవజత (C. P. No. 9 of 1924-25.)

### నాల్గవ రేకు, రెండవ ప్రక్క.

1. కూటప్రముఖాన్ కుటుంబిన స్సమాహూయ మన్త్రిపురోహిత సేనాపతి యువరాజదౌవారి
2. కసమక్షు నిత్థ్రి స్సూజ్ఞాపయతి ఆసీత్పితామహో యస్య పితామహసమద్యు తిః పంపనా
3. య్యార్య ఇతి ఖ్యాతో వేదశాస్త్రార్థతత్త్వవిత్ తస్మాత్సమభూత్కేశవశర్మ్మ సముదితవేదవేదపరమ్
4. గః యత్రప్రష్టేభ్యః పారం విద్వద్భిన్నైవగమ్య శమతి నోభిః తస్మాత్ శ్రీమా న్శోపీనాపీత్వా వాజ్మ
5. యవార్ధిమ్ ఉదితో దక్షిణాశాయా మగస్త్య ఇవ యోమునిః ఇష్ట మిష్టం యతో లోక శ్చాప్త్ర
6. తత్త్వం సముజ్జ్వలం సలక్షణం సమాధ్యత్ర రత్నం రత్నాకరాదివ జ్ఞానాసి లూనాః విలకర్మ్మ
7. పరిః శ్రమణ సర్వ్వాస్స్వీపయూస్వీ జేతా సచ్చక్రసంసేవిత పాదపద్మో వి భాతి యో భూసుర
8. చక్రవర్త్తి తస్మ పోసుదోవనామగ్రామవాస్తవ్యాయ పంపనార్య్యాయ పరాశరగోత్త్రాయ షట్క
9. ర్మ్మ నిరతా యా స్తస్సంతానబలాయురారోగ్యైశ్వర్య్యాభివృద్ధయే క్రం దుయేనామగ్రామం సర్వ్వ
10. యకరపరిహారేణ సర్వ్వనమస్య మగ్రహారి కృత్వా ఏకభీగి చలివిసంపత్స హితముత్తరాయణ
11. నిమిత్తదత్త ఇతి విదితమస్తు వః అన్య గ్రామసీమానః పూర్వత వీరవిజయా దిత్య బ్రహ్మధేయః
12. దక్షిణతః పచ్చలపల్లిః పశ్చిమతః పాదరిపల్లిః ఉత్తరతః దాక్షారామః అస్యవృక్షత్ర సీమానః

రెండవజత (C. P. No. 9 of 1924-25.)

ఐదవ రేకు, మొదటిప్రక్క.

1. పూర్వ్వతః కృండదిపడువ తూర్ప్వన కట్టయు వీరవిజయాదిత్య బ్రహ్మద
యమున పొలగరుసు
2. డాకరోమి యయ్యవాడ పొలగరుసు నుం గూడిన ముయ్యలికుట్ర సీమా
ఆగ్నేయతః ముయ్య
3. లికుట్రనుణ్డి దక్షిణా మించిపాఱిన చోడిపల్లమసీమా దక్షిణతః వీరవిజ
యాదిత్యబ్రహ్మ
4. దేయమున పొలగరుసు నుం గ్రుందుదిపొలగరుసునం బాఱిన అవుఱుగడ్డల
లోని క్రయ్యాయ సీ
5. మా నైరుత్యతః కణ్డఱుమరు నెఱసీమా పశ్చిమతః గాడవాలుంబుట్టల పడు
మటి అవుఱుగడ్డల
6. లోని క్రయ్యనుణ్డి రాజరాజవే అని వేఱువునుం బెద్దడాకరోమిపొలమునుం
గ్రున్దుదిపొ
7. లమునం గూడిన ముయ్యలికుట్ర సీమా వాయవ్యతః పెద్దడాకరమి పృత
వపపొలమున
8. యుం గరణపుంబొలమునయుం గృందుదీపొలమునయుం నడిమిపెద్దవ్రంతయు
దక్షిణమించివచ్చిన పొల
9. గరుసునుం గూచియనాయకు చెఱువుపడుమటికట్టయు నిచ్చెఱువున ఆగ్నే
యమున మూలను
10. ణ్డి వచ్చిన ఎంగట్టసీమా ఉత్తరతః కృంసుదిపడువ ఉత్తరమున కట్టయు న
య్యవాడపొలగరుసున
11. డిమి ఎంగట్టసీమా ఐశాన్యతః ఇప్పడువ కీశానమున కట్టయుసీమా అస్యోపరి
న కేనచిత్ బాధాకర
12. ణీయా యః కరోతి సపంచభిర్మ్మహాపాతకైర్య్యుక్తో భవతి తథా వ్యాసే
న గీతః షష్టివర్షసహ
13. స్రాణిస్వర్గ్గే మోదతి భూమిదః ఆక్షేప్తా చానుమంతా చ తాన్యేవ నరకే
వసేత్ ఆజ్ఞప్తిః పంచ

---

# ఉత్తరరామాయణము - రజకునివృత్తాంతము.

—: కిళాంబి రాఘవాచార్యులుగారు- ఎం. ఏ. బి. ఎల్. కాకినాడ :—

పట్టాభిషేకానంతరము శ్రీరాముఁడు సీతను బరిత్యజించుటకుఁ గలకారణ మొకరజకుని నిందావాక్యము లని జనశ్రుతి నుడువుచున్నది. ఈరజకుని వృత్తాంతము నేఁటినాటకములలోను, సినీమాప్రదర్శనములయందును నోట వచింపరాని బూతులతోడను, నసభ్యము లగుపాటలతోడను, దుర్నీతిబోధక మగుకథాసందర్భముతోడను జిత్రింపఁబడుచున్నది. ఇందులకు గ్రంథప్రమాణము లేమైనఁ గలవా, యున్నచో నది రసపోషక మగునా, దృశ్యప్రబంధముల నది జూపఁదగునా యనువిషయములు మన మవశ్యము చర్చింపఁదగినవి.

ఉత్తరరామాయణకథాసందర్భమునకు ముఖ్య మగు ప్రమాణ ముత్తరకాండమే-దీనియందు దీసీతాపరిత్యాగకారణము నలువదిమూఁడవసర్గమునఁ గలదు. శ్రీరాముఁడు పేరోలగముననుండి భద్రుఁడు, విజయుఁడు నున్నగువారి పరిహాస వాక్యముల వినుచు, భద్రుని నగరవార్తలఁ దెలుపు మన నాతఁడు జనుల శుభాశుభవాక్యముల నివేదించును. అంత శ్రీరాముఁడు తనతమ్ముల కాపౌరాపవాదమును దెలిపి, గంగయవలియొడ్డున వాల్మీకియాశ్రమమున సీతను బరిత్యజింప లక్ష్మణున కాజ్ఞాపించును. భద్రునివాక్యము లిటుఁ జూపుదును.

"దుష్కరం కృతవా న్రామ స్సముద్రే సేతుబంధనమ్
అశ్రుతం పూర్వకైః కైశ్చి ద్దేవై రపి సదానవైః ॥
రావణశ్చ దురాధర్షో హత స్స బలవాహనః
వానరాశ్చ వశం నీతా ఋక్షాశ్చ సహరాక్షసైః॥
హత్వా చ రావణం యుద్ధే సీతా మాహృత్య రాఘవః
అమర్షం పృష్ఠతః కృత్వా స్వవేశ్మ పున రానయత్ ॥
కీదృశం హృదయే తస్య సీతాసంభోగజం సుఖమ్
అంక మారోప్య హి పురా రావణేన బలాద్ధృతా ॥
లంకా మపి పురా నీతా మశోకవనికాం గతామ్
రక్షసాం వశమాపన్నాం కథం రామో న కుత్సతే ॥

అస్మాక మపి దారేషు సహనీయం భవిష్యతి
యథాహి కురుతే రాజా ప్రజా త మనువర్తతే ॥
ఏవం బహువిధా వాచో వదంతి పురవాసినః
నగరేషుచ సర్వేషు రాజన్ జనపదేషు చ ॥" (13-20 శ్లో)

ఇందు రజకునిప్రశంసయే లేదు. ఈశ్లోకములభావము రంగనాథరామాయణమున నిటులఁ జక్కగ వివరింపఁబడినది.

ద్విపద. అనవుడు భద్రుండుహస్తముల్ మోడ్చి, జననాథ చెప్పెద సత్యవాక్యముల
వినుము తుఁడాదిగా నెల్లవానరుల, ఘనులైన ఋక్షులఁ గడిఁది రాక్షసులఁ
దనవారిఁ జేయుట, దారుణంబైన, వనరాశి గట్టుట వడినెత్తి చనుట
యఖిలలోకద్రోహి యైనరావణుని, సఖులతో సుతులతో సచివుల తోడ
వారణంబులతోడ వాజులతోడఁ, దేరులతోఁ గూడఁ దీవ్రబాణముల
ఖండించి వైచుట కడిఁది రాక్షసుల, దండించిలోకముల్ దయఁ గాచు టొప్పఁ
బట్టిన చెఱవోయి పగవానియింట, నట్టున్న జానకి ననురక్తుఁ డగుచు
గోప మంతయుఁ ద్రొక్కి కొనివచ్చి కుసుమ, చాపునిచేఁ జిక్కి చాపలం బెసఁగఁ
బ్రియము దలిర్పనాపృథివీతనూజఁ, గయికొని యున్నాఁడు కాకుత్స్థుఁ డెలమి
మనమునఁ గాంతల మార్తురు గొన్న, మనకు నిట్టిది గాదె మనరాజు గుఱిచి
యనునివి లోనుగా నల్పవాక్యములు, మునుకొని పురజనుల్ మూఁకలు గట్టి
రచ్చల వీధుల రాజేంద్ర నిన్ను, నచ్చట నచ్చట నాడుచుండుదురు—

యుద్ధానంతరము సీత తనపాతివ్రత్యమహిమచే నగ్నిప్రవేశ మొనర్చినది. శ్రీరాముఁ డిట్టికఠినవ్రత మామెచే నొనర్పఁజేయుట లోకాపవాదమును బోఁగొట్టుటకుఁ గాని తనకొఱకుఁ గాదు. అయిన నది లంకయందు జరుగుటచే నద్దాని నయోధ్యాపురవాసులు విశ్వసింపరయిరి. శ్రీరామునకు సీత పరమసాధ్వి యనియు, భర్తృచింతాపరాయణ యనియుఁ బ్రథమమునుండియుఁ దెలియును. భవభూతి తనయుత్తరరామచరితమున నీవిషయమును జక్కఁగ నిరూపించియున్నాఁడు.

'ఉత్పత్తిపరిపూతాయాః కి మస్యాః పావనాంతరైః
తీర్థోదకం చ వహ్నిశ్చ నా న్యతః శుద్ధి మర్హతః'

క. జననముచే శుచియగు నీ, వనజాక్షికి వేఱె శుద్ధి వలయునె తలఁపన్ !
జననుత తీర్థజలంబుల, ననలంబును శుద్ధిసేయునవియుం గలవే.
(రామయ్యపంతులుగారి యాంధ్రీకరణము.)

ఇదియే యుత్తరకాండమున (45 సర్గము) 'అంతరాత్మాచ మే వేత్తి సీతాం శుద్ధాం యశస్వినీం' అనురామవాక్యమున స్పష్టముగఁ దెలుపఁబడినది. జనాపవాదభయముచే శ్రీరాముఁడు సీతను బరిత్యజించినఘట్టమునఁ బెక్కుగ్రంథముల నీరజకప్రశంస గన్పడదు.

మహాకవి యగుకాళిదాసుఁడు తనరఘువంశమున (స-14-శ్లో 32) భద్రునివార్త నొక్కశ్లోకముననే వర్ణించియున్నాఁడు.

'నిర్బంధపృష్ట స్సజగాద సర్వం స్తువంతి పౌరా శ్చరితం త్వదీయమ్
అన్యత్ర రక్షోభవనోషితాయాః పరిగ్రహా న్మానవదేవ దేవ్యాః ॥

(శ్రీరామునిచే నిర్బంధింపఁబడి భద్రుఁ డిటులఁ బలికెను. ఓమానవశ్రేష్ఠుఁడా! రక్షోభవనోషిత యగుదేవిని దాము పరిగ్రహించి రనువిషయమునఁ దక్క దేవరవారిచరితమును బౌరులు నుతించుచున్నారు.)

కవిసార్వభౌముఁడు పౌరుల నిందావాక్యముల నిటు సంకుచిత మొనర్చుటయు, నొకశ్లోకార్ధభాగమున దాని నిముడ్చుటయు నౌచిత్యపోషణమున కని యూహింపవలయును. శ్రవ్యకావ్యము గాన కవి యొకశ్లోకమైన నీవిషయమును గూర్చి రచింపవలసివచ్చినది.

దృశ్యకావ్యముల భవభూతి రచిత మగునుత్తరరామచరితమున నిదియుఁ గానరాదు. రంగస్థలమున భద్రునినోట సీతాదూషణవాక్యముల నుచ్చరింపఁజేయుట రసపోషకము గా దని కవి గ్రహించియున్నాఁడు. పౌరవాక్యములఁ గొని తెచ్చిన భద్రుని దుర్ముఖునిఁ జేసియున్నాఁడు. 'దుర్ముఖః—శృణోతు మహారాజః (కర్ణే) ఏవ మివ. రామః—అతి తీవ్రోయం వాగ్వజ్రః (ఇతి మూర్ఛతి). ఇంక రాముని పరిదేవనమువలనఁ బౌరుల నిందావాక్యముల మన మూహింప నగును. దివ్యచారిత్రు లగుసీతారాముల పవిత్రశీలమును రంగస్థలముపై రసపోషణ మొఱఁగిన యేకవియు మఱియొకపాత్రముచే నిందయొనర్పఁజేయునా ? కవి యౌచితిని రసపోషణమును బాటింపవలయును. లవునిచే శ్రీరామునిగూర్చి భవభూతిపలికించిన యుపాలంభవాక్యములను క్షేమేంద్రాదు లౌచిత్యభంగకరము లనితీవ్రముగ విమర్శించి రనుట మనకు విదితమే.

దిజ్నాగమహాకవి తనకుందమాలానాటకమున నిట్టిపౌరవాక్యకథన మప్రస్తుత మని యాకథాభాగమును వదలి ప్రథమాంకమున సీతాలక్ష్మణులఁ బ్రవేశ పెట్టియున్నాఁడు. సూత్రధారునిచే సీతాపరిత్యాగకారణమును జెప్పించెను.

'సూత్ర—(విలోక్య) కష్టంభోః అతికరుణం వర్తతే-
లంకేశ్వరస్య భవనే సుచిరం స్థితేతి
రామేణ లోకపరివాదభయాకులేన
నిర్వాసితాం జనపదా దపి గర్భగుర్వీం
సీతాం వనాయ పరికర్షతి లక్ష్మణోయమ్.

అయ్యో! యెంతకష్ట మెంతకష్టము ! అతిదుఃఖకర మగు కార్యముజరుగుచున్నదే !

ఉ. రావణునింటనుండెను జిరంబుగ నంచు జనాపవాదభీ
త్యావిలమానసాంబురుహుఁడౌ రఘురామునిచే నిరస్త, సీ
తావనజేక్షణన్ జనపదంబులకుం దొలఁగించి గర్భిణిన్
ద్రోవ నరణ్యమధ్యమున దోడ్కొనిపోయెను లక్ష్మణుండిదే.
(వసురాయని యాంధ్రీకరణము.)

ప్రథమాంకమున లక్ష్మణుఁ డాత్మగతమున నిటులు పలుకును.

"సమాదిష్టో హ మార్యేణ—అథవా స్వామినా 'వత్స లక్ష్మణ ! దేవ్యాః కిల సీతాయా రావణభవనసంస్థానా చ్చారిత్రం ప్రతి సముత్పన్నవిమర్శనాం పౌరాణా మన్యాదృశాః ప్రలాపాః ప్రవర్తంతే; త న్న శక్నోమి సీతామాత్రస్య కృతే శరచ్చంద్రనిర్మల స్యైక్ష్వాకుకులస్య కల్కం ముత్పాదయితుమ్."

లక్ష్మ—అన్నగారు, కాదు, ప్రభువుగారు నన్నుఁజూచి 'వత్సా ! లక్ష్మణ ! రావణభవననివాసమునుబట్టి సీతాదేవిచారిత్రవిషయమున సముత్పన్నవిమర్శను లయి పురజనులు వేఱువిధముగాఁ బ్రలపించుచున్నారు. సీతామాత్రమునకయి శరచ్చంద్రనిర్మల మగు నిక్ష్వాకుకులమునకుఁ గలంకము గలిగింపం జాలను...........................' అని యానతిచ్చిరిగదా ?

ఈనాటకమునందే లక్ష్మణుఁడు సీతతో రామునిసందేశము నిటులు దెలుపుచున్నాఁడు-

"తుల్యాన్వయే త్యనుగుణేతి గుణోన్నతేతి
దుఃఖే సుఖేచ సుచిరం సహవాసి నీతి
జానామి కేవల మహం జనవాదభీత్యా
సీతే ! త్యజామి భవతీం నతు భావదోషాత్."

చ. అనుగుణవంచుఁ, దుల్యమగు నన్వయముం గలదానవంచు, మే
లౌనముల ప్రోకవంచు, నను గోడున మేలున వీడవంచునుక్,
జనకజ! నే నెఱుంగుదును జక్కఁ; ద్యజించితిఁ గేవలంబునిక్
జనపరివాదభీతిని, మనంబున దోషముఁ బట్టి కాదు సూ.

లోకారాధనమునకై రాజ్యదారాదుల నిశ్చింతఁ బరిత్యజింపఁగల కఠోరవ్రత సంపన్నుఁడగుశ్రీరాముని పవిత్రశీలమును బై సందేశశ్లోకము విస్పష్టీకరించుచున్నది.

సంస్కృతాధ్యాత్మరామాయణమునం దుత్తరకాండమునందలి విషయమే కొంచెము మార్పుతోఁ గననగుచున్నది. రామున కీవార్తను దెల్పినవాఁడు విజయుఁడు గాని భద్రుఁడుగాఁడు. (అధ్యాత్మ—ఉత్తరకాం. స. 9 శ్లో. 46—53.) ఇఁక రజకునిగాథ సంస్కృతగ్రంథముల నీక్రిందివానియందుఁ గలదు.

1. పద్మపురాణము—పాతాళఖండము. అధ్యా 55 శ్లో. 67—74.

రజకః క్రోధసంప్లుష్టో భార్యా మన్యగృహోషితామ్
సహా సంతాడయామాస ధిక్కుర్వ న్ఛోణనేత్రవాన్
గచ్ఛ త్వం మద్గృహా త్తస్య గేహం యత్రోషితా దినమ్
నాహం గృహ్ణామి భవతీం దుష్టాం వచనలంఘినీమ్
తదా స్వమాతా ప్రోవాచ మా త్యజైనాం గృహాగతామ్
అపరాధేన రహితాం దుష్టకర్మవివర్జితామ్
మాతరం ప్రత్యువాచాథ రజకః క్రోధసంయుతః
నాహం రామ ఇవ ప్రేష్టాం గృహ్ణే మన్యగృహోషితామ్
సరాజా యత్ర గోత్యేవ తత్సర్వం సీతిమద్భవేత్
అహం గృహ్ణామి నో భార్యాం పరవేశ్మని సంస్థితామ్
పునః పున రువాచేదం రామో నాహం మహేశ్వరః
యః పరస్య గృహేసంస్థాం జానకీం వై రరక్షసః
ఇతి వాక్యం సమాశ్రుత్య చారః క్రోధపరిప్లుతః
ఖడ్గం గృహీత్వా స్వకరే హంతుం విదధేమనః."

"అంత నారజకుఁడు శోణనేత్రుఁడును క్రోధోద్దీపితుఁడు నై యన్యగృహోషిత యగుభార్యను బడెంబులఁ దన్ని 'ఓసీ! యింతవఱకెచటనుంటివో యచటికే చనుము. దుష్టురాలగు నిన్ను గ్రహింపఁజాల నని' పలికెను. వానితల్లి నిరపరాధినియు, దుష్టకర్మవివర్జితయు, మఱల గృహమున కరుదెంచినదియు నగుతన

భార్యను విడనాడ వల దని యాతని బతిమాలెను. ఆమెవచనంబుల విని యాతఁ డాగ్రహం బూని 'అన్యగృహోషిత యగుభార్యను రామునివలె స్వీకరింపఁజాలను. పరగృహవాసిని యగుజానకిని గ్రహించి రక్షించిన శ్రీరామచక్రవర్తిని గా' నని మరలమరలఁ బలుకుచుండెను. ఇది విని సహింపఁజాలక చారుఁడు క్రోధముతో ఖడ్గము నెత్తి యాతనిఁ బరిమార్పనిశ్చయించెను."

ఈవృత్తాంతమే రామునికి (స- 66) గూఢచారునిచే నివేదింపఁబడినది.

2. జైమినిభారతమునందు నిట్టికథయే కలదు. పినవీరభద్రుని యాంధ్రీకరణము ఆశ్వా 6- పద్య 28-30 చూడుఁడు. ఇందు నాథుఁడు తిరస్కృతియొనర్చినఁ బుట్టినింటికేగిన రజకి నామెభర్త మరల గ్రహింపక విడిచె నని కలదు.

3. భాగవతము నవమస్కంధమున (అధ్యా- 11) రాముఁడే గూఢముగ రాత్రిఁ జరింపుచు సీతాపవాదవాక్యముల వినినటుల సంగ్రహముగఁ గలదు.

"కదాచి ల్లోకజిజ్ఞాసు ర్గూఢో రాత్ర్యా మలక్షితః
చరన్ వచోఽశ్రుణో ద్రామో భార్యాముద్దిశ్య కస్యచిత్ -
నాహం బిభర్మి త్వాం దుష్టా మసతీం పరవేశ్మగామ్
స్త్రైణోహి బిభృయా త్సీతాం రామోనాహం భజే పునః
ఇతి లోకా ద్బహుముఖా ద్దురారాధ్యా దసంవిదః
పత్యా భీతేన సాత్యక్తా ప్రాప్తా ప్రాచేతసాశ్రమమ్.

ఆంధ్రమున, పాపరాజకృత మగునుత్తరరామాయణాదిగ్రంథముల రజకుని ప్రశంస గన్పడదు. ఈగ్రంథము లుత్తరకాండమునందలి కథాభాగము ననుసరించుచున్నవి. పౌరజానపదులందఱును సీతశీలమును శంకించి రనుట యొప్ప దని పద్మపురాణాదికముల నీవృత్తాంతము గల్పింపఁబడియుండును. అది యెట్లున్నను దృశ్యకావ్యములలో నిది యనుచితము. సీత శీలమునుగూర్చి రంగస్థలముపైఁ దుచ్ఛులచేఁ బ్రసంగింపఁజేయుట రసపోషకము గాఁజాలదు. కాళిదాసు,భవభూతి, దిఙ్నాగమహాకవులు రచించిన దృశ్యకావ్యధోరణి మనకు మార్గదర్శకము. ఎయ్యది రసపోషకమో, యెయ్యది రసభంజకమో కవులు విచక్షణచే నరయవలయును. నూతనమార్గములను ద్రొక్కుటయే ప్రధానము కాదు. ఆధునికులు కొందఱు సీత, సావిత్రి, దమయంతి మున్నగువారి పవిత్రచరిత్రములకుఁగూడఁ గళంకము నాపాదించుచు విశృంఖలులై గ్రంథరచనకుఁ గడంగుచున్నారు. అట్టిప్రయత్నములు గర్హ్యములు. పామరజనాహ్లాదమునకై యసత్కావ్యరచనకుఁ గడంగుట యొప్పదు. రసపోషణము, నౌచిత్యమును బాటింపవలయును. 'ఆపరితోషా ద్విదుషాం నసాధు మన్యేప్రయోగవిజ్ఞాన'మ్మను కాళిదాసీయసూక్తిని స్మరించుటయొప్పు.

# వేణీసంహారము-నాయకుఁడు.

యం. సూర్యనారాయణమూర్తిగారు,—బొల్లపాడు.

---

వెనుక, ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక (22 సం. 5 సం.) లో "వేణీసంహారే భీమ ఏవ నాయకః" అను శీర్షికను గుఱించి నే నొకవ్యాసము వ్రాసితిని. ఆవ్యాసమును ఖండించుచు 'వేణీసంహారము - నాయకుఁడు' అనుశీర్షికతో, పరిషత్పత్రిక (23 సం. 3 సం.) లో శ్రీయామిజాల పద్మనాభస్వామిగా రొకవ్యాసము వ్రాసిరి. ఆవ్యాసమునకు సమాధాన మీయఁగలబాధ్యత నాయందే యుండెఁ గావున నీ విమర్శనను వ్రాయఁగడంగితిని.

నాయకశబ్దమునకు వ్యుత్పత్తిమూలముగ నర్థము చెప్పరా దనియు, నాలాగునఁ జెప్పి "అభిజ్ఞానశాకున్తలమున శకున్తలాదుష్యన్తసమాగమమునకుఁ బ్రధానభూత మంగుళీయకము గదా యని తన్నాటకమున నాయకత్వము నంగుళీయకమున కంటఁగట్టుట న్యాయమా ?" అని వ్రాసిరి. మఱి నాయకశబ్దమున కర్థ మేమిటి ? "నేతా వినీతో మధురః" ఇత్యాదిగా ధనంజయునిచేఁ జెప్పఁబడిన నాయకసామాన్యలక్షణ మంగీకరించెదరా ? ఆలక్షణ మంగీకరించినప్పటికి నాలక్షణ మంతయు ధర్మరాజునందు సరిపోవునా ? సామాన్యలక్షణముమాట నటుంచి నాటకమున ధీరోదాత్తుఁడు నాయకుఁడుగా నుండవలె నని నియమ మున్నదిగా ?" "మహాసత్త్వోఽతిగమ్భీరః క్షమావా నవికత్థనః" ఇత్యాదిగా ధీరోదాత్తలక్షణము చెప్పఁబడినది. ఆలక్షణమేని నితనికి సరిపోదే ? మఱి యేయుపపత్తులచే ధర్మరాజు నాయకుఁడగును ?

అథవా, ధర్మరాజే నాయకుఁ డైన నేనాయకుఁ డగును ? సచివాయత్తసిద్ధి గలనాయకుఁడా ? ఇతని ప్రవేశ మొకషష్ఠాంకమందే యుండుటచేతను, సచివాయత్తసిద్ధి గలనాయకుని కంతగాఁ బ్రవేశించుట కవసరము లేకపోవుటచేతను, నితఁడు సచివాయత్తసిద్ధి గలవాఁ డని కొందఱియాశయము. వేణీసంహారమున, ధర్మరాజు సచివాయత్తసిద్ధి గలనాయకుఁడు కాఁ డని శ్రీస్వామిగారు చెప్పినారు. ఏలయన, ధర్మరాజునకు సచివులుగా శ్రీకృష్ణుని, ద్రౌపదినే చెప్పవలయును గాని యితరులను జెప్పుటకు వీలు లేదఁట. ఏకార్యము వచ్చినను ధర్మజుఁడు వారితోడనే మంత్రాలోచన చేయుచుండును. కనుక నిట (అనఁగా వేణీసంహారమున) ధర్మజుఁ డేపనియుఁగూడ ద్రౌపది, శ్రీకృష్ణులతో నాలోచన చేసినట్లే లేదు. పోనీ భీము

నిట్లు చేయు మని యాజ్ఞాపించినాఁడా ? లేదు. లేదు. ధర్మజునకు, భీముని సచివు నిగాఁ జెప్పుటకు వీలులే దని చెప్పినారు. మఱిధర్మజుఁ డిచ్చట నేనాయకుఁ డగును?

మఱియు ధర్మజునకు మన్త్రాలోచనలో ద్రౌపదికూడఁ బాల్గొను నని స్వామిగారే చెప్పినారు. అయిన ద్రౌపది తనపరిభవక్లేశమును భీమునితోడనే మొఱ పెట్టుకొనుటకు హేతు వేమి? ఎప్పుడు కార్యాలోచన చేయువారు కనుక మఱి యేసందర్భములో నైన ధర్మరాజుతోఁ జెప్పలేదేల? ప్రభువు ధర్మరాజేగదా? ప్రత్యక్షముగఁ జెప్పుమాట యటుంచుఁడు. సూచీప్రాయముగ నైనఁ దెల్పలేదేల ? ధర్మరాజు నిర్వీర్యుఁ డనుకొనినదా ?

"యత్సత్యవ్రత" ఇత్యాది ధర్మరాజు నుత్సాహము పూర్తిగా వర్ణింపఁబడినదఁట. ఇట నొకచిన్నమాట. సోదరులలోఁ జ్యేష్ఠుఁడు ధర్మరాజు. ఇంతవఱకు నన్నగారు చెప్పినట్లెల్లఁ దమ్ములు నడుచుకొనుచున్నారు. ఇఁక వీరు చెప్పినట్లు వినువారుగ నుండరా. భీముఁడు "యుష్మచ్ఛాసన.................అద్యైకం దివసం మమాపి న గురు ర్నాహం విధేయ స్తవ'' అని యుద్ధమునకు ముం దంజ వేయుచున్నాఁడు ఇఁకఁ దానెంత శాంతివహించినను లాభములేదనుకొన్నాఁడు. లౌక్యుఁడుగదా? "అందినజుట్టు..........."అన్నమాదిరిగా భీముఁడు చెప్పినదానిని ననుసరించినాఁడు. ఇచ్చట ధర్మరాజు "క్రోధజ్యోతి రిదం మహ త్కురువనే యౌధిష్ఠిరం జృమ్భతే" అనియె.ఇట నుత్సాహమేనా సూచితము ? లేక క్రోధమా ?

ఇఁక రసవిషయము:—ఈగ్రంథమున రౌద్రరస మని చెప్పుటకు వీలు లేదఁట. ఏలయన "యత్సత్యవ్రతే''త్యాదిగా ధర్మజు నుత్సాహము సూచింపఁబడినదఁట."ఇంకను బంచమాంకమున"భోభో భీమార్జునౌనిహితాశేషారాతిచక్రాక్రాంతపరశురామయశాః ప్రతాపస్థాపితదిఙ్మండలః శ్రీమాన్.........దేవోయుధిష్ఠిర ఆజ్ఞాపయతి" ఇత్యాదివాక్యములచేతను "కుర్వంత్వాప్తా హతానాం" ఇత్యాది వర్ణనలచేతను యుధిష్ఠిరోత్సాహము మరలమరల ననుసంధానమై వీరమునకే యంగిత్వము నాపాదించుచున్నది." అని స్వామిగారు వ్రాసిరి. "భోభో" ఇత్యాది వచనమందు నుత్సాహ మెంతమాత్రము సూచింపఁబడలేదు. "నీ వీపని చేయుము" అని యెవరైన నొకని కాజ్ఞాపించినంతమాత్రమున నుత్సాహము వర్ణితమేనా ? "కుర్వంత్వాప్తాహతానాం" ఇత్యాదిగా సూర్యాస్తమయ మైన దనియు సమరభూమియంతయు పీనుఁగులచే నిండియున్న దనియుఁ, జచ్చినవారి పారలౌకికక్రియల గుఱించి చెప్పఁబడినది గాని యుత్సాహ మేమియు వర్ణితము కాలేదు.

మఱియు యుద్ధము విరమింపుఁ డని తెలియఁజేసినాఁడు. "రౌద్రరస మధికముగ వర్ణితమైనను దాని నంగత్వేన స్వీకరింపవలసినదియే. కాని, యంగిత్వేన స్వీకరింపవలనుపడదు" అని వ్రాసిరి. కారణ మేమి ? అందువలననే "అవిరోధీ విరోధీవా రసోఙ్గిని రసాన్తరే, పరిపోషం ననేతవ్య స్తథా స్యా దవిరోధితా" అని యానంద వర్ధనాచార్యులు వ్రాసినారఁట. వ్రాసిన వ్రాయుఁగాక. ఆశ్లోకమునకుఁ బ్రకృతమునకుఁ గలసంబంధ మేమి? స్వోత్కర్షను దెలియఁజేసికొనుటయా? "చంచద్భుజే" త్యాది వాక్యానన్తరమే, "అనుగృహ్ణన్తుతే భ్రాతరః" ఇత్యాది ద్రౌపదీవాక్యముల చేతను, "భోభో శృణ్వన్తు" ఇత్యాది నేపథ్యగతవృత్తాన్తములచేతను, రౌద్రము ధర్మజాయత్త మైనవీరమున కంగముగనే వివక్షచేయఁ బడుచున్నది." ద్రౌపదీవాక్యములచే నేమైన సూచితమైనది యు, లేక, యేదైనఁ బరిపోషిత మైనది యుఁ బాఠకులే నిర్ణయించెదరుగాక ! "ఇంక ననేకము లగు నుపపత్తులు వీరరసామోదములు గన్పట్టుచున్నవి." ఇంతవఱకు నొకటియైనను బ్రబలకారణముఁ జూపింపలేదు. ఉన్న వన్నంతమాత్రమునఁ బ్రయోజన మేమి ? రసవిషయములో నేను గుడ్యమార్గాలవిధానము వహించితి నని వ్రాసినారు. ఇప్పట్టున వా రేవిధానము వహించిరి ? పాఠకమహాశయులకుఁ దెలియదా ? నేను వ్రాయవలెనా ? కాన, నింతవఱకు శ్రీపద్మనాభస్వామిగారు చెప్పిన యుపపత్తుల ననుసరించి వీరరస మని చెప్పుట కావంతయు నాధారము లేదు.

ప్రథమాంకము, ''యత్సత్య వ్రతభంగభీరుమన సే''త్యాది వాక్యశ్రవణానంతరమున భీమసేనుఁడు పలికిన ''జృంభతాంజృంభతాం ఆర్యస్య క్రోధజ్యోతిః'' అను వాక్యము ధర్మరాజునకే నేతృత్వము నాపాదించుచున్నది'' అని తెల్పినారు. ఎట్లు ? పూర్వాపరసందర్భ మేమైన విచారించినారా? లోకమున నెవరైన నొకనిని (కోపమువచ్చినవానిని) "నీక్రోధము ప్రకాశించుఁగాక'' యనిన నాకోపము వచ్చినవాఁడు నాయకుఁడే ? నాయకునిలక్షణములలో నేలక్షణము సరిపోవునిచ్చట? "చత్వారో వయ మృత్విజః'' అనుభీమవచనము రణయజ్ఞమున ధర్మరాజుఁడు యజమానుఁ డనియు భీమాదులు ఋత్విక్కులే యనియుఁ జెప్పుచు ధర్మజునకే నాయకత్వమును జూఱుచుచ్చుచు భీముఁడు నాయకుఁ డనువారివాదమును ద్రోసిరాజనుచున్నది.'' అని సెలవిచ్చినారు. యథార్థమే. ఒక్క విషయ మాలోచింపవలయును. ధర్మరాజు నాయకుఁడు భీముఁడు నాయకుఁడు కాఁ డను మాటయే యసత్యము. మిగిలిన దంతయు యథార్థమే ! ఏలయన; రణయజ్ఞము

న కంతకును ధర్మజుఁడు యజమానుఁడు కావచ్చును. రణయజ్ఞమున కంతకు నొక్క వేణీసంహారమే పరమప్రయోజనము కాదుగదా ? ఇంక నితరప్రయోజనములు చాలనున్నవి. ఇట భట్టనారాయణుఁ డొక వేణీసంహారమును గుఱించియే గ్రంథముగ వ్రాసినాఁడు. రణయజ్ఞమున కంతకు యజమానుఁ డనుమాట యిట ననవసరము ఇట ననఁగా వేణీసంహారమే పరమప్రయోజనము గాఁగల పని యందుమాత్రము ధర్మజునకు నాయకత్వముచెల్లదు. కావున "చత్వారో వయ మృత్విజః" అనునది హేతువుగాఁ జూపించుట యనవసర మని నాయాశయము.

ఇం కొకవిషయము:—ఇదివఱలో కస్తూ అచ్యుతరామశర్మగారు రసవిష యమై కొద్దిదినములక్రిందటనే యొకవ్యాసమును వ్రాయుచు రౌద్ర మని నిరూపించి రఁట? కాని యావ్యాసమును జూచుభాగ్య మింతవఱకు నాకు లభింపలేదు.

ఇఁక లక్ష్యలక్షణసమన్వయము:—లక్షణగ్రంథములు తఱచుగా లక్ష్య గ్రంథముల ననుసరించియే వ్రాయఁబడిన వనియు లక్షణగ్రంథమునకు నేదేని నొక లక్ష్యగ్రంథము సరిపోకపోయినను బ్రమాద మేమియు లే దనియు నే నిదివఱలో వ్రాసితిని. ఏలయన- ఈలక్ష్యగ్రంథము (వేణీసంహారము) లక్షణగ్రంథముకంటె మున్నె రచింపఁబడినది. కావున సరిపోకపోయినను హానిలే దంటిని. "ఏకవి వ్రాసినగ్రంథమేని లక్షణశాస్త్రవిరుద్ధము కాకుండ నుండవలె నని సూర్యనారాయణ మూర్తిగారి యుద్దేశ్య మైయున్న దని నాయూహ. కాని యిప్పుడు కుప్పలు గ నుప్పతిల్లుచున్న గ్రంథములలో ముప్పాతిక మూఁడువంతులు లక్షణగ్రంథముల ననుసరించియే యున్నవా ?" అని శ్రీయుత పద్మనాభస్వామిగారు సెలవిచ్చి యున్నారు. ఈవాక్యమున కిచ్చుట నేమాత్రము నవసరము లేదు. వేణీసంహార మిప్పటికాలగ్రంథము కాదు. 10, 12 శతాబ్దముల క్రింద రచింపఁబడినగ్రంథము. ఇప్పటిగ్రంథములు సరిపోవుటలే దని నుడివిరి; కనుక యిప్పటిగ్రంథములు వాని ననుసరించియే యున్నవని వారియాశయమై యుండనోపు. కాని యీవేణీసంహారమున ధర్మరాజు నాయకుఁడన్నను భీముఁడు నాయకుఁడన్నను లక్షణగ్రంథమునకు సరిపోదు. ఇదియే నే నిదివఱలో వ్రాసితిని. ఇట స్వామిగారు స్వకీయాభిప్రాయమును వెల్లడిచేయుటకై యిట్లు వ్రాసి రని తలంచుచుంటి. వారు చెప్పినట్లు లక్షణగ్రంథముల ననుసరించి లక్ష్యగ్రంథములు లేవు గనుకనే "నిరంకుశాః కవయః" అన్నారు. లేక యిప్పట్లున వీరి నేమనియెదరు ?

మన భారతీయప్రాచీనసాంప్రదాయమున నెచ్చటఁ జూచినను గ్రంథమును మంగళాన్తముగఁ జేయుచున్నారు. ఈనియమము ననుసరించియే మహాకవి భవభూతి సీతారాముల పునస్సమాగమమునకై యెన్నియిక్కట్లపాల్పడెనో సాహిత్యసేవకు లందఱకు సువిదితమే. కాని వర్తమానకాలములోఁ, బాశ్చాత్యవ్యామోహములు మనపాలఁ బడినచందమున నే కవులుగూడఁ గవిత్వవిషయమునఁ గూడఁ బాశ్చాత్యుల ననుసరించి విషాదాంతగ్రంథములను వ్రాయుచున్నారు. గ్రంథములనే గాక చిన్నకథలు వ్రాసినప్పటికి వానిని విషాదాంతముగనే మార్చుచున్నారు. ఇప్పట్టున "నిరంకుశాః కవయః" అనుసూత్రము వీరియం దన్వయింపదా?

ఇంతవఱకు శ్రీపద్మనాభస్వామిగారు చూపిన యుక్తుల ననుసరించి వేణీసంహారమున వీరము రసమగుటకుఁ గాని ధర్మజుఁడు నాయకుఁ డగుటకుఁ గాని యావంతయు నాధారము లేదని నామనవి. *

---

# గ్రంథస్వీకారము.

## 1. పార్వతీపరిణయము.

ఐదంకముల నాటకము. కీ. శే. అబ్బరాజు వేంకటకోదండపాణిశర్మశాస్త్రి గారిచే రచియింపఁబడినది. ఈబాలుఁడు రేపల్లె హైస్కూలులోఁ బండితులు బ్ర॥ అబ్బరాజు హనుమంతరాయశర్మపాకయాజిగారి ప్రథమపుత్త్రుఁడు. ది 4-5-1918 సం॥న జన్మించి 29-9-33 సం॥ నాఁటికి సంస్కృతాంధ్రాంగ్లములయందుఁ బాండితి గణించి బ్రహ్మచర్యవ్రతము నడపుచుఁ గాలధర్మము నొందినవాఁడు. పదేనేండ్ల ప్రాయముననే భాషాభివృద్ధిచేసికొని నాటకము వ్రాయుట యాశ్చర్యమే. తమ నియమితకాలములలోఁ బేరు నిల్పుకొనుటకై యల్పాయుష్కులగు బుద్ధిమంతు లద్భుతకార్యములు చేసినవారు పెక్కురుండిరి. ఇం దనుభవము చాలనికతమునఁ, గొన్నికొన్ని తావుల గడసుఁదనముగ లేదు. కొంత పెంచెను. కొంత కుదించెను. దిక్పాలకులు బ్రహ్మతో మొఱ్ఱపెట్టుకొనుటలోఁ బెంచెను. ఈశానుఁడు పెట్టుకొన్న మొఱ్ఱ పేలవముగా నున్నది. ఈశ్వరుఁడును, ఈశాన్యాధిపతియు వేఱు చేయఁబడినట్లున్నది. దాక్షాయణి మృతికి శివుని విచారము మిక్కిలి పేలవముగా నున్నది. మనుష్యసాధారణముగాఁ గన్పట్టుచున్నది. "దైవకామినుల బలాత్కార

---

* ఈవిషయమై వ్యాసము లింకఁ బ్రకటింపఁబడవు. స. అ.

ముగను బుంశ్చలీవర్తనకుఁ దీయఁబోయినాఁడు"-క్రొత్తకోడండ్రను మొత్తంబుగాఁ దెచ్చి పుంస్త్వధర్మము దీర్పఁబూనినాఁడు-''ఊహచాలని వ్రాఁతలు. మేనకాహిమవంతులు "నవలావణ్యవతియగు పార్వతిం గాంచుచు నానందించుచుంటి'' మని యనుమాటలతోఁ బార్వతిజననము ప్రారంభించినారు. ఇది కథను గుఱించినందుల కుదాహరణము. నవలావణ్యమునకు ముందామె కథ లేదు. దక్షునిరాక నారదునితో సంభాషణము సరసముగ లేదు. ముసలికోపమే కాని యౌచితి యాతనియం దుఁగానరాదు. 'ని, ర్ధూతస్థేములమైతి మింక నతనిం గ్రుంపన్ మార్గమే లేదొకో'' అను ప్రమాదము సంస్కర్తలను గూడఁ గనుబ్రామినది. గ్రంథమును మామొద్దికిఁ బంపినకారణమున నందుకొంటి మని చెప్పుటకే కాని విమర్శించుటకా దిది. అకాలమరణము నొందిన బాలుని యశశ్చంద్రికలు తల్లిదండ్రుల మనశ్శాంతిని జేయుఁగాక. ఆంధ్రగీర్వాణపదలాలిత్యముతోఁ గవిత యాతని యీడునకుఁ దగినట్లున్నది. మచ్చున కొక్కపద్యము-

సీ. పుట్టింపఁగలశక్తిఁ బూని యాయువుకర్తవైన నీయంగలాఁ డన్నకలఁడు
పోషింపఁ గలశక్తిఁ బూని యాహారంబు తఱుగ నీయఁగలాఁడు తండ్రిగలఁడు
భోగింపఁ గలశక్తిఁ బూని భోగంబులు తఱుగ నీఁగల పెద్దతండ్రి గలఁడు
సర్వసంపచ్ఛక్తిఁ జరియించి సంపదల్ తఱుగ నీఁగల కన్నతల్లి గలదు
ఎందఱున్న నేమి హేమాద్రిధన్వుఁడు, మేనయత్త మగఁడు మేనమామ
కాఁడటన్నమాట కారణమ్ముగ నిన్నుఁ, గంటి మంటఁగాల్ప గెంటినారె.

ఈనాటకమును బాలకలోకము ప్రచారమునకుఁ దెచ్చి కవి జననీజనకుల కూరట గల్గింతురుగాక. వెల ౧౨ అణాలు. కవి తండ్రిగారియొద్ద దొరకును.

---

## 2. కామకోలాసము.

ఇదియొక విధమైన నాటకము. స్నేహలతాకవితాసంఘము 44 పుష్పము. హైదరాబాదు, నైజాము కాలేజీలో ప్రొఫెసర్, విద్వాన్ నరిపల్లె విశ్వనాథ శాస్త్రి ఎం. ఏ. గారు మిల్టను కవి రచించిన కోమస్ అను నింగ్లీషు గ్రంథము నుండి తెనిఁగించిరి. గ్రంథమంతయుఁ బేరు లేనిక్రొత్త జాతిచరణములలో వ్రాసినారు. "ఈచరణములు మంజరి- కర్ణాటచౌపది- వృత్త మిశ్రమము లగుటవలన దీనినొక కర్ణాటమంజరీ మిశ్రజాతివృత్త మని నిర్ధారణ గావింపవచ్చు" నని పీఠికాకారులు వ్రాయుచున్నారు. దీనిలోని కథ, ఒకసాధ్వి యడవులలోఁ జీఁకటిలో రంగస్థల

మేర్పఱుచుకొని తెన్నెఱుఁగక పెడదారులం బడి యన్నల నిద్దఱ విడిచి కాముని వలలం దగుల్కొని వానిలాలనలకుఁ దెలివిగోల్పడి మాయాపాశబద్ధయై కన్యాత్వము చెడిపోనున్న సందిగ్ధావస్థలోఁ దద్వనితాసౌశీల్యమున కేమాత్రమును భంగము రానీక ధర్మదేవత కాపాడుట-కొన్ని భాగములు ప్రబోధచంద్రోదయ కథతోఁ బోలునట్టు- భాషాంతరము చేయుటలో నా యా భాషలరుచుల కనుకూలముగ వర్ణనాంశములను బేరులను మార్చుట నిపుణులలక్షణమే. కేవల మంజరులలో నుండినఁ గవిగారి మృదుపదరచనకు నడక కొంతసాయము చేసియుండును, గాని, కర్ణాటమిశ్రమము చేయుటచే మాత్రావ్యత్యయము నడకను గుంటువడఁ జేయుచున్నది. చూడుఁడు-

“వినవచ్చెఁ గలకలము విపినాంతరమున- శ్రుతినమ్మఁ దగినట్టి శుభమార్గదర్శి
మధుపానమత్తులై మర్యాదవిడిచి- విషయసుఖముల కెపుడుఁ బ్రియశిష్యులగుచుఁ
జోరులై జారులై జూదములె పనిగ- రాత్రులం దిరుగాడు రక్కసులమూఁక”

“ఇది చక్కఁగా గానము సేయుటకుఁ జాలినంత సౌకర్యముల నిచ్చుచు మంచి హాయిలుగల నడకతోఁ బరుగెత్తుచుండు” నని పీఠికలోఁ గలదు. సంగీత జ్ఞానములేని కేవల పండితులకు నడకకుంటుగానేయుండును-దీనివెల ౮ అణాలు. కొల్హాపురములో స్నేహలతా కవితాసంఘములో దొరకును.

---

### 3. భౌతికభూగోళశాస్త్రము.

చిత్తూరుబోర్డుహైస్కూలు ప్రధానోపాధ్యాయులు, మ. ముడియం సీతారామరావుగారు, బి. ఏ., యల్. టి. గారిచే రచియింపఁబడినది. రెండవకూర్పు. మొదటికూర్పులో 266 పుటలును 140 ప్రతిమలును గలది- యీ రెండవకూర్పులో 514 పుటలును 226 ప్రతిమలును గలదియైనది. అనేకనూతనాంశములు చేర్పఁబడినవి. భౌతికభూగోళశాస్త్ర మిదియొక్కటియే ప్రస్తుతము తెలుఁగులోఁ గనుపట్టుచున్నది. ఉన్నవానిలో మిన్నగాఁగూడ నున్నయది. “భౌతికభూగోళశాస్త్రమునం దీగ్రంథకర్తగారికిఁ గల ప్రత్యేకాభిమానమును, హైస్కూలువిద్యార్థులకు తచ్ఛాస్త్రమును బోధపఱుచుటయందు గొప్ప యనుభవమును వీరికి గ్రంథము వ్రాయఁబడినపద్ధతివలన స్పష్టము కాఁగలవు. ‘సైన్సు’ మొదలగునవి దేశభాషలయందు నేరుపవలయు నని యాందోళనమున్న యీదినములలో శ్రీసీతారామారావుగారొనర్చిన ప్రయత్నము లాదరణీయములు” అని డా. సర్. సర్వేపల్లి

రాధాకృష్ణయ్యగా రభిప్రాయ మిచ్చియున్నారు. కావున నీగ్రంథమున కెట్టివిలువ గలుగునో యూహింపుఁడు. తమ కభిమానము గలశాస్త్రములలో ననేకపరిశోధనలు చేయుచుఁ దమజీవితమంతయు దానికై వినియోగించుచు విద్యార్థులకుఁ జ్ఞానాభివృద్ధి గావింప మార్గము లారయు పండితులను విద్యాధికారులు, విద్యాధికులు గౌరవింపవలయును. ఆగౌరవము లోకోపకారక మగును. దీనివెలయిప్పాడును రు. 2 లే. చిత్తూరు- రామచంద్రగ్రంథనిలయములో దొరకును.

---

## 4. వశిష్ఠగోత్రక్షత్రియులు.

ఇది శ్రీమహామండలేశ్వర పూసపాటి రాజరాజ విరచితము. బ్ర. సుప్వారి జగన్నాథశర్మగారిచేఁ బ్రకటింపఁబడినది. సీసమాలిక- దీనికి వివరణమును విశేషాంశములును శర్మగారు గ్రామ్యభాషలో వ్రాసియున్నారు. 24 పుటలచిన్నగ్రంథము. వశిష్ఠగోత్రక్షత్రియుల పూర్వులవిషయము లిందు విరివిగాఁ గలవు. దీని వెల 4 అణాలు- ఇది క్షత్రియచారిత్రికమండలి, రాజాబజార్ విజయనగరములోఁ గాని, ఏ. పూర్ణా అండుకో 16 చంద్రభానువీథి- కోమలేశ్వరన్‌పేట (మదరాసు)లోఁ గాని, డి. వి. ఆర్. భారతి, మసీదు ఎదుట కాకినాడలోఁ గాని దొరకును.

---

## 5. యోగమార్గము.

ఇది బ్ర। జమ్ములమడక సూర్యనారాయణశర్మగారిచే రచియింపఁబడినది. యోగ మసాధారణమైనది. ప్రజ్ఞాధురీణులకే యిది లభ్య మగును. మోక్షాపేక్షులగు వారలకు యోగసాధనము ముఖ్యమనికొందఱిమతము. యోగహీనమైన జ్ఞానము మోక్షద మెట్లగు నని పూర్వులు వక్కాణించిరి. యోగమునుగూర్చి యుపన్యాసము లిచ్చుటలోఁ బ్రయోజనము లేదు. శర్మగారిందు వీరాసనము సిద్ధాసనమును దామే కూర్చుండి యాసనబంధనైపుణిం గనఁబఱిచియున్నారు. వారియోగస్థితి రెండు పటములలోఁ జూపియున్నారు. యోగాభ్యాసము చేయఁ గోరువారికీగ్రంథము కొంచెము సాయముచేయును. అభ్యాసకుని యాహారవిహారము లిందు నిర్ణయింపఁబడినవి. ప్రకృతినుండి లభించునవి- దొరకినవి దొరకిన యట్లే తినవలసినదే గాని సంస్కరించి తినరాదనియు-అట్టివి వృక్షములనుండియే లభించుననియు, నట్టివృక్షములలో, చిరజీవులును గొమ్మలు లేనివియు శ్రేష్ఠము లనియుఁ, జిరకాలము చెట్టుననుండు కాయలు ప్రశస్తము లనియు నిన్నిలక్షణములు గలది నారికేళ మనియుఁ జెప్పినారు. యోగాభ్యాసము చేయనివారును, టెంకాయల నిపుడు దినుచున్నారు. 'దత్తం ప్రకృత్యా స్వయం' అనునట్లు చాల

మంది యిపుడు ప్రకృతిదత్తములైన యాహారములను భుజించుచున్నారు. వారు యోగాభ్యాసముం గూడఁ గావించిన మేలు.

దీనివెల ౮ అణాలు. కాకినాడలో జ. అనంతం బ్రదర్సువారియొద్ద దొరకును.

---

—ఁ కాకినాడహోమోపతీపత్త్రిక. ఁ—

ఇది కాకినాడలో డాక్టరు వై. గణపతిరావుగారివలనఁ బ్రకటింపఁబడు చున్న మాసపత్త్రిక- సంవత్సరమునకు, చందా రు. 1-4-0 ఇందు హోమోపతీ యను నూతనవైద్యవిధానమునకుఁ జెందిన పెక్కువ్యాసములు గలవు. ఈవైద్య విధానము పదునెనిమిదవ శతాబ్దమున జర్మనీదేశీయుఁ డగుశామ్యుయల్ హానిమను మహాశయునిచేఁగనిపెట్టఁబడినయది. నాఁటినుండి యును జర్మనీదేశములోను, అమెరికాయందును విశేషముగ వ్యాపించియున్నది. ముఖ్యముగ వంగదేశమం దును నీయాంధ్రదేశమునందును వ్యాప్తినిగాంచుచున్నది. ఇందలి ముఖ్యసిద్ధాంతము లేవనఁగా:—(1) ఏయేరోగుల కెట్టి బాహ్యాభ్యంతరలక్షణములు గనఁబడుచున్నవో యట్టి లక్షణములను బుట్టించు నౌషధములవలన నాయారోగములు పశమించును. దీనిని వారు సారూప్యౌషధప్రయోగ మందురు. ఈసిద్ధాంతము (Similia Similibus Curantur) అను దానియందు వ్యక్తీకరింపఁబడినది. (2) ప్రత్యౌషధియుఁ దన కనుగుణము లగు లక్షణముల నుదయింపఁజేయును. కాన వైద్యులు చికిత్సయం దొక యౌషధిని మాత్రమే వాడవలయును. ఇది ప్రస్తుతవైద్యవిధానమునకు (Allopathy) వ్యతిరేకము.

(3) Minimum dose- ఈవైద్యసిద్ధాంతములలో ముఖ్యమైనది బహు స్వల్పమైన మాత్రను (మోతాదును) ఉపయోగించుట. ఈవైద్యము నవలంబించుటవలనఁ బెక్కుప్రయోజనములు కలవు. ఔషధములు పసిబాలురు సయితము నుపయోగించుటకు వీలగునట్లు ఔషధసారమును బంచదారతోఁ (Sugar of milk) జేర్చి మాత్రలుచేయుదురు. మఱియును వీనివెల యత్యల్పమగుటచే నందఱ కీవైద్య మందుపాటులో నుండును. ఇట్టివైద్యవిధానమునుగుఱించి యందఱకుఁ దెలియునట్లు మాసపత్త్రికను నెలకొల్పుటచే గణపతిరావుగారి ప్రయత్నమెంతయుఁ బ్రశంస్యము. ఇది యాంధ్రదేశమున హోమోపతీవైద్యమును గూర్చి ప్రకటింపఁబడు పత్త్రికలలో రెండవది. మొదటిది పిఠాపురమున నాంధ్రహోమోపతీసంఘమువారి యాజమాన్యమున మ॥ మల్యాల మాధవరావుగారిచేఁ బ్రకటింపఁబడుచున్నది.

---

కర్ణపర్వమున వికల్పముచేత సంబోధన కాదేశము రహిఁ రాక
తనరును "మాతండ్రి" యనెడుకందమున "నికృష్టా తునిమె" దని యొసఁగె మఱియు
వరుస నుద్యోగపర్వమున నాదేశ మవ్యయపదమ్ముపయి రాకయె తగుటకు
"ధృతరాష్ట్రుఁ" డనెడి మత్తేభను "గానతగం బొందె" ననుచు నీగతి చెలంగు
నవ్విరాటమ్ములో నాదేశ మది యచేతనపుద్వితీయకుఁ దనరు వినుఁడు
మఱి "భవదాజ్ఞ" యన్మత్తేభఁ 'జిక్కువడం జేయదె' యటంచు రంజిలు నిఁకఁ
గర్ణపర్వమున నొక్కట "నృపుండనుభీష్ముఁ" డనెడిచంపకమాలికందు 'మత్స్య
నాథుపసులఁబట్టెనా' యనుషష్ఠ్యర్థమునను జశ్త్వముఁ రాక తనరు నవల
మును కర్మధారయమునకు నాదేశ మచేతనమునకు వచ్చినది యిటులఁ
'డెగి' యనుదాన 'నొండుగడకుఁబోవకుం' డని కర్ణపర్వమందునఁ దనర్చెఁ
గడు విరాటమున నాకర్మధారయమున నాదేశ మొకచోట లే దనుటకు
"నకుటిలుం" డనెడి చంపకమాలికను 'గుంతి ముద్దుసేయుకొడుక' నొప్పలిచె నవలఁ
దనర నచేతనమునకు నాదేశము రానియందునకు విరాటమునఁ ద్వి
తీయార్థమునను వర్తిల్లుచునుండెను "నాపతిగంధర్వు చేపడి" యనఁ
బరఁగ నచేతన ప్రథమ కాదేశంబు రానిది మనుచరిత్రను గణింప
"నీచనుదోయి" యనియెడి యుత్పలమాలికను 'వయఃశ్రీచన' నని చెలంగె
రహిఁగ నచేతన ప్రథమ కాదేశ మొప్పనిది కవులష్టమున "నుచితమె
దీనిమే" ననెడిపద్దెముతుద "నలపుష్పదామకంబుచెలికిదాపె" ననుచుఁ
దీరయ్యె నింక ద్వితీయ కాదేశంబు వచ్చుట కుద్యోగపర్వమందు
"నావిభురాజ్యపుశ్రీవాలి" యనఁబొల్చె వెలయుహరిశ్చంద్రనలచరిత్ర
యందచేతనముల నాదేశ మాకర్మధారయార్థంబునఁ దగె నిదె "పలు
పగతురగము" లని పలుకుటకుఁ "బలువగతురగము" లనిపల్కఁబడె శ్లేష
నలరు హరిశ్చంద్రనలకథ నింక నాంతపదము మీఁద జశ్త్వమ్ము రాక
సత్వంబు వచ్చిన జాడఁ జూడుఁ డిదె 'సారంగాహితమను సంపెం' గనఁ దగె
'నతనుబలం' బనునట్టి కందమునందు నింకఁ గొన్ని తెఱంగు లేర్పరింతుఁ
దొలుత హరిశ్చంద్రనలచరిత్రను మూర్తి 'తరలక' యనెడికందంబునందు
దరియించు చనెడినాంతపదముమీఁది 'బల్వల' యనుబమున జశ్త్వంబువచ్చి
యఱసున్న లేకయె యలరె శ్లేష నవల వెలయంగఁ దత్తథ వెండి మిగుల
'మర్యాద' యనుగీతి మఱియట్లు జశ్త్వ మలరి సున్న లేక కుల యనుకుత్వ

మునకు గుత్వమ్ము వచ్చును శ్లేష దాన రాజుల్ లసద్ధృతిని రాజుల్లసదురు
ధృతినని శ్లేషగఁ 'జతురబ్ధి'యనెడు మత్తేభ సంధి తగఁ బొందించె నింక
నుభయసత్త్వవిమిత్రుఁ డుద్యోగమునఁ 'గల్పకంబు గరము వేడ్కగ' నని చంప
కమునఁ బ్రాసంబు గకారంబుగాఁ జెప్పె 'నౌరకర' మనుక కారమునకు
జశ్త్వంబు వచ్చి యచ్చట సున్న లేకుండ "ధృతరాష్ట్రుఁ" డనెడి మత్తేభమందు
'వేగ తెగంబాఱి' నాఁగ నిచ్చోటను గలుగుజశ్త్వమ్ము వికల్పతఁ దగు
మొనసి యుద్యోగమ్మునసె "జగమ్ములనెల్ల"డనెడిచంపకమాలికను గకార
మగుటసమునను 'నెంతగుమతులైన' నంచును జశ్త్వముకు కారమున నిడె మఱి
వినుఁ డచేతనపదమ్మునకు ద్వితీయార్థమునఁ దగు నాదేశము గలిగినది
శాకుంతలమ్మున శార్దూల 'నావాలుఁగనుదోయి' యనుపద్యమునను బ్రాస
మునసె 'యాహావుట్టగనుపింపదే యిక్షు ధన్వి'నకని యిట్లు దనరె మఱియు
"ఒకనిమిష"మను చంపకమాలికందు 'పొమ్మికవని' విధ్యర్థమునఁ జెలంగుఁ
జేతనపదమున కాతఱి జశ్త్వ మెడలి యుద్ధకాండమందులఁ దలిర్చె
వెలయురాఘవపాండవీయమున నచేతనద్వితీయ ప్రథమ నడచుపట్ల
దాని కాదేశంబు రానివిధమునకుఁ జెప్పెదను 'దదంఘ్రిచేర్పు' మనుచుఁ
దనరు నీలాగునఁ దత్త్వావ్యమున మఱి ప్రథమార్థచేతనపదమునందు
జశ్త్వంబురాక పొసంగునందుకు గణింప 'సముదాటోపారి పంక్తిరథుఁ' డ
టంచు 'నాపట్టణ' మనుకందమునఁ బొల్చె 'నగరిపురమతల్లి'నా 'వెలయున
ఖిలభువనము' లనునలగీతమున నచేతనమునకుఁ బ్రథమార్థమయిన యెడ
రహిగ నాదేశంబు రాకుండె మఱి యచేతనమున కాకర్మధారయమునఁ
బ్రబలు నాదేశంబురాక కన్పట్టెను "బుడమిఱేఁడీరీతిఁగడఁ"గి యనెడి
తత్సమమందునఁ "దనరు వ్యాఖ్యపురాణమునిదంపతు"లటంచుఁ దనరుదాన
'నన్నగరంబున' ననుచోటఁ బ్రథమమై కరముజశ్త్వముగాంచి గరమునఁ దగె
దెలియ నలరు'ద్రోవదివరలీల'యనుచోఁ గ్రియపయినుడి జశ్త్వమయి తగె మఱి
సరసపుమాటలఁ జంద్రవహాళికవి రచనఘటించిన హరిశ్చంద్రకథను
ధోరణి గ "నకటాచేరెఁడునేలకు" ననెడిమత్తేభ నాలవపదమున
'రాజుకుమారుఁడ' న్రాజిల్లెఁ జేతనముగుపదమునకు షష్ఠ్యర్థమునను
రహిగ నాదేశంబు రాక యీకీతులఁ గృతులందుఁ జెల్లు నొక్కెడలఁ గనుక
యెచట నేయర్థమం దెట్లుండె నట్టులె రచియింపఁగావలె రసికుల కిఁకఁ

బదము మొదల గిత్వ మొదవి గీములు గిండు లనుచు నుండని యెడఁ దెనుఁగుఁగబ్బ
ముల నొక్కయెడఁ బలుకులు జంటగాఁ గూర్చి నుడువు-వో రెండవనుడుగు మొదలి
వ్రాయికి గిత్వంబు వచ్చి పులి గిలి నా నిల్లు గిల్లన నిట్టు లెసఁగు నింక
నక్కరములు గొన్ని యమరంగఁ బల్కు-చోట గకారము వకార మగుచు నొప్పు
నురుగు నురువు నాఁగ ను మఱి తెల్గున ద్వియుక్తులు విప్ర మినమిన తళతళ యన
వహి నింకఁ దద్భవపదములౌ సచజలు తలకట్ల నమరు నెత్వములు పొసఁగ
వ్రాక్కసెజ్జపదంబు దక్క సానాసము సాము సంబర మనఁ జంము చాయ
చక్కరమన జాము జడ జలంగ యన నీజాడలు గానట్టి సచజలెల్ల
నెత్వమ్ము లౌనవి యెఱిఁగింతు సెక సేస చెఱకు చెలువ జెట్టి జెజ్జి యనఁగఁ
గనఁగ నావలఁ దెనుంగున ణకారమ్ములు తెలిపెదఁ గొన్నింటిఁ దెలియుఁ డిటులఁ
బణఁతి యుఱువణించి వణఁకి యణఁకువ నాఁగణఁక యణఁగు జాణ ముణిఁగియనఁగఁ
బోణిమి, మణుఁగు, పూఁబోణి, పణ్యారము, పుణఁశించి, బెణఁకె నాఁబరఁగువరుసఁ
గాఁ బదునాల్గు నీకరణి పేళ్లెందులే వివి డకారమ్ములై యెసఁగు నొకటఁ
బడఁతి,యుఱువడించి,వడఁకి,యడఁకువనాఁ,గడఁక, యడఁగి, జాడ*ముడిఁగి నాఁగ
నింక శకారమ్ము లెఱిఁగింతు శేబాసనునుడి యెత్త్వాత్వతఁ దనరు వినుఁడి
శింగాణి శిరి శేలు శివిరి శేమంతి శేకరించెను శేరు శీదరంబు
శిరి శింగణావత్తి శిరిమిడితెరటు శిరాజి శేమంబు శేరబడు లనఁగ
శాబాసనఁగ నిట్టిశబ్దములు పదునాల్గు †తెలుఁగునను శకారములగు నవల
మొదలను నడుమను దుది శకారము లున్న సంస్కృతశబ్దా లెసంగుఁ గొన్ని
శాలాశిఫాశేషశమశంఖశుభశుక్రశీతశిలాశుచిశివ లనంగ
శలశక్రశమిశీలశర్మశంపాశ్వేతశయశాలిశరశర్వశౌరు లనఁగ
శ్యామాశిఖాశిఖిశ్లాఘాశిరశ్శితశాబశయ్యాశ్లక్ష్ణశక్తు లనఁగ
శిక్యశక్యశ్లిష్టశిష్టశుభ్రశ్రోత్రశుక్లశఃఖశ్రవఃశ్రుతు లనంగ
శ్రద్ధాశ్లథాశచీశ్యేనశంకాశంకుశార్ఙ్గిశుశ్మశ్రుశంభు లనఁగ
శూలిశోణశ్రావ్యశుద్ధిశూకశ్లేషశీఘ్రశాణాశ్రితశ్రీ లనంగ
శాంతశుక్తిశయనశరణశబలశపథశమనశకలశతఘ్ని లనఁగ

---

* జాణయను నర్థమున నిది జాడయని యగపడలేదు.

† శింగాణి మొదలు పదునాల్గుశబ్దములును తెనుఁగున శకారము లని కలదు. ఇప్పుడు సకారముగా వాడఁబడుచున్నవి.

శంకరశేముషీశైవాలశాలూరశేఖరశర్కరాశిఖరము లన
నాశరకేశవకౌశికదాశార్హపేశలకౌశలపిశితము లన
దశమాశనమశకక్రశిమదశార్ఙ్గాభ్రశిమనిశీథలశునశిశిరము లన
నశ్రాంతసంశయవిశ్రామకుశలప్రశస్తవిశేషవిశాలము లన
నీశానదేశికవేశంతనాశకకశ్మలకూశ్మాండకశ్యపు లన
నాశ్చర్యనిశ్చయపాశ్చాత్యపశ్చిమశశకకృశానువిశదము లనఁగ
నైశ్వర్యవిశ్వాసశాశ్వతదశనవిశిష్టకిశోరనిశితము లనఁగ
నాశుగోశీరశుగాశంసువిశిఖవిశాఖకశేరునిశాంతము లన
వశవశావేశ్యాంశువంశదంశీరాశికాశకాశీకోశదేశము లన
బాలిశకర్కశాపభ్రంశసదృశాపదేశాశ్రయాశప్రదేశము లన
దాశకశాప్రాంశువేశదిశాపాశకుశనిరాశాదశాకోశము లనఁ
గీశపేశిప్రశ్నలేశాశువేశ్మాశ్మదృశ్యవాంశీపాంశువైశ్య లనఁగ
నాదేశకులిశపలాశనివేశసదేశప్రకాశనిస్త్రింశము లన
నిఁక సకారమ్ముల నెసఁగును గొన్ని శబ్దమ్ములు దాససంత్రాసచమస
సీమాంతసీతులసీప్రసూతిస్వసాలసితవిహాయసోల్లసకిలాస
రాసలాసవికాసమాసరవాసరధూసరకేసరకాసరబిస
సితనాసికాసేకసిక్తబృసీస్మేరభసలవైసారిణప్రసవసస్య
పనసమాంసలహంసభసితసీతాసుతవిస్మయస్మయసీధుఘుస్మరసుమ
వసనసునాసీరవాసవసిష్ఠాసివాసనాభ్యాసవిలాసము లనఁ
డెనఁగునను అకారమునకు ద్విత్వముగల్గు పేరులు తగుఁ గొన్ని పిట్ట లెట్ట
లట్టులు వెట్టులు కొట్టలు తొట్టలు బట్టలు జెట్టులు గుట్టము లన
జిట్టులు జట్టులు కుట్టలు మొట్టలు కట్టలు కుట్టులు మట్టు లనఁగ
నట్టావు లిట్టులు పుట్టలు ముట్టుఁబాల్ గొట్టలు తొట్టులు కట్టె నాఁగ
వహిమీఱ నింకఁ గవర్గద్వితీయఖకారము లీపయిఁ గలుగుపేళ్ళు
పుంఖానుపుంఖవిశృంఖలాఖ్యాసంఖరింఖదసంఖ్యాకశృంఖల లన
దార్ఖంజనఖురళీనార్ఖాదలేఖకసర్ఖేలనవిశిఖమూర్ఖు లనఁగ
సఖవిశిఖాశిలీముఖసుఖరవిశాఖఖండదుఃఖనఖతుర్ఖారము లనఁ
ప్రేంఖచ్ఛిలీముఖకంఖాణముఖఖగఖరఖురఖండాఖుఖడ్గము లన
ఖలఖేదఖన్యలూఖలమేఖలాఖగఖాతఖలీనాతిఖట్వము లన

శ్లేష శ్చిత్రం త థౌచిత్యం ప్రశ్నోత్తర ప్రహేలికే.
14. అనుప్రాసోఽథ యమకం గూఢోక్తి రితి కీర్తితమ్
శబ్దాల జ్కృతయః స్పష్ట మష్టాదశ మనీషిభిః.

జాతి(శుద్ధ సాధారణి యనిద్వివిధము) 15. సంస్కృతప్రాకృతాది ర్వాక్ తత్ర జాతి రితి స్మృతా
శుద్ధా సాధారణీ చేతి తస్యా• ద్వివిధం మతమ్.

రీతి(దేశరుచిని బట్టి యనేకవిధములు.) 16. దేశరుచ్యా వచోన్యాసో రీతి రి త్యభిధీయతే
త త్ప్రభేదాంస్తు సర్వజ్ఞా దృతే కో వక్తు మీశ్వరః.

అయిదురీతులు పేర్కొనఁబడుచున్నవి. 17. ఉ[చ్యన్తే]రీతయ స్తత్ర తథాపి ప్రస్ఫుటా న్తరాః
వైదర్భ గౌడ పాఞ్చాల లా టావన్తి సమాశ్రయాః.

వైదర్భి. 18. తత్రాసమాసా వైదర్భీ[ప్రాయోబహుః? సాశ్శృఙ్గార]గుణాన్వితా
సాఞ్చా న్నివసతి ప్రాయో విదర్భేషు మనోభవః.
19. అతో వైదర్భగర్భా గీః శృఙ్గార స్యాఙ్గతాం గతా
[నిసర్గతో]హి బాలానా మపి వక్త్రః పరిక్రమః.

గౌడి. 20. యస్యాం సమాసబాహుళ్యం వర్ణానుప్రాససఙ్కులమ్
బన్ధవైదగ్ధ్యవన్ధ్యా సా రీతి ర్గౌడీతి కథ్యతే.

పాంచాలి. 21. సమస్తై ర్జాయతే రీతిః పాఞ్చాలీ పఞ్చభిః పదైః
సంక్షేపగుణహేతుత్వా దియం సర్వజనప్రియా.

లాటి. 22. సమస్త • • • • ర్ణా లాటీ చతురవల్లభా
హృద్యా వాటీవ లావణ్యసంపదా మాస్పదం పరమ్.

ఆవంతిక. 23. ఆవన్తికా త్వియం రీతి రుక్తలక్షణలక్షితా
[భా]త్యతీవ సుధాబిన్దుస్యన్దినీ యత్ర పద్ధతిః.

వృత్తి. 24. రసోచితార్థసమ్బన్ధపదసన్తానశాలినీ
మనోవికాససం[కోచ]వర్తనా ద్వృత్తి రుచ్యతే.

అయిదువృత్తులు. 25. కైశి క్యారభటీ చైవ భారతీ సాత్వతీ తథా

౧ కైశికీ. 26. సుకుమారార్థసన్దర్భనిబద్ధా కైశికీ స్మృతా
అత ఏవ హి లాస్యాఙ్గం విబుధై రియ ముచ్యతే.

27. యాశ్లక్ష్ణనైపథ్యవిశేషయుక్తా
స్త్రీసంయుతా యా బహుగీతనృత్తా
కామోపభోగప్రభ ♦ ♦ ♦ రా
తాం కైశికీం వృత్తి ముదాహరన్తి.

౨ ఆరభటి. 28. అతిప్రౌఢార్థసన్దర్భా వృత్తి రారభటీ భవేత్
ఇమాం తు ♦ ♦ వస్యాఙ్గ మఙ్గీకుర్వన్తి కోవిదాః.

29. యదాహ :—

ప్రస్తావపాత్రప్లుతలఙ్ఘితాని
ఛేద్యాని మాయాకృత మిన్ద్రజాలమ్
చిత్రాణి యుద్ధాని చ యత్ర వృత్తిమ్
తత్తాదృశీ మారభటీం వదన్తి.

3 భారతి. 30. అనతిప్రౌఢసన్దర్భా సుకుమారార్థవర్తినీ
మహాపురుష ♦ ♦ జ్యా భారతీ వృత్తి రిష్యతే.

31. ఇయం తు ధర్మశృఙ్గారగరిమాఞ్చితచేతసామ్
వల్లభాభరతాచార్యనామ్నా ♦ ♦ ♦ దర్శితా.

32. యా వాక్ప్రధానా భరతప్రయోజ్యా
స్త్రీవర్జితా సంస్కృతపాఠ్యయుక్తా
సునామధేయైర్ [భరతైః] ప్రయోజ్యా
సా భారతీ నామ భవేత్తు వృత్తిః.

౪ సాత్వతి. 33. నాతీవ సుకుమారా గీ రుదారార్థేషు చేద్భవేత్
ఇయం తు సాత్వతీ వృత్తి ర్శో ♦ ♦ గారశాలినామ్

34. యదాహ :—

యా సాత్వతే నేహ గుణేన యుక్తా
న్యాయేన వృత్తేన సమన్వితా చ
హర్షోత్కటా సంభృత[శోక]భావా
సా సాత్వతీ నామ భవేత్తు వృత్తిః.

35. యథా సమ్భవసంభిన్నా యస్యాం చతసృణాం గుణాః
వృత్తీనాం సాధు విజ్ఞేయా వృత్తిః సాధారణీ బుధైః.

౫. లలిత. 36. సర్వార్థవిషయా హృద్యా నానామార్గవిసారిణీ
ఇయం తు లలితా నామ కవీనాం[చిత్త]హారిణీ.

37. యదాహ మహాభామహః :—

యత్రారభట్యాది గుణాః సమస్తాః
మిత్రత్వ మాశ్రిత్య మిథః ప్రథన్తే
మిశ్రేతి తం వృత్తి ముశన్తి ధీరాః
సాధారణే మర్థచతుష్టయస్య.

38. యదాహ :—

యచ్చ వృత్త్యఙ్గసన్ధ్యఙ్గ లక్షణా ద్యాగమాన్తరే
వ్యావర్ణిత మిదం చేష్ట మలఙ్కారతయైవ నః.

రచన. 39. అర్థానుకూలః శబ్దానాం నివేశో రచనా మతా
సాతత్స్వరూపపర్యాయరచనా భవతి ధ్రువమ్.

ఘటన. 40. ఉపశ్లేషః పదార్థానాం ఘటనేతి ప్రకీర్తితా
ప్రస్తుతాప్రస్తుతాతీతపదవాక్యప్రభేదభూః.

ముద్ర నాలుగువిధములు. 42. సాభిప్రాయా[ర్థవిన్యా]సో ముద్రేతి పరికీర్త్యతే

ఉపలక్షణ మర్త్రార్థ శబ్దాలఙ్కరణక్షమః.

42. విభక్తి ర్వచనం చైవ సం[విధానం]సముచ్చయః
తస్యా భేదాస్తు చత్వారః కోవిదై రుపవర్ణితాః.

ఛాయ(=అన్యోక్తులననుకరించుట) 43. అన్యోక్తీనా మనుకృతిః ఛా యేతి పరికీర్తితా

సాచానన్తా జనానన్త్యాద్ కిఞ్చిత్ తత్రాపి కథ్యతే.

ఈకవితాచ్ఛాయ యైదువిధములు. 44. లౌకిక-స్ఖలిత-చ్ఛేక-ముగ్ధ-వేటోక్తి-భేదతః

పఞ్చధా తత్ప్రపఞ్చానాం పరిసంఖ్యా న విద్యతే.

యుక్తి,ఆఱువిధములు 45. అర్థానాం చ పదానాం చ యోజనం యుక్తి రుచ్యతే
అర్థానాం యోజనే యత్ర శోభాస్యా త్పదపద్ధతిః.

46. సాపదస్థా పదార్థస్థా వాక్యవాక్యార్థగోచరా
తథా ప్రకరణస్థా చ ప్రబన్ధస్థేతి షడ్విధా.

భణితి, నాలుగువిధములు. 47. ప్రస్తుతార్థప్రకర్షాయ వక్రః పరికరో యదిv
తదా సా భణితి ర్నామ శబ్దాలఙ్కార ఇష్యతే.
48. తతః సంభావనే త్యేకా స్యా దసంభావనా పి చ
కల్పనా చ విరోధశ్చ చతుర్ధా భణితి క్రమః.

శ్రవ్యత, ఆఱువిధములు. 49. [స్యా న్మనోహారిణీ]వాణీ శ్రవ్యతా సాపి షడ్విధా
ఆశీ ర్నమస్క్రియా నాన్ది వస్తు బీజం ప్రరోచనా.

శ్లేష, షడ్భేదములు. 50. అనేకార్థాభిధా స్యా చ్ఛ్ర దనేకార్థపదై ర్యది
వ్యుత్పత్త్యా వా భవే దాహు స్తం శ్లేషం కవిపుఙ్గవాః.
51. స ప్రకృత్యా విభక్త్యా చ పదే[వచ]నేన చ
భాషయా ప్రత్యయే నాపి షడ్విధో విబుధైః స్మృతః.

చిత్రము. 52. చిత్రం తు నియమన్యాసో వర్ణానా మీప్సితక్రమే
స్వరవర్ణగతిస్థానబన్ధకారాదిబన్ధనాత్ [?].

ఔచిత్యము రెండు తరగతులు. 53. ఉపకార్యోపకారిత్వం యత్ర శబ్దార్థయో ర్భవేత్
ఉత్తరార్థాధాయకం[ప్రాహు]రౌచిత్యం తత్ప్రకీర్తితమ్.
54. తథాభిధానతద్బన్ధభేదాత్ తద్ ద్వివిధం విదుః
తత్ర ద్వయేఽపి ధీమద్భి ర్విహితః సంభ్రమో మహాన్.

ప్రశ్నోత్తర మూఁడు తరగతులు. 55. [తథా ప్ర]యోగనిర్భేదః కుశాగ్రీయధియాం తు యః
నికషాయ భవే త్తచ్చ ప్రశ్నోత్తర మితి స్మృతమ్.

'విదగ్ధముఖమండన ము'న నీప్రశ్నోత్తర భేదములు సమగ్రముగఁ గననగు. 56. అస్య నిశ్శేషభేదానామ్[అవబోధే]స్తి చేత్ స్పృహా,
తదాలోకయత గ్రన్థం విదగ్ధముఖమణ్డనమ్.
57. వ్యాపకం లక్షణం కిన్తు కిఞ్చి దస్మాభి రుచ్యతే
శక్యం య దనుసారేణ సర్వభేదప్రకల్పనమ్.

రాజిల్లంగ సులోచనాసరసిలో రాయంచభంగిం గళా
భ్రాజిష్ణుం డగు గొల్లికుండు హరిరూపం బొంది క్రీడించుచున్. ౧౩౦

ఉ. ఇమ్ములఁ గొన్నియేండ్లు సుఖియింపఁగఁ దక్షిణరాజులెల్లఁ జో
ద్యమ్ముగ నిట్టివార్త విని యచ్యుతుఁ డీతని యల్లుఁ డయ్యె[1] గ
ర్వమ్ములు మాని వీనిఁ గొలువం దగునంచు భయమ్ముతోఁ దురం
గమ్ములఁ గుంజరమ్ములను గన్యలఁ గప్పము లిచ్చి పంపఁగాన్. ౧౩౧

క. చేకొనుచు బృహత్సేనుఁడు, చేకొలఁదుల లోఁగు టెఱిఁగి క్షితిపాలకులం
జీకాకుపఱిచి భూములు, చేకొనఁగా నలఁగి తలఁగి సిగ్గున నొకచోన్[2] ౧౩౨

వ. అందఱుం గూడుకొని విచారించుచుం దమలోన. ౧౩౩

క. సమముగ దేశము లేలుచు, నమరిన మగకూడు గుడిచి యధమాధమభా
వముతోఁ బెక్కం డ్రొక్కని, సమరమునకుఁ బోకయునికి[3] చచ్చుట గాదే.

క. గణుతింప మానభంగ,వ్రణ మాజన్మంబు నెడ్డ వ్రయ్యలు సేయున్
రణమరణము శూరులకును, క్షణదుఃఖము మీఁద నధికసౌఖ్య మొనర్చున్.

గీ. మానహాని యైన మనత్రోవకంటెను,[4] బ్రాణహాని యైన పదము లేదు
వీనిచేత బాధ వెచ్చుటకంటెను, జక్రధరునిచేతఁ జచ్చుఁ టొప్పు. ౧౩౬

క. రావణకంసాదికర,క్షోవీరులఁ జంపి తన్నుఁ గూడఁగనిచ్చెం
గావున సమములు నల్లని,దేవరకోపములు నట్టిదేవరవరముల్. ౧౩౭

సీ. మున్నీటిపాపయు మున్నీటితేపయు నిల్లాలు నిల్లునై యెసఁగువానిఁ
బాములపగవాఁడుఁ బాములవగవాఁడుఁ దేరును బాన్పునై తేరువానిఁ
గలువలచుట్టంబుఁ గలువలవెట్టంబుఁ దనరెండుకన్నులై తనరువానిఁ
బూవింటివాఁడును బూవింటివాఁడును గారాపుసుతులుగాఁ[5] గలుగువాని
జోడులేనికంటిజోగికి జోడుగా, నున్నవానిఁ బెక్కు మన్నవాని
దల్లి దండ్రియైన నల్లనివేల్పును, గంట చెడనిముక్తిపంట గాదె. ౧౩౮

క. చొత్తము చత్తమనుచు ను,ద్వృత్తు లగుచుఁ దెగి ప్రతాపవిషయముపై దం
డెత్తి చనుదెంచినం గని, యత్తఱిఁ దా వెడలె నాబృహత్సేనుండున్. ౧౩౯

చ. వెడలి నిజాప్తసైన్యపరివేష్టితుఁడై చని గర్వపాటవం
బడరఁగఁ బోరిపోరి బల మంతయుఁ జచ్చినఁ జచ్చులోపలం

1. డీతని కల్లుఁడంచుగర్వ- 2. కైకొనుచు... క్షితిపాలురఁజీ, కాకుపడనడిచి భూములు, చేకొనఁదలఁచుడు- నడచి- 3. జోరకయునికి 4. అవనిమానహానియగుత్రోవ- 5. గారాపుఁబట్టులై. గట్టియైపట్టియైకలుగువాఁడు- చిన్నయసూరి.

బడి వడిఁ దూలివచ్చు శలభంబు తెఱంగున నోహటించి లో
పడక పురంబు సొచ్చి సుతపాలికి నాపద చెప్పి పుచ్చినన్. ౧౪౦

మ. అది యాత్మప్రియుఁ జేరి, దేవ ! మును ప్రహ్లాదుం గృపం గాచి యు
న్మదుఁ డా దైత్యునిఁ ద్రుంచి తీవు మొసలి న్మర్దించి యాయేన్గు నె
మ్మది రక్షించితి నేఁడు ని న్గొలువఁగా మాతండ్రి కిట్లీ మహా
పద వచ్చెన్ రిపుసంఘముం దునిమి నీభక్తు న్భువి న్నిల్పవే. ౧౪౧

క. అని వేఁడుకొనిన వాఁడును,మనమున నిటు దలఁచెఁ దొల్లిమగతనమునఁ బూ
నినపూనిక విడిచిన నిఁక, వినువారలుఁ జూచువారు వికవిక నగరే. ౧౪౨

గీ. నాఁటిసాహసమున నిట్టిబోటిగలిగె, నేఁటితెంపున గొకవేల్పు నిల్వఁబడఁడె
యనుచుఁ జక్రంబుగైకొనియంత్రగరుడి, నెక్కిసూత్రంబుగదలించిమొగసివచ్చె.

వ. అట్టి వేళ నయ్యాదివిష్ణుండు- ౧౪౪

ఉ. గాళికుఁ డీల్గెనేనియు జగంబు జనార్దనుఁ డీల్గె నంచు న
న్నాలముసేయుచుండుఁ దన యల్లుఁడ నేనని నమ్మియున్న భూ
పాలుఁడు చిక్కు భక్తిఁ దమప్రాణము లొప్పనసేయ నున్న మ
న్నీలతలంపులుం బొలియు నే నటు పోవకయుండఁ బాడియే. ౧౪౫

క. అని చక్రము చే వెలుఁగఁగ, వినతాసుతు నెక్కి వచ్చి విభుఁ డొప్పె సువ
ర్ణనగంబుమీఁద సౌదా,మినితోఁ జెలువొందు నీలమేఘము పోలెన్. ౧౪౬

మ. తనదివ్యప్రభ లీక్రియ[1] న్వెలుఁగఁగాఁ, దార్క్ష్యుండు పక్షాగ్రచా
లనవాతాహతితోన మేఘములు డొల్ల న్మిన్ను ముట్టంగ నే
పున దీపించుచు లీలఁ గోపమును రూపుం జూపి చక్రాహతి
న్వనజాక్షుండు నృపాలపంక్తి ననిపెన్ వైకుంఠసంప్రాప్తికిన్. ౧౪౭

వ. ఇట్లు చేసి తదనంతరంబ తజ్జయంబు విదితంబుసేయం బూని. ౧౪౮

ఉ. ధన్యజనానుకూలుఁ డగు దానవసంహరుఁ డొత్తె నబ్జమూ
ర్ధన్యము భక్తసద్గతివదాన్యము నిర్జితగర్జితోగ్రప
ర్జన్యము ఛిన్నభిన్నపరసైన్యము దిక్కరికర్ణకీర్ణకా
ఠిన్యము గాళికావనదృఢీకృతజన్యముఁ బాంచజన్యమున్. ౧౪౯

క. ఇటు వానిపేరుగా నుత్కట మగు జయ మిచ్చి చక్రధరుఁ డేగిన ను
ద్భటవృత్తి గాళికుఁడు న,చ్చట చని రణమండలమునఁ జచ్చిననృపులన్. ౧౫౦

1. దనుజారాతియునీక్రియన్.

చ. కనుఁగొని మామఁ బిల్చి ననుఁ గంటివె వచ్చిన యీనృపాలురం
దునిమితి వీరిసంపదలు దొడ్డలుగాఁ గొనిరమ్ము నీపురం
బున కని చెప్పి తొంటిగతిఁ బోయి సులోచనఁ గూడి దాని కిం
పొనర విహారము ల్సలుపుచుండె ననేకదినమ్ము లిమ్ములన్. ౧౫౧

క. కావునఁ దెం పెఱిఁగి యస,ద్భావున కచ్యుతుఁడు తోడుపడియె ననంగా
నావిక్రమార్జునకు నతి, పావనునకు సురలు తోడుపడు టచ్చెరువే. ౧౫౨

ఉ. ఉల్లసితక్షమాభరణుఁ డుజ్జయినీపతిఁ బోలవచ్చునే[1]
యెల్లముఖంబుల న్విషమ మనేకవిధంబుల నొల్లుచుండఁగా
నుల్లము వ్రయ్య బు స్సనుచు నూరక నెవ్రాగెడి పాముతోడి పొ
త్తొల్లక తద్భుజాగ్రమున నుర్వి సుఖస్థితి నుండు నెప్పుడున్. ౧౫౩

వ. అట్టి యాతనితలంపు సంపదలందు నయవినయాదిగుణంబులం బొదలు. ౧౫౪

క. శీలం బగుసంపద నయ,శీలంబునఁగాక దుష్టచేష్టలఁ గలదే
యాలరి మొదవులకును దల,కోల యిడక చేరి పిదుకుకొనఁ[2]దర మగునే.

క. ఎక్కడనుండియొ కూడును, నిక్కము లైతోఁచు నొక్కనిమిసంబునఁ దా
నెక్కడికొ విరిసిపోవును, డక్కవు సంపదలు మేఘడంబరము క్రియన్. ౧౫౬

క. కలిమికిని దగినకొలఁదిని, నెలగల వెలి విడువకున్న[3] నిలువెక్కడి దా
కలయఁగ నిండినచెఱువున, కలుఁ గించుక విడువకున్న నాఁగని భంగిన్. ౧౫౭

సీ. అని యిట్టితలఁపున నశ్వమేధము సేయఁ బూని భూసురబంధుభూమిపతుల
రప్పించి శుభముహూర్తమున దీక్షావిధి గైకొని చేయుచో నాకవిభుఁడు
గరుడగంధర్వయక్షవ్రాతములతోడ నరుదెంచి తోడ్పడి యాదరింప
సురల నందఱఁ జూచి ధరణీశుఁ డంబులో రత్నాకరుం డటు రామి యెఱిఁగి
యతనిఁదోడితేరహితుఁబుగోహితునంపె,బ్రియముగూర్చిమైత్రినయము మెఱయ
విప్రవర్యుఁ డంత క్షిప్రయానంబునఁ, దెరువునడిచి కొన్నిదివసములకు. ౧౫౮

మహాస్రగ్ధర. కనియెన్ దుర్వారదర్వీకరమకరఝషగ్రాహరక్షావినిద్రున్
ఘనవీచీసద్భుజాభ్రంకషగుణసమతిక్రాంతకాలాంతరుద్రున్
జనకాధీశాత్మజాధీశ్వరధనురతివిస్తారితావర్తభద్రున్
స్వనదంభోదాతిరౌద్రస్వరతటవిహితోచ్ఛ్వాససముద్రున్ సముద్రున్. ౧౫౯

1. వెన్నఁబోలునే. 2. నిలిచిపిండుకొన. 3. వలసినకొలఁదిని, నెలగల వెలి వెడలకున్న.
నెలగ=ధనము(నెలగలు)

సీ. అనిమిషరక్షణాయత్తజీవనముల గురుబృహస్పతుల సన్మహిమఁ దాల్చి
యధికనాగేంద్రసమారూఢమహిమల హరిశచీనాథుల ననుకరించి
రాశీభవస్వకరప్రాభవంబుల సారికుబేరుల సాటి నొప్పి
కమలావృతాయతాకారవైభవముల బ్రహ్మవిష్ణులతోడిపాటి మించి
సంతతప్రవాళకాంతి వసంతక, బాలసూర్యులసరి లీలఁ గ్రాలి
భూమి సర్వదేవతామయుం డనఁ జెల్లి, యెలమి నేఱుతెల్ల నేలువాని. ౧౬౦

సీ. మిన్నంటఁ బొంగియు మేర దప్పక పెక్కుభంగము లలిగియుఁ బాఱులేక
సుళ్లెన్ని గలిగిన సుజ్జనస్రుక్కక యనుకయ్యుఁ బరులకు ననువుగాక
సరివారిలోపల నురువులు గ్రమ్మఁగా నేలపైఁ బొరలియు బేలుగాక
తనలోన బడబాగ్ని దరికొని మండియు వడగాలి మీలపై సుడియనీక
బయలుపడియును దనలోఁతు బయలుపడక, డిగులు పఱచియు నొండెడ డిగులుపడక
యిసుముకంటెను గుణమణులెసక మెసఁగ, నసమరసముయశైనవైక్కసమువాని.

వ. మఱియు గంగాతరంగిణీసంగతం బై హరజటాజూటంబునుం బోలె శంఖాలంకృతం బై విష్ణుభుజంబునుం బోలె వజ్రసముజ్జ్వలం బై పురందరుకరంబునుం బోలె ముక్తామయం బై ముక్తిపథంబునుం బోలె నీలసమగ్రం బై సుగ్రీవసైన్యంబునుం బోలె విజృంభితపద్మరాగం బై శరత్సమయంబునుం బోలెఁ బుష్పితపుష్యరాగం బై శిశిరంబునుం బోలెఁ బ్రసరత్తుషారం బై హేమంతంబునుం బోలెఁ బటువిద్రుమచ్ఛాయం బై వసంతంబునుం బోలె నుద్దండరాజీవం బై గ్రీష్మంబునుం బోలె నాభీలకూలంకషం బై వర్షాగమంబునుం బోలె మీనమిథునకర్కటమకరాదిసంచారం బై గ్రహమండలంబునుం బోలెఁ బరభీతసపక్షభూభృత్త్రాత్రితం బై మహాదుర్గంబునుం బోలె నొప్పు నపూర్వారంబుగలవాని. ౧౬౨

క. ఆనీరధి నెల వింతనఁ, గా నేరము తేలగిలు మకరములమీఁదన్
మైనాకాదులు తెక్కల,తో నిలుచుం గరులమీఁది దోమలకరణిన్. ౧౬౩

గీ. అట్టిజలధిఁ జేరి యవనీసురుఁడు పలు,మాఱుఁ బిలిచి పిలిచి మదిఁ గలంగి
యుత్తరంబు లేని యుదకంబు నచటికిఁ, బిలువ వచ్చి నేను బేలనైతి. ౧౬౪

క. సరసత్వము సన్మానముఁ, బొరయనిచోఁ బ్రియము నెఱపఁ బూనుట ధరలోఁ
దెరువాటుకాండ్రకడ ముష్కరుఁడై[1] తనకలిమి చూపఁగడఁగుట చుమ్మీ.

---

1. నొక్కరుఁడై.

మ. అని చింతించి పురోహితుండు నిజరాజాజ్ఞావిధి న్వారిధీ
నిను నేఁ బిల్చితి రమ్ము నిల్వనిడికో నీబుద్ధి యంచుర్ ఘన
ధ్వనిగాఁ జెప్పి చనంగ నర్ణవుఁడు దివ్యంబైన రూపంబునం
దనరత్నంబులు నాల్గుగొంచుఁ జని పొంత న్నిల్చి యవ్విప్రుతోన్. ౧౬౯

వ. నీ కింత వేగిరపడనేల నే నిదె వచ్చుచున్నవాఁడ మీరాజునకు మాకును బ
రమసఖ్యం బగు నే మెఱుంగుదుము గావున మమ్ముఁ బిలువం బంపె మే మచ్చ
టికి వచ్చినవారమ యని ప్రియోక్తి ని ట్లనుము. ౧౭౦

క. కడపట నుండియు నే మ,క్కడనుండుదు మనుచుఁ జెలిమిగతిఁ దప్పకుమీ
యెడద వ్వన వలవదు సం,గడ మనఁగాఁ దలఁపులోనఁ గలుగుట చుమ్మీ.

క. నెమిలి గిరి నంబుదము గగ,నముపై రవి లక్షయోజనంబులఁ గొలనం
గమలము లక్షద్వయమున,హిమకరుఁ డిలఁదొఁగలునుండు నెక్కువెచెలుముల్.

వ. అని విన్నవించి యీశోభనమునకుం గట్నంబుగా నిద్దివ్యరత్నమ్ము లిమ్ము, కో
రిన నివి సైన్యసంపాదకంబును, బహుధనప్రదంబును, మృదుచిత్రవర్ణవస్త్రాభ
రణదాయకంబును, బక్వాన్నప్రతిపాదకంబును నౌ నని చెప్పి వీడుకొలిపిన
నతం డతనివచ్చినపని సఫలం బగుటకు హర్షించి. ౧౭౦

క. సుముఖుండై చనుదెంచుచుఁ, దమమాళవభూమి సొచ్చి ధరణీశ్వరు యా
గము సంపూర్తియుఁ దాన,క్రమమును విని యచటఁ దనకురాకకు వగచెన్.

చ. పొసఁగిన పప్పు మండెఁగలుఁ బుక్కిటిబంటిగ మెక్కి మంచి వె
క్కసపుఁ బదార్థము ల్నమలి గజ్జునఁ ద్రేఁపఁగఁ గల్గు భూరి దా
నసమయ మైన మాడ ధరణం బటు వచ్చు, విశిష్టపూజతోఁ
బసనగు పచ్చడంబు నొకపల్లియరంబును గల్గుఁ దప్పితిన్[1]. ౧౭౨

క. చేరెఁడు నూకలుఁ బిడికెఁడు, కూరయుఁ గొని యొక్కపూఁటకూటికి దొరయై
యూరికిఁ బంచినఁ బోఁబడు, పౌరోహిత్యంబు బుద్ధి బంటఁజికముగా. ౧౭౩

క. అప్పటి కమికెఁడుకూటికి, నొప్పెడిదియుఁ[2] బోషణంబు, హోమము దొరకై
యొప్పించి వేల్వఁ గాగతి[3], దప్పెడు తత్త్వము పురోహితత్వము జగతిన్.౧౭౪

గీ. అనుచు బహువిధములఁ దనపని నిందించి, కొనుచు నాత్మనగరమునకు వచ్చి
మనుజవిభునిఁ గాంచి వనరాశి చెప్పిన, వినయభాషణంబు లెనయఁజెప్పి.౧౭౫

---

1. పల్లెరముం గలదప్పు దప్పితిన్ - చిన్నయసూరి. 2. నుప్పిణియును: 3. యొప్పించు కొనునులువగతి ?

క. నాలుగురత్నాకరముల, మూలద్రవ్యములబీజములొ[1] యనఁదగు నా
నాలుగురత్నంబులు నా, నాలుగుమహిమలును జెప్పి నరపతి కిచ్చెన్. ౧౭౬

వ. ఇచ్చిన నమూల్యంబు లగువానిం జూచి యిం దొకటి నీ వేఁకొమ్మనిన నతండు నాయింట నాలిం గొడుకుం గోడలిని విచారించి వచ్చి పుచ్చుకొనియెద నని సంభ్రమంబునం జని మువ్వురం బిలిచి యారత్నంబు లిట్టిట్టి సంపద లిచ్చు వీనిలో నేది పుచ్చుకొందమని తలపోయుచున్నపుడు. ౧౭౭

సీ. సైన్యంబు గలిగిన జగమెల్లఁ జేపడుఁ గొను డిది యూ నని కొడుకు పలికె
ధర "ధనమూల మిదం జగ" త్తనుమాట తగు నిది గొన నని తండ్రి పలికె
నిష్టాన్నములు మదిఁ దుష్టిగాఁ గుడుతును మే లిది గొను మని యాలు చెప్పె
భూషణాంబరముల భోగంబు లిడి గొంట వెర వని కోడలు విన్నవించె
నిట్లు వేఱువేఱు నిచ్చలఁ దమలోన, జగడ మైన నతఁడు మగిడి వచ్చి
యింటివారికలహ మెఱిఁగించి వీనిలో, నీవ యొకటి యిమ్ము దేవ యనుడు.

క. ఈనలువుర[2] కిం దొక్కటి, యీ నేల తలంపుకొలఁది నిట మీజగడం
బే నుడిపెద నని యొడయం, డానాలుగుమానికములు నాతని కిచ్చెన్[3].

క. ఈజాడ యోగి నీకడ, నీజన్మమునందుఁ గలుగ దిఁకఁ బొమ్మనినన్
భోజుండు నమ్రవదనుం,భోజుం డై తాను నంతిపురమున కరిగెన్. ౧౮౦

శా. ప్రహ్లాదస్థిరభక్తిభాగ్యవిభవప్రత్యక్షరూపు, న్నభోం
తహ్లాదిన్యుదయాదిమూలచరణున్, దైత్యాంతకు, న్విప్రవే
షాహ్లాదాకృతికృత్యవంచితబలిం, జక్షుఃశ్రవస్తల్పు, న
ల్పహ్లాముద్రమనోనురాగవిహరల్లక్ష్మీకవక్షఃస్థలున్. ౧౮౧

శా. ఇంద్రాదిస్తుతయోగ్యవైభవుని బర్హీభూత[4]భూతావళీ
సాంద్రానందకరప్రసంగనిజలాస్యప్రస్ఫుటీకారు, ని
స్తంద్రానేకమునీంద్రవంద్యచరణద్వంద్వున్ ముకుందప్రియుం
జంద్రాలంకరణాంకు నద్రితనయాసంసక్తచిత్తాంబుజున్. ౧౮౨

మాలిని. ఉరగశయనశాయీ యోగ్యవిద్యానపాయీ
గరుడవిహితయానా క్ష్మాధకోర్వీశయానా

1. మూలధనములయినవి నిజముల- 2. ఈనలకువ- 3. క. ఏనే తలంపుకొలఁదిని, మీనలువుర (లోని) జగడ మెడపెదననియుం, దానాలుగుమానికములుఁ, బూనికతో నతనికిచ్చి పుచ్చెం జెలుచన్. "ఈనలకువ" యనియే చిన్నయసూరియును- 4. బహీర్భూత.

ధరణీభరణదక్షా దండితోద్దండరక్షా
మురహరహరరూపా ముఖ్యసౌఖ్యస్వరూపా. ౧౮౩

గద్యము. ఇది రాయగజగంధవారణ వైరిమండలికభేకఫణీంద్ర వీరఘోట్టవిభాళాది బిరుదప్రకటచారిత్ర కళింగదేశనిర్ధూమధామ త్యాగనాగార్జున కర్ణాటద్రవిళాంధ్రమహారాష్ట్రభూపాలరూపనూపురసుందరచరణారవింద సనదప్రోలిపురవరాధీశ్వర వెలనాటిపృథ్వీశ్వరరాజ్యసముద్ధరణ శ్రీకొఱవి వెన్నయామాత్యపౌత్ర హారీతసగోత్రపవిత్ర సకలసుకవిమిత్ర కసవరాజతనూజ గోపరాజవిరచితంబైన సింహాసనద్వాత్రింశిక యనుకావ్యంబునందు సుదర్శనోపాఖ్యానంబును, విక్రమార్కుని మహౌదార్యంబును, దదీయసత్త్వసాహసమహత్త్వంబులును, గౌళికోపాఖ్యానంబును, సాహసాంకదాతృత్వంబును నన్నది ద్వితీయాశ్వాసము.

---

శ్రీరస్తు.

# సింహాసనద్వాత్రింశిక.

## తృతీయాశ్వాసము.

---

### —: నాలుగవబొమ్మ కథ :—

క. శ్రీరమణీరమణపదాం,భోరుహజాతాపగాంబు[1]పూరస్థితడిం
డీరశకలానుకారా,కారామృతకిరణధారిఁ గందర్పారిన్. ౧

మ. తనచిత్తాబ్జములోఁ దలంచి మఱియున్ ధారావిభుం డిష్టశా
కునికజ్యోతిషికాగమజ్ఞుల హితక్షోణీసులం గూర్చి శో
భనలగ్నంబున నెక్కఁబూనికొని తత్ప్రాంతంబు చేరంగ నా
సనపాంచాలిక నిల్వు నిల్వు మని యాశ్చర్యంబుగా నిట్లనున్. ౨

క. పఱతెంచెద విచ్చేటికి,[2] నెఱయంగా విక్రమార్కనృపతికి సరిగా
నెఱిఁ జేసిన యుపకారం, బెఱిఁగెడు సద్గుణము లేక యెక్కం దరమే. ౩

క. అనవుడు భోజుఁడు విస్మయ,మును లజ్జయుఁ బెనఁగొనంగ ముద మెడలఁగ నా
జనపతియుపకారజ్ఞత, యనువొందఁగఁ జెప్పు మనుడు నది యిట్లనియెన్. ౪

ఉ. ఆతఁడు కీర్తిపూరభరితాఖిలదిగ్విజయుండు సర్వధా
త్రీతలనాథసేవ్యుఁడు సుధీజనపాలనకేలిశీలసం
జాతమనోనురాగుఁ[3] డిల సాహసభూషణుఁ డేలుచుండఁగా
నాతనివీట నొక్కవసుధామరుఁ డుండు విలోచనుం డనన్. ౫

వ. ఆవిప్రుం డొకనాఁడు తనపత్ని విలోచన పుత్రలాభంబు లేమికి వగచి దీనికిం
గారణం బేమి నీవు సర్వజ్ఞుండ వని యడిగిన నూహించి ధనధాన్యంబు లుద్యో
గంబునం బడయవచ్చు విద్యాలాభంబు గురుశుశ్రూషల నచ్చుపడు వంశాభి
వృద్ధియుం గీర్తియు నీశ్వరకృపం గాక పడయవచ్చునే. ౬

క. ఏగురుపురుషులఁ గోరిన, యాగొంతియు ద్రౌపదియు మహాపుణ్యవతుల్
వేగురు బంధులఁ జంపిన, యేగురుపాండవులు ధన్యు లీశ్వరకరుణన్. ౭

క. కావున మన మిఁక నెట్టి య,పావనజీవనుల మైనఁ బరమేశ్వరు సం
భావనఁ బుత్రుని బడయం,గావచ్చు నిజోద్యమంబు గలిగినఁ బడఁతీ. ౮

---

1. జాతాపలాంబు 2. విచటికివిను. 3. మనోహరాంగుఁడు.

క. అన విని యాసతి వినయం, బెనయం దనయుండు గలుగు నీశ్వరు నారా
ధన మొనరింపుద మనవుడుఁ, దనలో స్త్రీబుద్ధి యనక తా నుత్సుకుఁ డై.
గీ. పెద్దయొసఁగెడుమాటయుక్తియయుకంటెఁ,బసుచుచేసితివాక్యంబువడయఁజొప్ప
శాస్త్రవేదిచేనున్న విషంబుకంటె, గొల్లవానిచే నమృతంబు గొనుట మేలు.
మ. అని తద్వాక్యము లాదరించి పరమేశారాధనం బావిలో
చనయుం దానును జేయుచుండఁగ సుఖస్వప్నంబులో నాత్రిలో
చనుఁ డేతెంచి భవత్ప్రియాసము విశిష్టం బయ్యె నీసువ్రతం
బనుకూలించె శనిత్రయోదశులఁ జేయం బుత్రలాభం బగున్. ౧౧
క. అని శంకరుఁ డానతియిచ్చిన నతఁడు శనిత్రయోదశీవ్రత మత్యం
తనియతి జరపుచుఁ బుణ్యాత్మునఁ గొన్నిదినముల కొక్కపుత్త్రుని బడసెన్. ౧౨
క. ఆపాపనికిం బుణ్యవ్యాపారుఁడు దేవదత్తుఁ డనుపేరిడి గౌ
రీపతిపదభక్తుని విద్యాపరిచితుఁ జేయుచును ముదంబునఁ బెంచెన్. ౧౩
చ. క్రమమున బ్రాహ్మ్యకర్మములు గైకొనఁజేసి యెఱుంగుచో[1] వివా
హముఁ దగఁజేసి కాశికిఁ బ్రయాణము చేకొని పుత్త్రుఁ బిల్చి కా
లము శుభవృత్తులన్ బ్రమకు లాగు విచారము సద్గృహస్థధ
ర్మములను మంత్రతంత్రముల మర్మము లెల్లను జెప్పి వెండియున్. ౧౪
క. పరపీడయుఁ బరనిందయుఁ, బరసతియుం బరధనంబుఁ బరులుం గలచోఁ
దిరుగకు పరోపకారము, పొరయుంగలచోటఁ బుద్ధిపురికొల్పవనా. ౧౫
క. తరుణులతోడిరహస్యము, వెరవరివగ నైరణయును వేషాఢ్యునిస
చ్చరితము దుర్జనుసఖ్యము, నరపతికరుణయును నీవు నమ్మకు మదిలోన్. ౧౬
క. సారాచారవిచారత, నాయూఘుం డగుచుఁ దను నిజావసరములం
జేరినవారికి హితుఁ డై, నైరణ గలప్రభువుఁ గొలువు సజ్జనవృత్తిన్. ౧౭
వ. అని పెక్కునీతులు చెప్పి. ౧౮
క. భూసురుఁడు సకలవిద్యాభాసురుఁ డటు తోడఁగూడి పడఁతుక నియమో
ల్లాసినిగా శివమూర్తివికాసిని యననొప్పుచున్న కాశికిఁ జనియెన్. ౧౯
మ. జనకుం డేగిన దేవదత్తుఁ డిటు లాచారంబు రెట్టింప స
జ్జనసత్కారము లింటఁ జెల్లఁగ విశిష్టప్రాప్తకాలంబు చొ
ప్పున నిర్ధంబులుఁ బత్రము ల్ఫలములుం బుష్పంబులుం గానసం
బునఁ దాఁ దెచ్చుచుఁ బంచయజ్ఞముల నెప్డుం జేయుచు న్నిల్వఁగన్. ౨౦

1. యెదుంగుచో.

మ. ఒకనాఁ డుజ్జయినీశుఁ డుత్సవమహోద్యోగంబున న్వేఁటకై
వికసన్మానసుఁడై బలంబులు తను న్వేష్టింపఁగా బాణకా
ర్ముకహస్తుం డయి వాజినెక్కి పటహంబుల్ మ్రోయఁగా నేగె గం
డకశార్దూలవరాహసింహకరిగణ్యం బౌ నరణ్యానికిన్. ౨౧

ఉ. అక్కడ వేఁట లాడుచు హయంబు రయంబునఁ దోలుకొంచుఁ దా
గ్రక్కున నొక్క పంది వెనుకం జని మార్గము దప్పి క్రంపలం
జిక్కి మది న్వితాకు పడి చింత మునుంగుచుఁ బంట్లుగోయఁగా
నొక్కెడ దేవదత్తుఁ గని యూరికి నేగెదు త్రోవ వేఁడినన్. ౨౨

గీ. హయమువాగె వట్టి యల్లన ముందట, ముండ్లు దప్పఁ దిగిచి గండ్లు గడపి
దేవదత్తుఁ డిట్లు తెరువునఁ గూర్చిన, సేనఁ గలసె రాజశేఖరుండు. ౨౩

క. తన యెక్కినతురగము నా, తని కిచ్చి సువర్ణనిర్మితం బగు నరవా
హనమున నొయ్యనఁ బురికిం, జనుదెంచెను బంచవాద్యశబ్దములులియన్. ౨౪

వ. ఇట్లు చనుదెంచి నగరు ప్రవేశించి మహావిభవంబు మెఱయం గొలువునం
గూర్చుండి- ౨౫

గీ. అచటి విప్రునిపని యత్యుపకారంబు, గాఁ దలంచి యొక్క గ్రామ మిచ్చి
వరుసతోడ నెల్ల వారల వీడ్కొల్పి, యంతిపురము సొచ్చె నవనివిభుఁడు. ౨౬

క. అన్నెలఁతలతో రతిసం, పన్నుండై వరుసతోడ భావజుకేళిం
గొన్ని దినంబులు సలుపుచు, నున్నంతం బిన్నయాలి కొక నెల మసలెన్. ౨౭

ఉ. చెక్కులు వెల్లఁబాఱెఁ[1] గడుఁ జిట్టుము లయ్యె మొగంబు వాడెఁ జ
న్ముక్కులు నల్పుగూడె నడుముం బరులుం జెలువారె నారు సొం
పెక్కెఁ గనుంగవ న్మెఱపు లేర్పడె నప్డు మనంబు కోరికల్
పెక్కువిధంబులం బరఁగెఁ బ్రీతిగ నాతికిఁ జీరచిక్కినన్. ౨౮

క. పొత్తికడుపు మెఱుఁగెక్కెం, జిత్తంబున జడను దోఁచెఁ జెలికత్తెలతో
నొత్తిలిపలుకఁగ నూన్నపడు, మెత్తనిమై నడఁచు[2] నిదుర మేకొను విసువున్. ౨౯

క. కొమ్మకుఁ బులు సంపయ్యెను, గమ్మని మన్నంతకంటెఁ[3] గడుఁ జవిక్కెం
దమ్మిమొనమొగ్గ లెక్కిన, తుమ్మెద లనఁ జన్నుదోయి తుద కప్పారెన్. ౩౦

గీ చెలువ బయఁకలైనఁ జెప్పవేటికి నన్న, సిగ్గుపడుచుఁ జెలువచెంత దలఁగుఁ
జెప్పఁబూను గొన్నిచిహ్నంబు లెఱిఁగించు, నగవుచేసి మీఁదనొగులుచేయ.[4]

---

1. వల్కఁబాఱె. 2. మెత్తనినడ మెలఁగు. 3. గమ్మఁదనంబంతకంటె. 4. నగము చేసి మీఁదనొగులు దెలియు.

క. విశదముగ నడిగి యారా, జశిఖామణి కెఱుఁగఁ జెప్పె సఖు లిం పగున
ర్వశుభంబులు గూరిచి త, చ్ఛిశువునకు స్మిఁద ఁ జీడచెవి[1] గాకుండన్. ౩౨

గీ. మూఁడు నెలలఁ జెలులు ముద్దలు[2] వెట్టిరి, యలుఁగుడుము లైదు నెలలఁ బెట్టి
యేడు నెలల మ్రొక్కి రెట్టపోలమ్మకు, సతికిఁ జూలు వెళ్ళ జనుపుకొనుచు. ౩౩

క. నెలకొనిన చూలు వేళం, దలకొని పొయిదీఁగ మెఱుఁగు దనరం గనకో
జ్జ్వల మగు వేషంబున సతి, పులుకడిగినముత్తియంబు పోలిక నొప్పెన్. ౩౪

గీ. [3]ఇంతి మదిఁ దలఁచుచు నెడమప్రక్క నిదిగొ, మెదలె ననుచుఁ జెప్ప సుదతులంతఁ
జంటిజిగురు గోర సంధించి చిరజీవి, యైనసుతుఁడు పుట్టు ననఁగఁ బొంగు. ౩౫

క. ఆసతి కానృపుఁ డష్టమ, మాసంబునఁ గెంటలంబమరఁ బెట్టి[4] మహో
ల్లాసంబున నుండఁగ నవ, మాసంబులు నిండె గర్భమహిమయు నలరన్. ౩౬

గీ. చన్నులురియఁ[5] బొదలె జఘనంబు ఘనమయ్యెఁ, బలకవెన్ను దనరె మలుసువట్టె
రాజయోగ్యమైన రత్నంబు దాఁచిన, పసిఁడిపెట్టె యనఁగ నెసఁగె నపుడు. ౩౭

క. నెలఁత శిశువునకుఁ బ్రొద్దుల, నెల నమృతము నించు నింద్రనీలపుమూఁకు
ళ్లలరించిన బంగారపుఁ, గలశము లనఁ గుచయుగంబు కప్పున నొప్పెన్. ౩౮

గీ. నాభి నెఱియ విరిసె నడుము నొవ్వఁదొడంగె, దాదు లంత నాయితంబు చేసి
కూడి మెలఁగ దండికుట్టులం బొదలక, నాతి యటు సుఖప్రసూతి యయ్యె. ౩౯

క. క్రూరగ్రహవిరహితుఁడగు, తారాపతిబలము గలుగు తత్కాలమునన్
మారుని కెనయనఁదగినకు, మారుం డుదయించె హితులు మదిముద మొందన్.

వ. అప్పుడు దాదులు. ౪౧

గీ. నిసువు బొడ్డుమీఁదఁ బసిఁడిటంకం బిడి, యొయ్య నాభినాళ ముత్తరించి
ముత్తియములఁ జేట ముంచి యందిడి కను, దమ్ములందు నస్సుదమ్ము నిగుడ. ౪౨

గీ. [6]కలిఁ దోఁచి నూనె వ్రేలిడి, తలపుత్త్రియయందు నేతితైలంబును జొ
త్తిలరాచి మెత్తగాఁ బొదు, గలరించి[7] కుమారు నునిచి రాదాదు లటన్. ౪౩

శా. క్షోణీనాయకుఁ డిట్టిమేలు విని తా సుస్నాతుఁడై యాదిక
ళ్యాణాంబైన మహోత్సవంబున సముల్లాసంబుతో దానపా
రీణుండై నిజబంధులోకగురుధాత్రీదేవసంసేవన
త్రాణం బొప్పఁగఁ బెట్టె గోధరణిరత్నద్రవ్యమాద్యంబుగన్. ౪౪

1. చీడచెవి–జేపుచెవి, చీదచెవి. 2 ముద్దాలు. 3. తొలుతచూలున మది దలఁచు నెడమ ప్రక్క...చంటిజేలు గోరనంటి...సుదతివుట్టుననిన సుదతి పొంగు (చంటిజిలుగు) 4. గెంట్లమమర 5. విరియ 6. కలిగడిగి 7. పొదుగుపొత్తులు.

సీ. క్రమమున దాది లక్కడను ముప్పటిలిన[1] జలకంబు దేర్చి యాచెలువసుతుని
కొనరఁగాఁ గాటుకయును జుక్కబొట్టును బాటించి యాగడపకు వెలుపటఁ[2]
బొదికిళ్లఁ దవుడు నిప్పులుఁ బ్రత్తిగింజలు నిడి యడ్డముగఁ జిట్టు బడిసివైచి[3]
వేఁపరెమ్మలు నీళ్ల వెసలలోపల నించి కాపులు పురిటింట గట్టి చేసి
వాయనముల కెల్ల వనితల రప్పించి, వారుదెచ్చినయవి వరుస నంది
పచ్చకప్పురంపుఁ బలుకులు వెట్టి వి,డియము లిచ్చి రింపు నయముగలుగ. ౧౫

క. వెడలం బడితివి చక్కని, కొడుకుం బడసితివి రాజుకూరిమి బలిసెం
బడఁతీ నీభాగ్యమునకుఁ, గడ లే దని పొగడి రెల్లకాంతలు నింతిన్. ౧౬

ఉ. మండలనాయకుండును గ్రమంబున నాపురు డైన యంతఁ బం
డ్రెండవనాఁడు పాపనికి రేవతి గావున మీనరాశి చం
ద్రుం డని పేరు వెట్టి యతిరూఢిగఁ బెంపఁగ వాఁడు బాలచం
ద్రుండును బోలె నిచ్చలును దుష్టియుఁ బుష్టియుఁ గాంచుఁ గాంతితోన్. ౧౭

సీ. వెలఁదులు వీని నవ్వింప నోయని నవ్వ వేడుక మూతియు విఱుచుచుండు[4]
నూఁకరలిచ్చు[5] నయ్యుయ్యాలఁ జేరిన నడు మెత్తివైచు ముందలయు నెత్తు
జోవలు వాడిన[6] భావించు నాలించుచుండు నేడుపు మాను నుగ్గు లడుగుఁ
గోరి డగ్గఱఁగ నంగుష్ఠంబు[7] నోరిలో నిడుకొను దాఁ జన్ను గుడుచుభంగిఁ
జిన్నిపాదములును జేతులు నాడించు, జవనగతిని మొగయ రవళి దన్ను[8]
బోరగిలి ఫణీంద్రు పోలికఁ దలయెత్తి,యాడుఁ బలుక నంచుసందుఁ జూచు. ౧౮

క. కూర్చుండ నురమునం జన,నేర్చును విద్దెంబు సేయనేర్చును భీతిం
దార్చుచుఁ దప్పటడుగు లొడఁ,గూర్చు జననిచెట్టపట్టుకొని నడపాడన్.

క. విందులు విందు లనుచు వే,డ్కం దనుఁ బిల్వంగ నగుమొగం బలరంగా
నందియలు మొరయఁగాఁ గుఱు,లుం దూలఁగ[9] వచ్చియంతలోఁ గప్పుకొనున్.

క. నిలువెల్లను గనకం బై, పలు కంతయు నమృత మగుచుఁ బార్థివునకు ము
ద్దులు చూపుచు నానాఁటికిఁ, బలుదెఱఁగులఁ బెరిఁగె సతనిప్రాణపదం బై. ౨౧

1. ముప్పటముసైన, చిన్నయసూరి. 2. పచ్చనికాటుఁబడిసి. 3. నిడియందముగ జుట్టువడసి వేసి–చిన్నయసూరి. 4. వెలదుకుల్ వినఁగనవ్వించ ననంగ నొయ్యనవ్వుచు మూతులల్లవిరుచు. 5. నూదరలిచ్చు. 6. జోలలువాడిన నాలించు. 7. కాలియంగుళము డగ్గఱబట్టినోటిలో 8. జన్నుగ డియ మొరయ దన్నుచూచు. 9. మొగయగున్నాలుం దూలఁగ—వచ్చునింతలో నెత్తుకొనన్.

వ. అంత నతండు తచ్చూడాకరణంబునాఁడు నానావిధంబు లగుదానంబుల దీను
ల విప్రులం బరితుష్టులం జేసి యాదేవదత్తునకు మఱియు నొక సర్వసమృద్ధ
గ్రామం బిచ్చి కుమారునిం బరీక్షాధికారిం గావించిన బహుమానితుండై బహు
దినంబులు తత్కార్యవిచక్షణత్వంబువలన విశిష్టపూజల నొందుచు విలోచనసు
తుండు త్రిలోచనసుతుండునుం బోలెఁ ద్యాగభోగానురాగంబులం జెలంగుచుం
డునంత. ౯౨

క. నృపతి యొకనాఁడు గని ని,ష్కపటాత్మ! పరీక్షణాధికారివి నీయ
త్యుపకారమునకుఁ దగఁ బ్ర,త్యుపకారము చాల దనియె నుర్వీసుతుతోన్.

చ. అనవుడు దేవదత్తుఁడు ధరాధిప యిట్టన కేను నీకుఁ జే[1]
సిన యుపకార మింత నుతిచేసెద వేటికి నంచుఁ దత్ప్రియం
బొనరఁగఁ బల్కి కొంతతడ వుండి గృహంబున కేగు వేళ నా
తని సుతుఁ జంకఁ బెట్టుకొని తత్తఱ మందుచు వచ్చెఁ జెచ్చెరన్. ౯౩

ఉ. అయ్యెడ వాని డాఁచి కనకాభరణంబులు పుచ్చి బంటుచేఁ
జయ్యన నిచ్చి యమ్ము మని సంతకుఁ బంపిన యంతలోన నేఁ
డెయ్యెడ కేగెనో శిశువు నెవ్వరు చంపిరొ యంచు నేడ్వఁగా
దయ్యె మెఱుంగుఱాతు వసుధాపతిగేహము నిండెఁ బెల్లుగన్. ౯౪

క. అమ్మొఱ విని తలవరులు ర,యమ్మున నలుగడల జాడ లరయుచు నొకచో
నమ్మంగ బంటుగని [2] యా, సొమ్ములతోఁ బట్టి తెచ్చి చూపిరి పతికిన్. ౯౫

వ. చూపిన నమ్మహీనాథుండును నీసొమ్ములు నీ కెవ్వరు తెచ్చియిచ్చి యమ్ము మనిన
నీ వమ్ము చున్నవాఁడ వని యడిగిన దేవదత్తుండను బ్రాహ్మణుండు తెచ్చియిచ్చె
నని యాతఁ డెఱింగించిన. ౯౬

గీ. బంటువలన నెఱిఁగి బ్రాహ్మణు రప్పించి, నిలువఁ బెట్టి తప్పుఁదెలియ నడుగ
నతఁడు మోమువాంచి యపరాధియుఁ బోలె, నుత్తరంబు లేక యూరకుండె.

క. చనువా రటు ధట్టింపఁగ, [3] ననుమానించుచును దైన్య మడరఁగ వెడఁగై
ధనలోభంబునఁ గొనిచని, జననాథా నీతనూజుఁ జంపితి ననియెన్. ౯౭

సీ. అనుడు నారాయణా యని వీనిఁ బట్టి తిత్తొలిపింపఁ దగు నని పలుకువారుఁ
గాళ్ళును జేతులు గనియలుగాఁ బట్టి చిదిమింపఁ దగు నని పదరువారుఁ
గాయంబు నుగ్గుగా గలుగానుఁగలఁ బెట్టి త్రిప్పుట తగు నని తెలుపువారు
మేన వెంటులు చుట్టి పైనగ్గితగిలించి మిడికింపఁ దగు నని నొడువువారు

1. దేవదత్తుఁడు ధరాధిపరత్నమ యేను నీకుఁ జే—2. నమ్మంగఁ బట్టుకొని 3. దండింపఁగ.

నగుచు జనులు దుర్విధాత్ముండు పీడఁగు, ననుచు విన్నవింప నవనివిభుఁడు[1]
తనయదుఃఖవహ్ని దనలోనఁ గ్రాఁగుచుఁ, జంపఁబూని తనదు తెంపు దలఁచి[2].

వ. అద్దేవదత్తునితోడ. ౬౧

క. అపకారము గా దిది నా,యుపకారము వాసె భూసురోత్తమ విను నీ
యుపకారమునకు నిది ప్ర,త్యుపకారం బయ్యె నింక నోడక పొమ్మా. ౬౨

గీ. అనుచు విడిచి మఱియు ధనమిచ్చి యనిపిన, హితులు దూఱి శిశువు మృతికి నొచ్చి
యింత చెఱుపు చూపు టే యుపకారంబు[3], గాఁ దలంచి యేల కావ ననుచు. ౬౩

క. వినుఁ డిట నేఁ గలిగిన నా,తనయుండును గట్టెఁగాక తప్పిన యెడఁ గా
ననమున నితఁడు తలఁగి పో,యిన భేరుండములలోన నే మగుడు ననే[4]. ౬౪

వ. ఇట్లు గాకుండం జేసిన నీరాజ్యంబును సంతతియును నగపడె నాప్రాణంబులు గాచి నన్ను నిలిపినవానికి సెలవు సేయుట యెంత పని[5] నామీఁది యప్పు కొంతదీర్చుకొనం గలిగె నూరకుండుం డనిన. ౬౫

క. పౌరుల్ హితులు దొర ల్పరి,వారంబును రాజు వెఱ్ఱివాఁ డయ్యెఁ గదే
మూఁడేడు ల్త్రోవయుఁ జూపుట, గారాపుంబట్టి చావుగనియుం గాచెన్.[6] ౬౬

వ. అని చెడనాడుచున్న యెడను. ౬౭

గీ. దేవదత్తుఁడు నరదేవుని సద్గుణం, బెఱిఁగి సంతసించి యింటి కేగి
చందమామకూనచందంబుతో నున్న, శిశువుఁ దెచ్చి రాజుచేతి కిచ్చె. ౬౮

వ. ఇట్లిచ్చిన పాపనిం జూచి. ౬౯

క. విస్మయహర్షంబుల మం,దస్మితవదనాబ్జుఁ డగుచు ధరణీపుఁ డా
కస్మికచరితము లడఁచెడి, యస్మత్తుల దైవ మనుచు నతనికి మ్రొక్కెన్. ౭౦

ఉ. మ్రొక్కిన దేవదత్తుఁ డతిమోదము నొంది నరేంద్ర నీమనం
బెక్కడఁ జూడ వేఁడి యలయించి మహావ్యథఁ దూలపుచ్చితిన్
మిక్కిలి తప్పుచేసి కడమీఱి భవద్గుణరత్నముల్ మెఱుం
గెక్క నొనర్చితిం బరుల కీకథ మంచితనంబు నొజ్జఁగాన్. ౭౧

శా. అంచుం జెప్పిన నయ్యవంతివరుఁడున్ హర్షించు మన్నంపదం
గంచిం బోలినయట్టి పట్టణము సత్కారంబుగా నిచ్చి మ

1, నైనజనులు పీడఁగ్రాఁడు వధకని, విన్నవింపఁగఁ బృథివీశ్వరుండు. 2. పెంపెఱింగి, 3. టిది యుపకారంబ, 4. కాననమున నితఁడెడఁగల బో,యిననీకానములోన నేమగుమనొకో. 5. నిలిపిన వానికిది యెంతపని. 6. గాలింబుచ్చెన్.

న్నించెం బాత్రుఁ డటంచు ధర్మసభకు న్నిర్ణేతగాఁ బ్రీతిఁ గా
వించెం గావున నీకు నట్టిగుణ మన్వేషించినం గల్గునే. ౭౨

క. మగునుము గద్దియ యెక్కుట, యగపడ దిఁక ననిన విక్రమార్కుగుణంబుల్
పొగడుచు బిగిచెడి ధారా,జగతీపతి చనియె నాత్మసదనంబునకున్. ౭౩

వ. మఱియు నొక్కనాఁడు. ౭౪

—॥ ఐదవబొమ్మ కథ. ॥—

క. తెల్లని యమృతాంబుధిలో, నల్లని తిరుమేను ధవళనలినములోనం
మ్రొక్కెడు తుమ్మెదక్రియ రా, జిల్లఁగ విహరించుచున్న సిరివరుఁ గొలుతున్. ౭౫

మ. అని చిత్తాబ్జములోఁ దలంచి సమయజ్ఞామోదితం బౌ దినం
బున సౌమ్యగ్రహదృష్టలగ్నమున నాభోజుండు వేడ్క స్సహా
సన మెక్కం జని పాదపద్మ మిడఁ జాల్పాలంచు నచ్చోటు కాం
చనపాంచాలిక వల్కె సర్వజనతాశ్చర్యం బవార్యంబుగన్[1]. ౭౬

క. కార్యం బెఱుఁగవు దానా,చార్యుండగు విక్రమార్కు సరిపూనఁగ గాం
భీర్యముతోఁ గూడిన యౌ,దార్యము లే కేల యెక్కఁ దర మగునీకున్. ౭౭

క. అనవుడు విస్మితుఁ డై మీ, జనపతి గాంభీర్యదానచాతుర్యము లే
పనిపట్టులఁ గనుపట్టెన, వని యడిగిన భోజనృపతి కది యిట్లనియెన్. ౭౮

శా. ధారానాయక యాచకార్తజనతాదారిద్ర్యవిద్రావణుం
డాపూర్ణస్థిరకీర్తివల్లివిభవవ్యాప్తాఖిలాశాంతవి
స్తారుం డూర్జితవిక్రమక్రమ నిరస్తక్షోణిపాలాగ్ర సం
ఘాగోత్సాహుఁడు సాహసాభరణుఁ డొప్పం జేసె రాజ్యం బిలన్. ౭౯

క. భూతలమునఁ బుణ్యగుణ,ఖ్యాతుం డగు నతని చేతి కౌక్షేయకధా
రాతీర్థంబున మునిఁగి య,రాతులు విహరింతు రమరరమణీయుతులై. ౮౦

వ. అట్లుండు నతనిరాజ్యంబున నెలకు మూఁడువానలు దళంబుగాఁ గురియ జను లెల్ల నుల్లంబుల నుల్లాసంబు వెల్లివిరియ ధనధాన్యసమృద్ధులై యున్నయెడల రత్నగర్భాతలంబున రత్నాకరగుణప్రఖ్యాపనాపరుండునుం బోలె వణిగ్వరుం డగునొక్కరత్నవ్యవహారి దూరదేశంబుననుండి యుజ్జయిని కరుదెంచి. ౮౧

క. అంబుధి పుత్తెంచిన క,ప్పం బన రేఖాంకబిందుభంగాదికదో
షంబులఁ బొరయని పదిర,త్నంబులు గుదిగ్రుచ్చి తెచ్చి నరపతి కిచ్చెన్. ౮౨

1 ఆశ్చర్యంబు కార్యంబుగన్.

గీ. వానిఁ జూచి కొలువువార లద్భుత మంద, మానవేంద్రుఁ డాత్మలోన మెచ్చి
విలువ నిశ్చయించి చులుకగా నతనికిఁ, దేటపడఁగ ధనము కోటియిచ్చె. ౮౩

గీ. కోటిధనముఁ బుచ్చుకొని యగస్త్యనియుక్తి, నమరునాల్గుసాగరముల యందు
నుత్తమంబు సింహళోద్భవం బటుగాన, దీనిఁ గొనుము మనుజదేవయనుచు. ౮౪

వ. ఇచ్చిన నదియును బ్రభాపటల విభాసిత సభామండపం బై యంబరమణిబింబ విడంబకం బగుచున్న మాసికంబు గైకొని మానవేంద్రుండు విస్మయమానమానసుండై తన్మాల్యంబు కోటిధనం బిచ్చి యిట్టివి మఱియునుం గలవే యనియడిగిన నావర్తకుండు ౮౫

గీ. దీనికంటెనొప్పు[1] దివ్యరత్నంబులు, గలవు మద్గృహమునఁ గొలఁదిమీఱి[2]
ధరణినాథ నాకు దశకోటి ధన మిచ్చి, భటునిబంపు పదియుఁ బంపువాఁడ.

క. అని చెప్పిన నాతనికా, ధన మిచ్చి భటాళిఁ జూచి తఱిదప్పకవే[3]
చనిరత్నంబులు గొని తెచ్చినవానికి మెచ్చు గలదు చేకొనుఁ డనియెన్. ౮౭

వ. అనిన ననహాయశూరుండును నలఘుతరాంఘ్రితలలంఘనుండును నగునొక్క జాంఘికుండు లేచి- ౮౮

క. అచ్చట నారత్నంబులు, పుచ్చుకొనుచు నేఁడుదివసములు పో మఱునాఁ[4]
డిచ్చటికి నిన్నుఁ గొలువఁగ, వచ్చెద నీయడుగులాన వసుధాధీశా. ౮౯

సీ. అని పంతమాడిన హర్షించి తాంబూల మిప్పించి వ్యయమున కేడుమాడ
లొసఁగి వర్తకుఁ గూడి మసలకుమీ యని యనిపిన వానిఁ దోడ్కొనుచు సెట్టి
యశ్వరత్నము నెక్కి యతివేగమున రేలుఁ బగళులు నెచ్చోటఁ దగులు వడక
నాలుగుదినముల నలువదియామడ ల్చని వీడు సొత్తెంచి తనగృహమునఁ
దేజరిల్లుచున్న దివ్యరత్నంబులుఁ, బదియు నిచ్చి రాచబంటు నంత
గవని వెడల ననిపి క్రమ్మఱ నేగిన, వాఁడు నటకు నడచి వచ్చె నట్లు.

క. లంఘితనగనగరసరి,త్సంఘాతుం డగుచు దినము దప్పక వడి ని
స్సంఘర్షాధ్వగుఁడై యా, జాంఘికుఁ డరుదెంచెఁ బురికి సంధ్యావేళన్. ౯౧

క. కాలూఁదక యట చని భూ, పాలుం గని మ్రొక్కి తనదు పంతంబునఁ ద
త్కాలోచిత దివసకర[5], జ్వాలాకృతి వెలుఁగు నైదు రత్నము లిచ్చెన్. ౯౨

ఉ. ఇచ్చిన వానిఁ బుచ్చుకొని యేలిక యల్లనఁ జల్లచూపులం
దెచ్చినబంటుఁ జూచి మఱి తెమ్మిఁక నైదును నాకు నిప్పుడే

1. మిగులు. 2. విలువమీఱి. 3. జనపతియా, తనికాధనమిచ్చి భటులఁ దప్పకపంచెం. 4. వేడుదివసములమఱునాఁ డేనిచ్చటికి. 5. దీపవర.

## ఆంధ్ర సాహిత్యపరిషత్తు—ప్రతిష్ఠాపకులు.

శ్రీరాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారావుబహద్దరువారు, పిఠాపురము మహారాజా వారు. పరిషదాద్యపజ్జీవాధ్యక్షులు.

కీ. శే. శ్రీ వేంకటగిరి మహారాజావారు.

శ్రీరాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు- ఉయ్యూరు జమీందారు

కీ. శే. శ్రీబొబ్బిలి మహారాజావారు.

## ఆంధ్ర సాహిత్యపరిషత్కార్యనిర్వాహకవర్గము.

### ఉద్ధారకులు.

జయంతి రామయ్యపంతులుగారు బి. ఏ, బి. ఎల్.

### కార్యదర్శులు.

కిశాంబి రాఘవాచార్యులుగారు ఎం. ఏ., బి. ఎల్.

వింజమూరి వెంకన్నపంతులుగారు ఎం. ఏ.

### కార్యనిర్వాహకసభాసభ్యులు.

దివాన్ బహదర్ కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తి నాయఁడుగారు (కోశాధ్యక్షులు.

పెద్దాడ రామస్వామిగారు, ఎం ఏ.

చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు

కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు.

శ్రీమాన్ గొడవర్తి జకన్నాథస్వామిగారు, ఎం. ఎ., ఎల్ టి.

దర్భా వేంకటశివరామరాసుగారు, బి. ఏ., బి. యల్.

అళక్కి వేంకట్రామయ్యగారు.

కేశవరపు కామరాజుగారు.

కోకా వేంకటసుబ్బారావు నాయఁడుగారు.

ఓలేటి వేంకటరామశాస్త్రిగారు, శతావధాని.

పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులుగారు.

పిళ్ళారిసెట్టి రంగబ్రహ్మారావునాయఁడుగారు.

## కాకినాడ-ఆంధ్రసాహిత్యపరిషత్తులో వెలకుదొరకు గ్రంథములు.

| | | | | |
|---|---|---|---|---|
| 1 | విప్రనారాయణచరిత్రము-చదలువాడ మల్లయ్యకవి | రు | 0 | 8 |
| 2 | కవిజనాశ్రయము-వేములవాడ భీమకవి | ... | 0 | 10 |
| 3 | చంపూరామాయణము-ఋగ్వేదికవి వేంకటాచలపతికవి | ... | 1 | 0 |
| 4 | నీతిసీసపద్యశతకము-తాళ్ళపాక పెదతిరుమలాచార్యుడు | ... | 0 | 2 |
| 5 | జ్యోతిశ్శాస్త్రసారము-శ్రీమాన్ కపిస్థళం కృష్ణమాచార్యులుగారు | ... | 0 | 8 |
| 6 | జ్ఞానప్రసూనాంబికాశతకము-శిష్టు సర్వశాస్త్రికవి | ... | 0 | 2 |
| 7 | సర్వేశ్వరశతకము-యథావాక్కుల అన్నమయ్యగారు | ... | 0 | 3 |
| 8 | యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనము-జ రామయ్యపంతులుగారు | ... | 0 | 8 |
| 9 | కావ్యాలంకారచూడామణి-విన్నకోట పెద్దయకవి | ... | 0 | 8 |
| 10 | చంద్రభానుచరిత్రము-తరిగొప్పుల మల్లనకవి | ... | 1 | 0 |
| 11 | అకారాద్యముద్రిత గ్రంథసూచిక | ... | 0 | 8 |
| 12 | ప్రాకృతభాషోత్పత్తి-శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు | ... | 0 | 12 |
| 13 | శివతత్త్వసారము-మల్లికార్జునపండితారాధ్యులు | ... | 0 | 12 |
| 14 | Defence of Literary Telugu జయంతి రామయ్యపంతులుగారు | ... | 0 | 8 |
| 15 | శివరాత్రిమాహాత్మ్యము-శ్రీనాథమహాకవి | ... | 0 | 12 |
| 16 | ఆర్యభాషావిభాగము-శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు | ... | 0 | 8 |
| 17 | Dravidian Lexicography జయంతి రామయ్యపంతులుగారు | ... | 0 | 4 |
| 18 | హ్రస్వరంగములు-కొత్తపల్లి సూర్యరావుగారు | ... | 0 | 8 |
| 19 | నారసింహపురాణము—ఉత్తరభాగము-హరిభట్టు | ... | 1 | 0 |
| 20 | మన్నారుదాస విలాసనాటకము—రంగాజమ్మ | ... | 0 | 8 |
| 21 | జైమినిభారతము-వచనము-వేంకటకృష్ణప్పనాయకుడు | ... | 0 | 12 |
| 22 | కాళిందీకన్యాపరిణయము (రెండుభాగములు) అహోబలపతి | ... | 1 | 4 |
| 23 | రెడ్లనాటి రెండు శాసనములు | ... | 0 | 4 |
| 24 | ఆంధ్రధాతుమాల—చిన్నయసూరి | ... | 0 | 12 |
| 25 | శాసనపద్యమంజరి | ... | 0 | 12 |
| 26 | శతకసముచ్చయము, (ప్రథమభాగము) | ... | 0 | 12 |
| 27 | ,, (ద్వితీయభాగము) | ... | 0 | 10 |
| 28 | పరిషత్పుస్తకభాండాగారము. (ద్వితీయభాగము) | ... | 0 | 8 |
| 29 | సూత్రాంధ్రవ్యాకరణములు—చిన్నయసూరి | ... | 0 | 8 |
| 30 | రసాభరణము—అనంతకవి. | ... | 0 | 8 |
| 31 | చాటుధారాచమత్కారసారః-(సంస్కృతము) | ... | 0 | 8 |
| 32 | ఉత్తరరామచరిత్రము-జయంతి రామయ్యపంతులుగారు | ... | 1 | 0 |
| 33 | షోడశకుమారచరిత్రము-వెన్నెలకంటి అన్నయ | ... | 0 | 8 |
| 34 | అమరుకము-సాంధ్రము-జయంతిరామయ్యపంతులుగారు | ... | 1 | 0 |
| 35 | సాంబోపాఖ్యానము- రామరాజురంగప్పరాజు | ... | 1 | 0 |
| 36 | హంససందేశము-కల్లూరి వేంకటరామశాస్త్రిగారు | ... | 0 | 2 |
| 37 | సింహాసనద్వాత్రింశిక-ద్వితీయభాగము-గోపరాజకవి | ... | 0 | 10 |
| 38 | రాయవాచకము | ... | 0 | 8 |
| 39 | ఆంధ్రశబ్దచింతామణి-బాలసరస్వతికృతాంధ్రటీకోపేతము | ... | 0 | 8 |

Printed by N. Achutaramiah at the Cocanada Printing works, Cocanada.

శ్రీ

# ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక.

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

**(Journal of the Telugu Academy·)**

సంపుటము. ౨౪ — యువనామసంవత్సరము. జ్యేష్ఠాషాఢమాసములు. — సంచిక ౨.



కాకినాడ:

క్రొత్తపల్లి సూర్యారావుచే బరిషత్కార్యాలయమునఁ

బ్రకటింపఁబడినది.

చందా, పోష్టువ్యయములతో సంవత్సరమునకు రు. ౩-౦-౦.

విడిసంచిక రు ౦-౮-౦.

**1935**- జూను, జూలయి మాసములు.

# వి ష య సూ చి క.

# ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక

## కాకినాడ.

రెండు నెలల కొకసారి ప్రకటింపఁబడును.

సంపుటము ౨౮. | యువనామసంవత్సరము. జ్యేష్ఠాషాఢమాసములు. | సంచిక ౨.

## పోతనస్తుతి.

కవితాకోకిల—రావిపాటి లక్ష్మీనారాయణగారు- గురజాల.

---

సీ. కమనీయకనకాబ్జగత భృంగరుతము తాభ్రంకషామరనదీస్వనముకంటె
బాలామ్రనవపల్లవంబులఁ దిని పాడు శారికాపంచమస్వరముకంటె
హస్తవీణాధ్వని కనుగుణంబుగ మ్రోయు వాణిమంజీరరవంబుకంటెఁ
బద్మజోదరదివ్యపాదాంబుజాసక్తనారదమధురగానంబుకంటె
హృద్యమై పామరులకైన నింపొనర్చు, శబ్దవైచిత్రములఁ గల్గి సరళశైలి
శ్రీమదాంధ్రభాగవతంబు చెప్పితౌర, పూతచారిత్ర ! బమ్మెర పోతరాజ.

సీ. కొండప్రక్కలనుండి ఘోరవేగముతో దుముకు సెలయేళ్ళ చప్పుళ్ళకంటె
విద్యుద్ద్యుతులు ప్రతిబింబింపఁ బురివిప్పి క్రీడసేసెడు నెమ్మి కేకకంటెఁ
దనయులు శైశవదశనుఁ దెలియక కుల్కుచుఁ బల్కు చిలుకపలుకులకంటెఁ
గమ్రతటాకభంగమ్ములం దూఁగెడు పక్షుల కలకలధ్వనులకంటె
హృద్యమై, సులభమధురమృదుపదముల, భావగర్భితముగను స్వాభావికముగ
శ్రీమదాంధ్రభాగవతంబు సెప్పితౌర, పూతచారిత్ర బమ్మెరపోతరాజ.

సీ. తాటాకు వహియింపఁ దగునీభుజముల నేగతి నాఁగలి వహింపఁగలిగితయ్య
గంటంబు పట్టంగఁ గలనీకరముల నేగతిఁ బగ్గములఁ బట్టఁగలిగితయ్య

కవితతి శాసింపఁగలవాణిచేత నేగతి నెడ్ల నదలింపఁగలిగితయ్య
యూహాప్రపంచాన నుండు నీవెట్లు కంచెలవెంటఁ గ్రుమ్మరఁగలిగితయ్య
భక్తిరసము నీవాగ్వీచి శక్తివలన, భంగమంది పొంగుచు హర్షబాష్పరూప
మొంది భక్తులఁదోఁగించు చుండఁగాదె, పూతచారిత్ర బమ్మెరపోతరాజ.

సీ. ఈపూఁటకే గ్రాస మిసుమంత లేదు పిల్లలకైన నని సతిపలుకుచుండ
నార్ద్ర వచ్చెను పరమాత్మ వర్షంబు లేదాయెనే యని దిగు లలముచుండఁ
గన్నకొడుకుకోరు కాయలఁగొనఁగ లేమిని లేమికై మది మిడుకుచుండ
నరకృతివైముఖ్యవరదీక్షతో మహాదారిద్ర్యమెంతయుఁ బోరుచుండ
నెట్లువ్రాయంగఁజాలితి విట్టికవిత?, నెన్నికష్టంబులను నైననెదురుకొనుచు
దీక్షతోఁ బనిసేయుటే ధీరగుణము, పూతచారిత్ర బమ్మెరపోతరాజ.

సీ. రాసలీలాభివర్ణన నీభరతశాస్త్రపాటవజ్ఞానంబు బయలుపఱచు
నద్వితీయము ద్వితీయస్కంధ మది నీనువేదాంతవిద్యను వెల్లడించు
సత్యభామాయుద్ధసంఘటనల్ నీను కల్పనాచాతురీగరిమఁ దెల్పు
మఱియు సప్తమదశమస్కంధములు నీను సహజకవితను నిశ్శంకఁజాటుఁ
జదువఁజదువఁగా మఱిమఱి చదువ బుద్ధిపుట్టు; నాఁకలిదప్పులు పుట్టఁబోవు
ఎన్నియో గంట లెట్టులో యిట్టె పోవుఁ, బూతచారిత్ర బమ్మెరపోతరాజ.

---

# గ్రామ్యవాదవిమర్శనము.

—: జయంతి రామయ్యపంతులుగారు, బి.ఏ., బి.ఎల్. :—

---

గ్రంథములయందు నేఁటివఱకు నుపయోగింపఁబడుచున్న సలక్షణాంధ్రభాష కడుఁ బ్రాచీన మగుటచే నేఁటియాంధ్రులకు దురవగాహముగా నున్నదనియును, నాభాషను విడిచిపెట్టి యక్షరాస్యు లగు నాంధ్రులు పరస్పరసంభాషణమునందు వాడుచున్న వ్యావహారికభాషయందే యిఁక ముందు గ్రంథములను రచియింప వలయు ననియు, నట్లు చేసినఁగాని గ్రంథములు సామాన్యజనులకు సుబోధములుగా నుండ వనియు నొకవాద మిటీవలఁ బుట్టినది. ఈవాదము నవలంబించువారంగీకరించెడి వ్యావహారికభాష వ్యాకరణశాస్త్రదృష్టిచే గ్రామ్య మగును గాన నీవాదము గ్రామ్యవాద మననొప్పు.

ఈవాద మించుమించుగా నిరువదియైదుసంవత్సరముల క్రిందటఁ బుట్టినది. తొలుత నీవాదమును బ్రతిపాదించినవారిలో విశాఖపట్టణవాస్తవ్యు లగు పి. టి. శ్రీనివాసయ్యంగారును, విజయనగరనివాసులయిన గురుజాడ అప్పారావుగారును, పర్లాకిమిడిలోనుండు గిడుగు వేంకటరామమూర్తిగారును ముఖ్యులుగా నుండిరి. వీరిలో రామమూర్తిగారు నేఁడుగూడ నీవాదమును వ్యాపింపఁజేయుటకై యత్నము చేయుచునే యున్నారు. తక్కిన యిద్దఱును దివంగతులయినారు. ఈనూతనవాదు లల్పసంఖ్యాకు లయ్యు నప్పుడు పాఠశాలాపరీక్షాధికారి (Inspector of Schools) గా నుండిన యేట్సు (Mr. Yates) మహాశయుని సాహాయ్యమును సంపాదించి వ్యావహారికాంధ్రభాష కాధునికాంధ్ర మని పేరుపెట్టి యది యాధునికాంగ్లభాషవంటి దని విద్యాశాఖాధికారి (Director of Public Instruction) గారికి నచ్చఁజెప్పి మాధ్యమికపాఠశాలోత్తమపరీక్ష (Secondary School Leaving Certificate Examination) కుఁ బోవు విద్యార్థు లాంధ్రభాషావ్యాసములు గ్రాంథికభాషలోఁగాని యాధునికభాషలోఁగాని రచియింపవచ్చు నని యుత్తరువును జేయించిరి. ఈయుత్తరువు పుట్టినవార్త క్రమక్రమముగా నాంధ్రలోకమున వ్యాపించి యాందోళనమును గలుగఁజేసినది. భాషాభిమాను లెల్లరు నాంధ్రసాహిత్యపరిషత్తును బురస్కరించుకొని బహువిధములఁ బ్రతిఘటింపఁ దుద కాయుత్తరువు రద్దయినది. ఈకాలమందే మదరాసు

విశ్వకళాపరిషత్తువారు (Madras University) పరిషత్పరీక్షలకు వచ్చు విద్యార్థులు వ్యాసము లెట్టి భాషలో రచియింపవలయు నను విషయమును నిర్ణయించుట కొకవిద్వత్సంఘము నేర్పఱిచిరి. ఆసంఘములో గ్రాంథికవాదులు గ్రామ్యవాదులును గూడ నుండిరి. తుద కాసంఘమువారియభిప్రాయము ననుసరించి వ్యాసరచనము గ్రాంథికభాషలోనే చేయవలయు నని విశ్వకళాపరిషత్తువారును దీరుమానించిరి. ఈవిధముగా రెండుచోటులయందును గ్రామ్యవాదము నిరాకృతమై గ్రాంథికవాదమే నిలిచినది.

కాని యిటీవల మద్రాసు విశ్వకళాపరిషత్తులోనేమి యాంధ్రవిశ్వకళాపరిషత్తులోనేమి గ్రామ్యవాదులుకొందఱు పరీక్షకులుగాను బఠనీయగ్రంథనిర్ణాయకులుగాను బ్రవేశించుచుండుటచే నీవాదము తిరిగి తలయెత్తుట కవకాశము కలుగునేమో యని యనుమానింపఁ దగి యున్నది. ఇంతియకాక భావకవు లనుపేర నిప్పుడు బయలుదేఱుచున్న నూతనకవితాప్రవర్తకులలోఁ గొంద ఱీగ్రామ్యభాషనే వాడుచున్నారు. ఈరెండువాదములలోను జేరక తటస్థముగా నున్నవారిలో గ్రాంథికగ్రామ్యభాషలకుఁ గలభేద మెట్టిదో తెలియనివారు కొంద ఱుండవచ్చును. కావున నీరెండుభాషల స్వరూపమును వానికిఁ గల భేదమును వివరింపవలసి యున్నది.

ముందుగా భాష యనఁగా నేమిటి యనువిషయ మాలోచింతము. భాష యనఁగా మనుజులు తమతమభావముల నితరులకుఁ దెలుపుటకు ముఖ్యసాధనమని చెప్పవొప్పును. వివిక్తదేశమం దొక్కఁడే నరుఁ డుండినచో వానికి భాషతోఁ బనిలేదు; కాని, పలువురు మనుష్యు లొక్కచోట సంఘముగాఁగూడి యున్నప్పుడు పరస్పరభావప్రకటన మావశ్యకమగును. అట్టిప్రకటనమునకుఁ దగిన సర్వజనసామాన్యసాధన మొకటి యుండవలయును. అట్టిసాధనము కాలక్రమమున బయలుదేఱును. కొంతవఱకు జనుల ముఖవికారములే వారిభావములఁ దెల్పును. ఇదియు నొకవిధ మయినభాష యని చెప్పవచ్చును. కాని, యీభాషకు వ్యాప్తి మిక్కిలి సంకుచిత మైనది. జనుల తాత్కాలికానందదుఃఖములుమాత్రము స్థూలరూపముగా ముఖవికారముల వలనఁ దెలియును గాని యాభావములసూక్ష్మాంశములనుగాని యితరభావములనుగాని వ్యక్తపఱుచుట కాభాష చాలదు. కరచరణాద్యవయవవిక్షేప మంతకంటె మేలు. దీనిమూలమునఁ బెక్కుభావములు వ్యక్తపఱుపవచ్చును. మూఁగవాండ్రభాషయిదియే.

భాషాస్వరూపము.

అభినయశాస్త్రమునకు మూలముకూడ నిదియే. ఇది యైనను సమగ్రము కాదు. సూక్ష్మభావముల వ్యక్తపఱుచుట కిది చాలదు. మిక్కిలి సమీపమం దున్నవారితోడను మాత్రమే సంజ్ఞలతో మాటలాడుట కను వగును. జనులబుద్ధి వికసించిన కొలఁది నీభాష చాలక వాగ్రూపక మగుభాష యుత్పన్నమై క్రమక్రమముగా వృద్ధినొందినది. సర్వభావములను సూక్ష్మాంశములతోఁ గూడ నీభాషామూలముగా వ్యక్తపఱుపవచ్చును. కాని, యుచ్చరింపఁబడినతోడనే మాటలు నశించును. వానియర్థము వాసనారూపముగ విన్నవారి మనస్సుల నంటి యుండును. కాలాంతరమం దీయర్థమును స్మరించుకొనవలసివచ్చినపుడు స్మృతి దుర్బలమైనచో నాయర్థ మున్నది యున్నట్లుగాఁ దలంపునకు రాదు. ఈలోపమును నివారించుటకును దూరదేశమునం దున్నవారికిఁ గూడ భావములఁ దెలుపుటకును లిపి

లిపి. కల్పింపఁబడినది. మానవసంఘములు ప్రబలి వారియూహలు, బుద్ధిబలము, వ్యవహారములు హెచ్చినకొలంది లిపి యావశ్యక మగును. ఈలిపి తొలుత నుత్తరప్రత్యుత్తరములు, పద్దులు, లెక్కలు మొదలగు చిన్నచిన్నపనుల కుపయోగింపఁబడి క్రమక్రమముగా గ్రంథరచన కుపయోగించును. విడిపద్యములు, చిన్నచిన్న కావ్యములు, లిఖితములుగాక కేవలవాగ్రూపముగ నుండవచ్చును, గాని, కావ్యములు ఖిలము గాకుండ శాశ్వతముగా నుండవలయు నన్నచో వానిని లిఖించి యుంపవలయును. కనుక నే వాఙ్మయము గలభాష లన్నింటిలోను లిపి యుండుట చూచుచున్నారము. కోదు (కుయి) సవర మొదలగు నాటవికభాషలకు లిపి లేదు. దక్షిణకర్ణాటమండలమందు వాడుకలో నున్న తులుభాష యాటవికభాష కాకున్నను దానిలోఁ గూడ లిపి లేదు. ఈభాషలలో వాఙ్మయమును లేదు. లిపి లేని భాషలలో వాఙ్మయము పుట్టుటకుఁ గాని యభివృద్ధి నొందుటకుఁ గాని యవకాశ మంతగా నుండదు. లిపి సమగ్రముగా నుండవలయు నన్నచో వేఱువేఱు ధ్వనుల కెల్ల వేఱువేఱు చిహ్నము లుండవలయును. ఒక్క ధ్వనికి బెక్కక్షరములు గాని పెక్కుధ్వనుల కొక్కటే యక్షరము గాని యున్నచో నాలిపి సంపూర్ణమైనది కాకపోవును. ఈపద్ధతినిబట్టిచూడ సంస్కృతలిపియుఁ దెనుఁగు లిపియు నించుమించుగాసంపూర్ణము లేయనవచ్చును. ఆంగ్లేయద్రావిడభాషలలిపి యసమగ్రమని చెప్పక తప్పదు. కావుననే యీభాషలయందు వ్రాఁత యుచ్చారణానుసారముగానుండుటకు వీలులేదు. కొన్నిశబ్దములలో వ్రాఁత యొకవిధముగను బలుకుబడి వేఱొక్కవిధముగను నుండును. తెనుఁగున నీవ్యత్యాస మంతగా లేదు.

జనులలోఁ దెలివితేటలు వ్యవహారధర్మములు విద్యలు వికసించినకొలఁది వాఙ్మయము క్రమక్రమముగా నేర్పడును. అట్టి జనులకు వాఙ్మయము లేనిదే లోకవ్యవహారము చక్కగా నడువదు. కావుననే నాగరికు

వాఙ్మయావిర్భావము.

లను పేరుపొందిన జనులభాషలలోనెల్ల గ్రంథసంచయ ముండుట చూచుచున్నారము. లిపిగలభాష లన్నింటిలోఁ గొంచెమో యధికమో వాఙ్మయము గలదు.

భాషావికృతి :—కేవలవాగ్రూపభాషాస్వరూపము స్థిరముగా నుండక కాలానుసారముగా వికృతులను జెందుచుండును. ఒకపురుషుఁ డొకమాట నుచ్చరించిన వెంటనే యామాట నశించిపోవును. వేఱొకసారి యాతఁడే యామాటనే యుచ్చరింపవలసినపు డాయుచ్చారణము సరిగాఁ బూర్వమువలెనే రాదు. ప్రాజ్ఞులైనను సామాన్యవ్యవహారవిషయములలో నొకరితో నొకరు మాటలాడుకొనునప్పు డలసతచే వర్ణోచ్చారణము శిథిల మై శబ్దముల రూపము క్రమక్రమముగా మాఱుట యనుభవసిద్ధము. విద్యావిహీనులమాట వేఱె చెప్పనేల. ఈయలసతచేత శబ్దములలోవర్ణలోపవర్ణవ్యత్యాసములుగలిగి కొంతకాలమున కాశబ్దములు మాఱిపోవును. నదీప్రవాహములోఁ బడి కొట్టుకొని పోవుఱాలు క్రమక్రమముగా నఱిఁగిపోయి చిన్నవయినటులు శబ్దములును జనులనోళ్లఁబడి యఱిఁగిపోయి హ్రస్వరూపములఁ దాల్చును. ఇది సర్వదేశభాషాసమానధర్మము.

వికృతులు హెచ్చినకొలఁది భాషలో నంతర్భేదము లేర్పడి యొక్కొక్క ప్రదేశమందలిభాష యొక్కొక్కవిధముగా నుండును. వీనిని బ్రాదేశికభాష (diolects) లనవచ్చును. ప్రదేశభేదములను బట్టియే కాక జనులవిద్యాతారతమ్యమును బట్టియు వృత్తులను బట్టియుఁ గూడ భాషాభేదము లేర్పడును. ప్రతిభాషయందును నిట్టి భేదములు గలవు.

మన తెనుఁగుభాషలో గంజాముమండలములోని యేచ యొకవిధముగా నుండును. విశాఖపట్టణప్రాంతమందలి యేచ దానికంటెఁ గొంతవిలక్షణము. గోదావరి కృష్ణామండలముల లోనిభాష యేకవిధ మని భావింపవచ్చును. గుంటూరు నెల్లూరుమండలములభాష వేఱు. కడప కర్నూలు మండలములభాష వీనియన్నింటికంటె విలక్షణము. కర్ణాటభాషాసంపర్కముచే బళ్లారిప్రాంతమందును మైసూరుదేశమునందును దెనుఁగు మాఱినది. ఆప్రకారమే చిత్తూరు మండలమందును నరవదేశమందును ద్రావిడభాషాసంపర్కముచేతఁ గొంత వికారము గలిగినది.

మఱియు- బ్రాహ్మణులు మొదలగు విద్యావంతులు మాటలాడు భాష వేఱు. విద్యాగంధములేని కేవల పామరజనులు మాటలాడు భాష వేఱు. వివిధములైన యేచలతో మాటలాడు జను లొక్కచోటఁ గూడి ప్రత్యక్షముగా మాటలాడుకొనునప్పు డొకరిమాట యొకరికిఁ దెలియకపోదుగాని లిఖితరూపముగా నున్నపు డొక ప్రదేశమువారియేచ వేఱొక ప్రదేశములో నుండువారికి స్పష్టము గాక నట్టుచు నుండును.

తద్భవశబ్దోత్పత్తిక్రమము :—ఏకభాషలోనిశబ్దములే యిట్లు మాఱుచుండ నొకభాషలోనిశబ్దములు వేఱొకభాషలోనికిఁ జేరునప్పుడు వానియుచ్చారణము మాఱు నని వేఱ చెప్ప నక్కఱ లేదు గదా! సంస్కృతశబ్దములు కొన్ని తెనుఁగులోనికి వచ్చినపు డవి మాఱి రూపాంతరముం దాల్చినవి. అట్టిశబ్దములకు వైకృతము లనియుఁ దద్భవము లనియుఁ బేరు. సాధారణముగా నీశబ్దములు తొలుతఁ బ్రాకృతభాషలలోఁ జేరి యందుఁ గొన్నిమార్పులను బొంది పిదపఁ దెనుఁగులోనికి వచ్చి మఱికొన్ని వికృతులను బొందినవి. సంస్కృతములో నున్న కొన్ని యక్షరములకు సరియైనయక్షరములు ప్రాకృతములందును దెనుఁగునందును లేకపోవుటచే నాశబ్దము లీభాషలోఁ జేరినయప్పుడు వాని యుచ్చారణము మాఱవలసివచ్చినది. పిదపఁ గొందఱుకవు లచ్చతెనుఁగు గ్రంథములను రచియించుచుఁ బెక్కుసంస్కృతశబ్దములకు వికృతులు కల్పించి తమగ్రంథములయందు వాడిరి. ఆంధ్రమునఁ దద్భవశబ్దములు పుట్టినరీతి యిది.

తత్సమశబ్దములు:—మొదటినుండియు సంస్కృతభాషాపాండిత్యము గలవారే తెనుఁగుకవిత్వము చెప్పుచుండుటచేతను వారురచియించినగ్రంథములు బహుళముగా సంస్కృతగ్రంథముల కనువాదము లగుటచేతను భావప్రకటనమునకుఁ గేవల దేశ్య తద్భవపదములు చాలక యాకవు లనేకసంస్కృతపదముల నాంధ్రవిభక్తిప్రత్యయములఁ జేర్చుటతప్ప మఱియేమార్పును జేయకయే యున్నవి యున్నట్లు వాడిరి. అవియే తత్సమశబ్దములు. తెనుఁగువాఙ్మయమునం దీశబ్దము లత్యధికముగా నున్నవి.

గ్రాంథికభాషాస్వరూపము:—భాషకు లిపి యేర్పడిన పిమ్మట మార్పులు కొంతవఱకుఁ దగ్గును. వట్టినోటిమాటలు మాఱిపోవునంతగా వ్రాఁత కెక్కినమాటలు మాఱవు. లిఖితరూపము లగు పదములు వ్రాసినప్పు డెట్లుండునో కాలాంతరమునందు నట్లే యుండును. కాని యుచ్చారణానుసారముగా వ్రాయఁబడినశబ్ద

ముల రూపము లాయాకాలములయందలి యుచ్చారణ ననుసరించి మాఱుచునే యుండును. బహుజనసన్మానార్హము లగు గ్రంథములు పుట్టినపిదప నాగ్రంథము లయందుఁ బ్రయుక్తమైనభాష తరువాతికవుల కాదర్శప్రాయ మగును. ఆభాషయే సలక్షణభాష యనియు నంతకంటె విలక్షణమైనభాష గ్రంథరచనకుఁ దగ దనియు భావింతురు. ఈసంప్రదాయము వాఙ్మయము గల సర్వభాషలయందును గలదు. అది యుక్తమే. జనులు వాఙ్మయమువలని ఫలమును సంపూర్ణముగాఁ బొందవలయు నన్న నాయాగ్రంథములు పుట్టినప్రదేశమందును, దత్కాలమందును మాత్రమే కాక ప్రదేశాంతరములయందును గాలాంతరమందును గల జనులు గూడఁ జదివి యర్థము చేసికొనఁ దగినట్టివిగా నుండవలయును. నియమితము స్థిరము నగుభాషయందు రచియింపఁబడినప్పుడే గ్రంథముల కట్టి యోగ్యత కలుగును. కావుననే వ్యావహారికభాష మాఱుచున్నను గ్రాంథికభాష నిలుకడఁ జెంది యుండుట చూచుచున్నారము. అట్లు కానిచో నించుమించుగా నెప్పటివాఙ్మయ మప్పుడే ఖిలమయి పోవలసివచ్చును.

ఇట్లనుటచే గ్రాంథికగ్రామ్యభాషల కన్యోన్యసంబంధము లే దని యూహింపఁగూడదు. రెంటికి నొకవిధమైన సాహచర్యసంబంధము గలదు. వడఁబోసిన నిర్మలజలప్రవాహము వంటిది గ్రాంథికభాష. తత్తత్ప్రదేశములయందలి కల్మషములతోఁ గూడినవాననీరు వచ్చి పడుచుండుటచేఁ గలుషమైననీటిజాలువంటిది గ్రామ్యభాష. ఈరెండు నొకటికొకటి యనతిదూరముననే ప్రవహించుచుండుటచే వీని కొకవిధమైన సాహచర్యసంబంధము గలదు. అప్పుడప్పుడు గ్రాంథికభాషలోని కొన్ని శబ్దములు, రూపములు, వాడుకభాషలోఁ జేరుటయు-వాడుకభాషలోని మాటలు కొంచెముగనో యధికముగనో సంస్కారముం బొంది గ్రాంథికభాషలోఁ బ్రవేశించుటయుఁ గలదు. ఈభాషలు రెంటికి జన్మస్థాన మొక్కటియే యైనను వాని తదనంతరచరిత్రమును వర్తమానరూపములు భిన్నములు.

ఆంధ్రగ్రాంథికభాష ప్రథమావస్థ :—సర్వభాషాసామాన్య మగు నీచర్చ తెనుఁగున కెంతవఱకు సరిపోవునో చూతము. ఆంధ్రదేశమందు వాడుకభాష బహువిధములుగా నున్న దని చెప్పి యుంటిని. గ్రాంథికభాష ప్రవాహన్యాయమున నేకాకారముగా నున్నది. మనకుఁ దెలిసినంతవఱకు నన్నయభట్టారకరచిత భారతభాగమే ప్రథమాంధ్రగ్రంథము. అంతకుఁ బూర్వము కవిత్వమే లే దని చెప్ప వలనుపడదు. మధ్యాక్కరపద్యములతో నున్న యుద్ధమల్లుని బెజవాడ

శాసనమును, తరువోజపద్యములతో నున్న గుణగవిజయాదిత్యునినాఁటి ధర్మవర శాసనమును లభించినవి. ఇట్టికవితలు మఱికొన్ని యుండిన నుండవచ్చును. భట్టారకుని కవిత్వము సర్వాంగసుందరమై సంస్కృతములో వాల్మీకిరామాయణము వలెఁ దెలుఁగులో నాదర్శప్రాయమై యున్నది. భాషాలక్షణమే కాక ఛందోలక్షణముసైత మానాఁటికే స్థిరపడి యున్నది. ఇది యంతయు భట్టారకుఁడే కల్పించినాఁ డనుట సమంజసము కాదు. కృత్యాదియందు నన్నయభట్టారకుఁడే—

"సారమతిం గవీంద్రులు ప్రసన్నకథాకవితార్థయుక్తిలో నారసి మేలునాన్"

అని చెప్పుటచేత నాకాలమం దితరాంధ్రకవు లుండి రని తేలుచున్నది. వా రందఱిలో మిన్నయై సర్వజనసంభావ్యమైన కీర్తి నుద్గ్రంథము రచించుటచే నన్నయ ప్రథమాంధ్రకవిగాఁ బరిగణింపఁబడుచున్నాఁడు. గ్రాంథికభాషాలక్షణమును నన్నయభట్టు కల్పించినాఁ డనుకొనుట యుచితము కాదు. ఆనాఁడు వేఁగీదేశరాజధాని యైన రాజమహేంద్రనగరప్రాంతమందు సలక్షణముగా గ్రహింపఁబడి యుండిన భాషనే యాకవి యనుసరించెను గాని తాను క్రొత్తభాషను సృజింపలేదు.

ప్రాచీనవ్యావహారికభాషాస్వరూపము:—ఈవ్యాసమున కనుబంధముగా నైదు ప్రాచీనశిలాశాసనములప్రతుల నిచ్చినాఁడను. వానిలో మొదటి మూఁడుశాసనములు గోదావరీ మండలములో ద్రాక్షారామగ్రామమందు శ్రీ భీమేశ్వరాలయములో నున్నవి. ఇవి యిదివఱలో South Indian Inscriptions Vol. IV అనుపుస్తకమందుఁ బ్రకటింపఁబడి యున్నవి. ఆపుస్తకములోని పాఠమునే భేదమేమియు లేకుండ ననుబంధములోఁ గనఁబఱిచినాఁడను. నాల్గవశాసనము నైదవశాసనమును గుంటూరుమండలమున, తెనాలితాలూకా వలివేరుగ్రామమందు శ్రీ స్వయంభూదేవుని యాలయములో నున్నవి. మూలపాఠమును సరిగా నెత్తి వ్రాసినాఁడను. ఈశాసనము లన్నియు రాజరాజనరేంద్రునికాలమందుఁ బుట్టినవి యని యూహింపవచ్చును. వీనిలో వ్రాఁతతప్పు లనఁదగిన పదముల విడిచినచో నీశాసనములలోని భాషలక్షణ మించుమించుగా నన్నయభట్టారకుని భాషాలక్షణమునకు సరిపోవును. ఈసామ్యము రాజమహేంద్రవరమునకు సమీపదేశమందున్న మొదటిమూఁడుశాసనములయందుకంటెను నించుక దూరదేశమందున్న నాలుగైదుశాసనములందె యధికముగాఁ గనుపట్టుచున్నది. ఇది చిత్రము. అక్షరాస్యులగు జనులందఱు వచ్చి చదువుకొనుటకై యేర్పడిన గద్యశాసనము లాయాకాలములందు

వాఙ్మకళా నున్న శిష్టవ్యవహారభాషయందే రచింపఁబడి యుండు నని యూహించుట యుచితము. కావున శాసనభాష యానాఁటి శిష్టవ్యవహారభాష యనియు దానికిని నన్నయభట్టారకప్రయుక్తగ్రాంథికభాషకు నంతర మంతగా లే దనియునుఁ దేలుచున్నది. ఇది వింత కాదు. గ్రాంథికభాష ప్రథమావస్థయందు శిష్టవ్యవహారభాషానిర్విశేషముగానె యుండును. పిదప రానురాను వ్యావహారికభాష మాఱుచుండుటచేతను గ్రాంథికభాష యంతగా మాఱకుండుటచేతను గొంతకాల మగు నప్పటికి గ్రాంథికగ్రామ్యభాషల కంతర మధిక మగును.

నన్నయభట్టారకునికాలము గ్రాంథికభాషకుఁ బ్రారంభదశ యని చెప్పవచ్చును. అంతకుముందే యాభాష యుత్పన్నమై జనాదరమును బొంది యుండెను గాని భట్టారకుఁడు దానికి మెఱుఁగుపెట్టి భారతమువంటి యుద్గ్రంథము రచించుటకుఁ జాలినదానినిగా నొనర్చెను. కావుననే తిక్కనసోమయాజి యా మహాకవికి విద్యాదయితుఁ డనుబిరుదము సమర్పించెను.

నన్నయభట్టారకుఁడు, తిక్కనసోమయాజి, వీరిభాషలస్వరూపము :—
'వాగనుశాసనుఁ డిట్లు సృజించిన గ్రాంథికాంధ్రప్రపంచము మహనీయస్థితికిఁ గుండలీంద్రుండు మూలమై నిలిచెను'. నన్నయభట్టారకుఁడు కని తన కొప్పగించిన భాషాశిశువును సోమయాజి యోజోదాయక మగు నాహార మిడి పెంచి విద్యాబుద్ధులు గఱపి ప్రౌఢం గావించెను. భట్టారకుని భాష ప్రసన్నముగ నుండును. అతఁడు సంస్కృతశబ్దము లధికముగా వాడెడి యభ్యాసము కలవాఁడు. అట్లు వాడినను సంస్కృతశబ్దప్రయోగము సందర్భోచితముగా నున్నట్లు కనఁబడును, గాని, ప్రౌఢిఁ జూపుటకయి పనిపట్టి మాఱుమూలపదములం దెచ్చి పెట్టినట్లు కనఁబడదు. పరిణతప్రజ్ఞుఁడగు కవికిఁ గాని యిట్టి నేర్పుండదు.

తిక్కన సోమయాజికిఁ దెనుఁగు పదము లుపయోగించుటయం దాసక్తి మెండు. సాధారణముగాఁ దెనుఁగుశబ్దములే యాతని మదికిఁ దట్టును, తెనుఁగుమాటలు దొరకనప్పుడే సంస్కృతశబ్దము లను వాడును. ఉదారభావములను గూడఁ దేటతెనుఁగు మాటలలో నీతఁ డిముడ్పఁగలఁడు. ఇదిగోఁ జూడుఁడు-

క. తనకుం దా నెర వనినను, విను బాంధవులు సతమె యవివేకంబున నే
పనులపయిఁ జేయునట్టివి, ననువగ నొంద దది కారణముగ నరేంద్రా!

క. నరనాథ సుఖము దుఃఖముఁ, బరువడి మెయిఁ బొరయుఁగాక పన్నుగ నరునిం
బొరయునె యం దొక్కటి యవి, పొరసిన వల దూఁద మోదమును ఖేదంబున్.

క. ఇది నాయది యను నూఁత, న్నది నెయ్యది పట్టుకొల్పినను వాసితమై
తుదిఁ జేటుఁ బొంది వానికి, నది శోకము నావహించు నత్యంతంబున్.

శాంతిపర్వము ౧వ యాశ్వాసము.

భట్టారకుఁడును సోమయాజియు విద్వద్వర్యులు. కవిశిఖామణులు. వారికి శైలిలో మాత్రము భేద మున్నది. వా రిరువురలో నెవ్వ రెక్కువ యెవ్వరు తక్కువ యని తారతమ్యము నిరూపింపయత్నించుట హరిహరుల తారతమ్యమునిర్ణయించు యత్నమువలె వ్యర్థము.

భట్టారకుని ప్రయోగములకంటె భిన్నము లయిన ప్రయోగములు కొన్ని సోమయాజి కవిత్వమం దగపడుచున్నయవి.

ఒక్కాఁడు, ఒక్కఁడు మొదలగు రూపములు గల యీశబ్దము భట్టారకుని కవిత్వమందు, 'ఒక్కటి' యను నర్థమం దమహదర్థకముగానె కనుపట్టుచున్నది. మహదర్థక ప్రయోగములు కొన్నికొన్ని యచ్చుప్రతులలోన నున్నవి గాని యవి యిటీవలి వారు కల్పించిన ప్రక్షిప్తపాఠము లని యెంచఁ దగి యున్నవి. సోమయాజి కవిత్వమం దీశబ్దము 'ఒక పురుషుఁడు' అను నర్థమందు మహదర్థక పుంలింగ రూపముగాఁ గూడ నగపడుచున్నది. ఒక్కఁడుశబ్దమునకుఁ బ్రథమేతర విభక్తి ప్రత్యయములు పరమగునప్పుడు వచ్చు ఒక్కటి యను రూపము, అమహదర్థకముగా సోమయాజి కవిత్వమునం దగపడుచున్నది. ఈప్రయోగము భట్టారకుని కవిత్వమందుఁ గానరాదు. ఇప్పుడు వాడుకలోనున్న వచ్చుచున్నాఁడు, పోవుచున్నాఁడు, ఇత్యాదిక్రియారూపములు సోమయాజి కవిత్వమునం దున్నయవి. భట్టారకుని కవిత్వమందు వీనికిఁ బూర్వరూపము లయిన వచ్చుచున్నవాఁడు, పోవుచున్నవాఁడు- అను రూపములే కనఁబడుచున్నవి. ఇట్టి ప్రయోగభేదములు మఱికొన్నిటిని గూడఁ జూపవచ్చును. తెనుఁగుపదములు, పలుకుబడులు నధికముగా వాడుటలోఁ దిక్కన సోమయాజి గుంటూరు నెల్లూరు ప్రాంతములందు వాడుకలోనున్న వ్యావహారికరూపములఁ గొన్నింటిని గ్రహించెను. ఆప్రకారమే నన్నెచోడుఁడు, కేతన, యిటీవల శ్రీనాథుఁడు, నాచనసోముఁడు - ఇత్యాదికవులు కొందఱు తమతమకాలములందు వాడుకలో నున్న వ్యావహారికరూపములఁ గొన్నింటిని దమగ్రంథములయం దుపయోగించిరి. తదనంతరము పుట్టిన గ్రంథములలోఁ గూడఁ గొన్ని వ్యావహారికశబ్దములు ప్రవేశించినవి.

గ్రాంథికభాష మాఱకుండుటకుఁ గారణము:—

అయినను, గ్రాంథికభాషాప్రవాహము నియమసహితమై సుస్థిరములైన కూలముల నడుమనే ప్రవహించును గాని గ్రామ్యభాషవలె గంగవెఱ్ఱు లెత్తి దారి తప్పిపోదు. గ్రాంథికభాషను వాఙ్మయ మనునది దృఢశృంఖలవంటిది. ఈ భాష గ్రంథములయందే యుండును. గ్రంథము లన్నిదేశముల నెల్లకాలముల జనుల కన్వయించున ట్లుండవలయును. గ్రాంథికభాష నియమహీనమై తఱచు మాఱినయెడల గ్రంథరచన కుపయోగింపదు. భాష మార్పవలయునన్నఁ బౌరకలోక మనుమతింపవలసి యుండును. ఒక మండలములోనివారి కిష్టమైనమార్పు మఱియొక మండలమువారి కిష్టముకాదు. నిన్నటిగ్రంథము నేఁటివారికి దుర్గ్రాహ్య మగును. కాఁబట్టి కొన్ని చిన్నమార్పు లేవియైన నప్పటప్పటికిఁ గలుగుచున్నను భాషస్వరూపము మాఱదు.

నియమము లున్నంగాని లోకవ్యవహారము చక్కగా నడువదు; నియమము లేర్పడిన పిమ్మట వానిని యథేచ్ఛముగా మార్చుట సులభముగాదు. బహుజనసమ్మతిమీఁదఁగాని మార్పులు చెల్లవు. ధర్మశాస్త్రమునుండి యొక్కయుదాహరణము:—సపిండు లగువా రొకరినొకరు వివాహమాడఁగూడ దని సామాన్యశాస్త్రము. దీనికి భిన్నముగా నాంధ్రులలో మేనఱికము, అనఁగాఁ, బురుషుఁడు మేనమామ కూఁతును బెండ్లియాడు నాచారము, కలదు. ఇది శాస్త్రవిరుద్ధమయినను శిష్టాచారముగా నీదేశమందు స్థిరపడి యున్నది. ఈయాచారము సామాన్యశాస్త్రమున కపవాదముగ నున్నది, కాని, యాశాస్త్రమును రద్దుచేయఁజాలదు. ఆలాగుననే వ్యావహారికభాషలోనుండి యప్పు డప్పు డొకమాట గ్రాంథికభాషలోఁ జేరుచు వచ్చినను గ్రాంథికభాష మొత్తముమీఁద వ్యావహారికభాషలకంటె విశిష్టమై స్థిరముగా నుండును.

ఈసంప్రదాయము సర్వభాషాసామాన్యము. గ్రామ్యవాదు లుత్కృష్టప్రమాణముగా గ్రహించెడి యాంగ్లేయభాష విషయమయి, లౌన్సుబెరీ (Mr. Lounsbury) యను విద్వాంసుఁడు వ్రాసిన విషయము నీక్రింద సంగ్రహించి వ్రాయుచున్నాఁడ నది గమనింపుఁడు.

"ఆంగ్లభాషలో వాఙ్మయ మనఁదగిన గ్రంథసముచ్చయము సృష్టి, మధ్యమాంగ్లయుగము (Middle English period) నందుఁ బ్రారంభ మైనది. రచనాపద్ధతికిఁ బ్రమాణము లనఁదగిన గ్రంథములు భావిగ్రాంథికభాషకు నియమ

ములఁ గల్పింపక మానవు. ఇట్టికారణము చేతనే యాంగ్లభాష 14 వ శతాబ్దాంతమునుండి నేటివఱకు నియమవిశిష్టమై వృద్ధిఁ జెందినది. లక్షణమందును శబ్దసముచ్చయమందును గూడ దానిలో మార్పులు కలుగుచునే యున్నవి. అట్లు మాఱకున్నచో నది జీవద్భాషయే కాకపోవలసి వచ్చును. కాని యట్టి మార్పులు యథేచ్ఛముగాఁ గాక నియమితములై కలుగును. ఆభాషలో స్థిరపడుటకుఁ జిరకాలము—కొన్ని విషయములలోఁ బెక్కుశతములు పట్టును. వాఙ్మయము పెరిఁగి వ్యాపించినకొలఁది గ్రాంథికభాష మాఱుట తగ్గిపోవుచుండును. మధ్యమాంగ్లయుగ ప్రారంభము మొదలు నేటివఱకుఁ గడచిన యైదువందల సంవత్సరములలోఁ గలిగిన మార్పులకంటె నంతకుఁ బూర్వము రెండువందల సంవత్సరములలోఁ గలిగిన మార్పు లత్యధికముగా నున్నవి. సంఖ్యలో నీరెంటికిని సామ్యమే లేదు. ఇటీవలఁ గలిగిన మార్పులు చాలవఱకు వర్ణక్రమము (Orthography) నందే యున్నవి."[1]

ఆవిద్వాంసుఁడే గ్రాంథికభాష భావిస్థితిని గుఱించి వ్రాయుచు "గతించిన మూఁడువందల సంవత్సరములలో నాంగ్లేయ(గ్రాంథిక)భాష ధరియించి యున్నరూపము భావికాలమందు నశించిన నశింపవచ్చును గాని యింతకుఁ బూర్వ మెన్నఁడును గలిగి యుండనట్టి యుపద్రవములు కలిగినంగాని నశింపదు." అనిచెప్పెను.

ఏభాషయందైనను వాఙ్మయము వృద్ధినొందినకొలఁది నావాఙ్మయమందుఁ బ్రయుక్తమైనభాష రూపము స్థిరపడి యేకాకారముగా నుండుననియు వ్యావహారికభాషాసంపర్కమునుబట్టి కొన్నికొన్ని చిన్నమార్పులు విరళముగాఁ గలుగ వచ్చునుగాని పెద్దపెద్దమార్పులు కలుగక మొత్తము మీఁద గ్రాంథికభాష యేకాకారముగా నుండు ననియు నీచర్చవలనఁ దేలుచున్నది. ఇది సర్వభాషాసమాన్య ధర్మము.

సశేషము.

---

1. History of the English language pp. 140-41.

# గ్రంథస్వీకారము.

(1) శ్రీరామవిజయము - కళ్యాణకాండము.

ఇది కాకినాడవాస్తవ్యులును సుప్రసిద్ధసంస్కృతపండితులు నగు బ్ర॥ శ్రీ॥ కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారిచే రచియింపఁబడిన శ్రీరామవిజయ మనుమహాగ్రంథమున రెండవభాగము. వాల్మీకిరచిత మగు శ్రీమద్రామాయణమునందలి బాలకాండములోని కథ యిందు వర్ణితము. అందు లేనట్టియుఁ గథాసందర్భమునకు ముఖ్యమైనట్టియుఁ బెక్కుపాఖ్యానము లిందుఁ జేర్పఁబడినవి. బాలకాండమందలికథకు మనోజ్ఞతనుఁ జేకూర్పఁగోరి శ్రీశాస్త్రిగారు వాల్మీకిమహర్షి పూర్వచరితమును, గుహునిచరితమును, వేదవతిచరితమును జేర్చియున్నారు. వీరికి శ్రీమద్రామాయణమునందు విశేషగౌరవమును బరిచయమును గలదు. 49 వ పుటయందు వీరు వాల్మీకిని గూర్చి వ్రాసిన విషయములలో నతిశయోక్తి యిసుమంతయును లేదు. కాళిదాసుఁ డాదిగాఁ బూర్వకవు లందఱును రామాయణసారము నాస్వాదించి యందలి యపూర్వకల్పనాదివిషయముల గ్రహియించి తమతమగ్రంథముల రచించియున్నారు. ఈగ్రంథమునందలి శైలి నాతికఠినమై మృదుమధురమై యున్నది. వర్ణితవిషయములు నీతిబోధకములై యార్యమతసంప్రదాయాదికముల వివరించుచున్నవి. నేఁటివిద్యావిధానమునందుఁ గాని ప్రకటింపఁబడు గ్రంథములందుఁ గాని నీతికిని హైందవమతమునకును దగినస్థాన మీయఁబడుట లేదు. నేఁటికవులును బ్రాచీనమతధర్మముల నుజ్జగించి పాశ్చాత్యరీతిని గథలను, నాటకములను రచింపుచున్నారు. అట్టిసందర్భమున వలయుస్థలములఁ బ్రాచీనధర్మముల విపులీకరించి పాఠకులకు నీతిబోధకముగ శ్రీశాస్త్రిగారీగ్రంథమును రచించుట సహృదయుల కానందదాయకము- పాయసవిభాగఘట్టమునందు, నహల్యావృత్తాంతమునందును శ్రీమద్రామాయణమునందలి కథాభాగము మార్పఁబడినది. మూలాతిరిక్త మగుస్థలముల యందును, నూతనముగఁ జేర్చిన యుపాఖ్యానములవిషయమునను దా మెచ్చటినుండి వానినిఁ గైకొనిరో యేల మార్పు గావింపఁబడినదో శ్రీశాస్త్రిగారు దెలిపియుండినచో బాగుగనుండును. సీతాకళ్యాణఘట్టమునందలి చిత్రలేఖనవృత్తాంతము వాల్మీకిగ్రంథమునఁ గానరాదు. ప్రతియాంధ్రుఁడు నీగ్రంథమునుఁ జదివి యందలిరసమును గ్రోలి యానందింపవలయును. ముద్రణస్ఖాలిత్యములు పెక్కులు గలవు. ముందుభాగములనైన నిర్దుష్టముగఁ బ్రకటింతురు గాక.

ఈకళ్యాణకాండమును శ్రీశాస్త్రిగారు, మండలప్రధానవైద్యాధికారమునుండి విశ్రాంతిని గైకొని కాకినాడలోనున్న మ. రా. శ్రీ ఉంగరాల సీతారామస్వామినాయుఁడుగారికి వారికుమారుని కళ్యాణసందర్భమునఁ గృతినొసంగిరి.

వెల రు 1-0-0 గ్రంథకర్తగారియొద్ద దొరకును.

---

(2) చిత్తోడుపతనము:—శ్రీ కోటమర్తి చినరఘుపతిరావుగారిచే రచియింపఁబడి సరస్వతీగ్రంథమాలయందు 38 వ కుసుమముగఁ బ్రకటింపఁబడినది. గ్రంథకర్తగారిదివఱలో-ప్రతాపసింహ, సుయోధనవిజయము, మున్నగునాటకములు రచించియున్నవారు. ఈనాటకము రాజస్థానమున సుప్రసిద్ధమగు చిత్తోడుదుర్గపతనమును గూర్చి వ్రాయఁబడినది. విషాదాంతము. వీరరసప్రధానము. చిత్తూరు రాణా యగు నుదయసింహుఁడు పలాయితుఁ డగుటచే ఖేల్వాసంస్థానాధీశ్వరుఁ డగు పుట్టాసింహుఁడు చిత్తూరు దుర్గమునుఁ జేరి యక్బరుతో యుద్ధమొనర్చి నిహతుఁడగును. ఈనాటకము రసపుత్రశౌర్యము నుట్టిపడఁజేయు సంభాషణములతోడను గూడియున్నది. మీరాబాయి తనపుత్రుఁడగు పుట్టాసింహు నెగతాళి యొనర్చిన వాక్యములు (అంక. ౧ రంగ. ౨) లకు దగిన కారణము గానరాదు. హద్దును మీఱినవి.

గ్రంథకర్తగారీనాటకమును సమవాకార మని (సమవకార మని కూఁడ గలదు.) వ్రాసియున్నారు. వీరరసప్రధానమగుటచే నట్లు వ్రాసియుందురు. మిగిలిన లక్షణములు సరిపడవు. రసపుత్రవీరుల దేశభక్తియు, వారిదేశారాధనదీక్షయును, నద్భుతముగ వర్ణింపఁబడినవి-భర్తృసందర్శనమును బడయకయే వివాహ మయినది మొదలు చిత్తోడుదుర్గరక్షణ మొనర్చిన రాణాబాయి వృత్తాంతము స్మరణీయము. పుత్రుని చిత్తోడుదుర్గరక్షణమునకుఁ బురికొల్పి తాను స్వయముగ యుద్ధ మొనర్పనేగిన మీరాబాయియును, వృద్ధురాలయ్యును గృపాణమునుఁ జేఁబూనిన రాణీకర్ణావతీదేవియును ప్రశంసాపాత్రములు- ఈముట్టడియందు మొగలుసార్వభౌముఁ డగు నక్బరు పుట్టాసింహునియొక్కయు, జయమల్లునియొక్కయు శౌర్యసాహసముల మెచ్చుకొనెననియు, యుద్ధానంతరము వీరి శిలావిగ్రహములు దుర్గద్వారమున నిరువైపుల నాతని చేఁ జేర్పఁబడెననియు రాజస్థానచరితమును వ్రాసిన టాడ్ (Tod) గారు వ్రాసియున్నారు. దీనివెల రు 0—12—0.

---

(3) క్షత్రియకులగోత్రప్రకాశిక—బ్ర॥ దువ్వూరి జగన్నాథశర్మగారిచేఁ బ్రకాశితము. ఇం దష్టావింశోత్తరశతక్షత్రియరత్నమాల- శ్రీమాన్ మహామహోపాధ్యాయ పరవస్తు వేంకటరంగాచార్యులయ్యవార్లంగారు రచించిన సీసమాలిక గలదు. 128 క్షత్రియుల యింటిపేరులీయఁబడినవి. క్షత్రియచారిత్రికసారస్వతము, అచ్చిరాజుగారికథ, క్షత్రియాన్వయమంజూష మొదలగునవికలవు. ఈ గ్రంథములో శర్మగారు వారే యే గోత్రములకుఁజేరినయింటిపేర్లవా రెవ్వ రెవ్వరో లిఖించియున్నారు. వీరిలో 17 ఇంటిపేర్లవారికి సారస్వతపవిత్రము గలదని బహుగ్రంథములను బరిశీలించి యెవ్వ రెవ్వ రేయే గ్రంథములలో నభివర్ణింపఁబడిరో యాయాగ్రంథముల నింపఁదెల్పిరి. కొందఱు సారస్వతసంబంధము లేమింజేసి పితృపితామహులను గోత్రములను మఱచినవా రున్నా రని తెలుపుచున్నారు. క్షత్రియాన్వయ మంజూషయు నొక్క సీసమాలికయే. కవియెవ్వరోగాని, క్షత్రియుల కీపుస్తకము చాలవఱకు నుపకరించును. వెల యెనిమిదణాలు. విజయనగరములో గ్రంథకర్తగారియొద్ద దొరకును.

---

(4) శ్రీభక్తమందారశతకము—కూచిమంచి జగన్నాథ(జగ్గ)కవిరచియించినది. ఈ జగ్గకవిగారు తిమ్మకవిగారి తమ్ముఁడే. ఆంధ్రలోకము వీరినిరువుర నెఱుంగకుండదు. ఈకవిరచియించిన సుభద్రాపరిణయము, చంద్రరేఖావిలాపమును లోక మెఱుఁగును. సోమదేవరాజీయమును రచియించిన దీయనయే కాని చాలమంది యెఱుఁగరు. రాధాకృష్ణద్విపదయు, జానకీపరిణయమును, వెలువడలేదు. ఈభక్తమందారశతకమును గవిసంశస్థులలోఁ గవి కించుమించెనిమిదితరములక్రిందివారగు శ్రీరామమూర్తిగారు ప్రకటించిరి. ఈకవి తనకు "రంగత్తిమ్మ భూమండలేశ్వరవర్యాదృతబేబదల్ బిరుదము"గలదని కడపటి 101 పద్యములోఁ దెల్పియున్నాఁడు. జగ్గకవికాలము 1700-1760 అని కవులచరిత్రము తేల్చినది. పెద్దాపురము సంస్థాన చరిత్రము 1714-1734 అని వ్రాయుచున్నది. ఈ శతకములోని కొన్ని పద్యములు పూర్వుల శ్లోకములకును బద్యములకును రూపాంతరములు. మచ్చు-

మ. సిరులెంతేనియు నిక్కువం బనుచు దుశ్శీలు ర్మది న్నమ్మి ని
ర్భరగర్వంబున మీఁదుచూతు రహహా భావంబులో నెంచినం
గరికర్ణాంతము లంబుబుద్బుదతతుల్ ఖద్యోతకీటప్రభల్
మరుదగ్రార్పితదీపమాలికలు రామా భక్తమందారమా.

ఈ శ్రీరామమూర్తిగారే యిపు డముద్రితాంధ్రగీర్వాణగ్రంథమాలను స్థాపించిరి. ఆగ్రంథమాలలో నిది మొదటిది. వెల 0-4-0 పెద్దాపురము తా॥ గెద్దనాపల్లిలో దొరకును.

# ద్వ్యర్థి త్ర్యర్థి కావ్యములు.

[23 సంపుటము 5 సంచిక శేషము.]

యీయాయూణ్ణి వేంకటవీరరాఘవాచార్యులుగారు, ఎం. ఏ.

"శ్లో. చతుర్ముఖః శ్రీపతిచన్ద్రశేఖరా షడాననో దాశరథి ర్హలాయుధః
భృగ్వాత్మజః శ్రీతనుజాజ జాహ్నవీసుతా దర్శైతే క్రమశోఽత్రవర్ణితాః."

ఈబహుళార్థకకావ్యముల క్లిష్టత్వము శ్రవ్యకావ్యములలో నేకాక, దృశ్యకావ్యములలోఁ గూడ వ్యాపించినది. బహుళార్థకనాటకముగూడ నొకటి కలదని తెలియుచున్నది.[10]

ప్రదర్శింపవలసిన నాటకములలోఁ గూడ నిట్టికావ్యముల క్లిష్టత్వము వ్యాపించుట శోచనీయమే యైనను, ఇట్టిద్వ్యర్థినాటకమును రచించిన కవిప్రజ్ఞను గొందఱు ప్రశంసించుచున్నారు. ఇట్టి ద్వ్యర్థినాటకమును శ్రవ్యదృశ్యకావ్య మనవచ్చును. ప్రదర్శించుట కననుకూలమై ప్రౌఢకావ్యములకంటెఁ బ్రౌఢతరమైన భట్టమురారి "యనర్ఘరాఘవము"నే, కొందఱు కావ్యనాటక మని నిరసించుచుండఁ, బైద్వ్యర్థినాటకముం గూర్చి చెప్పవలసినదేమి ?

—: విలోమకావ్యములు. :—

ఇట విలోమకావ్యములం గూర్చి కూడ నించుక చెప్పవలసి యున్నది.[11] విలోమకావ్యముల ద్వ్యర్థికావ్యము లనియు ననవచ్చును. కాని సామాన్యద్వ్యర్థి

10. 'A modern Skt. drama constructed on a similar principle' has been alluded to in Scherman's "Orientalishe Bibliographie," Vol. IX. 1896; P. 258; No. 460.] Vide Macdonell's 'History of Skt. Lit.' P. 447.

11. పాశ్చాత్యసారస్వతములలోఁ గూడ బంధకవిత విలోమకవితలు కానవచ్చెడిని: 'బెరిడేల్ కీత్' పండితుఁ డిట్లు వ్రాయుచున్నాఁడు.

"No doubt, we hear in the Alexandrian age, as in later Roman poetry (Cf. Martial II. 86.) of such things as Sotadean verses to be read backwards, of Simmias making poems, technopaignia, in the form of an axe, or a nightingale's egg, of Dosiadas's similar feat with an altar and so on. It may be that these tricks arose from the practice of writng inscriptions on swords and leaves." [H. Skt. Lit., P. 127]

The same scholar writes again on P. 139 of the same book "L. H. Gray has noted a western parallel in the elegy of Leon of Medina on his teacher Moses Bassola, which can be read either as Italian or as Hebrew,"

కావ్యములకంటె నిందు విలోమనియమ మొక్కటి విశేషముగా నున్నది. విలోమ కావ్యములు 'గత ప్రత్యాగతకావ్యము' లనియుఁ 'బ్రతిలోమకావ్యము' లనియు ననఁబడును. [ఉదా: వేంకటాధ్వరి 'యాదవరాఘవీయము.']

I 'కోసల-భోసలీయము[12]'—శేషాచలపతి (17 వ శతాబ్ది.)

ఇం దాఱుసర్గములలో-తంజావూరుమహారాష్ట్రప్రభు వగు 'సహాజీ' [క్రీ. శ. 1618-1711] రాజ్యపాలనవృత్తాంతమును, రామాయణకథయును వర్ణింపఁబడినవి. ఈకావ్యము తరువాత వివరింపఁబడు సంధ్యాకరనందికృత 'రామచరితము'ను, అనంతసూరికృత 'హరిశ్చంద్రోదయము'ను దలపించుచున్నది.

II ద్విసంధానము: ఆచార్యదండి [6 వ శతాబ్ది.]

భోజుఁడు 'శృంగారప్రకాశము'లో [IX దోషహానగుణప్రకాశము] దండిదియో, ధనంజయునిదియో 'ద్విసంధానము'ను బేర్కొని, యొకశ్లోకము నుదాహరించెను.[13] "దండినో ధనఞ్జయస్య వా ద్విసన్ధానమ్:

"శ్లో. ఉదారమహిమారామః ప్రజానాం హర్షవర్ధనః
ధర్మప్రభవ ఇత్యాసీత్ ఖ్యాతో భరతపూర్వజః."

ఈశ్లోకము ధనంజయుని 'ద్విసన్ధానము'లోఁ గానరాదు. కావున నిది లుప్తప్రాయ మనఁదగు దండికృతిలోని దనియు, నీశ్లోకమునుబట్టి యీకావ్యమునందలి యితివృత్తము రాఘవపాండవీయకథయే యనియు నూహింపఁదగును.

III ద్విసంధానము:[14] నైఘంటుకధనంజయుఁడు.

భోజునిచేఁ బేర్కొనఁబడుటచే నీతఁడు భోజునికంటెఁ [క్రీ. శ. 1005-1062] బ్రాచీనుఁడు. ముంజుని [క్రీ. శ. 975-95] సభ నలంకరించిన దశరూపకధనంజయుఁడు బ్రాహ్మణుఁడు, విష్ణుకుమారుఁడు. నైఘంటుకధనంజయుఁ డన్ననో జైనుఁడు, శ్రీదేవీవాసుదేవులపుత్త్రుఁడు;[15] కావున దశరూపకధనంజయునికంటె భిన్నుఁడు. ఇతఁడు క్రీ. శ. 750-800 నడుమ విలసిల్లియుండె ననుటకు హేతువులను గొంతకాలము క్రిందట మఱియొక పత్త్రికలోఁ బ్రచురించిన నావ్యాసమునఁ జూపి

12. Tanjore Catalogue—Vol. VII. 3275.

13. శ్రీ అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రిగారి 'ఆంధ్రకావ్యాదర్శనము'నకు- పండిత మానవల్లి రామకృష్ణకవిగారి పీఠిక.

14. కావ్యమాల, 49 సంఖ్య. 1895. బొంబాయి.

15. చూ. XVIII సర్గ.146 శ్లో.

యున్నాఁడను.[16] కాని నాఁటినాయభిప్రాయమును బిమ్మట సవరించుకొనియున్నాఁడను. కాశీనాథ బాపూ పాఠకపండితుఁడు[17] కన్నడములోని కొన్ని శాసనములు, గ్రంథములలోని ప్రమాణములంబట్టి యీతనికి శ్రుతకీర్తియను నుపనామము గలదనియు నీతఁడు క్రీ. శ. 1123-40 నడుమ 'ద్విసంధానమహాకావ్యము'ను రచించి యుండుననియు వ్రాసియున్నాఁడు. ఈయభిప్రాయములనే 'వింటర్‌నిట్జ్'[18] పండితుఁడును, 'కీత్'[19] పండితుఁడును దమతమ వాఙ్మయచరిత్రములలోఁ గ్రోడీకరించుకొనియున్నారు. 'డఫ్' పండితుఁడు కూడ నీధనంజయుఁడును శ్రుతకీర్తిత్రైవిద్యుఁడు నభిన్ను లనియు, ధనంజయుఁడు క్రీ. శ. 1130 సం॥ర ప్రాంతముల జీవించియుండెననియు వ్రాసియున్నాఁడు.[20] కాని యీవాదముల నన్నిటిని ఖండించి, ఆచార్య ఏ. వేంకటసుబ్బయ్యగారు, ధనంజయుఁడును శ్రుతకీర్తియు భిన్ను లనియును, ధనంజయుఁడు, క్రీ. శ. 960-1000 నడుమ 'ద్విసంధానము'ను రచించియుండు ననియు, శ్రుతకీర్తి త్రైవిద్యుఁడు గతప్రత్యాగతపద్ధతి నొక 'రాఘవపాండవీయము'ను రచించెననియు వ్రాసియున్నారు.[21] ధనంజయుని కాలమును గూర్చి వీరివాదము సమంజసముగానే చూపట్టుచున్నది; ఏల యన, క్రీ. శ. 1005 సంవత్సరమున సింహాసనము నెక్కి క్రీ. శ. 1054 ప్రాంతములనో, లేక ('కీత్' పండితుని యభిప్రాయము ననుసరించి) క్రీ. శ. 1062 లోనో స్వర్గస్థుఁడైన భోజుఁ డీధనంజయుని బేర్కొనియున్నాఁడు: భోజుని కాలముననే [అనఁగా క్రీ. శ. 1005-1054] ధనంజయుఁడును నాతని 'ద్విసంధానము'ను బ్రసిద్ధినంది యుండవలయును. కావున ధనంజయునికాలమును గూర్చి భిన్నమార్గముల ననుసరించి పడసిన వేంకటసుబ్బయ్యగారి నిర్ణయమును నానిర్ణయమును సరిపోవుచున్నవి. కవిరాజసూరి ధనంజయుల పౌర్వాపర్యవిషయము గూడ వివాదగ్రస్తమైయే యున్నది. ఈవివాదము తరువాత వ్రాయఁబోవు కవిరాజసూరిచరిత్రభాగమునఁ గనఁదగును. ఈతని 'ద్విసంధానము'నకు

---

16. 'Journal of the Andhra Historical :Rasearch Society'—Vol. II. Parts 3 and 4; Pp. 181-84.

17. Dr. K. B. Pathak: 'J. B. B. R. A. S.'—XXI. 1 ff.

18. Dr. M. Winternitz: 'History of-Indian Literature (In German)-Vol. III. P. 75.

19. Dr. A. B. keith: 'A History of Sanskrit Literature'- P. 137. (1928)

20. M. Duff: 'Chronology of India.'

21. Dr. A. Venkata Subbiah, (M. A., B. L., Ph. D.,): 'J. B. B. R. A. S.'-(New Series)- Vol. III. pp. 134-47.—(1927.)

'రాఘవపాండవీయ' మని నామాంతరము గలదు. ఇందు 18 సర్గములును, 1105 శ్లోకములును గలవు. ఇతనికవితాసరణి కర్కశముగా నున్నను ధారావాహికము గానే యుండును. సామాన్యముగాఁ బ్రతిశ్లోకమునందును- శబ్దాలంకారమో, అర్థాలంకారమో, చిత్రకవితయో, ఏదియో-యొకవిశేషము గానవచ్చుచుండును. లోకోక్తులవంటి సూక్తులును, అర్థాంతరన్యాసములును బ్రచురముగా నిందు గోచరించును. త్ర్యర్థక, చతురర్థక, షడ్ర్థకశ్లోకములును బంధకవితయు, నేకాక్షర, ద్వ్యక్షర, నిరోష్ఠ్య, గతప్రత్యాగతాదినియమములతోఁగూడిన శ్లోకములు నీకావ్యమునఁ గలవు. కాళిదాసకవి తనకవితాప్రజ్ఞను మేధాసంపదను బాగుగా గుర్తించినట్లు కానరాదు. కాని తమధిషణాపాటవమును, పాండితీప్రౌఢిని, కవితాప్రాశస్త్యమును గుర్తించిన భవభూతి, బిల్హణుఁడు, భట్టమురారి, వేదాంతదేశికులు, జగన్నాథపండితరాయలు, వేంకటాధ్వరికవులవలె ధనంజయుఁడును దనప్రజ్ఞను దాను గుర్తెఱిఁగియున్నాఁడు. వాల్మీకి, వ్యాసుఁడు, దండి-ఈముగ్గురే ధనంజయునిమతమునఁ గవిశబ్దమునకుఁ దగినవారు. వ్యాసవాల్మీకులప్రజ్ఞ తనలో మూర్తీభవించిన దని యీతనిదృఢవిశ్వాసము. అకలంకుని 'న్యాయశాస్త్రము,' పూజ్యపాదుని (దేవనంది) 'వ్యాకరణము'ను దన 'ద్విసంధానము'ను నపశ్చిమమును, నిరుపమము నగు'రత్నత్రయ మ'ని యీతనిమతము.[22] ఆనందవర్ధనుని, రత్నాకరుని ధనంజయుఁడు ప్రశంసించినట్లును, సోమదేవుఁడును, జల్హణుఁడును ధనంజయుని స్తోత్రము చేసినట్లును- డాక్టర్ మాడభూషి కృష్ణమాచార్యులవారు[23] ప్రకృతము ముద్రణములోనున్న తమ 'సంస్కృతవాఙ్మయచరిత్ర'ములో వ్రాసియున్నారు. వర్ధమానుఁడు (క్రీ. శ. 1140)—'గణరత్నమహోదధి'లో ధనంజయుని 'రాఘవపాండవీయము'ను బ్రమాణీకరించుకొని యున్నాఁడు. కొందఱు సంస్కృతకవులు తమకావ్యముల కాద్యంతములనుఁ గాని, యంతమునఁ గాని యొకానొకపదమును జిహ్నముగా నుంచుకొనుట యాచారముగాఁ జూపట్టుచున్నది. ఇట్లు తమపేరును గాని, యందలి తొలియక్షరములఁ గాని, తమకాశ్రయుఁడైన ప్రభువుపేరు

---

22. "శ్లో. ప్రమాణ మకలఙ్కస్య పూజ్యపాదస్య లక్షణమ్
ద్విసన్ధానకవేః కావ్యం రత్నత్రయ మపశ్చిమమ్.' ధనంజయనిఘంటువు. II. స.

23. Dr. M. Krishnamacharya, (M. A., M. L., Ph. D.,): 'A History of the Classical Period of Sanskrit Literature'-II Revised & Improved edition-now in print,

గాని, లక్ష్మీపర్యాయపదములను గాని, యిట్లనేకవిధములుగాఁ గావ్యచిహ్నముల ననుబంధించుచుండిరి. ఉదాహరణము.

1. అగస్త్యుఁడు- 'నలకీర్తికౌముది'- లక్ష్మీశబ్దాంకము.
2. అభయదేవుఁడు- 'జయంతవిజయము'— 'శ్రీ'
3. అరుణగిరినాథుఁడు- (డిండిమకవిసార్వభౌముఁడు) } 'డిమము'— 'రామ'
4. 'అవంతిసుందరీకథాసారము'— 'ఆనంద'
5. కవిరాజసూరి- 'రాఘవపాండవీయము'— 'కామదేవ'
6. కృష్ణలీలాశుకుఁడు- 'శ్రీచిహ్నకావ్యము'— 'శ్రీ'
(లేక గోవిందాభిషేకము-
గోపికాభిషేకము.)
7. జినరత్నసూరి- 'నిర్వాణలీలావతి'— 'జిన'
8. త్రివిక్రమకవి- 'నలచంపువు'— 'హరిచరణసరోజ'
9. ధనంజయుఁడు- 'ద్విసంధానము'— 'ధనంజయ'
10. పంచశిఖకవి- 'శూద్రకకథ'— 'ఆనంద'
11. ప్రవరసేనుఁడు- 'సేతుబంధము'— 'అనురాగ'
12. భారవి- 'కిరాతార్జునీయము'— 'శ్రీ' శబ్దాది, 'లక్ష్మీ' శబ్దాంతము.
13. మంఖుఁడు- 'శ్రీకంఠచరితము'— 'కర్ణకార'
14. మాఘుఁడు- 'శిశుపాలవధ'— 'శ్రీః' శబ్దాది, 'శ్రీ' శబ్దాంతము.
15. రత్నాకరుఁడు- 'హరవిజయము'— 'రత్న'
16. విజ్జిక (విజయాంక)— ? — 'విజయ'
17. విద్యామాధవకవి- 'పార్వతీరుక్మిణీయము' 'శ్రీ' శబ్దాది; 'సంపదానంద' చిహ్నము.
18. సోఢలుఁడు- 'ఉదయసుందరీకథ'— 'సారస్వతశ్రీ'
19. శ్రీహర్షుఁడు- 'నైషధీయచరితము'— 'ఆనంద'

ధనంజయుని యితర కృతులలో రెండుసర్గములు గల 'నామమాల'[24] లేక 'ధనంజయనిఘంటువు' అను నొకకోశము లభించుచున్నది. 'ద్విసంధానము'నకు

24. వావిళ్ళవారిచే మద్రాసులోఁ దెలుఁగుటీకతోడను పదసూచికతోడను ముద్రితము, బొంబాయిలోఁ గూడ నిది ముద్రింపఁబడె నఁట.

వినయచంద్రాంతేవాసి యగునేమిచంద్రుఁడు రచించిన 'ఘటకౌముది' యనుప్రాచీన టీక యొకటి కలదు. ఇది విపులముగా నుండుటచే నిందలిసారమును సంగ్రహించి జయపురమహారాజసంస్కృతపాఠశాలలోఁ బండితుఁడగు దాధీచకుద్దాలోపనామక బదరీనాథపండితుఁడు 'కావ్యమాల' లో నీకావ్యమును వ్యాఖ్యతోఁ బ్రచురించియున్నాఁడు.

IV 'పార్వతీరుక్మిణీయము'[25] విద్యామాధవకవి. (12 వ శతాబ్ది).

ఈవిద్వత్కవి కన్నడదేశములోని గుణవతిగ్రామవాసి; నారాయణసూరికిఁ గుమారుఁడు. చాళుక్యరాజవంశమునందలి సోమేశ్వరున కాశ్రితుఁడు. ఈప్రభువునకు 'భూలోకమల్ల, సర్వజ్ఞ' బిరుదములు గల వనియును, నీతఁడు శతాధ్యాయములు గల 'మానసోల్లాసము' [లేక -'అభిలషితార్థచింతామణి'] అను బృహద్గ్రంథమును రచించె ననియు, నీతఁడు క్రీ. శ. 1126-1138 ప్రాంతముల విలసిల్లిన తృతీయసోమేశ్వరుఁడే యనియు, డాక్టర్, కృష్ణమాచార్యులవారు తమ 'సంస్కృత వాఙ్మయచరిత్ర'ములో వ్రాసియున్నారు. కాని యిది సమంజసముగాఁ జూపట్టదు. విద్యామాధవకవి తాను రచియించిన 'విద్యామాధవీయ'[26]మను భారవివ్యాఖ్యలో ననేకగ్రంథములను, దత్కర్తలను బ్రమాణీకరించుకొని యున్నాఁడు. ఈగ్రంథములలో నిక్కిలి నవీనము వరదరాజపండితుని 'తార్కికరక్ష'.[27] ఇది క్రీ. శ. 1150 ప్రాంతముల రచియింపఁబడెను. కావున విద్యామాధవుఁడు క్రీ. శ. 1150 కంటెఁ బ్రాక్తనుఁడు కాఁజాలఁడు. అందువలనఁ గ్రీ. శ. 1182-89 వఱకురాజ్యపాలనమొనరించిన నాల్గవసోమేశ్వరుఁడే యీతని కాశ్రయుఁ డని చెప్పఁదగును. చాళుక్య ప్రభువులకుఁ గులదైవము విష్ణువు. కాని యీప్రభువులకు శైవ, జైన, బౌద్ధాది మతములపై ద్వేషభావ మెంతమాత్రమును లేదు. అందువలననే శైవమతస్థుఁ డగువిద్యామాధవకవి యీప్రభువున కాశ్రితుఁడుగా నుండఁగల్గెను.

ఈకవికృతులుమూఁడు—1. పార్వతీరుక్మిణీయము[28] 2. భారవికృతమగు 'కిరాతార్జునీయము'నకు వ్యాఖ్య 3. ముహూర్తదర్పణము.[29]

25. 'Descriptive Catalogue of Sanskrit MSS'(Madras O. MSS. Library) Vol. XX. No. 11606.

26. 'D. C. S. MSS.'- Vol. XX. No. 7778; Now in course of publication along with another commentary by Devarajayajvan- in the 'Calcutta Oriental Journal'—Vols. I & II.

27. 'కలకత్తా ప్రాచ్యసాహిత్యపత్రిక, లోఁ బ్రకటింపఁబడినప్రతి, 59 పుట.

28. 'D. C. S. MSS.'—Vol. XX. No. 11606.

29. ముద్రితము. [Bibliotheca Sanskrita. No. 63].

పార్వతీరుక్మిణీయము:—ఇందు 9 సర్గములు గలవు. దీనినామమును బట్టియే యిందు శివపార్వతీపరిణయమును, శ్రీకృష్ణరుక్మిణీవివాహమును వర్ణింపఁబడినట్లు తెలియుచున్నది. కవియే యీకావ్యమునుగూర్చి 'శ్రీశబ్దాదిః సంపదానందచిహ్నమ్మ'ని[30] వ్రాసికొని యున్నాఁడు. సుబంధుఁడు, భట్టబాణుఁడు, కవిరాజును మాత్రమే వక్రోక్తిమార్గనిపుణు లని కవిరాజు[31] చెప్పుకొని యుండఁగా విద్యామాధవుఁ డీకవిత్రయమునకుఁ దననామమును గూడఁ జేర్చి యీనలుగురే పుడమియందు వక్రోక్తిప్రచుర మగు కవితానిర్మాణమునందు దక్షు లనియు, నింకనైదవవాఁడు లేనేలేఁ డనియుఁ జెప్పుకొనియున్నాఁడు.[32] కవిరాజు మొదలగు కొందఱు కవులవలె నీతఁడును దనకవితాప్రజ్ఞయం దధికవిశ్వాసము గలవాఁడు. కవిరాజును నీతఁడును సమకాలికులై, కవిరాజుకంటె నీతఁ డించుక చిన్నవాఁడు కానోపు. ఇతఁడు వేదములను, సకలశాస్త్రములను వ్యాసంగముచేసినమహావిద్వాంసుఁడు. ఇతఁడు భారవిమొద లగు ననేకగ్రంథములకు వ్యాఖ్యలు నిర్మించినట్లు తెలియుచున్నది.

'విద్యామాధవీయము'- [భారవివ్యాఖ్య]:—ఈకవి శైవుఁ డగుటవలన, శివచరితసుధాపరిషిక్త మగుకిరాతార్జునీయమునకుఁ దాను వ్యాఖ్య నిర్మించుచుంటిని గాని, విద్యాభిమానమువలనఁ గాదని చెప్పుకొనియున్నాఁడు[33] ఈవ్యాఖ్యాప్రారంభమునను, 'పార్వతీరుక్మిణీయ' ప్రారంభమునను శివస్తుతినే యీతఁ డొనరిం

30. 'ఇత్థం నామ్నా పార్వతీరుక్మిణీయే హృద్యే విద్యామాధవీయేఽత్ర సర్గః
శ్రీశబ్దాదిః సంపదానన్దమూర్ధ్నా స్పష్టార్థోఽభూ దాదిమోఽయం సమాప్తః'
[ప్రథమసర్గాంతమున]
ఇహ సుమహతికావ్యే పార్వతీరుక్మిణీయే శుభమవసితరాజశ్రీ(త్) సంపదానన్దచిహ్నమ్
నవమ మనవమార్థం సర్గమాధత్త సశ్రీపదముఖ మితి విద్యామాధవః పండితేన్ద్రః'
[కావ్యాంతమున].

31. 'సుబన్ధు ర్బాణభట్టశ్చ కవిరాజ ఇతి త్రయః
వక్రోక్తిమార్గనిపుణా శ్చతుర్థో విద్యతే న వా'
[రాఘవపాండవీయము. I స. 41 శ్లో.]

32. 'బాణః సుబన్ధుః కవిరాజసంజ్ఞః విద్యామహోమాధవపండిత శ్చ
వక్రోక్తిదక్షాః కవయః పృథివ్యాం చత్వార ఏతే నహి పఞ్చమోఽస్తి.'
[D. C. S. MSS. Vol. XX. P. 7779.]—కృత్యాది.

33. 'దుర్వృత్తాకీర్తనోపాహితకలుషభరాం భారతీం భారవీయ
వ్యాఖ్యానవ్యాజతోఽహం శివచరితకథాపాథసాం పాయ(వ)యిష్యే
' ఇత్థం బుద్ధ్యా యతిష్యే విరచయితు మిద న్నైవ విద్యాభిమానాత్ **'

చెను.[34] భారవివ్యాఖ్యానములో నీతఁ డనేకకృతులను, గృతికర్తలను బేర్కొనియున్నాఁడు. అందుఁ బ్రధానములు-(1) భోజుఁడు. (2) 'సరస్వతీకంఠాభరణము.' (3) 'కావ్య ప్రకాశము' [1075-1100 క్రీ. శ.] వరదరాజకృత 'తార్కికరక్ష.'

V 'యాదవరాఘవీయము'[35]—నరహరికవి.

ఈకృతిని, దన్నిర్మాతను గుఱించిన వివరములు ప్రస్తుతము నాకేమియు లభింపలేదు. కాలాంతరమున నావివరములు ప్రకటింపఁబడును.

VI 'రాఘవనైషధీయము'[36]—హరదత్తసూరి.

ఇతఁడు గర్గగోత్రజుఁడు; జయశంకరునికుమారుఁడు;[37] కన్నడదేశమునందలి గుణవతీపట్టణసమీపమున నున్ననీలాలయగ్రామవాసి. పతంజలిమహాభాష్యము, ఛందస్సు, సాహిత్యాలంకారముల నీతఁడు చక్కనిపండితుఁడు.[38] ఈకావ్యమున రెండుసర్గములు, 148 శ్లోకములును గలవు. తన కావ్య మితరులకు దుర్బోధముగా నుండు నని కవియే దీనికి వ్యాఖ్య రచించియున్నాఁడు. ఈవ్యాఖ్యలో భట్టోజీదీక్షితుని [17 వ శతాబ్ది] 'సిద్ధాంతకౌముది'ని 'ప్రౌఢమనోరమ'ను నుదాహరించుకొనియెను;[39] మఱియు భట్టమల్ల, కేశవ, రామకృష్ణ, రభస, యాదవుల నిఘంటువులఁ బేర్కొనియున్నాఁడు. కావున నీతఁడు క్రీ. శ. 18 శతాబ్దిలో విలసిల్లియుండె ననఁదగును. గ్రంథనామమును బట్టియే యిందు రామచరిత్రయు, నలచరిత్రయు వర్ణింపఁబడినట్లు తెలియుచున్నది. 'సిద్ధాంతకౌముది' యం దుదాహరింపఁబడి, 'కాశికావృత్తి'కిఁ 'బదమంజరీవ్యాఖ్య' రచియించిన హరదత్తుఁడును, 'ఉజ్జ్వలా' [ఆపస్తంబీయవ్యాఖ్య] కారుఁ డగుహరదత్తుఁడును, 'మంత్రప్రశ్న భాష్యము'ను రచించిన హరదత్తుఁడును బ్రకృతగ్రంథకర్తకంటె భిన్నులు.

---

34. 'ఆద్యావానన్దినా నిత్య మాశ్లిష్టావిష్టదాయినా
దివ్యౌ తౌ ససుతౌ వన్దే దమ్పతీ జగతాంపతీ.
దేవో మే సగురుః కరోతు భగవా నిష్టార్థసిద్ధిం శివః.'—(భారవివ్యాఖ్యాపీఠిక.)
'జగత్త్రియం బిభ్ర దుపాత్తసత్త్వో వృషేణ గచ్ఛన్ సుఖబోధమూర్తిః
తనో దధానోఽనుపమశ్రియం తాం శివాం శివం వో విదధాతు దేవః.'
పార్వతీరుక్మిణీయపీఠిక.

35. మైసూరుప్రాచ్యలిఖితగ్రంథాలయపట్టిక, 253-5 పు.

36. కావ్యమాల, 57 సంఖ్య, ద్వితీయావృత్తి. 1926. బొంబాయి.

37. చూ. కావ్యాంతశ్లోకము.

38. చూ. II. స. 22 శ్లో.

39. చూ. 62 పుట.

బహుశాస్త్రవైదుష్యమే కాక యీ హరదత్తునకు వ్యాకరణశాస్త్రమునఁ గూలంకష మగుపాండిత్యము గలదు. రాజశేఖరుఁడు కావ్యమీమాంసయందు నుడివినట్లు కావ్యకవి, శాస్త్రకవులలో, హరదత్తుఁ డీరెండవతెగకుఁ జెందినవాఁ డనవచ్చును. అందువలన నీతనికృతి శబ్దశాస్త్రసంప్రదాయప్రచురమై బహుక్లిష్టముగా నుండును. కావ్యదృష్టిచే నీగ్రంథ మంత యుత్తమ మైనది కాకపోయినను వ్యాఖ్యానమునందు వ్యాకరణవిశేషములు, శాస్త్రీయసంప్రదాయములు మిక్కిలి సామర్థ్యముతోఁ జర్చింపఁబడియుండుటచే దీనిని నిరసింపఁదగదు. శబ్దశ్లేషప్రచుర మగునీకృతి, మాఘుని 'శిశుపాలవధము,' మురారి 'అనర్ఘరాఘవము'లవలెనే శబ్దశాస్త్రమున జితశ్రము లగువారికిఁ గాని సుగమముగా నుండదు.

VII. రాఘవపాండవీయము[1]—కవిరాజసూరి [2]

ఇతఁడు గౌతమగోత్రజుఁడు; తల్లి చంద్రముఖి, తండ్రి కీర్తినారాయణుఁడు, ఇతఁడు వనవాసిలో రాజ్యపాలన మొనరించిన కాదంబప్రభువులయొద్ద సేనానాయకుఁడు; ఇతనికుమారుఁ డగుకవిరాజు కాదంబవంశమునందలి వీరకామదేవుని యాస్థానకవీశ్వరుఁడు. ఈ వీరకామదేవుఁడు మహామండలేశ్వరుఁ డై, హాన్గల్లు, (Hangal), వనవాసి (Banavasi), పులిగేరి (Puligere) మండలములను బాలించెను. ఇతఁడు పశ్చిమచాళుక్యప్రభువులలోనివాఁడగు నాలుగవసోమేశ్వరునికి సామంతప్రభు వై, శకవత్సరము 1104 (క్రీ. శ. 1182-83) ప్రాంతములందు రాజ్యము నేలెను. హానగల్లునగరమును హొయిసాల ప్రభు వగురెండవవీరబల్లాలుఁడు ముట్టడించి, తుదకుఁ, గాదంబుల నోడించి వారిరాజ్యము నాక్రమించెను. పిమ్మట గాదంబులచరిత్ర తెలియవచ్చుటలేదు. కాదంబవంశమునకు మూలకంద మగుప్రభువు త్రినేత్రుఁ డనియు, నీతఁడు శివభక్తితత్పరుఁ డనియు, జయంతిపురమున నీతఁడు శివప్రతిష్ఠ నొనరించి, అహిచ్ఛత్రపురమునుండి- 32 గోత్రములవారిని- 12000 బ్రాహ్మణులను దీసికొనివచ్చి, వారికి స్థాణుగూఢపురాగ్రహారమున స్థిర

---

1. అ) కావ్యమాల- 62 సంఖ్య. (1897-బొంబాయి), శశధరునివ్యాఖ్యతో.
   ఆ) వ్యాఖ్యతో- గోపాలనారాయణకంపెనీ- బొంబాయి.
   ఇ) ప్రేమచంద్రతర్కవాగీశుని 'కపాటవిపాటికా' వ్యాఖ్యతో- కలకత్తా. 1885.
2. కవినిగురించిన వివరము లాతని 'పారిజాతహరణము'న లభించుచున్నవి.

వాస మేర్పఱిచె ననియు జనశ్రుతివలనఁ దెలియుచున్నది.[1] నేఁటికిని ఉత్తరకనరా జిల్లాకు జయంతీక్షేత్ర మని పేరున్నది; మధ్యదేశమునుండి బ్రాహ్మణాగమముఁ గవిరాజు పేర్కొనియున్నాఁడు. కావునఁ గవిరాజుచేఁ బ్రస్తుతింపఁబడిన కామదేవుఁడు వనవాసిలోఁ బాలించిన కాదంబవంశీయుఁడే యని నిర్ణయింపఁగూడును. దుర్గాసింహుఁడు(కన్నడకవి)తనపంచతంత్రము[2]లో ననేకసంస్కృతకవులను స్తుతించియున్నాఁడు; ఇందు మఱియొక 'రాఘవపాండవీయము' ను రచించిన జైనకవియగు ధనంజయుఁడు తక్కఁ దక్కినకవులందఱును బ్రాహ్మణులే. కవిరాజును, రాఘవపాండవీయమును దుర్గాసింహుఁ డెఱిఁగియున్నచో, నీతఁడు ధనంజయునకు బదులుగాఁ గవిరాజునే పేర్కొనియుండును. దుర్గాసింహుఁడు చాళుక్యరాజగు రెండవజగదేకమల్లుని [శక. 1061-1072]యొద్ద సాంధివిగ్రహికుఁడు; కావున మనకవిరాజు శక. 1072 సంవత్సరమునకంటె నర్వాచీనుఁడై యుండును. అందువలనఁ గవిరాజు [శక. 1104 ప్రాంతముల] క్రీ. శ. 12 వ శతాబ్దమునుత్తరార్ధమున జీవించియుండు నని నిర్ణయింపఁదగును.[3]

కవిరాజధనంజయుల పౌర్వాపర్యము:—కవిరాజుకృతిని జూచి యే ధనంజయుఁడు 'ద్విసంధానము'ను రచించె నని ఆచార్యభండార్కర్,[4] డాక్టర్ మెక్‌డానెల్[5] పండితులయభిప్రాయము; కాని పాఠకపండితుఁడు[6]ను, కీత్ పండితుఁడు[7]ను, వేంకటసుబ్బయ్యగారు[8]ను ధనంజయుని కావ్యమే ప్రాక్తన మని వ్రాసియున్నారు. ఇతరప్రమాణములమాట యటుండ- రాజశేఖరకవి కారోపింపఁబడి, జల్హణాదిసంగృహీత మగు 'సూక్తిముక్తావళి'లోను, 'సుభాషితహారావళి'లోను

---

1. 'ఆనేతా మధ్యదేశా త్ప్రవచనవిదుషాం సోమపాం బ్రాహ్మణానామ్' అని రాఘవపాండవీయమునఁ [ I స. 25 శ్లో.] గలదు. దీనినిబట్టి యిందఱబ్రాహ్మణులకు జీవనోపాధిని గల్పించుట యనుఘనకార్యము తనప్రభువగు కామదేవునకే యారోపించెను. ఒకవేళ, కామదేవుని పూర్వులే కాక, యితఁడును విప్రబృందమును మధ్యదేశమునుండి తీసికొనివచ్చి జీవనోపాధి కల్పించియుండవచ్చును.

2. కర్ణాటకకావ్యమంజరి- 6-7.

3. మొదటినుండియు నింతవఱకును, గవిరాజువృత్తాంతము కృష్ణమాచార్యులవారి 'సంస్కృతవాఙ్మయచరిత్ర'నుండి కైకొనఁబడినది.

4. Dr. R. G. Bhandarkar's 'Reports'- 1884-87, pp. 19 ff.
5. 'History of Sanskrit Literature.'
6. J. B. B. R. A. S. Vol. XXI-1 ff.
7. 'History of Sanskrit Literature', P. 137. (1928)
8. J. B. B. R. A. S. (New Series), Vol. III. pp. 134-47 (1927)

'శ్లో. ద్విసన్ధానే నిపుణతాం సతాం చక్రే ధనఞ్జయః
　　యయా జాతం ఫలం తస్య స తాం చక్రే ధనఞ్జయః.'

అని పొగడ్త నంది, లోకములో వాల్మీకి యవతరించుటతోడ 'కవి' యను నేకవచనశబ్దమును, వ్యాసునిపుట్టుకతో 'కవీ' అనుద్వివచనమును, దండిజననముతో 'కవయః' అను బహువచనమును బుట్టి, 'కవులు, కవులు' అను బహువచనము ధనంజయుఁ డవతరించుటతోడనే యాతనియందే రూఢమై యేకవచనముగా మాఱినదను నిట్టి ప్రశంస[1]కు నిశ్చయముగా నర్హుఁడనఁదగు ధనంజయుఁడే తనకంటెఁ బూర్వుఁడైనచోఁ గవిరాజు, సుబంధుబాణభట్టులను వక్రోక్తిమార్గనిపుణులనుగాఁ జెప్పెనినపుడు[2] ధనంజయు నేల చెప్పలేఁడు? అనుశంకకుఁ దగిన సమాధానము లభించుటలేదు. మఱియు ధనంజయుఁడు కవిరాజుకంటెఁ బ్రాచీనుఁడే యగుచో బాణసుబంధుకవిరాజులును, దానును వక్రోక్తిదక్షు లగుకవీశ్వరు లనియు, జగతియం దిఁక వక్రోక్తిమార్గనిపుణులు లే రనియు నేల విద్యామాధవకవి నొక్కి వక్కాణించియుండును ?[3]

'రాఘవపాండవీయము'న 13 సర్గములును, 668 శ్లోకములును గలవు. ఈకావ్యముంగూర్చిన మావిపులసమాలోచనము కొంతకాలముక్రిందట నీపత్త్రికలోనే ముద్రింపఁబడినది.[4] కావున దాని నటఁ జూడఁదగును. ఈకావ్యమున కెనిమిదివ్యాఖ్యానములు గలవు:—1. లక్ష్మణపండితుఁడు. 2. రామభద్రుఁడు. 3. శశధరుఁడు.[5] 4 ప్రేమచంద్రతర్కవాగీశుఁడు.[6] 5. చారిత్రవర్ధనుఁడు. 6. పద్మనంది. 7. పుష్పదంతుఁడు. 8. విశ్వనాథుఁడు- అనువారు రచించిరి.

కవిరాజు ప్రారంభకవితలోనిది కావలయుఁ, 'పారిజాతహరణము'[7] అను

---

1. 'జాతే జగతి వాల్మీకౌ శబ్దః కవి రితి స్మృతః
　కవీ ఇతి తతో వ్యాసే కవయ శ్చేతి దణ్డిని
　కవయః కవయ శ్చేతి బహుత్వం దూరమాగతమ్
　వినివృత్తం చిరా దేత త్కలౌ జాతే ధనఞ్జయే'—ధనంజయనిఘంటువు. II స. 49-50
2. రాఘవపాండవీయము. I స. 41 శ్లో.
3. పార్వతీరుక్మిణీయమునఁ గృత్యాదియందలి 'బాణః సుబన్ధుః' అనుపూర్వోద్ధృతశ్లోకము.
4. ఆం. సా. ప. ప. XVII సం. 2, 3. సంచికలు.
5. నిర్ణయసాగరప్రచురణమున (కావ్యమాల) ముద్రితము.
6. కలకత్తానగరమున- సంస్కృతముద్రాలయమున ముద్రితము.
7. 'A Trienniel Catalogue of MSS.' 1919-'22-Vol.IV- part i-Sanskrit, A. Page 4295; R. No. 2961. Also 'Tanjore Catalogue'—Vol. IV. 4295.

10 సర్గముల యుత్తమకావ్య మొకటి లభించుచున్నది. ఇది తనజనకుఁ డగు కీర్తినారాయణుని ప్రీతికై రచింపఁబడినది. నందనోద్యానమునుండి శ్రీకృష్ణుఁడు పారిజాతమును దీసికొనివచ్చుటయను భాగవతప్రసిద్ధ మగుకథయే యీకావ్యమునందలి యితివృత్తము. శ్లేషాదిక్లిష్టనియమములు లేకపోవుటం జేసి కవిరాజుకవిత యిందత్యంతరమణీయముగా నున్నది. ఈకావ్యమును భోజుఁడు 'శృంగారప్రకాశము'న నుదాహరించుకొనియున్నట్లు మాడభూషి కృష్ణమాచార్యులువారిసంస్కృతవాఙ్మయచరితమువలనఁ దెలియుచున్నది. ప్రస్తుతము బెల్గాము అనఁబడు వనవాసిలో క్రీ. శ. 1120 సంవత్సర ప్రాంతముల రాజ్యముచేసిన కాదంబవంశీయుఁ డగుకీర్తినారాయణుని ప్రేరణచే నిది రచింపఁబడె నని చెన్నపురిప్రాచ్యలిఖితగ్రంథవివరణపట్టికలోనున్నది. ఈకీర్తినారాయణుఁడు కాదంబవంశీయప్రభువా ? లేక మనకవిజనకుఁడా? అనుసందేహములు పొడముచున్నవి. మఱియుఁ గవిరాజకృతములుగా—1. కవిరాజస్తుతి[1] (శ్రీకృష్ణస్తవము). 2.మృగయాచంపువు[2]: [గంజాముమండలములో నిదేమో] కేలతి(Kelati)పురమును బాలించిన విచిత్రవిక్రముఁ డనురాజుయొక్క వేఁట యిందు వర్ణింపఁబడినది. ఈకవిరాజు మనకవిరాజుకంటె భిన్నుఁడా, కాఁడా యనువిషయ మీకావ్యములు సమగ్రముగాఁ బరిశోధించినఁగాని తేలనివిషయము.

VIII. రామచరితము[3]—సంధ్యాకరనంది.

క్రీ. శ. 11 వ శతాబ్దమున వంగదేశమున రాజ్యపాలన మొనరించిన రామపాలునిచరిత్రను, శ్రీరామునిచరిత్రమును సంధానముచేసి యీకావ్యము రచింపఁబడెను. రాఘవపాండవీయమును జూచియే యీకవి రామచరితమును రచించి యుండె నని యీకావ్యమును సంపాదించి ప్రకటించిన మహామహోపాధ్యాయ, ఆచార్య-హరప్రసాదశాస్త్రిచరణులు వ్రాసియున్నారు. కవియే తనకావ్యమునకు వ్యాఖ్యను రచించియున్నాఁడు. ఈవ్యాఖ్య చారిత్రికదృష్టిని మిక్కిలి యుపయోగమైనది. రామపాలుని రాజ్యపాలనసమయమునందలి యైతిహాసికప్రధానము లగు ననేకవిషయము లిందుఁ గ్రోడీకరింపఁబడి యున్నవి.

IX. హరిశ్చంద్రోదయము[4]—జినదత్తసూరి.

ఇందు 20 సర్గములు కలవు. కవికాశ్రయుఁ డగుహరిశ్చంద్రుఁ డనురాజుచరి

1. A Tr. Cata. of MSS.- Vol. IV- part i- Sanskrit, A- Page 4815- R. No. 3241.
2. *Ibid*. P. 4783, R. No. 3218.
3- 'Memoirs of the Asiatic Society of Bengal'—Vol, III. pp 1-56.
4. Cata. of Skt. M S S. in Mysore & Coorg. 261.

త్రయుఁ, బురాణప్రసిద్ధి గలసత్యహరిశ్చంద్రునికథయుసీకావ్యమున జోడింపఁబడినవి.

X. ద్వ్యర్థినాటకము[1]—కవినామము గాని, యిందలియితివృత్తము గాని తెలియుటలేదు. నాటకనామముగూడఁ దెలియవచ్చుట లేదు.

—: త్ర్యర్థికావ్యములు. :—

XI. అబోధాకరము[2]—ఘనశ్యాముఁడు.[3]

ఇందు శ్రీకృష్ణ, నల, హరిశ్చంద్రులకథలు ముప్పిరిగొని యున్నవి. దీనికి వ్యాఖ్యకలదు. కవి బహుగ్రంథకర్త; అనేకగ్రంథములకు వ్యాఖ్య రచించినవాఁడు. ఇతఁడు మహారాష్ట్రబ్రాహ్మణుఁడు; చాండో [Chaundo or Chande ?] అని యీతనియుపనామము; మౌనభార్గవగోత్రము; బాలాజీకిఁ బౌత్త్రుఁడు; తల్లి కాశీదేవి, తండ్రి మహాదేవుఁడు; సుందరి, కమల, యని ఘనశ్యామున కిరువురు భార్యలు; వీరిరువురును విద్యావతులు, గ్రంథరచనమున భర్తకుఁ దోడ్పడుచుండెడివారు. ఈతఁడు 64 గ్రంథములు రచించెనఁట! శాకుంతలము, విద్ధసాలభంజిక, భోజచంపువు, భారతచంపువుల కీతఁడు రచించినవ్యాఖ్య లీతనియుత్తరరామచరితవ్యాఖ్యలోఁ బేర్కొనఁబడియున్నవి; ఛందోఽలఙ్కారములంగూర్చి యీతఁడనేకకృతులను రచించినట్లును, అందు 'ప్రచండరాహూదయదీపిక' యొకటి యనియు-ఉత్తరరామచరితవ్యాఖ్యాపీఠికవలనఁ దెలియుచున్నది. ఇతఁడు పరమశైవుఁడు; క్రీ. శ. 1828-35 వఱకు, తంజాపూరులో రాజ్యముచేసిన తుక్కాజీమహారాజునొద్ద నమాత్యుఁడుగా నుండెను.

XII. యాదవరాఘవపాండవీయము—అనంతాచార్యకవి.

ఇతఁడు మైసూరురాజ్యమునందలి యుదయేంద్రపురవాసి. పేరును బట్టియే యిందు భాగవత, రామాయణ, భారతములయందలి కథాసారము, ఒక్కకావ్యముగానే సంయోజింపఁబడినట్లు తెలియుచున్నది. ఇతనికిఁ ద్రివేణి యనుపుత్త్రిక యుండెడిది. ఈమె సంస్కృతమున నెన్నియో కావ్యములను రచించిన విదుషీమణియఁట!

XIII. రాఘవపాండవయాదవీయము[4]—చిదంబరసుమతి.

ఇతఁడు కౌశికగోత్రజుఁడు; సూర్యనారాయణపౌత్త్రుఁడు; తల్లి వేంక

---

1. Scherman's 'Orientalische Bibliographie'—Vol. IX. 1896, (P, 258; No. 4605).

2. Haraprasada Sastri's 'Reports'—Vol. III. x and 66.

3. చూ. పాండురంగవామనకాణేపండితునిపీఠిక- 31 పు. ఘనశ్యామునివ్యాఖ్యతో నుత్తరరామచరితము.

4. D. C. S. MSS. Vol. XX. 7829.

టాంబ; తండ్రి అనంతనారాయణుఁడు; శ్రీనివాసుఁ డీతనిసోదరుఁడు. విజయనగరమున రాజ్యముచేసిన మొదటివేంకటప్రభువు [క్రీ. శ. 1586-1614]న కాశ్రితుఁడై ముల్లాండ్రము గ్రామమున (Mullandrum) నివసించినట్లు తెలియుచున్నది. కవిజనకుఁ డగుననంతనారాయణపండితుఁడే యీకావ్యమునకు 'అర్థప్రదీపిక' యను వ్యాఖ్య వ్రాసియున్నాఁడు. ప్రతిశ్లోకమునకు మూఁడుకథలకు సరిపడునట్లుగా సువిపులమైన వ్యాఖ్య వ్రాయఁబడియున్నది.

ఇందు 3 సర్గములును, 155 శ్లోకములును గలవు. మహాకావ్యమునను౦డు వర్ణనము లన్నియు నిట్టిబహుళార్థకకావ్యములయం దుండవు; వీనియందు కేవలము ప్రధానకథాసంగ్రహమునకే ప్రాముఖ్య మొసంగఁబడును. ఇందలి యన్ని కథలకు సాధారణము లగుకొన్ని వర్ణనము లెడనెడ నుండును. ఈతనియితర కృతులు 1. భాగవతచంపువు:—పేరునుబట్టియే యిందు భాగవతకథ వర్ణింపఁబడినట్లు తెలియుచున్నది. 2. పంచకళ్యాణచంపువు:-ఇందు రామ, కృష్ణ, విష్ణు, శివ, సుబ్రహ్మణ్యుల వివాహములు వర్ణింపఁబడియున్నవి. దీనికిఁ గవియే యొకవ్యాఖ్యను రచించియున్నాఁడు.

XIV. రాఘవయాదవపాండవీయము—రాజచూడామణి.

[క్రీ. శ. 17 వ శతాబ్ది] విశ్వామిత్రగోత్రజుఁ డగునీరాజచూడామణిదీక్షితులు రత్నఖేటశ్రీనివాసదీక్షితునికిని గామాక్షికిని బుత్త్రుఁడు; అర్ధనారీశ్వరదీక్షితునికిశిష్యుఁడు,అనుజుఁడును. ఉపనయనమునకుఁ బూర్వమే యీతఁడు కావ్యనాటకాలంకారసాహిత్యముల దృఢవ్యుత్పత్తినంది, మనోహరకావ్యనిర్మాణదక్షుఁడాయెను. ఈతనిగ్రంథములు 24. తన్నిర్మితకావ్యదర్పణము నంతమునఁ జేర్పఁబడినవి. అందుముఖ్యములు:—1. శృంగారసర్వస్వభాణము. 2. భోజచంపూపూరకమగు యుద్ధకాండము. 3. భారతచంపువు. 4. రత్నఖేటవిజయము. 5. మంజుభాషిణి యనురామకథ. 6. కంసవధ. 7. రుక్మిణీపరిణయము. 8. కమలినీకలహంసనాటిక. 9. ఆనందరాఘవనాటకము. 10. అలంకారచూడామణి. 11. చిత్రమంజరి. 12. రాఘవయాదవపాండవీయము. మఱియు 13. రఘునాథభూపవిజయము-14. కాంతిమతీపరిణయము. 15. సాహిత్యసామ్రాజ్యము, అనునవి కూడ నీతని కృతు లని బాలయజ్ఞవేదేశ్వరుఁడు తనరుక్మిణీపరిణయవ్యాఖ్యారంభమునఁ జేర్చియున్నాఁడు. త్ర్యర్థకములును; మంజులములు నగుపదములతో నీతఁడు రామకృష్ణపాండవులకథను మనోహరముగారచియించినట్లు పండిత శ్రీ టి. యస్. కుప్పు

స్వామిశాస్త్రిగారు 'కమలినీకలహంసము'నకు వ్రాసినపీఠికలో నుడివియున్నారు.

—: బహుళార్థకకావ్యములు. :—

XV. నలయాదవపాండవరాఘవీయము—కవి ?

ఈ గ్రంథమును గూర్చినవివరములు ఆపర్టుపండితుఁడు (G. Oppert) ప్రచురించిన తాళపత్రగ్రంథవివరణపట్టిక (6595)లో నున్న వని గైక్వాడ్ ప్రాచ్యగ్రంథమాలలోఁ బ్రకటింపఁబడిన రామచంద్రసూరి'నలవిలాస'నాటకముయొక్కపీఠికలోఁ గలదు.

XVI. పంచకల్యాణచంపువు[1]—చిదంబరసుమతి.

ఈకావ్యమునుగుఱించి, తన్నిర్మాతనుగుఱించియు XIII పేరాలోఁ జూడఁదగును. ఇందు 2 స్తబకములు గలవు; కవియే 'శబ్దశాణోపల'మను వ్యాఖ్యను రచించెను.

XVII. సప్తసంధానమహాకావ్యము[2]— మేఘవిజయగని [క్రీ. శ.17వ శతాబ్ది]

ఇతఁడు జైనసన్న్యాసి, కృపావిజయుని శిష్యుఁడు, జైనగురుపరంపరలో హీరవిజయునికంటె నైదుతరములు నవీనుఁడు. ఇతనికిఁ గావ్యవ్యాకరణ న్యాయ జ్యోతిషములలో నత్యద్భుతపాండిత్యము గలదు. ఈశాఖలలో నీతఁడు రచించిన గ్రంథరాజము లనేకములు పండితామోదమును బడయుచున్నవి. ఇతని 'హైమకౌముది' యే భట్టోజీదీక్షితుని 'సిద్ధాంతకౌముది' కాదర్శగ్రంథ మని కొందఱు పండితులతలంపు. ఈ 'హైమకౌముది' క్రీ. శ. 1669లో రచియింపఁబడినది. ఇతని 'సప్తసంధానకావ్య' మీతఁ డెంతటిమహాకవియో తెలుపఁగలదు. అతిసరళ మగు భాషలో నిం దేడుకథలు సంధానింపఁబడి యున్నవి. ఇందు వృషభనాథుఁడు, శాంతినాథుఁడు, పార్శ్వనాథుఁడు, నేమినాథుఁడు, మహావీరుఁడు నను జైనతీర్థంకరులయొక్కయు, శ్రీకృష్ణ, బలదేవు(బలరాము)ల కథయు వర్ణింపఁబడినది. తొమ్మిదిసర్గములు గల యీకావ్యమున నేకథ లేడును మంజులపదగుంఫనముతో ధారావాహికముగా రచింపఁబడినవి. దీనినిబట్టి సంస్కృతభాషయొక్క యంతస్సారము విశద మగుచున్నది. హేమచంద్రుఁడు 'సప్తసంధాన'మను నొక కావ్యము రచించినట్లును, అది యుత్సన్న మైనట్లును జనశ్రుతి గలదు; ఈలోటును మేఘవిజయగని పూరించెను. ఇతని యితరకృతులు:—i. దేవనందాభ్యుదయము-[3] 7 సర్గములు.

---

1. Tanjore Catalogue. IV. 4257-8.
2. బొంబాయిలో హరగోవిందదాసు- దీనిని టీకతోఁ బ్రకటించెను.
Vide also 'Indian Antiquary'—VIII. 55.
3. 'యశోవిజయజైనగ్రంథమాల'లోఁ గొంతవఱకు ముద్రితము- భావానగరము.

క్రీ.శ. 1671సం॥న రచింపఁబడెను. ఇందు విజయదేవసూరిచరిత్ర వర్ణితము. ii. శాంతినాథచరితము: ఈరెండుకావ్యములయందును 'శిశుపాలవధ, నైషధీయచరితము' లలోని పాదములను సమస్యగాఁ గైకొని తనకవితానైపుణ్యమునువిశదీకరించెను. iii. దిగ్విజయమహాకావ్యము: 13 సర్గములలో విజయప్రభసూరిజీవితము వర్ణింపఁబడెను. iv. యుక్తిప్రబోధము: పరమతసిద్ధాంతఖండనాత్మక మగు నాధ్యాత్మిక నాటకము. (Allegorical drama) v. మేఘదూతసమస్యాలేఖ: ఇందుఁ గవి తనమతాచార్యుఁడగు విజయప్రభసూరియొద్దకు మేఘుని దూతగాఁ బంపుట వర్ణితము. ఇది క్రీ. శ. 1671 సం॥లోఁ బూర్తికావింపఁబడెను. ఇది విజయదేవగురుస్తోత్రాత్మకము. కాళిదాసునిమేఘదూతయందలి నాల్గవపాదములను సమస్యగాఁ గొని యీకావ్యము రచింపఁబడెను. ఈచమత్కారము జినసేనుని పార్శ్వాభ్యుదయములోను, చేతోదూత, నేమిదూత, శీలదూతలయందును గానవచ్చుచున్నది.

XVIII. శతార్థకకావ్యము[1]: సోమప్రభాచార్యుఁడు. [క్రీ. శ. 12 వ శతాబ్ది]. బహుళార్థకకావ్యరచనమున నితఁడు మిన్నందెను. ఈకావ్యమున నొక్క శ్లోకమే నూఱువిధములుగా నన్వయింపఁబడినది. ఇందువలన నీతనికి 'శతార్థిక' కవి యని బిరుదు వచ్చెను. ఇది క్రీ. శ. 1177 సంవత్సరప్రాంతముల రచింపఁబడెను. వ్యాఖ్యానారంభమునఁ గవియే యీశ్లోకమునకుఁగలనూఱర్థములకు సూచికనైదుశ్లోకములలో నొసంగెను. మొదట 24 గురు జైనతీర్థంకరుల వృత్తాంతమొసఁగఁబడెను. పిమ్మట బ్రహ్మ, విష్ణు, నారద ప్రభృతి వైదికదేవతల పరముగా నన్వయింపఁబడెను; తరువాతఁ గవి తనకు సమకాలికులగు వాదిదేవసూరి, హేమచంద్రాచార్యుఁడు, జైనమతాచార్యులు, జయసింహదేవుఁడు, కుమారపాలుఁడు, అజయదేవుఁడు, మూలరాజు, గుజరాత్ దేశమున రాజ్యముచేసిన నలుగురుచాళుక్యరాజులు, సిద్ధపాలకవి, నాఁటినాగరకాగ్రణి యొకఁడు, తనకు గురువులగు అనితదేవ, విజయసింహులు-వీరిపరముగా నీశ్లోకమన్వయింపఁబడెను. తుదకు స్వపరముగాఁ గూడ నీశ్లోకమును గవి యన్వయించుకొనెను. తన్ను గుఱించి యొకానొకశిష్యుఁడు రచించిన యయిదుశ్లోకముల ప్రశస్తిని గావ్యాంతమునఁ జేర్చెను. 'శృంగారవైరాగ్యతరంగిణి'[2]యను నీతిబోధక మగుకావ్యమును గూడ నీతఁడు రచించెను.

---

1. 'కుమారపాలప్రతిబోధము'- పీఠిక. (గైక్వాడ్ప్రాచ్యగ్రంథావళి.)
2. కావ్యమాల, బొంబాయి.

మిచ్చితి తోడి మాసికము లేగతిఁ జిక్కిన వన్న[1]నాభటుం
డిచ్చుఁ దలంకియుం దలఁక కిట్లనియెం గరము ల్మొగుడ్చుచున్. ౯౩

గీ. మొదల సెట్టిచేతఁ బదిరత్నములుఁ గొని, మగిడి వచ్చుచోఁ గ్రమక్రమమునఁ
బార్థివేంద్ర నాకు భాగ్య మింకినభంగిఁ, బెద్దయడవిలోనఁ బ్రొద్దుగ్రుంకె. ౯౪

వ. అక్కడ మఱియు నొక్క చిక్కు గలిగె. ౯౫

సీ. ధూళిపర్వఁగ వడిఁ దూర్పువాఱెడుగాడ్పు సారతురంగప్రసార మనఁగ
సంపూర్ణజలమదశ్యామలాకృతు లైన యంబుదంబులు కుంజరంబు లనఁగ
భూరిగర్జితములు భేరీరవములన మెఱపు లాయుధముల మెఱుఁగు లనఁగఁ
గేకినాదములు మహాకాహళము లనఁ జాతకంబులు భృత్యసంఘ మనఁగ
శక్రచాపము[2]విజయధ్వజం బనంగ, నొప్పి భూతవిహిత[3]జీవనోదయమున
నవనినాయక నీమువాహ్యాళిధాక, ననుకరించుచుఁ దోఁచె వర్షాగమంబు. ౯౬

సీ. తొలితొలి సన్నంపుఁదుంపురు లొలుకఁగా వెసఁ దిమితిమి యని[4]ముసురుపట్టె
బిసబిస యని గాలి బెట్టుగాఁ బెటపెట గణికలంతంతలు చినుకు లురిలెఁ
బిడుగు పెళిల్లునఁ బడియెనో యనఁగను గడఁదియుర్ములు బెడబెడ యనంగఁ
గ్రొక్కారుమెఱుఁగు తళుక్కని మెఱయఁగాఁ బాసియుఁ జీఁకు చూపఱఁ బెనంగ
నించి కడవలు వడిఁ గుమ్మరించినట్లు, పాము వ్రేలాడఁగట్టినభంగి దోఁప
వాన బోరునఁ గురియంగ వఱదనుండి, మిఱ్ఱుఁ బల్లంబు నొక్కటై మేరమీఱె. ౯౭

ఉ. దండడి దండశూకసమధారలు తోరము లై పడంగ మ
ధ్యందినవేళ యైన నభ మంతయుఁ జీఁకొని చీఁకుపర్వ న
క్తందినచిహ్నముల్లఱవఁగా నటు బోరన వాన వట్టె దై
నందినకల్పమో యిది యనన్ జలపూరము నిండె ధారుణిన్. ౯౮

వ. అట్టి వర్షోత్కర్షంబున మార్గంబు జలదుర్గమం బైన- ౯౯

క. తత్కాలమ్మున నిలువక, యుత్క్రోచము చేసి తప్పియును భవదాజ్ఞా
సత్కారముఁ దలఁపుచుఁ[5]జని, యుత్కూలజలాఢ్య[6] మైన యొకనదిఁ గంటిన్.

గీ. అచట నిలుచునంత నవ్వాన వెలియఁగ, నొకఁడు వచ్చె వాని యొద్ది కేగి
దైన్య మొంది యేఱు దాఁటించు మని వేఁడు,కొనిన నాతఁ డీయకొనక పలికె.

క. వినుము మహానది దాఁటుట,యును గురువిప్రార్యనిందయును ధర్మసభా
జనవైరము దైవతలం,ఘనమును బఁకింప హానికార్యములు సుమీ. ౧౦౦

---

1. మఱితెమ్మిఁక నైదునుగాక నాకు నైదిచ్చితి—ఐదునునాకు నిప్పుడీవిచ్చితి- 2. చక్రవాకము, 3. నొప్పు-భూగోళహితజీవ- 4. వెసనిదేమిటియని 5. సలుపుచు 6. ఉత్కల్లోలాఢ్య.

క. నారీహృదయంబును వ్యవ,హారనిజంబును నదీజలాపూరంబుం
జోరుని ధర్మస్థితియును, వైరుల చెలిమియును నమ్మవల దెవ్వరికిన్.[1] ౧౦౩
క. అనలముఁ బన్నగమును దు,ర్జనుఁ డుదకముఁ గపియు[2]బ్రహ్మచారియు వారాం
గనయును నృపుఁ డగసాలెయుఁ, దనవా రని నమ్మవలదు తత్త్వజ్ఞునకున్. ౧౦౪
క. అనవుడు నివి నీతులు గా, వన వచ్చునె విభునితోడ నాడినపంతం
బున నీపదిరత్నంబులు, గొని చని దర్శించి రాజుఁ గొలువఁగవలయున్.
క. తలకొను మని ప్రార్థించిన, వలనుగ నాకార్యగౌరవమ్మెఱిఁగి యతం
డలయక యిది సందనుచును,వలనొప్పఁగఁ బుంటిచేయి పట్టినభంగిన్. ౧౦౬
గీ. అవనిపాలుఁ గొల్వ నవసరం బైనచోఁ, జాలు నింతవడి విచార మేల
మైనమానికంబు లందు నా కిచ్చిన, నిట్టియనలిదరిని బెట్టువాఁడ. ౧౦౭
వ. అనిన. ౧౦౮
సీ. అడిగిన రత్నంబు లన్నియు నిచ్చితి నేని రాజద్రవ్యహాని పుట్టు
నీఁజెల్ల దని యున్న నీడినం బిచ్చోటఁ దప్పెనా రాజాజ్ఞ దప్పఁ గలుగు
నిలలోని ధనికుల యిండ్ల హయంబులు ధనధాన్యములును గాంచనముమణులు
మృదులాంబరంబులు మృగమదకర్పూరచందనంబులుఁ బరిచారగణము
దానధర్మములు సమాన మై యుండును, వానికంటె భూమివరుని కలిమి
యెక్కుడగుచుఁ జెల్లు నొక్కరాజ్యంబున, రాజ్యమనఁగ నాజ్ఞ పూజ్య మగుట.[4]
వ. అని విచారించు నెడలఁ దొల్లింటి నీతి తలంపునం బడియె. ౧౧౦
క. ధనమునకు దానమును దప, మున కాచారమును రాజ్యమున కాజ్ఞయు జీ
వనమునకు యశము విద్యకు, వినయంబును నీతులకు వివేకము ఫలముల్[5].
క. ధరఁ దగువారలకుఁ డిర,స్కరణంబును సతుల కొండు శయ్యయు నుర్వీ
వరులకు నాజ్ఞాభంగము, నరి నివి యాయుధము లేని చావులు గావే. ౧౧౨
మ. అని చింతించి ధరాతలేంద్ర భవదీయాజ్ఞాసముల్లంఘనం
బున కే నోర్వక యేనుమానికము లాపూర్ణాపగాతోయలం
ఘనపణ్యంబుగ నిచ్చినం గొని లతాగ్రగ్రంథిచే నన్ను నే
పున బంధించి రయంబుతో నతఁడు తత్పూరంబు దాఁటించినన్. ౧౧౩

1. నారుల, వ్యవహారుల, చోరుల, వైరుల యని చిన్నయసూరిగారి పాఠము. 2. బాలికలు ను దుర్జనుండును గన్యకయు–దుర్జనుఁడు జలంబులును. 3. నిట్ట యవలిదరిని– చిన్నయసూరి. నిట్ట= ప్రవాహము. 4. యెక్కుడై చెలంగునెల్ల దేశంబుల, రాజునాజ్ఞ చాలఁ బూజ్యగుట. 5. బల ముల్—చిన్నయసూరి.

గీ. అరుగుదెంచి నీపదాంబుజంబులు గనుఁ,గొంటి నాజ్ఞఁ నడప[1] గంటి నేఁడు
రాజుసెలవు[2] లేక రత్నంబు లిచ్చిన,తప్పనరును శిక్ష దలఁపు నాకు. ౧౧౪

క. అనవుడు నృపుఁ డుత్తమమణి,ధన మిచ్చియు విఘ్నమైన తఱి నాజ్ఞాలం
ఘన మొనరింపక వచ్చితి, వని మెచ్చుగఁ జేతి మణులు వానికి నిచ్చెన్. ౧౧౫

ఉ. కావున విక్రమార్కు సరిగావు నృపాలక చాలు నింటికిం[3]
బోవుట మేలు నాఁగ విని భోజుఁడు ఖిన్నముఖారవిందుఁడై[4]
భావములోన నాతని ప్రభావము నీగియు మెచ్చుచున్ సుహృ
ద్భావరయుక్తుఁడై మగిడి పోయెను నెంతయు వింతచొప్పనన్[5]. ౧౧౬

వ. ఇట్లు పంచమద్వారంబున నుండి మగిడి మఱియు నుత్సుకుండై. ౧౧౭

—: ఆఱవబొమ్మ కథ :—

క. లక్ష్మీనాయకసాయకుఁ, బక్ష్మలనయనాంకవామభాగుని ఘనునిన్
లక్ష్మాహిమకరధరు రజ,తక్ష్మాధరసదను మదనదమనుం గొలుతున్. ౧౧౮

గీ. అనుచుఁ గడఁగి భోజుఁ డట గొన్ని దినములు, చనిన విబుధవందిజనులఁగూడి
యింద్రభద్రపీఠ మెక్కు లగ్నంబుతోఁ, బొంతఁ జేరునంత బొమ్మ పలికె. ౧౧౯

క. నిలు నిలువు విక్రమార్కుని, కొలఁదిని నిర్వ్యాజదానగుణ మటు నీకుం
గలుగక యెక్కం బూనుట, చెలఁగి నపుంసకుఁడు బోటిఁ జేరుట చుమ్మీ. ౧౨౦

క. నావుడు భోజనృపాలుఁడు, భావంబున సిగ్గు గదురఁ, బాంచాలిక ! నీ
వావిక్రమార్కువితరణ, మేవెరవున నోదవెఁ జెప్పు మేర్పడ నాకున్. ౧౨౧

క. అనవుడు నాపుత్రిక యి, ట్లనియెం జిఱునవ్వుతోడ నవనీనాథా
విను మొప్పగఁ జెప్పెద నా, జననాయకు దానగుణము సామాన్యంబే. ౧౨౨

క. సమరస్థలిఁ గపికేతుఁడు, విమతపురోన్మూలనమున వృషకేతుఁడు మా
నమున నహికేతుఁ డాకృతి, సమతను ఝషకేతుఁ డనఁగ జగతిం బరఁగెన్.

ఉ. అట్టి గుణంబులుం గల ధరాధిపుఁ డాదటఁ దండ్రి భంగిఁ జే
పట్టి వినిద్రబుద్ధిఁ బరిపాలన చేయుచు నుండఁగాఁ బ్రజల్
దట్టము లైనసంపదలఁ దారు కుబేరుని పెంపు మీఱి యే
పట్టున దానధర్మములుఁ బాడియుఁ దప్పక యొప్పి రప్పురిన్. ౧౨౪

వ. ఇట్లు రాజ్యం బఖిలజనమనోరంజకం బగుచుండ. ౧౨౫

1. దిరుగ. 2. రాచసెలవు 3 విక్రమార్కునికిఁ గల్గు గుణంబులు చాల వింటికిం- 4 ఖిన్నముఖాబ్జతేజుఁడై. 5. భోజుఁడు పోయెను దొంటి చొప్పనన్.

సీ. కనికని మానినీజనమనోధనములు తొలితొలి గెలుబాడు దొద్దకాఁడు
పువ్వుఁ రెమ్మలకు లేమవ్వ మెక్కించుచు నంగజుతో నాడు సంగడీఁడు
రాచిల్కగములకు వాచవిఁ జుబ్బనచూఱగా[1] నొనరించు సొంపుకాఁడు
కోకిలంబుల కెల్ల మూకభావంబులు విడిపింప నడరెడు వెజ్జుఁ డేఁడు
తేఁటికదుపులకును దేనెతోఁ బువ్వొడి, మేపి మరపనేర్చు తీపులాఁడు
ప్రాఁకులకు ముదంబుఁ బ్రాయంబు వాటిల్ల, వింతఁ దోఁచె భువి వసంతుఁ డంత.
వ. అప్పు డామలయాచలంబు నుండి. ౧౨౭
క. వే చని చని ఫణిసతులకు, వాచవి పుట్టించి [2]రత్నవతి యనునదిలో
వీచికలఁ దోఁగి [3]మెల్లన, వీచెం దెమ్మెరలు మరునివీచోపు లనన్. ౧౨౮
క. మరుఁ డరుదేరఁగ ముందఱఁ, దిరువీథులు దుడుచుకరణిఁ దిరుగుచుఁ బవనుం
డిరవుచెడ వీవ జడియఁగఁ, దరువులఁ గారాకు ధరణిఁ దఱచై రాలెన్. ౧౨౯
క. బలిమియుఁ గలిమియుఁ జెలిమియు, నలవడ వచ్చిన వసంతుఁ డనుచుట్టముతోఁ
గలసిన నెలకొను పులకల, మొలకల క్రియఁ దరుల మొత్తముగఁ జిగురొత్తెన్.
క. చెలరేఁగి మరుఁడు విరహులు, దలఁకంగా దండుగదలు తఱి నతనికి మా
వులు మొదలుగఁ దలకొనుబహు, దళములను వసంతుఁ డపుడు దగ మొనదీర్చెన్.
క. దీపంబుల క్రియఁ బువ్వులు, దీపింపఁగ మోదుగులు మది న్విరహులకుం
దాపంబు లినుమడింపఁగ, రూపించిన మన్మథాగ్నిరూపము దాల్చెన్. ౧౩౨
క. శ్రీరమణీయవసంతో, దారవ్యాకోచకుసుమతతి వనలక్ష్మీ
భూరివిభూషణభాండా, గారంబులకరణిఁ గర్ణికారము లొప్పెన్. ౧౩౩
క. బహుకిసలయఫలసుమనో, విహితోత్సవపికశుకాళివిహరణసౌఖ్యా
వహమహనీయగృహశ్రీ, సహజము లై చూడ నొప్పె సహకారంబుల్.
సీ. ఫలరసంబులఁ గూడి యలుఁగులు వాఱెడి పూఁదేనియలు వారిపూర మనఁగ
సాంధ్రమధూళికాస్యందమందానిలస్ఫురణంబు తరగల పొం దనంగ
శుకతుండ సదృశకింశుకముకుళంబుల కాంతులు విద్రుమాంకుంబు లనఁగ
మవ్వ మెక్కిన వెలిక్రొవ్విరు లెల్లను శంఖమౌక్తికఫేనసంఘ మనఁగఁ
దత్పరాగధూసరోత్పతద్భ్రమరాళి, శీకరంబు లనఁగఁ జెలువు మీఱి
యుదధిభంగిఁ దత్పురోద్యానవనభూమి, మాధవాశ్రయముగు మహిమఁ దాల్చె.
ఉ. గంధవహుండు వేగరి పికంబులు గాయకపంక్తి మత్తపు
ష్పంధయము ల్బలంబు శుకసంఘము మంగళపాఠకుల్ మహా

1. గుబ్బనచూర- చిన్నయసూరి. 2. రత్నవతి యనునదిలో. 3. దూఁగి.

బంధురకార్యవాది నిజబంధుఁడు చంద్రుఁడు మంత్రిగాఁగ గ
ర్వాంధుఁడు మన్మథుండు దనయాజ్ఞ దలంబుగ నేలెఁ దత్పురిన్. ౧౩౬
క. తత్సమయంబున భూవరుఁ, డుత్సాహము రాజ్యవృద్ధియును మెఱయ వసం
తోత్సవ మొనరింపుద మని, యుత్సుకుఁడై కదలె వైభవోద్రేకమునన్.[1]
వ. తదనంతరంబున. ౧౩౭
సీ. మంజులమంజీరశింజారవంబులు వీనుల కందంద విందు లొసఁగఁ
గాంచన కాంచీప్రకాశవిలాసముల్ వలపుల పసిఁడి వన్నియ నిగుడ్పఁ
దారహారోజ్జ్వలస్తనకుంభదీప్తులు ముఖచంద్రకళలతో ముచ్చటాడఁ
దాటంకరోచులం దఱిమిన కన్నోఁగ మెలఁకువ లిరుదెస మెఱుఁగులీన
జల్లిముత్తియములు మొల్లపూదండలు, దల్లితోడుభంగిఁ దడఁబడంగ
వలమరత్నరుచులు కెలఁకులఁ బొలయంగఁ,దలిరుఁబోఁడు లెదుర నిలిచి రిట్లు.
వ. మఱియుం దదనురూప సఖీజనంబులును, భవ్యసుగంధద్రవ్యహస్తంబు లగు పరిచారికాగణంబులును, విట నట పీఠమర్ద విదూషక వైతాళిక వందిబృందం బులును, భూషావిశేషభూషితదేహంబు లగు నుత్సవసందర్శనాగతోత్సుక సందోహంబులును జేరి యక్కడక్కడ నిరుపక్కియల నిలుచునప్పుడు. ౧౪౦
క. ఒనరించిననీలని నడగని, బొల్లనిఁ, గత్తలాని, గైరని, సారం
గని, జారని, జన్నని, నిమ,వని మొదలుగఁ దెచ్చి నిలిపె వాహకుఁ డెసఁగన్.?
క అక్కడ నొయ్యనఁ బచ్చల, పక్కెరతురగంబు నెక్కి పతి గదలుచు సొం
పెక్కఁ దనచిలుకనారువ, మెక్కి వసంతునకు మారుఁ డెదురేగుక్రియన్.
శా. రాజశ్రేష్ఠుఁడు వాగె సన్నల గతుల్రాజిల్ల రేవంతు న
ట్లాజాడం బురికొల్పునట్టి గతితో నమ్మేరగా మెల్పఁ దా
నాజాడం బురికొంచు నట్టి వడితో నామేరఁ దానిల్చుచున్
వాజీంద్రంబు మనోజవం బనఁగ నిర్వ్యాజోద్ధతిం దేలఁగన్. ౧౪౩
క. విద్యుల్లతలకు నెనయగు, హృద్యాకృతులైన వనిత లేతేర మహా
వాద్యంబులు మ్రోయఁగ నృపుఁ, డుద్యానవనాంతభూమి కొయ్యనఁజనియెన్.
మ. చని యచ్చోట విభుండు చేరె సుమనోజాలప్రవాళావళీ[2]
జనితానేకసకామపంచశరచంచచ్చాపవల్లీగుణ
ధ్వనిశంకావహఝంకృతిప్రవిలసత్సంగీతభృంగాంగనా
ఘనసంతోషవిశేషకల్పలతికాకందంబు మాకందమున్. ౧౪౫

1. వైభవోత్సేకము. 2. జాలాప్తలీలావనీ.

వ. తత్ప్రదేశంబున శంబరభేది వేదికాకృత్యంబులు నివర్తించునంతకుం గృతవాహా నారోహుండనై యంకురిత కోరకిత ఫలిత ఫలినంబుల నవలోకించుచున్న యెడ విదూషకుం డొక్క-చోఁ జోద్యభేద్యంబుగాఁ బద్యంబు చెప్పి మామిడి సిరి వడయ వ్రాసితిఁ బత్త్రిక యందుకొన నవక యవధరింపు మిది తగు ననుచు నాశ్రయించినవారికి మామిడి కామునిగెలుపుంగలిమికి దుంప యగునను నర్థంబుగలుగ నొకయాకున వ్రాసి చేతి కిచ్చె నది యె ట్లనిన:— ౧౪౬

క. మాకంద మలరవ్రాసితి, మాకంద మనాక చూడు మాకందమిటన్
మాకంద మనుచుఁ జేరిన, మాకందము మదను జయరమాకంద మగున్.

వ. ఇ ట్లున్న నది చదివి చిఱునవ్వుతో నవ్విభుండు జాణ వవుదు వని పరిణమించిన నతండు చందనాశ్రితవృక్షసౌరభంబుగతి మాకు నిది నీప్రభావంబున నయ్యె నని కొనియాడి మఱియును. ౧౪౮

క. నీ కెన యగు నాశ్రితర,క్షాకుశలత్వమునఁ దన్నుఁ గలసినపుణ్య
శ్లోకపికమధుకరముల న,శోకంబులఁజేయు నిది యశోకంబు చుమీ. ౧౪౯

క. వికలంబుగ నీవాసన, సకలంబును బువ్వులందు సంపూర్ణముగా
వకుళంబులందు రోలం,బకులం బిది దీనిఁ జూడు పార్థివముఖ్యా. ౧౫౦

క. భిన్నాగమ బలశంబర,భిన్నాగ మనంగ మిగులఁ బెంపొందిన యీ
పున్నాగ మవధరింపుము, పున్నాగమనోజ్ఞకీర్తి పుణ్యాగణ్యా. ౧౫౧

క. కంబూపమహంసలనిల,యం బూర్జితమూలబంధ మంభోనిధిగా
జంబూవృక్షముఁ జూచితె, జంబూద్వీపంబుసరి నిజం బూహింపన్. ౧౫౨

క. సంచితపింఛసమంచిత, పంచాయుధమరకతాతపత్త్రం బన ని
శ్చంచలశాఖాంచిత మగు, చించావృక్షంబుఁ జూడు చిత్తజరూపా. ౧౫౩

వ. దీనిప్రభావం బే మని వర్ణింపంబోలు. ౧౫౪

క. చింత మది లేక మనుజులు, చింతించినకోలఁదిఁ జవులు చేకూర్చుచు ని
శ్చింతులఁగా నొనరించెదు, చింతకు సరి గలదె లోకచింతామణికిన్. ౧౫౫

క. ఈచింతపంటిసరిగా, నోచెల యమృతంబుఁ జెప్ప నొప్పునె దానిన్
వాచవి గొని తమజిహ్వల, నేచవులును లేక చెడరె యింద్రాది సురల్.

క. భ్రాంతి వడి కల్పవృక్ష,ప్రాంతంబునఁ గూడుఁ గూర్చుఁ బట్టక సురల
శ్రాంతంబు దీనికై మదిఁ, జింతించుటఁ జేసి పరఁగెఁ జింత యనంగన్. ౧౫౭

క. మాను జిగురునఁ బువ్వున నో,మనగాయల దోరపండ్ల మఱి యారఁగఁబం

డినపండ్ల నెల్లకాలముఁ, దనియఁగఁ జవు లొసఁగ నొంచు తరువులు గలవే.[1]

క. ఉడుపతి తనలో నమృతము, గడలుకొనియుఁ బెక్కు చవులు గానక కృశుఁడై
విడిచినకళ లన్నియు నీ, గొడిసెల రూపమునఁ జెంత గొలువఁగఁబోలుౝ.

క. వెస నిర్మించిన బ్రహ్మకు, రసికుఁడు మ్రొక్కుచు ఫలము రంజిల్లఁగ ష[2]
డ్రసములలో నిది నమలెడు, దెసఁ గని నోరూరు నాదిదేవునికై నౝ. ౧౭౦

గీ. గరిత లేని యిల్లు దొర లేని తగవును, జెంతపండు లేని వింతచవియుఁ
జనవు లేనికొలువు శశి లేని రాత్రియు, ముక్కు లేనిమొగము నొక్కరూపు.

మ. అని యిబ్భంగి విదూషకుండు చనవుౝ హాస్యోచితం బైన చో
ప్పునఁ దద్జ్ఞత్వము నేర్పడం బలుకుచు న్యాభర్తకు న్వాగ్వినో
దనసౌఖ్యంబులఁ బ్రొద్దుపుచ్చునెడ నుత్సాహంబుతోఁ గామిను
ల్వనసౌందర్యవిలోకలోలమతులై వర్తించి రయ్యెయెడౝ. ౧౭౨

క. అడుగులుఁగెందలిరాకులుఁ, దొడవులుఁ గ్రొవ్విరులుఁ గురులుఁదుమ్మెదగుములుం
దడఁబడఁ బడఁతులు బెడఁగడ, రెడు నడగలతీవెలనఁ జరించిరి కడఁకౝ. ౧౭౩

సీ. ఎలమావిజొంపంబు లివెచూడుమనుచునొండొరులకుఁజూపుచుఁదిరుగువారుఁ
గరములుఁ బల్లవోత్కరములుఁ దడఁబడ డాయుచుఁ బువ్వులు గోయువారుఁ
బొలుపారఁ దనువులు పుష్పవల్లులతోడఁ గూడ డాఁగురుమూఁత లాడువారుఁ
దిన్నని యేలలఁ దీపులురెట్టింపఁ దీఁగె యుయ్యల లెక్కి తూఁగువారుఁ
బువ్వుఁదేనియఁగురియంగఁబొన్న లెక్కి, మెఱపులట్లందువిరులకు మెలఁగువారు
నగుచుబాలికలు వనవిహారలీల, లెనయఁ జెలఁగిరి వనలక్ష్ము లనఁగ నచట.

ఉ. వెన్నలి వ్రేలఁగాఁ బిఱిఁది వ్రేఁకట మొయ్యనఁ గ్రింది కీడ్వఁగాఁ
జన్నులమీఁదఁ గ్రిక్కిఱిసి సందెటిదండలు పొంతనిక్కఁగా
సన్నపుఁగౌనుదీఁగఁ గడుసన్నముగా మునివ్రేళ్ల నిల్పి తాఁ
బొన్నలు గోసెఁ జేతులను బుప్పొడి యొప్పెడుకొమ్మ కొమ్మలౝ. ౧౭౫

ఉ. అత్తఱి నత్తలోదరుల కందఱ కంముల కందరాని పూ
గుత్తులఁ జూపి చేకొలఁదిఁ గోయుఁడు మీరని గ్రుచ్చి వానికై
యెత్తుచుఁ జేయి దప్పె నని యించుక జాఱఁగనిచ్చి యక్కులౝ
హత్తుచు నంగసంగసుఖ మందిరి కొందఱు ప్రేమఁ గాముకుల్. ౧౭౬

1. జవు లొసఁగుచుండుతరువులు గలవే-నిట్టితరువులుఁగలవే. 2. రసికుఁడు "హాణ్ణాశే నున్నరే, నొసవి" యనుచుఁ గన్నుఁడీఁడు నుడువఁడె.

ఉ. దేహము లాకుఁదీఁగెలకుఁ దేఁకువ సూప నపీనగుచ్ఛక
గ్రాహక లైనకాంతలకు ఘర్మజలం బుదయించుచుం బ్రియ
స్నేహరసాకృతిం జెలువు చేకొనఁగా మకరందబిందు సం
దోహసమావృతంబు లనఁ దోఁచెఁ దదీయముఖారవిందముల్. ౧౬౭

ఉ. కాంతుఁడు వోలె సోలి యలకం బులుఁ బయ్యెద లొత్తుచు న్నవ
శ్రాంతులు దీర్చుచు న్మిగులఁ జల్లనివాసన నావనస్థలో
పాంతనిదాఘవారికణహారివిహారి యనంగ నింతుల
న్నంతన మందఁ జేయుచు వసంతసమీరుఁడు వీచె నయ్యెడన్. ౧౬౮

గీ. పుష్పఁబోఁడు లంతఁ బుష్పాపచయకేళి, చాలు ననుచు నాత్మసఖులఁ గూడి
భూతలేంద్రుఁ డొక్క చూతతరుచ్ఛాయ, నుంట దెలిసి వేడ్క నొయ్య మగిడి.

గీ. మనసిజునకుఁ బాడసూపెడు, వనదేవత లనఁగ వచ్చి వనజానన లా
జననాయకునిం బువ్వులు, కనుకనిఁ గానుకలు చేసి కనుఁగొని రచటన్.

క. క్రొక్కారు మెఱుపుగములను, లెక్కింపను సోయగముల లీలలుగల యా
చక్కనివనితలలోఁ బతి, చుక్కలలోఁ జంద్రు భంగిఁ జూడఁగ నొప్పెన్. ౧౭౧

వ. ఇట్లుతరుణీగణ పరివృతుం డై యచ్చటువాసి చని పురోభాగంబున రంభాస్తం
భశోభితంబును మృగనాభిలిప్తంబును ఘనసారరంగవల్లీతరంగితంబును బూర్ణ
కలశాలంకృతంబును మరువకావృతపర్యంతంబును నగు వేదీమధ్యంబున నరపతి
రతిరాజానువర్తి యైన ఋతుచక్రవర్తి నర్ఘ్యపాద్యధూపదీపాదిషోడశోప చారం
బుల నారాధించి పంచమహావాద్యప్రపంచంబుల నృత్తగీతాది మహోత్సవం
బులు మెఱయఁ గప్పూరాదిసుగంధద్రవ్యంబులతో నింతులతో వసంతఖేలనం
బొనర్చె. ౧౭౨

క. వ్యక్తంబుగ సతిపై ను,న్ముక్తం బగు కప్పురంబుముద్దర లల్పా
సక్తం బై యలకలపై, ముక్తాజాలకముచందమునఁ జెన్నొందెన్. ౧౭౩

క. చెలఁగుచుఁ బతి చల్లినఁ దొ,య్యలులముఖాబ్జములఁ గొంత యంటి సుగంధం
బలవడియె మెఱుఁగుటద్దం,బుల నంటిన మెఱుఁగుటాతిపొడియును బోలెన్.

క. సురభితహరిదంతరనవ,పరిమళసంకీర్ణపూర్ణపరిమళమునఁ ద
త్తరుణులముఖముకురంబులు, సరజస్సరసీరుహములచందముఁ నొందెన్.

క. సుందరులఁ గూడి వైభవ,బృందారకపతి వసంతపీతాంబరుఁ డై
బృందావనమున గోపీ,బృందాన్వితుఁ డైనకృష్ణువిధమున నొప్పెన్. ౧౭౬

మత్తకోకిల. కుంభినీనికరంబుతో నొనగూడి యాడుచుహాటప్రే
కుంభిచందము దోఁపగా నతిగుంభితప్రమదంబునం
గుంభినీపతి మందయానలఁ గూడి వేడుకతోఁ గుతూ
జృంభితాంబర మా సరోవరసీమఁ జేరెఁ గ్రమంబునన్. ౧౭౭

మత్తకోకిల. అంమఁ జొచ్చి చెలంగి సుందరు లందఱు న్ముదమందుచుం
గ్రందుకొంచుఁ బరస్పరం బుదకంబు మోములఁ జల్లుచు
న్మందఱం దను ముట్టుకొమ్మని ముగ్ధ దర్వ్వలఁ దేలుచుం
జందనంబు గరంగ లీలలు సల్పి రోలలు వాడుచున్. ౧౭౮

సీ. వదనదర్పణములు వారిరుహంబులు నలకజాలకములు నలికులములు
లోలనేత్రంబులు నీలోత్పలంబులుఁ గుచకుంభయుగములుఁ గోకములును
బాహువులును బిసప్రకరంబులును లోఁతుగలనాభిమండలములును సుళ్లుఁ
దమలోన సరి యనఁ దారతమ్యము చూడ నిన్నియు నొక్కచో నితఁడు గూర్చె
ననఁగ నంగనాసహితుఁడై యవనివిభుఁడు, యమునఁ గ్రీడించుగోపికారమణుకరణి
దివ్యనదిలోన నప్సరఃస్త్రీసమేతుఁ, డైన వజ్రినాఁ జెలఁగెఁ బద్మాకరమున.

క. వెలికిలఁబడి యీఁదెడు నెడ, జలసంవృతగాత్రి యైనసతివదనముతో
నలవడఁగఁ జన్ను లొప్పెను, జలజాతము పొంతనున్న జక్కవ లనఁగన్.

క. ఓలోల యనఁగ నెచ్చెలి, యాలోఁ దను ముట్టవచ్చు టది గని పెలుచన్
లోలాక్షి మునిఁగి యీఁదెను, మీలకడను నయనరుచులు మెఱయించు క్రియన్.

క. కామినులు చేరి మెలఁగం,గా మును నిర్మలము నధికగంభీరము నౌ
నామడుఁగు గలఁగె ననఁగాఁ, గాముకచిత్తములు దానఁ గలఁగుట యరుదే.

క. పొలఁతులతనువుల జాఱిన, మలయజమును విరులు నెరయ మడుఁగొప్పె సము
జ్జ్వల మగువెన్నెలఁ జుక్కలు, గలయంగొని నిండియున్న గగనము భంగిన్.

వ. అంత జలకేళి చాలించి. ౧౮౨

ఉ. కన్నులఁ గెంపు దోఁప నలికంబుల మౌక్తికజాలకాకృతిన్
సన్నపుబిందువు ల్మెఱయ జాఱిన కేశభరంబు లొప్పఁగాఁ
జన్నులనంటి పయ్యెదలు చందనపంకముచంద మందఁగా
నన్నరనాథుతో వెడలి రంబురుహాకర మంబుజాననల్. ౧౮౩

వ. అంతం దదీయతటప్రదేశంబున ముక్తసిక్తవసనుం డగుచు వసుంధరారమణుండు
మెత్తనిపొత్తులం దనమేని తడియొత్తిన యనంతరంబ- ౧౮౪

గీ. మలయజంబు నలఁది మౌక్తికహారంబు, లమర నుజ్జ్వలాంబరములు గట్టి
యమృతవీచి మిశ్రమై విశ్రమించిన, మందరాద్రిఁ బోలె మనుజవిభుఁడు. ౧౮౭

వ. అట్టిచందంబున నాచందనగంధులును జాదనకావులును బట్టెడకావులును జెంగావులును గదంబకావులును గరకంచులును బొమ్మంచులును ముడుగుఁబొమ్మంచులును ముయ్యంచులును జిలుకచాళ్లును వేటచాళ్లును నిండువన్నెలును నుఱుతచాఱల వన్నెలును గంటకివన్నెలును బుప్పొడి వన్నెలును రుద్రాక్షవన్నెలును నాగబంధంబులును బూజాబంధంబులును జలపంజరంబులును గామవరంబులును సూరవరంబులును దారామండలంబులును హంసావళులును హరిణావళులును దురగావళులును గజావళులును సింహావళులును ద్రౌపదీస్వయంవరంబులును లక్ష్మీవిలాసంబులును మదనవిలాసంబులును వసంత విలాసంబులును రత్నకీలితంబులును రాయశృంగారంబులును గనకదండెలును గచ్చిలంబులును గర్పూరగంధులును బారువంపుగంధులును శ్రీతోఁపులును శ్రీరామతోఁపులును శ్రీకృష్ణవిలాసంబులును జీబులును సుగిపట్టంబులును సన్నవలిపంబులును వెలిపట్టులును హొంబట్టును బులిగోరుపట్టును నుదయరాగపట్టును నేత్రపట్టును వజ్రపట్టును ననుపేళ్లు గలపుట్టంబులు గట్టుకొని పాదముద్రికలును మంజీరంబులును హంసకంబులును మణిరశనాగుణంబులును ముక్తాఫలావళులును బదకంబులును నంగదంబులును నంగుళీయకంబులును గ్రైవేయకంబులును రత్నతాటంకంబులును భ్రమరకంబులును లాలాటికంబులును మౌక్తికజాలకంబులును శేఖరంబులును నాపెగాఁ గల యలంకరణంబులు ధరియించి యగరు చందన హరిచందన ఘనసారోదయభాస్వరమృగమదప్రముఖనిఖిలవాసనల నాశావకాశంబులు వాసించుచు నృపరత్నంబుం జేరునంత. ౧౮౮

క. అంగీకృతశృంగారకు,రంగీశయనాంతరంగరంజకరంగ
ద్భృంగీరవహృదయంగమ,భంగీసంగీతుఁ డగుచుఁ బవనుఁడు వీచెన్. ౧౮౯

వ. అట్టి యుల్లాససమయంబున. ౧౯౦

క. రూపముగల యానందము, చూపించిన మన్మథుండు రుచిరాకృతితో
దీపించెను శృంగారము, భూపతి యని కొలిచి కెలమిఁ బొలఁతుక లెల్లన్.

క. ఆవేళ భూమివల్లభుఁ, డావెలఁదులు గొలువ నొప్పె యక్షవధూబృం
దావృతుఁ డగు ధనద నిగతి, దేవస్త్రీసహితుఁ డైన దేవేంద్రు క్రియన్. ౧౯౨

వ. ఇట్లనల్పకాలంబు విశ్రమించుచున్న యెడల ననతిదూర మాకందవనంబునుండి

యొక్క భూసురుండు చనుదెంచి తన్మహోత్సవం బవలోకించుచు భూలోకస్వర్గ
లోకం బిది గదా యితఁడు గదా మహాభాగ్యవంతుం డని కొనియాడుచు
మున్ను దా నధిక దారిద్ర్య పీడితుం డగుటం జేసి తన్ను నిందించికొనుచుఁ
దనలోన. ౧౯౩

క. ధాత్రి దరిద్రుఁడు సభల న,పాత్రుఁడు కడు మ్రుచ్చు మిత్ర బాంధవులయెడం
బుత్రకళత్రంబులయెడ, శత్రుం డఁట వాని బ్రదుకు చాకాఁ గాదే. ౧౯౪

క. ఇలలో నెవ్వని కర్థము, గల దాతఁడు మాన్యుఁ డుచితకార్యజ్ఞుఁడు ని
ర్మలుఁడు బలవంతుఁ డార్యుఁడు, కులతిలకుఁడు సభ్యుఁ డధికగుణగణ్యుండున్.

మ. అని చింతించి మహీసురుం డొకయుపాయం బాత్మనూహించి ము
న్నొనరం జేసిన చండికాచరణపాదోపాస్తి చాలించి యా
జనపాలాగ్రణిపాలికిం జని మహాసంపత్తి యర్థించి కై
కొన నిం దొప్పు నటంచు వచ్చె మదిఁ గోర్కుల్ తీఁగ లై సాఁగఁగన్. ౧౯౬

వ. అతనిం జూచి యి ట్లని దీవించె. ౧౯౭

క. "భూయాత్తే సంప ద్దీర్ఘాయు ర్భవ తే" యటంచు నాశీర్వాదో
పాయనములతో నృపుఁ గని, డాయం జని నేర్పు చొప్పడరఁగాఁ బలికెన్.

ఉ. అంబుజబంధుతేజ మధురామ్రవణంబున నుండి సర్వలో
కాంబిక యైనచండికఁ బ్రియంబునఁ గొల్వఁగ నాకు నూఱువ
ర్షంబులు వోయె నంతటఁ బ్రసన్నత దేవత నిన్ను నర్థరా
త్రంబున దంతపంక్తి విశదద్యుతిచంద్రిక పర్వ ని ట్లనెన్. ౧౯౯

క. నీచేసినతపమునకు య,థోచితముగ విక్రమార్కుఁ డొసఁగెడు నతనిన్
వే చని వేఁడుము నావుడు, నీచక్కటి నిన్నుఁ గొల్వ నేఁ బనివింటిన్. ౨౦౦

వ. అని విన్నవించిన నవ్వసుంధరాపురందరుండు చండికయే యి ట్లాన తిచ్చెనో కా
క యీవిప్రుండే నెపంబున న న్నుబ్బించి ధనంబు వడయం జూచెనో యెట్లైన న
న్నంతటివానింగాఁ దలంచి వచ్చుటంజేసి యీతని యాశాపరిపూర్తి చేసెద నని
నిశ్చయించి. ౨౦౧

గీ. దేవిమాట కల్ల గావింపఁగా రాదు, నిన్ను రిత్త వంప నీతి గాదు
నీతపోమహత్త్వనియతికిఁ దగునంత,యనఘ యిష్ట మెద్ది యడుగు మనిన.

క. మాకందవనములో ని,చ్చాకీర్తులు వెలయునట్లు చండికపేరన్
నాకొకనగరము వలయును, జేకొని నిర్మింపు రాజశేఖర యనినన్. ౨౦౩

సీ. సంతోషమున మహీకాంతుఁ డచ్చటి కేగి సర్వసామగ్రియుఁ జాలఁ గూర్చి
మహనీయగృహములు మండపంబులు సోమసూర్యవీసులుఁ గోటమట్టుపరిఖ
లనుకొందఁ జాడికాయతనంబు నాపురిఁ గట్టించి కాపులఁ బట్టు కొలిపి
నియుతసంఖ్యములుగ హయముల బంట్లను నాఱునూఱేర్గుల నతని కిచ్చి
రాజుఁ జేసి పిదప రాజుకట్నంబున, కనుచు మూఁడుకోటు లర్థ మొసఁగి
పటహపటునినాదభంగి దిక్కులఁ గీర్తి, పిచ్చలింప మగిడి వచ్చెఁ బురికి. ౨౦౪

క. కావున నాతని సరిగా, నీవీగతి భూమి కీర్తి నెఱపిన నెక్కం
గావచ్చు నిట్టి వితరణ, మేవెరవున దొరకదేని నింటికిఁ జనుమూ. ౨౦౫

వ. అని పల్కుటయు. ౨౦౬

క. ఉల్లంబున భోజమహీ,వల్లభుఁ డాశ్చర్య మంది వదనాబ్జమున
న్వెల్లఁదనము వాటిల్లఁగ, నల్లనఁ దాఁ దిరిగి చనియె నంతఃపురికిన్. ౨౦౭

శా. చక్రీభూతకఠోరశార్ఙ్గవితతజ్యావల్లరీముక్తబా
ణాక్రాంతోగ్రసమానసంస్ఫురణకీర్ణజ్వాలపుంఖీభవ
చ్చక్రాస్త్రద్యుతిమాత్రనిర్దళితరక్షఃపక్షపాతద్విష
చ్చక్రాటోపతమఃప్రసారుని మహాచక్రీశపర్యంకునిన్. ౨౦౮

శా. ఆలోలాలకజాలభృంగయుతవక్త్రాంభోరుహాంభోజభ్రాంతిత
ప్రాలేయాద్రితనూభవాకృతిమతిప్రాప్తాంధకచ్ఛేదనో
త్తాలాఖీలకరాళశూలధరణత్రాతామరవ్రాతపూ
జాలక్ష్మీయుతపాదపద్మయుగళుం జంద్రార్ధచూడామణిన్. ౨౦౯

మాలిని. ఉరగనికరవేషీ యోగనిద్రాభిలాషీ
గిరిధరవరదాయీ క్షీరవారాశిశాయీ
పురవిదళనదక్షా పుండరీకాయతాక్షా
స్మరహరహరిరూపా సత్యనిత్యస్వరూపా. ౨౧౦

గద్యము. ఇది రాయగజగంధవారణ వైరిమండలికభేకఫణీంద్ర వీరఘోట్టవిభాళాది
బిరుదప్రకటచారిత్ర కళింగదేశనిర్ధూమధామ త్యాగనాగార్జున కర్ణాటద్రవి
ళాంధ్రమహారాష్ట్రభూపాలహృదనూపురసుందరచరణారవింద సనదప్రోలిపుర
వరాధీశ్వర వెలనాటిపృథ్వీశ్వరరాజ్యసముద్ధరణ శ్రీ కొఱవి వెన్నయా
మాత్యపుత్ర హరితసగోత్రపవిత్ర సకలసుకవిమిత్ర కసవరాజతనూజ గోప
రాజవిరచితంబైన సింహాసనద్వాత్రింశిక యను కావ్యంబునందు విక్రమార్కు
కృతజ్ఞత్వదాతృత్వప్రశంసనం బన్నది తృతీయాశ్వాసము.

శ్రీరస్తు.

# సింహాసనద్వాత్రింశిక.

## చతుర్థాశ్వాసము.

---

—: ఏడవబొమ్మ కథ :—

క. శ్రీస్తనకుంకుమసదృశగ,భస్తిసమూహప్రశస్తిపరిదీపితవ
క్షఃస్థలపటుతేజోమయ, కౌస్తుభకమనీయవేషి గంసద్వేషీ. 1

చ. తలఁపున నిల్పి పెద్దల హితజ్ఞులఁ దద్జ్ఞులఁ గూర్చి భోజమం
డలపతి భుఁ డిష్టలగ్నమున డాసి మహాసన మెక్కఁ బూనఁగాఁ
బలికెఁ దదీయపుత్రిక నృపాలక నిల్వుము విక్రమార్కభూ
తలపతిఁ బోలు తెంపు బలదర్పము లేకిట నెక్కవచ్చునే. 2

క. అనవుఁడు నాతనిసాహస,మును సత్త్వము నెట్టిచందమునఁ బెం పొదవె
న్వినిపింపు మనిన నుల్లస,మున నేడవబొమ్మ పలికె భోజునితోడన్. 3

శా. సత్యాలంకృతభాషణాభరణుఁ డుత్సాహప్రశస్తోదయుం
డత్యాసన్నహితోపభోగ్యవిభవాయత్తాధికప్రాభవ
ప్రత్యాదిష్టసురేశ్వరుండు నయసంపన్నిత్యుఁ డా విక్రమా
దిత్యుం డుజ్జయినీపురిం బరఁగె నాదిత్యప్రభావుం డనన్. 4

వ. ఇట్టి విధంబున నతండు వ్యసనరాగద్వేష కామక్రోధలోభమోహ మదమత్సర విరహిత సుజనప్రాజ్యం బగు రాజ్యంబు సేయు న్విద్యయందు వ్యసనంబును, కీర్తిసంపాదనంబునందు రాగంబును, బాపంబునెడ ద్వేషంబును, సంతతిసమృద్ధుల యెడఁ గామంబును, ధర్మవిరోధుల యెడఁ గ్రోధంబును, దుర్విషయంబులకడ లోభంబును, శిశువులకడ మోహంబును, బరోపకారంబులయెడ మదంబును, దానంబులయెడఁ బరస్పరమత్సరంబును బ్రవర్తిల్లఁ బ్రజలెల్ల నుల్లంబుల నుల్లసిల్లుచు భూవల్లభుగుణంబులం బెల్లు గొనియాడుచుండ. 5

ఉ. అన్నరనాథుపీట ధనదాఖ్యుఁడు సద్గుణుఁ డర్థసంపదం
గిన్నరనాథసన్నిభుఁడు కీర్తివిశాలుఁడు దానధర్మసం
పన్నుఁడు నీతిమంతుఁడు కృపాపరిపూర్ణుఁ డుదారబుద్ధి వి
ద్వన్నుతశాలి వైశ్యకులవర్ధనుఁ డుండుఁ బ్రజానుకూలుఁడై. 6

గీ. ఆతఁ డనుదినంబు నవనిసురులఁగూడి, ధర్మశాస్త్రగోష్ఠి దగిలియుండి
యైహికంబు దక్క దని పరం బెఱుఁగుచు, విహితసకలదానమహిమ నెగడె.

క. హింసాతరంగితం బగు, సంసారపయోధిలోన జనులకు నెల్లం
గంసారిపాదపంకజ,సంసేవయ నావ యని ప్రశంసింపంగన్. ౮
క. ఈక్రమమును విని ధనదుం, డస్త్రారప్రియుని ద్వారకాధీశ్వరునిం
జక్రధరుని దర్శింప ను,పక్రమమునఁ బతికిఁ జెప్పి పయనం బయ్యెన్. ౯
గీ. ఆప్తవర్గసహితుఁ డై యేగి దుర్గంబు, లూళ్లు నదులుఁ గడచి యొక్క నాఁడు
వృక్షరమ్య మగుచు వెలయు నుపద్వీప, మందు[1]విడిసి విశ్రమార్థ మరిగి.
క. స్ఫాటికసోపానంబుల, హాటకమయభైరవాలయమునుముందట మి
న్నేటిగతి శుద్ధజలరుచిఁ, బాటిల్లఁగఁ గనియె నొక్క పద్మాకరమున్. ౧౧
వ. అందుఁ గృతస్నానుండై యొంటిఁ బసిండిగుడిఁ బ్రవేశించి. ౧౨
శా. ఆలోనం గనియె న్భుజాష్టక విభూషాకీర్ణరత్నప్రభా
జాలోన్మిశ్రితరక్తచందనపయస్సంధ్యాభ్రసంకాశదే
హాలంకారు మహోరగప్రకరజిహ్వాసన్నిభోగ్రానల
జ్వాలాకారకరాళకేశముఖదంష్ట్రాభైరవున్ భైరవున్. ౧౩
క. అట్టిమహాభైరవునకు, దట్టం బగు భక్తితోడ దండాకృతిగాఁ
గట్టెదుర మ్రొక్కి లేచుచుఁ, బట్టికపై నున్న యొక్క పద్యముఁ గనియెన్.
గీ. ఎవ్వఁడైన నిచటి కేతెంచి తనతలఁ, దానె త్రెంచికొనినఁ దక్షణంబ
మొండెములునుదలలు రెండునంటికొనంగఁ,బతియుఁ బడఁతుకయును బ్రదుకఁగలరు.
వ. అనునట్టి పద్యార్థంబునకుఁ గలంగి తత్త్వార్థం బవలోకించుచు. ౧౫
క. చంపుడుగుడి[2]యిది యని యా,దంపతులకళేబరములుఁ దలలుం గని త
త్సంపాదితభయరౌద్రా, కంపితుఁడై సెట్టి బెగడి కన్నులు మూసెన్. ౧౬
క. తదనంతరంబ చెదరిన, హృదయముఁ దనలోన నెట్టకేలకు[3]నిలువం
బాదపెట్టి వెడలి యొక బా,రి దోలఁగ నని విడిదలకుఁ దిరిగి చనుదెంచెన్.
క. ఆరే యచటం బుచ్చి వి,కారవిహీనాత్ముఁ డగుచుఁ గలమునఁ బారా
వారము నడిమికిఁ జని యా, ద్వారావతిపురము సొచ్చి తత్సౌధములోన్. ౧౯
మహాస్రగ్ధర. కనియె న్భూపుత్రజిష్ణున్ ఘనదురితమహాఖండనావిర్భవిష్ణున్
వనమాలాలంకరిష్ణున్ వ్రజవనవిహారద్వల్లవీకేలితృష్ణున్
దనుజేంద్రేరికాసహిష్ణుం దరళమణిమయద్వారకాబద్ధధృష్ణున్
దినకృత్కన్యావరిష్ణున్ ద్విజపతిగతివర్ధిష్ణు గోపాలకృష్ణున్. ౨౦

1. అఖిలవృక్షరమ్యమగునుపద్వీపము నందు. 2. చంపెడుగుడి. 3. నెట్టకేనియు.

క. కనుఁగొని యాదేవునకుం, గనకంబులు మణులుఁ బూజ గావించి ప్రియం
బెనయఁ బ్రణమిల్లి నిటలంబునఁ జేతులు మొగిచి వినయమున వినుతించెన్.

సీ. ఇరుజోడు మొగముల యెత్తుని కొమరుండు నేర్పునఁ బనులెల్లఁ దీర్పుచుండఁ
దప్పనియోజతోఁ దనపిన్నపాపల నాడింపఁ దెల్లని కోడ లుండఁ
గలిమిఁజూ నిల్లాలు కలిమినీనెఱుచూడ్కిఁ బెంపుడుబిడ్డలఁ బెంచుచుండఁ
గమ్మని యమ్ములు గల్గు ముద్దులపట్టి చిల్లంగి చేతలు చేయుచుండఁ
గాలిప్రేలఁ గన్నగారాబుఁగూఁతురు, మొదలివేల్పుఁ గూడి మురియుచుండ
నల్లపాలవెల్లి యిల్లుగాఁ గాఁపుర, మెఱిఁగి చేయు మేటి దొరవు నీవ.

సీ. పాదతీర్థం బతిపావనం బగుటకు శిరమున నిడుకొన్న శివుఁడు సాక్షి
కలఁడన్న నెందైనఁ గలుగుట కుర్వీలోఁ బంబిన యుక్కుఁగంబంబు సాక్షి
తలఁచిన యంతనె తలఁగక యర్థుల రక్షించుటకుఁ గరిరాజు సాక్షి
యాచంద్రతారార్కమగు దానశక్తికి ధ్రువపదంబున నుండు ధ్రువుఁడు సాక్షి
తాలిమికిఁ గాలఁ దన్నిన తపసి సాక్షి, భాగ్యమున కాదిలక్ష్మి చేపట్టు సాక్షి
త్రిభువనగురుండ వగుట విరించి సాక్షి, నిన్ను వర్ణింప నలవియె నీరజాక్ష.

నిరోష్ఠ్యదండకము:—జయకృష్ణ ! జయకృష్ణ ! కృష్ణ ! స్థిరాస్యందనస్థాననానా దినధ్యాననానాసితానేకసేనారజోనీకరథ్యాతిరథ్యాళిసన్నాహసన్నద్ధరాజన్య జన్యాగతానన్యసాదృశ్యదృశ్యాంగహృష్యజ్జరాసంధసంధానయంత్రాదియత్న క్షయాదాయి ! నీతిశ్రితాసారసారాంతరజ్ఞానదాసాహితధ్యాన సన్నద్ధతేజః కళాసంచితానంద! నందాంతరంగాంతరంగన్నిజానందినీరాకరాకారరాకానిశా ధీశ ! ధీశస్తసంచారసంచేయ ! సత్కీర్తినారీలసన్నారదారాధితాచార ! ధీరాం గనానాయకాద్యంతరాజాతశాస్త్రార్థసారాశయాగణ్య ! గణ్యాకృతిచ్ఛాయ ! రాధానిరంతస్తనాద్రిస్థలక్రీడనాయత్తచిత్తస్థిరాసక్తిలీలానటీరంగరంగస్థలీసాధనా హృష్ట! దుష్టాహితాభేదనాకాలసంజాతరాగాఢ్యనేత్రాంతకంసారిహింసాకళాద క్ష ! దక్షక్రియానాశనాకారకాశాకరేశాదిగర్జద్గణాధీశశస్త్రీసహస్రీజయశ్రీర ణాసార నిస్సారితాకారనీరంధ్రతేజోలసచ్చక్ర ! చక్రాకృతిశ్లాఘనీయాంతశార్ ఙ్గాత తజ్జ్యాలతానిర్గతాఖండకాండాగ్రఖండీకృతారాతిసంఘాత! ఘాతస్ఖలత్కాళి యాహీంద్ర శీర్షాళిరంగక్షితిక్రీడనాహర్షణాశ్చర్యకార్యాంగహారాయతిజ్ఞానస త్యక్షణాసక్తచిత్తాదితేయాదిసిద్ధాంగనాకిన్నరీయక్షసంకీర్తితానంతకీర్తిస్రగాధార! ధారాళధారాధరాకాశనీలాంజనేందిందిరానీలసచ్ఛీకర గ్రాహకాళిందిహేలాక

రాత్రిమహఃప్రవృత్తివిస్ఫూర్తిసంగత్యశాంతాది సంతత్యహంకార! కారాగతారాతి నాకికసక్తంచరాన్యక్ష నిశ్శేషణీశాతనాకేళిఖేలజగజ్జాల! జాలాంతగాఢాంధకారచ్ఛిదానందకృత్యాకరాదిత్య! నిత్యాహితస్నేహసంరక్షితాశేష! రక్షస్సతీసంఘదృక్కజ్జలక్షాళనాశీలధారాజలాధారఖడ్గాగ్ర లగ్నాహితానీకరక్తాధరన్యస్తనాఖ్యాంతశాసంగి సంగీతసంతుష్టసారంగరంగత్తరంగాదిగంగానదీకారణాంఘ్రి! స్మితానంద సంక్రందనాగ్నక్ష్మజాతాదితేయాంగనీరాధినాథానిలాధీశ గంగాధరాద్యష్ట దిగ్రక్షకశ్రేణికాశేఖరానర్ఘ్యరత్నాళినీరాజనారాజితాకార! కాంతిచ్ఛటాకాంత సంధానితాలీల! లీలాలసచ్చారిణీగీతసీరేజసంచారిణీరాజరాజాగ్రణీ. ౨౬

మ. అనుచుం బెక్కువిధంబులం బొగడి సాష్టాంగంబుగా మ్రొక్కి ధ
న్యునిఁగాఁ దన్నుఁ దలంచికొంచు జనమాన్యుం డౌచు నుజ్జేనిక
ల్లన నేతెంచి మహీతలేంద్రు నధికాహ్లాదంబుతోఁ గానుక
ల్గొని దర్శించిన నావణిక్ప్రవరు సద్గోష్ఠిం బ్రియం బందుచున్. ౨౭

గీ. వైశ్యచంద్ర నీవు ద్వారకానాయకు, చరణసేవ కేగి తెరువు నందుఁ
గ్రొత్త యేమి గంటి వత్తెఱం గెఱిఁగింపు, మనిన ధనదుఁ డిట్టు లనియెఁ బతికి.

క. ద్వారవతి కేగు తెరువునఁ, బారావారంబులోని నుపద్వీపమునన్
భైరవుగుడిలోపల నతి, భైరవభావార్థ మైన పద్యముఁ గంటిన్. ౨౮

వ. అది యెట్టిదనిన. ౨౯

గీ. ఎవ్వఁడైన నిచటికేతెంచి తనతలఁ, దానె త్రెంచుకొనినఁ దత్క్షణంబ
[1] మొండెములునుదలలురెండునంటుకొనంగఁ, బతియుఁబడఁతుకయును బ్రదుకఁగలరు

క. కథ గాదిది ముందట నామిథునము మొండెములుఁ దలలు మేదినిఁ బడవే
వ్యథహేతువులైనవి తత్కథనంబున నామనంబు తలఁకెడు నిపుడున్. ౩౦

ఉ. నావుడు విక్రమార్కుఁడు మనంబున నుత్సుకుఁడై వణిక్పతీ
నీ వటు రమ్ము పోద మని నిశ్చలఖడ్గసహాయుఁ డౌచు నా
త్రోవన యేగి యచ్చటి సరోవరతీర్థము లాడి రక్తపూ
జావృతుఁడైన భైరవుని సద్మము డగ్గఱి సెట్టి మాన్పఁగన్. ౩౧

శా. తద్వారంబున సెట్టినుంచి చని యంతర్వేదిపై భుక్తిము
క్తిద్వారం బగు కాళినాథునకు భక్తిన్ మ్రొక్కి సంతుష్టుఁడై

1. రుండములకుఁ దలలురెండునంటుకొనంగ?-తుండములకుఁ దలలురెండు- చిన్నయ్యసూరి.

శేఖరవై శాఖశిఖరసఖిశిఖిశిఖిశిఖండకశతమఖము లనఁగ
ఖాదిరాఖేటకఖర్జూఖసూచిప్రముఖఖచితఖలపూనఖరము లన
తోఁ నింక వర్గచతుర్థఘకారము లై తగు నీపయి నాహ్వాయములు
ఘంటాఘనాఘనఘ్రాణఘాతుకఘనఘీంకారఘృణిఘోరఘృష్టు లనఁగ
నోఘాఘుఘుర్మనిదాఘులంఘనమాఘులఘిమజంఘాలార్ఘ విఘటిక లన
నిర్ఘాతసంఘాతదీర్ఘజంఘామోఘసరఘామఘవమఘిపరిఘము లన
ద్రాఘిష్ఠఘూర్ణితశ్లాఘాప్రఘోషౌఘజఘనప్రఘణమేఘజాంఘిక లన
రాఘవఘస్మరలాఘవానఘపరిఘా *మాఘ్యఘోశఘాసము లన
అర్ఘ్యనిరాఘాటదైర్ఘ్యదార్వాఘాటఘటనాఘటాసంఘఘటము లనఁగ
ఘోటకఘంటికాఘోణఘుమంఘుమోద్ఘాటనరఘుఘుణంఘుణ లనఁగఁ
దెలియంగ వర్గద్వితీయథకారము లై రహిఁబొల్చుఁ బై పేరు లింకఁ
బార్థివమన్మథపార్థివావితథార్థి పృథురాట్ప్రమాథిసత్రాథ లనంగఁ
దైర్థికాతిథ్యార్థపార్థపృథుప్రథామంథానమంథరగ్రంథము లనఁ
బ్రీథప్రథమనాథగాథావ్యథానుథాశ్వత్థామ మిథునకపిత్థము లన
గథ్యామనోరథగ్రంథిచైత్రరథోత్థపాథఃప్రథనరథప్రోథము లనఁ
మిథ్యాపథికతథ్యపథ్యపాంథసమర్థతీర్థనిశీథచతుర్థ లనఁగఁ
బ్రార్థనాసర్వథాపార్థయథాతథాతిథివికత్థననిశీథిను లనఁగ
యూథకంథాక్రోథిపీథివమథుయూథిపథివరూథిమథప్రమథు లనంగ
నశ్వత్థపృథివికాయస్థావయస్థమస్థసమిదిత్థంభూతసార్థము లన
నస్థిరస్థేమస్థితిస్థగితస్థలసక్థిసుస్థవిరాతిత్థికము లనఁ
బ్రస్థానసంస్థావ్యవస్థామహాస్థాకరస్థసిక్థమిథిలాప్రస్థము లన
వరుసగా నింక మీఁద వర్గచతుర్థధకారము ల్దనరును గోరువగను
గంధబంధురసింధుసైంధవసింధురరాధామధురిపువిరాధు లనఁగఁ
గంధరాంధదివాంధగంధబాంధవబంధుసంధానుసంధానసంధు లనఁగ
నంధకపరిపంధిదంధనాద్ధావిధాధూసరశ్రద్ధాతిధూర్తు లనఁగ
యుద్ధసన్నద్ధనిరుద్ధబద్ధాసిద్ధవిద్ధానిరుద్ధప్రసిద్ధు లనఁగఁ
బద్ధతిగోధాసముద్ధతాయుధసుధాపీవధామోధనవిధము లనఁగ
బుద్ధసమిద్ధసమృద్ధకదధ్వాధ్వధైనుకాబధ్నత్ప్రధానము లన

---

* పరిఖ యని కవర్గద్వితీయముగా నుండవలయును.

1. సమిత్ = కాష్ఠము. ఇది తవర్గ ద్వితీయాంతము కాదు.

శ్రద్ధైర్యాశ్రీధానమాధుర్యహూత్రాహాతధృతిపిధానసధ్వస్తధృతము లనఁగ
షుద్ధహుద్ధస్నిద్ధదిద్ధసమాధిధురంధరాంధోధ్వాంతకంధు లనఁగ
విధువిధుధ్వాంతఘాతివిధివిధురవ్యాధియోద్ధైధమానవిరోధము లన
బంధూకసంబంధగంధకసంధ్యవధిప్రతిషేధకధిషణు లనఁగ
వింధ్యాద్రిసౌగంధ్యసంధ్యానస్థిరత్నసంధ్యకసంధ్యాత్యవంధ్యము లన
నిర్ధారణార్ధాంగమర్ధరమర్ధ్రవార్ధకస్పర్ధాశుశీర్ధవు లన
వార్ధక్యగీతార్ధమూర్ధన్యవర్ధకివర్ధితాయోధ్యారివర్ధకు లన
వార్ధత్రయోవార్ధిమూర్ధగోవర్ధనహార్దుషికాంతర్ధినిర్ధను లన
ప్రసవధునివ్యాధ్యోవిధుంతుదాంతర్ధానరోధనధృతిధూపసౌధము లన
దోర్ధ్రథామ్యాస్నిగ్ధదోర్గ్ధ్రీవధూధవర్ధద్ధాపబుద్ధప్రవృద్ధు లనఁగ
స్తబ్ధరోమవిలబ్ధలుబ్ధకప్రారబ్ధలబ్ధాబిలబ్ధిసంలుబ్ధు లనఁగ
గృధ్రమహీధ్రారిరోధ్రసధ్రీచీనరంధ్రనీరంధ్రపురంధ్రు లనఁగ
నింధనసింధుజలంధరసంబాధవధ్రిసైరంధ్రాంధ్రవంధ్య లనఁగ
బుధ్నవద్ఘ్నధ్నధీబ్రధ్నబుధ్నమధురాదధిశతధాసీధునిధు లనంగ
ధూమధావనసాధుధామధర్మధిషణామాధవాభిధమధుమాధవు లన
బోధమేధోపాధిసాధారణవిధాతృమధురమధూళికామధువు లనఁగ
నాధ్మాతవేధోధిసిధ్మలభూధరదేధ్మీయమానసుధేధ్మ లనఁగ
మేధ్యమధ్యధ్యానసాధ్యవధ్యారాధ్యమధ్యమాధ్యాహారబాధ్యము లన
ధారణాధోరణధోరణీధారాళిధారాధురీణధూర్ధీరు లనఁగ
నధరాధరాధోక్షుబుధవధూధానుష్కధూర్వహధారేయ ధుర్య లనఁగ
సాధకనిషధప్రసాధనసుగ్ధనుర్ధారణీవారిధిధరణు లనఁగ
నిధువనధ్వజినీపరిధిబధిరీధ్వజారాధనద్వైధశరధు లనంగ
మాగధసాన్నిధ్యగాధప్రణిధిసముత్సేధావరోధనిషేధము లన
గాధేయవిధిపరివ్యాధమహాపధశపధ[1] రాధేయవిశ్లధము లనఁగ
ధన్వధూర్జటివిరోధకృదసురాధాకబాధానుబంధిప్రబంధము లనఁ
బరిధావిసిద్ధార్ధి బహుధాన్యసుధీరోద్గారిసాధారణధాతువు లనఁ
గ విరోధినిధనధాతువసుధాధ్యేశవ్యధర్మధర్మాధానసధర లన నీక
సావిదల్లుఁ డనంగ దౌవారికుఁ డనంగ సాపేరనృపతినా యకావన మున

1. శపథ=ద్వితీయాంతము.

వెలయు సంస్కృతమున ద్విత్వంబు లేని మధ్యవకారనామంబు లవని నింకఁ
గనఁ దెనుంగునను వకారములకు ద్విత్వములు గల్గి కొన్ని పేరులు చెలంగు
అవ్వ కవ్వము చివ్వ క్రొవ్వు బువ్వము గవ్వ నివ్వటి ల్లవ్వము గువ్వ లనఁగ
బువ్వ జువ్వలు నవ్వు నెవ్వగ నువ్వుఁ లవ్వ జువ్వలు మువ్వ లనఁగ నింకఁ
క్రయ్యసాన్నాయ్యనికాయ్యధాయ్యాత్కుయ్యజయ్యసాహాయ్యసంచాయ్యపాయ్య
శయ్యాదిశబ్దాలఁ గియ్యవళ్లు దనర్చు నీకియవళ్లు రా కెసఁగునట్టి
పదములు తగు నింక వైయాసికాత్మీయహైయంగవీనవైయాయికు లన
వైయాత్యమనఁగను వైయాకరణులు నైయగ్రోధములు ద్వితీయలు నన రమ
ణీయతదీయత్వదీయమదీయాస్మదీయులు నా యుష్మదీయు లనఁగఁ
గమనీయతపనీయగణనీయవంధ్యఘటీయు లనఁగ భవదీయు లనఁగ
నింకమీఁద మకారసంకలితహకారములు కొన్ని దనరాపుఁ దెలివిడిగను
గనుఁడు జిహ్మజిహ్మగబ్రహ్మజిహ్మగబ్రాహ్మణు లనఁ బరబ్రహ్మ మనఁగ
నింక రంహోంహప్రబృంహణసంహితాసంహతిసంహారసింహసంహ
ననము లన్శబ్దముల్ కనఁగ ననుస్వారయుతహకారమ్ములై యొప్పు నిటులు
నింకమీఁద హకారసంకలితవకారము లగుచుఁ గొన్ని రాజిలుచు నుండుఁ
బ్రహ్వగహ్వరకహ్వవిహ్వలాహ్వనాహ్వబహ్వశిబహ్వష్ఠజిహ్వ లనఁగ
గుహ్యసమూహ్యదందహ్యమానగ్రాహ్యకైతిహ్య లనఁగ వాహ్యాళి యనఁగ
సహ్యజాబాహ్యాపవాహ్యగుహ్యకసహ్యవాహ్యలేహ్యము లన వఱలుపదము
లన్నియు నిర్బిందులై కియ్యవళ్లతోఁ గూడుకయుండు నీజాడ నింక
నిర్ణయస్వర్ణదీమూర్ణితిగీర్ణాధులనుశబ్దములముంపఁ ద్రినయన మను
శబ్దమునందు నెసఁగు ద్వితీయనకారములకు ణకారము గలుగ దటుల
నల్లయాచార్యాని యనుశబ్దమునకు లే కర్ణవర్ణాపఁల్ ణకారము లేక
ద్రుహిణప్రతధ్రువద్రుపదత్రుటీప్రమభ్రూభ్రుకుంసశ్రుతిస్రుక్స్రవములు
క్రూరవిశ్రుతశతప్రక్రుద్ధశత్రుకప్రభ్రూణములు కొమ్ముతోడి క్రార
లింక వట్రువసుడి పొంకమౌ శబ్దాల పేరులు తగుఁ గొన్ని భృంగశృంగ
కృపకృషికృతిభృతినృపసృణిపృథువృత్తిధృతిమృషాదృఢభృగుపృథులవృజిన
విసృమరాసృక్స్మృతిఘుసృణమసృణగృహకృత్తిప్రసృతిదృప్తవృద్ధితృప్త
వృక్కావృషభపరివృషకృత్స్నమృత్స్నఘృతగృధ్నుకృంతనబృసీతృణసృగాల
దృగ్గ్రృష్టిఘృణిఘృష్టికృకవాకుమృగవృష్టితృష్ణాదృషత్పృష్ఠతృష్ణ లనఁగ

నీకమీఁదఁ జెనుఁగునఁ బృథివి యన్పేరొందుఁ గాక కడమ కొమ్ము క్ర్ర లగును
గాన నీద్వివిధముల్ కవులు ప్రాసస్థలుల్ తెలిసి పద్యంబుల నిలుప మిగుల
నీటుల వెలయుచునుండునౌ నెల్లకృతులఁ, జగతినాచంద్రతారార్కమగుచునిదియు
వ్రాయఁ జదివిన వినిన నెవ్వారి కైన, విభవములు గల్గు నీకృప వేంకటేశ.

పంచచామరము. ఘనాఘనాతికాంతికాంతకాంచనాక్షశాసనా
జనాసశాక్షనాచనాక్షశాసనాజపాలకా
ఘనాఘనావనాఘనాఘకాలపాకనాశనా
ఘనాఘనాశనాకపారిఖండనారమాధవా.

—: ఇది త్రిశూలబంధము :—

| | | | | |
|---|---|---|---|---|
| ఘ | | తి | | లకా, ఘనాఘనావ |
| నా | తి | కాం | చనాక్షశాసనా, జపా | రిఖండనారమాధవా, |
| ఘ | | త | | కనాశనా, ఘనా |

ఈపద్యమునకర్థము:—ఘనాఘనాతికాంతికాంత- ఘనాఘన=మేఘుని యొక్క, అతికాంతి=అతిశయమైన కాంతివంటి కాంతిచేతను, కాంతా=ఒప్పెడివాఁడా! కాంచనాక్షశాసనా- కాంచనాక్ష=హిరణ్యాక్షునికి, శాసనా=శిక్షకుఁ డైన వాఁడా! జనాసశాక్ష- జన=జనులవిషయమై, అ=అంతటను, సశ=కాంతితోఁ గూడినటువంటి, అక్ష=కన్నులుగలవాఁడా! నాచనాక్షశాసనాజపాలకా- నా=జ్ఞానప్రధానమైనటువంటి, చ=చంద్రునికిని, న=వినాయకునికిని, అక్షశాసన=జితేంద్రియులకును, అజ=బ్రహ్మకును, పాలకా=పాలకుఁడైనవాఁడా! ఘనాఘనావనా=గజరక్షకుఁడా; ఘనాఘకాల- ఘన=ఘనమైన, అఘ=పాపమునకు, కాల=అంతకుఁడా! పాకనాశనాఘనాఘనాశ- పాక=చిన్నవాండ్రను, నాశనా=కొట్టుటకు, అ=హేతువైన, ఘనాఘన=ఘాతుకులను, అశ=హరించువాఁడా! నాకపారిఖండనా- నాకపారి=రాక్షసులను, ఖండనా=ఖండించెడివాఁడా! రమాధవా=ఓలక్ష్మీధవుఁడా!

ఇందులకు నానార్థరత్నమాలికానిఘంటుప్రయోగములు.

సః పుం స్యుమాసుతే వాయౌ దేహే కాంతే తు సాస్త్రియామ్.
చ స్తురుష్కే స్వరేచాపే[1] చకోరే చంద్రమస్యపి.

1. చాపే- అనుటకు చోరే అని కలదు,

శాస్త్రియాం దేవపూజాయాం శక్తౌ శోభావరేణ్యయోః కంపేవిత్తే భారే యుగాగ్రయోః.
హేరంబే నః పుమాన్ నాస్త్రీ నాభా(సం)సుజ్ఞానవాద్యయోః.
అకారో బ్రహ్మవిష్ణ్వీశకమఠేష్వంగణేరణే
గౌరవేస్త్రః పురే హేతౌ భూషణేంఘ్రావుమేబ్జయోః.
శక్రఘాతుకమత్తేభవర్షుకాబ్దఘనాఘనాః. (ఘనాఘనస్త్రివృత్రే, వర్షుకమేఘే ఘాతుకమత్తేభే) అని ముద్రితప్రతి.

---

గద్యము. ఇది శ్రీమత్పెరుంబూదూరియతిరాజాచార్యవర్యకరుణాకటాక్షసంప్రాప్తాంధ్రకవితాసామ్రాజ్యధురంధర నీతియుగంధర నందవరకులకలశజలధిపూర్ణిమాచంద్ర సత్యహరిశ్చంద్ర వాసిష్ఠగోత్ర ప్రశస్తాశ్వలాయనసూత్ర కార్యఖడ్గప్రవీణ కామినీజనపంచబాణ కర్ణాటతుండీరచోళపాండ్యమండలప్రముఖాఖిలమహీమండలాఖండలదత్తమత్తసింధురసైంధవాందోళికాచి రత్నరత్నకాంచనాంబరాదివస్తుప్రశస్తమందిర నిరంతరవసదిందిర సకలకళావిచక్షణ నిఖిలశుభలక్షణ లక్షణకవి వేంకటపత్యమాత్యాభిధానాస్మద్వరవిరచితంబును మంగమాంబాసమేతగణపవరాప్పయమంత్రిమణివిఖ్యాతమజ్జనకరూపాలమేల్మంగాసనాథతిరువేంగళనాథాంకితంబును నగు సర్వలక్షణశిరోమణి యను మహాకావ్యంబునందలియాంధ్రకౌముదియందు నాంధ్రోద్భవకారణంబును బంచవిధాంధ్రభాషాస్వరూపంబును సంజ్ఞాప్రకరణంబును నజంతసంధినిరూపణంబును హలంతసంధిప్రచారంబును విభక్తినిర్ణయంబును నవ్యయపద్ధతియును స్త్రీప్రత్యయకథనంబును కారకగ్రథనంబును సమాసభేదంబును తద్ధితపదనిష్పత్తియు సుప్తిజంతవాచకవిన్యాసంబును గృదంతప్రత్యయరీతిభావార్థప్రతిపాదనంబును వికల్పజశ్త్వాదేశవిధంబును సామాన్యవిశేషసూచకంబును శకారసకారభేదనిశ్చయంబును ఖఘధభవర్ణసరణియును వకారయకారద్విత్వశబ్దమార్గంబును సంయుక్తహకారశబ్దభేదప్రకటనంబును రేఫఋకారవివరణంబును గలయది తృతీయోల్లాసము.

---

# గ్రంథప్రశంస

ఈగణపవరపు వేంకటపతికవి, నందవర బ్రాహ్మణశాఖకుఁ జేరినవాఁడు. వసిష్ఠగోత్రజుఁడు. ఆశ్వలాయనసూత్రుఁడు- ఈతని తండ్రి అప్పయార్యుఁడు, తల్లి మంగమ్మ. నివాసము గణపవరము. ఇది కాటేపల్లెముఖ్య మని వేంకటేశ్వర విజయవిలాసములో వ్రాసికొన్నాఁడు. ఏమండలములోనిదో- ఈతఁడు రచియించిన గ్రంథములు:—

సీ. శ్రీకరంబుగఁ బదిరెండవయేటఁ దారావళు లచియించి ప్రౌఢిఁగన్న
మునిమునిమిాసంబు మొనయు నేట యమకశతకంబొనర్చి కౌశలముగన్న
యిరువదియవయేట శృంగారమంజరియు నుదాహరణఁ జేసి ఘనతగన్న
యిరువదే నగునేటఁ గృష్ణమల్లకథఁ జతుర్భద్రఁ జెప్పి సంతుష్టిగన్న
మఱియును బాలరామాయణ ద్విపదఁ బొసంగించి బహువిధ చాటుకవిత
నతిముదముగన్న నాదు జిహ్వాంచలంబు, తనివినొందదు కులదేవతావతంస
వేంకటేశ్వరచరణారవిందమహిమ, నవనవోన్మేషపేశవర్ణనలఁగాక.

సీ. అమరమునకుబదు[1]లభినవాంధ్రనిఘంటు కౌముది[2]కెనయాంధ్రకౌముదియును
గణయతిప్రాసలక్షణ సీసమాలిక[3] యాంధ్రప్రయోగరత్నాకరంబు
నిఖిలరేఫఱకారనిర్ణయపద్ధతి[4] షట్ప్రత్యయముల ప్రస్తారసరణి[5]
తగునిర్వచనాఱుఛందములకువచనంబు[6]సమధికాలంకారసారమనుమ
హాకృతులు సేయు మాపేర నీకెచెల్లుఁ, గాక పెఱకవులకు నెట్లు కలుగనేర్చు
నౌర నీశక్తి యెక్కడనైనఁ గలదె, గణపవర యప్పనార్య వేంకట కవీంద్ర.

సర్వలక్షణశిరోమణి, ప్రబంధరాజవేంకటేశ్వరవిజయవిలాసము నిందుఁ జేరలేదు.

ఇందు మొదటిపద్యములోని వృత్తాంత మింతవఱకుఁ దెలియదు గాని రెండవదానిలో నుదాహరింపఁబడిన 1. వేంకటేశాంధ్ర మను నామాంతరము గలది సర్వలక్షణశిరోమణిలోని ద్వితీయోల్లాసము. రెండవది తృతీయోల్లాసము. 3 ది ప్రథమోల్లాసములోని యొక ప్రకరణము. 4 ది యైదవయుల్లాసము మొదటనున్నది. 5-6లు దీని నాల్గవయుల్లాసములోని భాగములు. ఇదిగాక, కవితాలక్షణము, నాయికానాయకలక్షణములు, కావ్యలక్షణము, రసప్రకరణము, కావ్యదోషప్రకరణము మున్నగునవియనేకప్రకరణము లీయుల్లాసములలో నిమిడియు

న్నవి. రెండవపద్యమున సంకేతములచే నిరూపింపఁబడినవి యాఱును నామమాత్రావశిష్టము లని కవులచరిత్రయు, ప్రబంధరాజవేంకటేశ్వరవిజయవిలాసపీఠికయుఁజెప్పుచున్నవి. ఇందలి యింకొకపద్యమునుబట్టి యీకవి వసంతతిలకభాణమును వెనిఁగించినట్లు కనఁబడుచున్నవి. మొదటిపద్యమున నుదాహరింపఁబడిన తారావళులెన్ని గలవో కాని యింక రేఫఱకారనిర్ణయమును దారావళిగాఁ జెప్పెదనని కవి ప్రతినచేసినట్లు కన్పట్టుచున్నది. ఇట్లు బహువిషయములను దెల్పు బహుగ్రంథములు రచియించిన యీతనికృతులలోఁ గొన్ని పోయిన వేమో గాని సర్వలక్షణశిరోమణి బహువిధముల లోకమున కుపకరించు గ్రంథమని మాత్రము వచింపవచ్చును.

కవికాలమును, గవులచరిత్రమును ప్రబంధరాజవేంకటేశ్వరవిలాసపీఠికయును సరిగ నిర్ధారణచేయలేవు. ఇతఁడు ప్రబంధరాజవేంకటేశ్వర విలాసములో విన్నకోట పెద్దనార్యాదుల కావ్యాలంకార చూడామణ్యాదులను బేర్కొనుచు “సర్వలక్షణ సారసంగ్రహ, సరస్వతీవిలాస, సాత్యచింతామణి......లక్షణంబులకు లక్ష్యంబును” అని వ్రాసికొనియెను. ఇందుఁ బేర్కొనఁబడిన సర్వలక్షణ సారసంగ్రహము చిత్రకవి పెద్దనార్యుఁడు రచియించినదే కాని కూచిమంచి తిమ్మకవిది కాదని తలఁపవచ్చును. ఏమనఁగా- కవి తనగ్రంథముల యవతారికల యందే కాక యీసర్వలక్షణశిరోమణి యుల్లాసముల తుది గద్యములయందుఁ గూడ...“కర్ణాటతుండీరచోళపాండ్యమండల ప్రముఖాఖిల మండలాఖండల దత్త మత్తసింధుర...రత్నాంబరాదివస్తు...నిఖిలశుభలక్షణ లక్షణకవి వేంకటపతికవి” యని వ్రాసికొన్న దానింబట్టిచూడఁగాఁ బాండ్యమండలప్రభువులలోనాంధ్రకవుల నాదరించుటచేఁ బ్రశస్తికెక్కిన—“మండలేశ, పాండ్యమండలేశ, పాండ్యభూవిభు” మొదలుగాఁ గల విశేషణములచే వ్యవహరింపఁబడినవాఁడు విజయరంగచొక్కనాథభూపాలుఁడే యని పెక్కండ్రు దాక్షిణాత్యకవుల వ్రాఁతలవలనవిశ్వసింపఁదగియుండుటచే నీకవి యతనికాలమందే, యనఁగా క్రీ. శ. 18 శతాబ్దము మొదట నుండినవాఁడై కూచిమంచి తిమ్మకవికి సమకాలికుఁడై యుండునని తోఁచును.

ఈగ్రంథములు నందందు “ప్రబంధరాజవేంకటేశ్వరవిలాసములో సరిచూచునది” యని యుండుటచేతను ఆగ్రంథము నవతారికలో నీగ్రంథములోని వేఱువేఱుభాగములు వేఱువేఱు కృతులుగాఁ బేర్కొనఁబడియుండుటచేతను నేది ముందురచియించెనో నిశ్చయించుట కవకాశము లేదు గాని కవితాలక్షణము వేం

కటేశాంధ్రము (ఆంధ్రనిఘంటువు) ఆంధ్రకౌముది, నిఖిలరేఫఱకారనిర్ణయము, షడ్వింశతిచ్ఛందోలక్షణము మొదలుగాఁ గల లక్షణములను ముందుగా రచియించి వానికి లక్ష్యముగాఁ బ్రబంధరాజవేంకటేశ్వరవిలాసమును రచియించి యందుఁ దాను బూర్వము రచియించిన యాయాలక్షణములను వేఱువేఱు కృతులుగాఁ బేర్కొని తరువాత మఱికొన్నిలక్షణములనుగూడఁ జేర్చి యాపూర్వోక్తలక్షణము లన్నింటికిఁ గలిపి సర్వలక్షణశిరోమణి యను పేరుపెట్టి యుండు నని యూహింపఁ దగియున్నది.

గీ. వేంకటేశాంకితమ్ముగ వేంకటపతి, రచిత సర్వలక్షణశిరోరత్నకృతిని
యూహిగఁ దలిర్చు నాంధ్రద్విరూపకోశ, మనవెలయు దశమోల్లాసమసమలీల.

అను పద్యమునుబట్టి యిది పది యుల్లాసములకుఁ దక్కువకాని గ్రంథ మని యాంధ్రద్విరూపకోశముతోపాటు మిగిలిన గ్రంథములుగూడ మిగిలిన యుల్లాసములలో నిమిడియుండు ననియుఁ దెలియుచున్నది.

ప్రబంధరాజవేంకటేశ్వర విజయవిలాసమును ముద్రించిన యముద్రితగ్రంథచింతామణి పత్రికాధికారులకును లక్షణశిరోమణి తెలియరాలేదు, కావుననే "యిక్కవి కృతులలో నొక్క వేంకటేశ్వరనిఘంటువు తప్పఁ దక్కిన గ్రంథములు నామమాత్రావశిష్టములై యున్నవి." అని చెప్పియున్నారు. ప్రబంధరాజము నెఱింగిన కవులచరిత్రమును లక్షణశిరోమణి నెఱుఁగదు. కావుననే "రెండు మూఁడు కృతులు దక్క శేషించిన వన్నియు నామమాత్రావశిష్టము లయినవి" అని వ్రాసెను.

ఇంకను వేంకటపతికవింగూర్చి తెలిసికొనఁ బరిషత్పత్త్రిక 4 వ సంపుటము లలోఁ జూచునది. పైవిషయమును దానికి సంగ్రహామే.

ఇది వేయిచరణములుగల సీసమాలిక. సర్వలక్షణశిరోమణి పూర్తిగఁ బరిషత్కార్యాలయమునలేదు. అందుఁ గౌముదిగల తాళపత్రసంపుటములురెండున్నవి. అందొకటి యసంపూర్ణము, రెండవది పూర్ణమే గాని వ్రాఁతతప్పులు మెండు. ఈ రెంటినిబట్టి, వ్రాయించి దీనిని బ్రకటింపవలయు నని వెనుక పరిషత్కార్యాలయము చెన్నపురిలో నున్నపుడే సభ్యులు తలంచిరి. మాతృకనుండి నేనే యొక్కప్రతికను వ్రాసితిని. దానిని కొ. వేం. లక్ష్మణరావుపంతులుగారు నితరులును, సంస్కరించుటకు-దండిగుంట సూర్యనారాయణశాస్త్రిగారి కిచ్చియుండిరి. దానిని వారు సంస్కరింప కుండఁగనే కీర్తిశేషులైరి. వారియొద్దినుండి వ్రాఁతపుస్తకము మరలదొరకినదికాదు. అంతటితో నాయుద్యమ మప్పుడు తగ్గినది. అప్పు డప్పుడు శ్రీయుత గునుపాటి

యేనాదిరెడ్డిగారు మున్నగువారు తలంపునకుఁ దెచ్చుచుండుటచే నిటీవల దీనికి మరలనొక పుత్రికను వ్రాసితిని. దానిని శ్రీసూర్యరాయాంధ్రనిఘంటు కార్యాలయ నిర్వాహకులు బ్ర॥ శ్రీ॥ చర్ల నారాయణశాస్త్రిగారు పరిష్కరించిరి. అదియే యిది.

దీనివిశేషము లివియే చెప్పుకొనునుగాన నీ చిన్నిపొత్తమునకు విశేషించి విమర్శనము వ్రాయలేదు.

ఈసంపూర్ణతాళపత్రపుస్తకము పరిషత్పుస్తకభాండాగారములో 16 వ సంఖ్యగలది. చివర-"౮౦౦ గ్రంథము. సిద్ధార్థినామసంవత్సరము ఆవణినెల ౧౫ తేది రాచవేల్పు కృష్ణమరాజు స్వహస్తలిఖిత"మని కలదు. ఇది పుదుకోటలో సంపాదింపఁబడినది. ఈ సంపుటములో దీనితోపాటు శబ్దమంజరి, ఆంధ్రనామసంగ్రహము, అకారాదిదేశి తెనుఁగునిఘంటువు, వేంకటేశాంధ్రము, ఆంధ్రశబ్దచింతామణియుం గలవు.

కొత్తపల్లి సూర్యారావు.

# విషయసూచిక.

---



---

# ప్రకటన.

ఈ 1935 సంవత్సరము ఆగష్టు నెల ది 24-25 తేదీలు శనివార ఆదివారములలో ఆంధ్రసాహిత్యపరిషద్వార్షికసభ గోదావరీమండలములోని అమలాపురములో జరుగును. దయతో భాషాభిమానులెల్లరు విచ్చేయు గోరుచున్నారము.

కార్యదర్శులు.

# కాకినాడ హోమోపతి పత్రిక.

హోమోపతీ మరియు బయోకెమిక్ చికిత్సలను గూర్చియు, ఆరోగ్యాది విషయములను గూర్చియు అనుభవశాలురగు వైద్యులచే వ్రాయబడిన వ్యాసములు, క్లినికల్ కేసు రిపోర్టులు, మొదలగువానితో తెలుగునను యింగ్లీషునను వెలువడునట్టి ఆంధ్రహోమోపతీ మాసపత్రిక. ఇది ప్రతిగృహస్థునకును వైద్యునకునుగూడ నెక్కువ యుపయుక్తముగానుండును.

సంవత్సర చందా రు 1-4-0 మాత్రమే. విడిపత్రిక రు 0-2-0. ప్రకటనరేట్లు అతిసరసము.

వలయువారు:—

డాక్టరు: వై. గణపతిరావు,

సంపాదకుడు.

కాకినాడహోమోపతీపత్రిక, కాకినాడ.

అని వ్రాయవలెను,

58. అన్తఃప్రశ్నం బహిఃప్రశ్న ముభయప్రశ్న మేవ చ
పృష్టప్రశ్నోత్తరప్రశ్నే జాతిప్రశ్నం చ తత్త్రిమాః.

ప్రహేళిక. 59. ప్రశ్నం ప్రహేళికా మాహు ర్యత్ర నోత్తరభాషణమ్
కిన్తు వాక్యార్థ ఏవాసౌ దుర్బో[ధో బో]ధ్యతే బుధైః.

ప్రహేళిక, ఆఱు 60. పరివర్తిత-విన్యస్త-లుప్త-వ్యుత్క్రమ-బిన్దుకైః
విధములు. వర్ణైః సా పఞ్చధా షష్ఠీ భవే దర్థప్రహేళికా.

యమకము, ఏడు 61. ****త్తు భిన్నార్థా యావృత్తిః శబ్దసన్తతేః
తరగతులు. కవివ్యుత్పత్తినికషం యమకం నామ తద్విధః.

62. అవ్యపేతం వ్యపేతాఖ్య మవ్యపే***తకమ్
నియతానియతస్థానభేదా త్షోధా తదుచ్యతే.

63. ద్విరభ్యాస త్రిరభ్యాస చతురభ్యాసపాశజమ్
**భ్యాసభవం చాన్య త్సప్తమం స్యా త్సముద్గకమ్.

64. ఏతేషాం తు నకార్ త్స్న్యేన ప్రభేదా వక్తు మీప్సితాః
లక్ష్యలక్షణ[బోధా]ర్థం దిఙ్మాత్రం తు ప్రదర్శ్యతే.

గూఢోక్తి, అయిదు 65. లుప్తరూపః పదన్యాసో గూఢోక్తిః పఞ్చధా భవేత్
విధములు. క్రియాకారకసమ్బన్ధ పదాభిప్రాయ[భేదతః].

ఔచిత్యమును, రస 66. అమీ చ శబ్దాలఙ్కారాః పద్యే గద్యే చ కోవిదైః
మునుబట్టి, పద్య కార్యా సన్దర్భశోభాయై యథౌచిత్యం యథారసమ్.
గద్యములయందు 67. ఇహ శిష్టానుశిష్టానాం శిష్టానా మపి సర్వదా
సందర్భశోభకై శ వాచా మేవ ప్రసాదేన లోకయాత్రా ప్రవర్తతే.
బ్దాలంకారముల 68. ఇద మన్ధంతమః కృత్స్నం జాయేత భువనత్రయమ్
నుపయోగింపఁ యది శబ్దాహ్వయజ్యోతి రాసంసారా న్న దీప్యతే.
దగును.

సరస్వతికి జాతిశరీర 69. జాతి స్త దత్ర వాగ్దేవ్యా మూర్తి స్తద్జ్ఞై రుదీరితా
ము; రీతులు సౌన్ద రీతయ స్త్వఙ్గసౌన్దర్యం లావణ్యా మథ వృత్తయః.
ర్యము; వృత్తులు 70. అలఙ్కారతయా హ్యాసాం కామచారో****
లావణ్యము. వక్తవ్యః కామచారశ్చ ద్విశేషాపేక్షయా భవేత్.

రచనాఘటనలుకుం
డలములు; ముద్ర
దయాముద్ర; ఛా
య మాల్యము;
యుక్తి హారావలి;
భణితి యొడ్డాణము;
శ్రవ్యత మురుగులు;
శ్లేష చిత్రములందె
లు; ఔచిత్యము
లీలాకమలము;
ప్రశ్నోత్తరము వ
స్త్రము; ప్రహేళిక
పదకము. అనుప్రాస
కంచుకము.

71. రచనా ఘటనే దేవ్యాః కుణ్డలే పరికీర్తితే
దయాముద్రాతు ముద్రైవ చ్ఛాయా మాల్య ముదాహృతమ్.

72. యుక్తిం హారావలీః ప్రాహు ర్భణితిం మేఖలాం పునః
శ్రవ్యతాం కఙ్కణశ్రేణిం శ్లేషచిత్రే తు నూపురా.

73. లీలాకమల మౌచిత్యం, వాసః ప్రశ్నోత్తరం పరమ్
ప్రహేళికాం తు పదక, మనుప్రాసం తు కఞ్చుకమ్.

యమకము క్రీడాశ
కుంతము; గూఢోక్తి
యాడుకొనుబంతి.

74. క్రీడాశకున్తం యమకం, గూఢోక్తిం కేళికన్దుకమ్
విజాతే ర్గారవం ప్రాయః క్వాపి[కావ్యేన] దృశ్యతే.

75. రీతిస్తు పేశలో మార్గ స్సచే న్నాస్తి కిమస్తి తత్
రచనా నామ చాతుర్యం తం వినా కః కవే ర్గుణః.

76. వినా[ఘటనయా కావ్యం] దుర్ఘటం న విరాజతే
సముద్రత్వం తు నామ్నాపి గాంభీర్యగుణదాయకమ్.

77. విచ్ఛాయం యత్తు కిం తస్య వార్తయాపి మనీషి[ణః]
[నిర్]యుక్తికంతు యద్వాక్యంతస్యకాఽన్యావిగర్హణా.

78. భణితి ర్వక్రతా సాతు విదగ్ధజనవల్లభా
అవక్రభణితే ర్దోషః [సు] న్దర్యోఽపి కులాఙ్గనాః.

79. న భవన్తి విదగ్ధానాం ప్రకామానన్దహేతవః
అశ్రవ్య మితి చే దుక్తం శ్రూయతే***పునః.

శ్లేషచిత్రముల
ప్రాధాన్యము.

80. చిత్తసంశ్లేషణః శ్లేష శ్చిత్రం చిత్రైకకారణమ్
వినయేన వినా కా శ్రీః కా నిశా శశినా వినా .

81. వినా చ శ్లేషచిత్రాభ్యాం కీదృశీ వాగ్విదగ్ధతా
అనౌచిత్యాత్కిమన్యోఽస్తి తిరస్కారః సచేతసామ్.

82. ప్రశ్నోత్తరనామ్నా [?]
క్రీడాగోష్ఠీవినోదేషు తద్జ్ఞై రాకీర్ణ మన్త్రిణే
పరవ్యామోహనే చాపి సోపయోగాః ప్రహేళికాః.

అనుప్రాసప్రాముఖ్యము.

83. లవణేన వినా భోజ్యం త్యాగేన రహితం ధనమ్
అనుప్రాసవిహీనం తు కావ్యం కోవాఽభిన[న్దతి].

అక్లిష్టయమకము.

84. న తథా వల్లభాశ్లేషో న పీయూషరసప్లుతి
యథా భవతి మోదార్థ మక్లిష్టయమకం వచః.

85. గూఢాగూఢచతుర్థాది వా [క్యం కన్దద్]పశాన్తయే
యదివా వల్లభా కేళిగోష్ఠీ భ్రమరసావహామ్.

86. యథామతి యథాశక్తి యథౌచిత్యం యథారుచి
కవేః కావ్యస్య చైతాసాం ప్రయోగ ఉపపద్యతే.

బాణునకు గద్యరచనమునం దున్న నేర్పు పద్యరచనమున లేదు.

87. యాదృగ్గద్యవిధౌ బాణః పద్యబన్ధే న తాదృశః
ప్రతిమార్గ మియా[న్ భేదః స]చిత్రాహి సరస్వతీ.

సంస్కృతప్రాకృతాది భాషావిచారము.

88. సంస్కృతేనైవ కోఽప్యర్థః ప్రాకృతేనైవ చాపరః
శక్యో [రచయితుం] ద్వాభ్యాం కశ్చిత్తు పథిభిస్త్రిభిః.

89. సంస్కృతేనైవ కేఽప్యాహుః ప్రాకృతేనైవ చాపరే
సాధారణాదిభిః కేచిత్ కేచన మ్లేచ్ఛభాషయా.

90. న మ్లేచ్ఛితవ్యం యజ్ఞాదౌ స్త్రీషు నా ప్రాకృతం వదేత్
సఙ్కీర్ణం నా**తేషు నా ప్రబుద్ధేషు సంస్కృతమ్.

91. వదన్తి సంస్కృతం దేవాః ప్రాకృతం కిన్నరాదయః
పైశాచాద్యం పిశాచాద్యాః మాగధం హీనజాతయః.

ఆఢ్యరాజ, శ్రీసాహసాంకప్రభువులకాలమునందలి భాష.

92. కేఽభూ[వన్నాఢ్య]రాజస్య కాలే ప్రాకృతవేదినః
కాలే శ్రీసాహసాఙ్కస్య కే న సంస్కృతభాషిణః.

93. నాత్యన్తం సంస్కృతేనైవ నాత్యన్తం దేశభాషయా
కథాగోష్ఠీషు కథయన్ లోకే బహుమతో భవేత్.

94. శృణ్వన్తి లటహం లాటాః ప్రాకృతం సంస్కృతద్విషః
అపభ్రంశేన తుష్యన్తి స్వేన***గూర్జరాః.

95. బ్రహ్మన్ విజ్ఞాపయామి త్వాం స్వాధికారజిహాసయా
గౌడః పరిత్యజతు వా గాథాం***స్తు సరస్వతీ.

96. విభాగైనం ప్రయత్నేన శబ్దాలఙ్కారజాతయః
యథాయోగోపయోగాయ [విజ్ఞేయా] కవిపుఙ్గవైః.

97. ఏతద్గ్రాహ్యసురభికుసుమం మాల్య మే తన్నిధేయమ్
ధత్తే శోభా మిద మిహ పున ర్నైన***తి సమ్యక్.
మాలాకారో రచయతి యథాసాధువిజ్ఞాయ మాలామ్
యోజ్యం కావ్యేఽప్యవహితధియా త***భిధానమ్.

మంచిపుష్పములనెంచి మాలనుగూర్చు మాలాకారుని వలెఁ గవికావ్యశోభాస్పదము లగువిషయము లనుగ్రహించికావ్యనిర్మాణముం జేయఁదగును.

ఇతి శ్రీప్రకాశవర్షకృతౌ రసార్ణవాలఙ్కారే
శబ్దాలఙ్కారప్రకాశం నామ
తృతీయః పరిచ్ఛేదః.

## ఆంధ్రసాహిత్యపరిషత్తు—ప్రతిష్ఠాపకులు.

శ్రీరాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారావుబహద్దరువారు, పిఠాపురము మహారాజావారు. పరిషదాద్యవజ్జీవాధ్యక్షులు.

కీ. శే. శ్రీ వేంకటగిరి మహారాజావారు.

## ఉద్ధారకులు.

శ్రీరాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు- ఉయ్యూరు జమీందారు.

కీ. శే. శ్రీబొబ్బిలి మహారాజావారు.

## ఆంధ్రసాహిత్యపరిషత్కార్యనిర్వాహకవర్గము.

### కార్యనిర్వాహకసభాధ్యక్షులు.

జయంతి రామయ్యపంతులుగారు బి. ఏ., బి. ఎల్.

### కార్యదర్శులు.

కిళాంబి రాఘవాచార్యులుగారు ఎం. ఏ., బి. ఎల్.

వింజమూరి వెంకన్నపంతులుగారు ఎం. ఏ.

### కార్యనిర్వాహకసభాసభ్యులు.

దివాన్ బహదర్ కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తి నాయఁడుగారు (కోశాధ్యక్షులు.)

పెద్దాడ రామస్వామిగారు, ఎం. ఏ. ,,

చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు

కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు.

శ్రీమాన్ గొడవర్తి జగన్నాథస్వామిగారు, ఎం. ఎ., ఎల్ టి.

దర్భా వేంకటశివరామరాసుగారు, బి. ఏ., బి. యల్.

అళక్కి వేంకటరామయ్యగారు.

కేశవరపు కామరాజుగారు.

కోకా వేంకటసుబ్బారావు నాయఁడుగారు.

ఓలేటి వేంకటరామశాస్త్రిగారు, శతావధాని.

పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులుగారు.

పిళ్ళారిసెట్టి రంగబ్రహ్మారావునాయఁడుగారు.

## కాకినాడ-ఆంధ్రసాహిత్యపరిషత్తులో వెలకుదొరకు గ్రంథములు.

| | | | |
|---|---|---|---|
| 1 విప్రనారాయణచరిత్రము-చదలువాడ మల్లయ్యకవి | రు | 0 | 8 |
| 2 జైమినిభారతము-వచనము-వేంకటకృష్ణప్పనాయకుఁడు | ... | 0 | 12 |
| 3 కవిజనాశ్రయము-వేములవాడ భీమకవి ... | ... | 0 | 10 |
| 4 చంపూరామాయణము-ఋగ్వేదికవి వేంకటాచలపతికవి ... | ... | 1 | 0 |
| 5 నీతిసీసపద్యశతకము-తాళ్ళపాక పెదతిరుమలార్యుఁడు ... | ... | 0 | 2 |
| 6 యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనము-జ. రామయ్యపంతులుగారు | ... | 0 | 8 |
| 7 జ్యోతిశ్శాస్త్రసారము-శ్రీమాన్ కపిస్థళం కృష్ణమాచార్యులుగారు | ... | 0 | 8 |
| 8 జ్ఞానప్రసూనాంబికాశతకము-శిష్టు సర్వశాస్త్రికవి ... | ... | 0 | 2 |
| 9 సర్వేశ్వరశతకము-యథావాక్కుల అన్నమయ్యగారు ... | ... | 0 | 3 |
| 10 కావ్యాలంకారచూడామణి-విన్నకోట పెద్దయకవి ... | ... | 0 | 8 |
| 11 అకారాద్యముద్రిత గ్రంథసూచిక ... | ... | 0 | 8 |
| 12 ప్రాకృతభాషోత్పత్తి-శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు | ... | 0 | 12 |
| 13 శివతత్త్వసారము-మల్లికార్జునపండితారాధ్యులు ... | ... | 0 | 12 |
| 14 చంద్రభానుచరిత్రము-తరిగొప్పుల మల్లనకవి ... | ... | 1 | 0 |
| 15 శివరాత్రిమాహాత్మ్యము-శ్రీనాథమహాకవి ... | ... | 0 | 12 |
| 16 ఆర్యభాషావిభాగము-శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు | ... | 0 | 8 |
| 17 హ్రస్వరంగములు-కొత్తపల్లి సూర్యరావుగారు ... | ... | 0 | 8 |
| 18 నారసింహపురాణము—ఉత్తరభాగము-హరిభట్టు ... | ... | 1 | 0 |
| 19 మన్నారుదాస విలాసనాటకము—రంగాజమ్మ ... | ... | 0 | 8 |
| 20-21 కాళిందీకన్యాపరిణయము (రెండుభాగములు) అహోబలపతి | ... | 1 | 4 |
| 22 రెడ్లనాఁటి రేడుశాసనములు ... | ... | 0 | 4 |
| 23 ఆంధ్రధాతుమాల—చిన్నయసూరి ... | ... | 0 | 12 |
| 24 శాసనపద్యమంజరి ... | ... | 0 | 12 |
| 25 శతకసముచ్చయము (ప్రథమభాగము) ... | ... | 0 | 12 |
| 26 పరిషత్పుస్తకభాండాగారము. (ద్వితీయభాగము) ... | ... | 0 | 8 |
| 27 సూత్రాంధ్రవ్యాకరణములు—చిన్నయ్యసూరి ... | ... | 0 | 8 |
| 28 రసాభరణము—అనంతకవి. ... | ... | 0 | 8 |
| 29 ఆంధ్రశబ్దచింతామణి-బాలసరస్వతికృతాంధ్రటీకోపేతము | ... | 0 | 8 |
| 20 షోడశకుమారచరిత్రము-వెన్నెలకంటి అన్నయ్య ... | ... | 0 | 8 |
| 31 హంససందేశము-కల్లూరి వేంకటరామశాస్త్రిగారు ... | ... | 0 | 2 |
| 32 శతకసముచ్చయము (ద్వితీయభాగము) ... | ... | 0 | 10 |
| 33 రాయవాచకము ... | ... | 0 | 8 |
| 34 సింహాసనద్వాత్రింశిక-ద్వితీయభాగము-గోపరాజకవి ... | ... | 0 | 10 |
| ౧ Dravidian Lexicography జయంతి రామయ్యపంతులుగారు | ... | 0 | 4 |
| ౨ Defence of Literary Telugu జయంతి రామయ్యపంతులుగారు | ... | 0 | 8 |
| ౩ చాటుధారాచమత్కారసారః-(సంస్కృతము) ... | ... | 0 | 8 |
| ౪ ఉత్తరరామచరిత్రము-జయంతి రామయ్యపంతులుగారు ... | ... | 1 | 0 |
| ౫ అమరుకము-సాంధ్రము-జయంతిరామయ్యపంతులుగారు | ... | 1 | 0 |
| ౬ సాంబోపాఖ్యానము- రామరాజురంగప్పరాజు ... | ... | 1 | 0 |

Printed by N. Achutaramiah at the Cocanada Printing Works, Cocanada.

శ్రీ

# ఆంధ్రసాహిత్య
# పరిషత్పత్రిక.

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

**(Journal of the Telugu Academy.)**

సంపుటము. ౨౪ { యువనామసంవత్సరము. శ్రావణభాద్రపదమాసములు. } సంచిక 3.



కాకినాడ:

కొత్తపల్లి సూర్యారావుచే బరిషత్కార్యాలయమునఁ
బ్రకటింపఁబడినది.

చందా, పోష్టువ్యయములతో సంవత్సరమునకు రు. 3-౦-౦.

విడిసంచిక రు ౦-౮-౦.

**1935**- ఆగష్టు, సెప్టెంబరు మాసములు.

# విషయసూచిక.

# ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక.

కాకినాడ.

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

సంపుటము ౨౪. { యువనామసంవత్సరము. శ్రావణభాద్రపదమాసములు. } సంచిక 3.

## ఆంధ్రసాహిత్యపరిషద్వార్షికసభావృత్తాంతము.

అమలాపురము.

ఆంధ్రసాహిత్యపరిషద్వార్షికసభ (ఇరువదిమూఁడవది, యిరువదినాల్గవది) ఆ 1935 సంవత్సరము ఆగష్టు నెల ది 24-25 వ తేదులలో, అమలాపురములో బాలికా పాఠశాలాభవనమున జరగినది. ఆమహాసభకు గుంటూరు నగరనివాసులు, అవధానిశిరోమణి మాధ్వశ్రీ కాశీ కృష్ణాచార్యులుగా రగ్రాసనాధిపత్యమును స్వీకరించిరి. కోడూరుపాడు వాస్తవ్యులు మ॥ రా॥ శ్రీ శ్రీనడింపల్లి సుబ్బరాజుగా రాహ్వానసంఘాధ్యక్షులు; ఉ. భా. ప్ర. గరిమెళ్ల వేంకట లక్ష్మీనరసింహ శాస్త్రిగారును బండారు తమ్మయ్యగారునునాహ్వానసంఘకార్యదర్శులు. ఆహ్వానసంఘమునం దనేకులు న్యాయవాదులు సంపన్నగృహస్థులు విద్యాధికులు చేరియుండిరి. పలువు రన్యగ్రామములనుండి భాషాభిమానులు విచ్చేసిరి. సభాస్తారులలోఁ గొందఱ నామములుమాత్ర మిచ్చుటఁ జూపఁబడుచున్నవి.

మ॥ రా॥ రా॥ శ్రీ ఎఱ్ఱగుంట్ల సుబ్బారావుగారు బి. ఏ. రాజమహేంద్రవరము.

,, పిసుపాటి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, కాకినాడ.

,, పిసుపాటి విశ్వేశ్వరశాస్త్రిగారు, పిఠాపురము.

,, కేశవరపు కామరాజుగారు, పెద్దాపురము.

,, శ్రీకవిరాజ వత్సవాయి వేంకటనీలాద్రిరాజుగారు, తుని.

,, తాడిమళ్ల నారాయణమూర్తిగారు ఎం. ఏ. కాకినాడ.
,, డాక్టరు పంద్రంగి సుబ్బారావుగారు, కాకినాడ.
,, రుద్రరాజు నరసింహరాజుగారు, పోడూరు.
,, తెలికిచెర్ల రంగనాయకమ్మగారు బి. ఏ. రాజమహేంద్రవరము.
,, దువ్వూరి సుబ్బమ్మగారు ,,
,, ఉ. భా. ప్ర. భువనగిరి లక్ష్మీకాంతమ్మగారు ,,
,, తిమ్మరాజు శేషగిరిరావుగారు, రాజోలు.
,, బొల్లోజు వీరభద్రయ్యగారు బి.ఏ.డి॥ కలెక్టరు. అమలాపురము.
,, మాడభూషి రంగనాథాచార్యులుగారు బి.ఏ.,యల్. యల్‌బి. సబ్ జడ్జి అమలాపురము.
,, T. M. H. సదాశివయ్యగారు ఎం. ఏ., బి. ఎల్., అడిషనలు డిస్ట్రిక్టు మునసబు, అమలాపురము.
,, దువ్వూరి రామసోమయాజులుగారు బి. ఏ. బి. ఎల్. ,,
,, గూడా సత్యహరిశ్చంద్రుడుగారు బి. ఏ. బి. ఎల్. ,,
,, న్యాపతి కృష్ణారావుగారు బి. ఏ. బి. ఎల్. ,,
,, కందాళం నరసింహముగారు బి. ఏ. ,,
,, బి. నరసింహశాస్త్రిగారు బి. ఏ. బి. ఎల్. ,,
,, మల్లాది వేంకటరామయ్యగారు బి. ఏ. బి. ఎల్. ,,
,, దర్భా వెంకయ్యగారు బి. ఏ. ,,
,, సుసర్ల సత్యనారాయణగారు బి. ఏ. బి. ఎల్. ,,
,, పిండిప్రోలు రామచంద్రరావుగారు బి. ఏ. బి. ఎల్. ,,
,, చాగంటి విశ్వపతిశాస్త్రిగారు బి. ఏ. బి. ఇ. డి. ,,
,, ఉడతల నారాయణరావుగారు (కమ్మర్షల్ ఇన్‌స్ట్రక్టరు.)
,, జి. వి. శంకరముగారు బి. ఏ. బి. ఇ. ,,
,, కాళే వీరరాజుగారు బి, ఏ. బి. ఎల్. ,,
,, దువ్వూరి వేంకటేశ్వరులుగారు ,,
,, R. V. రామారావునాయుడుగారు బి. ఏ. బి. ఎల్. ,,
,, నల్లా రెడ్డినాయుడుగారు ,,
,, రేకపల్లి వర్ఘులుగారు బి. ఏ. బి. ఎల్. ,,

,, కూచిమంచి జగన్నాథముగారు అమలాపురము.
,, చిలుకూరి వేంకటరామశాస్త్రిగారు(సం. పండితులు),,
,, పేరేప సూర్యనారాయణగారు బి. ఏ. ఎల్. టి. ,,
,, కత్తా సుందరరామశాస్త్రిగారు (తెలుఁగుపండితులు.)
,, వెనుమెచ్చ గోపాలరాజుగారు ,,
,, నడింపల్లి శ్రీరామరాజుగారు ,,
,, బులుసు గంగారాయుఁడుగారు ,,
,, నేమనూరి జగన్నాథరావుగారు బి. ఏ. బి. ఎల్. ,,
,, పచ్చిగోళ్ల సత్యనారాయణగారు (బ్యాంకరు.) ,,
,, కొల్లూరి సూర్యనారాయణమూర్తిగారు (బ్యాంకరు),,
,, కాళ్లకూరి సూర్యప్రకాశరావుగారు ,, ,,
,, పేరూరి వైద్యనాథముగారు ,, ,,
,, వంకాయల వేంకటరత్నముగారు ,, ,,
,, నంబూరి నాగరాజుగారు ,, ,,
,, పోలిసెట్టి మంగయ్యనాయఁడుగారు, గూడాల.
,, డాక్టరు వేంకటకృష్ణయ్యగారు, రాజమహేంద్రవరము.
,, గంటి అప్పనసోమయాజులుగారు, విశ్వేశ్వరాగ్రహారము.
,, గొర్తి విశ్వనాథశాస్త్రిగారు, భట్నవిల్లి.
,, వీరఘంటము సత్యనారాయణశాస్త్రిగారు, కొవ్వూరు.
,, వేదుల వేంకటరావుగారు, పుల్లేటికుఱ్ఱు.
,, వల్లూరి వేంకటరత్నముగారు బి. ఏ. యల్. టి. ముమ్మిడివరము
,, పులవర్తి కృష్ణారావుగారు, ఇమ్మిడివరప్పాడు.
,, మంథా సీతారామశాస్త్రిగారు (తె. పం.) పేరూరు.
,, శిఖా కామశాస్త్రిగారు (తె. పం.) పేరూరు.
,, కంచినాథము సూర్యనారాయణమూర్తిగారు, కోడూరిపాడు.
,, పేరి వేంకటనరసయ్యగారు కోడూరిపాడు.

మఱియు ననేకులు దయచేసి సభ నలంకరించిరి. వ్యాసకర్తల యుపన్యాసకుల నామము లిందుక్రిందఁ గలవు.

సభ ది 24 తేది శనివారము, ఉదయమున బ్ర॥ గరిమెళ్ల వేంకట లక్ష్మీనరసింహశాస్త్రిగారిదైవప్రార్థనతోఁ బ్రారంభింపఁబడినది. ఆహ్వానసంఘాధ్యక్షులుతమ స్వాగతోపన్యాసము గావించినపిదపఁ గోండఱు రాజుల మైత్రి మని వ్రాసిన లేఖలు చదువఁబడినవి. సభాధ్యక్షులు గంభీరోపన్యాసము చేసిన యనంతరము పండితారాధ్యుల నాగభూషణముగారు స్వాగతపద్యములం జదివిరి. జయంతి రామయ్యపంతులుగారు గ్రాంథికాంధ్ర ప్రశంస యొనరించిరి. సాగి వేంకటనరసింహము, ఎం. ఏ. గారు, ఆంధ్ర వాఙ్మయము, హాస్యరసము ననువ్యాసముం జదివిరి. అంతట సభ ముగిసినది.

మధ్యాహ్నము మరల రెండుగంటలకుఁ బ్రారంభింపఁబడిన సభలో జటావల్లభ పురుషోత్తము ఎం. ఏ. గారు కాలము, సారస్వతము- ననువ్యాసమును, కుందూరి యీశ్వరదత్తు బి. ఏ. గారు, ఆముక్తమాల్యదరచనాకాల మను వ్యాసమును, కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు, నవ్యకావ్యాకృతివ్యాసమును, తెన్నేటి దీక్షితులుగారు నిఘంటువిషయవ్యాసమును, చతుర్వేదుల సత్యనారాయణగారు, తిక్కనకవి విరాటపర్వముం గూర్చిన వ్యాసముం జదివినపిమ్మట కాశీనుండి వచ్చిన వేదకావ్యస్మృతితీర్థేత్యాది బిరుదాంకితులు చిదిరెమఠము వీరభద్రశర్మగారు తాము తీసికొనివచ్చిన ఉత్తరకాశీ స్తంభలేఖనుగూర్చి యుపన్యసించిరి. కోరాడ రామకృష్ణయ్య ఎం. ఏ. గా రాంధ్రభాషద్రావిడలక్షణ మను నుపన్యాసముంగావించిరి. అంతటితో శనివారము సభ నిలుపుచేయఁబడియెను.

ది 25 తేదీ ఆదివారము, ఉదయమున సభమరలఁ బ్రారంభమయ్యెను. అందు మొదట, ఆంధ్రదేశమునఁ బ్రసిద్ధివడసిన, కేతవరపు వేంకటశాస్త్రిగారు, వంక వేంకటరత్నశాస్త్రిగారు, అల్లమరాజు రంగశాయికవిగారు, అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, కనుపర్తి మార్కండేయశర్మగారు ననువారు మరణమునొందినందులకుసభవారుతమ దుఃఖమును వెల్లడించిరి. సూర్యరాయాంధ్రనిఘంటువిషయమై జరుగుచున్న పనియుదానిపద్ధతియుం జెప్పి జయంతిరామయ్యపంతులుగారు నిఘంటువునందు కొన్నిముద్రితభాగములను సభ్యులకెఱుకపఱుప మ॥ తెలికిచెర్ల వేంకటరత్నము ఎం.ఏ, గారిచేఁ జదివించిరి. సంస్కృతకవయిత్రులనుగూర్చి, ఈయుణ్ణి వేంకటవీరరాఘవాచార్యులు ఎం. ఏ, గా రుపన్యసించిరి. గిడుగు సీతాపతిరావు బి. ఏ, గారు తమపేరంబంపిన పెద్దయుత్తరములోని విషయముల సధ్యక్షులు సభ్యులకుఁ గొంత తెల్పిరి. తెలికిచెర్ల వేంకటరత్నము ఎం. ఏ, గారు భాషాసంస్కరణముం

గూర్చి ముచ్చటించిరి. కొమరవోలు వేంకట సుబ్బారావు బి. ఏ. గారు తాము రచించిన ప్రత్యూషమను నూతనకావ్యమునుండి కొన్నిపద్యములం జదివి యాకావ్యములోని కల్పన కథ మున్నగు విషయముం దెలిపిరి. పొన్నాడ కృష్ణమూర్తిగా రాధునికాంధ్రమనువ్యాసమును, పారుపూఁడి చలమయ్యశాస్త్రిగా రీశ్వర మహిమ యను వ్యాసమును జదివిరి. అమలాపురము "అడిషనల్ డిస్ట్రిక్టుమునసబు"గారు టి. యం. హెచ్. సదాశివయ్యగారు, ఎం ఏ.,బి.యల్. ఆంధ్రకర్ణాట వాఙ్మయముల పరస్పరసంబంధమునుగూర్చి ముచ్చటించిరి. అయ్యగారి లక్ష్మీకాంతముగారు (ఉ.భా ప్ర.) భారతకవులకవితాసామ్యము; జయంతి స్వామినాయనగారు, సుకవి; పండితారాధ్యుల సూర్యనారాయణగారు ప్రాచీనకవుల ప్రతిభావిశేషము; మంచిము బుచ్చిలింగప్పగారు, ఆంధ్రకళ; అను వ్యాసములం జదివిరి. అనంతరము సత్యవోలు రాధామాధవరావుగారు వీణావాద్యము సముద్రమథనమును బోల్చిన యొకపద్యవ్యాసముం జదివిరి. పండితారాధ్యుల నాగభూషణముగారు, ఆంధ్రము-ఆధునికవిమర్శనము; అను వ్యాసముం బఠించిరి. భువనగిరి లక్ష్మీకాంతమ్మగారు (ఉ. భా ప్ర.) పత్రికలలో స్త్రీలనుగూర్చి వ్రాయు నింద్యవ్యాసముల విషయమై యుపన్యసించిరి. కవిరాజు వత్సవాయ నీలాద్రిరాజుగారు కొన్నిపద్యములు చదివిరి. కాకినాడలో నూతనముగా వెలువడనున్న ప్రౌఢభారతీ పత్రిక మొదటిసంచికను దత్పత్రికాధిపతులు మ॥ ఎండమూరి వేంకటరమణ ఎం.ఏ. గారు సభవారికిం జూపి దానిపీఠికను జదివి, తమ్ముం బ్రోత్సహింప భాషాభిమానులను బండితులను గోరిరి.

# గ్రామ్యవాదవిమర్శనము.

గతసంచిక శేషము.

జయంతి రామయ్యపంతులుగారు బి. ఏ., బి. ఎల్.

---

గ్రాంథికాంధ్రము దురవగాహము కాదు :—

గ్రాంథికభాష పండితులకుఁ దప్పఁ దక్కినవారికి దురవగాహ మనియు నాభాషలో రచింపఁబడుగ్రంథములు సామాన్యజనుల కుపయోగింపవనియు గ్రామ్యవాదు లందురు. ఇది యతిశయోక్తి. గ్రాంథికభాషయం దైనను గ్రామ్యభాషయం దైనను శైలీభేదము లున్నవి. శైలి మిక్కిలి ప్రౌఢ మైనచో వ్యావహారిక భాషలో రచింపఁబడిన గ్రంథము కూడఁ గఠిన మనిపించును. గ్రాంథికభాషలోఁ గూడ రెండువిధములైన శైలి యున్నది. మిక్కిలి ప్రౌఢమైనప్రబంధశైలి యొక్కటి, పురాణాది గ్రంథములందుఁ గాననగు సులభశైలి యొక్కటి. ప్రబంధశైలిలోనున్న గ్రంథములు పండితైకవేద్యము లన్నమాట నిజమే. కాని సులభశైలిలో నున్నశతకములు వేమనపద్యములు మొదలగు గ్రంథములు సుగమములు. భారతాదిగ్రంథముల యందు సందర్భోచితముగా రెండుశైలులును గలవు. ఈభేద మైనను శైలినిబట్టి వచ్చినది గాని భాషాలక్షణమునుబట్టి వచ్చినది కాదు. లక్షణమన్నిటికి సమానమే.

భారతము మొత్తము మీఁదఁ బ్రౌఢగ్రంథమే కదా! ఆగ్రంథము పల్లెటూళ్ళలోఁ బురాణముగాఁ జదువునాచారము చిరకాలమునుండి యున్నది. ఒకరు పుస్తకము చదువుట, యింకొక రర్థము చెప్పుట యాచారము. ఇంచుమించుగా గ్రామములో నున్నవా రందఱును వచ్చి యాపురాణమును విందురు. స్త్రీలు ముఖ్యముగా వత్తురు. చదువువానికంటె నర్థము చెప్పువాఁడు గట్టివాఁడుగా నుండవలయునుగదా! వ్రాలుచేయనేరనివారు శ్రుతపాండిత్యము చేతనే భారతమున కర్థము చెప్పుట నే నెఱుంగుదును. ప్రతిపదార్థముతో నన్వయించు సామర్థ్యము లేకున్నను సభ్యులలో ననేకులకు- పద్యము చదువఁగనే దాని ముఖ్యభావము బోధపడును.

ఇంతియ కాక, యిటీవలఁ దెనుఁగులో నాటకములు ప్రబలి తఱచుగా రంగస్థలములందుఁ బ్రదర్శింపఁబడుచున్నవి. ఈనాటకములు సామాన్యముగా గ్రాంథిక శైలిని రచింపఁబడినవియే. ఈనాటకప్రదర్శనమునకు స్త్రీలు మున్నగు ననేకులు

వచ్చి యానందించుచుండుట మనము చూచుచున్నారము. నాటకభాష యర్థమే కానిచో జను లీరీతిని వత్తురా ?

ఇరువది సంవత్సరములకుఁ బూర్వము నేను, జెన్నపురిలో నుద్యోగమందున్నపుడు రాజమహేంద్రవరమునుండి యొకనాటకసమాజము చార్కోడకువచ్చి యనేకనాటకములను బ్రదర్శించిరి. చెన్నపట్టనములోఁ దెనుఁగునాటకము లాడినప్పుడు వైశ్యస్త్రీలధికముగా వచ్చుట కలదు. ఒకనాఁ డొకనాటకమాడుచు నడుమ గ్రామాధికారి యొక యభియోగమును విచారించుట యను చిన్నప్రహసనమొకటి ప్రదర్శించిరి. ఈ ప్రహసనమునందు వచ్చుపాత్రములు గోదావరిమండలమందు సామాన్యజనులు వాడునట్టి శుద్ధవ్యావహారికభాషను జక్కగా ననుకరించెను. ఆయనుకరణ మస్మదాదుల కెంతయు హృద్యముగా నుండెను. కాని, నాటకము ముగిసినపిమ్మటఁ గొందఱు వైశ్యులు సూత్రధారునొద్దకు వచ్చి మీ రింతకుముందుఁ బ్రదర్శించిన ప్రహసనభాష మాకొక్కముక్కయైనను దెలియలేదు. ఇట్టి ప్రహసనములే ముందుఁగూడ మీరు ప్రదర్శించునెడల మేము మీనాటకములకు వచ్చుట మానుదు మని చెప్పిరి. నాటకములోఁ, బ్రయోగింపఁబడిన గ్రాంథికభాష సర్వప్రదేశసామాన్యమగుటచే వారికిఁ గొంతవఱకైన నన్వయించినది గాని వ్యావహారికభాష వారిప్రాంతమందలి భాష కాకపోవుటచేత వారికర్థము కాలేదు. కావుననే సర్వసమాన మగుగ్రాంథికభాషయొకటి యావశ్యకము.

ప్రబంధములశైలి ప్రౌఢ మగుట నాగ్రంథములు పండితులకు మాత్రమె సుగ్రాహము లగు ననుమాట వాస్తవము. కాని, భారతము, భాగవతము, రామాయణము మొదలగు పురాణగ్రంథములను, సామాన్యులు గూడఁ జదివి యానందించుచున్నారు. కందుకూరి వీరేశలింగము పంతులుగారు, చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు గ్రాంథికభాషలో సులభశైలిని రచించిన గ్రంథములను వేనవేలు చదువుచున్నారు. లక్ష్మీనరసింహముగారి గయోపాఖ్యానము మున్నగుగ్రంథములు కొన్ని పరీక్షలకుఁ బఠనీయములుగా నిర్ణయింపఁబడకున్నను బైకుసారులు ముద్రితములయి వానిప్రతు లనేకసహస్రములు దేశమందు వ్యాపించినవి. విజ్ఞానచంద్రికామండలి, ఆంధ్రప్రచారిణిగ్రంథమాల యనుసమాజములు శతాధికములగు గద్యగ్రంథముల రచింపించి వానిప్రతులు వేలకొలఁది యమ్మిరి. అచ్చుటచ్చుటఁ దప్పు లున్నను నీగ్రంథము లన్నియు గ్రాంథికభాషాగ్రథితములే. సత్య మిట్లుండ గ్రాంథికభాష పండితులకే కాని యితరులకుఁ దెలియదనుట సాహసము.

బ్రౌనుమహాశయుని యభిప్రాయము :—

పెక్కుసంవత్సరముల క్రిందట నీదేశమునకు రాజకీయోద్యోగముపై వచ్చి కడుశ్రద్ధతో నాంధ్రభాష నభ్యసించి పలువురుపండితుల నాదరించి వారిసాహాయ్యముచే "బ్రౌణ్యా" మను నిఘంటువు నొనర్చిన సి. పి. బ్రౌను (Mr. C. P. Brown) అను నాంగ్లేయమహాశయుఁడు, ఆంధ్రభాష నభ్యసింపఁ గోరుతోడి యాంగ్లేయులనుద్దేశించి సమకూర్చిన యొకవ్యాసములో గ్రాంథికాంధ్రమును గూర్చి చెప్పిన మాటలు సంగ్రహముగా నెత్తి వ్రాయుచున్నాఁడను.

"ఆంధ్రపద్యగ్రంథములు మనము చదువనారంభించినపుడు, ఆగ్రంథముల భాష మనము మాటలాడునట్టియు (నుత్తరప్రత్యుత్తరములు) వ్రాయునట్టియు భాషకంటెఁ గేవలము భిన్నమైనదని తోఁచును. కాని యభ్యాస మించుక హెచ్చిన పిదప గ్రాంథికాంధ్రమునకును వ్యావహారికాంధ్రమునకును గలభేదము, మిల్టను, పోపు, డ్రైడను (Milton, Pope and Dryden) అను కవులు వాడిన గ్రాంథికాంగ్లమునకును మనము వాడుచున్న సంభాషణాంగ్లమునకును గలభేదము కంటె నెంతమాత్రము నధికముగా దని స్పష్టపడును. భాస్కరశతకమను గ్రంథ మొకటి గలదు. దీనిని బడులలో సాధారణముగాఁ బాఠముచెప్పుదురు. బాలురు, బాలికలు, దానిని జదివి సులువుగా గ్రహింతురు. ఈగ్రంథము శైలి ప్రసన్నమై వాల్టరుస్కాట్టు (Walter Scott) శైలినిబోలి యుండును. ఇట్లయినను నీశతకమునుజదివి యర్థము చేసికొనఁ గలిగిన యాంగ్లేయులు ముగ్గురయినను నగపడరని చెప్పవచ్చును. గ్రాంథికాంధ్రభాష నభ్యసింపకయే యది దురవగాహ మని యెంచఁగూడదు." *

ఇది యాంధ్రభాష నభ్యసించిన యాంగ్లేయుని యభిప్రాయము. ఆంధ్రులై పుట్టి చిన్నప్పటినుండి యాంధ్రభాషయే మాటలాడుచున్న మన గ్రామ్యవాదులు గ్రాంథికభాష యాంధ్రులకుఁ గేవలము దురవగాహ మని పలుకుచుంట "పొరుగువాఁడు పాఁడిగేదెయన్న నింటివాఁడు గొడ్డుగేదె" యన్నట్లున్నది. దీనికిఁ గారణ మేమని యూహింపఁగా నొక్కటి స్ఫురించుచున్నది.

గ్రామ్యవాదు లించుమించుగా నందఱును దెనుఁగునందుకంటె నాంగ్లేయభాషయం దెక్కువపరిశ్రమచేసినవారు. వీరిలోఁ గొందఱటీవల నాంధ్రమందుఁ గూడఁజక్కనిజ్ఞానమును సంపాదించినను మొదటఁ బట్టినపట్టు విడువంజాలకున్నారు.

* Madras joural of Literature and Science 1st series Vol X.

వీ రాంగ్లభాషాపరిచయముఁ గొంతవఱకు సంపాదించి యాభాషలో గ్రాంథికవ్యావహారికభాషలకు భేదము లేదని భ్రమపడి తెనుఁగులోఁ గూడ నట్టిభేదము లేకున్నచో గ్రంథరచన యథేచ్ఛముగాఁ జేయవచ్చు ననునుత్సాహముతో నీప్రయత్నము చేయుచున్న ట్లగపడుచున్నది. వీ రనుకొన్నట్లు, ఆంగ్లభాషలో గ్రాంథికవ్యావహారికభాషలకు భేదము లే దనుమాట యసత్యము. ఆంధ్ర మునందువలెనే యాభాషయందును స్థిరరూపమును ధరించిన గ్రాంథికభాషయున్నది. మనకువలెనే వారికిని వ్యావహారికభాష బహువిధములుగా నున్నది. అయినను నాభాషయం దొకవిశేషము గలదు. కేవలప్రాదేశికవ్యవహారభాషలకు ను గ్రాంథికభాషకు ను మధ్యస్థ మని చెప్పఁ దగినట్టియు విద్యాభ్యాస మొనర్చినవారు వాడునట్టియు సామాన్యవ్యావహారికభాష యొకటికలదు. దీనిని ప్రామాణిక వ్యావహారికాంగ్లభాష (Standard Spoken English) యందురు. విద్యాభ్యాసకాలమునందు విద్యార్థులు మాటలాడుటయందు గ్రాంథికభాష ననుకరించుటచేతఁ గ్రమముగా నీభాష బైలుదేఱినది. ఇది కేవలవ్యావహారిక భాషలకంటె భిన్నము. చాలవఱకు గ్రాంథికభాషకుఁ జేరువుగా నుండును గాని కేవల గ్రాంథికభాషకాదు. దీనికి సంస్కృతవ్యావహారికాంగ్లభాష యని నామకరణ మొనర్పవచ్చును. ఈభాషవిషయమై వైల్డు (Wyld) అను గ్రంథకర్త యిట్లు వ్రాయుచున్నాఁడు.

“వర్తమానకాలమం దీదేశములో నుపాధ్యాయవృత్తిలో నున్నవారు విద్యార్థులకుఁ బరిశుద్ధమైన భాషలో సంభాషించునేర్పును గలుగఁజేయుట కై యధికప్రయత్నములు చేయుచున్నా రనుమాట సత్యము గా దని యెవ్వరును జెప్పలేరు. ఉపాధ్యాయవృత్తిలో నున్నవారును, పెద్దసభలలో నుపన్యసింప యత్నించువారును, పెద్దపెద్దవ్యవహారములలోఁ జేరఁ దలఁచువారును దమతమ గ్రామ్యభాషను విడిచిపెట్టి సర్వప్రదేశసమానమైన ప్రామాణికవ్యవహారభాష నభ్యసించుట యుపయోగకర మని యెంచుచున్నారు.”[1]

ఇట్టి సంస్కృతవ్యవహారభాష యితరభాషలయందు లేదు. తెలుఁగులో లే దనుట స్పష్టము. పెద్దపెద్ద సభలలో నుపన్యసించు వా రిప్పు డిప్పుడు గ్రాంథిక భాష ననుకరింప యత్నించుచున్నారు. ఈయభ్యాసము ముదిరినకొలఁది సంస్కృతమైన సామాన్య వ్యావహారికభాష యొకటి యవతరింపవచ్చును గాని వర్తమాన కాలమం దది లేదు. కర్ణాటభాషలోఁ గ్రొత్తకర్ణాటము (హొసకన్నడ) అను

1. Historical study of the mother tongue p. 356.

భాషాభేద మొకటి కలదు. కాని యది కర్ణాటక దేశ మంతట సర్వసమానముగా లేదు. మైసూరుప్రాంతభాష వేఱు, ధార్వాడప్రాంతభాష వేఱు. ఈభాషల కైక్యము కల్పింపవలయు నని కొంద ఱుత్సాహపడు చున్నారు గాని మార్గము కానకున్నారు.

ఈక్రొత్తకన్నడములో గద్యగ్రంథములు బయలుదేఱుచున్నవి గాని పద్యగ్రంథములు రచించునప్పుడు తఱచుగాఁ బ్రాచీనకన్నడమే యుపయోగపడుచున్నది. హొసకన్నడము పద్యరచన కంతగాఁ బనికిరాదు. ఈపద్ధతియే వ్యాపించిన యెడలఁ బద్యభాష వేఱు, గద్యభాష వేఱుగ నుండవలసి వచ్చును. ఇది యసంభావ్యము.

బెంగుళూరులో నెలకొల్పఁబడిన కర్ణాటసాహిత్యపరిషత్తీనడుమఁ గర్ణాటభాషను వాఙ్మయమును వృద్ధిచేయునుపాయముల నన్వేషించుటకై బెంగుళూరులో నొకపండితసభ కావించినది. దానిలో మైసూరు రాజాస్థానమంత్రివర్గములోఁ జేరిన (S. P.) రాజగోపాలాచార్యులుగారు నూతనకన్నడమును గూర్చి యిట్లు ప్రసంగించిరి.

“కన్నడదేశమందు వివిధప్రదేశములయందుఁ గలభాషాభేదముల కేకీకరణము గావించి సర్వకర్ణాటదేశసామాన్య మగు గ్రాంథికభాష నొకదానిని గల్పించుట యీపరిషత్ప్రయోజనములలో నొకటిగా నుండవలయు నని నాయభిప్రాయము. ప్రస్తుతకాలమందుఁ బ్రాదేశికభాష లచ్చటచ్చటఁ గలవు. కేవలవ్యావహారికభాషలో నిట్టిభేదము లుండవచ్చునుగాని గ్రాంథికభాష సర్వకర్ణాటకసామాన్యముగా నుండవలయును.”

“The other matter I would refer to is the verification of Kannada language and the formation of a Common literary Kannada for the whole of the Karnataka. We have now what may be asked dialects for defferent parts of Karnataka while this is natural in the case of spoken dialects, there should be a common literary form of the language for the whole Kannada country and I trust I am not wrong in saying that this work is well within the normal scope of an Academy of this kind.”

(The Hindu dated Thursday April 25, 1935.)

దీనిని బట్టిచూడ హొసకన్నడమందు సామాన్య మగు గ్రాంథికభాష లేదనియు, నందువలన భాషాభివృద్ధికిని వాఙ్మయాభివృద్ధికిని నాటంకములు గలుగు

చున్న వనియుఁ దేలుచున్నది. మనగ్రామ్యవాదుల వాదము నెగ్గినచోఁ దెలుఁగు నకుఁ గూడ నిట్టి విపత్తు తటస్థించునుగదా !

దేశమభివృద్ధి నొందినకొలఁది, జనులయాచారములు, భాషలు మొదలగు వానిలో నున్న యంతర్భేదములు నశించి క్రమముగా నవి యేకాకారమును బొందుట లోకమర్యాద యై యున్నది. దీనికి వ్యతిరేకముగా గ్రామ్యవాదులు చిరకాలసంప్రాప్తమైన యేకాకారగ్రాంథికాంధ్రభాషను రూపుమాప యత్నించుచున్నారు. వీరియత్నము కొనసాఁగినచో నాంధ్రవాఙ్మయము భావికాలపుఁ దెనుఁగువారికి దురవగాహమై పఠనము లేక నశించి పోవలసి వచ్చును గదా ! లోకహితార్థము మహాకవు లెంచుమించుగా వేయిసంవత్సరములనుండి సంపాదించి మనపరము చేసిన సర్వాంగసుందరవాఙ్మయ భాగ్యమును మన మనుభవింపలేక పాడుచేసికొన్నవార మగుదుము. తాను సంపాదించుట లేదుగదా పెద్దలు సంపాదించి యిచ్చిన దానినైనను నిలుపుకొనలేక చెడఁగొట్టుకొన్నవాఁడెట్టిప్రజ్ఞాశాలియో యూహింపుఁడు. పెద్దలు కట్టిన దివ్యభవనమును బడఁగొట్టుకొన్న పిమ్మట నిలువనీడ యెద్ది? ఎద్దియో యొకకొంపఁ గట్టుకొందుమందురా? దానికి సాధనసామగ్రి యేది? అది యెన్నఁటికిఁ గొనసాగును. ఇఁకముందు గ్రామ్యకవులు గ్రంథములు రచింపవలసినది గ్రామ్యభాషయందే కదా ! ఇది బహుముఖములుగా నున్నది. అం దేభాషలో రచింతురు ? గోదావరీకృష్ణామండలములలో విద్యాధికులు వాడుచుండు సంభాషణభాషయం దఁట ! ఆభాష యేకాకారముగా నున్నదా ! ఆభాషలో నున్నగ్రంథము లితరమండలములలో నున్న తెనుఁగువారికి సులభముగా నర్థమగునా ! గ్రాంథికభాషను బోఁగొట్టి తమ కర్థముగాని గ్రామ్యభాష నేర్చికొమ్మని బలవంతపెట్టుట వీరికి ముల్లుదీసి కొఱ్ఱుకొట్టిన ట్లగును గదా. ఈవృథాయత్నమేల ? వ్యావహారికభాష సుగమ మను గ్రామ్యవాదులలో నెంతమంది చంద్రశేఖరశతకము చదివి యన్వయింపఁగలరో భాషీయదండకమను చిన్నిపొత్తము నెంతమంది యర్థము చేసికొనఁగలరో. అధికసంఖ్యాకులకు సులభముగాఁ దెలియుటే ప్రయోజనమైనచో విద్యాధికులవాడుకభాషయేల విద్యావిహీనులయిన ప్రాకృతజనులభాష యేలకూడదు. ఏభాషను గ్రాంథికభాషగా గ్రహించినను గాలక్రమమున దానిరూపములు స్థిరపడి యిప్పటి గ్రాంథికభాషయందుఁ గల వన్నదోషము లన్నియు దానికిని బట్టునుగదా ! అట్టిచో నీ నిరర్థక ప్రయత్నమేల ?

"మహి మను న్వాగనుశాసనుండు సృజియింపం గుండలీంద్రుండు త
ద్గ్రహనీయస్థితి మూలమై నిలువ శ్రీనాథుండు ప్రోవ న్మహా
మహులై సోముఁడు భాస్కరుండు వెలయింప న్సొంపువాటిల్లు నీ
బహుళాంధ్రోక్తిమయప్రపంచమును" దీనికి శరీరప్రాయ మగు గ్రాంథికాంధ్ర భాషయు నిరాతంకముగా దినదినప్రవర్ధమానము లయి శాశ్వతము లయి యుండుఁగాక!

---

# అనుబంధము.

South Indian Inscriptions Vol. IV లో 1008 వ సంఖ్యగల శాసనము.

(1)

(స్వస్తి) సర్వలోకాశ్రయ శ్రీవిష్ణువర్ధన మహారాజులైన శ్రీరాజరాజ దేవరసంవత్సరంబులు ౨౮॥ యోభూత్తి...ఖ్యోవిశాల వరగుణీ ధనీ తస్యసూను ...మి...తో యోధరణీతలే॥ (౧).

శాకాబ్దే నిధితకర్ణనన్దగణితే త్రై(లోక్య)సేవ్యాయనే ప్రాదాదారవి దక్షిణాయన తిథౌ భీమేశ్వరాయ (స్వ)...వందీప్ర మఖణ్డ వర్తి మతులం వంశోత్తమో ధర్మ (౯) ధీః...మ్మడిచోడసెట్టి తనయ స్త్యాగీ గుణానా (౦) న్నిధిః॥ (౨) శకవర్ష...ణ్డు భీమేశ్వరమహాదేవరకు దక్షిణాయన నిమిత్త (మునను)... చోడసెట్టి దనయిచ్చినయఖణ్డవర్తి దివియకు ని(చ్చి)న...శమున మూనెణ్డుసేసి నెయి ఆచంద్రార్కర్కముంబో...యబోయుణ్డును బాదియబోణ్డును నావియ (బోయు)ణ్డును (కొమ్మ) య బోయుణ్డును లోపైన యీమువ్వురుబోలవసమునని(చ్చి)న ఎఙ్గ గిం లిఖిత(ం) పెద్దనాచార్య్య.

(2)

పై పుస్తకములోనె 1010 వ సంఖ్యగలశాసనము.

శాకాబ్దే మునిభూధరాజగణితే నారాయణాచార్య్యాత్మజా భక్త్యా యాచక యూథకల్ప విటపిప్రోత్తుంగ శా(ఖో)పమా। ఆసూర్య్యస్థితిదీప మంబుజముఖీ రాత్రిందివిం దీపకం। ఖ్యాతా కుప్పమసంజ్ఞయా గుణయుతా భీమేశ్వరా యాదదాత్॥ శకవర్ష ౯౭౭ గునేంట భీమేశ్వరదేవరకుం జక్రవర్తి త్రైలోక్య మల్లదేవర ప్రధాని నారాయణభట్లు కుంతుఋ కుపమ పెట్టిన అఖణ్డవర్తి (౯) లోహపుదివియ యెుక్కంటికిం గిలారమన చామబోయు వెంటియయు బాదబోయు దొ

డ్డియయు నావబోల భీమయయుం గొమ్మబోల కాటియయు బెరసిన బోలవస(ము)న నిచ్చిన ఎడ్లు ౫౦ కి నిత్యపడి త్రిభువనాంకుశమునం బోయంగల నే మా ౧ లిఖితం బేతనాచార్య్యః.

(3)

పై పుస్తకమందే ౧౧౧౫ వ సంఖ్య గలశాసనము.

సకవర్షంబులు ౧౦౦౬ స్వస్తి సర్వ్వలోకాశ్రయ శ్రీ విష్ణువర్ద్ధన మహారాజుల ప్రవర్ద్ధమాన విజయరాజ్యసంవత్సరము ౧౫ గు(శ్రా)హి దిన ౩౦ (౭౬)౦ జక్రవర్త్తి శ్రీకులోత్తుంగ చోడదేవర అనుంగు గుద్దవాదినాణ్టి పెద్ద డాకరేమి పెద్దమున్నూటి సమర మొదలి బేతినాయ(కు) కూంతుఱు జయమ యిం ద్దుల యమినీశ్వరమహాదేవరసన్నిధానమున నుత్తరాయణసంక్రాంత్తి నిమిత్తము నం బెట్టించ్చిన కులోత్తుంగ చోడశత్రమునకుం బ్రోలునాణ్టి శుంకటూరి దక్షనా మున చెఱువు దక్షనామున ముప్పదివుట్లు విత్తుపట్లు సర్వ్వకరపరిహారముగా శ్రీ చోడ(గ)ంగ్గదేవరిచ్చి శత్రమునం గుడ్వంగ్గలబ్రాహ్మ లిరువణ్డ్రుకు దిన ౧ కిం బేరముమ్మడి భీమకుంచ్చమున నిరువుసనడ్డెఙ్గా నెనవెంబ్రలకుం కుంచ్చ ౫౦ దిం బదియెన్మిదిగా నైన డంగ్గుంబ్రాలకుంచ్చ ౪౦ ది పప్పుకుంచ్చా ౩ నేతి కు ౧ నంజుడ్లు ౪ మిరియములు అరసోల ౧ సక్కు పల ౩ ఉప్పు కు ౧ బెల్ల కు ౩౦ యింద్దుల పురోహుతునికి దిన ౧ కిం బ్రాకు ౩ సంవత్సరజీవితమాడ ౩ వ డ్డెడి బ్రాహ్మనికిం బ్రాకు ౩ జీవిత చి ౭ కట్టుపనివానికిం బ్రాకు ౩ జీవితమాడ ౧ వడ్లుం బ్రాలును డంచ్చి యెంగ్గిడెత్తి నీడ్లు దెచ్చునాణ్డువాణ్డ్రిద్దఱకుం బ్రాకు ౩ జీవితమాడ ౧ చి ౩ ఇమ్మాగ్గమున నాచంద్రార్క్కము నడవంగలవారుగా శ్రీ భీమేశ్వరమహాదేవరదేవ భణ్డారమునంగల పిరిదేవర కిలరుమున చామియబోయు చందియయు బాదియబోయు పోతియయు గొమ్మియబోయు కనియయుం గాటియ బోయు కొమ్మియ బెరసిన బోలవసమునం బెట్టిన యెడ్లు ౩౦౦ టి బ్రాహ్మలకుం గుడువ నిత్యపడి వోయంగల నే కు౧ దేవభణ్డారమున శనివారదిన ౧కి చి (దు)ం గ్గల నూనియ కు౧ నిత్యపడి పెట్టంగ్గల ఆకులు ౮౦ వోంకలు ౪౦ది

(4)

1920 సంవత్సరములో శాసనవిమర్శనాధికారులు సంపాదించిన శాసన సముచ్చయములో 673 శాసనము.

స్వస్తి శకవర్షంబులు ౮(౬)౫ నేణ్టి సుభాను సంవత్సరమున నుత్త రాయణ నిమిత్త్తమున నగ్గ్రిహారము వెలనాణ్టి వరివేరి త్రిపురుషదేవరకు నాచం

ద్రార్కస్థాయిగా మఖణ్డవర్త్తిగా దివియలు మూర్త్తికి దణ్డనాయక తిక్కపయ్యనాయకు లిచ్చిన గొఱియలు నూట యెంభది వీనిం జేకొని సన్తానక్రమమున నిత్యమూణ్డ మానికలు నేయి ముమ్మడి భీమన (డ)ంబోయం గలవాణ్డు ఇద్దేవరక యిన్నంది యగ్రహారము పెరువలి (న)గ్గియ షడంగ్గవిభట్లు ఆచంద్రార్కస్థాయిగా మఖణ్డ వర్త్తిదివియ యొక్కట్టికి నిచ్చిన గొఱియ లెంభది ఇందుల బ్రహ్మదేవరకు నొంగ్గేఱుమార్గమున దేసట్టి మహాసామన్తనంబయ కొడుకు మణ్డలిక గణ్డయ యాచంద్రార్కస్థాయిగా మఖణ్డవర్త్తిదివియ యొక్కొట్టికి నిచ్చిన గొఱియ లెంభది ఇద్దేవరక యిందుల—

(అసంపూర్ణము)

(5)

పూర్వోదాహృతశాసనసముచ్చయములో 672 వ శాసనము.

స్వస్తి వలివేరి విష్ణుదేవరకు నిందుల దివాకరపెద్దేరి కొడుకు పోతయ యాచంద్రార్కస్థాయిగా మఖణ్డవర్త్తి(గా)దివియ యొక్కొట్టికి నిచ్చిన గొఱియలు యేంబది. ఇద్దేవరకు యిందుల కొమ్మియషడంగ్గవి కొడుకు సవ్వియషడంగ్గవి యాచంద్రార్కస్థాయిగా మఖణ్డ వర్త్తిగా దివియ యొక్కొట్టికి నిచ్చిన గొఱియ లేంబది.

---

# కర్ణాటకసాహిత్యపరిషత్తు.

## 21 వ సాహిత్య సమ్మేళనము.

రాఁబోవు డిసెంబరునెలలో బొంబాయిపట్టణములో జరుగఁబోవు ౨౧ వ కర్ణాటకసాహిత్యసమ్మేళనసభకు, అధ్యక్షులుగా నుండుఁడని ఆహ్వానసంఘము వారును బరిషత్కార్యనిర్వాహకమండలియు వేఁడుకొనఁగా, మైసూరుసంస్థాన విద్యాప్రచారశాఖకు డైరక్టరు గారయిన శ్రీమాన్. ఏ. ఎస్. సుబ్బరావు, ఎం. ఏ. (క్యాంటబ్) బార్-ఎట్-లా-గా రనుగ్రహించి సమ్మతించిరి. ఘనులైనవిద్వాంసులు, విద్యాసేవాధ్యక్షులు నయిన సకలభారత విద్వన్మండలిచే మన్నన వడసిన యీ మహనీయు లధ్యక్షస్థానము నలంకరించుట యెల్లకర్ణాటకులకు సంతోషవార్తగదా! ఆసమ్మేళనసందర్భమునఁ గళాప్రదర్శనములు మొదలైన యనేకాకర్షకోత్సవము లేర్పాటు చేయవలయునని స్వాగతమండలివారు యత్నించుచున్నారు. ఎల్లకర్ణాటకులు దయతో వచ్చుటకు విచ్చేసి సభను జక్కగ జరుగునట్లు చేయఁ బరిషత్తు ప్రార్థించుచున్నది.

సి. కె. వేంకటరామయ్య,
గౌరవకార్యదర్శి, బెంగుళూరు.

ఆంధ్రసాహిత్యపరిషద్వార్షికసభ.

# ఆహ్వానసంఘాధ్యక్షోపన్యాసము.

అమలాపురము.

— శ్రీ నడింపల్లి సుబ్బరాజుగారు. —

అధ్యక్షా ? ప్రతినిధిమహాశయులారా ? ఆంధ్రభాషాసోదరులారా !

ఆంధ్రసాహిత్యపరిషన్మహాసభాసమావేశమునను, దనువంటిపండితప్రకాండుల నాహ్వానించుభారము నాపైఁ బడుట నాసౌభాగ్యము.

మాకోనసీమయందుఁ, బ్రాచీనమునుండియు నారికేళ కదళీ వనాంతరసీమలఁ, బర్ణకుటీరప్రాంగణముల, వేదాభ్యసనమును, సకలశాస్త్రపఠనమును, నిరాటంకముగను, నిత్యముగను, జరుగువిషయము లోకవిదితము. చతుర్వేదములందును, దేశదేశాంతరములందు వన్నెకెక్కిన, ఘనాపాఠీలును, సకలవిధశాస్త్రచర్యలయందును బృహస్పతి నతిసామర్థ్యముతో నెదుర్కొనఁగల విద్యాపారంగతులును, తర్క వ్యాకరణశాస్త్రవేత్తలును, శ్రౌత స్మార్తాది నిత్యకర్మానుష్ఠానగరిష్ఠులును, బెక్కుమంది మాసీమయం దింకను విలసిల్లుచున్నారు- భూలోకస్వర్గమనుకీర్తిని బడయఁజేసిన ప్రకృతిసౌందర్యమును, దత్సౌందర్యమునకు, వన్నెఁబెట్టిన విద్యాశోభయును గల, యీయమలాపురపురియందుఁ, దమరందఱకు నాహ్వానసంఘపక్షమున హృదయపూర్వక మగు స్వాగతమును సమర్పించుచున్నాఁడను-

దక్షిణహిందూదేశమున, ఆంధ్రులు, మహాసామ్రాజ్యమును స్థాపించుకొని తమ యకుంఠిత శౌర్య ధైర్యములచే విస్తరింపఁజేసికొనినసంగతి యెల్లరకును దెలిసినవిషయమే. ఆంధ్రసామ్రాజ్యప్రకీర్తి దిగంతముల వ్యాపించినకాలమున, మౌర్యరాజ్యమును జూడవచ్చిన గ్రీకురాయబారి మెగస్తనీసు మన్ననలనుగూడ నొందియుండెను- విస్తీర్ణమందేగాక, నాగరకతయందును, విద్యాప్రాపీణ్యమునందును, నాంధ్రు లాదినుండియు భారతదేశమునం దుచ్చస్థానము నాక్రమించుచునేవచ్చిరి. గౌతమపుత్ర యజ్ఞశ్రీ శాతకర్ణుల విశాలసామ్రాజ్యమును, యశోవైభవము నమరావతీవిశ్వవిద్యాలయమును, దానిదిగంతవిశ్రాంతకీర్తియును, వజ్రాలదిన్నియు నాంధ్రులనాఁటి భాగ్యవిశేషమును మనప్రాచీనపరిస్థితుల నించుక విస్పష్టముచేయఁగలవు-

ఇట్టి యాంధ్రులభాషయే యాంధ్రభాష:—ఆంధ్రభాష సంస్కృతపద విలసనముతో, మాధుర్యముగను, శ్రుతి కింపుగ నుండుటచే Italian of the East అనుకీర్తి వహించినది. ఆంధ్రమునందు, పదునొకొండవశతాబ్దమునకుఁ బూర్వము, వ్రాయఁబడినగ్రంథసంపుటములేమియు నేఁడు మనచేఁజిక్కుటలేదు. నన్నెచోడుని కుమారసంభవమును గూర్చిన వివాద మటుండనిచ్చి చూచినచో, నాంధ్రభారతమే ప్రథమాంధ్రగ్రంథముగను- తత్కృతికర్తనే యాంధ్రవాఙ్మయనిర్మాతగను, మనము గ్రహించి పూజింపవలసియున్నది. నన్నయభట్టారకుఁడును, తిక్కనకవిసార్వభౌముఁడును,ఎఱ్ఱాప్రెగడయును, ఆంధ్రభాషాకృతిమూర్తులు. ఆంధ్రభారతము కొన్నివిషయములయందు సంస్కృతభారతమును మించి ప్రకాశించియున్నది. ఆంధ్రభారతమును మించినగ్రంథము, నేటిదనుక నాంధ్రభాషలో లేదనుట యతిశయోక్తి కానేరదు-

రాజరాజనరేంద్రాది మహారాజుల పోషణముచేఁ, దెనుఁగుభాషాలలామ, దినదినాభివృద్ధిం గాంచి, ప్రబంధకవులహస్తములలో వివిధరూపములతో విస్తరిల్లి, కృష్ణదేవరాయాదిపండితరాజన్యుల యభిమానమును జూఱగొని, రెడ్డిరాజుల యాశ్రితపోషణమున, స్థిరత్వమునుం జెంది కీర్తింగాంచినది. రాజాస్థానములవైపునకు దృష్టినైన మరలింపని, బమ్మెర పోతనామాత్యకవిరేణ్యుఁడు దక్కఁ దక్కుంగలకవులు రాజపోషణయందే కాలవిశ్రాంతిని బొంది, యమూల్యగ్రంథరచనకుఁ గడంగిరి. అట్టిమహామహులలో, అల్లసాని పెద్దనయు, రామరాజకవిభూషణుఁడు, శ్రీనాథుఁడును, ముక్కుతిమ్మనార్యుఁడును, పింగళిసూరన్నయు స్థిరకీర్తిని సంపాదించి యున్నారు- వీరలే గాక వందలకొలఁది కవులు, ఆంధ్రభాషకు వన్నెగూర్చు పెక్కుగ్రంథముల రచించిరి. పరదేశపరిపాలన దేశములోనికిఁ జొరఁబడి, దేశీయసంస్థానము లంతరించుటతోడనే, కవిత్వప్రౌఢిమయుఁ, గవులును, రాజపోషణారాహిత్యముచే శుష్కించిరి. 19 వ శతాబ్దములో మొత్తముమీఁదఁ దెలుఁగుగ్రంథరచన చాలఁదక్కువ—

కాని 20 వ శతాబ్దమం దాంధ్రులకు మాతృదేశాభిమానము ప్రబలిననాఁటినుండియు, దేశభాషాగౌరవ మినుమడించి, యాంధ్రభాషకు నూతనయౌవనము ప్రాప్తించినది. ఈయుగమున, తిరుపతివేంకటేశ్వరకవులు, విద్యాప్రావీణ్యముచేతను, గవితాకౌశల్యముచేతను, నాంధ్రభాషాసామ్రాజ్యమునకుఁ జక్రవర్తులై బహుగ్రంథరచనచేతను, శతావధానాదిప్రత్యేకకవిత్వప్రదర్శనములచేతను,

నాంధ్రులమన్ననలకుఁ బాత్రులైరి. వీరలేగాక చాలమందికవులు నూతనశోభను గూర్చుచున్నారు. భాషాసంప్రదాయముల నూతనపద్ధతులను ద్రొక్కించుచు, భావమునకుఁ బ్రాబల్యమిచ్చుచు, భావకవులు విరాజిల్లుచున్నారు. పద్యరచనను మించి, గద్యరచనయుఁ బ్రబలమైనది. చిన్నయసూరియు, వీరేశలింగకవివరేణ్యులును, వేదము వేంకటరాయశాస్త్రులువారును, నవలాగ్రంథకర్తలును, గద్యరచననుగూడఁ బద్యరచనతోఁ దుల్యమునుజేసిరి.—

సంస్కృతమునకుఁ దెలుఁగు వికృతి యని యెల్లరంగీకరించిన విషయమే. అందువలనఁ బ్రథమమునుండియును, సంస్కృతభాషామార్గములే తెలుఁగునకుఁ గూడ నలవడినవి. ఆంధ్రకవిత్వమునందు సంస్కృతపదసమూహము లెక్కుడుగఁ గన్పట్టుటకును బ్రతిగ్రంథమునకును మాతృక, యేపురాణగాథయో, సంస్కృతగ్రంథమో యగుటయు, నిదియే కారణము. ఆంధ్రభాషయందు స్వతంత్రగాథల రచన చాలఁదక్కువ. కాని మాతృకలు, పూర్వగాథలైనను, నాంధ్రకవిసార్వభౌములును, నాంధ్రకవితాపితామహులును, నూతనవర్ణనలచేతను, గథావిస్తరణమునందు నూతనపద్ధతులను ద్రొక్కుటచేతను, నాంధ్రభాషాస్వాతంత్ర్యమును, నిరూపింపఁగలిగిరి. కవిత్వమునకు భావశుద్ధి, పాత్రోచితపద్యరచనము ను, ముఖ్యములు. భావవైపరీత్యమును గాని, భావోద్రేకమునుగాని, మూర్తీభవింపఁజేయుటయందే మహాకవులశక్తి యిమిడి యున్నది. మఱియుఁ, బాత్రలవర్ణించునపుడును, బాత్రలమనోభావముల వెల్లడించునపుడును, మహాకవులు తత్పాత్రలయం దైక్యము గావలయును. మఱియుఁ గవిత్వమునకు వన్నెఁబెట్టునది శైలి. పదజాలమును వివిధరీతుల సంపుటీకరించి తనహృదయాంతర్గతభావముల నుద్దీపింపఁజేసి ప్రదర్శించునపుడే కవి పాఠకుల మన్ననల నందఁగలఁడు. ఆంధ్రకవిత్వచరిత్రయందు భారతకవులును, ప్రబంధకవులును, నాధునికకవులును, నీనియమముల వేర్వేఱురీతులఁ బాటించి, యాంధ్రభాషావ్యక్తిత్వమును జాటిరి, చాటుచున్నారు—

ఈసమయమున రెండువిషయములు మనము యోజింపవలసియున్నది. ప్రథమమున శైలి. శైలినిగుఱించిన గ్రామ్య, గ్రాంథికవిధము లన్నియు మీ రెఱుంగుటయేగాక, యనుభవించినవే. నేను గ్రాంథికవాదిని. భాషాసౌష్ఠవమునకు గ్రాంథికమే ముఖ్యము. కాని భాషావిస్తీర్ణము గూడ ముఖ్యము గావున భాషలో నూతనపదసంపుటిని జేర్చుకొనుట తప్పదు. అట్టిపదముల నన్యభాషాజన్యములైనను, స్వీకరించుట యవసర మని యభిప్రాయ పడుచున్నాఁడను. లేనిచో భాష జీవభాష కాఁజాలదు. అందువలన, గిడుగు రామమూర్తిపంతులు

గారియొక్కయు, గురజాడ అప్పారావుపంతులుగారియొక్కయుఁ గృషి, యాంధ్రభాషకు నూతనకళల నుజ్జీవమును కలుగఁజేసిన దని మన మంగీకరింపక తప్పదు.

ఇరువదవశతాబ్దములోఁ బ్రాముఖ్యము వహించినవి రెండువిషయములు. గద్యమునకుఁ బ్రాముఖ్యము వచ్చుట, భావకవిత్వము,- దాని నూతనభక్తులు, గద్యరచనయం దొకమూల గౌరవమును, బ్రాప్తించుచున్నది. సౌందర్యమైన వర్ణనలు, భావనలు గలనవలలుఁ, గావ్యములు, శాస్త్రములుం, జాలనవసరము. కాని నేఁడు మనము గాంచుచున్న రైల్వేపుస్తకసముదాయము, భాషకుఁ గళంకము తెచ్చుచున్నది. ఆంధ్రభాషాభిమాను లీపనికిమాలిన పుస్తకసముదాయము నరికట్టకున్నచో, భాషారిష్టము తప్పక సంభవింపఁగలదని మనవిచేయుచున్నాను.

కవిత్వము భావప్రాధాన్యము గలిగి యుండుటకును, నూతనచ్ఛందస్సులచే నలంకరించుటకును- నాకెట్టి యభ్యంతరమును లేదు. కాని కొందఱు భావకవు లనవసరమార్గములు త్రొక్కుట మనము నిరసింపవలసియున్నది. "కాటుకకంటినీరు" అను పోతనవర్ణనకును, "ఎలుఁగెత్తి యేడ్చినాను" అను భావనాకవివర్ణనకును, నెట్టిపోలికయును గానరాదు.

నూతనమార్గము లనుపేరుతో భాషయొక్క సత్సంప్రదాయములను, శైలిని, శక్తిని నశింపఁజేయు యత్నముల నరికట్టి, యాంధ్రభాషను దేజోవంతముగఁ జేసి, నూతనశోభను గల్పించి, పరిశోధనలఁ బ్రోత్సహించి, నిఘంటువుల సంపుటీకరించి, సద్గ్రంథరచనను బురికొల్పి, భాషాసేవ చేయు తలంపే యీపరిషత్తు నుద్భవింపఁజేసినది. ఈపరిషద్బాలను, బోషించి, పెంచి ప్రౌఢను జేయుటలో శ్రీపీఠాపురము మహారాజావారి యాదరణయు జయంతి రామయ్యపంతులవారి కృషియు నెంత తోడ్పడినవో నేను విశేషించి చెప్పనక్కఱ లేదు. చేసినపనికంటెఁ జేయవలసినపని చాలఁ గలదు. యువకులు, నుత్సాహవంతులు, భాషాపోషకులు, నీనూతన కార్యారంభమునకుఁ గడంగవలసియున్నది. దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులుగా రత్యంతకృషితోఁ బ్రచురించుచున్న యాంధ్రవిజ్ఞానసర్వస్వమును, బరిషత్తువారు పీఠికాపురరాజన్యుని యాదరమునఁ బ్రచురించుచున్న యాంధ్రనిఘంటువును, ద్వరలోఁ బూర్తి కాఁగల వని యాశించుచున్నాఁడను.****

భాషావిషయమును గూర్చి తమకు నేను జెప్పవలసిన విషయముకంటెఁ దమరందఱుఁ జెప్పువిషయములే విని యానందించుట ముఖ్యము. నేఁటిసభ కధ్యక్షులు సర్వశాస్త్రపారంగతులు. వారినుడులను నితరపండితవరేణ్యుల భాషాప్రావీణ్యమును, నచిరకాలములో మనము విని యానందింపఁగలము. తిరుగ మిమ్మందఱ నాహ్వానించుచు, విరమించుచున్నాఁడను.

# అధ్యక్షోపన్యాసము.

ఆంధ్ర సాహిత్యపరిషత్సభ - అమలాపురము.

— కాశీ కృష్ణాచార్యులుగారు. —

ఆర్యమహాశయులారా!

మ. రా. శ్రీ జయంతి రామయ్యపంతులవారి యుత్తరమును జూచినతోడనే నాసామర్థ్యము నైన నే నాలోచించికొనక యీ యాంధ్రసాహిత్యపరిషదుభయ వార్షికోత్సవములం దధ్యక్షత నంగీకరించితిని. అమలాపురప్రాంతదేశము నాకపరిచిత మగుటంజేసి నేనెట్టివాఁడనో కొంతవఱకుఁ జెప్పికొనక తప్పినదికాదు.

సీ. నాజన్మభూమి కృష్ణాశీకరాసేకపావనం బైన బృందావనంబు
ననుఁ బెంచి పెద్దఁజేసినయొజ్జ యాదయాభాసురుం డగుశేషభూసురుండు
ప్రళయంబునందేనిఁ బడిపోని యాబేసికంటియూరా కాశి యింటిపేరు
నాయభిఖ్యకు ముఖ్యనాయకుం డాలోకపాలకుండగు గోపబాలకుండు
గీ. భాగ్యమా దివిజాంధ్రవాగ్యోగ్యమృదుల, తరసుధాఝురభరసహోదరకవిత్వ
మఖిలభోగంబు లాహయాస్యాంఘ్రిదివ్య,జలరుహారాధనమున నోసభ్యులార.

ఇట్టి మహాపరిషద్వార్షికోత్సవాగ్రాసనాధిపత్యమునకు నాకెంతవఱ కర్హత గలదో, మనవిచేసికొనుచున్నాఁడను.

శ్లో. శ్రీమత్పాణినివాక్సుధారసరుచిం జిహ్వా న జానాతి మే
వాణీ కాణభుజీ నవా మమ ముఖే నోమాత్రతంత్రాదికమ్
నా లంకారతతి స్తతస్తు కవితాకన్యా న లబ్ధా మయా
క్వాహం మందమతిః క్వ పండితతతిః క్వాగ్రాసనే మే స్థితిః.

ఈశ్లోకార్థము తమకందఱకును విదితమే. దీనిచేత నాయల్పశక్తి సభ్యులకు స్ఫురింపకపోదు. తమవంటి బహుసర్వతోముఖుల దర్శనలాభేచ్ఛయె నన్నీ కార్యమునకుఁ బురికొల్పిన దని విన్నవించుకొనుచుంటిని. నాయందు గురుతర మగుగౌరవముం జూపి నాకు లేఖనము నంపిన మాపరమాప్తు లగు శ్రీ జయంతి రామయ్యపంతులగారియెడ నే నెంతయుఁ గృతజ్ఞుఁడను.

సభ్యమహాశయులారా?

నేఁటి కిరువదినాల్గు సంవత్సరముల క్రిందట నీయాంధ్రసాహిత్యపరిషత్తు చెన్నపత్తనమున నావిర్భవించి యిప్పటిదనుక, జక్కనియభివృద్ధిగాంచి యెన్నియో

భాషావిషయకములగు చర్చలను గ్రంథరూపమునఁ బ్రకటించి యాంధ్రవాఙ్మయమునకు వన్నెఁదెచ్చి యాంధ్రులేగాక తదితరులయొక్కయు మన్ననకుఁ బాత్రమైన దనుటకు సంశయములేదు. ఈపత్త్రిక యావిర్భవించునాఁటికి గ్రామ్య భాషలోనే గ్రంథముల వ్రాయవలయు ననెడివాద మొకఁడు మనయాంధ్రదేశమున మొలకెత్తినది. దానిం బ్రతిఘటించుటకే యీపత్త్రిక బయల్వెడలె ననుటకు సందియములేదు. దీనివలన గ్రామ్య, గ్రాంథిక వాదములు రెండును, తుల్యబలములై కొంతకాలము యుద్ధ మొనరించినవి. గ్రామ్యవాదులు ప్రభుసాహాయ్యమునార్జించికొని కొలఁదికాలము తమవాదమున కెక్కువబలము నార్జించికొని యంతటితోఁ దృప్తినొందక గ్రాంథికభాష నుపయోగింపరాదనియు, విద్యార్థులు తమపరీక్షాసమయములఁ బ్రశ్నపత్త్రములకు సమాధానపత్త్రములను వ్రాయునపుడు గ్రాంథికభాషలో వ్రాసినయెడల నట్టివిద్యార్థులకు జయచిహ్నములను(మార్కుల)నీయరా దనియుఁ గూడ నొకరాజాజ్ఞను సంపాదించిరి. అందుపై నుభయవాదులకునుఁ బోరాట మధికమయినది. తుదకు నెటులనో గ్రామ్యవాదమున కంతటి ప్రాముఖ్యము శాంతించినది. కాని గ్రాంథికభాష యీపరిషత్తువారిచేఁ జక్కనిపెంపు నొందింపఁబడుచున్నను బ్రస్తుతకాలమున నాంధ్రలోకమున నెందఱి జిహ్వాగ్రములందు వ్యవహరింపఁబడుచున్నదో పరిశీలించినయెడల నట్టిగ్రాంథికభాషాప్రయోక్తలయొక్క సంఖ్య పెంపు నొందుచున్నట్లు నాకు గోచరించుటలేదు. దానికి నాకుఁదోఁచినకారణ మేమనఁగా, గ్రాంథికభాషాలంకృతము లగుగ్రంథరాజములను జదువవలయు ననుకోరిక బహుజనులలోఁ గలుగకుండుటయు, నొకవేళఁ జదువువా రున్నను, "దాముఁ గూడ గ్రాంథికభాషలోనే గద్యపద్యములను వ్రాయుచుందము" అను నుత్సాహము గలవారి సంఖ్య చాలఁ దగ్గియుండుట యు, నటుల వ్రాయువా రున్నను, వారి గ్రంథము లర్థార్జనమున కుపకరించునవి కాకుండుటయు నయి యున్నవి. మఱియు నేభాషయేనియు నభివృద్ధినొందవలయు ననిన, విద్యార్థిలోకముయొక్క యాదరమునకుఁ బాత్రత నొందవలయును. అభివృద్ధి యనఁగ నిచ్చకు వచ్చినట్లు ప్రయోగింపఁబడుట యని నాయభిప్రాయము కాదు. మ ఱే మన, సహజ మగు శుద్ధితోఁ గూడినదై, స్వచ్ఛందముగ వ్యవహరింపఁబడుటయే భాషయొక్కయభివృద్ధి యని నాయాశయము. దానికి, ఆయా భాషలకు సంబంధించిన విశ్వవిద్యాలయముల ప్రోత్సాహ మావశ్యకము. మనయదృష్టవిశేషముచే మనకు స్వతంత్రమయిన యాంధ్రవిశ్వవిద్యాలయము ప్రభుత్వమువారిచేఁ గటాక్షింపఁబడిన

థని చెప్పికొనుటయే కాని దానిసాయమున మనయాంధ్రభాష కెట్టి యభివృద్ధియు జరుగుట లేదు. "ఆక్సుఫర్డు యూనివర్సిటీ" వలన మనయాంధ్రభాష కెంత లాభమో, మనయాంధ్రవిశ్వవిద్యాలయమువలనను నట్టిలాభమే కాన్పించుచున్నది. నైజామురాజ్యములోని ఉస్మానియాకాలేజిలోని విద్యాభ్యాసపద్ధతి నించుక గమనింపుఁడు. అచటఁ బఠనీయగ్రంథములు చాలవఱకు నుర్దూభాషలోనికి భాషాంతరీకరింపఁబడియే విద్యార్థులకుఁ గఱపఁబడుచున్నవి. అటుల భాషాంతరీకరింపఁబడని గ్రంథము లుపాధ్యాయులచే నుర్దూభాషలోనే విద్యార్థులకు బోధింపఁబడుచున్నవి. అందువలన నైజామురాష్ట్రపుదేశభాష చక్కని పెంపు నొందుచున్నది. అటులనే మనయాంధ్రభాషవిషయమును యాంధ్రవిశ్వవిద్యాలయాధికారులు, కళాశాలలలోని పఠనీయగ్రంథములను, ఆంధ్రభాషలోనికిఁ బరివర్తించియే బాలురకుఁ గఱపవలయును. ఆంధ్రభాషలోనే సర్వశాస్త్రములను బోధింపవలయును. ప్రశ్నోత్తరపత్రములు గూడఁ జక్కనియాంధ్రభాషలోనే యుండవలయును—అను నియమముల నేర్పఱిచినఁ గాని మనయాంధ్రభాషకు మన మనుకొనునంత వృద్ధిరా దని నేను మనవి చేయుచున్నాఁడను. ఇంతపని కావలయు నన్న, సాహిత్యపరిషత్తువారు కొంతవఱ కాంధ్రవిశ్వవిద్యాలయసంబంధము కలిగించికొనవలయు ననియు, నెట్టిగ్రంథములు, చదివినకొలఁదిఁ జదువవలయు ననెడియుత్సాహమును విద్యార్థిలోకమునకుఁ గాని విద్వల్లోకమునకుఁ గాని కలిగించునో, యెట్టిగ్రంథములు చదివినచో నార్థికాంశముగూడఁ బొందు ననునాస యాంధ్రులకుఁ గల్గునో, యట్టిగ్రంథము లేభాషలోని వైనను సరియే, వానిని మనయాంధ్రములోనికి భాషాశుద్ధికి లోపము లేకుండునటులఁ బరివర్తింపఁజేసి, యాగ్రంథములనే విద్యాశాలలలోఁ బఠనీయ గ్రంథములుగ నియమింపఁబడునటులఁ బ్రయత్నించుట యవసరము. హూణభాషయం దున్నతస్థానము నొంది యాభాషలోని బహువిధోపకృతి నొనర్చుగ్రంథములను శుద్ధసులభాంధ్రభాషలోనికిఁ బరివర్తింపఁగల మహామహులు మనకుఁగలరు. అటులనే సంస్కృతములోని గ్రంథములను ద్రావిడభాషాగ్రంథములను, మఱియు ననేకభాషలలోని, యనేకవిధముల మన కుపకరించు గ్రంథరాజములను, శుద్ధసులభాంధ్రము లోనికిఁ బరివర్తన మొనర్పఁ గలవారును మనకుఁ గలరు. అట్టివారిచే రచింపఁబడిన వ్యాసములను మనపరిషత్పత్రికామతల్లి తనయందుఁ బ్రచురించుచునే యున్నది. ప్రకృతమున నేఁటివార్షికోత్సవమున కాహూతులైన ప్రాజ్ఞులు ముప్పదియిద్దఱు వ్యాసములను వ్రాసిరి. వానిలో

సుమారు పదునెనమండ్రు సభాస్థలమునకు విచ్చేసి తమవ్యాసముల నీవార్షికోత్సవసభలోఁ జదువఁగల్గిరి. తక్కినవారు తమవ్యాసములను సభ కంపిరి. ఇవన్నియు మనపరిషత్పత్త్రికయందు ముద్రితము లగును. ఇట్టివ్యాసరాజములు గద్యపద్యాత్మకము లయి శుద్ధసులభభాషామయము లయి, యాంధ్రులకు, ముఖ్యముగ నాంధ్రవిద్యార్థులకుఁ బ్రత్యక్షరశిరఃకంప మొదవఁ జేయునట్టియు నార్థికవృద్ధికిఁ దోడ్పడునట్టియు, విషయములను బోధించున వయి, పాఠశాలలలోఁ బఠనీయగ్రంథములుగ నుండవలయును. అపుడు గాని విద్యార్థులు, ఆంధ్రగ్రంథములను జదువరు. విద్యార్థులకు మనభాషాగ్రంథములను జదువ నుత్సాహము గలిగినపుడే యాంధ్రభాష బహుముఖముల వర్ధిల్లును. ఒకవేళఁ బద్యరూపము లగు కబ్బములు ధారణ కుపయుక్తము లగు ననుతలఁపున నట్టిగ్రంథములు మనయాంధ్రభాషలో వెల్వడినయెడల నాగ్రంథస్థవిషయములుఁగూడ బాలురకు హృదయరంజకము లయి, యర్థలాభకరము లయి, యుండవలయును. అదియునుం గాక పద్యములు శుద్ధమృదుమధురశైలిలో నుఁడవలయును. అట్టిపద్యములను బాలుఁడు చదువునపు డతిశ్రద్ధతోఁ జదువును. ఆపద్యములు వానిలింగశరీరమునకంటి జన్మజన్మాంతరములందును మఱపురాకుండును. అపుడె యాంధ్రవాఙ్మయము వర్ధిల్లును. దేశాభివృద్ధి యెపుడును విద్యార్థులయధీనము గదా ! మచ్చునకు నా యవధానములోని కొన్నిపద్యముల, నీక్రిందఁ గనఁబఱచెదను. "మంగళాదీని మంగళాంతాని మంగళమధ్యాని శాస్త్రాణి" అను సూక్తినిబట్టి, యేకార్యమునం దైనను మంగళబాహుళ్యము మనయార్యసిద్ధాంతప్రకార మత్యవసరము.

సీ. పదిమందిలోఁ బట్టపవలైన నిలువెల్ల దోఁచి తోఁచని పచ్చిదొంగవాఁడ
ఎరికేనియుఁ దిరుక్షౌరమ్ము సేయించి పంగనామమువెట్టి పంపువాఁడ
వడ్డిలోఁ గాసైన వదల కంతకు నంత గుంజి గైకొను జాతిగుండెవాఁడ
కడుపేద నని మొత్తుకొనిడ నెత్తిజుత్తైనఁ బెట్టి పొమ్మని యడ్డుపెట్టువాఁడ
యడుగడ్డునకు మ్రొక్కి ముడుపుగట్టెడు భక్తకోటిఁ బ్రోచెడు లంచగొండివాఁడ
గీ. ఇన్నియునుగల్గి పైస లేకున్నవాఁడ, పేరు గొప్పయె చూడఁగ నూరుతిప్ప
యనెడున్యాయంబునకులక్ష్యమైనవాఁడ, మమ్ముదయఁజూడుమలమేలుమంగ ఱేఁడ.

నే నీమంగళపద్యమును జదివినపుడెల్లను జను లెందఱెందఱో వ్రాసికొనియో, నేను జదువునపుడే పూర్తిగ వ్రాసికొన నేరనివారు, నాకడకు వచ్చి వ్రాసికొనియో, రెండుమూఁడుమాఱులు చదివికొని కంఠస్థ మొనర్చికొన్నవారిని నే

నెఱుఁగుదును. ఇది యార్థికాంశమున కుపయుక్త మగువిషయమును బోధించు పద్యము కాదు. అయినను దానియందుఁ బాఠకహృదయాకర్షక మగునొక విశేష మేదియో కల దని పాఠకులు గ్రహింపకపోరు. ఇఁక నార్థికాంశమునందుఁ గూడ నిట్టిపద్యము లుపయుక్తము లయినచో బాలకులను "వల్లించి యప్పగింపుఁడు" అని యుపాధ్యాయుఁడు నుడువవలయునా ? మ ఱొక పద్యమునుఁ గూడఁ జిత్తగింపుఁడు—"హిమాలయము లెంతయెత్తో శాంతమహాసముద్ర మంతలోఁతు" అనుకీతి నుపమానోపమేయభావము జూపువర్ణనలు మనయాంధ్రగీర్వాణములందుఁ గన్పట్టుట లేదు. అట్టివర్ణనముతో స్త్రీని శృంగారరసప్రధానముగ వర్ణింపుఁ డని నన్నొకసభలో సభ్యు లడిగినపుడు నే నీక్రింది పద్యమును నుడివితిని.

సీ. దరహాసములఁ జల్లు దాని దంతపుబంతి యెంత తెల్పో కచం బంతనల్పు
కలిమిలేముల యుయ్యేలలనూఁగు దానికౌ నెంతతగ్గో కుచం బంతమ్రొగ్గు
దానియానపుసొంపు దానిపాదన్యాస మెంతజబ్బో పిఱుం దంతయుబ్బు
ఆసేచనకరూప మగుదానినిలువెల్ల నెంతసొంపో సబా మంతవంపు
గీ. "ఔర ! యాసోయగము రంభ కైన రతికి, నైన శ్రీభారతీదేవి కైన లచ్చి
కైన లేదన నితరులయందుఁగలదె, యదిమొతొలివేల్పుతొలిసేఁతయగునుగాత.''

ఈపద్యము గూడ ననేకాంధ్రుల జిహ్వాగ్రముల నధిష్ఠించెను—

ఆంధ్రమహాజనులారా !

ఆంధ్రసాహిత్య మనఁగఁ, జక్కగ నాంధ్రభాషయందుఁ బ్రవేశము గల్గుటయే కాదు. సంస్కృతభాషయందుఁ గూడ మంచిప్రజ్ఞ నార్జించి యుండవలయు నని నాయుద్దేశము. నాకు సంస్కృతమందుఁ బ్రీతి మెండు. కాని యాంధ్రమునందభిమానము లే దని మీ రనుకొనవలదు. ఈవిషయమై నాయవధానపద్యముం గనుఁడు—

శా. జాజి న్రాజిలునట్టిమార్దవము రోజాపూవుటందమ్ము జ
వ్వాజి న్గ్రిమ్మెడుగమ్మతావి మధురంభాశ్శర్కరాపూపికా
రాజన్మాధురి తేట తెల్గునకు సంప్రాప్తించునే కాని రా
దేజన్మానకు నిష్ఠురంబయిన బర్బ్హార్వక్త్రవాగ్వైఖరిన్. ౫

నే నీపద్యమును సభలోఁ జెప్పి, నాయాంధ్రభాషాభిమానమును బూర్తిగ వెలిఁబుచ్చితిని. దీనింబట్టి యాంధ్రగీర్వాణభాషలలోఁ బ్రశస్త మగుపాండిత్యము

నార్జించికొని యీరెండుబాసలను సవ్యాపసవ్యబాహులతికలఁగఁ జేసికొనిన వాఁడే యాంధ్రసాహితి గలవాఁడని నాహృదయము. ఈవిషయము నీక్రింది నా పద్యమువలనఁ గనఁదగును—

ఉ. సంధి సమాసశుద్ధపదసంగతి భూరితరార్థభావసం
బంధ మొకింత గావలసివచ్చిన మీఁదగు నాంధ్రభాష కే
బంధువు లిత్తు రొక్కసురభారతి దక్కఁగ నట్లు కానిచో
నంధువులోని కూర్మమున కక్కరయె చెల్లెలో యాంధ్రి కాదొకో. ౬

ఇట్టి యభిప్రాయముగలవాఁడ నగుటచేతనే నేను సంస్కృతభాషావ్యాప్తికయి పాటుపడుచున్నవిషయ మందఱికిని విశదమే. అదియునుం గాక నాపరిశోధనలో సంస్కృతాంధ్రములకు విశేషసంబంధ మున్న దనియుఁ, బదములలోనే గాక, కొన్నివిలక్షణార్థముల నిచ్చుపదసముదాయములలోఁగూడ విశేషసంబంధ మున్న దనియు నాకు గోచరించినది.

ఉదాహరణము:— కొన్నియాంధ్రనిఘంటు గ్రంథములలో, తద్భవాంధ్రపదములకుఁ బ్రకృతులనువ్రాయుచు "కుంటి, వెళ్లుచున్నాఁడు" మొదలగు కొన్నిపదములకుఁ బ్రకృతులు వ్రాయఁబడవయ్యెను. దానంజేసి యట్టిపదము లన్నియు దేశ్యపదము లని నిఘంటుకర్తలయభిప్రాయ మై యుండవచ్చు నని నేనూహించి యంతటితోఁ దృప్తినొందక యట్టిపదములకు సంస్కృతములోఁ బ్రకృతులు దొరకునేమో యని పరిశీలించితిని. శ్రీపాణిని ధాతుపాఠములో "కుటి కౌటిల్యే, వేల్ల చలనే" అను సూత్రములు, గనవయ్యెను. "ఇదితో నుమ్ధాతోః" అను సూత్రప్రకారము, కుటి యనునది కుణ్టయగును. దానిచే, "కుణ్టతీతి కుణ్టీ" యనురూపము సిద్ధించు ననియుఁ, దెలుఁగులో కుంటి యను దానికి, కుణ్టీ యనునదిప్రకృతి గావచ్చు ననియు నేఁదలఁచి కొంతమంది వైయాకరణులను గనుఁగొనఁగా నాయూహ సరియె యని యొప్పుకొనిరి. ఇటులనే వేల్లతి= వెళ్ళుచున్నాఁడు. వకిధాతువువలన వంక, యనువైకృతపదము పుట్టినట్లు తోఁపకమానదు. ఇఁక Idioms అనఁగా విలక్షణార్థబోధక పదసమూహములు తెలుఁగులోఁ గొన్ని గానవచ్చెడిని. కాలముచేసెను= చచ్చెను. ఈప్రయోగమునందు, కాలముచేయుటకుఁ జచ్చుట యనువిలక్షణార్థము, అనుభవములో నున్నది. దీనికి సంస్కృతమున నాధార మే మయిన నున్నదా యని నేను విచారించితిని. శ్రీమద్రామాయణమున నీక్రిందిశ్లోకమున "ఏవం త్వం పుత్రశోకేన రాజ న్కాలంకరిష్యసి" కాలంకరిష్యసి=

చత్తువు, అనుష్ఠము వ్యాఖ్యానమున వ్రాయఁబడెను. ఇటులనే 'ఈనాల్గు నెలలును గన్నులు మూసికొని వెళ్ళఁబుచ్చుము' అని మనము తెలుఁగులో వాడుకొను చున్నారము. "శ్లో. శేషా న్మాసా న్గమయ చతురో లోచనే మీలయిత్వా" అని కాళిదాసప్రయోగ మున్నది. కావునఁ బరిశీలన చేసికొలఁది బహ్వాంధ్రపదము లకు సంస్కృతప్రకృతులు లభించునేమోయని నాయూహ. అందుచే దేశ్యపద ములు తెలుఁగున లేవని నే ననఁజాలను. కావున, ఆంధ్రసాహిత్యపరిషత్తువా రీపరిశీలనను గూడ గమనింపవలయు నని నాప్రార్థన—

సభ్యవర్యులారా ! ఇఁక గ్రామ్యభాష:—

శుద్ధభాషాభివృద్ధికిఁ దోడ్పడు నపుడు వ్రాఁతలోఁ గాని కూఁతలోఁ గాని గ్రామ్యభాషను వాడవచ్చును. కాని యాభాషలో స్థిరవాఙ్మయమును వ్రాయ వల దనియే నానిశ్చయము. పామరులకు గ్రాంథికభాషాగ్రంథములవలన విజ్ఞాన ము లభింపదు, గావున, గ్రామ్యభాషలోనే గ్రంథముల వ్రాయవలయు ననియు, మనలో గొప్పవారు (అనఁగా) స్వాధ్యాయవేత్తలు, నానాభాషాకోవిదులు, తార్కికులు, వైయాకరణులు, సంస్కృతసాహిత్యచక్రవర్తులు, ధనికులు మున్న గువారు వైనందినవ్యవహారములో నుపయోగించు నాంధ్రపదములను గ్రామ్య ము లనుటకు వలనుపడ దనియు, నట్టిపదము లన్నియుఁ బ్రామాణికములె, యని యుఁ గావున నట్టిపదములనే గ్రంథముల వ్రాయవలయు ననియు, గ్రాంథికవాదులు చెప్పెడు పూర్వప్రామాణిక కవిప్రయోగములలోఁ గూడ గ్రామ్యము లనఁదగిన పదము లెన్నియో కల వనియుఁ, దత్తత్కాలవ్యావహారికపదములతో గ్రంథముల వ్రాయుట కవిసామాన్యమునకు స్వభావసిద్ధ మనియుఁ జెప్పెడి గ్రామ్యవాదుల యొక్క వాక్యములందు నాకుఁ బూర్ణవిశ్వాసము లేదు. స్వాధ్యాయము, యమ్. ఏ. డిగ్రీ, తర్కము, పాణినీయము, సంస్కృతసాహిత్యము, పుష్కల మగుధనము, నివన్నియు నాంధ్రభాషాప్రామాణికత్వమునకు సాధకములు గావు. ఆంధ్రభాషా విషయమున, శుద్ధముగా వ్యాకరణశిక్ష నొంది ప్రాచీనభారతాదిలక్ష్యపరిశీలనము నొనర్చి, నిఘంటుగ్రంథములఁ గంఠస్థములుగా నొనర్చి, యాంధ్రలక్ష్యలక్షణవృత్త జ్ఞానము గలమహాకవులే ప్రామాణికులు గాని, స్వాధ్యాయవేత్తలు మొదలగు పైనఁ జెప్పఁబడినవారు గాని, సామాన్యశాసనాదులను గుది గూర్చువారు గాని, అర్జీలు, కవుళ్ళు, కదపాలు, ప్లయింట్లు వ్రాయువారు గాని ప్రామాణికు లని నాతాత్పర్యము కాదు. గ్రామ్యభాషలో వ్రాసి సంతసించువారు గాని, యట్టి

భాషలోని గ్రంథములను జదివి, తద్ద్వారా విజ్ఞానమును సంపాదించి శుద్ధభాషా ప్రవేశము నార్జించుకొను వారు గాని, యున్నచో వారిని వల దని నిషేధించుటకు మనకును, గ్రాంథికభాషాభిమానము గలవారిని నిషేధించుటకు వారికిని నధికారము లే దని నే ననుకొంటిని. రాజాధిరాజు ధరించినంతమాత్రమున మాయామౌక్తికము శుద్ధమౌక్తికము గాని, ముచ్చిబంగారము సువర్ణముగాని కానేరదు. ఎప్పటికిని గ్రాంథికవ్యావహారికభాషలకు వైలక్షణ్య ముండితీరవలయును. అదియే స్వాభావికము. ఆవైలక్షణ్యము ప్రయోగార్హానర్హతారూప మయినదే. పండితులొకవేళ గ్రామ్యభాషను వ్యవహారమునఁ బుష్కలముగ నుపయోగించుట లేదా యని ప్రశ్నింతు రేమో! ప్రత్యహమును మానవమాత్రునకుఁ బలుతెఱఁగుల వారితో దర్శన, స్పర్శన, భాషణాది సంబంధ మనివార్యము. ప్రాజ్ఞ, లజ్ఞులయొక్క భాష నర్థముచేసి కొన్నటు లజ్ఞులు ప్రాజ్ఞుల యొక్క భాష నర్థముచేసికొననేరరు. పరస్పరవాగర్థజ్ఞానము లేనియెడల జీవయాత్రకే భంగము రావచ్చును. అంతమాత్రమున గ్రామ్యభాషయే గ్రంథరచనాదులం గూడ నుపయోగింపఁబడవలయు ననువాదము యుక్తియుక్తము కాఁజాలదు. పాదరక్షల బూది ఫాలబాధఁ దీర్చుటకుఁ దాల్చినంతమాత్రమున, దేవతార్చన సమయమందుఁ గూడ, నాభస్మము నే ఫాలమున ధరింపవలయు నని శాసింపవచ్చునా? పండితకవు లొకపుడు తమగ్రంథములం దెచ్చటనో గ్రామ్యపదము లొకటిరెండు వాడుచుండి రనియు, నందుచే శుద్ధభాషలో గ్రంథముల వ్రాయుటయే యసంభవ మనియుఁ జెప్పుదు రేమో! "శ్లో॥ నిమజ్జ తీందోః కిరణే ష్వివాంకః" అను శ్లోకపాదము ననుసరించి యవి సహ్యములే యగును. మఱియు సంస్కృతమునఁ గూడ మహాకవులు గొందఱు "శ్లో॥ నయాచే హిందూకం పర్వణిద తైక డబ్బూకం. శ్లో॥ వ్యత్యస్తతులితరాజాం రాజాం కుత ఈశ్వరో సృజ ద్ధాత్ర్యాం. శ్లో॥ నిరస్తాఖిలమాన్యస్య సిరస్తాదారు సంజ్ఞినః। పురస్తాత్ శ్వః ప్రభాతే స్యాత్, శిరస్తాడన ముచ్చకైః॥ అని చమత్కారముగాఁ గొన్ని పద్యములను జెప్పియుండిరి. అందులో మొదటిది జగన్నాథపండితరాయలచేఁ జెప్పఁబడిన దనియుఁ దక్కినవి నడిమింటి మంగళాద్రిశాస్త్రులవారిచేఁ జెప్పఁబడిన వనియుఁ గింవదంతి గలదు. ఇట్టిప్రయోగములు, పగటిభాగవతులు నీచపాత్రముల వేషముల ధరించి ప్రేక్షకులకుఁ దాత్కాలికానందమును ఘటింపఁజేసినట్లు, శ్రోతలకుఁ దాత్కాలికానందజననార్థము మహాకవులచేఁ బ్రయోగింపఁబడినవే కాని యన్యము కాదనియె నానమ్మకము.

వ్యాకరణమునకు బద్ధములు కాని కొన్నిప్రయోగము లార్ష గ్రంథాములలోం గనవచ్చుచున్నను, వానియెడల 'ఆర్షత్వా న్న దోషః, ఛాందసత్వా న్న దోషః,' అని వ్యాఖ్యాతలు సమర్థించిరి గదా! అంతవఱకేల, వ్యాకరణశాస్త్రము లోనే శాస్త్రకర్తలకె కొన్నిసూత్రములలో శాస్త్రనియమము తప్పుట యనివార్య మనియే, "ఛందోవత్సూత్రాణి భవంతి" అను నియమము నేర్పఱిచికొని యట్టిప్రయోగముల నితరవిద్వాంసులుగూడ నుపయోగింపరాదని కట్టుఁబాటొనర్చిరి. నేనైనను గ్రామ్యభాష నిరర్థక మనను- గ్రామ్యభాష బహూపకార ము. ఎట్లన, గ్రాంథికభాషామయము లగుగ్రంథములను బాలురకు బోధింపవలసివచ్చినపుడు, గ్రామ్యభాషాసాధనమున బోధించుట యతిసులభము.

ఉదాహరణము:—"రాముఁడు వచ్చెనేని" అనుదానిని బాలునకు బోధించునపుడు, ముందుగా 'వచ్చెనేని' యనుదాని కర్థము తెలిసెనా, యని బాలు నడిగినచో, వాఁడు నాకుఁ దెలియులే దనియే చెప్పును. అపు డుపాధ్యాయుఁడు, 'వచ్చెనేని' అని అంటే, వస్తే అని అర్థమురా' అని బాలునకు బోధింపవలె. అపు డు బాలునకుఁ 'రాముఁడు వచ్చెనేని' అను వాక్యమునకుఁ జక్కగా నర్థ మగును. ఈద్రావిడప్రాణాయామ మేల, 'రాముఁడు వస్తే' అనియె, ముందుఁ బ్రయోగింప రాదా యని గ్రామ్యవాదు లనవచ్చును. దానికి సమాధాన మీదిగువ వ్రాయు చున్నాఁడను.

వస్తే యనుప్రయోగము వాడఁబడుచున్న దేశకాలములందు, వస్తే యని వాడినచో ద్రావిడప్రాణాయామదోష ముండదు గాని, వస్తే యనుప్రయోగము లేని దేశాంతరకాలాంతరములందు, అచ్చటి యప్పటి గ్రామ్యభాషలోనే వస్తే యనుదాని కర్థము చెప్పవలసివచ్చును. అందుచే ననవస్థాదోషము తప్పనిసరిగా ఘటించును. లేదా ! యెప్పటికప్పుడు భాషను సంస్కరింపుమనే యుండవలయు నని చెప్పినచో ననంతవ్యాకరణప్రాగభావ, ప్రధ్వంసాభావములు రావలసి వచ్చును. సంస్కృతమున, పాణిని, పతంజలి, వరరుచి, ఆయాకాలముల భాషను సంస్కరించి కట్టుఁబాట్లొనర్పలేదా ! అని యడిగినచో, దాని కిది సమాధానము:- పాణిన్యాదులను బోలినలాక్షణికులు తత్తత్కాలవ్యవహారభాషను సంస్కరించినచో గ్రాంథికవాదులకుఁ బరమానందమే. కావున నెప్పటికేని గ్రామ్యభాష గ్రాంథిక భాషాబోధకుఁ దోడ్పడుచు ముఖ్యముగ నుండవలయునే గాని సుతరాము, నుండరాదని నాయుద్దేశము కాదు. అటుల గ్రామ్యభాషాత్యంతాభావము జన్మసహస్ర

ములకైన సంభవింపనేరదు. ఇది గ్రామ్యభాషను గూర్చి నాయభిప్రాయము-ఇక సూర్యరాయాంధ్రనిఘంటువు—

ఆంధ్రసోదరులారా !

నేఁటి కిర్వదినాల్గుసంవత్సరములనుండియు నాంధ్రసాహిత్యపరిషత్తు నడచుచున్నను, నింకను సూర్యరాయాంధ్రనిఘంటువు మాకరగతము కాలేదను నలజడి యాంధ్రలోకమున బయల్వెడలినది. కాని "నిఘంటుకార్యము బహుకాలసాధ్యము. న్యాయముగను నిఘంటుకార్య మారబ్ధమయి పదునైదు సంవత్సరములే గాని యిరువదినాల్గుసంవత్సరములు కాదు. కృత్యాద్యవస్థ యన్నట్టు లింతదనుకను సాధనసామగ్రీసంపాదనముతోనే సరిపోయి, కార్య మారబ్ధమయి, యజాది పదములలో 'ఎడ' అను పదమువఱకును నిఘంటువు వెల్వడినది. ఇఁక నింతటి కాలయాపనము లేకయే కార్యము సాగు" నని మ॥ రా॥ శ్రీ జయంతి రామయ్యపంతులవారు చెప్పిరి. కావున నిఘంటువు త్వరలోనే యజాదిపదములవఱకైన నొకసంపుటముగనో, కొన్నిసంపుటములుగనో రాఁగల దని నమ్మితిని.

వ్యాసకర్తలు—వారివ్యాసములు.

మహామహులారా !

ఈవార్షికోత్సవసందర్భమున సుమారు ౩౨ వ్యాసములును సభాంతరము నలంకరించినవి. తత్కర్తలును గొందఱు మాత్రమే సభలోఁ జదువంగలిగిరి. కాని వ్యాసములు విపులములగుటచేతను, దత్కర్తలు విశేషవిద్వాంసులగుటచేతను వ్యాసము లన్నియుఁ బూర్తిగఁ జదువుటకుఁ గాని, శ్రోతలకు వినుటకుఁ గాని వలయు నవకాశము చిక్కదాయె. ఇట్టి సమయముల వ్యాసకర్తలు తాము వ్రాసినవిషయము నంతయుఁ బ్రతిపత్త్రమును జూచుచుఁ జదువుటకంటెఁ బత్త్రాపేక్ష లేకయే, శ్రోతలముఖపద్మముల వీక్షించుచుఁ దాము వ్రాసినవ్యాసముయొక్క సారాంశమును జెప్పినచో నింతకన్న శ్రోతలు సంతసింతు రేమో యని, సభ్యులయొక్క యుపాంశువాక్యములవలన నాకుఁ బొడకట్టినది. అటులు ముఖమునకుఁ బత్త్రమునడ్డుపెట్టుకొనకుండ, తమవ్యాససారములను జెప్పినవారు శ్రీరస్తు చిరంజీవి సాగి వేంకట నరసింహము యమ్.ఏ., బ్ర. శ్రీ కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు మొదలగు మహాశయులును గలరు- వారియెడల శ్రోతలకు వైముఖ్యము నగపడలేదు. దానంజేసి "కాలము సమీపించినది- త్వరగ ముగింపుఁడు" అని పల్కెడు ఘోరకృత్యమును నాకుఁ దప్పిపోయినది-ఏ మయినను, బాఠశాలలలో విద్యార్థు

లకుఁ బఠనీయములై, యార్థికాంశమున నుపయుక్తములయి, శుద్ధసులభభాషామయములయిన, వైద్యగ్రంథములును, జ్యోతిర్గ్రంథములును, శిల్పగ్రంథములును, ప్రకృతిశాస్త్రగ్రంథములును, సనాతనధర్మబోధకగ్రంథములను నింకను నిత్యజీవయాత్ర కనుకూలము లగు గ్రంథము లన్నియును, నిప్పటి వ్యాసముల స్థానములో వెల్వడవలయును. అవి బాలురకుఁ జదువుట కుత్సాహజనకములుగను, నార్థికాంశమున నుపయుక్తములుగను, శుద్ధసులభాంధ్రభాషాభూషితములుగను నుండవలయును. అపుడే మనయాంధ్రభాషామతల్లి సంపూర్ణాభివృద్ధినందఁగలదు.

ప్రాజ్ఞమహాశయులారా!

మనభరతఖండమున నొకభాషావిషయముననే గాక సర్వవిషయములందును నీరసస్థితియె ప్రాప్తించిన దనియును, నిట్టిదుస్థితి తొలఁగి, భారతీయులకు బహోఽభివృద్ధి కలుగవలయునన్న, భారతీయబాలసూనులే, యాధారభూతు లనియుఁ జెల్పెడు నొకటిరెండు పద్యములను వ్రాసి నాయధ్యక్షతాభరమును మఱలఁ దమకె యర్పించికొనుచున్నాఁడను.

సీ. మాయగా మనదేశమాయెఁగా పరులపాల్ పోయిగా బ్రదుకె లేదాయెఁగా దె
చాయగా హక్కు రాదాయెఁగా దాస్యంబుఁ బాయఁగా రోజు రాదాయెఁగాదె
దాయగా నొకకూఁతఁ గూయఁగా నొకవ్రాఁతవ్రాయఁగాఁ జేతఁగాదాయెగాదె
ఈయగాధాఘాబ్ధిఁ ద్రోయఁగా మొఱవెట్టి డాయఁగా దిక్కు లేదాయెఁ గాదె

గీ. అఖిలవిధముల నెత మనకాయెఁ గాదె, యాత్మధర్మంబు నిర్మూల మాయెఁగాదె
యటునిటుఁ గదలవీలు లేదాయెఁగాదె, దేవుఁ డేరీతిఁ జేయునో తెలియదాయె.

సీ. కామాదు లనుపాడుకలముచే నేపిచ్చి గీఁకెఱుంగని బ్లాంకుషీటులార!
పరవంచనాది దుర్భావంబులను చెడ్డకలు పెఱుంగని పంటపొలములార!
పురుషార్థసురభూజములను బెంచఁగమంచి యనువైన యుద్యానవనములార!
ఒకచెంపఁ గొట్ట నీ రొకచెంపఁగొట్టఁ బా ల్గాఱుచుండెడి నిర్వికారులార!

గీ. అభము శుభము నెఱుంగక యాత్మనిష్ఠ
పటుతఁ జూపెడు పబ్లికు పటములార!
యుభయసుఖములఁ గోల్పోయి యున్నమాకు
దారిఁ జూపింపుఁడో బాలసూనులార!

కోనసీమవాస్తవ్యమహాశయులారా !

సీ. దివ్యకౌశికనదీతీర్థనిత్యస్నానవిమలడింభసమీరవీజితంబు
పక్వామ్రపనసరంభానారికేళజంబీరాదిఫలగంధపూరితంబు
ఖరరశ్మికరతాపహారకనిరంతరతరానల్పవల్లీవితానాంచితంబు
సతతవేదనినాదసంకులోత్తమసోమపీథిమందిరబహిర్వేదికంబు

గీ. ఆంధ్రభూనీరజాక్ష్యుత్తమాంగభూషణంబు బహుసంపదలకాఁపురంబునగుచు
సకలసుఖముల నొసఁగుట స్వర్గసీమ, మేనమామ మనఁజెల్లు మీకోనసీమ. ౯

ఇట్టిపుణ్యక్షేత్రమున నిట్టిమహాసభలో నే నగ్రాసనము నధిష్ఠించి తమబోటి విద్వద్బృందమధ్యమున మాటలాడ సాహసించినందులకు క్షంతవ్యుఁడ నని మఱొక్కమాఱు ప్రార్థించుచుంటిని—

చ. బుధజనులార నాకుఁగలబుద్ధియె సూక్ష్మము నాదుపల్కులన్
మధురిమఁ జూతమన్న నణుమాత్రముఁ గన్పడదైన ధర్మస
త్పథ మిది యంచు మీకు విశదం బొనరించితి నింతెకాని నా
యధరము దాఁటి తప్పులు బయల్పడినన్ క్షమియింపవేఁడెదన్. ౧౦

శ్లో. కళ్యాణాద్భుతగాత్రాయ కామితార్థప్రదాయినే
శ్రీమద్వేంకటనాథాయ శ్రీనివాసాయ మంగళమ్.

ఇ తి శ మ్.

# ఆంధ్రకర్ణాటకవాఙ్మయ పరస్పరసంబంధము.

టి. హెచ్. ఎం. సదాశివయ్యగారు, ఎం. ఏ. బి. ఎల్.
అడిషనల్ డిస్ట్రిక్టుమున్సిఫ్, అమలాపురము.

---

సభాధ్యక్షమహాశయా: సభ్యులార !

కర్ణాటకప్రాంతం బగుబళ్ళారిమండలనివాసి నైన నేను, ఆంధ్రభాషాయోషామణీహృదయస్థానం బనం బరఁగు నియ్యెడఁ దద్భాషావిశారదులు, విద్వత్పుంగవులు నగు తమసమ్ముఖంబున నాంధ్రభాషయం దుపన్యసింప సాహసించినందులకు క్షమింపవేఁడెదను. కన్నడము నాకన్నతల్లి యైనను, తెనుఁగు నాయభిమానమాత. ఆంధ్రసారస్వతమహోదధియందు విహారమొనర్ప నాకంతటి శక్తియు నవకాశమును లేకపోయినను దత్తీరప్రదేశమునం దాడుకొనుచు వీనులవిందొనరించు తద్ఘోష నాలకించి హర్షపులకితగాత్రుఁడ నగుమహాభాగ్యము నాకు సంఘటించినది. తమబోటి భాషావేత్తలసహవాససమావేశములు గల్గినవి. తమ రొనరించెడి యీ సాహిత్యదేవీపూజాసమారంభమునందు సమభాగినై యద్దేవికి నాభక్తిప్రణామాంజలి నొసంగుసౌభాగ్య మొదవినందులకు నే నెంతయు సంతసించెద. ఆంధ్రసరస్వతీస్తవనపరముగా దివ్యగంభీరనిస్వనంబునఁ దమరు సేయు జయజయారావములందు నాహీన, క్షీణస్వరంబుఁ జేర్చుటకు నా కీయవకాశముఁ గల్పించినందులకుఁ దమ కెంతయుఁ గృతజ్ఞుఁడను.

స్వరమేలనము (Harmony) పరమాత్మునిసృష్టియొక్క మూలతత్త్వము. ఆవిశ్వస్వరమేలన (The universal Harmony) స్ఫుటీకరణమే సాహిత్యమునకుఁ గారణము. సాహిత్యక్షేత్రము దేశమతకాలభాషాభేదవాతావరణంబులచే దూషితంబు గాదు. అయ్యెడ నాహూఢించి యుండునది పరబ్రహ్మవాచకం బగు నానందము. అయ్యెడ నేకచ్ఛత్రాధిపత్యము వహించి యేలునది శాంతిమహాదేవి. అయ్యెడ సతతము వినఁబడునది ప్రేమగీతము. సర్వసౌహార్దకతత్త్వవిజయశంఖనినాదము. స్వార్థైకపరాయణులకు భేదభావప్రధానులకు రాగద్వేషాసూయాదివిదగ్ధహృదయులకు నాపవిత్రసాహిత్యప్రమదోద్యానంబునఁ బ్రవేశము లేదు. అతిక్రమించి ప్రవేశించినను వా రందలిరామణీయకంబు ననుభవింపఁ జాలరు. సుప్రసిద్ధాంగ్లవిమర్శకుఁడగు Mathew Arnold నుడివినట్లు మాధుర్యము ప్రకాశము (Sweetness & Light) అనురెండును సంస్కృతియొక్క

లక్షణములు. తేనెటీఁగ, సాలెపురుఁగు రెండు నొకపువ్వునుండియే సారమును గ్రహించినను దేనెటీఁగ తాను గ్రహించినరసమును మాధురీమయ మగు తేనెఁ గాను బ్రకాశకారణ మగు మైనముఁ గాను బరివర్తన మొనర్చి లోకమునం దంత మాధుర్యప్రకాశముల ప్రసారమునకుఁ గారణ మగును. సాలెపురుఁ గన్ననో పుష్పమకరందమును విషముఁగాను నిరుపద్రవకీటికముల నాకర్షించెడి జాలము నల్లు దారముఁగను జేసివేయును. సుసంస్కృతసాహిత్యసేవకుఁడు తేనెటీఁగ మాడ్కి సారస్వతసారమును దనివిదీఱఁ గ్రోలి ప్రపంచమునం దంతట మాధుర్య రూపక మగు ప్రేమతత్త్వమును, బ్రకాశరూపక మగు జ్ఞానమును బ్రసరింపఁజేసి విశ్వస్వరమేళనమును దిగంతరాళములం దుఁ జాటించును. Shelley మహాకవి పాడిన "The Spirit of the worm beneath the sod
In Love and Worship blends itself with God"
అనుగీతమే సాహిత్యోపాసకుని జన్మగీతమునకుఁ బల్లవిగా నుండును.

"యస్మిన్ సర్వాణి భూతాని ఆత్మైవాభూ ద్విజానతః
తత్ర కో మోహః ? కః శోకః ఏకత్వ మనుపశ్యతః"

అని యీశోపనిషత్కారకుఁడు వాక్రుచ్చినట్టులె సర్వభూతములందు నేకత్వము నీక్షించు సాహిత్యసేవకునకు శోకమోహాదికము లుండ నేరవు.

సుసంస్కృతుఁడు భాషాభేదముఁగూడ నంతగాఁ బాటింపఁడు. సత్యము తెనుఁగునఁ జెప్పఁబడిన నేమి ? కన్నడమునఁ జెప్పఁబడిన నేమి ? అనాదిసంసిద్ధమైన పురాతనవాఙ్మయమున నుండిన నేమి? మొన్నఁబుట్టి నిన్ననే కన్నుఁదెఱచిన వాఙ్మయమున నుండిన నేమి ? అది యెప్పటికిని సత్యమే గదా ? ఈ ప్రపంచమునం దుండు భాష లన్నియు నొకకుటుంబమునకే చేరిన వని భాషావిదులు చెప్పుదురు. తనభాషతో నితరభాషలను, తులనాత్మక దృష్టిని బరిశీలించి వానియం దుండు దివ్యతత్త్వముల గ్రహించుటయు వాగ్దేవీభక్తుని కర్తవ్య మని వేఱ చెప్ప నవసరము లేదు. పూర్వపుఁ గర్ణాటకాంధ్రకవు లీయుదాత్తమార్గము ననుసరించి తదుభయవాఙ్మయములందు నికటమైత్రిని సంబంధమును గల్పించి తదుభయ భాషాభ్యుదయమునకుఁ గారకు లైరి. ఆధునికకర్ణాటకాంధ్రులుగూడఁ దదుదాత్త మార్గంబు ననుసరించి యుభయజనాంగములందుఁ బరస్పరమైత్రిని గల్పించి యుభయవాఙ్మయాభివృద్ధికిఁ దోడ్పడుట యత్యంతావశ్యక మని నివేదించుటయే నాయీవ్యాసముయొక్క ముఖ్యోద్దేశము.

— పంచద్రావిడభాషాకుటుంబము. —

క్రీ. శ. పదియవశతాబ్దియందు కన్నడకవియు లాక్షణికుఁడు నగు నాగవర్మ తన "ఛందోంబుధి"యందు "సంస్కృతం ప్రాకృత మపభ్రంశ పైశాచిక వెంబ మూరువరె భాషెగళోళ్ పుట్టువ ద్రవిడాంధ్ర కర్ణాటాదిషట్పంచాశత్సర్వవిషయ భాషాజాతిగళక్కుం" అనఁగా ద్రవిడాంధ్రకర్ణాటాదిభాష లన్నియు సంస్కృతము నుండి త్రివిధప్రాకృతములనుండి పుట్టిన వని వ్రాసినాఁడు ద్రావిడభాషలయం దత్యంతకృషి సల్పిన Bishop Caldwell గారు తమిళము, తెనుఁగు, కన్నడము, మళయాళము, తుళు, ఇవి ద్రావిడభాషాకుటుంబమునకుఁ జెందిన వని చెప్పుచున్నారు. కాని యాంధ్రకర్ణాటకముల కున్న పరస్పరసంబంధ మితరభాషలయందు లేదు. ఉత్పత్తిమూలద్రావిడభాషయం దైనను, నార్యభాషాసంపర్కముచే వీని కొకనూతనస్వరూపమే గల్గినది. ఆర్యద్రావిడసంస్కృతుల సంగమ మీభాషలయందుఁ గానవచ్చును. Indo-germanic మఱియు Teutonic భాషల సమావేశమున Romantic languages అనునూతనభాషలు ఐరోపాఖండమునం దుద్భవించినట్లు ద్రావిడసంస్కృతభాషల సంగమమందుఁ దదుభయభాషలసారము గ్రహించిన తెనుఁగు, కన్నడము జనించి యుండవచ్చు నని నా యూహ. ఇది వట్టియూహమాత్రము కావచ్చును. ఏది యెట్లున్నను ద్రావిడ భాషాకుటుంబమం దీరెండుభాషలకు నొకేవిధ మైన లిపియే యుండుటచేతను, పురాతనగ్రంథములందు కర్ణాటాంధ్రము లొకతరగతియందే యుదహరింపఁబడి యుండుటవలనను, ఈరెండుభాషలు సోదరీభాష లనుటకు సందేహము లేదు. ద్రావిడభాషకు మూలవ్యాకరణ మని, అగస్త్యప్రోక్త మని సుప్రసిద్ధిఁ గాంచిన "అగత్తియమ్" అనుగ్రంథమునందు "కొంగ్గ జ్కన్నడ జ్కొల్లం తెలుజ్గం" అను సూత్రము ననుకరించి పదునొకండవశతాబ్దిలో వెలసిన "నన్నూల్" అను తమిళ వ్యాకరణమునకు వ్యాఖ్యాన మొకదానియందు "కన్నడమ్ వడుగు కలిజ్గ తెలుజ్గమ్" అని యున్నది. "వడుగ"శబ్దము, అరవములోఁ దెనుఁగుమున్నగుదేశభాషాదుల కుపయోగింపఁబడుచున్నది. ఇఁక నుభయవాఙ్మయేతిహాసములను, తులనాత్మకదృష్టినిఁ బరిశీలించినచో నాంధ్రకర్ణాటకభాషాయోషామణులు సహోదరులవలె సౌహార్దసాహచర్యసంపర్కములచే వర్ధిల్లుచుండె నని విస్పష్టమగును. వాని పరస్పరసంబంధమును జర్చించుతఱి వాఙ్మయేతిహాసమును 1 చాళుక్యయుగము, 2 విజయనగరసామ్రాజ్యయుగము నని రెండు భాగములుగ విభజించి విమర్శింపవచ్చును.

## 1. చాళుక్యయుగము.

ఆంధ్రకర్ణాటకదేశములకుఁ జాళుక్యులే ప్రభువులై యుండినందున, కర్ణాట ప్రభువులాంధ్రకవులను, ఆంధ్రప్రభువులు కర్ణాటకవులను నాదరించుచుండిరి. పశ్చిమచాళుక్యులు కన్నడములోఁ బ్రథమకవులగు జైనకవుల కాశ్రయమిచ్చి కర్ణాటకవాఙ్మయమును వర్ధిల్లఁజేసిరి. అప్పుడు కన్నడసారస్వతమునం దనేకకావ్యరత్నములు వెలువడినవి. అప్పుడాంధ్రవాఙ్మయముయొక్క యాస్తికత్వ మంతగా నారూఢమై యుండిన ట్లగపడదు. కర్ణాటకప్రాబల్యమే విశేషముగాఁ గనఁబడుచున్నది. ఆంధ్రము కన్నడమునందే మిళితమయియుండెను ఈయుగమునే యాంధ్రవాఙ్మయచరిత్రమందు, అజ్ఞాతయుగ మని చెప్పుదురు. ఈకాలమునందు, ఆంధ్రప్రభువులు కన్నడకవులనే యాదరించుచుండిరి. క్రీ॥ శ॥ 850 ప్రాంతమునం దుండిన గుణగాంకవిజయుఁ డనునాంధ్రప్రభువు కన్నడకవులనే పోషించుచుండెను. ఇతని కంకితమై "గుణగాంకియం" అను కర్ణాట చ్ఛందశ్శాస్త్రము కన్నడకవి యొకనిచే రచింపఁబడిన దనుటకు, అమృతసాగరుం డను తమిళజైనకవి తన "యాప్పరుంగళక్కారింగై" అను ఛందోగ్రంథమున "గుణగాంకియం" అను కర్ణాటకచ్ఛందస్సు ననుకరించినాఁడ నని చెప్పినాఁడు. రాజనరేంద్రునితండ్రి విమలాదిత్యుని దానశాసనము కన్నడభాషలో నున్నది. కర్ణాటలాక్షణికుఁడు, నరపతియు నగు నృపతుంగుఁడు తనకవిరాజమార్గమందు వర్ణించినట్లే కర్ణాటకదేశము "కావేరీనదినుండి గోదావరివఱకు వ్యాపించియుండె నని నిస్సందేహముగఁ జెప్పవచ్చును. ఈయుగమునాఁటియాంధ్రభాష కర్ణాటకమయముగా నుండెను. రాజరాజు కాలమువఱకు నాంధ్రభాషకు స్వతంత్రవ్యక్తిత్వమే యుండ లేదనుట కాంధ్రకవిత్వమును "మహిమ న్వాగనుశాసనుండు" అనఁగా సుప్రసిద్ధాంధ్రభారతకర్త యగు నన్నయభట్టారకుఁడే సృజించె నని యాంధ్రకవులు చెప్పుటయే తార్కాణము. ఆమహాకవి యాంధ్రభాషను లిపిని సంస్కరించి ప్రత్యేకవ్యక్తిత్వముఁ దెచ్చె నని యాంధ్రవిమర్శకు లందురు. ఈకారణమును బట్టియే రాజరాజాకవిని "విపులశబ్దశాసనుం డ"ని వక్కాణించె నని యాంధ్రపండితులమతము. ఈదృష్టిని నన్నయ, ఆంధ్ర Chaucer అని కూడఁ జెప్పవచ్చును.

### — నన్నయభట్టునకు పూర్వపు యుగము. —

అట్లని నన్నయభట్టునకుఁ బూర్వము తెలుఁగుకవిత్వమే యుండ లేదని చెప్ప నలవి కాదు. "కుమారసంభవ" కావ్యకర్త యగు నన్నెచోడుఁడు నన్నయ

భట్టునకన్నఁ బూర్వుఁ డని వాదించుట కనేకాధారములున్నవి. ఈతని శైలి కవిసమయము కన్నడమందలి జైనయుగకవులను జ్ఞప్తికిఁ దెచ్చును. నన్నెచోడునికృతిపతి జంగమ మల్లికార్జునశివయోగి. నన్నెచోడుఁ డీతని శివుని కభేదముగా వర్ణించినాఁడు. అట్టులే క్రీ॥ శ॥ 941 నందుండిన పంపుఁ డను కన్నడకవి తనవిక్రమార్జునవిజయమందుఁ గృతిపతియగు అరికేసరిచాళుక్యుని అర్జునునితోఁ బోల్చినాఁడు. నన్నెచోడునిగురువుకూడ జంగమమల్లికార్జునశివయోగియే. దీనింబట్టియు నితని కర్ణాటక దేశభాషాపరిచయములఁ బట్టియు నీతఁడు వీరశైవుఁడుగా నుండు నేమో యనుసందేహము గూడఁ గలుగుచున్నది. ఈతనికావ్యమునందుఁ గర్ణాటకపద బాహుళ్యమును దద్భాషాకవిత్వసంప్రదాయములు మెండుఁగాఁగనఁబడుచున్నవి. ఇందుచే నీతనికావ్యము "అన్యభాషాపదదూషిత మ"ని పేరువడసినది. ఈకాలపు శాసనము లగుయుద్ధమల్లునిశాసనము మున్నగువానియందుఁ గూడఁ గర్ణాటకభాషాసంపర్కలక్షణములు కనఁబడుచున్నవి. ఈయుగమే కన్నడవాఙ్మయమందు—

జైనయుగమని

వ్యవహరింపఁబడుచున్నది. ఈకాలమునందు జైనశైవధర్మములకుఁ బ్రబల విరోధముండి పూర్వచాళుక్యులు శైవమతాభిమానులుఁగా నుండినందున, ననేకజైనకవు, లాంధ్రమండలపు వేంగీదేశము నుండి కర్ణాటకప్రాంతమునకుఁ బోయి యచ్చటి ప్రభువుల నాశ్రయించి కర్ణాటసారస్వతసేవాబద్ధు లైరి. కన్నడములో, నాదిమహాకవి యనంబరఁగు పంపఁడు వేంగీపళువి నివాసియై యుండి పులగిరిప్రభువగు ఆదికేసరియాస్థానమున కేఁగి యాతనియాశ్రయమున "ఆదిపురాణము" "విక్రమార్జునీయ"ము రచించి ప్రసిద్ధివడసెను. పంపని యనంతరము పొన్నఁడు, రన్నఁడు ననుకన్నడజైనకవులు వేంగీదేశపు పుంగనూరుగ్రామవాస్తవ్యు లగు మల్లప్ప, పున్నిమయ్య, మల్లప్పకొమార్తె అత్తిమబ్బె యనువారిప్రోత్సాహమున శాంతిపురాణము, అజితపురాణమును వ్రాసిరి. పొన్నఁడు రాష్ట్రకూటరాజగు కృష్ణరాజునాస్థానములోనుండి "ఉభయకవిచక్రవర్తి" యను బిరుదము నొంది యుండెను. రన్నఁడు తనకావ్యమునందు వేంగీదేశమును "భోగమహీతల'మని వర్ణించినాఁడు. నాగవర్మకూడ వేంగీపళువువాస్తవ్యుఁడే యని యతని "ఛందోంబుధి"వలన వ్యక్తమగుచున్నది. దీనింబట్టి యప్పటికవు లుభయభాషాప్రవీణులై యుండి రనియు నాంధ్రకర్ణాటకభాషలకేగాక తజ్జనాంగములకుఁ గూఢ నికటసంబంధ ముండెననియుఁ దెల్ల మగుచున్నది.

పదునోకండవశతాబ్దియందు నన్నయభట్టారకుఁడు, ఆంధ్రభాషకుఁ గవిత్త్వమునకు స్వతంత్రస్వరూపము నిచ్చినను, నాతనిభారతమందుఁగూడఁ గర్ణాట ప్రయోగములు కనఁబడును. భారతాంధ్రీకరణమందు నన్నయకు సాయపడిననారాయణభట్టు సుప్రసిద్ధకర్ణాటకవియై యుండెను.

—ధార్మికవిప్లవము, దానిపరిణామము.—

పండ్రెండవ శతాబ్దియందుఁ గర్ణాటకమునందు మహాధార్మిక విప్లవ మై నిర్మాణ మగుచుండిన వీరశైవము వీర్యవంతమై నవశక్తితో విజృంభించుచుండెను. విప్లవమూలస్థానము కర్ణాటకకేంద్రస్థాన మగు కళ్యాణము. వీరశైవధర్మోద్ధారకుఁడును, నద్వితీయసంఘసంస్కరణకర్త్తయు నగు శ్రీబసవేశ్వరుఁడు జాతి కుల వైషమ్యములతో నిండి నిర్వీర్య మై యుండిన సమాజమునందు విచారక్రాంతిబీజమును విత్తి దానిని భక్తిపాశబద్ధము చేసెను. బసవేశ్వరునికి మార్గదర్శకుఁ డై శ్రీప్రభుదేవుఁడును సహాయకుఁడై శ్రీచెన్నబసవేశ్వరుఁడును, అనుయాయులై మాచిదేవ, సిద్ధరామేశ, కిన్నర బ్రహ్మయ్య, మున్నగు శివశరణులును, గంగాంబిక, నీలాంబిక, మహాదేవి, ముక్తాయి మున్నగు యోషామణులును ననేక గ్రంథములు రచియించి వీరశైవమతప్రసారము గావించిరి. ఐరోపాఖండపు మధ్యయుగమునం దెట్లు 'ప్రాటిస్టెంటు' మత మావిర్భవించి సమాజముయొక్క యాచారవిచారములందుఁ దత్త్వములయందు సారస్వతమునందలి లలితకళలయందు నద్భుతపరివర్త్తన మొనరించి "Renaissance" అను నూతనయుగమును స్థాపించెనో యట్లే యీధార్మిక విప్లవము దక్షిణాపథమందు నవసందేశప్రసారకారణమై నవశక్తి, నవభావనోద్దీపకంబగు నవయుగమును స్థాపించెను. వాఙ్మయముపై వీనిపరిణామ మద్భుతము. పురాణరచన, భాషాంతరీకరణము, ప్రాచీనకవిసమయము మున్నగునవి యంతరించినవి. వేదోపనిషత్తుల జ్ఞానము స్త్రీశూద్రాదిసంకుచితభేదభావములు లేక సర్వమానవులకు స్వతస్సిద్ధమగు హక్కని తలంచిన యీవిప్లవకారకధర్మవీరులు, ఆజ్ఞానమును జనసామాన్యమునకు సుబోధక మగు సులభ సరళ భాషయందుఁ బ్రసారించుటకుఁ బూని కన్నడకవి యొకఁడు చెప్పునట్లు "సులిద బాళెయహణ్ణినంద" దిశ్శరకేళీశైలియందుఁ దమకృతులను రచించిరి. ప్రాచీనఛందస్సు, ప్రాచీనవ్యాకరణాది నియమములు వారికిఁ బనికిరావయ్యె. హృదయకుహరమునుండి వెలువడి నీటుగా హృదయకుహరము ప్రవేశించుభావాలహరికిఁ గృత్రిమాటంకము లుండరా దని వారితలంపు కాఁబోలు. ఈనూతనశైలికిం దగునూతనదేశీయచ్ఛందస్సు

కనిపెట్టఁబడి దానియందు, షట్పది, రగళె, ద్విపద మున్నగునవి పుట్టెను. "వచనము"లనంబడు సరళ లలిత మనోహరపదభూయిష్ఠంబు లగుగేయములునుబుట్టినవి.

ఈవిప్లవ మాంధ్రసమాజభాషావాఙ్మయములపైఁ గూడ నద్భుతపరిణామము జేయకఁ పోలేదు. బసవేశ్వరునివలన నూతనసందేశప్రచారమునకుం గాను కళ్యాణపట్టణమునందు స్థాపింపఁబడిన "శివానుభవమంటప"మందుఁ దెనుంగుబొమ్మయ్య, మోళిగె మారయ్య మున్నగు నాంధ్రదేశీయశరణులు కూడ సమావేశులగుచుండిరి. బసవేశ్వరునిజీవితము ప్రప్రథమమునఁ బుట్టినది యాంధ్రభాషయందు. సుప్రసిద్ధుఁడగు పాల్కురికి సోమనాథుఁడు కాకతీయప్రథమప్రతాపరుద్రునికాలమందు బసవేశ్వరపురాణద్విపదకావ్యమునురచించెను. వీరశైవధర్మసంబంధముగ బసవేశ్వరస్తుతిపరముగ ననేకానేకగ్రంథముల రచించి చిరస్మరణీయుఁడయ్యెను. ఈమహాకవి కర్ణాటకశివకవులమార్గము ననుసరించి "కర్ణరసాయనలీలఁ గ్రోలు" "తేనియసోనలం జిలుకు తేటఁగు జాను తెనుంగున"దనకృతుల రచియించి యాంధ్రభాషకు మహోపకార మొనర్చెను. నామిత్రు లగు శ్రీయుత బండారు తమ్మయ్యగారు చెప్పినట్లు "తెలుంగుకవితయొక్క జీవకళ నిక్కముగ తెలుఁగుఁబలుకుబడులలోనె కల"దని తలంచి, సన్నయమార్గమునకు వన్నియవెట్టుచు జాను తెనుంగునఁ దనకబ్బముల జాలువార్చి జాతీయకవితానిర్మాణమునకయి తిక్కనాదిమహాకవులకు మార్గమును దీర్చినవాఁ డీమహానీయుఁడే యనుట సత్యదూరము కానేరదు. సోమనాథుఁడు తనబసవపురాణపీఠికయందు-

"ఉరుతరగద్యపద్యోక్తులకంటె, సరసమై పరఁగిన జాను తెనుంగు, చర్చింపఁగా సర్వసామాన్య మగుటఁ, గూర్చెద- "అనియు" "ఆరూఢగద్యపద్యాది ప్రబంధ, పూరితసంస్కృతభూయిష్ఠరచన, మానుగా సర్వసామాన్యంబుగామి, జాను దెనుఁగు విశేషము ప్రసన్నతకు" అని చెప్పినాఁడు.

సోమనాథుని కుండినసంస్కృతభాషావైదుష్యమును సకలశాస్త్రపారంగతనుఁ గూర్చి వేఱ చెప్పనవసరము లేదు. వేదవేదాంగములం దితనికిఁ గలయద్భుతపాండిత్యముఁ బట్టి యితఁడు వీరశైవుఁడు గాక బ్రాహ్మణుఁడై యుండనోపు నను తర్క మాత్సారికులసంకుచితభావమును వెల్లడించును, గాని వేదవేదాంత సంసిద్ధంబగు వీరశైవమున కేమాత్రము లోపము లేదు. సోమనాథుఁడు రచియించిన గ్రంథమహత్తరసంఖ్యంబట్టి యితఁడు వీరశైవవేదవ్యాసుఁ డనుట యతిశయోక్తిగా నేరదు. కర్ణాటకవివరేణ్యుఁడు దేశికుఁడు నగు శ్రీతోంటరాద్యుఁ డితనిచరిత్రమును గన్నడమునఁ బురాణరూపముగా వ్రాసినాఁడు. కన్నడకవులందఱును నీతని

తమ గ్రంథములయం దతిభక్తిపూర్వకముగాఁ బేర్కొని యున్నారు. ఆంధ్రకవిసార్వభౌముఁడగు శ్రీనాథుఁ డీతనియందు గురుత్వభావము వహించి యీతని "పండితారాధ్య" చరిత్రమును జంపూకావ్యముగా వ్రాసెను.

శ్రీమల్లికార్జున పండితారాధ్యులు వీరశైవగురుపరంపరలోఁ జేరినవారు. బసవేశ్వరుని కించుమించుగ సమకాలీను లని చెప్పవచ్చును. వీరు బసవేశ్వరుని దర్శనంబున కరుగుచు మధ్యమార్గమునం దాతనినిర్యాణమును విని బహువిధముగా విలపించినట్లు తెలియవచ్చుచున్నది. వెండియు వీరి కాబసవేశ్వరుఁడు పంపినవిభూతిప్రభావమువలనఁ గన్నడభాషాజ్ఞాన ముదయించెనఁట. వీ రాంధ్రమున "శివతత్త్వసార"మను గ్రంథమును రచించియుండిరి. ఆగ్రంథంబు కేవల తాత్త్వికదృష్టినిగాక భాషాదృష్టినిఁగూడ నత్యంత మహత్త్వము గలిగినది. "బసవేశ్వర పురాణమును" "పండితారాధ్యచరిత్రమును బ్రసాదించిన యాంధ్రమాత యుపకారమును గన్నడిగ లెన్నటికి మఱవఁజాలరు.

సోమనాథునిశిష్యకోటిలోఁ జేరినపిడుపర్తి బసవకవి "వీరశైవదీక్షాబోధ" మున్నగు ద్విపదకావ్యముల రచియించెను. కన్నడములో కెరెయపద్మరసు "దీక్షాబోధరగళె" నే బసవకవి యాంధ్రద్విపదయందు వ్రాసినాఁడు. పిడుపర్తి సోమనాథకవి పాల్కురికెసోమనాథుని ద్విపదబసవపురాణమును జంపూరూపముగావ్రాయుటయ గాక కన్నడములో నత్యంతప్రసిద్ధ మగు చామరసకృత "ప్రభులింగలీలను" ద్విపదయందు రచించెను. పిడుపర్తి బసవప్పకవి దానినే పద్యకావ్యముగా వ్రాసెను. ఆంధ్రద్విపద"ప్రభులింగలీల" శైలియొక్క లాలిత్యమును, బారిశుధ్యమును, మనోజ్ఞతను, ఆంధ్రు లంతగాఁ బాటింపకపోయినను సి. పి. బ్రౌనుదొరవారు వేనోళ్లఁ బొగఁడుచు పాశ్చాత్యదేశీయ సుప్రసిద్ధకవు లగు థియాక్రటీసు, స్కాట్టు మున్నగువారి లలితకవిత్వమునకుఁ బోల్చియున్నారు. ప్రభులింగలీలయందుండు నైతికవిషయమును, నుదాత్తవిచారములను గడుంగడు స్తుతించుటయేగాక యటువంటినైతికపరిశుద్ధత నిం కేకావ్యమునందుఁ జూడలేదని పొగడియున్నారు.

బ్రాహ్మణకవి యగు అత్తలూరి పాపకవి ''చెన్నబసవపురాణ''మను నాంధ్రపద్యకావ్యమును వ్రాసియున్నాఁడు. కన్నడమున విరూపాక్షకవి రచించిన చెన్నబసవపురాణమునకు దీనికి నేమి సంబంధము తోఁచదు. పాపకవికృతికి మూలమేమో తెలియదు.

ఈకాలమందుఁ గాకతీయప్రభువు లాంధ్రకవులను, బోషించుచుండినట్లు హరీశ్వర,పద్మరస, రాఘవాంకాదులగు కన్నడకవులకుఁగూడ నాశ్రయమిచ్చియుం

డుటం జూచిన నక్కాలమున సీమాభేదములేక యాంధ్రకర్ణాటకకవులెల్లెడ నుండిర నియు మహాకవు లందఱు నుభయభాషాకోవిదులై యుండి రనియుఁ జెల్లమగును.

## 2. విజయనగరసామ్రాజ్యయుగము.

ఉభయవాఙ్మయచరిత్రలందు విజయనగరసామ్రాజ్యయుగము, నందునను శ్రీకృష్ణదేవరాయలకాలము సువర్ణయుగ మని చెప్పందగు. కర్ణాటకసామ్రాజ్య సింహాసనారూఢుఁడైన కృష్ణదేవరాయలు కన్నడకవుల నాదరించినయట్లాంధ్ర కవులగు అల్లసాని పెద్దన, తిమ్మన, ధూర్జటి, మల్లన మున్నగు అష్టదిగ్గజము లని యెన్నంబడు నాంధ్రకవులను బోషించి స్వయముగ నాంధ్రమునందుఁ గవియై యుండి యాంధ్రభోజుఁడను బిరుదముఁ బొందెను. తనభుజబలసామర్థ్యమున దక్షి ణాపథమునుఁ గెల్చి "మూరురాయరగండఁ"డని బిరుదము పొందిన యతం డాంధ్ర దేశమును గూడఁ గెల్చెను, గాని యాంధ్రరమణుల కోడిపోయినాఁడు. ఆంధ్ర భాషాసౌష్ఠవమునకు ముగ్ధుఁడయ్యెను. ఆతని యాంధ్రపత్నులు తిరుమలాంబ అన్న పూర్ణాదేవి వీరిరాకవల్ల విజయనగరమున కనేకాంధ్రకవు లేతెంచి ప్రభుసన్మాన మునకుఁ బాత్రులైరి. "ముద్దుపలుకుల" ముక్కు తిమ్మన నెల్లూరుమండలేశ్వరుని కూఁతురగు నన్నపూర్ణయొక్క బోధకుఁడు. ఇంగ్లండునందు రెండవఛార్లెసుకాలము నందు ఛార్లెసుభార్యయగు Marie Antionette అనునది ఫ్రాన్సుదేశపు రాజ కుమారిక యైయున్నందున నాకాలమునందు, ఇంగ్లండురాజసభయందు ఫ్రెంచికవీ శ్వరులకుఁ బండితుల కెక్కువమన్నన యుండి ఫ్రెంచిభాషను నేర్చుకొనుట నాగరక తకు ముఖ్యలక్షణ మని యెంచఁబడెను. 17 వ శతాబ్ది-ఇంగ్లీషువాఙ్మయమందు ఫ్రెంచిభాషాపరిణామమే యెక్కువ గాననగును. కృష్ణదేవరాయలకాలమందు భుజబలపరాక్రమవిజయము కర్ణాటకుల దైనను, సాంస్కృతికవిజయము (Cultural Victory) ఆంధ్రులదే యని కన్నడిగ లొప్పుకొనవలసినది. అప్పు డారూఢమై యుండిన యాంధ్రవర్చస్సుయొక్కచిహ్నము లిప్పటికిని గూడఁ గర్ణా టకప్రాంతమైన బళ్లారిమండలమందుఁ గానవచ్చును. శ్రీకృష్ణదేవరాయలు, ఆంధ్ర కవితాపితామహుఁ డగుపెద్దనామాత్యుని సన్మానించి "కృతి రచింపుము మాకు శిరీషకుసుమపేశలసుధామయోక్తులఁ బెద్దనార్య" అని యడిగి "మనుచరిత్ర"ము వ్రాయించినట్లు, కర్ణాటకకవికులసార్వభౌముఁడగు తిమ్మనను "వినూతనాధికవస్త్ర భూషావ్రాతగళకొట్టెడకె మన్నిసి" ఈరీతిఁ జెప్పెను.

"తే సెనిసి మొందలా కుమార, వ్యాస దశపర్వగళ హేళిద
భాసురవిదొందెనిసి భారతదుళిదపర్వగళా
నీసకలజగ వెంచువంతె విలాసదలి పేళ్దెందను."

ఈరీతి కుమారవ్యాసుఁడు రచించి యసంపూర్ణముగా వదలిన కన్నడభారతమును బూర్తిచేయించెను. తిమ్మన్న తన పీఠికలోఁ గృష్ణదేవుని వర్ణించు తఱి-

"బళిక విద్యానగరియలి భుజబలది పట్టవకట్టికొండొలి
దిళెయనాళిదసఖిళకర్ణాటాధిపతియాగి."

అని యాకర్ణాటకసార్వభౌముని వర్ణించినాఁడు. ఇదియునుం గాక కృష్ణదేవరాయలు వ్యాసతీర్థు లను మాధ్వయోగిని దనసింహాసనమునఁ గూర్చుండఁబెట్టి కనకరత్నాభిషేకము గావించి మాధ్వమతమును బోషించెను. వ్యాసతీర్థుల శిష్యులైనపురందరదాసు, కనకదాసు లీకాలములోనే యుండి తమభక్తిభావగర్భిత మనోహరగీతములను పాడి కర్ణాటకము నంతయు సమ్మోహనపరవశముఁజేసిరి.

ఈరీతి కర్ణాటకాంధ్రవాఙ్మయములు పాలు పంచదారలవలె నన్యోన్యమైత్రిని వెలయుచుఁ బరస్పరాభ్యుదయమునకుఁ గారణములై యుండెననుసంగతిని నాయాంధ్రకర్ణాటకసహోదరులు మఱచిపోక మనపూర్వుల యుదాత్తమార్గమునే యనుసరింతురుగాక. ఇది కర్ణాటకము, ఇదియాంధ్ర మని యితరప్రాంతములమీఁద దాఁడివెడలుట భాషాభిమానము గానేరదు. తనసంస్కృతిం బలె నితరసంస్కృతులను గౌరవించుట కార్యము గాని యితరసంస్కృతుల రూపుమాపి తనసంస్కృతి నెలకొల్పఁ బ్రయత్నించుట పిచ్చితనము. ఆపిచ్చియే యిప్పుడు, ఇటలీదేశమునకుఁ బట్టినది. ఆత్మాభిమాన మున్నవాఁ డెవ్వఁడును నాపిచ్చితనమును సాగనీయఁడు. సీమను విశాలముఁ గావించుటయందు భాషాభిమానము లేదు. మేరల నతిక్రమించుటయందు భాషాభిమానము లేదు. ఇతరభాషల రూపుమాపుటయందు భాషాభిమానము లేదు. ఆంధ్రకర్ణాటకు లీపిచ్చితనమునకు లోఁబడక పూర్వకాలమువలెఁ బరస్పరమైత్రిని మెలంగి యుభయభాషాభివృద్ధికి, నుభయప్రాంతాభ్యుదయమునకుఁ దోడ్పడుదురుగాక! ఆంధ్రసాహిత్యపరిషత్తును, గర్ణాటకసాహిత్యపరిషత్తును నేకీభవించి కృషిఁజేసిన నాంధ్రకర్ణాటకులందుండు పరస్పరవైమనస్యమంతరించి సౌహార్ద మేర్పడు నని నాదృఢవిశ్వాసము. నాయీదీనసందేశమును నే నిదివఱకు నాకన్నడసోదరుల కిచ్చియుంటిని. ఇప్పుడు నాయాంధ్రసహోదరులకు మనవిఁజేయునవకాశము గల్పించినందులకు నే నీపరిషత్తువారికి నాకృతజ్ఞతాపూర్వకవందనము లర్పించుచున్నాను.

# గ్రంథస్వీకారము.

జగత్కథ:—అనువాదకులు శ్రీయుత కొమాండూరి శఠకోపాచార్యులుగారు. ఎం. ఏ. బి. యల్.

---

ఆంగ్లవాఙ్మయరంగమున హెచ్. జి. వెల్సుగారు సుప్రసిద్ధులు. వీరు ప్రపంచచరితమును 'Outline of History' అనుపేర విపులముగ రచించిరి. అందలిముఖ్యవిషయములఁ గైకొని పాఠకుల సౌకర్యముకొఱకు సంగ్రహముగ వారు రచించిన Short History of the World అను చారిత్రకగ్రంథమున కిది యాంధ్రానువాదము.

ఈగ్రంథమున నేదేశపుఁజరిత్రమును సమగ్రముగ నీయఁబడి యుండలేదు. వెల్సుగారి కట్టియుద్దేశమును లేదు. ముఖ్యవిషయములు మాత్రము సూచింపఁబడినవి- ఒకశతాబ్దమునుండియుఁ జరిత్రరచనమున నూతనదృక్పథము వచ్చినది. ఆయారాజులు, వారిరాజ్యములు, వారొనర్చిన యుద్ధాదికములను వరుసగ వర్ణించుట మాని, మానవజీవిత మొకటిగ నెంచి, యందలి వివిధపరిణామముల గ్రహించి ప్రపంచచరితమును సమన్వయ మొనరించుచుఁ జారిత్రకవేత్తలు తమ గ్రంథములను రచించుచున్నారు. భిన్నదేశముల నుండుచుఁ గాలవ్యత్యాసముచే వేఱుగఁ గన్పడుచున్నను మానవు లందఱును మతసాంఘికరాజకీయవిషయముల నెట్టిపరిణామమును బొందిరో మనము దెలిసికొనవలసియున్నది. మానవులయం దుదారభావములు, సౌహార్దము, పరస్పరాభివృద్ధి మున్నగునవి వృద్ధిఁబొంది సంకుచితభావములు నశించుటకై యెల్లవారును బాటుపడవలసియున్నది. అట్టి సదుద్దేశములతో వెల్సుగా రీగ్రంథమును రచించి మానవసంఘమున కొసంగియున్నారు. వెల్సుగారివంటి మహనీయులు వివిధదేశకాలముల నుచ్చైఃస్వరముతో మానవసంఘైక్యతను ఘోషించుచున్నను, బ్రాపంచికపరిస్థితులు భిన్నమార్గముల నడచుచున్నవి- రెండుమూఁడుశతాబ్దములనుండి పాశ్చాత్యదేశముల జరుగుచున్న రాజకీయవిప్లవములను గాంచినచో నిది స్పష్టపడఁగలదు. తనకుమాలిన ధర్మము లేదని పాశ్చాత్యులు పరస్పరాభిసంఘర్షణకై సంసిద్ధు లగుచున్నారు. వీరిచర్యలను గ్రంథాంతమున నుండు నధ్యాయములలో వెల్సుగారు నిష్పాక్షికబుద్ధితోఁ దీవ్రముగ విమర్శించియున్నారు. 'సర్వభూతేషు చాత్మానం యః పశ్యతి స పం

డితః' అనులోకోక్తి కేవలము గ్రంథములకొఱ కుద్దేశింపఁబడినటులు మానవుల విపరీతచర్యలవలన మనము గ్రహింపవలసి యున్నదేమో-

వెల్సుగారిగ్రంథమునఁ బ్రాచీనార్యుల విజ్ఞానవికాసమునకును నాగరకతకును దగిన స్థాన మొసఁగియుండలేదు. పాశ్చాత్యదేశములు తమోవృతములై యున్నకాలమున, వీ రన్నిశాస్త్రములందును గృషి సలిపి గొప్పవాఙ్మయమును సృష్టించియున్నారు. మాక్సుముల్లరు, జోన్సు, విలియమ్సు మున్నగువారి భాషాశాస్త్ర, సారస్వతపరిశోధనలవలనఁ బాశ్చాత్యులందలి విశేషముల గ్రహించుట కవకాశము లభించినది. ఆధ్యాత్మికవిషయములందు మాత్రము వీరు విశేషపరిశ్రమ మొనరించుటచే, భౌతికరసాయనశాస్త్రములు మున్నగునవి సమగ్రముగ రచించియుండలేదు. తత్త్వశాస్త్రమున వీ రత్యున్నతస్థానమును వహించి రని ప్రాచ్య పాశ్చాత్యు లంద ఱంగీకరించియున్నారు. ప్రాచీనార్యులవిజ్ఞానవికాసములు, హిందూదేశచారిత్రికవిషయములు సంగ్రహముగ ననువాదకులచే నానాస్థలములఁ జేర్పఁబడినవి. అందు శ్రుతిస్మృతిపురాణేతిహాసములనుండి యమూల్యము లగువిషయములు పెక్కులు వివరింపఁబడినవి. నేఁటి చారిత్రికపరిశోధనల ననుసరించి భారతదేశచరిత్రము వర్ణింపఁబడినది. ఇవి యన్నియు ననువాదకుల విమర్శకదృష్టిని, బరిశ్రమను వ్యక్తీకరించుచున్నవి. సింధునదీప్రాంతమున మొహంజోదారో, హరప్ప మున్నగుస్థలముల జరిగినపరిశోధనలవలనఁ బాశ్చాత్యులు, బాబిలోనియనులు, సుమేరియనుల నాగరకతకుఁబూర్వమే ప్రాచీనహైందవులు నాగరకులై యుండి రని యిపుడు గ్రహించుచున్నారు.

వెల్సుగారిగ్రంథము ప్రాచీన, మధ్య, ఆధునికయుగము లని మూఁడుభాగములుగ విభజింపనగును. అందు, క్రీ. పూ. 1000 సంవత్సరములకు వెనుకటి చరిత్రము ప్రాచీనయుగచరిత మన నొప్పును. దీనికిఁ జరిత్రములు గాని మఱి యేవిధమగు లిఖితాధారములు గాని లేవు. భూతత్త్వ శాస్త్రము (Geology) ఖగోళశాస్త్రము, (Astronomy) మానవతత్త్వశాస్త్రము (Anthropology) మున్నగువానియం దాధునికపరిశోధనలపై నీభాగ మాధారపడి యున్నది. జీవపరిణామసిద్ధాంతముల (Evolution theories) కును బ్రాచీనార్యుల యాశయములకును సమన్వయ మొనర్చుటకై యనువాదకులు తమ టిప్పణులఁ జేర్చియున్నారు. అందు మూలగ్రంథమున లేని విషయములుకూడఁ జాలఁ గలవు. దశావతారములకు సరిపోవునటులు వీరు యుగములకు మత్స్యయుగము, కూర్మ

యుగము మున్నగు నభిధానముల నొసఁగియున్నారు. వైజ్ఞానికవిషయములపై నాధారపడిన గ్రంథ మగుటచేఁ బెక్కు పారిభాషికపదముల వీరు వాడవలసివచ్చి నది. కొన్నియాంగ్లపదముల నటులనే వ్రాసియున్నారు. కాని గ్రంథముననే పారి భాషికపదముల నొసఁగినచోఁ బాఠకులకు సౌకర్యముగ నుండియుండును. అవి యన్నియు ననుబంధమునఁ జూపఁబడినవి- శైలివిషయమై వీరు తమయాశయ మును పీఠిక 34-38 పుటలలో వ్యక్తపఱచి యున్నారు. చారిత్రిక గ్రంథ మగు టచే నట్టిపద్ధతుల నీ రవలంబింపవలసివచ్చినది. నీ రిశ్శైలి సరళమై మూలమునందలి భావముల స్పష్టముగ వివరించుచున్నది. టిప్పణులు వీరిసర్వతోముఖపరిశ్రమ మును విశదీకరించుచున్నవి. అనుబంధముల నీ రొసఁగినవిషయములు ప్రస్తుతభార తదేశము దుస్థితిని దెలియఁజేయుచున్నయవి. బుద్ధునియొక్కయు, క్రీస్తుయొక్కయు సందేశములు ప్రాచీనార్యులగ్రంథములందుఁ గల వని వీరు సవిమర్శకముగ నుదా హరణాదికములతోఁ గన్పఱిచియున్నారు. ఈగ్రంథము, ప్రపంచచరిత్రమున వివిధ దృశ్యముల (Kaleidoscopic Views) ను జూపుచున్నది. ప్రతియాంధ్రుఁ డును జదువఁదగినది. దేశచరిత్రములు వేల్వేఱుగఁ గలవు గాని యిట్టిగ్రంథము లుండు టరుదు. అందును సుప్రసిద్ధచరిత్రకారుఁ డగు వెల్సుగారి గ్రంథము నను వదించి మనకొసఁగినందులకు మన మనువాదకులకుఁ గృతజ్ఞులము. మూలగ్రం థమును వెల్సుగారు 'ఇతిహాసము' (History) అని నామకరణ మొనర్చియు న్నారు. దాని కనువాదకులు కథ యని వాడుట వివిధభాగములు కథారూప ముగ నుండుటచే నని తోఁచుచున్నది.

వెల మూఁడురూపాయలు. కాకినాడలో గ్రంథకర్తయొద్ద దొరకును.

---

2. ఖేటకదర్పణము :—గ్రంథకర్త: బ్రహ్మశ్రీ జమ్మలమడక సూర్యనారా యణశాస్త్రిగారు, ప్రకాశకులు జ. అనంతంబ్రదర్సు, కాకినాడ. వెల రు. 2-0-0.

జ్యోతిషశాస్త్రగ్రంథములు బహుబుషిప్రణీతములును, భేదాభిప్రాయసమ న్వితములు నౌటచేత, శాస్త్రజ్ఞాన మలవరించుకొనుట దుష్కర మైనవిషయము. శాస్త్ర మొకత్రోవను, అనుభవ మొకవంకను నున్నది.

శాస్త్రానుభవము సుబోధక మొనర్చుకొనుట కాంధ్రములో నిదివఱకు రెండుమూఁడు గ్రంథములు ప్రకటితము లయ్యెను. ఇవటూరివారి "అనుభవ జాతకతరంగిణి" (ప్రథమభాగము) లో శ్రీరాముఁడు, శంకరాచార్యులు, అప్ప

యదీక్షితులు మొదలగువారి జాతకములు జ్యోతిషశాస్త్రసూత్రములకు దృష్టాంతములుగ నొసఁగబడెను. శ్రీసూర్యనారాయణశాస్త్రులవారి ఖేటకదర్శనము నీవిషయమున నొక యమూల్యమైన గ్రంథము. వీరు 372 జాతకముల వేర్వేఱు లగ్నముల క్రింద విభజించి, జాతకుల యోగములను జర్చించిరి. వీరిచర్చలో భాగ్యరాజ్యస్థానముల బలాబలములను జర్చించి, వారివారిభాగ్యములను బదవులను జెప్పిరి. పుత్త్ర, కళత్ర, విషయములనుగూర్చిన చర్చయు, నాయుర్దాయమును గూర్చిన ప్రశంసయు, నింకు లేవు. వీరిచ్చిన జాతకములలో సుప్రసిద్ధ పురాణపురుషుల యొక్కయు, మహారాజులయొక్కయు, నుద్యోగీయులయొక్కయు జాతకములుగలవు. నెం 43 రు జాతకము బాలగంగాధరతిలకుగారిదై యుండును. అది స్పష్టముగఁ జెప్పలేదు. నెం 95 రు ఔరంగజేబు జాతకము. నెం 125 రు శ్రీకృష్ణుని జాతకము. నెం 156 రు ధర్మరాజు జాతకము. నెం 167 రు హైకోర్టుజడ్జియై, ప్రధానన్యాయమూర్తిపదవి నలంకరించిన శ్రీరామేశముగారిదై యుండనోపు. అట్టివారి నామములను బేర్కొని యుండినచో సమంజసముగా నుండెడిది.

ఈగ్రంథము జ్యోతిషఫలానుభవమునకు మిక్కిలి సహకారి. గ్రంథకర్త యోగానుభవచర్చకు సంబంధించిన జాతకములె గాక, తదితరభావము లగు పుత్త్ర, కళత్ర, మాతృ, పితృ, భావములకు శాస్త్రానుభవసిద్ధికై, మఱికొన్ని జాతకముల సమకూర్చి, వేఱొకగ్రంథమును వ్రాసినయెడల శాస్త్రాభిమానులకు, శాస్త్రవిద్యాభ్యాసకులకుఁ బరమోపకారము గావించినవా రగుదురు.

---

3. కాశీయాత్ర:— కొల్లాపురము స్నేహలతా కవితాసంఘము 41 పుష్పము. తత్సంఘాధ్యక్షులు వాజపేయయాజుల రామసుబ్బారాయఁడు బి. ఏ. గారు గ్రంథకర్తలు. విషయము- ఇదివఱకు రెండుతడవలు కాశియాత్ర చేసి వచ్చుటచేతను, ననేకక్షేత్రములు సేవించుటచేత ననేక దివ్యనదులలోఁ గ్రుంకు లిడుటచేతఁ, బరమానందమునొందుచు సర్వక్షేత్రములందును గాశీక్షేత్రము శ్రేష్ఠమైనదనియు నందే సకుటుంబముగ నివసించి గంగాస్నాన విశ్వేశ్వరదర్శనాదులం గావించి యన్నపూర్ణామహాదేవి యింత ప్రసాద మిడుచుండ నందు దేహయాత్ర గావించి ముక్తినంద మనసు వొడమి యర్ధాంగితోఁ జేసిన కాశీప్రశంసయే. 122 పద్యములు. కథనుబట్టి చూడఁగా సోదరకవులు గ్రంథకర్త లనరాదని తోఁచుచున్నది. ఈ పుస్తకమునకు శ్రీ శేషాద్రిరమణకవులు తొలిపలుకు వ్రాసి గ్రంథమునందలి విష

యము దేటపఱచిరి. శ్రీజటప్రోలు సంస్థానమున పెర్సనల్ సెక్రటరీగా రగు దేవ బ్రాహ్మణ భక్తివిశ్వాసపూరితులు మహారాజశ్రీ కోట్ల వేంకటసుబ్బయ్యగారు స్వంతధనముతో నీయేకాశ్వాసగ్రంథము నచ్చువేయించిరి. మచ్చునకు సతీసమాధాన ములోని పద్యములు.

గీ. మీరు బోధించినట్టి సంసారసరణి, తెలిసికొంటిని మదిలోన నీవ దేవ్య
యడఁగె నిప్పటి కజ్ఞాన మంత నాకుఁ, గలసి వచ్చెద మీతోడఁ గాంక్షదీఱ.

గీ. మీకు లేనట్టివాంఛలు నాకవేల, ధనముధనమంచునిఁకముందుఁదలఁపనెపుడు
భర్తతోడిదలోకంబు భామకెపుడు, గాన మీరేగు సరణినే కదలివత్తు.

గీ. జ్ఞాన మీరఁజాలు కాశికానగరమందుఁ, బాప మడఁగింతుఁబతిపదాబ్జములఁబట్టి.
ఆసతియుఁ గవయిత్రి కావున నీపద్యము లాసె చెప్పినవియే.

---

4. ఆంధ్రసేతుబంధకావ్యము:—శ్రీమాన్ మేడేపల్లి వేంకట రమణాచార్యులుగారు రచియించినది. పరిషత్పత్రికాపాఠకులకుఁ బ్రవరసేనుఁడు, నాతని సేతుబంధకావ్యముం గూర్చి చెప్ప నక్కఱ లేదు. ఆచార్యులవారు- పండితులు గావునఁ బ్రవరసేనుని ప్రాకృతకావ్యమునుబట్టి తెనిఁగించి యాదలి నాలుగాశ్వాసములను మాత్ర మిపుడు ప్రకటించిరి. దీనికి శ్రీవిజయనగరము మహారాజ కళాశాలలో నాంగ్లోపన్యాసకులు, ఆచార్య శ్రీబుఱ్ఱా శేషగిరిరావు ఎం. ఏ. గారు మొదటి మాట లాంగ్లమున విరచించిరి. దీని వెల 0-8-0. మచ్చుపద్యములు పరిషత్పత్రికాపాఠకులు రుచిచూచియే యున్నారు. తక్కినభాగములను బ్రకటించి భాషోపకార మొనర్ప భాషాభిమాను లాచార్యులవారి కన్నివిధములఁ దోడ్పడుదురుగాక.

---

5. అభినవసుమతిశతకము:—నెల్లూరురాజకళాశాల యాంధ్రోపన్యాసకులు బ్ర. మర్చా సుబ్రహ్మణ్యశర్మగారు రచియించినది. వెల రు. 0-2-0.

వెనుకటి సుమతిశతకమువంటిదె యిది యభినవముగా బైలువెడలినది. ఆ సుమతిశతకములోని నీతులవలెనే యిందును నభినవము లగు నీతులు గలవు. ఆ సుమతిశతకముం జదివి దీనిం జదివినబాలురు సకలనీతిసమ్మతముగా నడచుకొనఁ గలరు. శర్మగారి కవితయు వెనుకటి సుమతిశతకములోని కవిత్వముతోఁ దుల దూఁగుచున్నది. కొంచెము ములు చూపుచున్న దనవచ్చును. పాఠశాలలలో నవశ్యపఠనీయముగా నుండఁదగినది. అనేకపాఠశాలలలో దీనిం బెట్టియున్నారు. ఇతరులును బెట్టి బాలురఁ నీతిమంతులఁ జేయుదురుగాక. మచ్చు—

క. అపకారపరుల కైనను, ఉపకారము చేయుచుండు రుత్తము లలగం
ధపుఁ జెట్టు తన్ను నఱికెడు, కృపాణికకుఁ దావి గూర్చురీతిని సుమతీ. 43

క. కరిపెద్ద, దానికంటెన్, గిరిపెద్ద, పయోధి దానికింబెద్ద చదల్
మఱిపెద్ద, దానికంటెను, అరయఁగ నన్నిటికిఁ బెద్ద యాశయె సుమతీ. 68

క. కలవాఁడు త్యాగశీలత, కలవాఁడు, గుణంబు నెఱుఁగఁ గలవాఁడు దయో
జ్జ్వలుఁ డొక్కఁడైన నుండుట, ఫలవృక్షం బూరినడుమఁ బండుట సుమతీ. 72

---

సుభద్రాపరిణయము:—కూచిమంచి తిమ్మకవి తమ్ముఁడు జగ్గకవి రచియించినది. విజయవిలాసము వంటిదే. కథ సుభద్రార్జునుల వివాహము. కాని చేమకూరపాకమును మిన్నగఁ జవిచూచియున్న వారికిది వెక్కసముగా నుండును గాని దాని నెఱుఁగనివారికి కూచిమంచిపాకము మంచిపాకమై యాస్వాద్యమగును. ఈజగ్గకవి లోకవిదితకీర్తి-అందఱుకవులదియు నొక్కబాటయే. విజయవిలాసములోవలె నిందును జిలుకగలదు. ఇక్కవిక్రొత్తబాటలోఁగూడఁజంద్రరేఖావిలాపమును రచించెను. చరిత్రాత్మకమగు సోమదేవరాజీయమును గూర్చెను. ఈగ్రంథము చాలకాలము క్రిందట నచ్చుపడినది కాని దానిప్రతులు లభించుటలేదు. బ్ర॥ కొల్లూరి సుబ్రహ్మణ్యముగారు దీనిం బునర్ముద్రితము చేయించి లోకోపకృతిం బొనరించిరి. ఈకవిగారి జానకీపరిణయము వీరు త్వరలో వెలువరింపనున్నారు. మచ్చునకై రెండుపద్యములీగ్రంథమునుండి యుదాహరించుచున్నారము.

సీ. ఇంద్రనీలపుడాలునేలు చామనచాయ మేనువాఁ డలఁతి లేఁగౌనువాఁడు
కొదమతుమ్మెదదిమ్ము నదలించు సోగపెన్నెరులవాఁ డొరపుముత్తెములవాఁడు
మలయుపున్నమచందమామనెగ్గులువల్చు మొగమువాఁడరిదిసోయగమువాఁడు
తమ్మిఱేకులగెల్వఁ దమకించునేత్రయుగమ్ము వాఁడు వెడందఱొమ్మువాఁడు
డంబుగలవాఁడు బవిరిగడ్డంబువాఁడు, కంబునీకాశరుచిరగళంబువాఁడు
నాకు మేనత్తకొమరుండు నాకవిభుకు, మారుఁ డర్జునుఁ డభినవమారుఁ డతఁడు.

మ. అతులానందమునన్ సమస్తకకుబంతానంతపుణ్యప్రదా
యతదేవాయతనంబులున్ గిరు లరణ్యంబుల్ నదుల్ తీర్థముల్
వ్రతనిష్ఠన్ భజియించుకొంచు నుచితవ్యాపార మేపారఁగా,
నతఁడే మేమయి యున్నవారము సుమీ యంభోజపత్రేక్షణా.

విజయవిలాసమును జూచివ్రాసినవాఁడు దానికంటెఁ జిత్రముగా నుండునట్లు కవిచూడవలసినది.

ఈ గ్రంథము తూర్పుగోదావరిజిల్లా, కొంకుదురులో ప్రకాశకులగు కొల్లూరి సుబ్రహ్మణ్యముగారియొద్ద దొరకును. వెల రు. 0—12—0.

---

6. కృషీవలవిలాసము:—కర్త. మ॥రా॥శ్రీ॥ చాట్రాతి చినవేంకటప్పయ్య గారు, ఏలూరు. వెల రు. 1—0—0.

ఇందు 568 వివిధపద్యములు గలవు. ఇది యొక్క కథగాదు. విద్యాభ్యాస కాలమున నొజ్జలు నియమించినట్లు కవిత్వమునేర్చుకొనుటకై రచియించిన వివిధ విషయము లగు పద్యములు-అయినను- కవివంశావళి, నృసింహస్తవము, సూర్య వర్ణనము, చంద్రవర్ణనము, కాలవర్ణనము, వృష్టికార్యము, ఛాయావివరణము, రాట్నపువర్ణనము, తంతువాయపద్ధతి, శీతబాధ, పుష్కరమహిమ- ఇత్యాదిగా ననేకవిషయములు గలవు. నాలుగధ్యాయములు - కవిత్వము క్రమక్రమముగా గొంతగ్రంథము నడచునప్పటికి వృద్ధిబొందినది. కవితాప్రారంభదశ, మధ్యభాగదశ, ముగింపుదశ, యిందుఁ దెలియవచ్చును. మచ్చుపద్యములు-

చ. జలముల మీఁది ప్రేమమునఁ జందనపాకవిలేపగాత్రముల్
　జలధరఘోషహూపగుణసామ్యము వెన్కను నంటదున్నలా
　జలజసుమిత్రపుత్రకుని శ్యామలవాహనమౌ మదంబుచే
　జలగజమత్సరంబులను జచ్చినపాములఁ జేసె మాటికిన్.　　౧-౬3 పద్యము.

శా. నారాయాఖ్యుఁడు చెన్నపట్టణరమాన్యాయైకవిద్వాంస శ
　స్త్రారూఢోత్తమ శక్తిసంయుతుఁడు సత్త్వాన్వేషణారంభవా
　గ్ధీరోదారుఁడు జిష్ణుపద్మగళ సందీపప్రకాశోజ్జ్వలా
　కారాంతర్గణి కృష్ణసామయరు సఖ్యంబప్డు తోడ్తేరఁదాన్.　　3 అ. ౫౧.

చ. తను వనుగోష్ఠి లేకెపుడు తామరతంపరలైన దీప్తులన్
　మనుపుచునుండుఁ దీక్ష్ణమగు మాయ తదీయ శరీరధామమై
　కనఁబడిన స్వలోలతను గారణదేహిని బాచివేయునే
　మని యిఁకఁ జెప్పవచ్చుఁ దనయాజ్ఞకుఁ లోఁబడువారికేగతుల్.　　౪ అ. ౮౬

ఇదియొక కథ కాకపోయినను సర్వప్రపంచభాగ్యములును కృషీవలకార్య మునం దిమిడి యున్న ట్లాయావిషయములను వర్ణించిరి.

---

# కాకినాడ హోమియోపతి పత్రిక.

---

హోమియోపతీ మఱియు బయోకెమిక్ చికిత్సలను గూర్చియు, ఆరోగ్యాదివిషయములను గూర్చియు అనుభవశాలు రగు వైద్యులచే వ్రాయఁబడిన వ్యాసములు, క్లినికల్ కేసు రిపోర్టులు, మొదలగువానితో తెలుఁగునను ఇంగ్లీషునను వెలువడునట్టి ఆంధ్రహోమియోపతీ మాసపత్రిక. ఇది ప్రతిగృహస్థునకును వైద్యునకునుగూడ నెక్కువ యుపయుక్తముగా నుండును.

సంవత్సరము చందా రు 1-4-0 మాత్రమే. విడిపత్రిక రు 0-2-0. ప్రకటనరేట్లు అతిసరసము.

వలయువారు:—

డాక్టరు: వై. గణపతిరావు,

సంపాదకుఁడు.

కాకినాడ హోమియోపతిపత్రిక, కాకినాడ.

అని వ్రాయవలెను.

---

# కర్ణాటక సాహిత్యసమ్మేళనము.

---

ఇరువది యొకటవ సాహిత్యసమ్మేళనము. బొంబాయిపట్టనములో రాఁబోవు డిసెంబరు ది26-27-28 తేదీలలో-(పుష్యశుద్ధ పాడ్యమి గురువారము మొదలు)మూఁడు దివసములు జరుగును. బొంబాయి సర్కారు విద్యాశాఖసచివులగు ఘనతవహించిన దివాన్ బహద్దరు ఎస్. టి. కంబళి. బి. ఏ. ఎల్ ఎల్. బి. గారు స్వాగత సభాధ్యక్షులుగా నుందురు. అను మొదలగు విషయ మిటీవలఁ గర్ణాటకసాహిత్య పరిషత్తు గౌరవకార్యదర్శిగారు వ్రాసిరి.

---

యుద్వేగస్థితినుండి ధైర్యమతితో నుర్వీశుఁ డచ్చో మను
ష్యద్వంద్వద్విశిరఃకబంధములుఁ బద్యంబు న్వ్రాయించుచున్. ౩౨

క. తద్యోగవ్యంజక మగు, పద్యార్థం బెఱిఁగి దాని భావంబుకతన్
సద్యోనిర్ణయముగ నృపుఁ, డుద్యోగముచేసె సాహసోద్యోగితుఁడై. ౩౩

గీ. భూపశేఖరుఁడు "పరోపకారార్థ మిదం శరీరం" మనుమాట దలఁపుకొలఁది
మృత్యుజిహ్వవోలె మెఱుఁగులీనెడుకత్తి, కికేఁడి యొడిసి కుత్తుక కోయఁబూనె.

క. ఆలోన నతని సాహస, మాలోకించుచుఁ బ్రసన్నుఁడై పార్థివ నీ
పాలం గల్గితి నని భూ, పాలునిఖడ్గంబు క్షేత్రపాలుఁడు పట్టెన్. ౩౫

ఉ. అప్పుడు మొండెముల్ దలలు నంటుకొనంగ నథూవరుల్ ప్రియం
బొప్పఁగ లేచి మ్రొక్కిన సముత్సుకమానసుఁ డౌచు భైరవుం
డిప్పటిసాహసంబునకు నే నిదె మెచ్చితి నిష్ట మేర్పడం
జెప్పుము నీకు నిత్తు నిటఁ జేకుఱ నన్న నతండు మ్రొక్కుచున్. ౩౬

గీ. దేవదేవ వీరికీవిధంబున శిర,శ్ఛేద[1]కృత్య మేల సిద్ధమయ్యె
నాన తిమ్ము నాకు నని విన్నవించిన, భైరవేశ్వరుండు పలికె నిట్లు. ౩౭

క. రత్నోద్భవుఁ డనఁగా నొక, రత్నవ్యవహారిసుతుఁడు రత్నంబుల కై
రత్ననిధిలోనఁ దిరుగుచు, యత్నంబున నిచట విడిసె నాప్తులుఁ దానున్.

క. తద్వేళ మఱియు నొకఁడు స,రిద్వల్లభసలిల ముత్తరింపఁగ నొకచో
నుద్వాహమునకు నేగుచు, నీద్వీపముఁ జేరె నిజసుహృద్వర్గముతోన్.

వ. ఇక్కడ నయ్యిద్దఱు నిట్లొండొరువుల మహిమలు మెఱయింపుచుఁ గలసి
మాటలాడునెడ రత్నోద్భవుండు నీనామం బెద్ది యేదేశంబునుండి యెచటి
కేఁగుచున్నాఁడ వనిన నతండు నేఁ జంద్రకేతుం డనువాఁడ మగధదేశంబు
నుండి రత్నద్వీపంబున కేఁగుచున్నవాఁడ నం దొక విశేషంబు గలదు. ౪౦

క. పద్మాకృతి రేఖలు కర,పద్మంబుల నొప్పుచుండఁ బద్మకు నెనయై
పద్మావతి యనుకన్యక, పద్మానన గలదు జాతి పద్మిని యనఁగన్. ౪౧

క. ప్రస్తుతలావణ్యగుణాని, రస్తప్రసవాస్త్రమోహనాకారిణి సం
త్రస్తకురంగేక్షణ తా, లస్తని యది మదనరాజ్యలక్ష్మియుఁ బోలెన్. ౪౨

చ. కలువలుఁ జక్రవాకములుఁ గంజములు న్బిసకాండము ల్మనం
బలరఁగ దీని లోచనకుచాననబాహుసమానలక్ష్మి గా

---

1. దేవ వీరికిట్టి తెఱఁగున నీశిరశ్ఛేద.

వలయు నటించుఁ గోరి యుదవాసమునందుఁ దపంబు సేయుచు
న్నిలుచుటఁగాక యెప్పుడును నీటఁ జలిం బడనేల వానికిన్. ౪౩

గీ. ఇట్టికన్య నాకు నిచ్చెద రమ్మని, దానితండ్రి తొల్లి తగినవారిఁ
బనిచినాఁడు గానఁ జనియెద ననుడు ర,త్నోద్భవుండుఁ దాను నుత్సహించి.

క. ఆతరుణి యెవ్వారికి నౌ, నాతని బ్రదు కొప్పు నదుచు ననురక్తి మనో
జాతునిచేతలఁ బడల న,తీతము మును విన్నభంగి దిట్టతనమునన్. ౪౫

క. ఆకన్నియఁ దజ్జనకుఁడు, నా కిచ్చెద నంచు మొప్ప నయముం బ్రియముం
గైకొనఁగఁ జెప్పి పుచ్చిన, నాకడ కే నేఁగుచంద మది యెఱుఁగవొకో.

వ. అనుడు మత్సరసముత్సేకంబున. ౪౭

క. అతనిపలుకులకు నాతం, డతికుపితుండైన వాఁడు నధికక్రోధా
న్వితుఁ డయ్యెను "మూలంబై, రతకోః స్త్రీ" యనినమాట ప్రకటంబయ్యెన్.

శా. అన్యోన్యం బిటు దూలుచు న్మనమునం ద దేఁగుచో[1] నెవ్వనిం
గన్యారత్నము గోర దాతఁడు కులోత్తర్షంబు వాణిజ్యమున్
సన్న్యాసంబును జేత పంత మని మాత్సర్యంబుతో నాత్మసా
జన్యం బెల్లఁ దొఱంగి[2] లేచి చనుచో సంకల్పసంసిద్ధికై. ౪౯

క. సద్భావము గైకొని ర,త్నోద్భవుఁ డిఁక దైవబలమ యుచితం బని తా
నద్భుతముగ మ్రొక్కుచు నిట, మద్భవనముఁ జొచ్చె మురభిమానముపేర్మిన్.

క. గుడిసొచ్చి నాకు సాఁగిలఁ,బడి మ్రొక్కుచుఁ బలికె నెన్నిభంగులనైనం
బడఁతుక యిది నా కబ్బిన, మిడిదల యొప్పించి నిన్ను మెప్పింతుఁజుమీ.౫౧

చ. అని యొడఁబాటు చేసి వినయంబున మ్రొక్కుచు నేఁగి చంద్రకే
తునిపని కేతు వుట్టఁ దనవొడ్డతనంబు నటించి రత్నకాం
చనమయ మైన దీవి రభసంబునఁ జేరి కడంకఁ గన్యకా
జనకుని గాంచి చెప్పె నిజసంవరణోద్యమ మప్పు డేర్పడన్. ౫౨

సీ. ఆతఁడు నాచంద్రకేతుండు చనుదెంచి తనరాక చెప్పినఁ దద్దురుండు
నిద్దఱ కర్చన లిచ్చినఁ దాంబూలగంధపుష్పాక్షతల్ గైకొనంగఁ
దొడవులకెల్లను దొడవైన కన్నియఁ దొడమీఁద నిడుకొన్న యెడ నొకండు
తెల్లసంపెంగలు దివ్యంబు లివి యని సమముగా నిచ్చినఁ జంద్రకేతుఁ
డిదియ మేలనితనతలఁగదియఁదుఱిమెఁ,దొలుతదేవయోగ్యములనఁదోడియాతఁ
డిష్టదేవత కర్పించి యెలమిఁ బిదప, వీని ముడిచెద నని యొడిలోన దాఁచె.౫౩

1. న్మనమె నేఁడందేఁగుచో 2. దొలంచి

చ. ఇరువురచేష్టలం గని మృగేక్షణ యల్లన లేచి హాసముం
దరగతి లోనికిం జనినఁ దంత్రియు నిద్దఱపేళ్లు జాడలుం
జరితములుం దగం దెలిసి సామ్యము గల్గిన వీరిలోన నె
వ్వరి నవుఁ గా దనం జను వివాదము బాలికచేతఁ దీఱెఁగన్. ౫౪

క. ఆతరుణి మెచ్చి కైకొను, నాతఁడె మాయల్లుఁ డగును నచటికిఁ జని క
న్యాతిలకముఁ జంకిట నిడి, వాతెఱ ముద్దిడుచు బుజ్జనంబునఁ బలికెన్. ౫౫

గీ. ఒడిఁ బ్రసూనముల్ దాఁచె రత్నోద్భవుండు
తుఱిమికొని యుండెఁ జంద్రకేతుండు దొల్త
నీకొలఁది యిద్దఱందును నీకుఁ జూడ
నొప్పుగా రసికుఁ డెవఁడొ చెప్పు మనిన. ౫౬

క. పువ్వులు గొను మని యిచ్చిన
యవ్వేళన తుఱుముకొన్నయతఁ డెవ్వఁడొ వాఁ
డివ్వసుమతి నస్థిరుఁ డగు
నవ్వంబడు నొరులచేత నాకుం జూడన్. ౫౭

వ. అనినఁ దంత్రి విని యితండె జాణ యని నాకు నీతివాక్యంబు దోఁచుచున్న
యది యది యెట్లనిన. ౫౮

క. వనితాభోగము లంచము, ధనము సుభాషితము విరులుఁ దాంబూలముఁ బం
డినపండ్లును సిద్ధాన్నం, బును దడయక కొన్నవాఁడె భువి జాణ యగున్.

వ. అనినం బద్మావతి యానీతివాక్యంబు దప్ప దిప్పటి కుసుమంబులు దివ్యంబు
లని యిచ్చుటం జేసి తోడియాతండు దేవతార్పణంబు చేసి మఱి ముడిచికొ
నం దలంచె నెయ్యా పాలలో నొలుకు టయ్యె దేవతాపరాయణుం డగుట సక
లమంగళహేతువు మానుషబలంబుకంటె దైవబలంబు ప్రబలంబు మఱి యిం
తియకాదు. ౬౦

క. ఆకుసుమంబులు దేవత,కై కోరికి డాఁచికొనినయది చూడంగా
నీకడకు వచ్చునెడ నను,గై కొనుటకు మ్రొక్కు టొకటి గలుగఁగఁ బోలున్.

మ. అనినం గూఁతు నలంకరించి మఱి నెయ్యం బెచ్చటం బుట్టె నా
తనిపై వైవుము వాఁడె భర్త యని నూత్నంబైన పుష్పస్రజం
బెనయం జేతికి నిచ్చి బంధులు నిజాభీష్టార్థముల్[1] వచ్చు క్రం
దున వాద్యంబులు మ్రోయఁగా నెలమితోఁ దోడ్కొంచు నేతెంచినన్. ౬౧

1. భీష్టౌఘముల్.

క. రత్నద్వీపంబునఁ గల, రత్నంబులలోనిదివ్యరత్నము[1] కన్యా
రత్నము దా వనమాలిక, రత్నోద్భవుమీఁద వైచె రాగం బడరన్. ౬౩

వ. అవ్వేళం బద్మినీరాగకారణంబగు గగనరత్నంబుపగిదిం బద్మావతీకృతానురాగుం డగురత్నోద్భవు శుభోదయంబునం జంద్రకేతుండు ప్రభాతచంద్రుక్రియం బ్రభాహీనుండై లోనం గుందుచు జలధిఁబడం దలంచిన నది తెలిసి యాసెట్టి తనతమ్ముని కూఁతుఁ గుముద్వతి నిచ్చెదనని యతనిరాకసఫలంబుగా ననునయించి తెచ్చి.

ఉ. సంపద సొంపుమీఱఁగఁ బ్రసన్నమనస్కుఁడు సెట్టి వేడ్కతోఁ
బెంపడరంగ నల్లునకుఁ బెండిలిచేసి తదీయసత్క్రియా
లంపటుఁడై సువర్ణదశలక్షధనం బరణంబు నిచ్చి యా
దంపతు లుల్లసిల్లఁగఁ బదంపడి వారల నంపె నింపునన్. ౬౪

క. రత్నోద్భవుండు నిట కతి, యత్నంబున వచ్చి వంచితాప్తజనుండై
నూత్నవివాహశ్రీ యగు, పత్నిం జేపట్టి నాకుభవనము సొచ్చెన్. ౬౫

వ. చొచ్చి ప్రణమిల్లి. ౬౬

శా. దేవా మ్రొక్కెద వచ్చె నంచు శితశస్త్రం గంఠనాళంబు స
ద్భావాధిక్యము దోఁపఁ ద్రెంచుకొనినం బద్మావతీకన్య ప్రే
మావేశంబును భక్తియు న్నిగుడఁగా నాభంగి నిచ్చో నిజ
గ్రీవాచ్ఛేదము చేసి వ్రాలెఁ బతిపైఁ గీర్ణోచ్చలద్రక్తయై. ౬౭

చ. అటఁ దమమూఁకలోన హితు లాతనిఁ గానక జాడ వట్టి యి
చ్చటి కరుదెంచి తున్కలయి చచ్చినవీరలఁ జూచి మద్గృహం
బిటనట నాదటం బొరలి యేడ్చుచు నెత్తులు మొత్తుకొంచు ను
త్కట మగుదుఃఖవహ్నిఁ గడుఁ గ్రాఁగిరి వేఁగిరి దోఁగి రశ్రులన్. ౬౮

సీ. తదనంతరంబ యిద్దఱ నెత్తికొని వెలి కరుగఁ జూచిన నేను గరుణ కల్మి
మీలోన నొక్కఁడు మిడిదల యిచ్చిన దంపతుల్ బ్రదుకుట తథ్య మనిన
నామాట కుల్కి మిన్నక కాలభైరవుం డీలోన నిద్దఱ నిట్లు ద్రుంచె
నింక నెందఱఁ జంప నెంచినాఁడో యని విడిచి కన్నని గూడి వెడలి పాఱి
రేను నామాట పద్యంబుగా నొనర్చి, వ్రాసి నిలిపితి నంత నెవ్వారలైన
మ్రొక్కఁ జనుదెంచి కాంచి విదిక్కుపడుచు, వెడలిమఱిచూడ రిట వెరవేఁకిపట్టి.

క. వీరాగ్రణి యగు నీచే, వీరిద్దఱు బ్రదికి రింక వేఁడుము దగ నీ
కోరిన కోరిక లిచ్చెద, భూరమణీరమణ సర్వభూతదయాత్మా. ౭౦

1. మొదలిరత్నము.

వ. అనుడు నతండు మఱియుం బ్రణమిల్లి. ౭౨

క. సకలార్థసిద్ధికై దేవ! "కలా మైలారు భైరవా" యనుపలుకుల్
ప్రకటంబుగ రాజ్యముతో, వికలత్వము లేనిబ్రదుకు వీరల కిమ్మా. ౭౩

మ. అనుచు న్వేఁడిన వానిసాహసము నత్యౌదార్యముం భైరవుం
డనురక్తిం గొనియాడి వారలకుఁ బ్రాజ్యం బైనరాజ్యంబుఁ జా
దనశైలస్థలిఁ గల్గ నిచ్చి తనలోఁ దా సన్నిధిం బొందినన్
ధనదుం గూడి కడంకతో మగిడె నాధాత్రీశుఁ డుజ్జైనికిన్. ౭౪

క. ఆభూపతి గుణములు నీ, కేభంగులనైనఁ గలుగ వింక మగుడు మనం
బ్రాభవముఁ గలిమి జాఱఁగ, నాభోజుఁడు తిరిగి చనియె నంతఃపురికిన్. ౭౫

వ. అంతఁ గొంతకాలంబు చనఁగ. ౭౬

—: ఎనిమిదవబొమ్మ కథ :—

క. కాశాబ్జమల్లికాకలి, కాశారదనీరదేందుకైరవహంసా
కాశాపగాంబుహిమసం, కాశాంగవికాసితప్రకాశు గిరీశున్. ౭౭

చ. తలఁపుచు మ్రొక్కి భోజవసుధావరుఁ డిష్టులు దృష్టశాస్త్రవే
త్తలు శకునజ్ఞులు న్సముచితం బగు లగ్నము చెప్పఁగా సము
జ్జ్వలకరవాలహస్తుఁ డయి వచ్చి మహాసన మెక్కఁ బూనఁగా
నిలునిలు మంచుఁ బల్కెఁ గడు నేర్పున నచ్చటి బొమ్మ యిమ్ములన్. ౭౮

క. మోహమున భద్రపీఠా,రోహణ మగు ననుట గుణవిరోధము గాదే
సాహసభూషణుసరిగా, సాహసగుణగణము లేక చనునే యెక్కన్. ౭౯

క. ఇవ్విధమునఁ బలికిన నృపుఁ, డవ్వీరుని బలిమి తెంపు లవి యెట్టి వన
న్నవ్వుచు నప్పాంచాలిక, నివ్వెఱఁగందంగఁ జెప్పె నిర్వచనముగన్. ౮౦

శా. ఆకర్ణింపుము భోజభూవర నిలింపాధీశసంపాదితా
స్తోకస్నేహవివేకనాకయువతీస్తోత్రైకపాత్రుండు ధా
త్రీకాంతాపరిభోగ్యభాగ్యనిధి కీర్తిన్ విక్రమాదిత్యుఁ డి
లైకచ్ఛత్రముగాఁ దనర్చుచు జగం బేలెం గృపాలోలుఁడై. ౮౧

క. ద్వాత్రింశద్భాగములను, ద్వాత్రింశద్ద్వారమైన వజ్రాసనమున్
ద్వాత్రింశదాయుధములున్, ద్వాత్రింశల్లక్షణములుఁ దగు నాతనికిన్. ౮౨

సీ. దుర్గరక్షణమును దుష్టశిక్షణమును శిష్టపాలనమును జేయవలయు
వర్ణధర్మములును వనములు గుళ్లును జలజాకరంబులు నిలుపవలయుఁ

కృషియు వాణిజ్యంబు గృహజీవధనములు నాయుర్వ్యయంబులునరయవలయు
ననదల నర్థుల నార్తులఁ బాత్రులఁ బూజ్యుల విప్రులఁ బ్రోవవలయు
బలముఁదెంపుఁగలిగియలుకయుఁగరుణయుఁ, జలమునిలుకడయునుజరుపవలయు
నయముఁబ్రియమువైరిజయముఁగార్యముఁగొల్వ,నితరరాజగతులనెఱుఁగవలయు.

క. అన నున్ననీతివిధమున, ననువుగ భూపతులవలన నయ్యైయుపవ
ర్తనముల జరిగెడు నృపవ, ర్తనములుఁ దెలియుచు నతండు ధరయేలంగన్.

క. చారులు చనుదెంచినఁ బతి, వారలచే నన్యదేశవార్తలు వినుచు
న్మీరు చరించిన యాకా, శ్మీరంబున నేమి గలవు చిత్రము లనినన్. ౮౬

సీ. వసుధేశ యచ్చట వైశ్యుండు ధనపతి యోజనాయతమైన యొక్క చెఱువు
గట్టించి లోఁతుగాఁ గావింప నందులోఁ బుడిసెఁడునీళ్లును బొడమకున్న
వగచి యింటికిఁ జని మగిడి నిచ్చలు నట్లు వచ్చి యాకట్టపై వెచ్చనూర్చు
చుండఁగా ముప్పదిరెండులక్షణములు గలవానికంఠరక్తంబు లిమ్ము
చెఱువు నిండు ననుచుఁ జెప్పె నంబరవాణి, దాని కాతఁ డట్టివానిఁ గూర్పఁ
బూని యేఁడుకోటు లైన బంగారునఁ, బ్రతిమ చేసి నిలిపెఁ, బద్య మొకటి.

గీ. "అవనిఁ ద్రిదశలక్షణాన్వితుఁ డగుధీరుఁ, డిచటఁ గంఠరక్త మిచ్చెనేని
సప్తకోటిమూల్యతప్తకాంచనముల, ప్రతిమ చేసి నతని పాలు సుమ్ము." ౮౭

మ. అని యిట్లున్నది విస్మయం బిది నృపాలాగ్రేసరా నావుడు
న్విని యుత్సాహముతోడఁ దత్సహితుఁడై విశ్వంభరాధీశుఁడుం
జని యచ్చోటఁ దటాకమధ్యమున గర్జన్మదళిధ్వానసం
జనితశ్రీరమణీప్రసాదవిలసత్సౌధంబు వీక్షించుచున్.[1] ౮౮

గీ. అష్టదిక్కులందు నష్టభైరవులను, దాండవమున నొప్పుతాండవేశు
నెదుర శ్రీవరాహు నేఁబదిచేతుల, రాతికంబముతుదిఁ బ్రీతిఁ గనియె. ౮౯

క. ఉర్వీశుఁడు సేతువునఁ జ, తుర్వింశతిమూర్తు లెదురఁ దోఁపఁగఁ ద్రిజగ
న్నిర్వాహకుఁ డన నిలిచిన, సర్వేశ్వరుఁ జూచి మ్రొక్కి సద్భావమునన్. ౯౦

ఉ. అచ్చటిపద్యముం బ్రతిమ లన్నిటి నేర్పడఁ జూచి యాత్మలో
నచ్చెరువంది భూమివరుఁ డచ్చెఱు వప్పుడె నిండఁ జేయఁగా
నిచ్చఁ దలంచి వేళకొఱ కించుకసేపు సహించి యుండఁగా
నిచ్చయెఱుంగుసంగతి దినేశుఁడు దగ్గఱెఁ బశ్చిమాంబుధిన్. ౯౧

1. శ్రీరమణీకటాక్ష విలసత్స్థానంబు వీక్షించుచున్. ప్రసాదమగునాసౌధంబు వీక్షించుచున్.

ఉ. అంబరరత్నబింబ మపరాంబుధిఁ జేరఁగ నెంత శైలశృం
గంబుల ధాతురాగముల కైవడిఁ గెంపు వహించెఁ జక్రవా
కంబులు తల్లడిల్లె విహగంబులు గూండ్లకు నేఁగఁజొచ్చెఁ బ
ద్మంబులు వాడఁబాఱెఁ గుముదంబులు సొంపుర రెక్కె నిక్కుచున్. ౯౬
గీ. పండుటెండఁ దరులు పల్లవద్యుతులతో, నొండుకొంచఁగ వరుణుమేడమీఁద
నుండి వెలుఁగు పసిఁడికుండ చందంబున, నెండఱేఁడు గ్రుంకుకొండ నొప్పె.
సీ. అపరాబ్ధిఁ గ్రీడించు నంబరస్త్రీ యొద్ద నిద్దపుఁ గుంకుమముద్ద యనఁగ
నచట సంధ్యాదేవి కర్ఘ్యంబు లెత్తుదిక్సతిచేతిమణిమయకలశ మనఁగ
వరుణుని ముందఱఁ బరిచారకులు నిల్వఁ బట్టిన రత్నదర్పణ మనంగ
నస్తాచలం బను హస్తిమస్తకమునఁ దిరమైన రక్తచామర మనంగ
నిఖిలదిగ్వలయాంతమాణిక్య మనఁగ, నిట్ట ప్రాఁకిన పవడంపుఁ జుట్టయనఁగ
గట్టుతుద నున్న జేగుఱుగ ల్లనంగ, నరుణమండల మొప్పె దినాంతమందు.
క. అయ్యెడ నర్కునిమండల, మయ్యచలము డిగ్గి పశ్చిమాంబుధి సొచ్చెం
దయ్యెందిఁ గాంచి కమ్మరి, చయ్యనఁ బదనిచ్చు నుక్కుచక్రము మాడ్కిన్. ౯౭
గీ. ఏవిధమున మలక లైన దైవగతిని, సొమ్ము వానిన మఱి చేరు సొమ్ము నాఁగఁ
ద్రిభువనము లెల్లఁ గలయఁగఁ దిరిగి గగన,రత్న మప్పుడు రత్నాకరమునఁ గలసె.
క. నెఱసంజఁ గ్రుంకు గుబ్బలి, చఱి జఱజఱ నినుఁడు డిగ్గజాఱుచుఁ జనునా
తఱి నఱిముఱి నెగసిన [1]జే, గుఱుధూళి యనంగఁ గెంపు గఱికొని పర్వెన్.
క. మిన్నందెడు తేజంబున, నెన్నంగల యినుఁడు డీఱె నిదె యెడ రనుచు
న్విన్నంతనె పఱతెంచెడు, మన్నీలన నపుడ యిరులు మన్నీ లెసఁగెన్. ౯౮
*క. లోకమున విగతదృష్టి వి,వేకంబునఁ జక్రవాకవిరహానల ధూ
మాకారంబున జనములు, చీకాకుపడంగ దెసలఁ జీఁకటి గప్పెన్. ౯౯
గీ. అర్కుఁ డేఁగిన పిదపఁ గాలాభ్రలీలఁ, దమము గప్పిన యెడ వియత్పథము దోఁచె
వరుస దప్పక దావపావకము సోఁకి, చనినపిమ్మట ఘనతృణస్థలము కరణి. ౧౦౦
క. నేలయు నింగియు నిండఁగ, వాలుచు దళమైన చీఁకువా లేచినఁ ద
త్కాలంబున జగ మొప్పెను, నీలసలిలమునను గడవ నించినమాడ్కిన్. ౧౦౧
సీ. యమునాజలానీల మాచిమ్ము చీఁకటి పెల్లున జగమెల్ల నల్లనైన
దిగినఁ దప్పెద మని యగజతోడను శూలి తనవెండికొండపైఁ దలఁకుచుండ

1 తఱివడితో నెగసినజేగుఱు—*ఈపద్యము మొదలు **వఱకు నొకప్రతిలో నే కలవు.

నీవెస మఱి గానరా దని హరి లక్ష్మి దోయిగా నమృతాబ్ధిఁ బాయకుండ
దీనఁ బాసినఁ గానలే నని వాణి తోప్పడ బ్రహ్మ వెలిదమ్మి వెడలకుండఁ
వెలుపు నలుపుచు ననియెడి తెలివి తలఁగి
పల్లమును మిట్టు నెఱుఁగక యెల్లజనులుఁ
బుట్టుచీఁకులగతి నంటి పోక దక్కి
యుండి రుదకంబులో మునిఁగున్న పగిది. ౧౦౨

క. రాజిల్లెను తారాగ్రహ, రాజిం గ్రిక్కిఱిసి యంబరము గడు నొప్పెన్
రాజు చనుదెంచు నని యు,ద్భ్రాజితమైయున్న విపులపందిరిభంగిన్. ౧౦౩

శా. దిగ్భామామృగనాభిలేపనము భాతి న్విస్సృతం బౌ తనుః
ప్రాగ్భారంబు నిశావధూచికురభారస్ఫూర్తి వర్తిల్లఁగాఁ
బ్రాగ్భాగంబునఁ దచ్ఛిఖావినిహత ప్రవ్యక్తరక్తోత్పల
స్రగ్భావంబునఁ గెంపు దోఁచె రజనీరాజద్యుతివ్యాజమై. ౧౦౪

క. తరుణారుణకిరణోత్కర,పరిహృత ఘనతిమిర మైనప్రాగ్భాగమునం
బురుహూతు నెదుర నెత్తిన, కరదీపికకరణి శీతకరుఁ డుదయించెన్. ౧౦౫

క. తనయుదయమె మదిఁ గోరెను, నను విడిచె నినుండు కల్ల నాయెడ లేకుం
టనెఱుఁగఁ డని పూర్వాశాం, గన జగమున మడ్డు వట్టు గతి శశి మెఱసెన్.

సీ. ఉదయాచలము చఱి నున్న బంధూకంబుకొమ్మచు బొడమిన కుసుమమనఁగఁ
దత్ప్రదేశంబునఁ దలకొని పొడతెంచు నలినీలతాపక్వఫల మనంగ
విరహిమృగంబుల వేఁటాడుమదనుండు తివిరి పెట్టించిన దివియ యనఁగ
నమరంగ నింద్రాణి యాఖండలుని నివాళించెడు పసిఁడిపళ్లెర మనంగఁ
దోడుతోడన తన కెంపువీడుచుండఁ, దిమిరపటలంబు కొంత మీఁదికిఁ జలింపఁ
దెలివిపడ లేఁతవెన్నెలమొలక లెత్తి, నిండుకొనియుండె నమృతాంశుమండలంబు.

ఉ. కోకములు న్సరోజములుఁ గుందుచుఁ గందుచునుండఁ గైరవా
నీకములుం జకోరములు నిక్కుచు సొక్కఁగ మానినీసము
త్సేకము నంధకారమును దిగ్గఁగ దిగ్గన లోకము న్నిజా
లోకము నుల్లసిల్లఁ గవిలోకము మెచ్చులు పిచ్చలింపఁగన్. ౧౦౮

క. నడుమం గృష్ణుఁడు గలపా,ల్కడలిని జనియించి తండ్రికై వడి మూర్తిన్
బెడఁ గడరెడవాఁ డనఁగా, నుడుపతి తెలుపై కళంకయుతుఁడై మెఱసెన్.

క. తిమిరసముదాయమున న, ర్ధము నలుపై పూర్ణతుహినధామద్యుతి న
ర్ధము తెలుపై యాకాశము, యమునాగంగాంబుసంగమాకృతిఁ దాల్చెన్.

గీ. మిత్రుఁ డేగిన యెడమున మేర దప్పి, వాలి చేకొన్న యిరులమున్నీలు పఱవ
యశముగతిఁ గ్రొత్తవెన్నెలదిశలఁ బర్వ, రాజుచను దెంచె గగనదుర్గమునకంత. **

క. ఇటునటుఁ జనకుండఁగఁ జెం, గటఁ జక్కం బాఁక నిడిన గతిఁ దప్పినచీఁ
కటి చెలికాండ్రన నంబుజ, పుటములలోఁ జంచరీకములు తగులొందెన్. ౧౧౨

క. భాగీరథియుదకంబు న, భోగంగయు వేఱుసేయఁ బోల దనుచు న
వ్వాగీశుఁడు గూర్చెనో యన, వేగన భూగగనములను వెన్నెల నిండెన్.

సీ. తొలితొలి లేఁతవెన్నెల నారగింపుచుఁ దనియఁ బిల్లలనోళ్లఁ జొనిపి చొనిపి
ముదురువెన్నెలఁ బట్టి చదియంగ నములుచు మెచ్చుచుఁ బిల్లల కిచ్చి యిచ్చి
పండువెన్నెల దాడఁ బలుమాఱు నొక్కుచు గమిగూడి యందంద కమిచికమిచి
వెలినార సాఁగెడు వెన్నెలకాఁడలఁ ద్రొక్కి ముక్కునఁ ద్రెంచి బొక్కి బొక్కి
బొక్కి తత్ప్రవాహములోన సోలిసోలి
యడ్డమీఁదుచు గడ్డపై నాఁగియాఁగి
యెనసి బలఁగముతోఁగూడి[1] మునిఁగిమునిఁగి
కోరికలు మీరఁబుచ్చెఁ[2] జకోరచయము. ౧౧౪

చ. కలువలవిందు జక్కవలకందువ వెన్నెలతీవదుంప ము[3]
చ్చిలమెడకోణ మంగజునిచూపరి చూపులయింపు జారకాం
తలవెఱగొంగ రాత్రికులదైవము చల్లనిరాజు పంకజం
బుల ముకుగొయ్య[4] యచ్యుతుని ముద్దుమఱంది వెలింగె నయ్యెడన్. ౧౧౫

క. కొడుకుసిరిఁ జూడ నుబ్బునఁ, గడఁగి వడి న్వడలి వచ్చి కడు మీఱెనపా
ల్కడలి యన నిండువెన్నెల, గడలుకొనుచు నెల్లకడలఁ గడు బెడఁగడరెన్.

సీ. దిక్కులు గలయంగఁ బిక్కటిల్లిన పండువెన్నెల యాపాలవెల్లి యనఁగ
ముత్తియంబులభాతి మొత్తమౌ తారకాగణములు లహరికాగణము లనఁగ
నుజ్జ్వలాకారమౌ నుడురాజబింబంబు సెజ్జయై మెలఁగిన శేషుఁ డనఁగ
నందమై మృగనాభిబిందుసుందర మైన యందులకందు ముకుందుఁ డనఁగ
నట్టివేళఁ గువలయానందకందమై, పుణ్యములకుఁ గలితభోగములకుఁ[5]
గారణంబునాఁగఁ గందర్పజనని యై, రజనిలక్ష్మి మిగుల భజనకెక్కె. ౧౧౭

1. యెనసి బుడుగులయట్టులు మునిఁగి-బుడిగి=బుంగముంత. చి. సూ.—2. మాగిముంచె 3. రాజుల మెడకోణ 4. పంకజంబులకెదురెక్క. 5. యానందమై పుణ్యభాగులకును వారి భోగములకు.

ఉ. అత్తఱిఁ బ్రాప్తమగు సమయం బిదె నిర్జన మంచు నిల్చి త
త్సేతువుమీఁద రక్తబలిదేవత[1] నిష్ఠఁ దలంచి ధర్మవి
ఖ్యాతముగాఁ బరోపకృతికై తల యిచ్చెద నంచు నుబ్బుచుం
జేతికృపాణ మల్ల మెడఁ జేర్చె మెఱుంగులు తొంగలింపఁగన్.[2] ౧౧౮

ఉ. అప్పుడు రక్తభోజని తదస్త్రము పట్టి ప్రసన్నచిత్తయై
కప్పు తనూలత స్సెఱయఁగా నృపుముందట నిల్చి వేఁడు మే
నిప్పుడు మెచ్చితి న్వరము లిచ్చెద నావుడు మ్రొక్కి యాత్మలోఁ
దప్పనిభక్తితోడ వసుధాపతి పల్కె నుదారవృత్తియై. ౧౧౯

క. ఇచ్చుటఁ గోరినకోరిక, లిచ్చెద నని యానతిచ్చితే నడిగెద నా
కచ్చెరువుగ నీతలఁపున, నిచ్చెఱు విదె నిండఁజేయు మిప్పుడు తల్లీ. ౧౨౦

గీ. అనుడు దేవి పల్కె నవనీశ నీధర్మ,బుద్ధిఁ జెఱువు దానె పూర్ణమయ్యె
ధార్మికులకు సిద్ధితడయునే కప్పలఁ, గాచి యెలుక పాము గతికిఁ బుచ్చె. ౧౨౧

క. అనవుడు జనవిభుఁ డది యె,ట్లని యడిగిన దేవి చెప్పె నాకథ యిదిగో
వినుము హిమాద్రిసమీపం,బునఁ గడు లోఁతైన మడుఁగుపొలుపై యుండున్.

క. ముదమున నందులకప్పలు, వెదవెట్టిరె వెట్టికోరు వెట్టిరె యెమరే
కదకడ దక్కుము పొదపొద, యనె వరవర వాఁగుహూఁగు రనుచుం జెలఁగున్.

క. అట కంతటను ఘనాత్రయ,పటుతరుఁడై యొక్క శంఖపాలుం డను పే
రిటి నాగేంద్రుఁడు చని దా,పటికప్పల[3] మ్రింగఁ జొచ్చి పద్యము చదివెన్.

క. "గుండియ చెదరక భువి నె,వ్వం డైన నిజాంగ మిచ్చువాఁడు గలిగినన్
గండూపదీయుతం బగు, మండూకోఘుంబుతిండి మానుదుఁ జుండీ." ౧౨౫

క. అని ముమ్మాటు ముఖత్రయ, మునఁ జదువుచు మడుఁగుచుట్టు ముమ్మాఱు వివ
ర్తనచేసి మూఁటి మ్రింగుచు, నను దినమును వ్రతముపోలె నచటం దిరుగున్.

శా. ఈమర్యాదల నున్నదాని చరితం బేపారఁగాఁ జూచి వి
శ్రావ్యార్థంబుగ నొక్కకాకి చని వృక్షశ్రేణిపై బాంధవ
స్తోమంబు న్వినిపించి నిల్వక మహాచోద్యంబుగా నుత్తమ
ప్రేమాఢ్యం బగు మూషకంబునకుఁ జెప్పెం దత్క్రమం బేర్పడన్. ౧౨౭

క. ఆమూషక మిది చూడఁగ, నీమహిఁ గడుఁ జిత్ర మనుచు నిచ్చఁ గుతుకము
ద్దామముగఁ గాకితోడుగ, నామడువున కేఁగి యచటి యవనిజ మెక్కెన్.

1. రక్తజలదేవత. 2. కృపాణ మెత్తి మెడఁజేర్చె మెఱుంగుతురంగలింపఁగన్. 3. యప్పటికప్పల.

క. అత్తరువుమీఁద నుండుచు, నత్తఱి నుదకంబులోన సహీక్షితిఁ గడుం
గుత్తుక తుకతుక యనఁగాఁ, దత్తఱపడుచున్న ఫేకతతిఁ బొడఁగాంచెన్. ౧౨౯

గీ. బ్రహ్మ "కప్పకాటు బాఁపనపోటును", లేకయుండఁ జేసెఁ గాక నేఁడు
గలిగెనేని వైరిఁ గని యున్ని దునుమనె, దైవలిఖిత మేల తప్పు ననియె. ౧౩౦

క. ఆలోనను వెడలి మహో,వ్యాళము చనఁపుచును మదువ్రవలగొనఁగాఁ ద
త్కాలంబున మూషక మిటు, చాలం గృపవుట్టి వాయసంబున కనియెన్. ౧౩౧

చ. అలిగి వధించినప్పు డొరు లడ్డము వచ్చిరయేని నాఁడుఁగ
ప్పల మగకప్పల న్విడువఁ బంతముచేసె వడిన్ భుజంగ మి
మ్ముల మన మడ్డమై నిలిచి ముక్తుల వాదము రమ్ము నావుడుం
గలఁగి ఖగంబు బుద్ధి యిదిగాఁ దనుచుం దలయూఁచి యిట్లనున్. ౧౩౨

ఉ. అన్నలొ తమ్ములో చెలులొ యాత్మజులో చనువారు వీరికై
మిన్నక చావనేల యిది మేలె భువిన్ బలిభోజి నయ్యు నా
యున్నెడ విశ్వసింప నొరునొద్దకుఁ జేరఁ బ్రమాద మైనఁ గ
న్నన్న నెఱింగి యొండెడకుఁ జాఁగుదుఁ బ్రాణముతీపి చూచితే. ౧౩౩

క. వలవనిపని యిది ఫల మని, చలమునఁ దాఁ జచ్చి పడయుసంపద లేలా
యిలఁ బ్రాణము గలిగిన *బ్రబ్బలియాకేఱి తినవచ్చుఁ బెక్కుదినంబుల్. ౧౩౪

గీ. మనుజుఁ డొక్కఁడుఁ జేటమునిఁగెడు దిగి నిల్వఁ, బట్టు మనిన భంగి నిట్టునీవు[1]
కొంత దెలియలేవు క్రొవ్విన గొఱియ దాఁ, జింతకట్టె మేయఁ జేరుటయ్యె.

గీ. ప్రాణమైన సుతులుఁ బత్నులుఁ జావఁగాఁ, జావలేరు వీనిచావు కింత
తన్నుమాలినట్టి ధర్మంబు గలుగునే, చెడుగుబుద్ధు లింక విడువు నీవు. ౧౩౬

క. అనవుడు నది యిట్లనియెను, విను మొక ప్రాణమునఁ బెక్కువిధముల ప్రాణుల్
మనఁగం జేసినపుణ్యం, బెనయునె భువిలోనఁ గ్రతువు లెన్నియుఁ గూడన్.

క. ధనధాన్యములును సుతులును, వనితలుఁ దనతోడఁ గూడి వచ్చుట గలదే
జనహిత మగునడవడినిఁ జనిన ధర్మము దనకుఁ దోడునీడను బోలున్. ౧౩౮

క. ధనము గలిగి పెట్టక యీ, జననంబున నెలుకనైతి జనులకు నిడువ
ర్తన సమకూరక యూరక, చనియెను దినము లొగి ధర్మసంచయ మేదీ ౧౩౯

క. పాపంబు పుట్టునెడఁ దా, నోపియు నుడుపంగలేక యూరక యున్నం
గాపురుషుం డాతం డగు, నాపాపము వానిఁ బొందు నండ్రు వివేకుల్. ౧౪౦

---

* బ్రబ్బలియాకేఱి- 1. డొక్కఁడు (మనగు) గునుకుదినియె (యే) దుగోదానఁ బెట్టు మనినభంగి నిట్టినీవు- చిఱుత కట్టె-చిన్న యనూరిగారు.

క. క్షోణి "సనిత్యాని శరీ,రాణి" యనుచుఁ బెద్దలెఱుక ప్రచురింపంగాఁ
బ్రాణిపరిపాలనమునకుఁ, బ్రాణము వంచింపనేల పరహితమతికిన్. ౧౪౧

క. తనతనయులుఁ దనసతులును, దనవారలుఁ దనగృహంబుఁ దనసొమ్మనుచుం
దనువుసఁ దనరెడికప్పలఁ, దన దగు తను విచ్చి కాచి తనిపెదఁ బ్రీతిన్. ౧౪౨

క. ఈగతి "ధర్మస్య త్వరి,తాగతి" యనుపలుకుకొలఁదిఁ దడయక నే నా
నాగేంద్రుని కెదిరించెద, నాగాంతకుఁ జేరుఖచరనందను మూర్ధిన్. ౧౪౩

క. అని పలికి శంఖపాలుని, పని విఘ్నముఁ బొందఁజేయఁ బనిపూని గజా
ననుఁడు దనవాజిఁ బుత్తెం, చెనో యనఁగా మూషకంబు క్షితిపై నుఱికెన్.

సీ. ధవళాంశు మ్రింగి సుధాశక్తిఁ దెల్లని దేహంబు వడసిన రాహు వనఁగ
భువనత్రయం బాక బుట్టఁ[1] బెట్టఁగఁ జాలు వేఁడిమివడగలు మూఁడు మెఱయ
భీషణాం బైయున్న రోషాగ్నిఁ బొడమెడు శిఖలకై వడిఁ గ్రాలు జిహ్వ లడరఁ
దనలోని కీఁసు ముందటఁ దెల్పుమార్గిని శ్వాసంబుతో విషజ్వాల లొలుక
[2]మ్రోయుజేగంటచాడ్పున మ్రోగి మ్రోగి, చదివి తిరిగెడు నాగేంద్రు నెదురనుండి
నీకు నాహార మిప్పుడు నేన యైతి, నిలిచి కైకొను మనుచు నయ్యెలుక పలికె.

క. ఆపలుకున భుజగము తన,రూపంబు పరిత్యజించి రుచిరాకృతి వి
ద్యాపారంగతమతి యన, దీపించెడు విప్రుఁడై నుతించుచుఁ బలికెన్. ౧౪౬

క. మూషకకులతిలక దయా,భూషణ నినుఁ బోలునట్టి పుణ్యులు గలరే
భాషణమాత్రంబున ని,ర్దోషుఁడ నై బ్రదుకఁ గంటిఁ దొల్లిటిభంగిన్. ౧౪౭

సీ. తాపసుం డగు దీర్ఘతముఁ గొల్చి సాంగయుక్తంబుగా వేదత్రయంబు చదివి
యతనిచే దేవకార్యమునకు నామంత్రితుండనై యుండఁగా దొర యొకండు
తనయింటి పితృకార్యమునకు రమ్మనవుడుఁ దద్గృహంబునఁ బదార్థములు పెక్కు
గలుగ నూహించి యక్కడి కేఁగి కుడిచిన విని ఋషి చనుదెంచి నను నదల్చి
మునుపు మాకు నీయకొని యట చని కూడు,కుడిచి తీవు కుడువఁ గూడ దనక
శ్రుతి యుతుండ వయ్యు శ్రుతిహీనజీవమై, పెనఁచి మ్రింగుచుండు భేకములను.

క. అని శపియించిన నే నా,తనికిన్ ధరఁ జాఁగి మ్రొక్కి తప్పు గలదు శి
ష్యునిఁ గరుణింపుము మునుచది,విన చదువుల దురితమెడలి విరతియుఁ గలుగన్.

గీ. అనుడు నామాటదప్పదు వినుము నీకు, వేదము ల్వాఁడు పడగలై వెలయుఁగాన
శంఖపాలుండ వై జలాశయముఁ జేరి, మూఁటిఁ దినుమని పద్యంబు మొదలఁ జెప్పె.

1. బుస్సఁ 2. మోసియున్నట్టి ఘోరవక్త్రముఖము లడర.

క. "గుండియ చెదరక భువి నె, వ్వాఁ డైన నిజాంగ మిచ్చువాఁడు గలిగినన్
గంఠాపదీయుతం బగు, మఁడూకౌఘుంబుత్రెంచి మానుమఁ జుండీ." ౧౫౧

క. ఈకరణిం జదువుచు* నీ, వాకఁడ మున్నాయఁ దిరుగునవసరమునఁ ద
ద్దేకములఁ గావ ధైర్యము, గైకొని తెలుకఁ దగ్ధమైన గతిఁ గను మనియెన్.

క. కావున నిట నరగాకృతి, నీవిధమునఁ దిరిగి చదివి యిన్నిటఁ గలయం
గా వధియించితిఁ గడపట, నీవెరవున హంత మొల్ల నేఁగితి ననఘా. ౧౫౩

క. దీర్ఘతముని శాపం బను, నిర్ఘాతము సోఁకి వచ్చి నీవచనసుధా
నిర్ఘర్షణమున మంటిని, దుర్ఘట మిది యనఁగ వింటిఁ దుది గతిఁ గంటిన్. ౧౫౪

మ. అని చెప్ప న్విని మూషకంబు గడుఁ జోద్యం బంది యవ్విప్రుఁ డో
డ్డోని తా నుండు బిలంబుఁ జేరి యిదె కైకొమ్మంచు నం దున్న కాం
చన మెల్లం గొనివచ్చి యిచ్చి యుచితస్నానప్రదానస్పృహం
జనియెం గాశికి ధర్మరాశికిని మోక్షశ్రీపయోరాశికిన్. ౧౫౫

మ. ధరణీదేవకుమారుఁడు న్మగిడి యుత్సాహంబుతోఁ దత్సరో
వరతీరంబున మూషకేశ్వరమునా సత్తిల్లు తీర్థంబు నీ
శ్వరగేహంబును గల్గఁ జేసి చని యాచార్యుం దగం గాంచి సు
స్థిరమా భక్తిఁ జతుర్థవేదముఁ బఠించెన్ ధర్మనిర్మాతయై.[1] ౧౫౬

సీ. ఈవిధంబున నొక్కయెలుక ధర్మముసేయఁ జింతించునంతలో సిద్ధి యయ్యె
సర్వలక్షణముల సంపూర్ణుఁ డవు నీవు నీతలంపున నిది నిండు టరుదె
యదిగాన నొండెద్ది యైన నన్నడుగుము నావుఁడు వసుమతీనాయకుండు
చెలువుగట్టించిన సెట్టిధర్మం బెల్ల నుడివడకుండఁగ నడపు తల్లి!
యేనొనర్చునట్టి యీచేఁత మానవు, లెఱుఁగకుండఁ జేయు మిదియచాలు
ననుచు మ్రొక్కి వీడుకొని గూఢచారియై, యచ్చమెచ్చి మగిడి వచ్చెఁ బురికి.

క. ఓరాజ యతని సరిగా, నీకీర్తిగుణంబు లేక యెక్కకు మనుడున్
ధారానాయకుఁ డతి ని,స్మేరకుఁ డై మగిడె మోము సిగ్గున వ్రాలన్. ౧౫౭

—: తొమ్మిదవబొమ్మకథ :—

వ. అంత నొక్కనాఁడు నవమద్వారంబునం బ్రవేశింపఁ గడంగి. ౧౫౮

క. నలువకు నెల వగుతమ్మియు, వలిపం బగుపచ్చపట్టు వలయపుటలుగున్
వెలిగుల్లయు వనమాలయుఁ, గలిమియు మానికము మేనఁ గలిగిన వేల్పున్.

* వ. అనుచును. క. ఈకందముఁ జదువుచు. 1. నిర్ణేతయై.

ఉ. భక్తిఁ దలంచి భోజుఁడు శుభం బగులగ్నమునందు చూళిపై
మౌక్తికశేష లొప్ప హితమాగధవందివనీపకద్విజా
ముక్తజయానులాపములు మున్నుగ డంగెడు సంతసంత నా
సక్తసువర్ణపుత్రిక వెసం బలికెన్ నృపు నడ్డపెట్టుచున్. ౧౬౧

గీ. వినుము భోజరాజ విక్రమార్కుని బోలి, సత్త్వధైర్యములను జాలకునికి
దివ్యపీఠమెక్కఁ దివురుట పిచ్చుక,కుంటు శైలమెక్కఁ గోరుటయ్యె. ౧౬౨

మ. అనుడు న్నిల్చి యతండు వాని బలధైర్యంబుల్ దగం జెప్పుమా
యనఁ బాంచాలిక వల్కె నాతఁడు రణవ్యాపారపారంగతుం
డిన తేజోంశభవుండు సాహసఘనుం డింద్రాదిమిత్రుండు స
జ్జనరక్షామణి యాచు నుజ్జయిని రాజ్యప్రాజ్యుఁడై యేలఁగన్. ౧౬౩

గీ. భట్టిమంత్రి సైన్యపాలి గోవిందచంద్రుఁడు త్రివిక్రముఁడు పురోహితుండు;
నప్పురోహితునకు నాత్మజుం డగు కమలాకరుం డన నవివేకి గలఁడు. ౧౬౪

క. ఆకమలాకరుఁ డాకమలాకరసాదృశ్యముగ జడాశయుఁ డైనన్
శోకము మదిఁ బొదలంగ వివేకము పుట్టింపఁ దండ్రి వెరవున[1] దూఱెన్.

క. చుట్టములకుఁ దలిదండ్రుల, కెట్టియెడం బ్రియము నెఱపనెడపని చదువుల్
గట్టిగ నెఱుఁగనిపుత్త్రుఁడు, పుట్టుట కులమునకుఁ దెవులుపుట్టుట చుమ్మీ.

క. విను ముత్తమ మగుపుట్టువు, గనుపట్టెడు నట్టిరూపు గలమోదుగుఁబూ
వును మూర్ఖుండును బ్రబలెడు,వనమున భవనమునఁ దగినవాసన గలదే.

క. కులసతికి సిగ్గు క్షత్రియ, కులజునకున్ జయము నర్తకున కోపికయుం
గలిమికి వితరణమును విప్రులకు న్విద్యయును దగినభూషణము లగున్.

క. పరులకు సోదరులకు భూవరులకుఁ గొనరాదు సర్వవశ్యము తానె
వ్వారి కిచ్చినఁ గోటిగుణో,త్తరవృద్ధి భజించు విద్య తనధన మెపుడున్. ౧౬౯

క. పరభూమికిఁ జనుచోఁ దస్కరులకు నగపడదు ప్రేఁగుగా దెచ్చుట నె
వ్వారి నైన హితులఁ జేయును, ధరలో మఱి విద్యఁ బోల ధనములు గలవే.

ఉ. గద్యముఁ బద్యముం బెనుపఁ గైకొను టొండె, ధ్రువాప్రబంధసం
పద్యుతుఁ డౌట యొండె, మృదుభాషలఁ బ్రొద్దులు పుచ్చుటొండె, లో
కోద్యమలక్షణం బెఱుఁగు టొండెఁ, గడు న్భజియించుఁగాక యే
విద్యలు నేరఁ డేనిఁ బృథివిం బశు వాతఁడెగా గణింపఁగన్.[1] ౧౭౧

1. వెరచుచు దూఱెన్—మూ. విద్యలు నేరఁడేని పశువేయగుఁగాదె గణించిచూచినన్.

శా. సంగీతంబుఁ గవిత్వతత్త్వమును సాజన్యంబు భావంబు స
త్సాంగత్యంబు నెఱుంగఁ డేని భువి నాశ్చర్యంబుగా వాలముల్
శృంగద్వంద్వములేని మొ ద్దవఁ డనం జెల్లుం దృణం బాతఁ డ
య్యాంగీకంబున మేయఁ డాపసులభాగ్యం బిచ్చుటం గల్గుటన్. ౧౭౨

సీ. అనుచు నెగ్గించిన నాకములాకేశం డక్షమానియై తనశాస్త్రలోన
విద్యలునేర్చి వివేకినై కాని యీజనమునఁ ద్రొక్కఁ జూడననుచు వెడలి
కాశ్మీరదేశంబుకడ కేఁగి యొకయూరఁ జన్ద్రకేతుం డనుసంజ్ఞఁ బరఁగు
నుత్తమద్విజుఁ గొల్చియుండఁగా నాతండు క్రమమున సిద్ధసారస్వతంబు
కరుణ నొసఁగినఁనతఁడుసాంగంబుగాఁగ, నాల్గువేదములునుగావ్యనాటకములు
దర్శనంబులు నీతిశాస్త్రములు చదివి, కలయ సంగీతసాహిత్యకళలు నేర్చి.

వ.అభిజ్ఞుండై గురునాసతివడసితిరిగి దేశవిశేషంబులంజూడంజరియించుచునొక్కనాఁడు.

క. కాంచనమణిమయరుచికలి, కాంచితనిజసాలవలయమై భూమిసతీ
కాంచీగుణ మన మించిన, కాంచీపట్టణము నతఁడు గాంచెం గడఁకన్.

క. ఆనగరమునకుఁ జని జయ,సేనుం డనురాజుచేతఁ జిత్రంబుగ వి
ద్యానిపుణతఁ బూజ్యుండై, యానెపమునఁ గొన్నిదినము లచ్చట నిలిచెన్.

వ. అంత నొక్కనాఁ డతనియెదుట విటలోకమోహిని యను వారకామిని లలిత
విలాసిని యై పొలసె నది యెట్టిదనిన. ౧౭౭

సీ. శృంగారరసములోఁ జేవశోధించి వికిరించి యీసతి నొనరించెనొక్కొ
మెఱుపు లన్నియుఁ గూర్చి మెదపి రూపుగఁ జేర్చి యీసరోజాననఁ జేసెనొక్కొ
కాక బంగారులోఁ గాంతిసాధించి యీచంచలనేత్రఁ గావించెనొక్కొ
యుడురాజుఁ జేపట్టి పిడిచి సారంబున నీపడంతుక రచియించెనొక్కొ
చక్కఁదనమునెల్ల నొక్కచోటనుగూడఁ, గూర్చి యీనెలఁత నొనర్చెనొక్కొ
యనఁగ రత్నపుత్రికాకృతి రసికుల, చూపుగములకెల్లఁ దీపు లొసఁగు.

క. ఆకామినిఁ గనుఁగొని కమ,లాకరుఁడు ప్రమత్తచిత్తుఁడై కందర్పో
ద్రేకమునఁ జేరునెడ నా,లోకించి యొకండు వింతలుగ నిట్లనియెన్. ౧౭౯

క. ఈనరమోహినిఁ బొందం, గానేఁగినరాత్రి వచ్చి ఘనదంష్ట్రుం డన్
దానవుఁడు చంపుఁగావున, హానింబడనేల తిరిగి యరుదెమ్మిటకున్. ౧౮౦

ఉ. నావుడు నుల్లి భూమిసురనందనుఁడు న్నరమోహినీరతే
చ్ఛావిరతాత్ముఁడై నిలిచి సత్యముగా జనులెల్లఁ జెప్పఁగాఁ

(1.) కాంచనమయతటరుచికలి, కాంచిత— కాంచనమణిమయ తటరుచి, కాంచిత—

దా విని చోద్యమంది వసుధావరు పేర్కొని యొయ్య నొయ్య వి
ద్యావినయాఢ్యుఁడై తిరిగి తండ్రిఁ గనుంగొన వచ్చె నూరికిన్. ౧౮౧

మ. అచటం దల్లికిఁ దండ్రికి న్వరుస సాష్టాంగంబుగా మ్రొక్కి సం
బ్రచురప్రేమరసాకృతిం బ్రమదబాష్పస్యంద మందంబుగా
రచితాలింగను లై, కుమారక! సుధీరత్నంబవై వచ్చితే
సుచరిత్రా! యిది భాగ్య మంచు మదిలోఁ సొంపొంది రాదంపతుల్. ౧౮౨

శా. తద్యోగంబునఁ దండ్రి మిక్కిలియు నాత్మం బొంగి సద్వృత్తికిం
జోద్యం బంది యనంతరంబ ధరణీశుం గానఁగాఁ నేఁగి నా
యుద్యోగంబున జాణ యయ్యె నని యేనూహించెదన్ వీనికిన్
విద్యాచాతురి గల్గు టీవు కరుణ న్వీక్షింపుమా నావుడున్. ౧౮౩

మ. క్షితినాథుండు నిజాదరంబునఁ గృతాశీర్వాదుఁ జేనప్పరో
హితపుత్రుండు సభాస్థలి న్బుధగణం బింపొందఁగాఁ దా నకం
పితుఁడై శాస్త్రపురాణకావ్య నిగమ స్మృత్యర్థ సంగీత సం
గతి మర్మజ్ఞతతోఁ బ్రసంగ మెలమిం గావింపఁగా నిట్లనున్. ౧౮౪

క. యత్నమునఁ దెలియ నన్నియు, రత్నాకరుభాతి దుస్తరం బగు విద్యా
రత్నము కవితాతత్త్వము, నూత్నముఁగా నందుఁ గలుగు నును వెతఁగితివే.

క. నావుడు కమలాకరుఁ డను, దేవా నీ వానతిచ్చితివి నిజ మది, వి
ద్యావారిధి కడ గానఁగ, నావారిజభవునకైన నలవియె తలఁపన్. ౧౮౬

గీ. అట్లు యయ్యు సంస్కృతాదిభాషలు నేర్చి, కవిత యెఱిఁగి యెల్లకడలఁ దిరిగి
తెలిసినాఁడ నిచటఁ గల లక్షణముకంటెను, నూతనంబు లేదు భూతలేంద్ర.

క. గణములు గణవర్ణంబులు, గణతారలు గణరసములు గణదేవతలున్
గణజాతులు గణఫలములు, గణుతింపఁగ నొక్కవిధము కవితల కెల్లన్.

వ. ఇట్టి విధం బయ్యును నంధ్రమండలంబునం [1]గోణదేశంబునం దెలుఁగుం గవిత
కు వ్రాలు[2] వల్లు నను నియమంబులు చూచినాఁడ నవి యెయ్యెడం దఱచు
గాకుంట నపూర్వం బవధరింపుము. ౧౮౯

శా. పుణ్యస్త్రీకి గుణంబు[3] మంగళగుణంబు నోనమ్ములె యొప్పుఁగాఁ
బణ్యస్త్రీకి సువర్ణ మౌక్తిక సురూపవ్యక్తి భూషాకృతుల్
గణ్యం బాగతి సంస్కృతంబునకు వాగ్భావంబు శబ్దంబు లా
వణ్యాకారము లౌఁ దెనుంగునకుఁ బ్రాల్వళ్లుం గడు న్వన్నియల్. ౧౯౦

1. గణదేశంబున- 2. వ్రాలు-ప్రాలునని రెండురూపములుగలవు. 3. గణింప.

## ఆంధ్రసాహిత్యపరిషత్తు—ప్రతిష్ఠాపకులు.

శ్రీరాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారావుబహద్దరువారు, పిఠాపురము మహారాజావారు. పరిషద్యావజ్జీవాధ్యక్షులు.

కీ. శే. శ్రీ వేంకటగిరి మహారాజావారు.

## ఉద్ధారకులు.

శ్రీరాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు- ఉయ్యూరు జమీందారువారు.

కీ. శే. శ్రీబొబ్బిలి మహారాజావారు.

## ఆంధ్రసాహిత్యపరిషత్కార్యనిర్వాహకవర్గము.

### కార్యనిర్వాహకసభాధ్యక్షులు.

జయంతి రామయ్యపంతులుగారు బి. ఏ., బి. ఎల్.

### కార్యదర్శులు.

కిళాంబి రాఘవాచార్యులుగారు ఎం. ఏ., బి. ఎల్.

వింజమూరి వెంకన్నపంతులుగారు ఎం. ఏ.

### కార్యనిర్వాహకసభాసభ్యులు.

దివాన్ బహదర్ కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తి నాయఁడుగారు, (కోశాధ్యక్షులు.)

పెద్దాడ రామస్వామిగారు, ఎం. ఏ. ,,

చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు.

కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు.

శ్రీమాన్ గొడవర్తి జగన్నాథస్వామిగారు, ఎం. ఏ., ఎల్. టి.

దర్భా వేంకటశివరామరాసుగారు, బి. ఏ., బి. యల్.

అళక్కి వేంకట్రామయ్యగారు.

కేశవరపు కామరాజుగారు.

కోకా వేంకటసుబ్బారావు నాయఁడుగారు.

ఓలేటి వేంకటరామశాస్త్రిగారు, శతావధాని.

పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులుగారు.

పిళ్ళారిసెట్టి రంగబ్రహ్మరావునాయఁడుగారు.

## కాకినాడ-ఆంధ్రసాహిత్యపరిషత్తులో వెలకు దొరకు గ్రంథములు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | విప్రనారాయణచరిత్రము-చదలువాడ మల్లయ్యకవి | — | రు | 0 | 8 |
| 2 | జైమినిభారతము-వచనము-వేంకటకృష్ణప్పనాయఁడు | — | ... | 0 | 12 |
| 3 | కవిజనాశ్రయము-వేములవాడ భీమకవి | — | ... | 0 | 10 |
| 4 | చంపూరామాయణము-ఋగ్వేదికవి వేంకటాచలపతికవి | — | ... | 1 | 0 |
| 5 | నీతిసీసపద్యశతకము-తాళ్ళపాక పెదతిరుమలార్యుఁడు | — | ... | 0 | 2 |
| 6 | యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనము-జ రామయ్యపంతులుగారు | | ... | 0 | 8 |
| 7 | జ్యోతిశ్శాస్త్రసారము-శ్రీమాన్ కపిస్థళం కృష్ణమాచార్యులుగారు | | ... | 0 | 8 |
| 8 | జ్ఞానప్రసూనాంబికాశతకము-శిష్టు సర్వశాస్త్రికవి | — | ... | 0 | 2 |
| 9 | సర్వేశ్వరశతకము-యథావాక్కుల అన్నమయ్యగారు | — | ... | 0 | 3 |
| 10 | కావ్యాలంకారచూడామణి-విన్నకోట పెద్దయకవి | — | ... | 0 | 8 |
| 11 | అకారాద్యముద్రిత గ్రంథసూచిక | — | ... | 0 | 8 |
| 12 | ప్రాకృతభాషోత్పత్తి-శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు | | ... | 0 | 12 |
| 13 | శివతత్త్వసారము-మల్లికార్జునపండితారాధ్యులు | — | ... | 0 | 12 |
| 14 | చంద్రభానుచరిత్రము-తరిగొప్పుల మల్లన్నకవి | — | ... | 1 | 0 |
| 15 | శివరాత్రిమాహాత్మ్యము-శ్రీనాథమహాకవి | — | ... | 0 | 12 |
| 16 | ఆర్యభాషావిభాగము-శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు | | ... | 0 | 8 |
| 17 | హ్రస్వరంగములు-క్రొత్తపల్లి సూర్యరావుగారు | — | ... | 0 | 8 |
| 18 | నారసింహపురాణము—ఉత్తరభాగము-హరిభట్టు | — | ... | 1 | 0 |
| 19 | మన్నారుదాసవిలాసనాటకము—రంగాజమ్మ | — | ... | 0 | 8 |
| 20-21 | కాళిందీకన్యాపరిణయము (రెండుభాగములు) అహోబలపతి | | ... | 1 | 4 |
| 22 | రెడ్డినాటి రెండుశాసనములు | — | ... | 0 | 4 |
| 23 | ఆంధ్రధాతుమాల—చిన్నయసూరి | — | ... | 0 | 12 |
| 24 | శాసనపద్యమంజరి | — | ... | 0 | 12 |
| 25 | శతకసముచ్చయము (ప్రథమభాగము) | — | ... | 0 | 12 |
| 26 | పరిషత్పుస్తకభాండాగారము. (ద్వితీయభాగము) | — | ... | 0 | 8 |
| 27 | సూత్రాంధ్రవ్యాకరణములు—చిన్నయ్యసూరి | — | ... | 0 | 8 |
| 28 | రసాభరణము—అనంతకవి. | — | ... | 0 | 8 |
| 29 | ఆంధ్రశబ్దచింతామణి-బాలసరస్వతీకృతాంధ్రటీకోపేతము | — | ... | 0 | 8 |
| 30 | షోడశకుమారచరిత్రము-వెన్నెలకంటి అన్నయ్య | — | ... | 0 | 8 |
| 31 | హంససందేశము-కల్లూరి వేంకటరామశాస్త్రిగారు | — | ... | 0 | 2 |
| 32 | శతకసముచ్చయము (ద్వితీయభాగము) | — | ... | 0 | 10 |
| 33 | రాయవాచకము | — | ... | [illegible] | [illegible] |
| 34 | సింహాసనద్వాత్రింశిక-ద్వితీయభాగము-గోపరాజకవి | — | ... | 0 | 10 |
| 35 | నిఘంటుచరిత్రము-శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు | | ... | 0 | 4 |
| 36 | ఆంధ్రకౌముది-గణపవరపు వేంకటపతికవి | — | ... | 0 | 8 |
| 37 | బాలభారతము-(అగస్త్యకృతమునకుఁ దెనుఁగు) క్రొత్తపల్లి సూర్యరావుగారు | | ... | 0 | 4 |
| ౧ | Dravidian Lexicography జయంతి రామయ్యపంతులుగారు | | ... | 0 | 8 |
| ౨ | Defence of Literary Telugu జయంతి రామయ్యపంతులుగారు | | ... | 0 | 8 |
| ౩ | చాటుధారాచమత్కారసారః-(సంస్కృతము) | — | ... | 0 | 8 |
| ౪ | ఉత్తరరామచరిత్రము-జయంతి రామయ్యపంతులుగారు | — | ... | 1 | 0 |
| ౫ | అమరుకము-సాంధ్రము-జయంతిరామయ్యపంతులుగారు | — | ... | 1 | 0 |
| ౬ | సాంబోపాఖ్యానము- రామరాజు రంగప్పరాజు | — | ... | 1 | 0 |

శ్రీ

# ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక.

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

**(Journal of the Telugu Academy·)**

సంపుటము. ౨౪ { యువనామసంవత్సరము. ఆశ్వయుజకార్తికమాసములు. } సంచిక ౪.



కాకినాడ:

క్రొత్తపల్లి సూర్యారావుచేఁ బరిషత్కార్యాలయమునఁ బ్రకటింపఁబడినది.

చందా, పోష్టువ్యయములతో సంవత్సరమునకు రు. 3-౦-౦.

విడిసంచిక రు ౦-౮-౦.

1935-అక్టోబరు, నవంబరు మాసములు.

# విషయసూచిక.

# ఆంధ్రసాహిత్య
# పరిషత్పత్రిక.

త్రైమాసిక.

మూడునెలల కొకసారి ప్రకటింపఁబడును.

| | | |
|---|---|---|
| సంపుటము ౨౮. | యువనామసంవత్సరము. ఆశ్వయుజ కార్తికమాసములు. | సంచిక ౪. |


## ఆన్ధ్రభాషాభివర్ధక సూక్తములు.


— పుల్య ఉమామహేశ్వరశాస్త్రిగారు. —


---

శ్లో. శబ్దబ్రహ్మమయం జ్యోతి శ్శాశ్వతం సముపాస్మహే ।
    అవిద్యాయ త్తిరోధానా ద్యత్ స్ఫూర్తి స్సర్వవృత్తిః పరా॥

స్వస్తి శ్రీమదాన్ధ్రవాఙ్మయాభివృద్ధికై నిరన్తరముగఁ జిరకాలమునుండి పాటుపడుచున్న యాన్ధ్రసాహిత్యపరిషద్యమహాశయులకు ను వయస్సున వృద్ధులయ్యు నుభయభాషాకవితావధూటీగాఢపరిరంభణమున నతియువకు లగుచు నిరన్తరవిబుధవాణీవిలాసలాలసులై యాన్ధ్రధరణీరమణీమణీతిలకాయమాను లగు నేతదాన్ధ్రసాహిత్యపరిషదధ్యక్షమహాశయు లైన బ్రహ్మశ్రీ శ్రీమదవధానిశిరోమణి శ్రీ కాశీ కృష్ణాచార్యులువారికిని దోయిలించి నావన్దనసహస్రములు సమర్పింపకుండ నాలేఖిని ప్రస్తుతాంశమును లిఖించుట కెట్టులు గడంగును. మహాభాగులారా! ప్రస్తుతము మనయాన్ధ్రదేశమున సహజమగుస్వభాషాభిమానముచే మనయాన్ధ్రవాఙ్మయము నభివృద్ధిచేయుతలంపున ననేకసంఘము లేర్పడి బహువిధముల నందులకై గొప్పయత్నములం జేయుచుఁ బాటుపడుచుండుట యేయాన్ధ్రశబ్దాభిధేయునకు ముదము నొడఁగూర్పకుండును?- అందున నీపరిషత్తు ప్రథమ యనుట నిర్వివాదము- తక్కుంగల పరిషత్తులు ను సంఘములు ను గూడ స్వోద్దిష్టానుసారము

వాఙ్మయాభివృద్ధికై యత్నించుచున్నవి కాని యింతవఱ కట్టియభివృద్ధియం గానుపించుటలే దని సాహసించి చెప్పవలసి వచ్చినందులకు క్షమింతురుగాక. బిరుదముల నొసంగుటయే యభివృద్ధిమార్గ మని కొందఱును, పత్త్రికల స్థాపించుటయే యభివృద్ధినిదాన మని కొందఱును నవలలు నాటకములు మున్నగు గ్రంథముల నిర్మించుటయే తత్సాధన మని కొందఱును, పదములు పాటలు మున్నగువాని నిర్మించుటయే యభివృద్ధ్యుపాయమని కొందఱును, వైదేశికసంప్రదాయానుసారము గ్రంథములను రచించుటయే తత్సాధన మని కొందఱును గ్రామ్యభాష నతిసులభశైలిని గ్రామీణు లగువారికిం దెలియునట్లు శాస్త్రీయవిధినిషేధముల విసర్జించి స్వేచ్ఛగాం గల్పితకథలతో గ్రంథముల వ్రాయుటయే యభివృద్ధిసాధన మని కొందఱును నమ్మి యట్లు చేయుచున్నారు. చిరకాలముక్రిందట నే స్థాపించి పని చేయుచున్న యీపరిషత్తువారు మాత్రము ప్రాచీనాముద్రితాంధ్రసత్ప్రబంధముల సేకరించి చక్కగ ముద్రించి ప్రకాశింపఁజేయుటయు నుభయభాషాపండితుల వ్యాసరాజములతో విరాజిల్లు చక్కనిపత్త్రికారాజమును బ్రకటించుచుండుటయు నిన్నిటికన్న నీపరిషత్తున కంతకును మకుటభూషణ మననొప్పు శ్రీసూర్యరాయాంధ్రబృహన్నిఘంటునిర్మాణముం జేయుటయు మున్నగుఘనకార్యముల నాచరించుచున్నారు. కాని యీపను లన్నియుం గూడ నుద్దిష్టాభ్యుదయముం జేకూర్చునవి యని నొక్కివక్కాణింపం దగినవి కా వని నాయాశయము. కారణము- ఈపరిషత్తువారిచేం గాని యితరులచేం గాని ప్రకాశింపఁజేయంబడిన ప్రాచీనాంధ్రసత్ప్రబంధములం బదార్థవాక్యార్థాది విజ్ఞానపూర్వకముగ నధ్యయనము చేయువార లున్నప్పుడుకదా వీనికి సాఫల్యము చేకూరును. అట్టియధ్యయనము దేశీయకళాశాలావిద్యావిధాన మున్నప్పుడు కాని యెటులు తటస్థించును. ప్రస్తుత మట్టివిద్యావిధానము లేకపోవుటయే గాక తాదృశవిజ్ఞానవినాశక మగువిధానమే యేర్పడియుండుట యందఱకుం దేటతెల్లమే- ఏవాఙ్మయ మభివృద్ధి నొందవలయు నని యెంచినను దానిస్వరూపమును శాస్త్రీయమర్యాదలతోం దెలియంజేయు నధ్యయనవిధాన ముండుట యావశ్యకము. ఏవాఙ్మయమునం దైనను వాక్యార్థజ్ఞానమావశ్యకమైనపుడు పదార్థజ్ఞానము దానికావశ్యకము. పదార్థజ్ఞానమునకు విశిష్టపదార్థనిర్ణాయకము లగు నిఘంటువులయొక్కయుం బ్రకృతిప్రత్యయరూపావాన్తరార్థనిర్ణాయక మగువ్యాకరణాధ్యయనము ముఖ్యము. పిమ్మట నొక పదార్థమునకుం బదార్థాన్తరముతో నన్వయ మెట్లు చేయవలెనో నిర్ణయించు న్యాయ

శాస్త్రముయొక్క యధ్యయన మావశ్యకము. పిమ్మట ప్రకరణసాన్నిధ్యాదుల వలన నెట్టిసందర్భములలో నెట్టు లెట్టులు పదార్థముల నన్వయింపవలెనో తెలిసికొనుటకుఁ గొన్ని యాంధ్రవాఙ్మయకావ్యముల యధ్యయనమును నత్యన్తావశ్యకము. ఇన్నిటిని గురుశిక్షాపూర్వకముగ నధ్యయనముఁ జేసినఁ గాని యాంధ్రవాఙ్మయమునందలి వాక్యార్థ మవగతము కానేరదు. వాఙ్మయస్వరూప మంతకన్న దెలియదు. ఇట్టిస్థితిలో మనయాంధ్రవాఙ్మయము సంస్కృతభవసంస్కృతసమదేశ్యగ్రామ్యభేదములఁ జతుర్విధపదకదంబకలితమై యుండుటచేత నందునను దత్సమబహులమై యుండుటచేతను సంస్కృతాంధ్రభాషాద్వయపరిశ్రమ చేసినఁ గాని యవగతము కాదు. ఈయుభయభాషలలోను నెరుక వ్రాసినదాని భాషాస్వరూపపరిజ్ఞానమాత్రోపయుక్తమగునట్టి వ్యాకరణకోశకావ్యాదుల నధ్యయనముచేసి తీరవలెను. ప్రాచీను లట్టిపరిశ్రమముఁ జేసియున్నటుల వారిగ్రంథములే చెప్పుచున్నవి. కొంతకాలమునకుఁ బూర్వమువఱకును మనదేశమున నుభయభాషాకావ్యములఁ జదువుచుండు సంప్రదాయ మంతరించినదే- ప్రస్తుతము కలిప్రాబల్యమున మనవేషములు నాచారములును ధర్మములు నెట్లు విపరీతము లైనవో యగుచున్నవో యట్లే భాషాప్రపంచము కూడ విపరీతమై యపభ్రంశముగాఁ బేర్కొనఁబడిన గ్రామ్యమునకే ప్రాబల్య మేర్పడి విలువ కల "గ్లేజు" కాగితములమీఁద ముద్దులొలుకు నక్షరములతో నెంకిపాటలును తందానపదములు గొల్లసుద్దులు దంపుళ్లపాటలు పడవపాటలు మున్నగు నపభ్రంశవాక్యములు ముద్రింపంబడుచున్నవి. లక్షల కొలఁది ద్రవ్యమును మేధావు లగుకవిరత్నముల మేధావిశేషములు నందులకే వినియోగపడుచున్నవి. ఇట్టిమార్గమే యభివృద్ధిమార్గ మని నిశ్చయించుచు మనము భాషాసేవకుల మని యుఁ గృతార్థుల మని యు భావించుచున్నారు. ఇట్టిస్థితిలో మనయాంధ్రభాష తనతల్లితో పాటు నన్నయతిక్కనాదితనయరత్నములం దలంచికొనుచుఁ బొరలి పొరలి వచ్చుచున్న శోకము నాఁపికొనలేక గన్నీరు గార్చుచు వృద్ధదశకు వచ్చిన మిమ్ములఁ బరికించి శ్వానాననవానములు[1] గా నున్న యీయువకపుత్రాభాసుల చర్యల నివేదించుచున్నయది. కావున నాంధ్రవాఙ్మయము నభివృద్ధికిం దేఁదలఁచిన నేపారిషద్యులయిన నేసంఘములవారయిన నామె మొఱ, నాలకించి చక్కని యుభయభాషాపండితుల సిద్ధముచేయ ననువగు విద్యావిధానము నేర్పఱచి యట్టు లధ్యాపింపఁజేయుట ముఖ్యావశ్యకము. మఱియు

1. కుక్క-మూతి పిందెలు.

సనాతనసంస్థగా నేర్పడి పనిచేయుచున్న యీపరిషత్తువారు నిట్టిసదభిప్రాయము కలపరిషదస్తరములవారును వెంటనే యుభయభాషావిద్వత్పరీక్షాసంస్థల నేర్పఱిచి ప్రాచీనసంప్రదాయానుసారము సంస్కృతాంధ్రసాహిత్యగ్రంథములను మధ్యమోత్తమ కక్ష్యలతోఁ బాఠ్యములుగా నేర్పఱచి బాగుగఁ బరీక్షింపఁజేసి యందుత్తీర్ణులగువారికి సార్థక బిరుదముల నుచితసత్పారితోషికముల నొసంగుచు నుభయభాషాపండితమండలీమండితమ్మును గా నాంధ్రదేశము నొనర్చుటయే యాంధ్రభాష నభివృద్ధిపఱుచుటకుఁ బ్రస్తుతస్థితిలో ననువగు గొప్పమార్గ మని నాయాశయము- మఱియుఁ బౌరాణికులు హరికథకులు మున్నగువారికిఁగూడ నైషధాన్తకావ్యములును సిద్ధాన్తకౌముదియు ముక్తావల్యన్తతర్కప్రకరణములును ఆన్ధ్రకావ్యపంచకమును నన్నయభట్టీయాద్యాన్ధ్రవ్యాకరణగ్రంథములును అమరకోశవిశ్వకోశాన్ధ్రనామసంగ్రహాదులును మధ్యమశ్రేణిగా నేర్పఱచి యందు నిశితముగఁ బరీక్షించి యందుత్తీర్ణులగువారి నుత్తమశ్రేణి కథకులనుగా నిర్ణయించుట యత్యంతావశ్యక మనియు నిట్టివారిని దయారుచేయుపకున్నచో నితరమార్గముల నెన్నిటి నవలంబించిన నాంధ్రవాఙ్మయ మభివృద్ధి నొందనేర దనియు నానిశ్చితాభిప్రాయము. సర్వాంతర్యామి యగు సర్వేశ్వరుఁడు చిరకాలమునుండి యాంధ్రవాఙ్మయాభివృద్ధికై నిరంతరముగఁ బాటుపడుచున్న యీయాంధ్రసాహిత్య పరిషత్సభ్యుల నిద్విషయమున వెంటనే ప్రేరేపించి యిమ్మహాకార్యమునకుఁ గడంగఁ జేసి యాంధ్రవాఙ్మయాభివృద్ధికయి దేశమునకు మార్గదర్శులఁ గావించుఁగాత. ఆంధ్రవాణి సర్వావయవవిభూషణములతోఁ జక్కఁగ భూషింపఁబడి యలరారుఁగాత. ఆంధ్రదేశీయసారస్వతసేవకాభివర్ధకసంఘముల కిమ్మార్గము రుచించి కార్యాచరణమునకుఁ గడంగునట్లు సర్వేశ్వరుఁ డనుగ్రహించుఁ గాత.

---

కొఱవి గోపకవిరాజ.

# స్వాగతము.

— పండితారాధ్యుల నాగభూషణముగారు, అమలాపురము. —

సీ. శ్రీమత్సరస్వతీసింహాసనాయిత-ప్రాపితనిజముఖాంభోజులార!
నానామహీధవాస్థానకాసారవిహార్తృవిద్యాహంసలార!
రసవత్ప్రబంధనిర్మాణనిష్ణాతకళాప్రముదితాఖిలబుధక్రవరులార!
వివిధావధానవిభవసచ్చాతురీసముపార్జితకీర్తివిస్తారులార!
శ్లాఘనీయవిమర్శనచతురులార, సరసవాగ్ధోరణీసుధాసారవర్ష
తోయసారస్వతాచ్ఛకేదారులార, స్వాగతము! స్వాగతము! మీకు స్వాగతంబు!

ఉ. పాయనివేడ్కతో నిటులు భాషయెడం గలగౌరవంబుచే
స్వీయసుఖంబుల న్గణనసేయక కొంకించుక యేఁగుదెంచి కీ
మాయమలాపురంబునకు మమ్ముఁ గృతార్థులఁజేయుపొంటె నో
శ్రీయుతులార! మానతులఁ జేకొనుఁ డీయవె యాదరంబునన్. 2

సీ. సకలసౌకర్యముల్ సమకూరియుండిన స్వగృహంబులను వీడి వచ్చినారు
ఒడ్డులనొరసి పెల్లురవడిమైఁ బాఱు తటినీచయంబును దాఁటినారు
ఎడనెడఁ బడుచుండు నెలగోలుజల్లుల నొత్తిడి కెట్టులో యోర్చినారు
మబ్బుపీడినయెండదెబ్బకు నందంద పైనంబులోఁ గొంత బడలినారు
ఇట్లు కరము శ్రమంపడి యేఁగుదెంచి
నట్టి మీ కర్హమౌ సపర్యల ఘటింపఁ
గలుగుదుమొ! లేదొ! యని భీతిగడలుకొనియె
నైనఁ గదరయ్య! లోపముల్ సరసులార! 3

క. సుమనోధీసచివోపమ, విమలమనీషావిశేషవిశ్రుతవిబుధో
త్తములార! మీకు రాకను, నమలపురము దోఁచె నిప్పు డమరపురంబై. 4

ఉ. ఓయనఘాత్ములార! విబుధోత్తములార! కవీంద్రులార! మీ
మీయతులప్రభావముల మేలిమిఁ గూరిచి యంతరాయముల్
వాయఁగ మేటిదోహదములన్ ఘటియించి యితోధికంబుగా
శ్రేయము లందఁ జేయఁగదరే? పరిషల్లతికామతల్లికిన్. 5

# ఆధునిక కర్ణాట కేరళ వాఙ్మయములు.

ప్రాక్తనవిమర్శవిచక్షణ, ప్రాచ్యవిద్యావైభవ, రావుబహద్దూరు ఆర్. నరసింహాచారి ఎం. ఏ. ఎం. ఆర్. ఏ. యస్. గారు కర్ణాటకసాహిత్యపరిషత్పత్రిక సం. 19. సం. 1 పు 8 యందు “భాషెయ సుధారణె” యనుశీర్షిక క్రింద నిట్లువ్రాయుచున్నారు.

‘అభిప్రాయములు హెచ్చుచోఁ బదజాలము హెచ్చవలసియున్నది. ఇందులకు నూతనపదములను గల్పింపవలయును. అన్యభాషాపదములఁ గైకొనవలయును. గ్రంథకర్తలభాషయు నాగరకులు మాటలాడుభాషయును విశేషవ్యత్యాసము నందరాదు. అట్లు వ్యత్యాసమునందుచో వేర్వేఱుగ రెండుభాష లావిర్భవించును. గ్రంథకర్తలు ప్రాచీనకన్నడమునుండి శబ్దములను, శైలిని సంధినియమములను వలయునంతవఱకుఁ గైకొనవలెను. గ్రామ్యప్రయోగముల విడనాడవలయును. శైలి సరళముగను, స్ఫుటముగ నుండవలెను. గ్రంథరచన పండితులకొఱకు మాత్రమే కాదు. సాధారణజనులకు వలయుభాష గూఢ మగుచో నర్థమగుట కష్టసాధ్యము. శైలియందు స్పష్టత యత్యావశ్యకము. ఈసందర్భమున ‘క్వింటిలియను’ యొక్క యభిప్రాయ మిట నీయఁబడినది.

“By perspicuity, according to Quintilian, care is taken not that the hearer may understand if he will, but that he must understand whether he will or not.”

[స్పష్టత యనిన వినువారి కప్రయత్నముగ నర్థ మొసఁగుట గాని ప్రయత్నపూర్వకముగ నర్థము గ్రాహ్య మగుట కాదు.]

నూతనాభిప్రాయములను వెలువరించునపుడు భాషామర్యాద నతిక్రమింపరాదు. అనావశ్యక మగుపట్టుల నన్యభాషాపదములను, రీతుల నవలంబింపరాదు. అవశ్య మగుచో నట్టివానిని గైకొనుట కడ్డులేదు. అందువలన భాషయొక్క ప్రాశస్త్యము చెడదు. భాషను పరిశుద్ధముగ నుంచుట మనముఖ్యకర్తవ్యము. ఈసందర్భమున న్యూయార్కు ‘రౌండుటేబిలు’ పత్రికయందుఁ బ్రచురింపఁబడిన యొక లేఖలోని కొంతభాగము ప్రకటించుట యుచిత మని తోఁచుచున్నది.

‘The corrupter of a language stabs straight at the heart of his country. He commits a crime against every individual of the nation for he throws poison into a stream from which all must drink. He wrongs himself first and afterwards every man and woman whose native speech he mars. It is the duty of every educated man

to guard jealously the purity of his native tongue. He who hunts down and pillories a slang phrase, a vulgarism, a corruption of any kind is a public benefactor. In the fulfilment of the sacred trust which rests on him as an educated man, he adds a stone to the bulwark of his nation's safety and greatness.'

[భాషకు మాలిన్యము నాపాదించుట దేశమునకు ద్రోహ మొనర్చుటయగుచున్నది. అట్టివాఁడు దేశమునందలి స్త్రీపురుషులయెడ నపరాధ మొనర్చుచున్నాఁడు. అతని ప్రవర్తన, మందఱు నుపయోగించు జలప్రవాహమున విషముగలుపుటవంటిది. అతఁడు తనకుఁ దాను ద్రోహ మొనర్చుకొనుటయే గాక తనభాషను మాటాడు స్త్రీపురుషుల కందఱకును ద్రోహ మొనర్చినవాఁడగును- స్వభాషయొక్క శుభ్రతను గాపాడుట ప్రతివిద్యావంతునికిని గర్తవ్యము. ఎవరు భాషయందు గ్రామ్యపదములను, బూతులను, ఇతరమాలిన్యములను జేరకుండు ప్రయత్న మొనర్తురో యట్టివారు దేశోపకారకు లగుదురు. విద్యాధికులు తమయందుంపఁబడిన యీభారమును సరిగ నిర్వహించినయెడలఁ దమదేశమున కౌన్నత్యమును, సురక్షకత్వమును దెచ్చినవా రగుచున్నారు.]

(2) కేరళవాఙ్మయమునందలి నూతనపరిస్థితులను గూర్చి కేరళసంఘమువారికుపన్యసించుచు సి. అచ్యుతమీనను గారిట్లు చెప్పియున్నారు.

‘నూతనకవులు శృంగారరసభూయిష్ఠముగఁ దమరచనముల గావించుచున్నారు. కేవలము శృంగారమును గూర్చియే గాక యితరవిషయములను గైకొని వీరు తమగ్రంథముల రచియింపనగును. తాము రచియించుపద్యములనుగూడ వీరు ‘Mysticism’ అనుపేర బాలకుల కర్థముగాకుండ రచించుచున్నారు. అదితప్పు. కాళిదాసుని కవిత్వమువలెఁ గవిత్వము విస్పష్టముగ నర్థ మగుచుండవలెను. విమర్శకుల ప్రతిభావిశేషముచే విశేషార్థముల నీయవచ్చును. ఈసందర్భమునఁ బాశ్చాత్యుల ననుకరింపరాదు.’

(3) కన్నడ, కేరళములను గూర్చిన పైయభిప్రాయము లాంధ్రమునకు వర్తించు నని సహృదయులకు గోచరింపకమానదు. నేఁటి నవాంధ్రరచనములఁ గొనినచో నందలి శృంగారము, అన్యభాషాసంప్రదాయము, నవ్యదేశీయములు, Mysticism అనుపేర నూతనకవు లర్థముగాకుండ నొనర్చురచనములు, గ్రామ్యభాషాప్రయోగములు, భాష కపకృతిని గావించుచున్న వనుట విస్పష్టము. శైలియందు స్పష్టతయు, సరళతయు నావశ్యకములు.

# ఆముక్తమాల్యద రచనాకాలము.

—: కుందూరి యీశ్వరదత్తుగారు, బి. ఏ. కాకినాడ :—

---

ఆంధ్ర ప్రౌఢప్రబంధకావ్యములలో నొకటి యగు నాముక్తమాల్యదయొక్క రచనాకాలమును గూర్చి మొదట కృషి యొనర్చినవారు కీర్తిశేషు లైన శ్రీలక్ష్మణ రావుగారు. వారు కృష్ణరాయల దిగ్విజయయాత్రలను గూర్చి వ్రాయుసందర్భమున నాముక్తమాల్యదారచనాకాలనిర్ణయమును గావించి మార్గదర్శకు లయిరి.* ఆనిర్ణయమునం దొకపొరపాటునకు వారు లోనౌటచేత మరలనీవిషయము వ్రాయ వలసివచ్చినది.

గ్రంథనిబంధనకాలనిర్ణయమునకుఁ దద్గ్రంథములోని ప్రథమాశ్వాసమునందలి కృతిపతిప్రశంసయును, నాశ్వాసాంతపద్యములును ముఖ్యసాధనములు. ప్రథమాశ్వాసములో రాయలు తానిష్టదేవతాస్తుత్యాదిక మొనర్చినపిమ్మట గ్రంథరచనాకారణము నిట్లువ్రాసెను.

" అని యిష్టదేవతావందనంబుఁ జేసి మున్నే కళింగదేశవిజిగీషామనీషం దండెత్తి పోయి విజయవాటిం గొన్నివాసరంబు లుండి శ్రీకాకుళనికేతనుం డగు నాంధ్రమధుమథను సేవింపఁ బోయి హరివాసరోపవాసం బచ్చటఁ గావింప నప్పుణ్యరాత్రచతుర్థయామంబున,

సీ. నీలమేఘముడాలు డీలుసేయఁగఁజాలు మెఱుఁగుఁజామనచాయ మేనితోడ
నరవిందములకచ్చు లడఁగించు జిగిహెచ్చు నాయతం బగుకన్నుదోయితోడఁ
బలుఁగురాయనిచట్టుపలవన్నెనొరవెట్టు హాంబట్టు జిలుఁగురెంటంబుతోడ
నుదయార్కబింబంబు నొఱపు విడంబంబు దొరలంగ నాడు కౌస్తుభముతోడఁ
దమ్మికేలుండఁ బెఱకేల దండయిచ్చు, లేములుడిపెడు లేఁజూపులేమతోడఁ
దొలఁకుదయఁదెల్పుచిఱునవ్వుతోడఁగలఁద,దంధ్ర జలజాక్షుఁడిట్లనియానతిచ్చె.

సీ. పలికితుత్ప్రేక్షోపమల జాతి పెంపెక్క రసికు లౌనన మదాలసచరిత్ర
భావధ్వనివ్యంగ్యసేవధిగాఁగఁ జెప్పితివి సత్యావధూప్రీణనంబు
శ్రుతిపురాణోపసంహిత లేర్చి కూర్చితి సకలకథాసారసంగ్రహంబు
శ్రోత్రఘుచ్ఛటలు విచ్చుగ రచించితి సూక్తి నైపుణి జ్ఞానచింతామణికృతి
మఱియు రసమంజరీముఖ్య మధురకావ్య, రచన మెప్పించికొంటిగీర్వాణభాష

---

* ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక. సప్తమసంపుటము. పుట. 213.

నాంధ్ర భాషయసాధ్యంబె యుండునొక్కొ, కృతివినిర్మింపుమిఁక మాకుఁ బ్రియముగాఁగ."

పై వాక్యముల ననుసరించి రాయలు తనదిగ్విజయయాత్రాసందర్భమున శ్రీకాకుళము వెళ్ళినట్లును, శ్రీకాకుళనికేతనుఁ డగు నాంధ్రవిష్ణువును దర్శించినట్లును, దేవుని సేవించినదిన మేకహరివాసర మైనట్లును దెలియుచున్నది. కృష్ణరాయలు శ్రీకాకుళేశ్వరుని సేవించినట్లు మన కొక ప్రబలనిదర్శనము రాయ లాదేవుని కిచ్చిన ధర్మశాసన మున్నది* ఆశాసనప్రకారము రాయలు శాలివాహన శకసంవత్సరము 1440 అగు బహుధాన్యనామసంవత్సర కుంభసంక్రమణపుణ్యకాలమునందు దేవుని దర్శించి, యాదేవుని నిత్యనైవేద్యములకు, అంగరంగవైభవాలకు, కొండపల్లి వినుకొండ సీమలలోని కొన్ని గ్రామములను ధారాపూర్వకముగ నిచ్చెను. ఆంగ్లమానము ప్రకారము బహుధాన్యసంవత్సరమునందలి కుంభసంక్రమణపుణ్యకాలము క్రీ. శ. 27-1-1519, A. D. అగుచున్నవి. ఆముక్తమాల్యదలోని వాక్యము ననుసరించి, రాయలు దేవుని సేవించిన దిన మేకహరివాసరము. ఇచ్చట హరివాసరశబ్దమును హరిదినమునకుఁ బర్యాయపదముగ రాయలు వ్రాసియుండెను. లెక్క వేసి చూడఁగా, కుంభసంక్రమణపుణ్యకాలమును, బహుధాన్య సంవత్సర మాఘ బహుళైకాదశియు నొక్కదినముననే సంభవించెను. కాఁబట్టి రాయలు వ్రాసినవాక్యము సత్య మని తెలిసికొన్నారము.

గ్రంథనిబంధమునకుఁ దలపెట్టవలసినయవసర మాపుణ్యదినముననే కల్గెను. ఆదినము మనసారస్వతమునకు సహిత మత్యంత పుణ్యదిన మని మనవి చేయుచున్నాఁడను.

ఆముక్తమాల్యదలోని యాశ్వాసాంతపద్యములు కర్ణాటకసామ్రాజ్యచరిత్రకారున కత్యంతోపయోగకరములు. గ్రంథరచనాకాలనిర్ణయమున కమూల్యమైన సహకారములు. ప్రథమాశ్వాసాంతమున, నెల్లూరి జిల్లాలోని యుదయగిరిముట్టడియును, ద్వితీయాశ్వాసాంతమునఁ గొండవీటిదుర్గసాధనమును, తృతీయాశ్వాసాంతమునఁ గొండపల్లివిజయమును, చతుర్థాశ్వాసాంతమున సింహాచల పొట్నూరివిజయస్తంభనిర్మాణమును, పంచమాశ్వాసాంతమునఁ గంబావిపురీవప్రవలయవిధ్వంసగాథయు, షష్ఠాశ్వాసాంతమున నైరామనపట్టణ విధ్వంసచరిత్రయు, మనోహరముగా రాయలు వర్ణించెను. అవి యన్నియు సుప్రసిద్ధచరిత్రాంశములు. ఇందలి వర్ణనచిత్రములో రాయలు తన దిగ్విజయయాత్రలను గాలక్రమానుసారముగాఁ బ్రథమ, ద్వితీయ, తృతీయ, చతుర్థ, పంచమ, షష్ఠాశ్వాసములలో వరుసగ వర్ణించి, తాను గవియును, జరిత్రకారుఁడు నయ్యెను.

* No. 981 South Indian Inscriptions. Vol. IV.

## నైరామనయుద్ధము.

పై యుద్ధవర్ణనములలో రాయలు కాలక్రమమును బాటించె నని చెప్పితిని. ఇంతవఱకును రాయలు రాయచూరుయుద్ధమును జేయలే దని చరిత్రకారుల యభిప్రాయము. పోర్చుగీసు చరిత్రకారుఁడైన న్యూనిజ్ రాయచూరుయుద్ధమును దాను గన్నులారఁ జూచినాఁడేమో యనునట్లు యుద్ధవర్ణనమును గావించెను. రాయలు చేసిన్న నైరామనయుద్ధమె రాయచూరుయుద్ధస్మరణ మని స్పష్టముగఁ జెప్పుటకుఁ బ్రబలప్రమాణ మున్నది ఈ నైరామన మేమో తెలియక చరిత్రకారు లూరకుండిరి. ఇది రాయచూరు జిల్లాలోని, మాన్వీపురమున కీశాన్యమూల నున్నగ్రామము. నైరామనమున కిప్పటిపేరు నిరుమానూరు* స్యూయెల్ దొరవా రీయుద్ధకాలనిర్ణయమును క్రీ. శ 19-5-1520 A. D. గా నిర్ణయించిరి.[1] ఇదియె రాయల కడపటియుద్ధముగ న్యూనిజ్ చెప్పియున్నాఁడు. రాయలును, ఆముక్తమాల్యదలోఁ జెప్పుకొన్నాఁడు. కాఁబట్టి రాయలు, ఆముక్తమాల్యద రచనమును దలపెట్టినదినము క్రీ. శ. 27-1-1519. తా నొనర్చిన దిగ్విజయముల నన్నిటినిఁ జేసి, కడపటిది యగు నైరామన (రాయచూరు) యుద్ధమును సహితమును బ్రశంసించియుండుటచేత, రాయలు గ్రంథమును క్రీ. శ. 1520 సం॥ లో గాని, క్రీ. శ. 1521 సం॥ లోఁ గాని పూర్తి గావించియుండును. రాయచూరు యుద్ధానంతరము రాయలు విజయనగరములో విచ్చేసినట్లును, వెంటనే మరల ఏదిల్ షాహపై దండువెడలి, కులబర్గాపట్టణమును బట్టుకొని యందలి బహమనీ రాజపుత్త్రులను జెఱనుండి విడిపించినట్లును న్యూనిజ్ వ్రాయుచున్నాఁడు. [2]న్యూనిజ్ వ్రాఁతలే సత్యము లని నమ్ముట కెక్కువ యవకాశము గలదు. ఆతఁడు రాయల కత్యంతసమకాలికుఁడు. పైవృత్తాంతములు జరిగిన పదిపండ్రెండు సంవత్సరములలోనే న్యూనిజ్ తనకుఁ దెలిసిన విషయములు వ్రాసియుండెను. రా

---

* నైజాముగవర్న మెంటివారి ఆర్కి యాలజీ శాఖాధ్యక్షు లగు 'యజ్ డానీ' గారు వ్రాసినలేఖను బొందుపఱచుచున్నాను.

" The Modern name of ' Nairamanam ' is ' Nirumanuru, ' a small village about seven miles N : E, of Manvi in Raichur District "

ఈవిషయమును దెల్పినందులకు వారికి నే నెల్లపుడును గృతజ్ఞుఁడను.

1. Forgotten Empire Page 147.

2. Forgotten Empire. Page 357. " Full of fury at this he entered to Kingdom of Daquem and marched against to city of Culbergura and destroyed it and razed to fortress to the ground, and the same with many other places."

యలు, ఆముక్తమాల్యదలో సింహాచల పొట్టునూరి విజయస్తంభ ప్రశంస యొన ర్చినవెంటనే, రెండు నూతనవిషయములను జేర్చానెను.

... ... ... ...

తే. తిరుగు హరిపురిసురతరుసురల మరగి, బహుళహళహళి భృతకలబరిగినగర
నగరపురవరపరిబృఢ జవనయవన, పృతన భవదసి నని దెగి కృష్ణరాయ.

మ. అలుక స్ఫోటకఘట్టికాఖురపుటీహల్య స్ఖురాసానిపు
చ్ఛలు వోదన్ని, చలచ్ఛమూగజమదాసారప్లుతిఁ గీర్తిపు
ష్కలసస్యం బిడి, యేకధాటి బళిరా కట్టించి తౌద్రుష్టికే
దులఖానోగ్రకపాల మర్థపహరిద్భూభజాంగల శ్రేణికిన్.

ఏదులఖాను సంబంధమైన యీకడపటిపద్యమును షష్ఠాశ్వాసాంతపద్యమైన నైరామనయుద్ధప్రశంసయుఁ బై నుదహరించిన కలుబరిగీనగరవిజయంబులు నొక్కసారి జరిగినవె. ఈయేదులఖానుఁ డెవరో యని శ్రీలక్ష్మణరావుగారు విపులముగఁ జర్చించిరి. నాయభిప్రాయము, రాయచూరుయుద్ధములో రాయలు, ఏదిల్ షాహ సేనానులలో ముఖ్యుఁడైన సలబత్ ఖానుని బట్టుకొని చెఱయం దుంచినట్లును దరువాత నతనిశిరచ్ఛేదనము రాయ లాజ్ఞాపించినట్లును న్యూనిజ్ వ్రాసియున్నాఁడు. అతఁడే యీయేదులఖానై యుండనోపును. ఇది నాయూహ. న్యూనిజ్ వర్ణనమును, బైపద్యమునందలి వృత్తాంతమును సరిపోవుచున్నవి.*

పై విషయము లన్నింటిని సమన్వయించుకొనినచో, రాయచూరుయుద్ధానంతరమును గలుబరిగీనగరపురవిజయానంతరమును, రాయలు విద్యానగరమందు విచ్చేసి, సుఖాసీనుఁడై యుండి, కావ్యమును, బూర్తి గావించియుండును. క్రీ. శ. 1520 సంవత్సరము రాయ లీసమరసంరంభము లైనపిమ్మట క్రీ. శ. 1521 సంవత్సరములోఁ గావ్యమును బరిసమాప్తిని గావించె నని యూహించుటయే సమంజస మని తోఁచెడిని. ఇందలి సందర్భాసందర్భములను బరిశోధకులు చర్చించి, విషయనిర్ణయమును గావింతు రను నమ్మకముతో ముగించుచున్నాఁడను.

* Forgotten Empire Pages 341, 342, 356. "The King...........angrily commanded that Salebatacao who was then in Bisnaga, should be beheaded ; and this was at once done as the message arrived."

# శ్రీనాథకవి ప్రయోగములు.

— బండారు తమ్మయ్యగారు, అమలాపురము. —

---

మ. స్మరసంహారకపాదపద్మయుగళీసంసేవనోత్కృష్టుఁ డై
సరసప్రాకటసత్కవిత్వగరిమన్ సాటెవ్వరున్ లేక సు
స్థిరమౌ కీర్తిని గాంచినట్టి కవితాశ్రీనాథు శ్రీనాథు మ
ద్గురునాథున్ మదిలోన నెల్లపుడుఁ గొల్తున్ భక్తివిస్ఫూర్తిమై.

కవిత్వమునకును గవిజీవితమునకు నొకవిధమగు నవినాభావసంబంధము న్నదనుట నిర్వివాదాంశము. ఒకకవి కవితను గాని యందలిపదప్రయోగములను గాని లెస్సగా గ్రహింపవలె నన్నచో నాతనిదేశము, కాలము, కులము, శీలము, మతము, ఆశ్రయము నప్పటియాచారవ్యవహారములు మున్నగు తజ్జీవితసంబంధ విషయములను విమర్శించి తెలిసికొనుట యావశ్యకము. శ్రీనాథుఁడు పదునేనవ శతాబ్దియందు వెలసిన ప్రఖ్యాతాంధ్రకవి. అనన్యసామాన్యకవితాపాండిత్యశౌండీర్యమునఁ గవిసార్వభౌమబిరుదమును స్వయముగ నార్జించి యిప్పటికినిఁ జెక్కు చెదరకుండ దానిని నిలువఁబెట్టుకొనినయొకయపూర్వవ్యక్తి. ఈశ్వరశబ్దము శివుని యందువలెఁ గవిసార్వభౌమబిరుద మీతనియెడ నన్వర్థ మని చెప్పినచో నాంధ్ర వాఙ్మయమున నాతనికిఁ గలస్థానమునుగూర్చి వేఱుగ వివరించుట యనవసరము. ఈతనికవితామహిమము,

సీ. "పంపావిరూపాక్షబహుజటాజూటికారగ్వధప్రసవసౌరభ్యములకుఁ
దుంగభద్రాసముత్తుంగవీచీఘటాగంభీరఘుమఘుమారంభములకుఁ
గళసాపురప్రాంతకదళీవనాంతరద్రాక్షాలతాఫలస్తబకములకుఁ
గర్ణాటకామినీకర్ణహాటకరత్నతాటంకయుగధాళధళ్యములకు
నిర్నిబంధనిబంధమై నెనయుఁ"జాలువది—ఇఁకఁ బాండితీసంపద యన్ననో—

సీ. "శ్రుతిపురాణాగమస్మృతిసాంఖ్యసిద్ధాంతకబళనవ్యుత్పత్తిగౌరవంబు
సంస్కృతప్రాకృతశౌరసేనీముఖ్యభాషాపరిజ్ఞానపాటవంబు
పన్నగపతిసార్వభౌమభాషితమహాభాష్యవిద్యాసమభ్యాసబలము
అక్షపాదకణాదపక్షిలోదీరితన్యాయకళాకౌశలాతిశయము
పూర్వకవిముఖ్యవిరచితాపూర్వకావ్య, భావరససుధాచర్వణప్రౌఢతయును"
గలిగి విలసిల్లునది.

అతనిసువర్ణకవిత్వ మప్పటికి నిప్పటికి నెప్పటికిఁ గూడఁ గనకాభిషేకసత్కారముల నందఁగలదు. పండితమానులగుండెలు దిగ్గురనునట్లు లీతనివిజయడిండిమము కలకాలము మ్రోఁగుచునే యుండును.

మనదౌర్భాగ్యమూలమున శ్రీనాథుఁడు స్త్రీలోలుఁడు, ధనలోలుఁడు ననుదురభిప్రాయములు మనదేశమున వ్యాప్తములయి వేళ్ళునాటుకొనినవి. వీనిని స్థిరీకరించుటకుఁ బూటకంపుఁబ్రాయము లగుచాటువులు, పుక్కిటిపురాణములు, పామరులనానుడులు, ఐతిహ్యములు దక్క నమ్మఁదగిన చరిత్రప్రమాణములు గాని గ్రంథాధారములు గాని కానరావు. ఈతనిగ్రంథములను దిలకించిన నందొక్క శృంగారమే గాక సకలరసములు నందు విశేషముగ భక్తిరసమును దాండవమాడుచుఁ జదువువారికి వినువారికిఁ గూడఁ దన్మయత్వము నాపాదించుచుండును. కావుననే చేమకూరపాకమునకుఁ బ్రథమభోక్తయు, రసికకవిచక్రవర్తియు నగుతంజావూరి రఘునాథభూపాలుఁడు తనవాల్మీకిచరిత్రమున నీతని నిట్లు ప్రశంసించినాఁడు.

శా. సందర్భంబు నవార్థగర్భమగుచుం జాతుక్రియల్ మించఁగాఁ
జిందుల్ద్రొక్కుచు నిండి యంతట రసశ్రీ మెచ్చుగొల్పంగ నా
నందాంభోధితరంగముల్ బలెఁ బ్రబంధంబుల్ భువిన్నిల్పి దా
నం దెల్లంబుగఁ గీర్తిఁ గాంచి మను శ్రీనాథుం బ్రశంసించెదన్.

అట్లగుట శ్రీనాథునియందుఁ బయిని జెప్పిన దుర్గుణముల నాపాదించుట కాతనిగ్రంథములు మాత్ర మొకించుకయు సహాయకములు కాఁజాల వని వేఱ చెప్పనక్కఱ లేదు. శ్రీనాథుఁడు స్త్రీలోలుఁడు, ధనలోలుఁడు నను దురభిప్రాయములను మనమున నిడికొని యాతనికావ్యములఁ జదివినచో నందలిపదప్రయోగముల సారస్యము గోచరమయి తత్తద్విశేషపరమార్థసిద్ధి మనకు లభ్యము కానేరదనియే నాయాశయము. కావున లోకమున వ్యాప్తమయిన యీదురభిప్రాయములను గొంతవఱకయిన నిర్మూలన మొనర్చుటకయి "శ్రీనాథమహాకవి గుణతత్త్వవిచారము" అనుకవిచరిత్రవిమర్శనమును వ్రాసితిని. (అది యింకను నముద్రితము. కేవలము చరిత్రవిషయములకు సంబంధించిన యందలి యొకటిరెండుఖండములు మాత్రమే పదేండ్లక్రిందట, ఆంధ్రపత్రికాసారస్వతానుబంధములోఁ బ్రకటితములయినవి).

శ్రీనాథుఁడు భారతరామాయణములవంటి యేయుద్గ్రంథమునో కైకొని యాంధ్రీకరించి జీవితమంతయు దానికి ధారవోయక, దినదిన ప్రబంధనిర్మాణ మొ

నర్చిబహుగ్రంథములు రచించుట యాతని ధనలోలత్వమునకు నిదర్శన మని యొక బుద్ధిమంతులు వ్రాసిరి. ఇట్లే శ్రీనాథుని స్త్రీలోలత్వమును నిరూపించుటకయి యాతనిగ్రంథములలోని కొన్నిపద్యములకుఁ దమ కనుకూలములయిన విపరీతార్థములను జెప్పుచు మఱికొందఱు మహానుభావులు వ్రాసిరి. ఇట్టివ్రాఁతలకుఁ, గుశంకలకుఁ దగినసమాధానములు పూర్వోక్తగ్రంథమున వ్రాసితిని. శ్రీనాథునకు నే నర్పించుకొనిన "గురుదక్షిణానవరత్నము"లలోఁ గూడ వీనిని దిఙ్మాత్రముగ సూచించితిని. అందలియొకపద్యము మాత్ర మిట నుదాహరించెదను:—

సీ. అఖిలదుర్గుణకందమా యౌవనమునంద శివపదార్చనరతిఁ దవిలినావు
ఆగమజ్ఞానతత్త్వార్థసేవధి వయి నిగమాంతవేది వై నెగడినావు
శృంగారశివమూర్తిఁ జింతించి మది భక్తి శృంగారరసము వర్షించినావు
భవునకుఁ దద్భక్తవరునకు లేశంబు భేదంబు లేమి భావించినావు
కొనుట యిచ్చుటలు భక్తులయెడనే పోలునెంతయు ననుగుట్టు నెఱిఁగినావు
కృతులెల్ల శివభక్తతతి కిచ్చి వారిని నీవలె స్థిరకీర్తి నిలిపినావు
గీ. అట్టినిన్ను స్త్రీధనలోలుఁ డని వచింత్రు, పామరులు గొంద ఱైన నీ కేమికొదవ
బోధపడకున్నె నిజము సన్బుద్ధులకును, సుగుణగణధన్య! శ్రీనాథసుకృతిగణ్యా.

ఇంతయేల ? "ఎవ్వ రే మనుకొన్న నా కేమి కొదవ" అని యామహనీయుఁడు స్వయముగనే చెప్పికొనినాఁడు గదా ! "యద్భావం తద్భవతి'' అని పెద్దలు వచింతురు. కావున శృంగారిశేఖరుఁ డనుభావముతో నేమి, శివయోగిశేఖరుఁ డనుభావముతో నేమి, యెవ రేతెఱంగునఁ దిలకించిన నారీతిని శ్రీనాథుఁడు వారివారి భావానుగుణముగ గోచరింపనోపును. అతఁడు శ్రీనాథుఁడు గదా! అతని ప్రభావ మట్టిది కాఁబోలును. కావున నీగొడవ నింక విడిచెదముగాక.

శ్రీనాథుని గ్రంథము లన్నియు నించుమించుగ శివభక్తిప్రతిపాదకములు. ఆతనికాలము నాఁటికి వీరశైవము రాజాదరము నంది విశేషప్రచారములో నున్నది. ఆతని నాదరించిన రెడ్డిరాజులు వీరశైవులు. ఆతని కృతిపతు లందఱు వీరశైవులు. ఈశ్వరార్చనకళాశీలుండ వని గురుశంకరారాధ్యులశిష్యుఁడు మామిడి సింగనామాత్యుఁ డీతని హెచ్చరించినాఁడు. తనకును నీసింగనామాత్యునకును గూడ గోత్రకర్త యైనభారద్వాజుఁడు శివునివలన స్వయముగ నొందిన శైవదీక్ష నీతఁడు నైషధములో నిట్లు ప్రశంసించినాఁడు.

శా. "తారం బైనతపోవిశేషమున సద్యోజాతవక్త్రంబునన్
గౌరీవల్లభుచేత దీక్షగొనియోగీ స్పష్టఫలం ద్రాక్షఁ దై
తారావీథి నలంకరించెఁ గొనియొం డ్రయ్యర్థసంఘాతముల్
భారద్వాజమహామునీంద్రుఁ డగదే భక్తిం బ్రశంసింపఁగన్."

"దీయతే లింగసంబంధః క్షీయతే చ మలత్రయమ్ ।
దీయతే క్షీయతే యస్మా త్తస్మా ద్దీక్షేతి కథ్యతే॥

అని శివాగమపురాణములలో దీక్షాశబ్దము నిర్వచింపఁబడినది. శ్రీనాథుని కృతిసమర్పణములో "తస్మై దేయం తస్మా ద్గ్రాహ్యం" అను వీరశైవమతరహస్యము గర్భిత మయి యున్న దేమో యని నాయాశయము. ఇత్యాదికారణములచే శ్రీనాథుఁడు వీరశైవదీక్షితుఁ డగుబ్రాహ్మణుఁ డనఁగా నారాధ్యబ్రాహ్మణుఁ డయి యుండు నేమో యని నాకుఁ బ్రబల మయిన యనుమాన ముదయించి యందుఁ గూర్చి, ఆంధ్రపత్రిక రుధిరోద్గారిసంవత్సరాది సంచికలోఁ జిన్న వ్యాస మొకటి ప్రకటించితిని. కొందఱు సహృదయు లామోదించి నామతము నవలంబించిరి. కాని మఱికొందఱ కిది కంటకమయ్యెను. వారు నావ్యాసముపయి విమర్శనములు ప్రకటించిరి. వారిసమాధానములు సంతృప్తికరములయి నాయనుమానమును నివారింపకపోవుటచే సత్యనిశ్చయకబుద్ధితో మరల విశేషవిమర్శనపూర్వకముగ సమాధానము లొసంగితిని. అందుపయి వారు బదులిడక మౌనము నవలంబించిరి. మౌన మర్ధాంగీకారసూచక మేమో యని నేను నామత మింకను మరల్చుకొనలేను.* శ్రీనాథుఁ డేమతమువాఁడయినను గవితారసజ్ఞుల కెల్ల నారాధ్యుఁడే. ఆతఁ డారాధ్యబ్రాహ్మణుఁడయినంతమాత్రమునఁ గాని, శృంగారిశేఖరుఁడు గాక శివయోగిశేఖరుఁ డయినంతమాత్రమునఁ గాని, నా కొలికినది గాని కా దనువారికిఁ దొలఁగినది గాని లేదు. కాని కవుల పదప్రయోగముల సారస్యమును సక్రమమయిన భావములను గ్రహించుటకుఁ దక్కినజీవితవిషయములతో పాటుగా వారి మతశీలనిర్ణయముకూడ నవసర మగు నని మొదటనే మనవిచేసితిని గదా! అది తెలియంగకపోవుటచేఁ గలుగునపార్థకముల కీక్రింది దృష్టాంతములఁ

* భారతి (సం. 4 సంచి. 11) లో శ్రీయుత సి. శివయ్యశాస్త్రిగారు "కాళిదాసకవి కార్తికేయ భక్తుఁడు" అనువ్యాసమున శ్రీనాథుని నారాధ్యబ్రాహ్మణునిగ విశ్వసించిరి. కాశీఖండమునందలి సూర్యోదయవర్ణనపద్యముల విమర్శించుచు మఱియొక రాతనిని సుహర్షిగఁ దిలకించిరి. ఇట్లు నేఁటివిమర్శకులు కొంద ఱయిన విమలవినూత్నదృష్టితో శ్రీనాథు నవలోకింపఁ గల్గుటకు నావ్యాసము లే మయిన నుపకరింపఁ జాలిన చో నాపరిశ్రమము నిరర్థకము కా దని యూఱట నొందుదును.

ఉత్తగింపుడు. ముఖ్యముగ మూడు ప్రయోగములఁ గూర్చి మాత్రము ప్రస్తుతము ముచ్చటింప నెంచితిని.

1. హరవిలాసము ద్వితీయాశ్వాసములో, చిఱుతొండభక్తుఁడు, తనభక్తిని బరీక్షించుటకయి కుహనాశివయోగిరూపధారియై వచ్చిన శివుని కొఱకు సిరియాళకుమారునిఁ జంపి వంటకముచేసి యారగింపఁ బెట్టు సందర్భమున శ్రీనాథుఁ డిట్లు వ్రాసినాఁడు.

"అనంతరంబ చిగురు మునురునుం గాని నిడుపు వెడల్పుం గల కదళీఫలాశంబు నడిమియాకు నయఁ బుచ్చి పఱచి యుదకంబునం బ్రక్షాళించి యుపస్తరించి పాయసాపూపపుంభ్రేక్షు ద్రాక్షాగోక్షీరమధుశర్కరాఖ్యమృతదధిరసావళీ శాకపాక శిఖరీపానకంబులతోడ గారాపుంగొడుకుపాల మేలోగిరంబుతోడం గూడ భరితభోజనంబుగా వడ్డించి గ్రుడ్డియవ్వకు నైత మట్లే సమర్పించి, దేవ! భక్తవత్సలరూప! శివయోగీశ్వరరూప! విరూపాక్ష! యమృతాహారం బారగించి రక్షింపుమని చిఱుతొండఁడు భార్యయుం దానును భక్తితాత్పర్యవిశ్వాసపురస్సరంబుగా నమస్కరించిన——"

1927-28 సంవత్సరమున స్కూలుఫయినలు పరీక్ష కేర్పఱచిన పఠనీయ గ్రంథభాగములలో సిరియాళకథ చేరినది. అప్పుడు పయికథాభాగమందలి "భరితభోజనంబుగా వడ్డించి" అనుదానికి విద్యార్థులకుఁ బండితు లేమి యర్థము చెప్పిరో తెలియదు. కాని శ్రీనాథుఁడు శృంగారిశేఖరుఁ డనియును, అద్వైతమతస్థుఁ డనియుఁ దలంచు సుప్రసిద్ధపండితు లొక రప్పుడు భారతిలో వినోదవిమర్శ మొకటి వ్రాసి "భరితభోజనము" అనుటకు సరియైన కవిపాఠము "భృతభాజనము" అని యై యుండు నని యు నట్లు సవరించుకొనవలసిన దని యు హెచ్చరించిరి. కాలక్షేపవినోదమునకయి యొకనాఁడు భారతిని జదువుచుండఁగా నా కప్పు డీ వినోదవిమర్శనము విప్రవినోదమువలె గోచరించి యాశ్చర్యమును గలిగించెను. అంతకుఁ బూర్వమే చెన్నపురములో వెలువడు "కళ" యనుపత్రికలోఁ బ్రకటితమయిన "శ్రీనాథుఁ డారాధ్యబ్రాహ్మణుఁడు కాఁడా?" అను నాప్రతివిమర్శవ్యాసమున వీరశైవమతరహస్యముల నెఱింగిన కేవలవీరశైవులకే యెఱుకపడు "భరితభోజనము" మున్నగు వీరశైవపారిభాషికపదప్రయోగములు కూడ శ్రీనాథుఁ డారాధ్యబ్రాహ్మణుఁ డని యెంచుటకు సాధకములు కానోపు నని నేను వ్రాసి యుంటిని. పూర్వోక్తపండితు లావ్యాసమును జిత్తగించియే యుండుదురు. కాని

దానిని వారు పాటింప నిచ్చగించి యుండరు. ఈ పాఠము వీరు ప్రకటించిన యీ సవరణను పాఠశాల లందలి పండితులు విద్యార్థులు నప్పు డెంతవఱ కనుసరించిరో తెలియదు. శ్రీపోలవరము జమీందారుగారు తొలుదొలుతఁ బ్రకటించిన హరవిలాసములోను, తరువాత వావిళ్లవారు ప్రకటించిన పునర్ముద్రణములోను, వ్రాఁతప్రతులలోను "భరితభోజన" మను పాఠమే యున్నది. అట్టిచో శ్రీనాథుని యీపదప్రయోగముయొక్క యర్థము నౌచిత్యము తమకుఁ దెలియనప్పు డూరక యుండుట లెస్సగాని యనవసరముగ నిట్టిసవరణలను బ్రతిపాదించుట సాహసాతిసాహస మని చెప్పకతప్పదు. వీరు సూచించిన "భరితభాజన" మనుసవరణ పరిహాసభాజనమునకే గాని యర్థప్రయోజనమున కిసుమంతయు నుపకరింపనేర దని నాయాశయము. వీరశైవులలో ననేకవిధము లయిన ప్రసాదనియమము లున్నవి వానిలో భరితభోజనవ్రత మొకటి. తాను భక్షింపఁదగిన యాహారపదార్థము నంతయు నొక్కమాఱె వడ్డించికొని యనఁగా మరల మాఱు కోరక యిష్టలింగార్పణ మొనర్చి యించుకయు మిగులకుండ భుజించుటను భరితభోజన మందురు. పిడుపర్తి సోమనాథకవి ప్రభులింగలీలలోని యీక్రింది పంక్తులలోఁ గూడ నీభరితార్పణవ్రతము పేర్కొనఁబడినది. చిత్తగింపుఁడు.

"భవులు భాండంబులు" పట్టంగరాని, సవిశేషనియమముల్ సలుపుచునుండు,
నట్టివ్రతస్థులు నన్యపాకములు, ముట్టి భుజింపని ముఖ్యవ్రతులును,
బరపాకముల చేతఁ బట్టనివారు, భరితార్పణము సేయు భవ్యశీలురును"—

హరవిలాసమందలి పయికథాభాగమునఁ బ్రకరణౌచిత్యమును బాటించి శ్రీనాథుఁ డీభరితభోజన శబ్దమును బ్రయోగించినాఁడు. చిఱుతొండఁడు నాతని సతియు శివయోగి కారగింపుగాఁ బెట్టుచున్నది తాము కడుపారఁ గనిపెంచిన ముద్దుకుమారునిఁ జంపివండిన మాంసాహారము. అట్టియెడ దానిని గొంత కొంత మరల మరల వడ్డించు మని కోరుట యాశివయోగికిఁగాని, యెంతయగ్నిపరీక్షకు లోనగుచున్నను వడ్డించెడి యాపుణ్యదంపతులకుఁ గాని యుచితము కాదు. ఇట్టి దెన్నియో యాలోచించి శ్రీనాథుఁడీభరితభోజనశబ్దమును బ్రయోగించి యుండఁగా జంకుగొంకులు లేక దానిని సవరింపఁజూచుట నే మని వాకొనవలెనో తెలియకున్నది. కృతికర్త, కృతిభర్త, కథాపాత్రములు నందఱు వీరశైవు లని తలంపున్న నేగదా యిందలి ప్రయోగౌచిత్యము గోచరించును.

ఇంతకు మనపండితులు సూచించిన సవరణవలన మన కర్థప్రయోజనము

గలుగకున్నను వారికిఁ గావలసిన వేఁతాంపు ప్రయోజనమునకయి యది యుంచుక సహాయకము కాఁజాలును. "భరితభాజనముగా వడ్డించిన" అని వారు చెప్పుదానికి భోజనమునకయి యుంచిన భాజన మనఁగాఁ బళ్లెరమో పత్త్రమో పూర్తిగా నిండునట్లు లనఁగా, అన్ని వారికిఁ గుంభము పోసినట్లు వడ్డించె నని వారి యభిప్రాయము కానోపును. "చిఱుత ముఱుకు గాని నిప్పు వెడల్పుఁ గల కదళీఫలాశంబు నడిమియాని యుఁ బుచ్చి పఱచి" అని మొదట నున్న వాక్యమును జూచి యాపఱచినయరఁటియాకంతయు నిండునట్లు గా ననియే వారు తలంచి యుందురు. ఇది యేమని యెవ రైన నడిగినచో శ్రీనాథుఁడు భోజనప్రియుఁడు, తిండిపోతును ; అందుచే నిట్లే యాతఁడు వ్రాసియుండు నని సమాధాన మొసంగుదురు. శ్రీనాథుఁడు శృంగారశేఖరుఁ డయ్యును వ్రుగ్గతిలఁబడక యనేకసంవత్సరములు జీవించినాఁ డఁట. అందుచే నాతని కేళీవిహారములు కొనసాగుటకయి విస్తరినిండ మస్తుగా సుష్టయిన భోజనాదికము లాతనికిఁ గావలయు నఁట. అందుచేతనే తనగ్రంథములలో నాహారవర్ణనాసందర్భములు వచ్చినప్పుడు వానినిజాల దివ్యముగాఁ జేసినాఁడఁట. ఇత్యాదిగా వారివిమర్శపంథ సాగుచుండును.

మహాశయులారా! చూచితిరా! "కౌపీనసంరక్షణార్థ మయం పటాటోపః" అనునట్లు శ్రీనాథుఁడు స్త్రీలోలుఁ డనుదురభిప్రాయము మనపండితుల నెట్టిపెడదారులం బట్టించుచున్నదో! మొదట శ్రీనాథుఁడు భోజనప్రియుఁ డనువిపరీతసిద్ధాంతమునకు దారితీయించినది. దానినిబట్టి "భరితభోజనము" మున్నగు నర్థవంతము లగు నాతనిప్రయోగములను జంకు గొంకులు లేక యిచ్చవచ్చినట్లు మార్చివేయు సాహసానర్థములకు హేతుభూత మయినది. కావున నేకవిని గూర్చి యైనను మొదట నొకవిపరీతమయిన దురభిప్రాయమును మనమున నిడుకొని యాతనిగ్రంథమును జదువరా దని నావిన్నపము. అట్లయినచో నిట్టి యనర్థకము లనివార్యములగును. గ్రంథము నుదారదృష్టితో సవిమర్శముగఁ దిలకించి దానిని బట్టియే యాతనిశీలాదికమును నిర్ణయింప నెంచుట శ్రేయస్కరము.

2. ఇప్పటికి రమారమి యైదువందల సంవత్సరముల క్రిందట నీరాజమహేంద్రవరముననే త్రైలోక్యవిజయసౌధశాలాభ్యంతరమునఁ గాశీఖండరచనావసరమున, అల్లయవేమభూపాలుఁడు మహాశ్రీనాథుని నిట్లు ప్రశంసించినట్లు లాగ్రంథావతారికలోఁ జెప్పఁబడినది.

శా. "ఈక్షోణిన్ నినుఁబోలు సత్రపులు లే రీనాఁటికాలంబునన్
ద్రాక్షారామచళుక్యభీమపురగంధర్వాప్సరోభామినీ
వక్షోజద్వయగంధసారఘుసృణద్వైరాజ్యభారంబున
ధ్యక్షించుం గవిసార్వభౌమ ! భవదీయప్రౌఢసాహిత్యముల్."

శ్రీనాథుని శృంగారిశేఖరునిగాఁ దలంచు కొండఱుమహానుభావు లీపద్యమును దమవాదమునకు సాధకముగాఁ గొని యా'క్ష'కారప్రాసముతోనే యిందలిపద్యభాగమును గూడఁ గొంత కలిగియున్న

శా. "అక్షయ్యం బగుసాంపరాయని తెలుంగాధీశ; కస్తూరికా
భిక్షాదానము సేయురా సుకవిరాడ్బృందారకశ్రేణికిన్
ద్రాక్షారామచళుక్యభీమపురగంధర్వాప్సరోభామినీ
వక్షోజద్వయకుంభికుంభములపై వాసించుఁ దద్వాసనల్."

అనుచాటుపద్యమును గూడ శ్రీనాథున కారోపింతురు. ఈపద్యమును శ్రీనాథున కారోపించుటకంటె వేములవాడ భీమకవి కారోపించుట కెక్కువ యవకాశము లున్న వని నాయాశయము. భీమకవి యుద్దండశైలియందలి లోభముచే నీచాటువునందలి పాదైకదేశమును శ్రీనాథుఁడు తనపద్యములోనికి నెరవు తెచ్చికొని యుండును. అట్లగుటనే కాఁబోలుఁ గాశీఖండములో నీపద్యమునకు మునుముందే "వచియింతు వేములవాడ భీమనభంగి నుద్దండలీల నొక్కొక్కమాటు" అని వ్రాసి యటుతర్వాతఁ బయిపద్యమును లిఖయించి భీమకవియందలి గౌరవమును వెల్లడించినాఁడు. భీమకవి—

"ఘనుఁడన్ వేములవాడవంశజుఁడ ద్రాక్షారామభీమేశనం
దనుఁడన్ దివ్యవిషామృతప్రకటనానాకావ్యధుర్యుండ భీ
మన నాపేరు వినంగఁజెప్పితిఁ దెలుంగాధీశ ! కస్తూరికా
ఘనసారాది సుగంధవస్తువులు వేగందెచ్చి లాలింపురా."

అనుపద్యమున 'రా' కొట్టుప్రయోగముతోడనే యొక తెలుంగాధీశునిఁ బయిపద్యములోవలెనే కస్తూరికాఘనసారాదిసుగంధవస్తువులకయి యాచించినాఁడు. కాకినాడతాలూకాలోఁ దుల్యభాగానదీతటమున నేఁడు 'సంపర' యను పేరితో వ్యవహరింపఁబడు గ్రామము శ్రీనాథుని భీమఖండములోను సంస్కృతభీమఖండములోను గూడ సాంపరాయనిపుర మని యభివర్ణింపఁబడినది. అది భీమకవి జన్మస్థాన మగు వేములవాడకు రెండుమైళ్లదూరములో నున్నది.

పూర్వ మచ్చట నెవరో రాజ్య మేలిన చిహ్నములు నేఁటికిని గానవచ్చు నని యచ్చటివారు చెప్పుచున్నారు. కావున భీమకవి పద్యములోని తెలుంగురాయఁడు సాంపరాయని తెలుంగురాయఁడే కాఁ దగును. ఈతని యీపేరికిని సాంపరాయనిపురమునకును గలసంబంధము చరిత్రజ్ఞులు పరిశోధింపఁదగినది. శ్రీనాథునికాలములో సాంపరాయని తెలుంగాధీశుఁడు కానరాఁడు. నెల్లూరుజిల్లా పొదిలిప్రాంతమున రాజ్యమేలిన శంభురాయని కొడుకు తెలుంగురాయఁడు మాత్ర మొకఁ డున్నాఁడు. అతఁడే యితఁ డని మనవారు సంబంధము ముడి పెట్టుచున్నారు. కాని యది సరికా దని నాతలంపు. ఇంతకు "అక్షయ్యం బగు" ......అనుపద్యమును జెప్పినది భీమకవి యైనను శ్రీనాథుఁ డయినను లేక మఱొకఁ డయినను నందలిపరమార్థమును విచారించువా రరుదుగ నున్నారు. ఆపద్యమునకు నాకుఁ దోఁచినయర్థమును, నందుఁ గలవ్యంగ్యార్థమును నాశృంగారశ్రీనాథవిమర్శనములో వివరించితిని. శ్రీవసురాయకవిశేఖరులును, శ్రీశ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి కవిసార్వభౌములును నించుమించుగ నాయర్థముల నంగీకరించిరి. కాని శృంగారగ్రంథమాలలోఁ బ్రకటిత మయిన క్రీడాభిరామము పీఠికలోఁ దత్ప్రతికాకర్తలు, అసహ్య మని నాయర్థమును నిరసించిరి. వారి కది యట్లే కావచ్చును. ఇంతకు నీచాటుపద్యముతో నాకిచ్చటఁ బ్రసక్తి లేదు. కాశీఖండావతారికలోని పయిపద్యమునందలి "ద్వైరాజ్యభారంబు" అనుశ్రీనాథుని పదప్రయోగములోని భావ మేమి? దీనికి సరియైనయర్థము సమన్వయము నేమి యనుట ప్రస్తుతవిచారణీయాంశము.

ఇంతఁ గూర్చి చరిత్రచతురాననబిరుదాంచితులు శ్రీచిలుకూరి వీరభద్రరావుపంతులుగారు తమ "శ్రీనాథకవి" నూత్నముద్రణములోఁ గొంత చర్చించిరి. వా రడిగినపండితు లెవరును బయిప్రయోగమునకు సరియైన యర్థమును జెప్పరయిరఁట. కొందఱు కవిపాఠము "ద్వైరాజ్యభావంబు" అనియై యుండు ననియు "ద్వైరాజ్య"శబ్దమునకు వైరము అని యర్థము చేసికొని "నీప్రౌఢసాహిత్యములు ద్రాక్షారామచళుక్యభీమవరవేశ్యామణీస్తనలిప్తము లయినచందన కుంకుమములతో వైరమును వహించును, అనఁగా వానికంటె నెక్కుడుగా వాసించు" ననుభావమును జెప్పఁ దగు నని సెల విచ్చి రఁట. కాని "ద్వైరాజ్య"శబ్దమునకు వైరమనునర్థ మెట్లు పొసంగు నని యడుగఁగాఁ బ్రమాణములు చూప రయిరఁట. మఱి కొందఱు "ద్వైరాజ్యభారంబు" అనుటకు "రెండు రాజ్యములభారము" అని

సువ్యక్త మగుప్రస్ఫుటార్థమునే గైకొని "చందనకుంకుమములు రెండును రెండు రాజ్యములు-ఆరెండింటియొక్క-భారమును వహించు" నని యర్థము చెప్పిరఁట. ఏది యెట్లున్నను, ఆకాలమున రాజుల దర్బారులలో జరుగుమర్యాదలను దెలిసికొన్నఁ గాని యీపద్యభావమును సరిగా గ్రహించుటకు వీలు కలుగ దని చెప్పి శ్రీ వీరభద్రరావుపంతులుగా రాదినములలో రాజులు కవి మంత్రి పురోహిత సామంతాది వర్గముతో నిండుకొలు వున్నప్పుడు వేశ్యామణుల నృత్యగీతాదివినోదములు జరుగుచుండెడి వనియు నందుచే నీపద్యము చెప్పిన యదనున రాజసభాగారమున ద్రాక్షారామచళుక్యభీమపురవేశ్యలు గొండ్లి సలుపు చుండఁగా వారి స్తనాంకితము లయిన చందనకుంకుమముల సువాసనలు సభాంతరాళమంతటను గుబాళించునట్లే, నీకవితావాసనలు గూడ సభయం దంతటను వ్యాపించు నని వేమభూపాలుఁడు ప్రశంసించె నని చెప్పుటయే శ్రీనాథుని భావమయి యుండు నని ఫలితార్థమును వివరించినారు. ఇట్టిదే యిందలి భావమయి యుండుననుట కెట్టిసంశయమును లేదు. ఈపద్యమున కించుక ముందు వీరభద్రారెడ్డికొలువుకూటమును వర్ణించుచుఁ జెప్పిన-

"సీ. త్రైలోక్యవిజయాభిధం బైనసౌధంబు చంద్రశాలాప్రదేశంబునందుఁ
సచివసైన్యాధీశసామంతనృపవారసీమంతినీజనశ్రేణి కొలువఁ
శాస్త్రమీమాంసయు సాహిత్యగోష్ఠియు విద్వత్కవీంద్రులు విస్తరింపఁ
గర్పూరకస్తూరికాసంకుమదగంధసారసౌరభము దిక్పూరితముగ
గీ. నిజభుజావిక్రమంబున నిఖలదిశలు, గెలిచి తను రాజ్యపీఠి నెక్కించినట్టి
యన్న వేమేశ్వరునియంక మాశ్రయించి, నిండుకొలువుండెఁ గన్నులపండువగుచు.

అనుపద్యము రెండునాలుగుపాదములుగూడ నిందుకు స్ఫోరకములు కాఁగలవు. కాని నేనును నామిత్రులు శ్రీ ఇవటూరి సుందయ్యగారును నొక్కనాఁడింకనుగూర్చి యర్థవిచారము చేయఁగా నింతకంటె విశాలమైన భావము మాకొకటి స్ఫురించినది. గంధసారము మలయజము- ఘుసృణము కాశ్మీరజము- రెండును రెండు వేర్వేఱురాజ్యముల నుద్భవించినయవి. ఈభారతక్షోణిలో నొకటి దక్షిణమున సేతుప్రాంతమున నున్న పాండ్యరాజ్యమునకును, మఱియొకటి యుత్తరమున హిమాలయప్రాంతమున నున్న కాశ్మీరరాజ్యమునకును సంబంధించినవి. మఱియు స్త్రీలకుచములను బర్వతములతోడను దుర్గములతోడను సరిపోల్చుట గూడ మనకవులసంప్రదాయము. కావున నీవేశ్యామణు లలంకరించుకొనిన చంద

నకుంకుమముల పరిమళములు వానియాశ్రయము లగుకుచగిరిదుర్గముల నుద్ఘాటించి సీమోల్లంఘన మొనరించి యీసభాంతరాళమునం దెల్ల గుబాళించి హృదయాహ్లాద మొనర్పఁగా భవదీయ ప్రౌఢకవితా సాహిత్యములు వాని నధ్యక్షించి యనఁగా వానినతిశయించి యీచందనకుంకుమముల జన్మస్థానము లగుమలయకాశ్మీరములను రెంటిపర్వతరాజ్యముల వఱకు ననఁగా నాసేతుహిమాచలపర్యంతము వ్యాపింప నేర్చు నని రాజు చెప్పినట్లు ప్రకటించుటయే శ్రీనాథుని భావమయి యుండు నని మాయాశయము. ప్రథమచతుర్థపాదారంభముల నుంపఁబడిన, “ఈక్షోణి” “అధ్యక్షించు” “కవిసార్వభౌమ” అను పదము లిందుకు స్ఫోరకములు. అవి కేవలము ప్రాసమునకయి కూర్పఁబడినయవి గాక సాభిప్రాయములు నర్థవంతములు నని నాతలంపు. ఈక్షోణి యనఁగా నీయాంధ్రావని యొక్కటియే గాక భారతావని యంతయు ననియే కవి యొక్క భావము. ఇట్లు సర్వభారతభూమిని బ్రసరించు ప్రౌఢసాహిత్యములు కలిగి యుండుటనే నీవు కవిసార్వభౌముఁడ వని కూడ నిందులధ్వని. శ్రీనాథుఁ డొక్క తెలుఁగుకవితయందే గాక సర్వభారతసామాన్య మగు సంస్కృతకవితయందుఁ గూడ ససమానుఁ డగుట పాఠకులు గుర్తింతురు గాక. మఱియు ద్వైరాజ్యభారంబు అనుదానికి సరియైన కవిపాఠము “ద్వైరాజ్యపారంబు” అనియై యుండు నని తలంచినచోఁ బయిని జెప్పినట్టి భావము మఱింతసంగతము కాఁగల దని నాతలంపు. పార మనఁగా నవ్వలిదరి. మలయ పర్వతమునకుఁ గొంతయావలనే సముద్రమును, కాశ్మీరమున కించుకయవ్వలనే హిమాచలమును నున్నవిగదా ! నీప్రౌఢసాహిత్యములు పాండ్యకాశ్మీరరాజ్యముల పారము నధ్యక్షించు ననఁగా నాసేతుహిమాచలపర్యంతము వ్యాపించు ననుభావము పరిస్ఫుట మగును. విజ్ఞు లాలోచింతురుగాక.

౩. సీ. కవిరాజుకంఠంబు కౌఁగిలించెను గదా పురవీధి నెదురెండ పొగడదండ
సార్వభౌముని భుజాస్తంభ మెక్కెను గదా నగరివాకిటనుండు నల్లగుండు
వీరభద్రారెడ్డి విద్వాంసుముంజేత వియ్యమందెనుగదా వెదురుగొడియ
ఆంధ్రనైషధకర్త యంఘ్రియుగ్మంబునఁ దగిలియుండెను గదా నిగళయుగము
కృష్ణవేణమ్మ గొనిపోయె నింతఫలము, బిలబిలాక్షులు తినిపోయెఁ దిలలుఁ బెసలుఁ
బొడ్డుపల్లెను గొడ్డేఱు మోసపోతి, నెట్లు చెల్లింతుఁ దంకంబు లేడునూర్లు.

అను శ్రీనాథుని చాటువుగాఁ దలంపఁబడు సీపద్యములోని “గొడ్డేఱు” శబ్దమునకు శబ్దరత్నాకరకారులు, తమనిఘంటువులో “గొడ్డు + ఏఱు” అని పదవి

భాగము చేసి, దానికి "గొడ్డేటి" యను క్త్వార్థకరూపమును గ్రహించి, సందర్భము ననుసరించి కాఁబోలును "గుత్తయెత్తు" అనునర్థము వ్రాసిరి. అప్పటి కీశబ్దమున కీయొక్క ప్రయోగము తప్ప నితరప్రయోగములు వారు పరికించినట్లు కానరాదు. వీరు చూపిన పదవిభాగమునకుఁ జెప్పినయర్థమున కెంతమాత్రము సంగతి కనఁబడదు. శ్రీనాథుఁడు హరవిలాసములో సిరియాళకథలోఁ గూడ నీశబ్దమును బ్రయోగించినాఁడు. అందలిస దర్భము మనకీశబ్దముయొక్క సరియైనయర్థముఁ దెలియనవకాశ మొసఁగఁగలదు.

"అనిన నత్తపోధనుం డిట్లనియె నీయుక్తమాఁగన యెలుంగెత్తి నలుదిక్కులం బిలుచునది. కుమారుఁడు వచ్చె నేని భుజియింతు రాకుండె నేని నేనును నీమునలి యవ్వయుం గుడుతు మట్లుగాక యొఱగొడ్డేటిబులు వలికి నిషధ్దపాటు గొడ్డేటుగా జిడ్డుకటుపంగలవా రమె యనినం బ్రసాదం బని పతియునుమతిం బురంధ్రీరత్నంబు"

పూర్వోదాహృతవినోదవిమర్శములోఁ దద్విమర్శకు లీవిషయమును కూడ నిట్లించుక ముచ్చటించిరి.

"శబ్దరత్నాకరకారులు గొడ్డేటు ధాతువుగా గ్రహించిరి. శ్రీనాథుని యవసానకాలపద్యపాఠమును బట్టి కాని శ్రీనాథుఁడు దానిని దన గ్రంథములందు "వ్యర్థప్రయాసము, నిరర్థకకృషి" అను నర్థమున విశేష్యముగాఁ బ్రయోగించెను. శ్రీనాథుని యవసానకాలపద్యపాఠము సరి కాదేమో. "బొడ్డుపల్లెను గొడ్డేటిమోసపోతి" అనుచో "బొడ్డుపల్లెను గొడ్డేటు మోసమయ్యె" నని యుండునేమో.

గొడ్డేటు మోస మయ్యె ననుచో గొడ్డేటు విశేషణ మగును, గాని విశేష్యమెట్లగునో నాకు బోధపడలేదు. ఇంతకు నీశబ్దము గొడ్డు అనువిశేషణపదముపయి ఏటు అను సకర్మకక్రియాపదమును జేర్పఁగా నేర్పడి, వృథా యని యర్థమిచ్చు నవ్యయ మేమో యని నాయభిప్రాయము. సొంపారు, చెలువారు మున్నగు పదములలోని "ఆరు" అను నకర్మకక్రియ తొలుదొలుతటి రూపము ఏటు అయియుండు నేమో! లేక యిదిగూడ నించుమించుగ నట్టియర్థమే గల వేఱొక పదమయిన నయియుండును. ఏర్పడు మున్నగుపదముల రూపనిష్పత్తినిబట్టి దాని స్వరూపము తెలియనగును. వృథా యనునర్థముననే శ్రీనాథునివంటి మఱికొందఱు శివకవులు, బమ్మెర పోతనయు, పిడుపర్తి సోమనాథుఁడు కూడ నీశబ్దమును దమభాగవతప్రభులింగలీలలలో వాడినారు. చూడుఁడు:—

క. ఒడ్డారించి విషంబునఁ, గడ్డము సనుదెంచి కాన నధికులు లేమిన్
గొడ్డేలు ద్రుంది రాలన, బిడ్డల నెడలేక జనులు పృథ్వీనాథా.

ద్వి. "ఒడ్డెయుప్పరవాని యోజ నీరాను, లొడ్డుక కీర్తుల నొందెద ననుచు
జడ్డునఁ దవిలి విచారంబు మాని, గొడ్డేలు చెడిపోయెఁ గూలిరామయ్య."

పిమ్మట సోమనాథుని ప్రభులింగలీల కర్ణాటకభాషలో చామరుసు రచించిన గ్రంథమున కాంధ్రీకరణము. మూలగ్రంథమందలి యీక్రిందిపంక్తులు కూడ నీయర్థమునే తెలుపుచున్నవి.

"వడ్డరామనిదేను గొడవిమె . నోడ్డికొండువృథామనస్సను
గోడ్డమాడిమె కెట్ట నెను తల్లమనకేళిదరె। గుడ్డరెల్లరుగురువనావను"

మఱియు నీపదము "గొడ్డేలుమోసపోతి" "గొడ్డేలు ద్రుందిరి" "గొడ్డేలు చెడిపోయె" ననుచోటులఁ గ్రియాపదములకు ముందుగాను, "గొడ్డేలుగా" అనుచో వ్యస్తముగాను బ్రయోగింపఁబడుటచే నిది తప్పక యవ్యయమే కాఁదగును. విజ్ఞులు విషయనిర్ణయ మొనరింతురుగాక! శ్రీనాథునిమఱికొన్ని ప్రయోగములఁ గూర్చి యింకొక పరి ముచ్చటించుకొందము.*

* ఈపద్యములో బయిపాఠము "బొడ్డుపల్లెను గొడ్డేలి" అని కొన్ని తావుల ముద్రింపఁబడినది. దీనిని బట్టి, పరిషత్సభలో నావ్యాసమును వినినపండితులు కొందఱు బొడ్డుపల్లె + అనుగొడ్డు + ఏలి అనుపదవిభాగములఁ జేసి "బొడ్డుపల్లె యను గొడ్డు (గొడ్డుగ్రామము) నేలి" అను నర్థమును వివరించిరి. ఇది కేవల మసంగత మని చెప్పనక్కఱలేదు. ఎకారముపయి నచ్చుపరంబగునపుడు సంధిచేయుట తెలుఁగుబాసలో నెచ్చటను లేని సంప్రదాయము. దీనికి వారు శ్రీనాథుఁడు నిరంకుశుఁడని సమాధాన మొసంగిరి. దాని యౌచిత్యమును వివరింపఁబనిలేదు. ఇంతకు బొడ్డుపల్లె గొడ్డుకాదు. అది పండలే దని కాని యూసరక్షేత్ర మని కాని శ్రీనాథుఁడు విచారింపనేలేదు. పండినపంట యంతయుఁ గృష్ణపాలిదకుఁ బోయిన దనియే యాతఁడు విచారించినాఁడు. నేను జెప్పిన యర్థమందు "బొడ్డుపల్లెను" అనునది సప్తమీవిభక్తిరూపము. ద్వితీయావిభక్తి కాదు.

ఈసందర్భమున మఱియొకసంగతి ప్రశంసించుట యప్రస్తుతము కాదు. పయిపద్యములో మొదటిపాదము నుత్తరార్థములో "ఎదురెండ పొగడదండ" "అని కాని ఎదురెండఁ బొగడు దండ" యని కాని పాఠమెట్లున్నను నందలిభావ మేమో బాగుగ గోచరించుటలేదు. పద్యమందలి విషయము, ఒడ్డెరాజులు పన్నునీయఁజాలని శ్రీనాథు నవమానించి బాధపెట్టినవిధము. రెండు, మూఁడు, నాలుగుపాదములలోని "నల్లగుండు, వెదురుగొడియ, నిగళయుగము" అనుశబ్దము లీయవమతి విధానమును బ్రకటించుచుండఁగా గౌరవస్ఫోరక మగు "పొగడదండ"కు మొదటిపాదమున బ్రసక్తి సంగతముగా లేదు. శ్రీనాథునిపాఠము "ఎదురెండఁ బొరకదండ" అనియై యుండు ననియు, పొరక యనఁగా గడ్డిపరక యనియుఁ దత్పరిషత్సభాధ్యక్షులు శ్రీవసురాయకవిశేఖరులు నాతో ముచ్చటించిరి. అదియుచితమనియే నాతలంపు. విజ్ఞులాలోచింతురుగాక.

# కాకతీయసంచిక.

"కాకతీయసంచిక"—రాజమహేంద్రవరము, ఆంధ్రచారిత్రకపరిశోధకమండలివారి తృతీయప్రచురణము. ఈసంపుటము మండలివారు ప్రచురించిన చాళుక్యసంచికకు రెండింతలును, గళింగసంచికలో సగమును నున్నది. దీనివెల నాల్గురూపాయలు. గ్రంథమున కొకసంపాదకీయసంఘము గలదు. గ్రంథసంపాదకులు మదరాసు విశ్వవిద్యాలయపరిశోధకవిద్యార్థిగ నుండిన శ్రీమారేమండ రామారావుపంతులుగారు, ఎం. ఎ., బి. యిడి.

కాకతీయులచరిత్ర మిదివఱకు సమగ్రముగ లేకుండుటయు, భండార్కర్, ఫ్లీటు, రామయ్యపంతులు, వీరభద్రరావుగారు మొదలగు చరిత్రకారుల వ్రాతలసమగ్రముగ నుండుటయునె యీసంచిక ప్రచురణమునకు హేతువు. ఇందు, కాకతీయచరిత్రము "ప్రత్యేకప్రామాణ్యము"లతో నిరూపింపఁబడి, యాంధ్రదేశీయుల పూర్వపుణ్యఫలముగ వివరింపఁబడినది.

ఇట్టి యపూర్వాదర్శముతో సంపాదకుఁడు చరిత్రమును వ్రాయుట సంతోషదాయకమని గ్రంథమును జదువుట కారంభించి, సమగ్రముగఁ బఠించి, వీరు వ్రాసిన చరిత్రాంశములు కాకతీయచరిత్ర కెట్టి నూతనవిషయములో యని విమర్శించితిని. గ్రంథము స్వవచనవ్యాఘాతములు, ప్రమాణరహితములు, అశ్లీలద్యోతకములు, అపశబ్దసన్నిపాతములు, అసత్యవృత్తాంతములు, అపార్థ వ్రాతములు వీనితో నిబిడీకృతమై యున్నది. స్థాలీపులాకన్యాయముగ నట్టివిశేషముల నుదాహరించెదను.

అవిఘ్నమస్తని యారంభముననె సంపాదకులు ప్రమాణరహితమయిన చరిత్రాంశమును దెల్పిరి. కాకతీయవంశమునకు వేంగీచాళుక్యసామంతుఁడుగ నుండిన కాకర్త్యగుండనయే మూలపురుషుఁడని వీరు సిద్ధాంత మొనర్చిరి. కాకర్త్యపదమే కాకతీయపదమునకు రూపాంతరమని వీరియభిప్రాయము. ఈగుండ్యన రాష్ట్రకూటుఁడనియు, సామంత ఒడ్డివంశమునకుఁ జెందినవాఁడనియుఁ దామ్రశాసనమున నున్నది. ఇతఁడు వేంగీచాళుక్యసామంతుఁడు. కాకర్త్యపదమునకు, కాకతీయపదమునకు శబ్దశాస్త్రసంబంధ మసంభావ్యమని, ఎపిగ్రాఫియా ఇండికా సంపాదకులు దత్పత్రికలో గణపతిదేవుని గారవపాడుశాసనమును శ్రీమాన్ కృష్ణమాచార్యులవారు ప్రకటించిన సందర్భమున స్పష్టముగఁ దెలిపిరి. శ్రీరామారావుగారీవిష

యమును గుర్తింపరైరి. వారు Epigraphia Indica Volume XVIII Pages 346- 356- పరిశీలించెదరుగాక. ఈకాకర్త్యగుండన ఒడ్డీయుఁడు !

పైనుదాహరింపఁబడ్డ కాకర్త్యగుండనయును నాతనిపూర్వులును మైసూరు రాజ్యమున నున్న కాకతిగ్రామమునం దుండెడివా రనియు ను, నట్టిగ్రామనామ మూలముననే వంశమునకుఁ గాకతీయవంశ మను నామమేర్పడె ననియు మఱియొక సిద్ధాంతము.ను రామారావుగా రొనర్చిరి. దీనికి సమాధానము గారవపాడుశాసనమును బ్రకటించు సందర్భమున ఎపిగ్రాఫియా ఇండికా సంపాదకులు వ్రాసినది రామారావుగారు చూచియుండినయెడల నిట్టియూహలు నిరాధారము లని తెలిసికొందురు. వీ రీవిషయము నెనిమిదియవపుటలో నిట్లు చెప్పి, మరల 23 వ పుటలో నిట్లు వ్రాసియున్నారు. "కాకతి యనుదుర్గాశక్తి నారాధించువారలు గాకతీయులు". ఇది స్వవచనవ్యాఘాతము గాదా ?

కాకతీయుల కాలనిర్ణయసందర్భమున వీరు గావించిన సిద్ధాంతముల కంతము లేదు. పాఠకు లేది నమ్మవలెనో, సంపాదకున కేది సమ్మతమో, యూహింపనలవిగాదు, చూడుఁడు.

| | పుటలు 13 | 38 | 109 |
|---|---|---|---|
| మొదటిబేతరాజు | | | 1000-1050 |
| మొదటిప్రోలరాజు | 1050-1085 | | 1050-1080 |
| రెండవబేతరాజు | 1085-1115 | | 1080-1115 |
| రెండవప్రోలరాజు | 1115-1158 | | 1115-1158 |
| రుద్రదేవుఁడు | 1158-1195 | -1197 | 1158-1195 |
| మహాదేవుఁడు | 1195-1199 | 1195-1198 | 1195-1199 |
| గణపతిదేవుఁడు | 1199-1231 | 1198-1261 | 1199-1261 |
| రుద్రాంబ | 1258-1296 | | 1258-1296 |
| ప్రతాపరుద్రదేవుఁడు | 1290-1326 | | 1290-1326 |

సంపాదకీయవ్యాసముననే యిట్టివిపరీతనిర్ణయము లున్నవి. గ్రంథమునందలి తదితరవ్యాసకర్తలనిర్ణయములు పైవిధముననే కలవు. వీనికి సమన్వయమెట్లు?

పదునాఱవపుటలో "మొదటి ప్రోలరాజు కాల మీదండయాత్రలు జరిగిన సమయమునకు సరి యగుచున్నది" అని వ్రాసి ప్రమాణమునకు 44 అంకె వేసి, యాపుటలోఁ గాని మఱి యెచ్చటను గాని ప్రమాణము చూపరైరి.

రుద్రునిమరణమును గూర్చి వ్రాయుచు, 38 వ పుటలో నితఁడు క్రీ. శ. 1197 లో మరణించె నని యొకసారియు, 13 వ పుటలో క్రీ. శ. 1195 లోఁ గాలధర్మ మొందె నని వేఱొకసారియు, వ్రాసిరి. ఒక మానవుఁడే రెండుమూఁడుతడవలు ప్రాణములు విడుచుట యెట్లు సంభవించె నని జిజ్ఞాసువు లడిగినచోఁ గాకతీయసంచిక సంపాదకు లెట్టిప్రత్యుత్తర మిత్తురో!

37 వ పుటలో రుద్రదేవుని మరణమును గూర్చి యీచరిత్రకారుఁడు వ్రాసినవాక్యములు గమనింపుఁడు-"పైటానుశాసనమునుండి యీరాజు(జైతుగి) మఱియొక యాంధ్రరాజునుజంపి యాతనితనయునిఁజెఱపట్టెనని తెలియుచున్నది." దీనికి వా రిచ్చినప్రమాణము ఎపిగ్రాఫియా యిండికా సంపుటము, కాని, వీ రాపైటానుశాసనమును జదివియుండినచో నిట్టియసత్యపు వ్రాఁతల వ్రాసియుండరు. పైటానుశాసనములో (1) జైతుగి యాంధ్రరాజును జంపినట్లు గాని (2) ఆతని తనయుని జెఱపట్టె నని కాని లేదు. ఆశాసనములలో జైతుగి "యః సంఖ్యే త్రికళింగరాజమవధీః" అని యున్నది. ఈత్రికళింగరాజె త్రిలింగరాజని భ్రమపడి, భండార్కర్ పండితుఁడు హేమాద్రి పేర్కొన్న తిల్లింగనృపతి యగురుద్రదేవుఁడీత్రికళింగాధిపతి యని వ్రాసియుండెను. శ్రీవీరభద్రరావుగారును భండార్కర్ పండితుని వాక్యములే యాంధ్రుల చరిత్రలో వ్రాసిరి. భండార్కర్ పండితుఁడు త్రికళింగాధిపతియుఁ ద్రిలింగాధిపతియు నొక్కరే యని పడిన విభ్రాంతి వీరభద్రరావుగారిని మోసపుచ్చినది. వారిద్దఱి త్రోవనే రామారావుగా రనుసరించిరి. ఈత్రికళింగాధిపతి బిరుదము చరిత్రలోఁ గాకతీయుల కెక్కడను లేదు. అది కళింగగాంగవంశజులకును, చేదిరాజులకును గలదు. ఇందును గూర్చి గొడవర్తి రామదాసుగారు వ్రాసిన వ్యాసములు చదివినచోఁ గొన్నివిషయములను దెలిసికొనవచ్చును. పైటానుశాసనములో గణపతిదేవుని తండ్రి ప్రశంసయే లేదు. జైతుగి గణపతిదేవుని కారాగారమునం దుంచె నని లేదు. రామారావుగా రింతటితో నూరకుండిన బాగుండెడిది. 38 వ పుటలో నీజైతుగియే క్రీ.శ. 1198 వ సంవత్సరములో నాంధ్రదేశముపై దండెత్తివచ్చి మహాదేవరాజును జంపి యాతనితనయుఁడగుగణపతిదేవుని చెఱగొని దేవగిరికి మఱలె నని వ్రాసిరి. ఇది యంతయు రామారావుగారి స్వకపోలకల్పితము. పైటానుశాసనము పరిశీలింపని కారణమె వీరి నీపొరపాట్లకుఁ దెచ్చినది. ఆశాసనములో గణపతిదేవుని ప్రశంస యి ట్లున్నది:-

"కారాగారాత్సమానీయ కరుణావరుణాలయః ప్రియంవదాస్య మకరో త్క్షితి త్రేగణ

పతిం పతిం" అని. పైశ్లోకములో జైతుగి గణపతిదేవుని కారాగారమం దుంచె నని కాని, యాతనిని దేవగిరికిఁ గొంపోయె నని కాని లేనప్పుడు రామారావుగారే ప్రమాణముచొప్పున పైవ్రాఁతలు వ్రాసిరో! జైతుగి గణపతిదేవునిఁ గారాగారమునుండి విముక్తునిజేసి, గణపతిని క్షితిపతిగా నొనర్చెనని యున్నదే !

37 వ పుటలోపల "యాదవరా జగు జైతుగి యొకయాంధ్రరాజును బశువుగ నుపయోగించి యొక నరమేధము నొనర్చె నని హేమాద్రి తన వ్రత ఖండమునఁ జెప్పెని యున్నాఁ డని వ్రాసి, తర్వాత "హేమాద్రి పేర్కొనిన తెలుఁగురా జీరుద్రదేవుఁడే యని తేలుచున్న దని" వ్రాసిరి. ఆవిషయము స్పష్టముగ హేమాద్రియే చెప్పినాఁడు. చూడుఁడు.

"తిల్లింగాధిపతేః పశో ర్విశసనం రుద్రస్య రౌద్రాకృతేః
కృత్వా పూరుషమేధయజ్ఞవిధినా లబ్ధ స్త్రిలోకీజయః॥

వీ రీహేమాద్రిరాజప్రశస్తి సంచికయనుబంధములో నిచ్చి పై శ్లోకము లోని "విశసనం" అనుపదమును 'వివశనం' అని దిద్ది ప్రకటించిరి. ఈమార్పును దానికి వారు దిగువ వ్రాసిన యర్థమునకును బరస్పరసంబంధము లేదు.

మహాదేవరాజును గూర్చి యొనర్చిన ప్రశంస పరిహాసాస్పదముగ నున్నది. ఈరాజు క్రీ. శ. 1195-1198 సంవత్సరముల మధ్య రాజ్య మొనర్చె నని వ్రాసిరి. దీనికిఁ గారణము రుద్రదేవుఁడు క్రీ. శ. 1195 సంవత్సరములో మరణమొందె నని వా రిదివఱ కొకసారి వ్రాసి యుండుట చేతను, గణపతిదేవుని రాజ్యారంభకాలము క్రీ. శ. 1198 యగుట చేతను నైయున్నది. కాని రుద్రదేవుఁడు క్రీ. శ. 1195 లో నొకసారియు, క్రీ. శ. 1197 లో నొకసారియు మరణించె నని వ్రాసినవ్రాఁతల కీమహదేవరాజు కాలనిర్ణయము ప్రతిబంధకము గాదా.

ఈమహాదేవరాజు క్రీ. శ. 1198 వసం॥లో జైతుగితో యుద్ధమొనర్చిరణనిహతుఁ డయ్యె నని వ్రాసినది సత్యము గాదు. పైశాసనములో నీవిధమున లేదు.

మహాదేవరాజును గూర్చి వ్రాయుచు "ఓరుగల్లు కోటలోని స్వయంభూదేవాలయమున కెదురుగ నున్నశాసనమున మహాదేవరాజున కుపమన్యుముని యనునాతఁ డొకఁడు సాయముచేసె నని వ్రాయఁబడియున్న దని వ్రాసిరి." ఈయుపమన్యుఁడు శివభక్తులలో నొకఁడు. వీ రిచ్చిన 26 వ సంఖ్యగల ఓరంగల్లు గణపతిదేవుని శాసనమున నీయుపమన్యుని ప్రశంస గలదు."ఉపమన్యు ప్రముఖాదిశకదశ(తశివ)భక్తి జనానందకారణ" యని గణపతి ప్రశస్తి. ఇట్టి భక్తకోటిలోని

వాని నొకమహాపురుషునిఁ జేసి మహాదేవరాజున కేదియో సాయ మొనర్చె నని వ్రాయుట వింతగానున్నది. ఈసహాయసంపదకుఁ గారణము జైతుగి మహాదేవ రాజుపై దండెత్తివచ్చె ననియు, నారణరంగమునం దీకాకతినృపాలుఁడు మరణించె ననియు వా రూహించుటయే.

ఈయుపమన్యుఁ డొకశివభక్తుఁడు. ప్రసిద్ధపురాణపురుషుడు. ఈతనిగూర్చి పూర్వగాథాలహరి పుట 71-72 లలోఁ గొన్ని యంశములు తెలుపఁబడినవి. ఇట్టి పురాణపురుషుఁడు పదుమూఁడవశతాబ్దములో మరల నవతరించి, మహాదేవరాజునకు సాయమొనర్చె నని వ్రాయుట హాస్యాస్పద మని చెప్ప నక్కఱ లేదు. ఇదియే కాఁబోలుఁ గాకతీయ చరిత్రకుఁ దెల్పిన నూతనాంశములలో నొకటి. రెండవప్రోలరాజునుగూర్చి వ్రాయుసందర్భమున రామారావుపంతులుగారు వింత చరిత్రాంశములను దెల్పిరి. ఈరెండవప్రోలరాజు గోవిందరాజు నోడించి యాతఁడేలుచుండిన లుంతాకవిషయమును, ఉదయరాజున కిచ్చె నని యనుమకొండ శాసనమునఁ జెప్పఁబడియున్న దని వ్రాసిరి. ఈవ్రాఁత కాధార మనుమకొండశాసనములోని యీక్రిందిశ్లోకము-పాఠకులు గమనింతురుగాక.

"యః కుంతోరిపతే రకుంఠపరశుశ్లక్ష్ణాగ్రధారోల్లస
ద్ధారాపాతనిపాతనైకచతురం గోవిందరాజాహ్వయం
బద్ధ్వోన్ముచ్య తదోదయక్షితిభృతే రాజ్యం దదౌ లీలయా
లుంతాకో విషయస్య తస్య సమరే సద్వీరదీక్షాగురుః"

కడపటిపాదమందలి 'లుంతాకో విషయస్య' యనుదానికి లుంతాకవిషయమని యర్థముచెప్పి, ఆలుంతాకవిషయమును ప్రోలరాజు ఉదయరాజున కిచ్చె నని వ్రాసిరి. అనుమకొండశాసనమును దాత్పర్యసహితముగాఁ బ్రకటించిన అప్పన్న శాస్త్రిగారి గ్రంథమును వీరు చదివి యుండియును, దానిలోని యర్థ మెట్లున్నదో తాము గ్రహింపనేరక రామారావుగారీ విపరీతవిషయమును వెల్లడించిరి. వారిచ్చిన శ్లోకమునకర్థము విస్మయము గలిగించుచున్నది శ్లోకములోని కుంతోరి విషయమును మఱచిపోయి లుంతాకవిషయమును దెచ్చిపెట్టి యీ లుంతాకవిషయ మేదో దేశవిభాగ మనుకొని, యద్దానిని ప్రోలరా జుదయరాజున కిచ్చెనని వ్రాయుట హేయమైనకార్యము. ఈలుంతాకపదము పైనే నుదాహరించిన శాసన శ్లోకమునందే గాక, ఆశాసనములో మరలనొకచోటఁ గూడ శాసనకృతికర్త యుపయోగించెను. ప్రోలరాజునుగూర్చి వర్ణించుచు "లుంతాకో రిపుసుందరీజనమహా

సౌభాగ్యసంపచ్ఛ్రియః" అని వ్రాసెను. ఈలుంఠాకపదమునకు హరించుట యని యర్థము. రామారావుగారిచ్చిన యర్థమే సరి యైనచో లుంఠాకస్య విషయస్య' యని యుండవలెను. ఇదియే కాఁబోలు వీరు కాకతీయచరిత్రమును బ్రత్యేకప్రామాణ్యములతో నిరూపించుట !

గణపతిదేవమహారాజునుగూర్చి వ్రాయుచు వారు 38 వ పుటలో "గణపతిదేవుడు దేవగిరిలో బందిగ నుండి 1209 లో తిరిగి స్వరాజ్యమునకు వచ్చె ననియు, నాతని రాజ్యకాలము మాత్రము 1198 నుండియే పరిగణింప బడియె ననియు దెలియుచున్నది." అని నిర్వచించిరి. గణపతిదేవుఁడు దేవగిరిలోఁ బదేండ్లు కారాగారముం దుండె నని వ్రాయుట నిరాధారమైన చరిత్రవిషయము. పైఠాను శాసనములో నట్లు లేదు. వీ రాధారముగాఁ గైకొనిన భండార్కార్ పండితుఁడు సహితమును జెప్పలేదు. మరల 39 వ పుటలో 'రేచెర్ల రుద్రసేనాని కాకతీయసామ్రాజ్యము నకాలప్రళయజలధిమగ్నము గాకుండ రక్షించి, బందీవిముక్తుడై యేతెంచిన గణపతిదేవున కొసంగెను. దీనికి పాలంపేటశాసనము ప్రమాణము' అని వారు వ్రాసిరి. పాలంపేఁటశాసనములో గణపతిదేవుఁడు బందీకృతుఁడై యుండె ననియు, నట్టి బందీకృతవిమోచనానంతరము రుద్రసేనాని గణపతిదేవునకు రాజ్యము నొసంగె ననియు లేదే! ఇది యొక యప్రామాణ్యమైన విషయము. వీరి స్వకపోలకల్పనము. పాలంపేఁటశాసనములోని యీక్రింది శ్లోకములు వారి వింత చరిత్రాంశమునకు మాతృక—చదువరులు గమనింతురుగాక. ఈశ్లోకమునకును వారిచ్చిన చరిత్రాంశమునకును సందర్భ మేమి యు లేదు.

శ్రీమద్రుద్రనరాధిపే రిపుమహీపాలాద్రివజ్రే దివం
యాతే కాకతినాథ భోగ్యవిలసత్పృథ్వీకరాకర్షణే
సంభ్రాంతాః సముద్ధితాః సరభసం వైరిక్షమాపాలకాః॥
శూరః స్వామిహితః సునిశ్చితమతి ర్యః కాకతీశశ్రియా
పాదే భూరిషుకంటకేషు ఇహితే తీక్ష్ణేషు మోహా త్షణం
త్రైవిద్యే వ్యథితేచ తాన్స్వభుజబలా దుద్ధృత్య పిష్ట్వా హఠా
త్తామ్ముత్థాపయ దవ్యథం స్థిరతరం రేచర్లరుద్రస్స్వయం॥

దీనితరువాతను 42 వ పుటలో గణపతిదేవుని యుప్పలపల్లిశాసనమును గూర్చి ప్రశంసించుచు వీరు రాజనాయకుఁడు సాధించిన ఉదయగిరి యెక్కడ నున్నదో తెలిసికొనలేరక "కళింగదేశముననే యుండునని తోఁచుచున్న"దనివ్రాసిరి.

ఈయుదయగిరి గంజాముమండలములో నున్నది. బొక్కెరగ్రామమును గంజాము మండలములో నున్నదని వారు వ్రాసియున్నపుడు 'ఉదయగిరి' యెక్కడనున్నదో తెలియదా !

వీరుగణపతిదేవునికాలమున గోళకీమఠశైవాచార్యులం గూర్చి వ్రాయుచు 'వీనిగూర్చి మల్కాపురశాసనమును జూచునది'యని చదువరుల కుద్బోధించిరి. శ్రీజయంతి రామయ్యపంతులుగారు మల్కాపురశాసనము నాంధ్రచారిత్రిక పరిశోధకమండలివారి త్రైమాసికపత్రికలోఁ బ్రకటించి, విపులమైన యుపోద్ఘాతము ను వ్రాసి, కాకతీయచరిత్రకెట్టియమూల్యమైన శాసనమో వారు వివరించిరి. వీ రీవ్యాసమును భాషాంతరీకరించి, వారి యనుమతిని బొంది వారిపేరనే వీరిసంచికలోఁ బ్రకటించియుండినచో సమంజసముగ నుండెడిది. కాని వీ రావిధమునఁ గావింపక, శాసనమును, అనుబంధములోఁ బ్రకటించి, తాత్పర్యము మాత్ర మిచ్చి, యూరకుండిరి. విశ్వేశ్వరదేవుని గూర్చియు, గోళకీమఠమును గూర్చియుని శేషములను దెల్పరైరి. వీ రిచ్చిన తాత్పర్యముసైతము తప్పులతోఁ గూడియున్నది. వీ రిచ్చిన యొక చిత్రమైన తాత్పర్యవిశేషమును దెల్పుచున్నాను.

82 శ్లో. నామ్నా స్వేన స చంద్రవల్లినగరే లింగం ప్రతిష్ఠాప్యసః
　　కంచంపల్లితటాకసేతు మధికం కృత్వార్థమస్మా అదాత్......

పై శ్లోకమునందలి 'తటాకసేతు' పదమునకుఁ జెఱువుమీఁది వంతెన యని యర్థముచెప్పి, యందు సగ మాదేవుని కిచ్చె నని వారు వ్రాసిరి. చెఱువుపై వంతెన కట్టుట యెట్టిదో దురూహ్యమైన కార్యము. సేతుపదమునకు వంతెన యని యర్థము కాదు. 'గట్టు' అని యర్థము. (Bund)

పై గోళకీమఠప్రశంసాసందర్భముననే "భాగీరథీనర్మదానదులకుమధ్యదహాలమండలము గల" దని వ్రాసిరి. దహాలమండలము భరతభూమిని లేదు. అది 'డాహాలమండలము.'

ఆంధ్రదేశములో సుప్రసిద్ధచరిత్ర పరిశోధకులలో నొక్కరు శ్రీజయంతి రామయ్యపంతులవారు. నలుబదియేండ్లనుండి దానిలో వారు చేసిన పరిశ్రమ ప్రశంసార్హము. అట్టి మహాపురుషుఁడు ప్రకటించిన మల్కాపురశాసనవిషయము కాకతీయసంచికలో నెట్టి స్థానము వహించెనో గమనించినచోఁ గాకతీయసంచిక సంపాదకున కాంధ్రదేశములో నాఁటితేటిన చరిత్రకారులయం దెట్టిగౌరవ మున్నదో తెలిసి

కొనఁదగును. రామయ్యపంతులు, వీరభద్రరావు పెట్టిన చారిత్రకపరిశోధనభిక్షయే యాధునికయువకులకు గ్రంథరచనాధారము.

ఇఁక రుద్రాంబవిషయము. ఈమెనుగూర్చి వ్రాయుచుఁ గాకతీయసంచిక సంపాదకుఁడు మఱికొన్ని విపరీతవిషయములను వెల్లడించెను. ఈపెభర్త యెవ్వరో సంపాదకున కింకను దెలియలేదు. కొలనుపాకశాసనములోని వీరభద్రుఁ డీపె భర్త యని చెప్పిరి. దక్షిణహిందూశాసన సంపుటములను వీరు పరిశీలించియుండలేదు. ఈచాళుక్య వీరభద్రుఁడు No. 121, 122 South Indian Inscriptions. Vol. V. లోఁ జెప్పఁబడినాఁడు. ఆశాసనములను బరిశీలించి, వీరీ చాళుక్యవీరభద్రుని వృత్తాంతము విపులముగ వ్రాయవలసియుండెను.

వీరు 59 వ పుటలో హేమాద్రిరాజప్రశస్తిలోని యీక్రిందిశ్లోకము నుగ్గడించి, యొక విపరీతార్థమును దెల్పిరి.

"యస్తస్యై వరణే జహార కరిణ స్తత్పంచశబ్దాదికాన్
యస్తత్యాజ వధూవధా దుపరత స్తద్బాహుజాం రుద్రమాం."

ఈశ్లోకము ప్రకారము మహాదేవరాజు, (యాదవ)రుద్రాంబిక నోడించి పంచరత్నములను, నేనుఁగులను, పంచశబ్దసాధనములను హరియించి, యామెను స్త్రీ యగుటచే ప్రాణములతో విడిచిపుచ్చె నని వ్రాసిరి. ఆశ్లోకములో 'పంచరత్నప్రశంస'యే లేదే! ఈపంచరత్నముల వీ రెచ్చటనుండి సంగ్రహించిరో!

వీరు 'రుద్రాంబిక తన తండ్రియాజ్ఞ ననుసరించి దౌహిత్రుని బుత్త్రునిగ పరిగ్రహించె' నని ప్రతాపరుద్రయశోభూషణమున నున్న దని వ్రాసిరి. ప్రతాపరుద్రయశోభూషణములో నట్లు లేదు. స్వయంభూనాథుని యాజ్ఞానుసారముగ రుద్రాంబిక యట్లొనర్చె నని యున్నది. వీరు నాటకములోని సంభాషణము సరిగ నర్థము చేసికొనలేదు. వీరు రుద్రాంబిక ప్రతాపరుద్రుని దత్తతచేసికొనె నని వేఱొక నిర్ణయమును గావించిరి. ప్రతాపరుద్రయశోభూషణమునఁ గాని, శాసనములలోఁ గాని చెప్పఁబడని యీసిద్ధాంతమున కాధార మేమో! రుద్రాంబ స్వయంభూదేవుని యాజ్ఞానుసారముగ దౌహిత్రుని పుత్త్రభావమున స్వీకరించె ననుటకు, ప్రతాపరుద్రుని రుద్రాంబ దత్తస్వీకార మొనర్చుకొనె నని యర్థము చెప్పుట తగదు.

కాకతీయులకాలమునాఁటి రాజ్యాంగతంత్రముం గూర్చి రామారావుగారు పరిశోధన గావింపలేదు. చాళుక్యకాకతీయ రాజ్యాంగతంత్రములం దొక్కచారిత్ర

కవి శేషమున్నది. మహారాజు బ్రతికియుండఁగనే, వృద్ధాప్యముచే రాజ్యభార మంతయుఁ దానె వహించుటకు వలనుపడక, పుత్రునికిఁ గాని, రాజ్యార్హునికిఁ గాని, యువరాజపట్టాభిషేక మొనరించి, రాజ్యాంగమునం దాతనిం బాల్గొనఁ జేయుట యాచార ముండెను. అంతియె కాని యిద్దఱును గలసి సంయుక్తపాలన మొనర్చు పద్ధతి లేదు. అందుచేతనే రుద్రాంబికకాలమునందే ప్రతాపరుద్రుని శాసనములలో కుమారరుద్రుఁ డనియు, కుమారప్రతాపరుద్రుఁ డనియుఁ బదముల ప్రయోగములుగలవు. కాని రామారావుగారు భావించినటుల రుద్రాంబయుఁ, బ్రతాపరుద్రుఁడు నొకకాలముననే రాజ్యభారము వహించియుండి రని, 56 వ పుటలో నిరూపింపఁబోవుట సత్యమైన చరిత్రవృత్తాంతముగాదు. అంనుచేతనే వీరిచ్చిన పరిపాలనా కాలనిర్ణయములు విపరీతములుగఁ గన్పట్టుచుండును.

కాకతీయ సంపాదకున కాంధ్రసారస్వత వికాసమునుగూర్చి యేమియును దెలియదు. తెలిసియుండినచో నిట్టివ్రాఁతలు వ్రాసియుండరు.

(1) ఆంధ్రకవితకు రాజమహేంద్రవరవిక్రమసింహపురములకుఁ బిమ్మట నోర్గల్లుపురమే రంగస్థలముగ నుండెడిది. (పుట 1)

(2) గీర్వాణాంధ్రవాఙ్మయపోషణమున కేకశిలానగరసామ్రాజ్యము పెట్టినది పేరుగనుండెను. (పుట 1)

(3) కాకతీయచక్రవర్తులయాదరముననే పౌరాణికయుగము పరిసమాప్తి నందినది. (పుట 1)

(4) ఆంధ్రవాఙ్మయమునకు రాజరాజ మనుమసిద్ధి ప్రతాపరుద్ర కృష్ణరాయాదులు మూలస్థంభులు. (పుట 79)

కాకతీయ మహారాజు లాదరించిన తెలుఁగుకవు లెందఱో, ప్రతాపరుద్ర చక్రవర్తి, యెట్లు ఆంధ్రవాఙ్మయమునకు మూలస్థంభుఁడో తెల్పకయే, పదాడంబరమునకుఁ బరువులెత్తి ప్రమాణరహితములైన సిద్ధాంతము లొనర్చుట ధర్మము గాదు. కాకతీయ సామ్రాజ్య మాంధ్రవాఙ్మయమున కాలవాలము గాదు. రాజరాజు, కృష్ణరాయలతోఁ బ్రతాపరుద్రచక్రవర్తిని జతసేయుట పాడికాదు. వీరికిఁ బ్రత్యుత్తరము శ్రీయుత దూపాటి శేషాచార్యులుగారు వ్రాసిన కాకతీయాంధ్రభాషాసేవ యను వ్యాసములోని యీక్రింది వాక్యములే ప్రమాణములు.

(1) ప్రోలరాజు......కర్ణాటకభాషకే ప్రాధాన్యత నిచ్చినటుల నూహింపవచ్చును. పుట 160.

(2) గణపతిదేవుని వాఙ్మయసేవ దెలుపు ప్రత్యేకగ్రంథము లేవో తెలియరావు. పుట 161.

(3) రుద్రమదేవి చక్రవర్తి కావించిన భాషాసేవను గమనింపజాలము. పుట 162.

(4) ప్రతాపరుద్రచక్రవర్తినాఁటి వగుచు నుపలబ్ధగ్రంథములలో భాస్కరరామాయణము బహుకర్తృకము. ప్రేమాభిరామ మదృశ్యము. పురుషార్థసారము నామమాత్రశరణ్యము. పుట 163.

కాకతీయ యుగములో నాంధ్రగ్రంథములు వెలువడినవి. తిక్కన సోమయాజిభారతము లేదా, కాని కాకతీయులాంధ్ర వాఙ్మయమున కొనర్చిన సేవ స్వల్పము. ప్రశంసింపఁదగినదికాదు.

గ్రంథములోఁ గాకతీయుల కాలమునాఁటి మతవిషయములను గూర్చిన ప్రశంసయు సమంజసముగ లేదు. మొదటి పుటలో బౌద్ధ జైన శైవ వైష్ణవ మతము లీకాలమునఁ బ్రబలి యన్యోన్యసంఘర్షణచేఁ గొన్ని క్షీణించుటయుఁ గొన్ని వర్ధిల్లుటయు సంభవించిన వని వీరు వ్రాసిరి. బౌద్ధజైనమతములు ప్రబలె నని వ్రాయుట సత్యముగాదు. అవిపూర్తిగ నిర్మూలము లయ్యెను. వీరు వీరశైవమతమును గూర్చి వ్రాసిన విషయములు విపరీతముగ నున్నవి. ముప్పది మూఁడవపుటలో "అట్టివాఁడే శివునితో నైక్యమునంద సర్హుఁడు ప్రతివారును గురులవలన దీక్షను గైకొని శివపంచాక్షరిని జపించుచు లింగపీఠార్చనము జేయుచు శివచిహ్నమగు లింగమును దేహమున ధరింపవలయును" అని యేమేమో వీరశైవమత సంప్రదాయములను బేర్కొనిరి. శివునితో నైక్యమందుట శైవమతసిద్ధాంతము గాదు, శివపంచాక్షరి వేఱుసు, వైష్ణవపంచాక్షరి వేఱును లేదు. పంచాక్షరి యను పదములోనె యాయర్థ మున్నది.

ఈ గ్రంథమునందు సంపాదకీయవ్యాసమె 112 పుట లున్నది. ఇంత వ్యాసము వ్రాయుట యనవసరము. సంచికయందలి వ్యాసములను సమన్వయించి యావ్యాసములను సంస్కరించి సంపాదకీయవ్యాసమును సంక్షిప్తముగ వ్రాయుట సంపాదకునిధర్మము. ఇతరులు వ్రాసిన వ్యాసములలో నెన్నఁదగినవి, బండారు తమ్మయ్యగారు వ్రాసిన "పాలకురికి సోమనాథకవి" మల్లంపల్లి సోమశేఖర శర్మగారు వ్రాసిన "కాకతీయుల కళింగము," నిడుదవోలు వెంకటావుగారు వ్రాసిన "కాకతీయాంధ్రవాఙ్మయము," శేషాద్రిరమణకవులు వ్రాసిన రెండువ్యాసము

లును, టేకుమళ్ల అచ్యుతరావుగారు వ్రాసిన 'క్రీడాభిరామము'ను, కిళాంబి రాఘవాచార్యులుగారు వ్రాసిన "ప్రతాపచరిత్రము" అను వ్యాసములు.

'కాకతీయుల—ద్రవిడవాఙ్మయము' అని సోమసుందరదేశికగారు వ్రాసిన వ్యాసములో నీక్రింది వింతచరిత్రాంశమును గమనింపఁదగినది. "క్రీ. శ. 1575 లో రాయ లోఢ్రులను జయించుట చరిత్రవిదితము" శ్రీకృష్ణదేవరాయలు క్రీ. శ. 1530 సంవత్సర ప్రాంతమున మరణించె నని చరిత్రకారు లొప్పుకొందురు. చచ్చి స్వర్గముననున్న నలుబదియైదేండ్లకుఁ దరువాత రాయలు గజపతులను జయించుట యెట్లు పొసఁగియుండెనో! కాకతీయసంపాదకు లీ ధర్మసందేహమును దీర్తురా!

కాకతీయుల కాలమునాఁటి సాంఘికచరిత్రమును గూర్చి రెండు మూఁడు వ్యాసము లున్నవి. చెప్పిన విషయమునే చెప్పినచోఁ జనువరులకు విసువు జనింపదా ! ఈసందర్భమున నొక్కసంగతి చెప్పవలసియున్నది. ఆంధ్రచరిత్రచతురానన బిరుదాంచితులు సుభాషిపత్రికలోఁ గాకతీయుల కాలమునాఁటి సాంఘికపరిస్థితులనుగూర్చి వ్రాసిన వ్యాసములోని యత్యద్భుత విషయములనుగూర్చి చేసినప్రశంస, యీసంచికయం దెచ్చటను గానరాదే! అట్టియమూల్యవ్యాసమునుగూర్చి వీరు వ్రాసిన కృతజ్ఞతాపూర్వక వాక్యమొక్కటియైనను లేదు.

కాకతీయసంచికానుబంధములో వీ రిచ్చిన శాసనపాఠములం దనేకములు తప్పులున్నవి. గ్రంథమునం దచ్చుతప్పులు పెక్కు లున్నవని వా రుపోద్ఘాతమునందే మొదట మనవిచేసికొనిరి. అట్టి యచ్చుతప్పులు వాక్యరచనలో నున్నచో సవరించి చదువుకొందురు గాని, శాసనములలో నున్నచో నేమిగతి ? ప్రతిశాసనపాఠమునందును వదలకొలఁది తప్పులున్నవి. అట్టి తప్పుల కుప్పలగు శాసనపాఠము లెవ్వరి కుపయోగించును? అట్టి యనుబంధము బహుజాగరూకతతో ముద్రింపవలసినభారము సంపాదకీయవర్గమునకుఁ గలదు. తప్పొప్పులపట్టికయే, యొక గ్రంథ మగు నని చెప్పినచో నతిశయోక్తి గా దని నేను జెప్పఁగలను.

గ్రంథశైలినిగూర్చి రెండుమూఁడు విషయములను జెప్పి, విరమించుచున్నాను. గ్రాంథికశైలి నవలంబించి, యర్థానుస్వారాదినియమములుపాటింపరైరి. పదాడంబరమునకుఁ బోయి యర్థములేని పదములను, అశ్లీలద్యోతకములగు పదముల నుపయోగించిరి. మచ్చునకుఁ గొన్నింటిని జూపుచున్నాను.

(1) "ప్రత్యక్షప్రమాణము." ఈపదము చాలసార్లు వీరు ప్రయోగించిరి. చరిత్రలోఁ బ్రత్యక్షప్రమాణ మెట్లుండును? ప్రత్యక్షప్రమాణమున కర్థ మేమో!

(౨) "యాదవనిశితధారలు." అర్థము గుమరదు. ఈనిశితధారలు యాదవులవియా ? యాదవఖడ్గములవియా? యాదవఖడ్గనిశితధారలని యుండనోపు.

(౩) కళింగభాగము కాకతీయసామ్రాజ్యమున కొక "మర్త్యస్థానముగ" నుండెడిది. ఇట్టి పదప్రయోగము లశ్లీలద్యోతకములు గావా ?

సంచికయందలి వ్యాసములలో మూడువ్యాసములు మండలివారి త్రైమాసికపత్రికయందలి యాంగ్లవ్యాసముల కాంధ్రానువాదములె. ఒకటి కళింగ సంచికనుండి పునర్ముద్రితము. అది మామిత్రు లగు సోమశేఖరశర్మగారి 'కాకతీయులు- కళింగము' అను వ్యాసము. ఈవ్యాసమును శర్మగారి యనుమతి లేకయే, సంచికయందు ముద్రింపించిరి. ఇట్టికార్యము సంపాదకీయవర్గము చేయఁగూడని పనియని నామనవి. గద్వాలసంస్థానమునకును గాకతీయచరిత్రకును సందర్భము లేదు. కాకతీయసామంతులగు సుప్రసిద్ధరాజవంశముల చరిత్ర విపులముగఁ జర్చింపక, గద్వాలసంస్థానమును గూర్చి పండ్రెండుపుటలు వ్రాయుటకుం గారణము గద్వాలరాణీగారు సంచికాప్రచురణమునకుఁ బోషకు లగుటయే.

గ్రంథ మామూలాగ్రముగఁ జదివినచో, కాకతీయసంచికాసంపాదకులు తాముచెప్పిన నూతనచరిత్రాంశములు, విపరీతాంశము లనియు, నిదివఱకుఁ జరిత్రకారులు చెప్పిన విషయములకంటెను, నూతనసంగతులు లే వని యుఁ దెలిసికొనవచ్చును. చెప్పిన నూతనవిషయములు సత్యదూరములు, నిరాధారములు.

కష్టపడి, గ్రంథమువ్రాసి, ప్రచురించి, యాంధ్రభాషలో నాంధ్రులకుఁ గాకతీయచరిత్రమును దెల్పవలె నన్న రామారావుగారి యభిలాష, ఆంధ్రచారిత్రక పరిశోధకమండలివారు నెఱవేర్చిరి.

ఈశ్వరదత్తు.

గీ. పలుదెఱంగులైన పలుకులు గలిగియుఁ, బ్రాలు వళ్ళు లేని బేలుగవిత
వన్నె లెల్లఁగూర్చి వ్రాయఁజోఁగాటుక, వన్నె లేని ప్రతిమవ్రాఁతఁ బోలు. ౧౯౧

క. తప్పక వళ్ళును బ్రాలును, ముప్పిరిగొనఁ దగినశబ్దములు మెఱుఁగెక్కం
జెప్పినకవితాచాతురి, యొప్పును వెట్టినపసిండియొఱపున మెఱయున్. ౧౯౨

క. పాదముల వళ్ళుఁ బ్రాసము, లాదిమము ద్వితీయ మైనయక్షరములు త
త్పాదంబుల యతు లవిసం, వాదముగాకుండఁ దగినవ ళ్ళిడవలయున్. ౧౯౩

వ. అందు వళ్లన్నవి—స్వరవళ్లు, వ్యంజనస్వరవళ్లు, గూఢస్వరవ్యంజనవళ్లు, వర్గ
వళ్లు, సరసవళ్లు, నెక్కటివళ్లు, సంయుక్తవళ్లు, ననుస్వారవళ్లుఁ, బోలికవళ్లు,
వృద్ధివళ్లుఁ, బ్లుతవళ్లు, నిత్యసమాసవళ్లుఁ, బ్రాసివళ్లుఁ నాఁ ద్రయోదశవిధంబు
లయ్యె నందు స్వరవళ్లెట్టి దనిన. ౧౯౪

క. అద్వయ మైజౌలకు నౌ, నిద్వయము ఋఋలు గూడ నేఏలకు నౌ
నుద్వయ మౌ నోఓలకు, విద్వన్నుత వళ్లు సెల్లు వీడ్వడఁ దమలోన్. ౧౯౫

ఇంక వ్యంజనస్వరవళ్లు—

క. ఈకొలఁదిఁ గాక కాదులు, గైకొని చెప్పుదురు వళ్లకడ నీస్వరముల్
పైకొనఁగఁ దత్స్వరంబులు, నాకడ వళ్లౌ నృపాలకాన్వయతిలకా. ౧౯౬

ఇంక గూఢస్వరవ్యంజనవళ్లు—

క. అన్యోన్యపరీక్షాదిప, దన్యాసములందు సంస్కృతస్వరములు[1] పూ
ర్వన్యాయంబుగ నగు న, న్యోన్యము వడి హల్లుసెల్లు నూతనకర్ణా. ౧౯౭

ఇంక వర్గవళ్లు—

క. రమణీజనమన్మథ భూ, రమణా నిజపంచమాక్షరము వర్జ్యముగాఁ
దమనాలుగక్షరమ్ములుఁ, దమలోఁ వళ్లయ్యెఁ గచటతపవర్గములన్. ౧౯౮

ఇంక సరసవళ్లు—

క. నయముగ చఛజఝశషసలు, నయహాలు ణణలును జెలంగు[2] యతి మీఁద నసం
శయగతిఁ దమలో వీడ్వడు, జయలక్ష్మీయువతిభోగసౌభాగ్యనిధీ.[3] ౧౯౯

ఇంక నెక్కటివళ్లు—

క. నరవరవంశవిభూషణ, మరవఱలను వళ్లొగిం దమకుఁ దామె యగున్
ధరజ్ఞణాలు మొదలచిన మం, తరపదములఁ గలుగునేని దగునట్లుగున్. ౨౦౦

1. సంభృతస్వరములు. 2. బెనంగి. 3. సౌందర్యనిధీ.

ఇంక సంయుక్తవళ్లు—

క. బుధసమ్మతి మిశ్రితబహు, విధవర్ణములందు వళ్లు వివరింపంగా
నధరీకృతఫల్గునశా,ర్ఙధరనిభా యెల్లయక్షరమ్ములుఁ జెల్లున్. ౨౦౧

ఇంక ననుస్వారవళ్లు—

క. అమరఁగ వర్గసితవ,ర్ణములపిఱుఁద బిందులూఁదినం బంచమవ
ర్ణములును వళ్లగు జయసం,భ్రమపరిచితపరనృపాల మానితకీర్తీ. ౨౦౨

ఇంకఁ బోలికవళ్లు—

క. పోలును[1]బుఫుబుభులకు మూ, పోలికవడి యనఁగ నంత్యమున యతి మీఁదం
దేలి బుకారముపట్టను, భూలోకసురేంద్ర యోగ్యముగఁ జనుదెంచున్.

క. తెలుఁగుననది కెడి శబ్దం, బులమీఁదిమకార మందముగ స్వత్త్వమునన్
నిలుచు నట పావడికిన్నై, పలుకుటకంటెను భజించుఁ బావడియైనన్. ౨౦౪

ఇంక వృద్ధివళ్లు—

క. సుగుణైధిత నగరౌషధి,నగౌఘనైకాదియోజనలసంధులఁ బెం
పుగ వృద్ధు లండ్రు వానికి, నగు నయహాలు వళ్లు నరవరౌఘశరణ్యా. ౨౦౫

ఇంకఁ బ్లుతవళ్లు—

క. గానప్రశ్నవిధానా,హ్వానములఁ ద్రిమాత్రమైన యత్వము నుభయా
ధీనమునై వళ్లకుఁ జన, నా[2]నిని నీవేమి యెఱుఁగవా సర్వజ్ఞా. ౨౦౬

ఇంక నిత్యసమాసవళ్లు—

క. డాయఁగ సమసింపఁగఁ బా,రాయణ నారాయ ణాంతరం గానేకా
నాయాసాదులఁ గర్ణర,సాయనముగ రెండువళ్లు జరగుచునుండున్. ౨౦౭

క. ఇది చేతిది పోచక పి,న్నది కట్టెఁడు దానికంటె నల్లల ననునీ
పదముల నుభయముగాన ను,న్నదివళ్లకు ననుమతంబు నరలోకేంద్రా. ౨౦౮

ఇంకఁ బ్రాదివళ్లు—

క. మేదినిఁ బ్రపరిప్రతినిప,రామురుపాపాత్యవవినిరాజన్యభిసం
సూదప్యధులన నిరువద, ప్రాదులు యతి తత్స్వరములు హల్లులుఁ జెల్లున్.

సీ. ప్రమదాజనేక్షణప్రార్థితసౌందర్య యాచకసంతతిప్రార్థనీయ
పృథ్వీసురప్రజాభీష్టసంధాయక యిభముఖ్యసైనికాభీష్టయాత్ర
పరమధర్మక్రియోపాయసంచితకీర్తి యరిదుర్గసాధనోపాయవేది
వివిధశాస్త్రాగమ వీక్షణతాత్పర్య యిందిరాసత్కృపావీక్షణీయ

1. పోలఁగ 2. జనఁగా.

రాజనీతిగుణనిరంతరవైభవ, యష్టసిద్ధిబలనిరంతరాయ
ప్రాదివళ్లకిది యుదాహరణం బయ్యె, విద్వదంబుజార్క విక్రమార్క. ౨౧౦

వ. మఱియుఁ బ్రాసంబు లన్నవి ద్వ్యక్షరప్రాసంబు, ద్విప్రాసంబు, త్రిప్రాసంబు, చతుష్ప్రాసం, బంత్యప్రాసం, బనుప్రాసంబు నన నాఱుదెఱంగులయ్యె నందు ద్వ్యక్షరప్రాసం బన్నది. ౨౧౧

క. దృక్కంజులవిలసన్మృగ, దృక్కన్మథరూప వసుమతీవరతిలకా
దిక్కండలభరితయశ,స్సిక్కండన యిట్లు ద్వ్యక్షరప్రాస మగున్. ౨౧౨

ద్విప్రాసము:—

క. నవరసములు నమరం బద,వివరణభరణీయమైన వెరవునఁ గావ్య
ప్రవరమతులైన కవులీ, వివరంబునఁ జెప్పిరేని ద్విప్రాస మగున్. ౨౧౩

త్రిప్రాసము:—

క. సరములుగూర్చిన క్రియ న,క్షరములు పాదములఁ గలయఁ గవిరాజమనో
హారము లన సముచితార్థ, స్థిరములుగాఁ జెప్ప నిట్లు త్రిప్రాస మగున్. ౨౧౪

చతుష్ప్రాసము:—

క. భూషణముగఁ గైకొని రస,పోషణముగఁ గ్రాలు నర్థపోషణమున ని
ర్దూషణముగఁ జెప్పిన కవి, తోషణముగఁ గృతుల నివి చతుష్ప్రాస మగున్.

అంత్యప్రాసము:—

క. అనుపమపుణ్యవిశేషా, ఘనబలవిద్వేషినికరఖండనరోషా
వినయనయవినుతవేషా, విను మంత్యప్రాస మయ్యె విక్రమభూపా. ౨౧౬

అనుప్రాసము:—

క. ఈప్రాసప్రకరంబు శ్రు,తిప్రసవదళప్రభాప్రదీప్తంబై లో
కప్రకటార్థప్రసృతి న,నుప్రహితంబైనచో ననుప్రాస మగున్. ౨౧౭

క. అని లక్షణయుక్తముగా, వినిపించిన సంతసించి విభుఁ డద్దేశం
బునఁ బరఁగెడు నుడుగులఁ గల,నునుపునఁ బద్యంబుఁ జెపు మనుడు నిట్లనియెన్.

సీ. పొదలినకూటమి పిదప మెల్పునఁ గల గనయంబు డాకేలఁ గొని తెమల్చి
పోఁడిమి గలపాఁపతేఁ డనుసెజ్జపై నూఁతగా వలకేల నొయ్య హత్తి
క్రొమ్ముడిఁ జెరివిన కమ్మనిక్రొవ్విరు లెడలి వెన్నున జాఱి కడలుకొనఁగ
లేచి వేంచేయుచోఁ జూచి వెన్నుఁడు సొంపు రెట్టింపఁ గమ్మఱఁబట్టి యెడఁదఁ
దమక మినుమడిగాఁగొనుదక్కఁ దొడిగి, బిగువుఁగౌఁగిటఁ గదియంగఁ దిగిచి తీవుట
మోవిగదియంగఁ గోర్కు లుమ్మూరిఁ బుచ్చు, కలిమియాభిడ చూడ్కులుగాచుఁగాత.

వ. అని చదివినం జెవులకుం జవులు చిలుకు నచటి పలుకులకు సరసభావంబు
లకుం బులకించి నృపతితిలకుం డచటి యాబిడ యనుశబ్దం బది స్త్రీవాచకం
బుగదా యనవుడు విద్యాకరుం డగుకమలాకరుం డిట్లనియె. ౨౨౦

సీ. ఎలనాఁగ తొయ్యలి యింతి ముగ్ధియ నాతి ప్రోయాలు పొలఁతుక పువ్వుఁబోఁణి
చెలువయుఁ గలకంఠి చేడియ నెలఁతుక మగువ మెఱుఁగుబోఁడి మచ్చెకంటి
యుగ్మలి యాబిడ యువిద వాలుంగంటి యన్ను చిగురుఁబోఁణి యతివ పడఁతి
లేమ క్రాల్గంటియుఁ జామ పొలఁతి కొమ్మ తీఁగఁబోఁడి మడఁతి తెఱవ బోటి
వెలఁది ముదిత గొంతి మెలఁతుక పడఁతుక, నెలఁత యిగురుఁబోఁడితలిరుఁబోఁడి
యనఁగ సతులపేళ్లు తెనుఁగున నలువది, వెలయుచుండు నిట్లు విక్రమార్క.

వ. అనిన నచ్చాతురికిం బరిణమించి ధరణీరమణుం డారీతి రత్నమాలిక యతని
యుఱుత నిడి కర్ణానందంబుగా నాకర్ణించితి విలోకానందంబుగా విలోకించితి
నిట్టి దెద్దియేనియు వింత గలిగినఁ జెప్పు మనవుడు నాకమలాకరుండు. ౨౨౨

క. అవనీశ నీగుణంబులు, చెవులకుఁ జవు లొసఁగి విందు సేయుచునుండుఁ
నవలావణ్యమయం బగు, భవదాకృతి చూపు గనులపండువ గాదే. ౨౨౩

మ. జగతీనాయక సర్వవిస్మయనివాసం బైన నీ విప్పు డిం
పుగ న న్నచ్చెరు వేమి గంటి వని సంబోధించి తేఁ జెప్పఁగాఁ
దగ ద ట్లయ్యును విన్నవింతు నిజవిద్యాకాంక్ష నాఁ డేఁగి యు
క్కగతిన్ సస్యఫలప్రశస్యతలమౌ కాశ్మీరదేశంబునన్. ౨౨౪

గీ. అగ్రహారములోన బుధాగ్రగణ్యుఁ, జంద్రచూడుని గురునిఁ బ్రసన్నుఁ జేసి
సిద్ధసారస్వతమున వాక్సిద్ధి వడసి, పీడుకొని తిరిగితిని నావిద్యమెఱసి. ౨౨౫

మ. భవదాజ్ఞావశవర్తు లౌ నృపులతో భాషించుచు న్వచ్చి వ
చ్చి వియత్సంచరరమ్యహర్మ్యగణమై చెల్వారు కాంచీపురం
బవలోకించి యచేఁగి యందు జయసేనాఖ్యున్ విభుం గాంచి యు
త్సవలీల న్నెలనాళ్లు నిల్చితి మనస్సంభావ్యసంభావనన్. ౨౨౬

క. ఆపీటను నరమోహిని, నా వెలయుచు నిఖిలమోహనం బైన మహా
లావణ్యంబున మరునం,జీవని క్రియ నున్న యొక్క చెలువం గంటిన్. ౨౨౭

సీ. క్రాలుగన్నుల నెమ్మొగమ్మున గళమున నబ్జవిజృంభణ మాలి సేయు
జఘనస్థలంబునఁ జనుఁగవ నతనాభిఁ జక్రవైభవము నతిక్రమించు
స్వరమునఁ దనుమార్దవమున బింబాధర ద్యుతిఁ బ్రవాళగుణంబు నోటువఱుచుఁ
బదతలంబుల మురిపంబులఁ బమ్యోదఁ బల్లవరాగంబు ప్రబలఁ బొలయుఁ

గన్నయంతన కన్నులకఱవు దీర్చు, నట్టిరూపంబు వర్ణింప నలవి గాదు
చెప్పవచ్చునె పడియచ్చు సేయఁ దరమె, రక్షణోపేంద్ర విక్రమార్కక్షితీంద్ర.

గీ. ఆనెలఁత రాక్షసాశ్రిత యగుటఁ జేసి, పాముతల నున్నరత్నంబుభాతి నుండుఁ
గోరి యెవఁడైన దానిని జేరనేని, దానవుఁడు రేయి పఱతెంచి వానిఁజంపు.

మ. ఇది చిత్రం బని చెప్పిన న్విని ధరిత్రీశుండు కౌతూహలం
బు దలిర్పం గమలాకరా యచటియంభోజాననం జూడనే
గుదమే రమ్మని వానిఁ దోడుకొనుచుం గ్రూరాసి చేఁదోడుగాఁ
గదలెం గాంచికిఁ గాంచనాంచితనిజత్ర్మాకామినీకాంచికిన్. ౨౩౦

వ. ఇట్లు కతిపయదివసంబుల కాపురి సొచ్చి గూఢవేషంబునం దిరుగుచు రాజమార్గంబున నున్న నరమోహినిం జూచి తదీయలావణ్యపయోధిలో మునిఁగినదృష్టిం దివియంజాలక తన్నుఁ దాన సవరించుకొని. ౨౩౧

క. సురకిన్నరపన్నగఖే,చరకన్యలఁ జూచినాఁడ సరిపోల్పఁగ నే
తరుణులు లే రీతరుణికి, నరమోహిని యనఁగ నున్ననామంబ తగున్. ౨౩౨

క. చూపులు మర్మము గాఁడెడు,తూపులు మురిపముల వలపుఁదూపులసరికిం[1]
బ్రాపులు సతినిలు వంతయుఁ, దీపులు నగు మన్మథాస్త్రదేవతసుమ్మీ. ౨౩౩

క. ఈపొలఁతి రాక్షసాశ్రిత, యై పన్నగసహితచందనాకృతి మెఱయున్
దీపితయై వెఱపించెడి, వ్యాపారముకొలఁదిఁ జూడవలయును మనకున్. ౨౩౪

క. కావున నీ వింటికిఁ జని, నే వచ్చెద ననుచుఁ జెప్పు నెలఁతుక తోడన్
నావుడుఁ గమలాకరుఁడును, నా వెలఁదికిఁ జెప్పి వచ్చి నరపతి కనియెన్. ౨౩౫

గీ. దేవయీమాటఁ జెప్పినఁదెఱవనవ్వి,యొయ్యఁబలుకుచునిదురకునియ్యకొనుచుఁ
గర్బురుం డనునొక్కరక్కసుఁడు గలఁడు, వాని మఱవక రమ్మని వనితచెప్పె.[2]

క. నావుఁడు నావీరవరుం, డావిప్రునిచేతఁ బోఁక లాకులు విరులున్
రో వెలయుం దగఁ బంపిన, నా వెలఁదియు నందుకొనియె నతివిస్మిత యై. ౨౩౬

సీ. అయ్యెడ దశరథునాజ్ఞపోలిక బ్రహ్మ కట్టడిఁ గాలంబు గడవరాక
జనకజ కెనయైన దినలక్ష్మి తనతోడు నీడకై వడిఁ దోడఁ గూడినడువ
సౌమిత్రిగతి [3]మునిసవనంబునకు మున్ను దోడైనయరుణుండు తోడుగాఁగ
సాకేతపురిలోని జనులవక్త్రంబులవడువున జలజము ల్వాడువాఱఁ

1. మరుకున్. 2. నొక్కచిక్కనుగలదొక్కరక్షసుండు, చేరిచనుదెంచు నీవింతఁ జేయుమనియె. 3. సాహసమునకుమున్నుగా.

గైకవంకవారిపగిదిఁ గలువ లుబ్బఁ, జిత్రకూటము క్రియ నస్తశిఖరి దాఁటి
రాక్షసులభంగి నటఁ దిమిరంబునడువ, వనముసొచ్చె రఘువరునివరుస నినుఁడు.

గీ. గడియకుడుకభంగి గ్రహరాజు జలధిలోఁ, వ్రాలఁ జుక్కలు దలఁబ్రాలుగాఁగఁ
గెంపు హోమవహ్నిక్రియ నొప్పఁగా ద్విజ,రాజు పెండ్లియాడె రాత్రిసతిని.

క. నలఁగినవిరులును గుఱుమా,పులయిన చీరలును నుదుటి బొట్టులు నెడగా
జులుఁ గమ్మటాకులును సొ,మ్ములుగాఁ దమక్రంతలందు మురిసిరి జంతల్. ౨౪౦

సీ. తిలకంబుఁ గొప్పుపువ్వులుఁ బూఁతలును గనుపట్టఁగా మెలఁగెడుదిట్టవిటులు
నిఱుకిండ్లఁ బాతికపరక కొంగున ముడ్చికొని ముసుంగిడి చొచ్చుగూఢవిటులు
బోఁటికత్తియలు పల్లాటును బిలువఁగా మెరవడిఁ దామేఁగు మేటివిటులుఁ
గనియుఁగానకయుండఁగా నోరముసుఁగుల నగపడ్డచో నిల్వఁ దగినవిటులుఁ
బెట్టలేమి వెడలఁగొట్టిన చోటికిఁ, బొంచి పడపుచెఱచు క్రించువిటులుఁ[1]
గ్రందుకొనఁగ వారకాంతల వాడలఁ, బచ్చవింటివాఁడు పెచ్చుపెరిఁగె. ౨౪౧

వ. అట్టియెడఁ గొందఱు విటులు లంజియలతల్లుల బిఱుసులకు వెఱచి యందఱు
నొక్కెడంగూడి తమలో నిట్లని వితర్కించిరి. ౨౪౨

క. మునుమున్నగ గొఱియలుఁ గూ,డును మొదలుగ నిడక చనువిటునిఁబణ్యస్త్రీ
జనని మెడ విఱిచి కొను నది, ధనముపయిం గాచియున్న దయ్యము చుమ్మీ.

వ. అనుడు మఱియు నొకరుం డిట్లనియె. ౨౪౪

క. వారాంగన మధురసవి,స్తారాకృతి యనఁగఁ జెల్లుఁ దజ్జనని విటుం
జేరఁగనీ దచ్చట సహ,కారఫలము పొంతనున్న కడుఁదారు చుమ్మీ. ౨౪౫

వ. అనిన మఱియు నొక్కరుండు. ౨౪౬

క. వెలయాలితల్లి కూఁతుం, గలఁచి విటుఁడు వచ్చెనేనిఁ గలుపించినఁ దాఁ
దలతోన మ్రింగునది ని,ర్మలజల మగు మడుఁగులోని మకరము చుమ్మీ. ౨౪౭

వ. నావుడు నితరుండు. ౨౪౮

క. పరికింప లంజతల్లికి, దొరయైనను దుచ్ఛుఁడైన దొరకినఁ జాలుం
బొరిగొను నది యీపురిలోఁ, నరమోహిని నంటియున్న నరభోజి సుమీ.

వ. నా విని యపరుండు. ౨౫౦

క. పుడమి నిఁక లఁజతల్లిం, గడుమీఱిన యట్టికీడు గలదే యది యె
య్యెడఁ జూచినఁ గూఁతునకు, న్నెడకోణము దొడ్డ గుదియ[2] మిండలకెల్లన్.

1. చొచ్చి వెరవు చెరచిపుచ్చువిటులు. 2. త్రాపుగుదియ.

వ. అనవుడుఁ దోడివాఁడు. ౨౫౨

క. ఆకూఁతుఁ గన్నయప్పుడ, చేకొని తజ్జననియాకుఁ జంపక వెడఁగై
లోకేశుఁడు పామునకుం, గాకికిఁ గలయాయు వేల కలుగఁగఁ జేసెన్. ౨౫౩

వ. అనినం దత్సఖుండు. ౨౫౪

ఉ. ప్రేమరసంబు తేటలనఁ బెక్కు గుణంబులు గూర్చి వారకాం
తామణులన్ సృజించి పరతంత్రతఁ ద్రోయఁగనున్న దిగ్గనం[1]
దామరచూలి లంజియలతల్లులఁ జాపఁడు లంజకాఁడు గా
కేమనవచ్చు నాతని నశేని ఏటావలి నిస్తరింపదే. ౨౫౫

వ. అని పెక్కువిధంబుల వితర్కించుచున్న మఱియు నొక్కెడం గొందఱు సుందరులు పానగోష్ఠికిం గడంగి కాదంబంబును, మాధవంబును, నైక్షవంబు, క్షీరంబు, నాసవంబు, వార్క్షంబు, రతిఫలంబు లనఁ బాకభేదంబుల మూలస్కంధకుసుమ ఫలసంభవంబుల బహువిధంబుల మధురంబులైన మధువిశేషంబు లెల్లం బరిమళద్రవ్యపరిమిళితంబుగాఁ గూర్చి పాత్రంబుల నించిన- ౨౫౬

క. అతిమధురంబైననిజా, మృతరసములకంటె నిదియమే లని తారా
పతి చేరెనొక్కొ యనఁ ద,త్ప్రతిబింబము లలరె దివ్యపాత్రంబులలోన్. ౨౫౭

వ. అప్పుడు. ౨౫౮

సీ. కామాక్షికిని మహాకాళికిఁ జండికి నక్కజయ్యకుఁ[2] గాళి కంబికకును
వింధ్యవాసిని కేకపీరకు మున్నుగా నెల్లవేల్పులకు బిందించి మ్రొక్కి
త్రావుచు నెడనెడఁ దాల్పుఁగా వండిన నంజుటిపొరకలు నంజుకొనుచు
గ్రుక్కెడు చవిచూడు మక్క యీమధువని తీపులు దమలోనఁ జూపుకొనుచు
నెట్టివస్తువు లడియించెనీతఁడనుచు, బ్రహ్మఁగొనియాడియు దెసాఁకఁబట్టుమనుచుఁ
బొట్టకొలఁదిగఁ బోంట్లకుఁ బోసిపోసి, పరిణమించిరి యొండొండఁ దరుణులెల్ల.

సీ. ఈవారుణీరసం బీశుండు దన కది సమకూరకునికి విషంబు ద్రావె
మధువైరి యగుట నీమధువున కెడరయ్యు హరి మాధవాఖ్యను శరణుసొచ్చె.
నీసుర లేక గంగాసార మున్న యాతలఁ జేరెఁ జంద్రుండు బలుపుదక్కి
యీమదిరాస్వాద మెడలి విఘ్నేశుండు పొగులఁగా లోలోనఁ బొట్టయుబ్బె
నిట్టిమద్యము గని పట్టి త్రావఁగ లేక, శక్తిసేవ సేసె షణ్ముఖుండు
అనుచుఁ జతురయైన యతివ మైరేయంబుఁ, బొగడుచుండ నొక్కపొలఁతి వలికె.

1. తోదసయున్న దెగ్గనన్ 2. గన్న జియ్యకు.

క. పరిమళముఁ గొన్నయంతనె, పరవశమై మేను హర్షభరితం బగు నీ
సుర గలుగ నమృతమునకున్, సురలంబుధిఁద్రచ్చి రిట్టిచోద్యముగలదే. ౨౬౧

వ. అనవుడు నొక్కర్తు. ౨౬౨

క. సుఖములతల్లి మనోభవు, సఖి యీసుర దొల్లి శుక్రశాపంబున స
న్ముఖులకు నెడగాకుండిన, నఖిలజనులచేత దక్కునా మన కనినన్.[1] ౨౬౩

వ. మఱియొక్కర్తు. ౨౬౪

క. ఎక్కడిశుక్రునిశాపం, బక్కడఁ గొండఱకు భాగ్య మించుక యైనన్
లెక్కకు నెక్కనికతమున, డక్కెఁ జుమీ మధువు లేర్పడ న్మన కెల్లన్.[2] ౨౬౫

వ. అని తమనేర్పులం గొనియాడుచు నానందంబున మాటలు తొట్రుపడఁ బలుకు చుం బయ్యెదలు సవరించుటలు మఱచి లజ్జలు దొలంగ బహుప్రకారంబుల నున్మత్తభావంబులు దోఁపం బ్రవర్తిల్లి. ౨౬౬

ఉ. ఇంపు మనంబులోన నటియింపఁగఁ జెక్కులమీఁదఁ గన్నులం
గెంపువహింప మోవిఁగల కెంపు చలింపఁగ ఘర్మబిందువుల్
సొంపిరివోవ ముద్దుమొగముల్ మెఱుపెక్క రతాంతసంగతిన్
సొంపువహించి రంగనలు సోలుచు నమ్మదిరామదంబునన్. ౨౬౭

సీ. అక్క మీతల్లి మాయత్త[3] యహా నెఱఁగితిఁ గోడలితల్లి నాకూఁతు రగుట
మాతల్లిమఱఁది మామామ సభ్యులక్రియ నుయ్యఁ[4] జంకిటనిడి యొయ్యనరిగ
మాబావకొడుకు నామఱఁది గాలపువేటఁ గొమ్ములకుందేలుఁ గొట్టితెచ్చె
నిదిసెప్పఁ గొఱఁతని యిదికల్లసేయక చెవులారఁజూడు నేఁజెప్పినట్టు
లనుచు లోకవిరోధోక్తులాడుకొనుచు, సొలపులూరఁగ నోరచూపులునటింప
వట్టినగవులఁ జప్పట్లువెట్టికొనుచు, నాడఁజొచ్చిరి చేడెలు పాడిపాడి. ౨౬౮

వ. ఇట్టివినోదంబులు సూచుచు విక్రమాదిత్యుండు త్రివిక్రమాపత్యంబు తోడరా నరమోహిని గేహంబున కేఁగి తదాళీపరిచరితసముచితోపచారంబులు గైకొని హంసతూలికాపర్యంకంబుపై సుఖాసీనుండై సరసవాక్యంబులం బ్రొద్దుపుచ్చి.

క. నరమోహిని మీరక్కసుఁ, డరుదెంచి తలంగకుండ నాలోపల ని
న్నరయుచు నుండెద నని భూ, సురయుతుఁడై యధిపుఁ డట్లుసొచ్చెన్ బుద్ధిన్.

1. నిఖిలజనులచేతఁ దక్క నేర్చునె సుధామున్ 2. దక్కెం బో మధువు నేఁడు దగమనకెల్లన్
3. మాయక్క 4. నొయ్య-నయ్య.

క. ఆలోన నోడిఁగి యున్నెడ, నీలాలక శయ్యమీఁద నిద్రింపఁగ నా
భీలనయనాంతదంత,జ్వాలలు నిగుడంగ నసుర వచ్చెం బెలుచన్. ౨౨౧
ఉ. అచ్చట నొంటినున్న సతి నార్చుచు వేసి యదల్చి నీవిటుం
డెచ్చట డాఁగెఁ జూపు మని యీడ్చి గృహాంగణసీమ కేఁగఁగాఁ
జెచ్చెర విక్రమార్కుఁ డొకసింహము చాడ్పున నేన వీఁడుగో[1]
వచ్చితినంచు నార్పుఁగొని[2] వచ్చెఁ గరాళకృపాణపాణియై. ౨౨౨
క. అటువచ్చిన దనుజుఁడు గిట, కిటఁ బండులు గీఁటుకొనుచుఁ గినుకవాఁడిమి యు
ద్భటవృత్తి నెగసిచం గని, భటధర్మము దప్పి తోడి పాఱితి వనుచున్. ౨౨౩
క. దుర్బలుఁడ వోరి నిదగు, దోర్బల మిది యెంత నన్ను దొరసెదు విను నేఁ
గర్బురుఁడఁ దొల్లి నాచే, నర్బుదసంఖ్యలుగ మనుజు లణఁగిరిచుమ్మీ. ౨౨౪
శా. వారిం గూడఁగ నేఁగు మంచు గద వైవం జేరిసన్ భీముఁ డా
కౌరవ్యేంద్రుని నేలఁ గూల్చుగతి నాత్మానాయకుండుం దదీ
యోరుద్వంద్వము నొంచి కూల్చి భువి దైత్యున్ ఖండతుండంబుగా
ఘోరాస్త్రాహతిఁ జ్రోవుచేసె, సుర లుత్క్రోశించి[3] వర్ణింపఁగన్. ౨౨౫
క. రక్కసుఁ డనియెడు చీఁకటి, నుక్కడఁపి శుభోదయమున నొప్పుచుఁ దమకున్
దిక్కైన విక్రమార్కుని, నక్కమలాకరుఁడు చూచి హర్షం బందెన్. ౨౨౬
క. తత్సాహసబలధైర్యస,ముత్సేకంబులకుఁ జోద్య మొంగుచుఁ బ్రియసం
విత్సమ్మతి నరమోహిని, యుత్సుక యై మ్రొక్కి పలికె నోభూనాథా. ౨౨౭
క. నామంబున నరమోహిని, నామెఱయుఁగ వీనిచేత నరఘాతినినా
నామీఁద నున్నకీ డిదె, నీమాహాత్మ్యమునఁ బాసె నిమిషములోనన్. ౨౨౮
క. కావున నాకేవిధమునఁ, గావం బ్రోవంగ నీవ కర్తవు పను లొఁ
గా వనక యొద్దిపంచినఁ, గావించెద నడిగమునకుఁ గైకొను నన్నున్. ౨౨౯
గీ. అనుడు వసుమతివల్లభుం డల్ల నవ్వి, యొద్దిపంచినఁ గావింపనియ్యకొంటి
వనజలోచన జాతిఁ బద్మినివి నీవు, సరసగంభీరుని గమలాకరు భజింపు. ౨౩౦
క. ఓకమలాకర మునునీ, వీకమలానన భజింప నింపొందితి నేఁ
డీకాంతామణిఁ గైకొని, యేకాంతక్రీడ నిలువు మిచ్చట సుఖివై. ౨౩౧
వ. అని పరస్పరకరగ్రహణంబు చేయించి. ౨౩౨

1. వీఁడకో 2. నార్చుకొని 3. సురలుత్క్రోశించి.

గీ. లంకలోని రాజ్యలక్ష్మి విభీషణు, కిచ్చి వచ్చు రాఘవేంద్రు పగిది
దితిజుఁ జంపి వారసతి నాశ్రితున కిచ్చి, విజయలక్ష్మిఁ గూడి విభుఁడు గదలి.

క. వాలుంగంటి నిలువు మని, వాలాయింపంగ నేఁగవలయు ననుచు న
వ్వాలుమగఁడు మెఱుఁగారెను, వాలు సహాయముగ మగిడి వచ్చెం బురికిన్.

క. కావున నీకీగుణములు, లేవైనను గద్దె నెక్క లే విట మగుడం
బోవుట మే లనవుడు భోజావనిపతి సిగ్గుపడుచు నల్లనఁ దిరిగెన్. ౩౮౫

శా. జీమూతాళికురంగనాభిశశభృచ్చిహ్నమరేంద్రోపల[1]
వ్యోమేందీవరసామజాత్మయమునాహాలామాగ్నిధూమాంజన
శ్యామాకారు సమస్తకల్మషతమస్సందోహమార్తాండు ను
ద్దామానంతయశోభిరాముని రమాధామున్ గుణస్తోమునిన్. ౩౮౬

శా. సర్పాధీశ్వరకుందచందనపయశ్చంద్రాబ్జమందాకినీ
కర్పూరామృతహారహీరతుహినాకారానుకారాకృతిన్
దర్పారూఢపికద్విరేఫశుకబృందానోహకోత్సాహకం
దర్పాటోపవనాంతదావదహనుం దైత్రిలోక్యరక్షామణిన్. ౩౮౭

మాలిని. వివిధసురవరేణ్యా వేదవేదాంతగణ్యా
భవతిమిరదినేంద్రా భక్తకారుణ్యసాంద్రా
సవినయజయలోలా సర్వలోకానుపాలా[2]
భవమధుపురూపా భవ్యదివ్యస్వరూపా.[3] ౩౮౮

గద్యము. ఇది రాయగజగంధవారణ వైరిమండలికభేకఫణీంద్ర వీరఘోట్టవిభాళాది బిరుదప్రకటచారిత్ర కళింగదేశనిర్ధూమధామ త్యాగనాగార్జునకర్ణాటద్రవిళాంధ్రమహారాష్ట్రభూపాలరూపనూపురసుందరచరణారవింద సనదప్రోలిపురవరాధీశ్వర వెలనాఁటిపృథ్వీశ్వరరాజ్యసముద్ధరణ శ్రీకొఱవి వెన్నయామాత్యపుత్ర హారితసగోత్రపవిత్ర సకలసుకవిమిత్ర కసవరాజతనూజ గోపరాజవిరచితంబైన సింహాసనద్వాత్రింశిక యను కావ్యంబునందు రత్నోద్భవుకథయును మూషకోపాఖ్యానంబును విక్రమార్కునిసాహసికత్వమహౌదార్యత్వంబులును గమలాకరుకథయు నన్నది చతుర్థాశ్వాసము.

---

1. శశిభృచ్ఛ్రీశ్యామలేంద్రోపల. 2. సర్వలోకానుకూలా, 3. భవతుదివిజరక్షా పద్మపత్రాయతేక్షా.

శ్రీ

# సింహాసన ద్వాత్రింశిక.

## పంచమాశ్వాసము.

---

క. శ్రీమత్పన్నగఫణామణి,ధామావృత బాలతుహినధామాంశునిభ
వ్యోమాపగాంబుసుమనో,దామాచరితావతంసు దక్షధ్వంసున్.[1] ౧

ఉ. ఇచ్చఁ దలంచి భోజధరణీశ్వరుఁ డంత గ్రహానుకూలత
న్మెచ్చుగునట్టిలగ్నమున నిల్చి మహాసన మెక్కఁబూనఁగా
నచ్చటిబొమ్మ వల్కె విను మర్థికి నుజ్జయినీపురీశ్వరుం
డిచ్చినభంగి నీగి మెఱయింపక నీ కిది యెక్కవచ్చునే. ౨

క. అనవుఁడు జనవల్లభుఁ డా,తనివితరణ మెట్లు మెఱసెఁ దగఁ జెప్పు మనం
దనమోవి[2] మందహాసం, బునటింపఁగ నిట్లు దశమపుత్రిక వలికెన్. 3

—: పదవబొమ్మకథ :—

సీ. ఎవ్వనిసాహసం బేవేళఁ జూచినఁ బరహితంబుల కెల్లఁ బట్టుఁగొమ్మ
యెవ్వనియాజ్ఞ భూమీశుల శిరముల మౌళిరత్నావళిమాడ్కి మెఱయు
నెవ్వనివైభవం బెల్లయాచకులకు ముంగిటిపెన్నిధి భంగిఁ దోఁచు
నెవ్వనిసత్కీర్తి యీరేడుజగముల నాటపట్టుగ నిండి యాడుచుండు
నతఁడు సామాన్యజనుఁడె ధీరాధినాథ, నిర్మలాత్మకుఁ డత్యంతధర్మమూర్తి
శత్రుసమవర్తి నృపలోకచక్రవర్తి, సత్యసంధుండు విక్రమాదిత్యవిభుఁడు. ౪

క. అట్టివిభుం డుజ్జయినీ,పట్టణమున రాజ్యలక్ష్మిఁ బరఁగుచుఁ బ్రజఁ జే
పట్టి తగఁ బెంచి సంపద, దట్టంబుగ నిల్పి తల్లిదండ్రులమీఱెన్. ౫

వ. అట్టిదినంబుల. ౬

క. అకళంకచిత్తుఁ డార్యుఁడు, సకలాగమమంత్రతంత్రసారజ్ఞుఁడు భి
క్షుకవేషధారి యవధూ,తకుఁ డనఁగా నపుడు వచ్చెఁ దత్పురమునకున్. ౭

ఉ. అచ్చటి దేవతాగృహమునందు గతస్పృహవృత్తి నుండఁగా
నచ్చెరువంది పౌరజను లాతనివర్తన విన్నవించినం
జెచ్చెరఁ దోడి తెం డని ప్రసిద్ధులఁ బంచిన రాకతక్షితిం
దచ్చరితంబుఁ జూడ వసుధావరుఁ డయ్యెడ కేఁగె వేడుకన్. ౮

---

1. తావతంసి దక్షధ్వంసీ. 2. మోము,

క. అవనీసురరక్షకుఁ డగు,నవనీశ్వరవరుఁడు చనినయవసరమున న
య్యవధూతకల్మషుం డగు,నవధూతకుఁ డతనిఁ గరుణ నవలోకించెన్. ౯

క. తత్కరవిహితోపాయన,సత్కార మనుగ్రహించి సంయమిపతి వి
ద్వత్కులరత్నము భూవరుఁ, దత్కాలసముచితగోష్ఠిఁ దగులంజేసెన్. ౧౦

క. మాటాడక యాతఁ డడిగిన, మాటలలో సకలశాస్త్రమర్మంబులు వ
ల్మాటుచు నానావిధములఁ, దేటపడం దెలిపె భూపతికిఁ బ్రియ మడరన్. ౧౧

క. నిధ్యానంబున నజున క,సాధ్యం బగుతత్త్వబోధసారము కుదురా
నధ్యాత్మవిద్యమర్మము, మధ్యమజగతీశునకు సమస్తముఁ జెప్పెన్. ౧౨

సీ. క్షోణిపానీయతేజోవాయుగగనాఖ్యపంచభూతాంశసంబంధమైన
మేనిలోఁ గర్ణనాసానేత్రజిహ్వాత్వగాహ్వయపంచేంద్రియములగోష్ఠి
శబ్దగంధాంగరసస్పర్శసంజ్ఞిక పంచవిషయములఁ బొలుపఱుచు
ప్రాణప్రభృతిపంచపవనప్రసారంబు హృదయాదిపదములఁ బొదలుబుద్ధిఁ
గూడి నిలిచి యుండు కుంభకపూరక,రేచకములగతి వివేచకంబుఁ
జిత్తకమలచక్రజీవాత్మపరమాత్మ,యోగసాధనముల నొసరఁ జెప్పి. ౧౩

క. యోగము కల్మషబాధవి,యోగము పంచేంద్రియాభియోగము, పుణ్యో
ద్యోగము, ముక్తివధూసం,యోగము పరతత్త్వపదనియోగము సుమ్మీ. ౧౪

గీ. దుఃఖసాధ్యమయ్యుఁ దొడరి యభ్యాసంబుఁ, జేయఁజేయ యోగసిద్ధిపెంపు
దినఁగఁ దినఁగ వేము తియ్యనౌకైవడిఁ, బిదపఁ బరమహర్షపదము సుమ్ము.

సీ. హఠయోగమంత్రయోగాష్టాంగయోగసాధనయోగలయయోగధర్మములకు
యమనియమాసనధ్యానధారణశక్తిఁ బవననిరోధంబుఁ బట్టుకొలిపి
నాభిచక్రోపరిచలితమధ్యంబున నీవారశూకసన్నిభ విభాతి
వెలిఁగెడు తేజంబు వెలుఁగునఁ గరఁగిన యమృతంబు మదిలోన ననువువార
నందఁ గలుగుట సచ్చిదానందమయ్యె,నచటితేజస్స్వరూపంబె యచ్యుతుండు
పంచవింశతితత్త్వప్రపంచమునకు, నతఁడె కారణ మాదినారాయణుండు. ౧౫

క. కరణాసనభేదంబుల, వెర వెఱిఁగి తదంగయోగ వితరణసరణిం
బరికించి పెనఁగనేర్చిన, మరగుఁ జుమీ ముక్తికాంత మర్మజ్ఞునకున్. ౧౬

క. అని బహువిధములఁ జెప్పఁగ, విని జనపతి తెలిసి యోగవిద్యావిభవం
బున రాజయోగి యనఁగా, జనకునిక్రియఁ బ్రజలఁ బెంచె జనకునిభంగిన్. ౧౭

వ. ఇట్లు కొంతకాలంబు పుచ్చి తన్ముఖకళలం జూచి యోతాపసోత్తమ నీకెన్ని

యేం డ్లయ్యె నని యడిగిన నతండు యోగికిఁ గాలక్రమంబు విచారింపనేల నూఱేండ్లు వేయేం డ్లని యెన్నిక గలదే సిద్ధయోగంబున వజ్రశరీరంబు దుర్లభంబు గాదు. ౧౯

క. బాధావిరహితగతికుఁడు, బోధాహితపరమహర్ష పూర్ణుఁడు నిజవాం
ఛాధీనమరణుఁ డీక్షణ,సాధితచిన్మూర్తి యోగి సామాన్యుండే. ౨౦

క. తలనరసినఁ జెక్కులపై, వళు లెగసిన మేని బిగువు వదలిన నేత్రం
బుల నెట్టసిరలు విరిసిన, జెలువెడలిన యతఁడు[1] యోగసిద్ధుఁడె ధాత్రిన్.

క. అనఁ దద్వచనామృతసే,చనమున యోగంబు సిద్ధిచందము దెలియన్
మనమునఁ గౌతుకకందళి, మొనసూపిన నృపుని నెఱిఁగి మునినాయకుఁడున్.

గీ. ఎద్ది యైన నీకు నెఱిఁగింతు నడుగుము, సిగ్గుపడకు మనుడు క్షితివరుండు
మరణభయము లేనిమార్గంబుచేకుఱు, సిద్ధయోగనియతిఁ జెప్పుమనియె. ౨౩

మ. అనిన న్వ్యాసముతోఁ జరామరణశూన్యం బైన మృత్యుంజయం
బను మంత్రంబును హోమతంత్రమును హవ్యద్రవ్యభేదంబు సా
ధనయోగంబుఁ గ్రమంబునం దెలిపి విద్యాదక్షిణానుగ్రహం
బున మన్నించి నరేంద్రు వీడుకొని విప్రుం డేఁగె వింధ్యాద్రికిన్. ౨౪

సీ. క్షితివరుం డిట యోగసిద్ధికై మంత్రిపై రాజ్యభారం బిడి రాముపగిది
జటిలుఁ డై మేన భస్మముఁ బూసి వల్కలధారియై కాననాంతమున కేఁగి
ఋషిభంగి గంగలోఁ ద్రిషవణస్నానుఁ డై జపతపంబులఁ బురశ్చరణ చేసి
మంత్రపూతంబుగా మధుతిలదూర్వాజ్య హోమంబు జరపు మ నేమమునను
నక్తము నుపోష్యమును నేకభుక్తమునఁగఁ,గలుగుదినముల సిద్ధయోగముననుండి
కందమూలముల నశనకాంక్ష దీర్చి, వ్రతము చరియించె నల్లేకవత్సరంబు. ౨౫

వ. తదనంతరంబ యొకనాఁటి హోమసమయంబున. ౨౬

క. ఆహుతి వోయఁగఁ గాంతితి,రోహితుఁడై లోహితాశ్వరోచిఃపటలీ
రోహితుఁడై యాకుండము,లో హితుఁ డై నిల్చె నీలలోహితుఁ డంతన్.

వ. తదాకారంబు గని సాఁగిమ్రొక్కి నిలిచిన. ౨౮

క. మృత్యుంజయుఁ డతనితపః,కృత్యమునకుఁ జిత్తవృత్తికిం దగఁగ జరా
మృత్యునివారక మగు ఫల, మత్యాదరణంబుతోడ నాతని కిచ్చెన్. ౨౯

వ. ఇచ్చి తిరోహితుం డైన. ౩౦

[1] జెలువించుక యొడయ్య

గీ. అట్టిఫలము చేత నంది జనేశ్వరుం, డీశ్వరునకు మ్రొక్కి శాశ్వతముగ
నంగసిద్ధి గంటి నని యుల్లసిల్లుచు, మగిడి వచ్చునట్టి మార్గమునను. ౩౧

చ. పదములుఁ జేతులు న్మడిఁగి పండులు డుల్లి నిజస్వరంబు గ
ద్గదికఁ బెనంగ నంగమున గ్రంథులు వాఱఁగఁ గుష్ఠరోగముల్
ముదిమియుఁ గూడి రూపు బలుపుం బొలియింపఁగ దైన్యజీవనా
స్పద మగు బ్రాహ్మణుండు జనపాలున కడ్డమువచ్చి యిట్లనున్. ౩౨

క. ముదిమియు రోగముఁ గూడం, బొదలెడు నిదె మేనునిలువఁబూనదు నాకున్
మది నెఱుఁగుదేని మం దీ,పదనున సమకూర్చి యిమ్ము పరమదయాత్మా.

గీ. అనిన నతనిఁ దోడుకొనిపోయి తనయింట, మందుమ్రాఁ కొనర్ప మదిఁ దలంచి
యాతఁ డంతదూర మరుదేర లేఁ డని, యాత్మఁ జూచి విక్రమార్కవిభుఁడు.

గీ. కలిగి పెట్టలేక కష్టుఁ డైయున్న దు,ర్గుణుని పాపమునకుఁ గొలఁది లేదు
తన్ను మాని యైన ధర్మంబు చేసిన, యతనిపుణ్యమునకు నవధి లేదు. ౩౫

క. తుదిముట్టని బ్రతుకున కా,పదఁ బొదలెడివాఁడు దానపాత్రం బని స
మ్మదమున నార్తులకొఱకై, సదయులు ప్రాణములు తొల్లి చాగము లిడరే.

వ. అని తొల్లింటి రాజులం బ్రశంసించి తనలో శంకింపక సాహసాంకుండు మహో
దారుండై. ౩౭

క. ప్రాణము లడుగఁడు వృద్ధ, క్షోణీసురుఁ డితఁడు మందుఁ గోరెడు దేహ
త్రాణము గావించెద నని, క్షోణీశుఁడు చేతిపండుఁ గోరిక నిచ్చెన్. ౩౮

శా. దివ్యం బౌఫల మిచ్చినం దిని ధరిత్రీనిర్జరుం డంతఁ గు
ష్ఠవ్యాధిస్థవిరత్వదూరతమమై సంపూర్ణతేజఃకణా
భివ్యాప్తం బగు దివ్యదేహ మటుఁ బ్రాపింపంగ నిర్మోకము
క్తవ్యాళేంద్రుని భంగి నొప్పెఁ బతి చోద్యం బంది హర్షింపఁగన్. ౩౯

క. అర్థికి నీక్రియ నిచ్చి కృ,తార్థుండై కదలి వచ్చె నటుగావున న
ప్పార్థివునకు సరిపూనమి, వ్యర్థము నీతలఁపు భోజవసుధాధీశా. ౪౧

క. నావుడు భోజక్షితిపతి, భావంబునఁ జోద్యహర్షభరితుం డై ల
జ్జావనతవదనుఁ డగుచు హి,తావృతుఁ డై మగిడి పోయె నంతఃపురికిన్.

వ. మఱియుఁ గొన్నిదినంబులు సనిన నేకాదశద్వారవీక్షకుండై. ౪౨

— పదునొకొండవబొమ్మ కథ —

క. సూక్ష్మముగఁ దలఁచెద న్మృగ,లక్ష్మకళారమ్య వీరలక్ష్మీగమ్యున్
లక్ష్మీలలనావక్షో,జక్ష్మాధరసక్తు భక్తసంహు నృసింహున్. ౪౩

క. అని నియమంబున భోజుం, డనువగులగ్నమునఁ జేర నరిగి మహేంద్రా
సన మెక్కఁబోఁగ నిలునిలు, మని యచ్చటిబొమ్మ పలికె నచ్చెరు వందన్. ౪౪
క. పరికింప విక్రమార్కుని, సరిపూనఁ బరోపకారసత్త్వంబులు సు
స్థిరముగఁ గలుగనివానికిఁ, దరమే యిట దీని నెక్క ధారాధీశా. ౪౫
క. అనవుడు నవ్వసుధాపతి, చనునతనిపరోపకారసత్త్వగుణము లె
ట్లనఁ బాంచాలిక యను స,ద్వినయంబున భోజనృపతి విననిట్లనియెన్.[1]
క. జననాథ రాజసమ్ముఖం,బున నున్ననరుండు యోగ్యము నయోగ్యముఁ[2] బ
ల్కిన నవ్వఁగా దన కూరక, వినవలయును సరస మైన విరసం బైనన్. ౪౭
గీ. పలుకఁ దగినపలుకు పలుకక యున్నను, బలుకు వినియు వినని పగిది నున్నఁ
బలుకఁ జూచువానిఁ బలుకకు మన్నను, బలుకు లేల తల్లి పాలయు నతని. ౪౮
వ. కావున. ౪౯
క. వ్యక్తంబుగఁ జెప్పెద నను,రక్తుఁడ వై విను మవంతిరాజుగుణము నా
యుక్తిం జులుకం జూడకు, యుక్తులయెడ నాఁటదాని యోగ్యత గలదే. ౫౦
మ. సత్యవచోవిశారదుఁడు, శారదనీరదసంస్ఫురద్యశో
నిత్యుఁడు నిత్యదానగణనీయుఁడు విజ్ఞజనావనీమనో
వృత్త్యనుసారి సారబలవిక్రమకృత్యుఁడు నాఁగ విక్రమా
దిత్యుఁ డవంతి యేలె నలుదిక్కులరాజులు పంపుసేయఁగన్. ౫౧
వ. అట్టిమహీపాలుండు షణ్మాసరాజ్యప్రతిపాలనంబును షణ్మాసదేశాంతరవనాంతర ప్రవాసంబును నవశ్యకర్తవ్యంబుగఁ జేసి యొక్కసమయంబున రాజ్యం బరాజకంబు గాకుండ భట్టి నుజ్జయిని నునిచి యసహాయశూరుండు గావున నొంటి నిగూఢవేషంబున దేశాంతరనగరగహనవిశేషంబులు చూచుచుం జని చని యొక్కనాఁడు. ౫౨
ఉ. పణ్యపథంబు భంగి భయభంగము నొందక చొచ్చె దండకా
రణ్యము శైలగర్భితహిరణ్యము తాపసచిత్తనిత్యకా
రుణ్యము గంధబంధురసరోజరజోవనరాజిలక్ష్మణా
గణ్యము[3] పత్రపుష్పఫలగణ్యముఁ బుణ్యజనానుగుణ్యమున్. ౫౩

1. వ. అనవుడు నవ్వసుమతీపతి యతని పరోపకార సత్త్వగుణంబు లెట్టివనినఁ బాంచాలిక సవినయంబుగా నిట్లనియె. అని యొకప్రతిలో వచనమున్నది. 2. రాజుసమ్ముఖ, మున నరుఁ డవయోగ కార్యములుగా వేసఁ, 3. రజోవనరాజితాజలక్షణ్యము,

వ. చొచ్చి యనుష్టుప్ఛందంబునుం బోలె హంసరుతయుతం బై త్రిష్టుప్ఛందం బునుం బోలె భ్రమరవిలసితం బై జగతీచ్ఛందంబునుం బోలెఁ గుసుమవిచిత్రాంబరం బై యతిజగతీచ్ఛందంబునుం బోలె మత్తమయూరసేవితం బై శక్వరీచ్ఛందంబునుం బోలె సింహోద్ధతాశ్రయం బై యతిశక్వరీచ్ఛందంబునుం బోలె సుకేసరభాసురం బై యష్టిచ్ఛందంబునుం బోలె హరిణీసంశ్రితం బై ధృతిచ్ఛందంబునుం బోలె మత్తకోకిలాకలితం బై యతిధృతిచ్ఛందంబునుం బోలె శార్దూలవిక్రీడితలక్షితం బై కృతిచ్ఛందంబునుం బోలె నుత్పలమాలాయుక్తం బై ప్రకృతిచ్ఛందంబునుం బోలెఁ జాపకమాలాసహితం బై సంకృతిచ్ఛందంబునుం బోలె సరసిజచిహ్నితక్రౌంచపదాంకితం బై [1] యుత్కృతిచ్ఛందంబునుం బోలె భుజంగవిజృంభితసంగతం బై యున్న యవ్వనాంతరంబునం దిరుగునప్పుడు. ౫౪

క. ఇల నందఱుఁ దను సైరింపలే రనుచు వెట్టయైన బ్రదుకొల్లక తాఁ
గలుమఱుఁగు లంటికెనో యన, [2] జలజాప్తుం డస్తశిఖరిచటి దిగఁబడియెన్.

వ. అప్పుడు. ౫౬

క. బహుయోజనదూరము లగుగహనంబుల నుండి యెగసి కలకలములతో
విహగంబులు నిలయమహీరుహముల కరుదెంచెఁ బంక్తిరూపం బలరన్. ౫౭

క. బంధురమదాంధదిక్సామాంధరగజగండమండలప్రచలితపు
ష్పంధయనిభనీలిమ జగదంధంకరణప్రసార మై తమ మొదవెన్. ౫౮

వ. తత్సమయంబున. ౫౯

గీ. ఆదిమూర్తిక్రియ సహస్రశాఖలను సహస్రపాదములను నవనిగగన
భాగపూర్ణ మగుచు భవ్యమై ద్విజకుల, [3] సేవ్య మైనతరువుఁ జేరె విభుఁడు.

సీ. ఏమ్రానిమూలంబు లిలకు నాధార మై శేషుపడగలతోఁ జెలిమిసేయు
సేవనస్పతికొమ్మ లెక్కియాడంగ దిగంతబాలికలకు నందికోలు
ఏవృక్షమునఁ గల యిర్లహర్నిశ మంధతమసంబునకు నుండఁ దల్లియిల్లు
ఏపాదపముతుద నెడనెడఁ గాలూఁద రవిహయంబులకు విశ్రామభూమి
యేమహీజమునిలు వెల్లపక్షుల కున్కిపట్టు నాఁగ నెగడి ఫలదళముల
సబ్జరాగమరకతాంచితైకస్తంభహర్మ్యసామ్యమందు నట్టివటము. ౬౧

---

1. క్రౌంచపదమును సరసిజచిహ్నితమును సంకృతిచ్ఛందములోఁ గనఁబడుచున్నవి. ప్రకృతిచ్ఛందములోని దని తెల్పినాఁడు. 2. దనుసైఁపక, పలుతెఱఁగుల ననఁగ నట్టిబ్రదుకోర్వకతా, గొలఁకుల గ్రోల్లుటికెనో యన. 3. హంసశిఖర రమ్యమౌచు నెపుడు, భూమిగగనభాగపూర్ణమై ద్విజకుల-

# రసార్ణవాలంకారము.

## చతుర్థపరిచ్ఛేదము-"అర్థాలంకారనిర్ణయము."

---

అర్థోత్కర్షహేతువులు. 1. అర్థాలఙ్కృతయ స్త్వన్యా అర్థోత్కర్షైకహేతవః
అర్థాలంకారములు. సచేతసమనో* *సదనన్తాః ప్రచక్ష్మహే.

అవియిరువదియెని మిది. 2. జాతి ర్హేతు రహేతు శ్చ సూక్ష్మసారసమాహితమ్
భావో విభావ నాఽన్యోన్యవిరోధో విషమం తథా.

3. సమ్భవః ప్రత్యనీకం చ వ్యతిరేక స్త్వసఙ్గతిః
తథా లేశాభిధానం చ పరివృత్తి ర్నిమీలనమ్.

4. వితర్కః స్మరణం భ్రాన్తి రభావ శ్చాగమ శ్చ సః
ఉపమానానుమానే చ ప్రత్యక్షం చార్థిక(మ్ తథా).

5. సంశయోఽతిశయ శ్చైతా అష్టావింశతి కీర్తితాః
నానావస్తుషు జాయన్తే యాని రూపాణి***.

జాతి. 6. స్వేభ్యః స్వేభ్యో నిసర్గేభ్య స్తాని జాతీ ప్రచక్షతే
అర్థవ్యక్తే రియం భేద మి** ప్రతిపద్యతే.

7. జహఃమో నమపి వక్తి[?]రూపం సా సార్వకాలికమ్
స్వరూప మాశ్రయే హేతు మితి త*దహేతవః.

8. తే సంస్థానాదయ స్తేషు సావిశేషేణ శోభతే
సంస్థాన మథ [చ]*వ్యాపారో వేష ఇ త్యపి.

9. స్వరూప మితి శంసన్తి తత్ప్రపఞ్చః ప్రవక్ష్యతే
బాలవృద్ధవి** స్త్రీహీనజాత్యాది రాశ్రయః.

10. తిర్యఞ్చోఽపీ తి తల్లక్ష్యం దిఙ్మాత్రేణ ప్రదర్శ్యతే
దేశకాలకలాశక్తి** నాని చ హేతవః.

11. అమీషా మపి లక్ష్యాణి యథాయోగం ప్రచక్ష్మహే
ప్రవృత్తే ర్వా నివృత్తే ర్వా యత్ [కార్యం]స్యా న్నిబన్ధనమ్

హేతువు—ఆఱు విధములు. 12. తత్రాస్య హేతురి త్యాఖ్యా షట్ప్రకారః స కథ్యతే
ఏకః ప్రవర్తకో హేతుః [అన్యః] కార్యే నివర్తకః.

అభావహేతువు. 13. అభావహేతు రపరో జ్ఞాపకోఽన్యః ప్రయోజకః
చిత్రహేతువు. అ[న్యో] బహుప్రపఞ్చ స్తు చిత్రహేతు రితి స్మృతః.

14. క్వాపి ప త్ర[వశావస్థ్యః]క్వా ప్యర్థాన్తరబాధితః
ఇఙ్గితాకారలక్ష్యోఽర్థః సూక్ష్మః సూక్ష్మగుణస్తు సః.

సూక్ష్మము ఆఱువిధములు. 15. సూక్ష్మా త్ప్రత్యక్షతః సూక్ష్మః ప్రత్యక్ష ఇతి భిద్యతే
సా చా భిధీయమానః స్యాత్ ప్రతీయమాన ఏవచ[?]
16. స ద్విధాపి ద్విధా మిశ్రో భూత్వా భవతి షడ్విధః
******హేతుః స్యా ద్యః సన్నపి కార్యకృత్ [?]

సారమిరువెఱఁగులు. 17. ** రస్య నిరాసేన సారసంగ్రహణే చ సా
రస[సార?]ఇత్యుచ్యతే సోఽపి ధర్మిధర్మాత్మనా ద్విధా.

సమాహితము ద్వివిధము. 18. అ***ప్రయత్నా ద్వా కారణం సహకారియత్
ఆసాద్యతే క్రియారమ్భ త ద్విధైవ సమాహితమ్.

భావము. 19. అభిప్రాయార్థ [గా యా]తు ప్రవృత్తి ర్భావ ఇష్యతే
ప్రసిద్ధహేతుత్యాగేన హేత్వ న్తరవిభావనమ్.

విభావన. 20. స్వభావభావనం స్యా ద్య**** విభావనా
శబ్దతో వా ర్థతో వాపి ద్వయతో వా పదార్థయోః.

అన్యోన్యము. 21. ఉపకార్యోపకారిత్వ మన్యోన్యమ్ [అభిధీయ]తే

మాలాన్యోన్యము. మాలారూపం యదన్యోన్యం మాలాన్యోన్యం త దుచ్యతే.

22. సర్వస్వం న్యస్యతి ప్రాయ స్తత్రసాక్ష***తీ

అన్యోన్యభ్రాంతి=అన్యోన్యము. అన్యోన్యభ్రాన్తిమ ప్యాహు రన్యోన్య మిహ కోవిదాః

23. కావ్యవస్తూపకారిత్వా దుపలక్షణ [మేవ]వా
అన్యోన్యైకతయా ప్రాయో వైచిత్ర్యం కావ్యవస్తునః.
24. అత స్తా మపి నా న్యోన్యా త్పృథ గుక్తం పృ***
అసఙ్గతిః పదార్థానా ముత్తరార్థాధాయినీ యది.

విరోధము. 25. వక్రిమాక్రాన్తసౌన్దర్యః స విరోధోఽభిధీయతే
** పదవిరోధోఽపి కథితః కవిపుఙ్గవైః.
26. నఞాకృతవికారత్వా త్స నోక్తః శ్లేషలక్షణే
** ఞ్చ శబ్దాలఙ్కారః సంఖ్యాగౌరవభీరుణా.
27. న మయా తత్ర యుక్తోఽపి పృథక్త్వే నోపవర్ణితః

విషమము. అ[సామ్య] కారణోత్పన్నం కార్యం విషమ ముచ్యతే.
28. ప్రయోగః ప్రాయశ స్తస్య సౌన్దర్య మవలమ్బతే
అనేకకార[ణోత్పన్న]దర్శనా దిద మీరితమ్.

సంభవము. 29. భవిష్యా మీతి యద్ జ్ఞానం స సమ్భవ ఇతిస్మృతః
విధిరూపో నిషేధాత్మా ద్వయాత్మా ద్వయవర్జితః.
30. [తద్ధ]ర్మనేషు తద్రూపం చతుర్ధాపి విభావ్యతామ్
ప్రతికూలఫలోత్పత్తి మీప్సితార్థస్య కారణమ్.
ప్రత్యనీకము. 31. యత్ర రోతి తదాఖ్యాతం [ప్రత్య]నీకం మనీషిభిః
య త్రాభిధాయ సాధర్మ్యం వైధర్మ్య మపి కథ్యతే.
వ్యతిరేకము. 32. వ్యతిరేకః స విజ్ఞేయః సప్తధాఽసౌ ప్రపఞ్చ్యతే
[ఏకో]భయవిభేదోఽర్థః సదృశాసదృశోద్భవః.
33. స్వజాతివ్యక్తిజన్మా చ రూపకప్రకృతి స్తథా
కార్యకారణ**త్ర భిన్నదేశవ్యవస్థితిః.
అసంగతి. 34. జాయతే తత్ఫలం సా తు స్మృతా ధీరై రసఙ్గతిః
దూషణస్య గుణీభావో దోషీభావో గుణస్య వా.
లేశము. 35. ద్వయం వా యత్ర సంశ్లిష్టం తత్తు లేశం ప్రచక్షతే
అన్య స్యాన్యత్ర విన్యాసో ద్రవ్యస్య తు గుణస్య వా.
పరివృత్తి. 36. యత్ర సా(పరివృత్త్యాఖ్యా) స్మృతాలఙ్కారకారిభిః
తా మాహు ర్వ్యత్యయే నైకా మన్యాం వినిమయేన చ
37. అన్యా ముభయవాక్యార్థవిమిశ్రా*****
వస్త్వన్తరతిరస్కారో వస్తు నాన్యేన చే ద్భవేత్.
నిమీలితము. 38. నిమీలిత మితి ప్రాజ్ఞై స్త దలఙ్కార ఇష్యతే
హితం చావిహితం చైవ తద్గుణోఽతద్గుణస్తథా.
39. నై తేషాం లక్షణం భిన్నం నిమీలిత మమీయత
సంశయా***తు స్యా ద్య ఊహో నిర్ణయాత్మనామ్.
వితర్కము. 40. స వితర్క ఇతి జ్ఞేయో నిర్ణయానిర్ణయాత్మకః
సదృశా ద్దృష్టచిత్తాన్య స్మ[?]** జాయతే స్మృతిః.
స్మరణము. 41. యానుభూతపదార్థానాం స్మరణం తత్ర కీర్తితమ్
ప్రత్యభిజ్ఞాన మ ప్యాహు ర్నా [ర్నచా?]ర్థాన్త[రతః]
స్మృతేః.[?]
42. స్మృతిః స్వప్నాయితం చాన్యా తథాన్యా వ్యక్తివర్జితా
భ్రాంతి. భ్రాన్తి ర్విపర్యయజ్ఞాన మతత్త్వే త[త్త్వకారి]ణీ.

43. తత్త్వే ప్యతత్త్వరూపా వా ద్వయం తత్త్రివిధం భవేత్
బాధితాబాధితాపూర్వం తథా కారణబాధితమ్.
44. [వి]హానార్థాసఙ్గ్రహార్థా వుపేక్షార్థా తథేతరా

భ్రాంతిమాల.

[కాలే కతిపయా?] భ్రాన్తి ర్భ్రాన్తిమాలేతి కథ్యతే.
45. [మాలా]భ్రాన్తే ర్న భిన్నా స్యా దేతల్లక్షణలక్షణాత్
యత్ర వస్తుని నోల్లేఖమాత్రం జ్ఞానస్య విద్యతే.

అనధ్యావసాయము=భ్రాంతి.

46. [సా]ప్యనధ్యావసాయాఖ్యా భ్రాన్తి రేవేతి మే మతిః

అభావము.

అసత్త్వం తు పదార్థానా మభావ ఇతి కథ్యతే.
47. కారణై రపి చే ద్భ్రాన్తి రపనేతుం న శక్యతే

భ్రాంత్యతిశయము.

స భ్రాన్త్యతిశయో హ్యత్ర న భిన్నో భ్రాన్తిలక్షణాత్.

నాలుగువిధములగు నభావము.

48. **ప్యుత్కర్ష మాప్నోతి కోఽప్యర్థః కవికౌశలాత్
స భవే త్ప్రాగభావో వా ప్రధ్వంసాభావ ఏవ వా.
49. అత్యన్తా***వో వా కల్పితాభావ ఏవ వా

ఆగమము-నాలుగు విధములు.

ఆగమ స్త్వాప్తవచనం దృష్టాదృష్టార్థసాధనమ్.
50. పురుషార్థప్రభేదేన[స చతు]ర్థా స్మృతో బుధైః
ధర్మార్థకామమోక్షాణాం శాస్త్రాణ్యాగమ ఉచ్యతే.
51. అదృష్టార్థా తా వ[దృష్టార్థా]దృష్టార్థా మధ్యమా స్మృతా

ధర్మము రెండు తెఱఁగులు.

ప్రవృత్త్యాత్మా నివృత్త్యాత్మా ధర్మోఽయం ద్వివిధః స్మృతః.
52. నానాసను** దనపుర్భిః స్తస్య విస్తరః
తథాపి బ్రూమహే కిఞ్చిత్ మార్గమాణా ప్రదర్శకమ్.
53. ఆర్యోక్తి రితి సంత్యజ్య వాక్యా సఙ్గృహ్య మర్థతః

మూఁడువిధములగు నర్థము.

అర్థస్త్రివిధో జ్ఞేయః పిత్ర్యః స్వః సఞ్చితో నవః.
54. తమపార్జితశాస్త్రాణా మర్థాగమ ఇతి స్మృతిః
తత్ర విద్యా మహీ హేమ పశుభాణ్డ ముపస్కరః.
55. [ఇదం మి]త్ర మిదం పిత్ర్య మర్థజాతం ప్రచక్ష్మహే
కలత్రపుత్త్రసహితం దశధాన్యద్వయం పునః.
56. అస్యాపి విస్తరా[ఖ్యా]నం తద్గ్రన్థే ష్వవధార్యతామ్

మాహేశ్వరశాస్త్రము.

ఆసీ న్మాహేశ్వరం శాస్త్ర మత్ర కోటిప్రమాణకమ్.

దీనికిసంక్షేపముస్వా యంభువము. 57. పున స్తదపి సంక్షిప్త మథ[స్వా]యంభువం తతః
వాతవ్యాధే రపి గ్రన్థః సప్రపఞ్చః ప్రవర్తతే.

బృహస్పతిమతము. 58. బృహస్పతే ర్మతం చేద మిద***సన్మతమ్
విష్ణుగుప్త, కామన్ద కులు. ఇదం చ విష్ణుగుప్తస్య తథా కామన్దకే రపి.

59. కియన్తోఽ న్యేఽభిధాతవ్యాః కృతా యే** ధే రపి
అత స్తదర్థజిజ్ఞాసా యది వః సమ్ప్రవర్తతే.

60. క్షణాన్తరం ప్రతీక్ష్యం త దన్యా స్తావ దుపక్రమః
[అన్యో] ప్యుపాయః గ్రన్థానా మజ్ఞానే నార్థభాషణమ్.

అర్థశాస్త్రములందలి దశస్కంధములు: 61. తే న్నైషాం లక్షణాఖ్యానమాత్ర మ త్రోపయుజ్యతే
వినయే నార్జనం యేన విద్యాదే రర్థసమ్పదః.

వినయస్కంధము. 62. తేనా సౌ వినయస్కన్ధః స్మృతో నీతివిశారదైః
[పశుపోష]ఖనిద్రవ్య వణిగ్వృత్త్యాది వార్తయా.

వార్తాస్కంధము 63. స్వవృత్తిచిన్తనం యేన వార్తాస్కన్ధః స ఉచ్యతే
ప్రజావివాదసమ్బద్ధన్యాయాన్యాయనిరూపణాత్.

వ్యవహృతిస్కంధము 64. అయం వ్యవహృతిస్కన్ధ ఇతి తద్జ్ఞై రుదాహృతః
కణ్టకాక్రాన్తసామన్త[రక్షణం]యేన చార్జనమ్.

రక్షాస్కంధము. 65. తే నాయ మర్థత న్త్రజ్ఞై రక్షాస్కన్ధ ఇతిస్మృతః
హేయోపాదేయషాడ్గుణ్య[సిద్ధమన్త్ర]మార్జనమ్.

మంత్రస్కంధము. 66. సుసిద్ధం యేన చార్థస్య మన్త్రస్కన్ధ స్తు తేన సః
సమాదిభి రుపాయై స్తు యే[సామా]వర్జనం భవేత్.

ఉపాయస్కంధము. 67. ఉపాయస్కన్ధ ఇ త్యుక్తో మన్త్రస్కన్ధా ద్విభేదితమ్
ప్రవణాదిభి రన్యేభ్యో యేన[చా]ర్జన మిష్యతే.

విభ్రమస్కంధము. 68. విభ్రమస్కన్ధ ఇత్యాఖ్యా మయ మాలప్యతే క్రమః
జైత్రమన్త్రాదిభి ర్యత్ర శాస్త్రయుక్త్యా ప్రచోదితే.

ఉపనిషత్స్కంధము. 69. అర్థ [?] ఉపనిషత్స్కన్ధ ఇతి తం చ ప్రచక్షతే
చతురఙ్గేణ యుద్ధేన యత్ర విద్విషతాం శ్రియః.

యుద్ధస్కంధము. 70. ***తే త మ త్రాహు ర్యుద్ధస్కన్ధం విశారదాః
పరోపద్రవసన్త్రాసప్రశాన్త్యా యత్ర లభ్యతే.

ప్రశమస్కంధము. 71. అర్థ**పి సః ప్రాజ్ఞైః ప్రశమస్కన్ధ ఉచ్యతే
అత్ర చైతే ప్రదర్శ్యన్తే యది తై స్తై ర్నిదర్శనైః.

72. ప్రకృ[తస్య]విచారస్య తదా దేయో జలాఞ్జలిః
ఉపయోగం వినా కిన్తు న క్వా ప్యర్థో విరాజతే.

అర్థశాస్త్రముయొక్క పదియుపయోగములు.
73. ఉప[యోగా]దశైకస్మా దర్థస్యాస్య ప్రచక్ష్మహే
క్వచి దేవ హి కోప్యర్థో దేశే దేశే ప్రవర్తతే.
74. [క్వచిత్]తస్యోపయోగస్య దేశ ఏవ నిబన్ధనమ్
కార్యత్వే సర్వసామాన్యే కార్యం కార్యా న్త**కమ్.
75. అర్థాన్తరానుబన్ధిత్వా త్తత్ర కార్యనిబన్ధనమ్
ఉపకారాదినానార్థప్రతిఘాతో హి దృశ్యతే.
76. తత్రా**ప్రతీఘాత ఉపయోగనిబన్ధనమ్
దత్త్వార్థం వైరిణాం సన్ధా కృతే వైరం నివర్తతే.
77. [అ]తో వైరనివృత్తి స్స్యా దుపయోగనిబన్ధనమ్
అర్థేన వర్తనం యచ్చ తద్విఖ్యాతం గృహే గృహే.
78. **మేవ తతో వృత్తి రుపయోగనిబన్ధనమ్
గుణినోఽపి దరిద్రస్య నాదరః ప్రాకృతా జ్జనాత్.
79. తస్మా దర్థోప[యోగా]ర్థం భవే న్మానో నిబన్ధనమ్
అపి నిర్వ్యాజవీరస్య న త్యాగవిరహే యశః.
80. తత్కీర్తిరేవ తత్ర స్స్యా దుపయోగనిబన్ధనమ్
తస్మా దర్థార్జనోపాయా నుపయోగాం శ్చ తత్త్వతః.

అర్థాగమము. 81. యతో జా న్తి ధీమన్తః సో[ప్య]ర్థాగమ ఇష్యతే
కామము. స్త్రీపుంయోగస్తు కన్దర్పలలితం కామ ఉచ్యతే.
82. తత్రైకత్రాభియుక్తే స్త్రీ***యత్ర తద్ద్విధా
తయోస్తు మన్మథక్రీడాచాతుర్యావర్జనార్థినోః.

కామాగమము- వాత్స్యాయనము. 83. శాస్త్రం కామాగమో నామ [యథా వాత్స్యా]య నాదికమ్
కన్యా స్వస్త్రీ పరస్త్రీ చ సామాన్యేతి చ యోషితామ్.

స్త్రీలునాలుగువిధములు. 84. భవన్తి భేదాశ్చత్వారః తత్ప్రభేదా స్త్వనేకశః

కన్యాగతకామము ద్వివిధము. తత్ర కన్యాగతః కామో ద్విధా తద్జ్ఞై రుదాహృతః.
85. వైవాహికో భవ త్యేకో ద్వితీయః [పారదా]రికః

స్వస్త్రీకామము ద్వివిధము. స్వస్త్రీ రూఢావరుద్ధేతి ద్విధా కామోఽపి తద్గతః.
86. దృష్టాదృష్టఫలః పూర్వో దృష్టార్థైకఫలోఽపరః

పరస్త్రీత్రివిధము. ఊఢా వమూఢా రబ్ధా చ పరస్త్రీ త్రివిధా భవేత్.
87. ఏక ఏవ హి కామః స్యాత్ తద్గతః[పారదా]రికః
వేశ్యాగతకామము. సామాన్యా వనితా వేశ్యా కామ స్తత్రైక ఏవ హి.
88. ధీరై ర్విసర్గచాతు**తురాస్య ప్రకీర్తితః
అస్యోదాహరణశ్రేణీ శాస్త్రం పూర్వోపవర్ణితమ్.
89. శ్లోకమాత్రే***త్రం తథా ప్యేతత్ ప్రచక్ష్మహే
ఆత్మనో బన్ధనచ్ఛేదా దశకేరదశాస్థితిః.
మోక్షాగమము. 90. మోక్షః స్యా త్తదుపా[యార్థం]శాస్త్రం మోక్షాగమః స్మృతః
యత్ర దృష్టార్థసాదృశ్యా దదృష్టోఽర్థః ప్రతీయతే.
91. ప్రతిబిమ్బ మపి ప్రేక్ష్య ప్రతిబిమ్బి ప్రతీయతే
అత స్తదపి రసజ్ఞై[?]రుపమాన ముదాహృతమ్.
92. రూపం శంసన్తి ముద్రాపి స్వనిమిత్తస్య వస్తునః
భామహుఁడు. ఉపమానా న్న సా భిన్నా భవతీ త్యాహ[భామ]హః
93. అవినాభావినా జ్ఞానం యత్ర లిఙ్గేన లిఙ్గినః
మానాఖ్యయా తు తస్యేహ వ్యవహా[రో]మనీషిణామ్.
అర్థపంచకమునుబట్టి ప్రత్యక్షమైదువిధములు. 94. ఇన్ద్రియార్థసమాయోగా జ్ఞాతం య దుపజాయతే
ప్రత్యక్షం పఞ్చధా తత్ స్యాద్[అర్థ]పఞ్చకభేదతః.
95. యస్మి న్నాత్యన్తసాదృశ్యాత్ సన్దేహో వస్తునోభవేత్
సంశయము. స సంశయ ఇతి ప్రాజ్ఞై[రుప]మాసోదరస్తు సః.
అసంభావ్యము. 96. ఉదీరిత మసమ్భావ్యం లోకవృత్తా నతిక్రమాత్
అత్యుక్తి. య దత్యుక్తిపదాఖ్యేయం విజ్ఞేయోఽతిశయోఽత్రసః.
97. అర్థాలఙ్కృతయ స్త్విమాః కవిసభాసమ్భావనాలిప్సుభి ర్వాచ్యా సమ్యగుదారబన్ధ[మధురై]ః కావ్యే నియోజ్యాః సదా
పీయూషశ్రుతిసున్దరై రపి పదై ర్లబ్ధాప్రమోదే[రసమ్]
సర్వోఽప్యర్థవిశేషభావనపరః ప్రాయో విదగ్ధో జనః.

ఇది రసార్ణవాలఙ్కారే అర్థాలఙ్కారనిర్ణయో నామ చతుర్థః పరిచ్ఛేదః.

# రసార్ణవాలంకారము.

## పంచమపరిచ్ఛేదము: "శృంగారవ్యక్తి."

---

1. ఉక్తః సోఽయం విభావానుభావసఞ్చారిసఙ్గ్రహః
క్రమేణ సర్వభావానాం శృఙ్గారేషు చతుర్ష్వపి.

భావముద్వివిధము. 2. స్థాయీ చ వ్యభిచారీ చ భావో ద్వివిధ ఉచ్యతే
శృంగారముద్వివిధము. సమ్భోగో విప్రలమ్భశ్చ శృఙ్గారోఽపి ద్విధా మతః.

3. సమవాయే చ ఉద్భూత శ్చిరం య శ్చావతిష్ఠతే
స్థాయీభావము. భావః స్థాయీతి స జ్ఞేయోఽప్య*. [రీతథోఽన్యథా?]

4. అభీష్టాలిఙ్గనాదీనా మవాప్తౌ యః ప్రకాశతే
సోఽస్మిన్ సమ్భోగశృఙ్గారో విప్రలమ్భో విపర్యయే.

విభావముద్వివిధము. 5. విభావోఽపి ద్విధైవా త్రాలమ్బనోద్దీపనాత్మకః
ఏకోఽనుభవ** రే జనకోఽన్యశ్చ బోధకః.

అనుభావము ద్వివిధము. 6. తతః ప్రబుద్ధే సంస్కారేఽ[అ?]నుభావో భవే ద్ద్విధా
అన్త ర్బహి శ్చ భావోత్థ*నవవ్యభిచారిభిః

7. స్మృతీచ్ఛాద్వేషవర్ణానా మన్తః సన్తాన ఇష్యతే
మనోవాగ్బుద్ధివపుషాం బహిరారమ్భ ఏవ తు.

8. [జన్మాతిశయసమ్పర్కానుగమానిహ] ?
విభావ శ్చాత్ర భావశ్చ వ్యభిచారీచ కుర్వతే.

9. విభావా జ్జన్మ భావానా ముద్దీపనవిభావతః
అనుబన్ధోఽనుభావేభ్యో ప్రక**** యతే.

10. సమ్పర్క స్తుల్యతా తుల్యబలభావాన్తరోదయే
అనుగామిత్వ మన్యేన స్థాయినోఽపహ్నవే సతి.

11. జన్మానుబన్ధాతిశయా***
**** [ధా]నుగమాత్క్రమేణ
భావమైదువిధములు. భావేషు తల్లక్షణలక్ష్యయోగాత్
పఞ్చ ప్రపఞ్చా నుపవర్ణయామః.

రతి. 12. సైష భావో రతిర్నామ కామ***మాఙ్కురః
సౌహృదాఙ్కురకన్దశ్చ ద్విప్రకారోఽపి దర్శితః.

13. భావాన్తరేభ్యః సర్వేభ్యో రతిభావః [ప్రపఞ్చ్యతే]
కవివర్గః సమగ్రోఽపి త మేవ మనుధావతి.

14. నిసర్గసంసర్గసుఖైః ప్రభేదైః
జన్మానుబన్ధా***దిభిశ్చ
ఇమం వినిశ్చిత్య నివేశయన్తః
కవీన్ద్రభావం కవయో లభన్తే.

—: రతిప్రపఞ్చః సమాప్తః :—

15. చతు***తి రిత్యేతే వా హర్షాదయో మయా
ఉక్తా జన్మాదిభేదేన ప్రాయః సమ్భోగహేతవః.

16. అతః పరం ప్రవక్ష్యన్తే విప్రలమ్భసమాశ్రయాః
చతుర్వింశతి రుత్కణ్ఠాచిన్తాస్మృత్యాదయోఽపరే.

17. ఏ***దయో భావాః శృఙ్గారవ్యక్తిహేతవః
కార్త్స్న్యేదేకోనపఞ్చాశ ద్యథాభేదం ప్రకాశితాః.

18. ***బన్ధాతిశయసమ్బన్ధానుగమా నితి
[యుఞ్జీత] సర్వభావేషు వర్గయో రుభయో రపి.

19. యదపిచ గదితం ప్రహర్ష**
**తిరసో రతివిస్మయాది రేవ
తదిద మితి నిరాకృతం ప్రకృష్టా
ప్రకృతిజభేద మమీ హి సర్వ ఏవ.

ఇతి ప్రకాశవర్షకృతౌ రసార్ణవాలఙ్కారే శృఙ్గార[వ్యక్తిః]
పఞ్చమః పరిచ్ఛేదః సమాప్తః.

—: శ్రీరస్తు. హరిహర[హిరణ్య]గర్భేభ్యోనమః. :—



# శివలీలావిలాసము.

నిశ్శంక కొమ్మయామాత్య విరచితము. ఇది యెన్నియాశ్వాసములో కాని మొదటి రెండాశ్వాసములుగల కాగితపుస్తకము నేనీనడుమ చెన్నపురము వెళ్ళినపుడు బ్రా॥ వేటూరి ప్రభాకరశాస్త్రిగారిచ్చినారు. మొదటి కాగితము లేదు. ఉన్నభాగములోఁదప్పులు మెండుగానున్నవి. అక్షరములు కనఁబడుటలేదు. ఈకవి శ్రీనాథునికి సమకాలికుఁడు కావచ్చును. అప్పయకుమారుఁడు దొడ్డ భూపాలునకుఁ గృతియిచ్చినాఁడు. శ్రీనాథుఁడు హరవిలాసమును రచించుటచేతనే యితఁడు శివలీలావిలాసము రచించెనేమో: ఈతనిది వీరమాహేశ్వరము- అని యొక్కటి యున్నట్లు వెనుక నేను బరిషత్పత్రికలో, ఉదాహరణపద్యములలోఁ దెల్పియుంటిని. ఇదియు నదియు నొక్కటికాదు. దయచేసి యీరెంటిలో నేదైన నెవ్వరియొద్దనైన నున్నచోఁ బంపవేఁడెదను. ఈశివలీలావిలాసము నెవ్వరో ప్రతి వ్రాసికొనినట్లు గుర్తులు కొన్ని పుస్తకములోఁ గనఁబడుచున్నవి. రెండవ పుస్తకము దొరకునని యాశించుచున్నాఁడను. కొత్తపల్లి సూర్యారావు.

---

# కాకినాడ హోమోపతి పత్రిక.

హోమోపతీ మరియు బయోకెమిక్ చికిత్సలను గూర్చియు, ఆరోగ్యాది విషయములను గూర్చియు అనుభవశాలురగు వైద్యులచే వ్రాయబడిన వ్యాసములు, క్లినికల్ కేసు రిపోర్టులు, మొదలగువానితో తెలుగునను యింగ్లీషునను వెలువడునట్టి ఆంధ్రహోమోపతీ మాసపత్రిక. ఇది ప్రతిగృహస్థునకును వైద్యునకునుగూడ నెక్కువ యుపయుక్తముగానుండును.

సంవత్సర చందా రు 1-4-0 మాత్రమే. విడిపత్రిక రు 0-2-0 ప్రకటన రేట్లు అతిసరసము. వలయువారు:—డాక్టరు: వై. గణపతిరావు, సంపాదకుడు. కాకినాడ హోమోపతిపత్రిక, కాకినాడ.అని వ్రాయవలెను.

---

కర్ణాటక సాహిత్య పరిషత్తు — బెంగుళూరు.

ఈపరిషత్తు యొక్క ౨౦ వ వార్షికసభ బొంబాయిలో, రాఁబోవు డిసెంబరు ౨౭ తేది శుక్రవారము ఉదయము 8 గంటలకు జరపుటకు నిశ్చయింపఁబడినది.

పరిషన్నిబంధనలను గురించికాని॥ కార్యవివరములను గురించికాని, సూచనలబంప నిశ్చయించిన సభ్యులు తమ సూచనలను పరిషత్కార్యాలయమునకు డిసెంబరు ౧౧ తేదీ లోపునఁ దెలియఁ జేయఁగోరుచున్నాము. పరిషదంగస్థాధివేశనమునకు, తమరు పంపఁదలఁచు ప్రతినిధుల పేరులు మొదలైన వివరములను డిసెంబరు ౧౧ తేది లోపలనే కార్యాలయమునకుఁ బంపఁగోరెదము.

పరిషత్సభ్యు లెల్లరు సభకు దయచేసి పరిషత్కార్యముల నెఱవేర్పవలయునని వేడుచున్నాము. అని గౌరవ కార్యదర్శి సి. కె. వెంకటరామయ్యగారు తెలియఁజేయుచున్నారు.

## ఆంధ్రసాహిత్యపరిషత్తు—ప్రతిష్ఠాపకులు.

శ్రీరాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారావుబహద్దరువారు, పిఠాపురము మహారాజా వారు. పరిషద్వ్యవస్థాపాధ్యక్షులు.

కీ. శే. శ్రీ వేంకటగిరి మహారాజావారు.

## ఉద్ధారకులు.

శ్రీరాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు- ఉయ్యూరు జమీందారువారు.

కీ. శే. శ్రీబొబ్బిలి మహారాజావారు.

## ఆంధ్రసాహిత్యపరిషత్కార్యనిర్వాహకవర్గము.

## కార్యనిర్వాహకసభాధ్యక్షులు.

జయంతి రామయ్యపంతులుగారు బి. ఏ., బి. ఎల్.

## కార్యదర్శులు.

కిళాంబి రాఘవాచార్యులుగారు ఎం. ఏ., బి. ఎల్.

వింజమూరి వెంకన్నపంతులుగారు ఎం. ఏ.

## కార్యనిర్వాహకసభాసభ్యులు.

దివాన్ బహదర్ కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తి నాయఁడుగారు, (కోశాధ్యక్షులు.)

పెద్దాడ రామస్వామిగారు, ఎం. ఏ.

చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు.

కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు.

శ్రీమాన్ గొడవర్తి జగన్నాథస్వామిగారు, ఎం. ఏ., ఎల్. టి.

దర్భా వేంకటశివరామదాసుగారు, బి. ఏ., బి. యల్.

అళక్కి- వేంకట్రామయ్యగారు.

కేశవరపు కామరాజుగారు.

కోకా వేంకటసుబ్బారావు నాయఁడుగారు.

ఓలేటి వేంకటరామశాస్త్రిగారు, శతావధాని.

పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులుగారు.

చిప్పారిసెట్టి రంగబ్రహ్మరావునాయఁడుగారు.

| | | | |
|---|---|---|---|
| 1 విప్రనారాయణచరిత్రము-చదలువాడ మల్లయ్యకవి | రు | 0 | 8 |
| 2 జైమినిభారతము-వచనము-వేంకటకృష్ణప్పనాయకుఁడు | ... | 0 | 12 |
| 3 కవిజనాశ్రయము-వేములవాడ భీమకవి | ... | 0 | 10 |
| 4 సంపూర్ణరామాయణము-ఋగ్వేదికవి వేంకటాచలపతికవి | ... | 1 | 0 |
| 5 నీతిసీసపద్యశతకము-తాళ్ళపాక పెదతిరుమలార్యుఁడు | ... | 0 | 2 |
| 6 యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనము-జ రామయ్యపంతులుగారు | ... | 0 | 8 |
| 7 జ్యోతిశ్శాస్త్రసారము-శ్రీమాన్ కపిస్థలం కృష్ణమాచార్యులుగారు | ... | 0 | 8 |
| 8 జ్ఞానప్రసూనాంబికాశతకము-శిష్టు సర్వశాస్త్రికవి | ... | 0 | 2 |
| 9 సర్వేశ్వరశతకము-యథావాక్కుల అన్నమయ్యగారు | ... | 0 | 3 |
| 10 కావ్యాలంకారచూడామణి-విన్నకోట పెద్దయకవి | ... | 0 | 8 |
| 11 అకారాద్యముద్రిత గ్రంథసూచిక | ... | 0 | 8 |
| 12 ప్రాకృతభాషోత్పత్తి-శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు | ... | 0 | 12 |
| 13 శివతత్త్వసారము-మల్లికార్జునపండితారాధ్యులు | ... | 0 | 12 |
| 14 చంద్రభానుచరిత్రము-తరిగొప్పుల మల్లన్నకవి | ... | 1 | 0 |
| 15 శివరాత్రిమాహాత్మ్యము-శ్రీనాథమహాకవి | ... | 0 | 12 |
| 16 ఆర్యభాషావిభాగము-శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు | ... | 0 | 8 |
| 17 హ్రస్వరంగములు-కొత్తపల్లి సూర్యరావుగారు | ... | 0 | 8 |
| 18 నారసింహపురాణము-ఉత్తరభాగము-హరిభట్టు | ... | 1 | 0 |
| 19 మన్నారుదాసవిలాసనాటకము-రంగాజమ్మ | ... | 0 | 8 |
| 20-21 కాళిందీకన్యాపరిణయము (రెండుభాగములు) అహోబలపతి | ... | 1 | 4 |
| 22 రెడ్డినాటి రెండుశాసనములు | ... | 0 | 4 |
| 23 ఆంధ్రధాతుమాల-చిన్నయసూరి | ... | 0 | 12 |
| 24 శాసనపద్యమంజరి | ... | 0 | 12 |
| 25 శతకసముచ్చయము (ప్రథమభాగము) | ... | 0 | 12 |
| 26 పరిషత్పుస్తకభాండాగారము. (ద్వితీయభాగము) | ... | 0 | 8 |
| 27 సూత్రాంధ్రవ్యాకరణములు-చిన్నయ్యసూరి | ... | 0 | 8 |
| 28 రసాభరణము-అనంతకవి. | ... | 0 | 8 |
| 29 ఆంధ్రశబ్దచింతామణి-బాలసరస్వతీకృతాంధ్రటీకోపేతము | ... | 0 | 8 |
| 30 షోడశకుమారచరిత్రము-వెన్నెలకంటి అన్నయ్య | ... | 0 | 8 |
| 31 హంససందేశము-కల్లూరి వేంకటరామశాస్త్రిగారు | ... | 0 | 2 |
| 32 శతకసముచ్చయము (ద్వితీయభాగము) | ... | 0 | 10 |
| 33 రాయవాచకము | ... | 0 | 8 |
| 34 సింహాసనద్వాత్రింశిక-ద్వితీయభాగము-గోపరాజకవి | ... | 0 | 10 |
| 35 నిఘంటుచరిత్రము-శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు | ... | 0 | 4 |
| 36 ఆంధ్రకామందకి-ఘణపవరపు వేంకటపతికవి | ... | 0 | 8 |
| 37 బాలభారతము-(అగస్త్యకృతమునకుఁ దెనుఁగు) కొత్తపల్లి సూర్యరావుగారు | ... | 0 | 12 |
| ౧ Dravidian Lexicography జయంతి రామయ్యపంతులుగారు | ... | 0 | 4 |
| ౨ Defence of Literary Telugu జయంతి రామయ్యపంతులుగారు | ... | 0 | 8 |
| 3 చాటుధారాచమత్కారసారః-(సంస్కృతము) | ... | 0 | 8 |
| ౪ ఉత్తరరామచరిత్రము-జయంతి రామయ్యపంతులుగారు | ... | 1 | 0 |
| ౫ అమరుకము-సాంధ్రము-జయంతి రామయ్యపంతులుగారు | ... | 1 | 0 |
| ౬ సాంబోపాఖ్యానము- రామరాజు రంగప్పరాజు | ... | 1 | 0 |

శ్రీ

# ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక.

రెండు నెలల కొకసారి ప్రకటింపఁబడును.

**(Journal of the Telugu Academy.)**


సంపుటము. ౨౪ | యువనామసంవత్సరము. మార్గశిరపుష్యమాసములు. | సంచిక ౫.





కాకినాడ:

క్రొత్తపల్లి సూర్యారావుచేఁ బరిషత్కార్యాలయమునఁ

బ్రకటింపఁబడినది.

చందా, పోష్టువ్యయములతో సంవత్సరమునకు రు. 3-౦-౦.

విడిసంచిక రు ౦-౮-౦.

1935-36 డిశంబరు, జనవరి మాసములు.

# విషయసూచిక.

దివంగత

# శ్రీఐదవజార్జిచక్రవర్తిగారు.



| | |
|---|---|
| జననము | 3-6-1865. |
| వివాహము | 6-7-1893. |
| పట్టాభిషేకము | 12-11-1911. |
| కాలధర్మము | 20-1-1936. |

# శ్రీమైదవజార్జిచక్రవర్తిగారిస్వర్గమనము.

---

శ్రీమన్మహామహిమోపేత మగు భరతవర్షమునకు సార్వభౌము లయిన యైదవజార్జిచక్రవర్తిగారు, ప్రజానురాగముతో నిరువదియైదు సంవత్సరములు సత్పరిపాలనముం గావించి దానికిం దగిన ప్రజలకృతజ్ఞతాసూచకమైన రజతోత్సవమహాపానందంబునంది తమడెబ్బదియవయేఁట స్వర్గము నలంకరించిరి. ఆనాఁ డేకాదశి, యీదుఃఖవార్తవినిన లోకమంతకుఁ దినినతిండి నీరగుటచే నుపవాసప్రాయమే యైనది. సత్పరిపాలకు లెంతకాల మున్నను వల దనువా రుందురా. కాని తమ యంతవానిఁ దమ్ముఁగూడ జయింపఁగల యిరువదియైదు వత్సరముల యౌవరాజ్యానుభవము గల జ్యేష్ఠకుమారుని యస్పందభుజాద్వయముపైఁ దమ రెండురాజ్యముల భారమును నిలిపి మనకానందదాయకులే యైరి. వారికై విచారింపఁగూడదు.

వృద్ధత్వమునను, మహాహవజయమునను, రాజనీతిని, బాలురచేత రాజ్యపరిపాలనముచేయింపఁ బూనుటను మఱియుననేకవిధముల భీష్మాచార్యుం బోలిన యీచక్రవర్తిగారి మరణము ధర్మమూర్తులకే కాదు వారిపైఁ గత్తికట్టిన దుర్యోధనులగు వైరులకును దుఃఖకారణమే యగుచున్నది. ఈమహాత్ముఁడు శస్త్రబాధననుభవించుచున్నను ననిమిషవిచారదూరముగా నుత్తరాయణము వచ్చువఱకు 'మేనిలోఁ బ్రాణములు నిలిపి యేకాదశినాఁడు మరణముఁగాంచినాఁడు. మనము హిందువులము, కర్మఠులము, ఇహముకంటెఁ బరమునం దెక్కుడు విశ్వాసము గలవారము కావున, ఇహలోకేంద్రైశ్వర్యము ననుభవించి వైకుంఠపరలోకప్రాప్తినొందినవారి హరివాసరమరణమునకు సంతోషింపవలయునుగాని విచారింపఁగూడదు. ఈభీష్మతుల్యునకు శ్రీకృష్ణునివంటి శ్రీక్రీస్తుద్వారమున మోక్షద్వారము తెఱవఁబడును గాక! ఆత్మకు స్వస్థత గల్గుఁగాక.

అన్నియు నెఱిఁగినఁ జక్రవర్తికుటుంబమునకు మన మింతకంటె సహానుభూతిని దెల్పుటలో నల్పజ్ఞులము.

---

# ఆంధ్రసాహిత్య

# పరిషత్పత్రిక.

## కాకినాడ.

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

సంపుటము ౨౪. { యువనామసంవత్సరము. మార్గశిరపుష్యమాసములు. } సంచిక ౫.

## సుకవి.

జయంతి స్వామినాయనగారు, ముమ్మిడివరము.

---

సీ. విశ్వమెల్లను నీలోన వెలయు నేమొ, వెలయుచున్నావొ నీవె యీవిశ్వమెల్ల
విశ్వమే నీవొ నీవ యీవిశ్వ మేమొ, లేశ మైనను భావింపలేము కాని
యేము "నిదమిద్ధ"మని చెప్పలేము కాని, నీమహాహృదయంబువిశ్వంబునిండియుండు
నీవిమలబుద్ధి నిశితమై నెగడుచుండు, నీయమృతబోధ సత్యమై నిలిచియుండు
నట్టి నీకెన యెవ్వ రీయవనియందు, సద్గుణోద్దామ! సత్కవిసార్వభౌమ!

నీవు గనరానితావులు లేవు భువిని, నీవెఱుఁగరాని కృత్యముల్ లేవు జగతిఁ
గానిచోఁ జొత్తుటీఁగకు నైనఁ దూఱ, రాని రాజుల యంతిపురంబులందుఁ
గలవిశేషంబు లెట్లు నీగ్రంథముల యథాగతిం జెప్ప నేర్తు? విద్వత్కవీంద్ర!

ప్రకృతిసృజియించునట్టి సద్బ్రహ్మ వీవ, ప్రకృతిఁజిత్రించు చిత్రకారకుఁడ వీవ
ప్రకృతి గానంబు సేయు గాయకుఁడవీవ, ప్రకృతి నలరించు సత్కవీశ్వరుఁడ వీవ
ప్రకృతి సౌందర్యమునుజూపుసుకృతివీవ, ప్రకృతికాంతకుముద్దుపుత్రకుఁడవీవ
యట్టినీ కివె జోహారు లందుకొనుము, ప్రథితగుణసాంద్ర! సత్కవిరాజచంద్ర!

అఖిలనిగమేతిహాసరహస్యములను, అఖిలశాస్త్రపురాణరహస్యములను
అఖిలగ్రంథార్థతత్త్వరహస్యములను, బలుకుపలుకునసమృతంబుచిలుకునటులఁ

బదము పదమున రస ముట్టిపడెడుభాతి, మించువేడ్కను జవులు జనించురీతి
రాజితానేకభావపరంపరలను, మహితసహృదయహృదయంగమంబుగాఁగ
గ్రంథజాలంబులందుఁ జోకైనముగ వ్రాసి, యజ్ఞులను విజ్ఞులను జేయునట్టి నీకు
సాటి యెవరయ్య యీప్రపంచంబునందు, సరసగుణధామ! సత్కవిసార్వభౌమ!
సమయము లెఱింగి సంఘదోషము లెఱింగి, దేశము నెఱింగి ధర్మంబు తెరు వెఱింగి
జనముల నెఱింగి వారియాశయము లెఱిఁగి, ప్రకృతితత్త్వంబెఱింగి కర్తవ్య మెఱిఁగి
యఖిలబుధసన్నుతముగ నవ్యైవిధముల, నయవినయముల నుదోధనంబొనర్చి
గ్రంథముల ధర్మసూత్రముల్ పొందుపఱచి, సకలజనులకు మార్గదర్శకుఁడవైన
నీ కివే వందనములు గొమ్మా! కవీంద్ర!
భావనాతీతశబ్దప్రపంచమునకుఁ, గర్తవై భర్తవై పరిహర్త వగుచు
ధర్మసంరక్షణాంబె కర్తవ్య మనుచుఁ, బ్రథమలపదార్థనిర్ణయప్రౌఢిఁ జూపి
కలమె ఖడ్గంబుగాఁగ నిష్కలుషబుద్ధిఁ, బ్రాంచితానేకవరవర్ణపాలనంబుఁ
జతురతనొనర్చు సుకవిరాట్సార్వభౌమ! మామకనమశ్శతంబు గొమ్మా మహాత్మ!
తావకోజ్జ్వలదివ్యసందర్శనంబుఁ, జేయునాతఁడు సద్యశశ్శ్రీల నొందుఁ
దావకీనమనోహరోద్యత్ప్రబంధ, సంచితార్థంబులెల్ల గ్రహించునతఁడు
దివ్యభోగసుఖాంభోధిఁ దేలియాడు, నీకనద్భుతనయవిద్య నేర్చునాతఁ
డఖిలధర్మప్రవర్తకుం డగుచు నెగడు; నీమనోజ్ఞవిజ్ఞానబోధామృతంబు
గ్రోలునాతఁడు మోక్షముం గొనితరించు; నహహ నీమహామహిమ లెంతని నుతింతు
సరసగుణధామ! సత్కవిసార్వభౌమ!
అవనిఁ దాపత్రయములచే నవయుమాకు, నమలమణిమయహర్మ్యసౌధాంతరముల
రమ్యభూషణరత్నాంబరములఁ దాల్చి, కాలము వినోదలీలలం గడపుచుండు
కువలయాక్షులఁ జూపించి కొంతసేపు; రమ్యతరలతాగేహాంతరముల వేడ్కఁ
దీఁగెయుయ్యాలలందు ననూఁగియాడి, యమృతమయమంజులోక్తుల నాడుచుండు
కొదమజవరాండ్రఁ జూపించి కొంతసేపు; నమలవాఃపూర్ణజలజాకరముల చెంత
విమలతరవాతపోతముల్ వీచువేళ, నెలచలువవెన్నెల బయళ్లఁ గలసిమలయు
కొమరుదంపతులను జూపి కొంతసేపు; సరసఫలకుసుమాసవాస్వాదనప్ర
మత్తశుకపికమధుకరమధురకూజి, తములఁ గోలాహలంబయి తనరునట్టి
సుందరోద్యానవనముల నందునందు, కేళిమై సంచరించు విటీవిటులను
వారి మురిపంపుస్వేచ్ఛావిహారములను, వారిమంజులమధురసంభాషణముల

వారిసుమనోజ్ఞహావభావంబులెల్ల, వివిధరీతుల వర్ణించి వేడ్కతోడఁ
గట్టెదుటఁ జరుగుచున్నట్లు కన్నుఁగవకుఁ, గన్నాక్రిదశకొత్తఁ జూపించి కొంతసేపు
చిత్తవికలతఁ బాపి రంజిల్లఁజేయు, యుష్మదద్భుతప్రభావ మీ యుర్వియందు
నస్మదాదులు పొగడ శక్యమె ! కవీంద్ర !
విమలమై యొప్పు మెఱుపుఁదీవియల నలరు, సురభిళాంచితకుసుమమంజరుల నరసి
యతులితానందమునఁ దేలునట్టి శక్తి, వెలఁదికెమ్మోవి చివురున వెలయుచుండు
మహితమంజులనవసుధామధురిమంబు, గ్రోలి తన్మయత్వముఁ జెందు గొప్పశక్తి
నీక కలుగుట తావకానేకపూర్వ, జన్మకృతపుణ్యఫలమెసూ ! సత్కవీంద్ర !
నిరతిశయమైన మోహవార్నిధిని మునిఁగి, యఖిలధర్మక్రియాపరిత్యక్తుఁ డగుచుఁ
గలికిపైఁటచెఱఁగునఁ గట్టువడుచుఁ, బడఁతికుచ్చిళ్లకొంగునఁ బంధుకొనుచు
మోహనాంగియె స్వర్గంబు మోక్షమనుచు, నుర్వియెల్లను గాంతతో నున్నదనుచు
నన్యములవెల్ల వ్యర్థంబులనుచు నెంచి, కాలముం బుచ్చుచున్నట్టి కాముకునకుఁ
గాంత యనిన నసహ్యత గలుగునటులఁ, గనక మనిన విరాగంబు గలుగునటుల
వాని నీతోడ దండకావనికినైనఁ, గాక హిమవన్నగాగ్రభాగమునకైన
ఱెక్కలంగట్టి కొంపోయి రేబవళ్లు, నిరుపమానందమూర్తులై నెగడునట్టి
యనుపమోజ్జ్వలగాత్రులై యలరునట్టి, పవనపర్ణాంబుభక్షులై వఱలునట్టి
బ్రహ్మనిష్ఠాగరిష్ఠులై పరఁగునట్టి, యాగతానాగతములెల్ల నరయునట్టి
విజితకామాదిగుణులౌచు వెలయునట్టి, సర్వలోకైకపూజ్యుల సత్యరతుల
శమదమాదిగుణాఢ్యుల విమలమతుల, నఖిలభోగవిరాగుల నధికయశుల
నిగమసూత్రార్థవేదుల నిఖిలఋషులఁ, జూపి కామలోలుపతను బాపి నీవు
సాధనచతుష్టయంబుల బోధచేసి, కర్మవిజ్ఞానభక్తియోగములఁ దెల్పి
యన్నిటికిఁ గల్గుసామరస్యమును జూపి, విహగసోపానమార్గముల్ విశదపఱచి
తత్త్వమస్యాదినిగమసూత్రముల వెలయు, ప్రథితజీవేశ్వరైక్యభావము వచించి
జగ మనిత్యము నిత్యుఁ డీశ్వరుఁడటంచు, నుర్వి నన్నిటఁ బరమాత్మయున్నదనుచు
నలపరంజ్యోతి నీయందుఁ గలదటంచు, నీవ బ్రహ్మంబ వఖిలంబు నీవ యనుచు
విమలపరతత్త్వభావంబు విప్పిచెప్పి, మోక్షమార్గముఁ జూపెడి పుణ్యపురుష !
మామకానేకవినయనమస్కృతములఁ, గైకొనఁగదయ్య సుగుణసాంద్రా! కవీంద్ర!

---

# ప్రాచీనకవి ప్రతిభావిశేషము.

పండితారాధ్యుల సూర్యనారాయణమూర్తిగారు, అమలాపురము.

---

'ప్రాచీనకవి ప్రతిభావిశేషము' అను శీర్షిక నెత్తికొనుటలో నాయాశయ మాకవిచంద్రుల యప్రతిమాన ప్రతిభాదులు లోక మెఱుంగ దని కాదు. ఆంధ్ర వాఙ్మయమును సృష్టించి, తగుకీర్తిఁ బోషించి, వివిధనియమ ప్రసాధనసామగ్రీసమగ్రంబుగ బంధుర ప్రబంధసౌధంబుల గౌరవించి యత్యున్నతస్థితికిఁ దెచ్చిన యే తన్మహనీయుల మనీషాశక్తు లాధునికాంధ్రకవులయం దెల్లవిధములఁ బ్రతిబింబించుచునే యున్నవి. అట్టికవిబ్రహ్మల యనిర్వచనీయ ప్రతిభం గూర్చి ముచ్చటింపఁ బూనుట నాయట్టి యల్పజ్ఞునకు సాహసకార్య మగుటం దెలిసియు దేవాలయంబున దేవునికి నమోవాకస్తుతులు యథామతి నర్పించునట్లు లీయాంధ్రసాహిత్య పరిషన్ముఖంబునఁ దదధిష్ఠానదేవత లగువారి స్మరియించి తన్మూలమున జిహ్వాశుద్ధిఁ బ్రాపింపఁ దలంచుటయే.

వర్తమానమున నాంధ్రభాషాసాహిత్య మలవఱచికొనినవారి కెల్లరకును, గద్యపద్యాదిరూపంబుల భాషాసేవ యొనర్చు నాధునికాంధ్రకవుల కందఱకును, ప్రాచీనకవికృతగ్రంథరాజంబులే గదా యాధారములు. వివిధనిఘంటునిర్మాతలకు మాత్రము మాతృక యేది? ప్రాచీనకవులు ప్రయోగించిన శబ్దజాలమే గదా! ఇన్నివిధముల నాంధ్రవాఙ్మయము పెంపొంది చిరస్థాయిగా నుండుటకుఁ బ్రాచీన కవులే శరణ్యమై యుండ నేతాదృశప్రతిభాదు లాకవులయం దునికికిఁ గారణం బూహింపఁజాలక కొంద ఱీకాలమునఁ బ్రాచీనకవులకు సంస్కృతము రా దనియు, శాస్త్రపరిచయము లే దనియు, నొరుల ననుకరించుటయే గాని స్వకపోలకల్పనాశక్తి మృగ్య మనియుఁ, బ్రకృతిపరిశీలనము, ప్రపంచజ్ఞానము శూన్యము లనియు మున్నగునజ్ఞానమూలకము లగువాక్యములు పలుకుట వినవచ్చుచున్నది.

కేవలసంస్కృతభాషానిష్ణాతులై యాంధ్రభాషాస్వరూపము నెఱుంగని వారు ప్రాచీనకవులకు సంస్కృతజ్ఞానము తక్కువ యనియును శాస్త్రపరిచయము లే దనియు, నుండినచో సంస్కృతముననే గ్రంథనిర్మాణ మొనరించి యుందు రనియు వింతవాదము లొనర్చుటకుఁ గారణము వారికాంధ్రభాషాజ్ఞానము లేకుండుటయే. ఆంధ్రకవితానిర్మాణమునకు వలయు వస్తుసామగ్రి యంతయు సంస్కృతమునుండియే గ్రహింపఁబడియున్నది.

నన్నయాదిమహాకవు లందఱును గీర్వాణభాషార్ణవమును దరిచి వివిధ శాస్త్రకళాపారంగతు లైనవారై యాంధ్రకావ్యనిర్మాణమునకుఁ గడంగిరి. ఏతద్విషయికజ్ఞానము వారిగ్రంథములు పరిశీలించినఁ గాననగును. మూలమునకు భిన్నముగా భారతనామాయణాదులఁ దెనిఁగించుటలోఁ గవిత యనువారలయు, భాస్కరునియు నద్వితీయకావ్యకల్పనాస్వతంత్రత వెల్లడి యగుచున్నది, గాని, సంస్కృతము రామింజేసి యనవచ్చునా ?

నన్నయభట్టీయ మను నామాంతరముగల యాంధ్రశబ్దచింతామణి యను నాంధ్రవ్యాకరణమును నన్నపార్యుఁడు సంస్కృతమునఁనే వ్రాసియున్నాఁడు. పాణినీయవ్యాకృతివిజ్ఞానమున నతఁడుపారంబు ముట్టినవాఁ డని యాగ్రంథముదెలుపుచున్నది. శాంత్యనుశాసనికపర్వములందలి విషయములు తిక్కనమహాకవికిఁ గల వేదాంతాదివివిధశాస్త్రపరిచయముఁ జాటుచున్నవి. ఆంధ్రభాగవతనిర్మాత యగు పోతనామాత్యుని వేదాంతశాస్త్రవిజ్ఞానపారమ్యము సామాన్యమా! శ్రీనాథకవిసార్వభౌముని గ్రంథములలోఁ దర్కవిజ్ఞానస్ఫోరకము లగుప్రయోగంబులు పెక్కులుగలవు. శృంగారనైషధములో, రణకంఠమాభర... కారణసంక్రాంతగుణాను షంగము, మున్నగునవి పెక్కులుగలవు. అష్టదిగ్గజము లని పేరొందిన పెద్దనాదిమహాకవుల గ్రంథములఁ బరిశీలించిన వారికిఁగలగీర్వాణభాషావైదుష్యమును, బెక్కు శాస్త్రంబులం గలయపారపరిచయమును గాననగును. ఉభయభాషాపదగుంఫనములతోఁ గవిత్వ మల్లుకొనిని జూపుటకై పెద్దనచెప్పిన "పూఁతమెఱుంగు" అను మాలికంబరికింపుఁడు. "సంస్కృతంబు పచరించెడుపట్టున భారతీవధూటీ..." మను చరిత్రమునందు సంస్కృతపదభూయిష్ఠసమాసములు- చకితైరావహులితి... అనాశ్వాసిత... కుశలత యేవ్రతముల నగునశనాయాపీడ... పవమానప్లవమాన... మున్నగునవి పెక్కులు గలవు. ప్రబలభల్లుకనఖభల్ల...

సంగీతశాస్త్రపరిచయమున కుదాహరణము- వాలారుంగొనగోళ్ళ-

జ్యోతిశ్శాస్త్రము- తేజంబబ్జభవాండ-

రామరాజభూషణుఁడు- సంస్కృతజటిలము. లలనా...

సంగీతము- నను శ్రీరామపదారవింద, అని చెప్పికొన్నారు. అరిగాఁబంచమ మేవగించి నవలాలవ్వేళ.

జ్యోతిశ్శాస్త్రము-సారసక్షైరవంబులకుఁ జంద్రదినేంద్రవిరోధ మంచకుం గారణము.

ఆముక్తమాల్యద- ఖనటత్పయోద్ధిపీక్ష్యరసాతలా ... కాంచె నవ్వైష్ణవుఁ డర్ధయోజన. పింగళి సూరనార్యుని రాఘవపాండవీయము శ్లేషకావ్యము గదా! సంస్కృతభాషయం దసాధారణపాండితి లేక యిట్టిమనోహరశ్లేషకావ్యము వ్రాయఁ గలుగునా? ప్రభావతీప్రద్యుమ్నములోఁ బ్రద్యుమ్నునియెదుట శుచిముఖి పలికిన వాక్యములు సూరనార్యుని తర్కశాస్త్రనిష్ణాతత్వమును దెలుపుచున్నది. కూఁచిమంచి తిమ్మకవిం గూర్చి కొందఱు సంస్కృతపండితు లితఁడు దెనుఁగుకవి యని తేలికగాఁ బలికి రఁట. అప్పు డాతఁడు నేను దెనుఁగుకవినే, గాని, గీర్వాణమునం గల మీబుద్ధివైశిత్యము ప్రకాశించునట్లుగా నా యీ పద్యము నన్వయింపుఁ డని "పరిపఠీలుకర్బురపురక్షణనుఁడు" అని చదివెనఁట-

ఆపద్యము నన్వయింపఁ జాలక తిమ్మకవికిఁ గలనవిశేషసంస్కృతవిజ్ఞానమున కచ్చెఱువడి తమకాంధ్రభాషాజ్ఞానము లేమికి సిగ్గువడి రఁట. ఆంధ్రకవి యనుటతోడనే సంస్కృతము రా దనునపోహము లోకమునఁ జాలవఱకు వ్యాపించి యున్నది. దానికిఁ గారణము లేకపో లేదు. వర్తమానకాలమునఁ గందము రాఁగానే కావ్యమును, ఆటవెలఁది రాఁగానే యవధానమును బ్రారంభించువారు పెక్కురు గలరు. అట్టివారి నాదర్శముగాఁ గొని పూర్వులకు సంస్కృతజ్ఞానమును శాస్త్రపరిచయము లే దనుట యవివేకమూలకము. గ్రంథములను సవిమర్శదృష్టితోఁ బఠించినఁగాని గ్రంథకర్తవిజ్ఞానపరిమితి యెఱుకపడదు. నేఁటిసాంస్కృతికులకుఁ బెక్కుమందికిఁ దమచదివిన గ్రంథములను గుఱించియే తెలియదు. కాళిదాసత్రయమును రచించినవా రెవరయ్యా యని ప్రశ్నింప 'వావిళ్ల రామస్వామిశాస్త్రులవారు' అని చెప్పు కావ్యపాఠకులు గొందఱు గలరు. అట్టివారి కాంధ్రకవుల ప్రతిభ యెట్లు దెలియును?

ప్రాచీనకవులకు నొరుల ననుకరించుటయే గాని స్వకపోలకల్పనాశక్తి మృగ్య మని కొంద ఱన్యభాషాభిమాను లగు నవనాగరకుల యూహాతరమణీయవాక్యములు—ఒకఁడు గ్రంథాదిని షష్ఠ్యంతములు వ్రాసినఁ దక్కినవారుఁ గూడ షష్ఠ్యంతము లేసఁట. ఒకరినిజూచి మఱియొకరు కృతిపతివంశావతారము, పురము, అగడ్త మున్నగువానిని వర్ణించుచున్నారఁట. ఇదియే యనుకరణమఁట.

ప్రబంధరచనకుఁ గొన్నిలక్షణము లుండవలయును. అందుచే వా రానియమములఁ బాటించి యష్టాదశవర్ణనలతోఁ బ్రబంధరచనఁ గావించిరి. అదియుంగాక పుర మనునది యిట్లుండవలె ననియును, రా జిట్టివాఁడు గా నుండవలయు

ననియు, లోకములో నాగరకత కాదర్శముగా నుండుటకు వ్రాసిరిగాని వారు వర్ణించిన ప్రతిపురము నట్లే యున్న దనుకొనరాదు. ఆశీర్నమస్క్రియా వస్తునిర్దేశః - అనునియమము ననుసరించి, ఇష్టదేవతా ప్రార్థనము, కృతిపతి కాశీస్సు మున్నగు వానితో గ్రంథారంభ మొనరించిరి. కృతిపతివంశవర్ణనము గూడ విడువరానిదే. సప్తసంతానములలో నొకటి యగు కన్నింట మిన్నయు నగు కృతిని గన్యగా భావించి కృతిభర్తను జామాతగా సంభావించియిచ్చుచో నుత్సాహ మినుమడింప - సవంగుణవిశిష్టుడు తనకృతికన్యం గ్రహింపఁగలవాఁ డని కొన్నిపద్యాంతములతోఁ జెప్పినట యనవసరమా? కన్యాదాత యగువాఁడు కూఁతు వివాహసమయమున జామాతవంశమును జెప్పినట లేదా? గోత్రోద్భవాయ, పౌత్రాయ, పుత్రాయ, శర్మణేవరాయ - అని.

ఇంతయేల, మన మొక యుత్తరమును వ్రాయునపుడు ప్రారంభములో సంబోధనరూపమున మహారాజశ్రీ యనియో, వేదమూర్తులైన బ్రహ్మశ్రీ యనియో వ్రాయుచుండుట లేదా? విద్యాంసుఁడు మొదలు ప్రాచ్యునిపర్యంతము, నిట్టి నియమముఁ బాటించుట లేదా? వార్షికసభాసమావేశము జరుగునపుడు పూర్వసభావినిశ్చితాంశములఁ జదువుట, యధ్యక్షుని ప్రారంభోపన్యాసము, మున్నగునవి లేకుండఁ గార్యక్రమము నడచుచున్నదా? స్వప్నమువచ్చుట, ప్రకృతిపరిశీలనము, ప్రపంచజ్ఞానము, ప్రాచీనులకు లేదనువిషయ మాలోచింతము. ప్రకృతిజ్ఞానము లేదు, కూపస్థమండూకము లని పలువురు నాగరకమ్మన్యులు సాహసించి పలుకుచున్నారు. ప్రకృతిజ్ఞాన మన నేమియో యీనవనాగరకులకే తెలియదు.

భారత భాగవత రామాయణాది పురాణగ్రంథములలో వర్ణింపఁబడిన రాజనీతి, ధర్మములు, ఆరోగ్యశాస్త్రప్రశంస యేతత్కవుల లోకజ్ఞానమును జాటుచున్నవి. ఆచారవిధులకు నారోగ్యమునకుఁ గలపరస్పరసంబంధమును దెలుపుచు వ్రాసినధర్మములు వారిలోకోత్తరప్రకృతిజ్ఞానము వెల్లడించుచున్నవి. ఆనుశాసనిక పర్వ మందలి యీపద్యమును జూడుఁడు.

వృద్ధువచ్చునపుడు విను బాలుప్రాణంబు, లెగయఁజూచు వాని కెదురు లేచి
ప్రణతిఁజేసె నేని పాదునఁబడి యవి, తొంటియట్లు నిలుచు దురితదూర.

పోతనగారి భాగవతములో భూగోళశాస్త్రమును విపులముగా వర్ణించి యున్నారు. భూమిగుండ్రముగానున్నదా చదునుగానున్నదా యనువిషయ మొకప్రశ్నయే గాదు. ధరావలయము, భూవలయము, నని వాడియున్నారు. శ్రీనాథ

కవి, శృంగారనైషధములో విద్యుద్దీపములను 'ఒకదీపమార్పిన నున్నదీపంబులు నశ్యింపక తమకుఁదా మాఱుటయును' వర్ణించినాఁడు.

ఆముక్తమాల్యదలోని యొకయుదాహరణము:—

"తరుఁజల్ తల్లియొఱంగుచంబులునుపందచ్చె" శ్లో॥కూపోదకంవటచ్ఛాయా...

ఇంకను దక్షుఁగలప్రబంధములలో-పర్వతములు వానియందు గను లుండుట, లోయలు, నిర్ఝరములు, జలపాతములు, అరణ్యములు, వేఁటలు, జంతుస్వభావములు- వృక్షవిశేషములకు నొనరించు దోహదక్రియలు- ఎంతయద్భుతముగా వర్ణింపఁబడినవో- ఇవి యన్నియు వారికిఁగల లోకజ్ఞానమును ప్రకృతిపరిశీలనమును స్ఫురింపఁజేయుట లేదా.

ప్రభావతీప్రద్యుమ్నములో 'పోలో' ఆట రమణీయముగా వర్ణింపఁబడినది. "ఎగురఁగనై చికొట్టుటది." సుమతిశతకము- లోకజ్ఞానసారము.

తపస్సంపన్నత- ఈయన్నింటికంటెను వారిప్రతిభకు వన్నె తెచ్చునది వారి పవిత్రజీవితము, తపస్సంపన్నతయును.

పంచమవేదమగు భారతమునుఁ దెనిఁగించుటకు మున్నుగా, తిక్కనగారు యజ్ఞముచేసినట్లు వినుచున్నారము. ఇంతియె గాక యితఁడు శుచియై నందీశంకరమధ్యంబునం గూరుచుండి తననోట నసంబద్ధవాక్యము వచ్చెనేని నాలుకను గోసికొందు నని ప్రతినంజేసికొని భారతగ్రంథరచనకుఁగడంగెనందురు. అట్లు కవితాధార నడచుచుండగా నొకచోట-కృష్ణార్జును లిరువురు తమశంఖంబులం బూరించిరని వర్ణించుటలో "దేవదత్తంబుపూరించె," అందులకుం బ్రతిజ్ఞాభంగము కాఁగా నాలుక గోసికొన సంసిద్ధుఁ డయ్యెను. అప్పుడు కృతిపతి యగుహరిహరనాథుఁడే సాక్షాత్కరించి "మున్నుగ" అన్నట్లు వినవచ్చి యప్పుడు సమర్థించుకొన్నట్లు వినికి గలదు. పిల్లలమఱ్ఱి వీరభద్రకవి జైమినిభారతమును వ్రాయుటంగూర్చి 'ఒకనాఁటి రాత్రి సహస్రబాహువులతో సరస్వతియే పూరించినట్లు' గాథలు కలవు. రామరాజభూషణుఁడు, అయ్యలరాజు రామభద్రకవి మున్నగువా రందఱు నాంజనేయోపాసకులని, రామోపాసకులని వినుచున్నారము. అడిదము సూరకవి తపశ్శక్తి వాక్శుద్ధిని గూర్చి కొన్ని నిదర్శనములుగలవు. శుచిర్వ్రత శ్శుచిః కవిః-వారి నాఁటిదే. ఇట్టి ప్రతిభావిశేషములు ప్రాచీనకవులకు సహజముగా నుండుటచేతనే యాంధ్రవాఙ్మయ మొక్కొకకాలమున నొక్కొకరీతిఁ బెంపువహించి శోభిల్లుచున్నది.

"మహిమున్ వాగనుశాసనుండు."

# భాసుఁడు.

—: కిడాంబి రాఘవాచార్యులుగారు ఎం. ఏ., బి. ఎల్., కాకినాడ :—

## (1) తిరువనంతపుర నాటకములు.

మహాకవి భాసునింగూర్చియు నతనినాటకములను గూర్చియును బ్రశంస యొనర్పకపూర్వము సంస్కృతవాఙ్మయమున నాటకము లేకాలమున రచింపఁబడినవో, యవి యేరీతి నుత్పత్తి నొందినవో, యెటులు వికాసమును గాంచినవో మనము తెలిసికొనవలసియున్నది. కావ్యములు దృశ్యశ్రవ్యభేదములచే ద్వివిధములు. దృశ్యకావ్యములును రూపకములు, నుపరూపకము లని విభజింపఁబడినవి. నాటకము, ప్రకరణము, భాణము, ప్రహసనము, డిమము, వ్యాయోగము, సమవకారము, వీథి, అంకము, ఈహామృగము, అని రూపకములు పది. గోష్ఠి, రాసక, హల్లీసకప్రేంఖణాదులు పదునెనిమిదియు నుపరూపకములు. వస్తు (Plot) నేతృ (Hero) రసాదుల (Sentiment) భేదములచే రూపకభేదములు గలుగుచున్నవి.

'నట-అవస్పందనే' అనుధాతువునుండి నాట్యము, నటుఁడు, నాటకము, మున్నగుశబ్దములు జనించుచున్నవి. కావ్యోపనిబద్ధధీరోదాత్తాదినాయకులఁ జతుర్విధాభినయముచే ననుకరించుచుఁ దాదాత్మ్యమునుఁ జెందుట నాట్యమనఁబడును. నటునియందు రామాదులయవస్థల నారోపించుటచే నది రూపక మనఁబడి, రసాశ్రయముచే నాటకప్రకరణాది దశగతుల నందుచున్నది. రసాశ్రయముగాక గాత్రవిక్షేపార్థక మగునది నృత్యము. తాళలయాశ్రయము నృత్తము. ఇవిరెండును లాస్యతాండవభేదంబులచే ద్వివిధము. (దశరూపకము ప్రథమప్రకాశము శ్లో. 7-10)

ప్రాచ్యపాశ్చాత్యదేశములఁ బ్రథమమున నృత్తనృత్యములే కానవచ్చుచున్నవి. కాలక్రమమున నాటకము లుద్భవించినయవి. పాశ్చాత్యవాఙ్మయములందు నాటకములు మొదట మతవిషయక మగుగాథలఁ బ్రదర్శించుచుండెడి వని విమర్శకు లంగీకరించి యున్నారు (Mystery Plays) కాని హిందూదేశమునఁ బ్రాచీనకాలమునం దట్టివి గలవా యనువిషయ మింకను నిర్ణయ మొనర్పవలసియున్నది. సంస్కృతనాటకరచనము మతముపై నాధారపడి యుండలే దనియుఁ గేవలము లౌకికవిషయములనుబట్టియే వ్యుత్పత్తిని గాంచె ననియుఁ గొందఱు వాదించుచున్నారు. అదియే సమంజస మని తోఁచుచున్నది. భరతుని నాట్య

శాస్త్రానుసారం బంద్రాదులు బ్రహ్మను దృశ్యమును, శ్రవ్యము నగు క్రీడనీయక మును సర్వవర్ణోపయోగముగ సృజింప వేఁడి రనియుఁ బరమేష్ఠియుఁ బంచమ వేద మగునాట్యవేదమును సృజించుచు నాసృష్టియందు ఋగ్వేదమునుండి పాఠ్య మును, సామమునుండి గీతమును, యజుర్వేదమునుండి యభినయమును, నాల్గ వది యగు యథర్వణమునుండి రసమును గైకొనియె ననియు, నాతని యాజ్ఞాను సారము భరతునిపుత్త్రు లగుశాండిల్యాదు లతనితోఁ బ్రయోగాదులఁ బ్రదర్శించి రనియుఁ దెలియుచున్నది. దీనివలన నాట్యవేదము చతుర్వేదానంతరము రచింపఁ బడిన దనుట స్పష్టము. ఇది భారతీయుల నాటకరచనోత్పత్తివిషయక మగు ప్రాచీ నగాథ యై యున్నది.

నాటకసంలాపము ననుసరించు సంభాషణములు కొన్ని వేదములందుఁ గలవు. ఈసంభాషణములే సంస్కృతనాటకరచనమునకు మూలము లనుట యతి శయోక్తి. పాణినికాలమునాఁడు నటసూత్రములు గల వనియు ను, నవి 'శిలాలి' 'కృశాశ్వ' ప్రణీతము లనియు మనకుఁ దెలియును.

పారాశర్యశిలాలిభ్యాం భిక్షునటసూత్రయోః- అష్టా-4-3-110

కర్మన్దకృశాశ్వాదినిః- ,, 4-3-111

క్రీ. శ. 2 వ శతాబ్దమువాఁ డగుపతంజలి తనమహాభాష్యమున శౌభికులు 'కంసవధ'ను 'బలిబంధము'ను బ్రదర్శించుచుండి రని తెలిపియున్నాఁడు. మఱియు నశ్వఘోషుని శారీపుత్త్రప్రకరణభాగములు కొన్ని యిటీవల దొరకినవి. ఈతఁడు కాళిదాసునకుఁ బూర్వుఁడా యర్వాచీనుఁడా యనువిషయ మింకను విమర్శకులు చర్చింపుచున్నారు. తరువాత భాసుఁడు, శూద్రకుఁడు, కాళిదాసుఁడు, భవభూతి, మురారి, విశాఖదత్తుఁడు, రాజశేఖరుఁడు మున్నగుప్రఖ్యాతకవీశ్వరులు తమతమ నాటకములచేసంస్కృతసాహిత్యమును వృద్ధిపొందించిరి. సంస్కృతనాటక రచనము పాశ్చాత్యనాటకములపై నాధారపడి యున్న దనియును, 'యవనికా', 'యవనీభిః పరివృతః' అనుచోట 'యవన' (Greek) సంబంధము సూచింపఁబడి యున్న దనియు ను పాశ్చాత్యవిద్వాంసుల యభిప్రాయ మైయున్నయది. ఇది సరి కాదు. సంస్కృతనాటకరచనము స్వతంత్రముగ మనదేశముననే యుద్భవించి యభివృద్ధిని గాంచిన దనియు, నన్యదేశీయనాటకరచనము ననుకరించుట లేదనియుఁ బలువురు పండితులు నిర్ధారణ మొనర్చియున్నారు.

క్రీ. శ. 1912 వ సంవత్సరప్రాంతమున ననంతశయనము (Trivendrum) సంస్కృతగ్రంథప్రకాశనకార్యాలయాధ్యక్షు లగు మహామహోపాధ్యాయ టి.

గణపతిశాస్త్రిగారు నాలు గయిదు తాళపత్రగ్రంథములను సేకరించి యందుఁగల రూపకముల 'ననంతశయనసంస్కృతగ్రంథావళి' యందుఁ బ్రకటించిరి. ప్రథమమున 'స్వప్నవాసవదత్త' మను నాటకమును దమగ్రంథావళియందుఁ బదునైదవగ్రంథముగఁ బ్రకటించుచుఁ గాళిదాసాదికవులచేఁ బ్రశంసింపఁబడిన భాసమహాకవియే యీనాటకముల రచించె నని సహేతుకముగఁ దమయుపోద్ఘాతమునఁ జర్చించిరి. నాఁటినుండి యుఁ బ్రాచ్యపాశ్చాత్యపండితులు గణపతిశాస్త్రిగారి వాదమునకు ఖండనమండనములుగఁ బెక్కువ్యాసముల రచించియున్నారు. వానిలో ముఖ్యమ యినవి మొదటియనుబంధమునఁ జూడనగును. భాసుని వని వారు ప్రకటించిన నాటకము లిట నుదాహృతములు.

| | | అనంతశయనగ్రంథావళిసంఖ్య. |
|---|---|---|
| 1. | స్వప్నవాసవదత్తము. | 15 |
| 2. | ప్రతిజ్ఞాయౌగంధరాయణము. | 16 |
| 3. | పంచరాత్రము. | 17 |
| 4. | అవిమారకము. | 20 |
| 5. | బాలచరితము. | 21 |
| 6. | మధ్యమవ్యాయోగము. | 22 |
| 7. | దూతవాక్యము. | 22 |
| 8. | దూతఘటోత్కచము. | 22 |
| 9. | కర్ణభారము. | 22 |
| 10. | ఊరుభంగము. | 22 |
| 11. | అభిషేకనాటకము. | 26 |
| 12. | చారుదత్తము. | 39 |
| 13. | ప్రతిమానాటకము. | 42 |

వీనియందు స్వప్నవాసవదత్తాప్రతిజ్ఞాయౌగంధరాయణములు వత్సరాజునకు సంబంధించినవి. ప్రతిమాభిషేకములు రామాయణకథ ననుసరించినవి. ప్రతిమానాటకమున నయోధ్యాకాండమునందలి కథయు సీతాపహరణమును, జటాయుమరణమును రావణవధయు వర్ణింపఁబడినవి. అభిషేకనాటకమునఁ గిష్కింధాసుందరయుద్ధకాండములయందలి కథ యనుసంధింపఁబడినది.

మధ్యమవ్యాయోగము, దూతవాక్యము, దూతఘటోత్కచము, కర్ణభారము, ఊరుభంగము, పంచరాత్రమును భారతకథను వర్ణనమొనర్చును. అందు మొదటి యయిదునాటకము లేకాంకపరిమితములు. పంచరాత్రమున మూఁడంకములు గలవు.

బాలచరితమునఁ గృష్ణుని బాల్యక్రీడావర్ణనమునుఁ గంసవధయును గలవు. అవిమారకనాటకేతివృత్తము పురాణసంగ్రథితము కాదు. కథాసరిత్సాగరమునందలి కథపై నాధారపడియున్నది. చారుదత్తమునందలికథ వసంతసేనాచారుదత్తుల ప్రణయవృత్తాంతము.

విమర్శకు లీనాటకము లేకకర్తృకములా, యేకకర్తృకము లగుచో నివి భాసవిరచితములా? భాసుని దేశకాలము లెవ్వి యనువిషయముల భిన్నాభిప్రాయు లగుచున్నారు. భాసుఁడే యీనాటకముల రచించెననువారును నాతనికాలనిర్ణయమును గూర్చి భిన్నాభిప్రాయులై యున్నారు. కొంద ఱాతని క్రీ. పూ. 4 వ శతాబ్దమువాఁ డగుకౌటిల్యునికిఁ బూర్వుఁ డనియు, మఱికొందఱు క్రీ. పూ. 2 వ శతాబ్దమువాఁ డగుపతంజలికిఁ బూర్వుఁ డనియు వాదించుచున్నారు. కొందఱు పతంజలి కీతఁ డర్వాచీనుఁ డని యొప్పికొనియు, నశ్వఘోషుని (వారిమతానుసారము క్రీ. శ. 1, 2 శతాబ్దములు) కిఁ బూర్వుఁడా యనువిషయమున సంశయగ్రస్తు లగుచున్నారు. తిరువనంతపురనాటకములు భాసునివి కావనివాదించు బార్నెటు (Barnett), భట్టనాథస్వామి, పిషరటీ మున్నగువారు వీనిని క్రీ. శ. 8, 9 శతాబ్దముల దక్షిణహిందూస్థానమున బాణకాళిదాసుల యనంతరము రచింపఁబడినవానిగఁ బరిగణించుచున్నారు. వారివారివాదములఁ గలముఖ్యవిషయముల సంగ్రహముగ విమర్శించి తిరువనంతపురనాటకముల కర్తృత్వమును భాసునిదేశకాలములను జర్చించుటయే యీవ్యాసముయొక్క ముఖ్యోద్దేశము.

(2) భాసుని ప్రాచీనత్వము.

మహాకవుల జీవితచరిత్రమును వ్రాయుట కుపకరించు సాధనములు మనదేశమునఁ జాల విరళముగ నున్నవి. కాళిదాసాదిమహాకవులు వారిగ్రంథములవలనను బరంపరాగత మగు గాథలవలనను వాఙ్మయమునం దితరకవుల ప్రశంసావాక్యములవలనను మనకుఁ బరిచితు లగుచున్నారు. వారిదేశకాలములు జీవితవిశేషములు మనకుఁ దెలియుటలేదు. భాసమహాకవిని గూర్చియు నట్టిగ్రంథాంతరసూచనములే మన కాధారము లగుచున్నవి.

సంస్కృతవాఙ్మయమునందలి కావ్యనాటకాలంకారవ్యాఖ్యాన గ్రంథముల వలన మనకు భాసమహాకవి ప్రాచీనుఁ డనియు, సుప్రసిద్ధనాటకకర్త యనియును దెలియుచున్నది. కవిసార్వభౌముఁ డగు కాళిదాసుఁడు తనమాళవికాగ్నిమిత్ర ప్రస్తావనయందు 'ప్రథితయశసాం భాస సౌమిల్లక కవిపుత్రాదీనాం ప్రబంధా నతిక్రమ్య వర్తమానకవేః కాళిదాసస్య క్రియాయాం కథం బహుమానః' అని భాసాదులను గీర్తించియున్నాఁడు[1]. దీనికి 'భాస కవిపుత్ర సౌమిల్లకాః కవయః ప్రాక్తనాః' అని కాటయవేముఁడు వ్యాఖ్యాన మొనర్చెను. 'ప్రథితయశసాం' అనుట వలనను, 'పురాణమిత్యేవ న సాధు సర్వం' అని స్వవిరచిత నాటకోత్కర్షముగఁ బలుకుచు 'పురాణ' శబ్దప్రయోగ మొనర్చుటవలనను, భాసుఁడు ప్రాచీనుఁ డనియుఁ, గాళిదాసునికాలమునకే ప్రథితయశస్కుఁ డనియు నిస్సందేహముగఁ జెప్పవచ్చును. 'వర్తమానకవేః' యనునది కూడ దానినే సూచించుచున్నది.

2. కాదంబరీహర్షచరితముల రచియించిన బాణుఁడు (క్రీ. శ. 7 వ శతాబ్దము) హర్షచరితమున (శ్లో. 15) భాసు నీవిధముగఁ బ్రస్తుతించియున్నాఁడు.

"సూత్రధారకృతారమ్భై ర్నాటకై ర్బహుభూమికైః
సపతాకై ర్యశో లేభే భాసో దేవకులై రివ"

సూత్రధారునిచే నారంభింపఁబడి, పెక్కుపాత్రములఁ గలిగి పతాకయుతము లగునాటకముల రచియించి భాసుఁడు కీర్తి నార్జించె నని దీనియర్థము. ఇందు భాసునినాటకములందుఁ గలవిశేషలక్షణములు దెలుపఁబడినవి. తిరువనంతపుర నాటకములం దివి కలవా యనువిషయము ముందు విమర్శింపఁబడును.

3. దండి తనయవంతీసుందరీకథయందు (దక్షిణభారతీగ్రంథమాల 3 వ కుసుమము) భాసు నిట్లు కీర్తించెను.

సువిభక్తముఖాద్యఙ్గైః వ్యక్తలక్షణవృత్తిభిః
పరేతో౽పి స్థితో భాసః శరీరైరివ నాటకైః (శ్లో-11)

4. క్రీ. శ. 8 వ శతాబ్దమునాఁటి దగువాక్పతిరాజకృత 'గౌడవధ' మను ప్రాకృతకావ్యమున-

"భాసమ్మి జలణమిత్తే కంతీదేవే అజస్సరహు ఆ రే సో బంధవే అ బంధమ్మి హారియందే అ ఆణందో" అని కలదు. దీనివలన భాసుఁడు జ్వలనమిత్రుఁ డనియు

1. భాసధావకకవిపుత్రాదీనాం, భాస్యరసౌమిల్ల కవిపుత్రాదీనాం అనియుఁ బాఠభేదములు గలవు.

నాతనినాటకము లగ్నిలోఁ బరీక్షింపఁబడుటచే వాక్పతిరా జటుల వ్రాసె ననియుఁ బండితులయభిప్రాయము. ఇట జ్వలనమిత్రుఁ డనుచో నగ్నిమిత్రుఁ డనుపర్యాయ నామము గలశూద్రకుఁడు సూచింపఁబడె ననియు, భాసశూద్రకు లొకరే యని యు నొకవిమర్శకులు వ్రాసియున్నారు.[1] ఇది ముందువిమర్శింపఁబడును.

5. అభినవగుప్తుఁడు (క్రీ. శ. 10 వ శతాబ్దము)తననాట్యవేదవివృతియందు 'మహాకవినా భాసే నాపి స్వప్నబంధే ఉక్తః' అని యొకశ్లోకము నుదాహరించి యున్నాఁడు. మహాకవి యగుభాసుఁ డభినవగుప్తునిచేఁ బేర్కొనఁబడె ననుటయే మన మిటఁ గైకొనఁదగినది.

6. 'ఉదయసుందరీకథ' ను రచియించిన సోఢలకవి (A. D. 1050) భాసు నిట్లు నుతించియున్నాఁడు.[2]

బభూవు రన్యేఽపి కుమారదాస, భాసాదయో హంత కవీందవ స్తే
యదీయగోభిః కృతినాం ద్రవంతి, చేతాంసి చంద్రోపలనిర్మలాని (నిర్మితాని).

7. క్రీ. శ. 11 శతాబ్దమువాఁ డగుభోజుఁడు తనసరస్వతీకంఠాభరణమునఁ గాళిదాసు నిట్లు ప్రస్తుతించియున్నాఁడు. ఆశ్లోకమునభాసునిప్రశంసకూడఁ గలదు.

"భాసయ త్యపి భాసాదౌ కవివర్గే జగత్త్రయమ్
కే న యాంతి నిబంధారః కాళిదాసస్య దాస్యతామ్."

8. రామచంద్రగుణచంద్రు లనుకవులు (A. D. 1175) తమనాట్యదర్పణమునందు భాసుని స్వప్నవాసవదత్తములోని దని యీశ్లోకము నిచ్చియున్నారు.[3]

యథా భాసకృతే స్వప్నవాసవదత్తే—శేఫాలికా మణ్డపశిలాతలా నవలోక్య వత్సరాజః—

'పాదాక్రాంతాని పుష్పాణి సోష్మ చేదం శిలాతలమ్
నూనం కాచి దిహాసీనా మాం దృష్ట్వా సహసా గతా.'

భాసుఁడు స్వప్నవాసవదత్తమును రచియించె నని దీనివలన స్పష్టము. ఇది తిరువనంతపురనాటకమున లేమి, యీనాటకము భాసకృతము గా దని కొందఱయభిప్రాయము. దానిని ముందు విమర్శింతును.

9. సోమదేవుని యశస్తిలకమున—

"పేయా సురా ప్రియతమాముఖ మీక్షణీయం, గ్రాహ్య స్వభావలలితో విక

1. The Problem of Bhasa by K. G. Sankar.
2. Baroda Edition- P 154.
3- ,, P 84,

టశ్చ వేషః । యేనేద మీదృశే మదృశ్యత మోహనస్త్వం, దీర్ఘాయు రస్తు భగ వా నృ పినాకపాణిః" ॥

అను శ్లోకము భాసుని దని కలదు. కాని, యిది మహేంద్రవర్మవిరచిత మగు "మత్తవిలాసప్రహసనము"నఁ గనఁబడుటచే సోమదేవుఁడు సమాదవనమును స ట్లుదాహరించి యుండు నని తోఁచుచున్నది.

10. జయదేవకవి (13 వ శతాబ్దము) ప్రసన్నరాఘవనాటకప్రస్తావనయం దుఁ గవితాకన్యకకు భాసుఁడే హాస మనియు, గవికులగురుం డగు కాళిదాసుఁడే విలాస మనియు స్తుతించి యున్నాఁడు.

'భాసో హాసః కవికులగురుః కాళిదాసో విలాసః'.

11. జయానకుఁ డనుకవి తన 'పృథ్వీరాజవిజయ' మున (దీనికే 'పృథ్వీమ హేంద్రవిజయ' మను నామాంతరము కలదు.)

"సత్కావ్యసంహారవిధౌ ఖలానాం దీప్తాని వహ్నేరపి మానసాని
భాసస్య కావ్యం ఖలు విష్ణుధర్మాన్ సోప్యాననాత్ పారతవ న్నమోచ.

అని వ్రాసియున్నాఁడు. దీనికి జోనరాజు [క్రీ. శ. 15 వ శతాబ్దమున] వ్యాఖ్యాన మొనర్చెను.

(సతాం కావ్యం తద్విషయే సంహారవిధౌ దాహే దోషారోపేణ అగ్నేరపి సకాశాత్ దుర్జనానాం చిత్తాని దీప్తా న్యజడాని భవంతి. అత్ర సాధనమాహ. సోగ్నే రపి భాసమునేః కావ్యం విష్ణుధర్మాన్ ముఖాత్ త్యక్తవాన్ నాదహదిత్యర్థః. అత ఏవ పారతవ దిత్యుపమా. అగ్నిశ్చ న స్త్వంతరవ త్పారతందగ్ధుముత్సృ ముఖాన్నుం చతి. భాసవ్యాసయోః కావ్య విషయే స్పర్ధాంకురవతో సర్వోత్కర్షవ త్తిత్వేన పరీక్షకాంతరాభావాత్ పరీక్షార్థ మగ్నిమధ్యే తయో ర్ద్వయోః కావ్యద్వయం క్షిప్తం. తయో ర్మధ్యాత్ అగ్ని ర్విష్ణుధర్మాన్ నాదహ దితి ప్రసిద్ధిః-ఖలైస్తు ప్రా ప్తం సత్కావ్యం దహ్యతే ఇత్యగ్నేస్సకాశాత్ ఖలానాం దాహకత్వ మిత్యర్థః)—

పై శ్లోకార్థమును గుఱించిగణపతిశాస్త్రిగారు స్వప్నవాసవదత్తపీఠికయం దు విపులముగఁ జర్చించిరి. భాసుఁడు విష్ణుధర్మము లను గ్రంథమును రచియించె ననియు, దాని నగ్ని దహింపక విడిచె ననియుఁ గొందఱ భిప్రాయపడుచున్నారు.[1] కాని శ్లోకమునందు 'విష్ణుధర్మాన్' అనుటకు 'విష్ణుధర్మ' అనియు 'పారతవత్'

---

1- Indian Antiquary—Vol XLII – 1913–P 52.
'a Poem by Bhasa' by C. Guleri.

అనుటకు 'భారతవత్' అనియుఁ బఠించినచో సర్థసమన్వయ మగు నని మఱియొకరు వ్రాసియున్నారు.[1] అటు లయినచో జోనరాజు వ్యాఖ్యాన మసందర్భముగ నుండును. భాసవ్యాసులకావ్యము లగ్నింబరీక్షింపఁబడెననిన నిరువురునొకవిషయమును గుఱించియే వ్రాసి రనవలయును గదా. భారతకథావిషయకములగు పంచరాత్రాదినాటకముల భాసుఁడు రచించె నన్నను, నాతని స్వప్నవాసవదత్తమును బరీక్షార్థము గైకొననేల? అందువలన 'పారతవత్' అనుపాఠమునే గ్రహించి 'విష్ణుధర్మాః' అని పఠింపవలయునేమో? అపుడు 'సోఽప్యనలాత్' అనుచోఁ బునరుక్తిదోషము ఘటిల్లును. భాసుఁడు రచియించినకావ్య మొకటియగ్నిదగ్ధము కాలేదనియే దీనినిశ్చితాంశము. పైవ్యాఖ్యానమున భాసుఁడు 'ముని' యని వర్ణింపఁబడుటచే నాతని ప్రాచీనత స్థిరపడుచున్న దని గణపతిశాస్త్రిగారు వ్రాసియున్నారు.

12. జల్హణుని సూక్తిముక్తావళియందు రాజశేఖరుని దని యీశ్లోక ముదాహరింపఁబడినది.

"భాసనాటకచక్రేపి ఛేకైః క్షిప్తే పరీక్షితుమ్
స్వప్నవాసవదత్తస్య దాహకోఽభూన్న పావకః"—

ఈశ్లోకమున భాసకవి పెక్కునాటకముల రచించె ననియు, నందు స్వప్నవాసవదత్త మనునాటక మొక్కటియే యగ్నిచే దహింపఁబడలే దనియుఁ దెలుపఁబడినది. ఇది భాసనాటకములలో స్వప్నవాసవదత్తోత్కర్షమునుఁ గూడసూచింపుచున్నది.

13. క్రీ. శ. 1360 ప్రాంతమున రచింపఁబడిన శార్ఙ్గధరపద్ధతియందు భాసుని రామిలసౌమిలులతోఁ జేర్చిన శ్లోక మొకటి గలదు.

భాసో రామిలసౌమిలౌ వరరుచిః శ్రీసాహసాంకః కవి
ర్మేంఠో భారవికాళిదాస తరలాః స్కంధః సుబంధు శ్చ యః
దండీ బాణదివాకరౌ గణపతిః కాంతశ్చ రత్నాకరః
సిద్ధా యస్య సరస్వతీ భగవతీ కే తస్య సర్వేఽపితే. (188)

ఇదియు 'భాససౌమిల్లకాదీనాం'అను కాళిదాసుని వాక్యమువలె భాసుని ప్రాచీనత్వమును విశదీకరించుచున్నది.

1. "The Problem of Bhasa" by K. G. Sankar. Sir Ashutosh memorial Volume Part II at Page 43.

14. శాకుంతలనాటకమునకు రాఘవభట్టు రచియించిన వ్యాఖ్యానమున (నిర్ణయసాగరప్రతి పు. 2.)

భాసుఁడు భరతునినాట్యశాస్త్రమును బోలుగ్రంథము నొకదాని రచించె నని తెలుపఁబడినది.

“అత్రాశిషి సభ్యానాం లాభః। అత ఏవ ఆశీర్నమస్క్రియారూపాః ఇతి భరతేన। భాసేనాపి ‘ఆశీర్నమస్క్రియావస్తు’ ఇత్యాదా వేవ ఆశీర్నిబద్ధా”.

ఆలంకారికు లెవ్వరును భాసునిఁ బ్రాచీనాలంకారికునిగఁ గీర్తించి యుండ లేదు. అందువలన రాఘవభట్టు వ్యాఖ్యానమున నుదాహరించిన భాసుఁడు సుప్రసిద్ధనాటకకర్తయా లేక మఱి యొకఁడా యనుసందేహము కలుగుచున్నది.

పైవిషయములవలన భాసమహాకవి ప్రాచీనుఁ డనియు, స్వప్నవాసవదత్తాదినాటకముల రచియించె ననియుఁ, గాళిదాసునకుఁ గొన్నిశతాబ్దములు పైనను బూర్వుఁడై యుండు ననియు విస్పష్ట మగుచున్నది.

---

## (3) తిరువనంతపురనాటకము లేకకర్తృకములు.

గణపతిశాస్త్రిగారిచే భాసుని వని నిర్ధారణ మొనర్పఁబడిన పదుమూఁడు నాటకము లేకకర్తృకము లని ప్రథమమున నిరూపించి యనంతరము వానిరచయిత భాసుఁ డని మతము స్థిరపఱుపవలసి యున్నది. ఈక్రిందియంశములవలన వాని నన్నిటి నొకకవియే రచించియుండు నని సహృదయు లంగీకరింపక మానరు.

1. ఈనాటకచక్రమునందుఁ బ్రతినాటకమును ‘నాన్ద్యన్తే తతః ప్రవిశతి సూత్రధారః’ యనువాక్యముతోఁ బ్రారంభింపఁబడినది. తరువాత మంగళశ్లోకము పఠింపఁబడినది.

స్వప్నవాసవదత్తమునందు—

“(నాన్ద్యన్తే తతః ప్రవిశతి సూత్రధారః)

సూత్రధారః -

ఉదయనవేన్దుసవర్ణా వాసవదత్తాబలౌ బలస్య త్వామ్। పద్మావతీర్ణపూర్ణౌ వసంతకమ్రౌ భుజౌ పాతామ్.”

అసంపూర్తిగ లభించిన చారుదత్తనాటకమందుఁ దక్క మిగిలిన యన్నినాటకములందును మంగళశ్లోకము సూత్రధారప్రవేశానంతరమే కననగును.

2. మఱియు నీనాటకములలో 'ప్రస్తావనా' యనుటకుబదులు 'స్థాపనా' యని యుపయోగింపఁబడినది. కర్ణభారమున మాత్రము 'ప్రస్తావన' యనియే కలదు.

3. 'ప్రస్తావన'యందుఁ గవినామము గాని, గ్రంథనామము గాని, కాళిదాసాదుల నాటకములందువలె, సూచింపఁబడలేదు. 'పూర్వకవుల నాటకములుండ వర్తమానకవుల నాటకములేల ప్రదర్శింపఁబడవలయు' ననుమీమాంసయే లేదు.

"పురాణ మి త్యేవ న సాధు సర్వం
న చాపి కావ్యం నవ మి త్యవద్యమ్"-అనియు—
"ఏనామ కేచి దిహ నః ప్రథయం త్యవజ్ఞాం
జానన్తి తే కిమపి తాన్ప్రతి నైష యత్నః—
అనియుఁ గవి యెచ్చటను స్వోత్కర్షాపాదకముగఁ బలికి యుండలేదు.

4. మంగళశ్లోకానంతరము సూత్రధారుఁడు-

'ఏవ మార్యమిశ్రాన్ విజ్ఞాపయామి। అయే కిం ను ఖలు మయి విజ్ఞాపనవ్యగ్రే శబ్ద ఇవ శ్రూయతే। అఙ్గ పశ్యామి।' అని పలుకును. ఈవాక్యములే స్వప్నవాసవదత్త, పంచరాత్ర, దూతఘటోత్కచ, బాలచరిత, మధ్యమవ్యాయోగ, దూతవాక్య, భిషేకోరుభంగనాటకములందును గలవు. ప్రతిజ్ఞాయౌగంధరాయణావిమారకప్రతిమానాటకములందు-

"నేపథ్యాభిముఖ మవలోక్య- ఆర్యే. ఇతస్తావత్" అని కలదు.

స్వప్నవాసవదత్తాదులయందును, ప్రతిజ్ఞాయౌగంధరాయణాదులయందును బ్రస్తావనానంతరమునఁ జూళికచే నర్థసూచన మొనర్పఁబడినది- ఇటఁ బూర్వపక్షము:—'భాసనాటకచక్ర' మని పేర్కొనఁబడిన నాటకములయందేకాక మఱియితరనాటకములందుఁ గూడఁ బ్రారంభమున 'నాన్ద్యన్తే తతః ప్రవిశతి సూత్రధారః' అని కలదు. ప్రస్తావనకు 'స్థాపన'యనియు నుపయోగింపఁబడినది. కొన్నినాటకములయందు 'అయే-కిం ను ఖలు మయి విజ్ఞాపనవ్యగ్రే శబ్ద ఇవ శ్రూయతే- అఙ్గ పశ్యామి' అనియు వ్రాయఁబడియున్నది. మహేంద్రవిక్రమవర్మవిరచిత మగు 'మత్తవిలాసప్రహసనము,' శక్తిభద్రుని 'ఆశ్చర్యచూడామణి,' కులశేఖరుని 'తపతీసంవరణ' 'సుభద్రాధనంజయము'లును, వరరుచికృత మగు 'ఉభయాభిసారిక' ఈశ్వరదత్తుని 'ధూర్తవిటసంవాదమును', శూద్రకుని 'పద్మప్రాభృతికము', శ్యామిలకుని

'పాదతాడితకము'ను జూడ నగును. దిఙ్నాగుని కుందమాలయందు 'ప్రస్తావనా' యనుటకు 'స్థాపనా' యనియే కలదు.

కావ్యార్థసూచకమును, ఆశీర్నమస్క్రియారూపమును నగుశ్లోకము నాంది నాఁబడును. ['ఆశీర్నమస్క్రియారూపః శ్లోకః కావ్యార్థసూచకః నాన్దీతి కథ్యతే' ఇతి భరతః] ఆనాందీశ్లోకమును సూత్రధారుఁడే పఠింపవలయును.

"సూత్రధారః పఠే న్నాన్దీం మధ్యమం స్వరమాశ్రితః
నాన్దీ పదై ర్ద్వాదశభి రష్టాభి ర్వా ప్యలంకృతామ్."

నాట్యవస్తువునకుఁ బూర్వము రంగవిఘ్నోపశాంతికొఱకుఁ గుశీలవు లొనర్చునది పూర్వరంగ మనఁబడును. దశరూపకమునందు-

"పూర్వరంగం విధా యాదౌ సూత్రధారే వినిర్గతే
ప్రవిశ్య తద్వ దపరః కావ్య మాస్థాపయే న్నటః.
అన్యత్రాపి.
ప్రయుజ్య రంగం నిష్క్రామేత్ సూత్రధారః సహానుగః
స్థాపకః ప్రవిశేత్ పశ్చాత్ సూత్రధారగుణాకృతిః."

అని యుండుటవలనను నాందీశ్లోకమును సూత్రధారుఁడు పఠింపవలయు ననియుఁ దరువాత స్థాపకనాముఁ డగునటుఁడు ప్రస్తావనాదివిషయములఁ జరుపవలయు ననియుఁ దేలుచున్నది. 'అభిజ్ఞానశాకుంతల విక్రమోర్వశీయా'దినాటకముల నాందీశ్లోకానంతరమే సూత్రధారుఁడు ప్రవేశించునటులు సూచింపఁబడినది. అట్లుగాక పైని దెలుపఁబడిన నాటకములయందు నాంద్యంతముననే సూత్రధారుఁడు మంగళశ్లోకమును బఠింపుచున్నాఁడు. శాకుంతల విక్రమోర్వశీయాది గ్రంథముల ప్రాచీనపుస్తకములయందు నాంద్యంతముననే 'వేదాంతేషు' ఇత్యాది శ్లోకములు గానవచ్చుచున్న వని కొందఱు దెలుపుచున్నారు. అందుననే విశ్వనాథకవిరాజు 'సాహిత్యదర్పణము'న (నిర్ణయసాగరప్రతి. పు. 280.)

"అతఏవ ప్రాక్తనపుస్తకేషు 'నాంద్యంతే సూత్రధారః' ఇత్యనంతరమేవ 'వేదాంతేషు' ఇత్యాదిశ్లోకలిఖనం దృశ్యతే యచ్చ పశ్చాత్ నాంద్యంతే సూత్రధార ఇతి లేఖనం తస్యాయమభిప్రాయః- నాంద్యంతే సూత్రధారః ఇదం ప్రయోజితవాన్. 'ఇతః ప్రభృతిమయా నాటక ముపాదీయత' ఇతి కవే రభిప్రాయః సూచిత ఇతి-"

అని వ్రాసియున్నాఁడు. భాసనాటకచక్రమునఁ గలపద్ధతిని గుఱించి వ్రాయుచుఁ గొందఱది దాక్షిణాత్యులశైలి యని వ్రాసి యున్నారు. కాని సాహి

త్యదర్పణకారుఁ డర్వాచీనుఁడు. పదునైదవశతాబ్దమువాఁడు. హర్షచరితమున బాణుఁడు భాసుని స్తుతింపుచు-

'సూత్రధారకృతారమ్భైః' అని వ్రాసెను గదా. భాసునినాటకముల కిది యొకవిశేషముగ నేలపలుకవలయును. నిరర్థకముగ నిట్లు వ్రాసె ననుట సమంజసముకాదు. శాకుంతలాది నాటకములయందలి నాందీప్రస్తావనాదులకు భిన్నముగఁ గన్పట్టుటచే, భాసనాటకములు సూత్రధారకృతారంభము లని బాణుఁడు పేర్కొని యుండును. బాణుని యనంతరము మత్తవిలాసాదులలో భాసునిమతమే యవలంబింపఁబడుటచే సాహిత్యదర్పణకారుఁడు రెండుమతములను సమర్థించుకొనవలసివచ్చెను.

“శాకుంతలచర్చా” అనఁబడు వ్యాఖ్యానమున (R. No. 2778. Govt. Manuscripts Library, Madras.) నిటులు వ్రాయఁబడియున్నది.

'బహురూపకాదిభి రనర్ఘరాఘవాదిషు ప్రథమశ్లోకో నాందీ త్యేవ కథితః-తత్ర తావ న్నాంద్యంతే తతః ప్రవిశతి సూత్రధార ఇత్యయం గ్రంథః ప్రథమశ్లోకాత్ పూర్వం కి ముపపద్యతే? ఉతా నంతరం ? ఉభయథాపి దర్శనాత్ సంశయః-'కావున భాసుఁడు తననాటకముల యం దవలంబించిన పద్ధతి ననుసరించియే దాక్షిణాత్యకవీశ్వరు లగుశక్తిభద్రాదులు తమనాటకములను రచించిరనవలయును.

'ప్రస్తావన' యనుటకు మారు 'స్థాపన' యని పెక్కునాటకములందుఁ గననగును. 'కర్ణభారము'నందును 'ప్రస్తావన' యనియే కలదు. నాట్యశాస్త్రము దక్షిణదేశపుఁ బ్రతియందు 'స్థాపకః ప్రవిశేత్ తత్ర'యనుదాని యనంతరము 'స్థాపనాం చ తతః కుర్యాత్'[1] యనుపాఠము గానవచ్చుచున్నదియని విమర్శకులొకరు వ్రాసియున్నారు. ఒకవేళ దాక్షిణాత్యమతానుసారము 'స్థాపన' యనియే ప్రయోగింపఁబడి యుండనోపును.

పైని వివరింపఁబడిన విషయములు మాత్రమే తిరువనంతపురనాటకచక్రమునకు సమాన మగుచో, వాని నొకకవియే రచియించె ననుటకు వీలు లేదు. కాని యీక్రింద విమర్శింపఁబడిన విషయములవలన నవి యేకకర్తృకము లని మనము నిశ్చయింపవచ్చును.

---

1. The Bhasa Problem by K. R. Pisharaoti. Indian Historical Quarterly Vol. I. Part II. Pages 330-340.

౫. ప్రతినాటకమునందును సూత్రధారుని మంగళశ్లోకమున ముఖ్యపాత్ర సూచనయు, విష్ణుస్తుతియుఁ గానఁగును. స్వప్నవాసవదత్తమున ముఖ్యపాత్రములగు నుదయన, వాసవదత్తా, పద్మావతులు సూచింపఁబడిరి. ప్రతిజ్ఞాయౌగంధరాయణమునందలి-

'పాతు వాసవదత్తాయో మహాసేనో తివీర్యవాన్
వత్సరాజ స్తు నామ్నా స శక్తి ర్యౌగంధరాయణః'

అనుశ్లోకమున వాసవదత్తా, మహాసేన, వత్సరాజ, యౌగంధరాయణుల ప్రశంస గలదు.

ప్రతిమానాటకమున—

"సీతాభవః పాతు సుమంత్రతుష్టః సుగ్రీవరామ స్సహలక్ష్మణశ్చ
యోరావణార్యప్రతిమశ్చ దేవ్యా విభీషణాత్మా భరతోనుసర్గమ్"

అనుశ్లోకమున సీతారాములు, భరతలక్ష్మణులు, రావణవిభీషణులు, సుగ్రీవసుమంత్రులు పేర్కొనఁబడియున్నారు.

పంచరాత్రమున నాందీశ్లోకము:—

"ద్రోణః పృథి వ్యర్జునభీమదూతో యః కర్ణధారః శకునీశ్వరస్య
దుర్యోధనో భీష్మయుధిష్ఠిరః స పాయా ద్విరా డుత్తరగోఽభిమన్యుః"

ఊరుభంగమున—

"భీష్మద్రోణతటాం జయద్రథజలాం గాంధారరాజహ్రదాం
కర్ణద్రౌణికృపోర్మినక్రమకరాం దుర్యోధనస్రోతసమ్
తీర్ణః శత్రునదీం శరాసిసికతాం యేనప్లవే నార్జునః
శత్రూణాం తరణేషు వః స భగవా నస్తు ప్లవః కేశవః"

ఈపాత్రసూచనము కాళిదాసాదుల నాటకములయందుఁ గానరాదు.

'యా సృష్టిః స్రష్టు రాద్యా' అనుశ్లోకమున 'అష్టాభి రీశః' అను-చో-

యస్మా దేషాం సురేంద్రాణాం మాత్రాభి ర్నిర్మితో నృపః తస్మాదభిభవత్యేష సర్వభూతాని తేజసా"—అనుభృగువచనముచేఁ బ్రభు వగు దుష్యంతుఁడు సూచింపఁబడియె నని వ్యాఖ్యాత లనిరి, కాని, యది క్లిష్టకల్పనాదులచే సాధింపఁదగినవిషయము. భాసనాటకములయం దన్ననో మంగళశ్లోకమున ముఖ్యపాత్రాభిధానములు స్పష్టముగ వివరింపఁబడుట నేకకర్తృత్వమును స్థిరపఱుచు నని యెఱుంగునది. ఇట్టి యర్థసూచనమునే ముద్రాలంకారమందురు—

'సూచ్యార్థసూచనం ముద్రా ప్రకృతార్థపరైః పదైః
నితమ్బగుర్వీ తరుణీ దృగ్యుగ్మవిపులాచ సా'

6. నాటకాంతమున భరతవాక్య మని స్వప్నవాసవదత్తావిమారక, బాలచరితాభిషేక, ప్రతిమానాటకములయందుఁ గలదు.

"మహీ మేకాతపత్రాంకాం రాజసింహః ప్రశాస్తు నః"

అని స్వప్నబాలచరితములందును,

"ఇమా మపి మహీం కృత్స్నాం రాజసింహః ప్రశాస్తు నః"—

అని ప్రతిజ్ఞావిమారకాభిషేకపంచరాత్రములందును గననగును. ఇం దుదాహరింపఁబడిన రాజసింహుఁ డేకాలమునాఁటివాఁడో యేదేశము నేలెనో నిశ్చయింప వీలులేదు. ఒకవేళ గణపతిశాస్త్రిగారి యభిప్రాయానుసారము రాజసింహుఁ డనునది రాజనామము కాకపోవచ్చును. రాజులయందు శ్రేష్ఠుఁ డనునర్థమునఁ బ్రయోగింపఁబడియుండవచ్చును. భరతవాక్యానంతర మభిషేక ప్రతిమానాటకములఁ దక్క మిగిలిననాటకములలో 'స్వప్ననాటక మవసితమ్' ఇత్యాది ప్రయోగములు గానవచ్చుచున్నవి. అభిషేకప్రతిమానాటకముల 'సమాప్తమ్' అనియే కలదు.

7. ముఖ్యముగ శైలియందును నాటకము లొకదానితో నొకటి పోలియున్న వనుట నిర్వివాదాంశము. లలితమై, దీర్ఘసమాసరహితమై ముద్దులొలుకు శైలిని రచింపఁ బడినవి. ప్రౌఢమగు గౌడీయపద్ధతి యిందుఁ గానరాదు. అర్థము సులభగ్రాహ్యము. ఆర్షప్రయోగము లందందుఁ గలవు. కాని యవి ముందుచూపఁబడును. మహాకవులలో నొకరిద్దఱు తప్ప మిగిలిన వారల కిట్టి రమణీయ మగు శైలియే యలవడలే దని చెప్పనగును. ఉపమానములు వాల్మీకి కాళిదాసులఁ దలఁపించును. రసములు చక్కఁగఁ బోషింపఁబడినవి. తత్తదుచితపదసంధానములతోఁ గథాంశములును, వర్ణనాదులు నలంకరింపఁ బడినవి. నీతివాక్యములు వలయుచోటుల నుద్ఘాటింపఁబడినయవి. పైవిషయములు పక్షపాతరహితము లని యు, నతిశయోక్తులు గావనియు నీక్రిందియుదాహరణములవలన విస్పష్ట మగును.

(a) "కాలక్రమేణ జగతః పరివర్తమానా చక్రారపఙ్క్తి రివ గచ్ఛతి భాగ్యపఙ్క్తిః"
స్వప్నవాస. అం-I-శ్లో 4.

(b) "గుణానాం వా విశాలానాం సత్కారాణాం చ నిత్యశః
కర్తారః సులభా లోకే విజ్ఞాతార స్తు దుర్లభాః" స్వప్న-IV-9,

(c) "ఆదత్తే త్యాగతా లజ్జా దత్తేతి వ్యథితం మనః
ధర్మస్నేహాంతరే న్యస్తా దుఃఖితాః ఖలు మాతరః."  ప్రతిజ్ఞా-II-7.

(d) "యత్నేకృతే యదినసిధ్యతి కోఽత్రదోషః
కోవా నసిధ్యతిమమేతి కరోతికార్యమ్
యత్నైశ్శుభైః పురుషతా భవతీహనౄణాం
దైవంవిధానమనుగచ్ఛతి కార్యసిద్ధిః"  అవిమారక-III-12.

(e) తమోవర్ణనము.
"అప్రకాశా ఇవ దిశో ఘనీభూతా ఇవ ద్రుమాః
సునివిష్టస్య లోకస్య కృతో రూపవిపర్యయః".  బాలచరిత-I-16.
"లింపతీవ తమోఽఙ్గాని వర్షతీవాంజనం నభః
అసత్పురుషసేవేవ దృష్టి ర్నిష్ఫలతాం గతా."  చారుదత్త-I-19.
"సులభశరణ మాశ్రయో భయానాం
వనగహనం తిమిరంచ తుల్య మేవ
ఉభయ మపి హి రక్షతేఽన్ధకారో
జనయతి యశ్చ భయాని యశ్చభీతః."  చారు-I-20.

(f) చంద్రోదయవర్ణనము.
"ఉదయతి హి శశాంకః క్లిన్నఖర్జూరపాండుః
యువతిజనసహాయో రాజమార్గప్రదీపః
తిమిరనిచయమధ్యే రశ్మయో యస్య గౌరా
హృతజల ఇవ పంకే క్షీరధారాః పతంతి."  చారు-I-29.

(g) అవిమారకమున రాజకార్యభారవర్ణన మెంత స్వాభావికముగ నొనర్పఁబడి నదో చూడుఁడు:—
ధర్మః ప్రాగేవ చింత్యః సచివమతిగతిః ప్రేక్షితవ్యా స్వబుద్ధ్యా
ప్రచ్ఛాద్యౌ రాగరోషౌ, మృదుపరుషగుణౌ కాలయోగేన కార్యౌ,
జ్ఞేయం లోకానువృత్తం, పరచరనయనైర్మండలం ప్రేక్షితవ్యం
రక్ష్యోయత్నాదిహాత్మా రణశిరసిపునః సోఽపినావేక్షితవ్యః."అవిమా-I-12.

(h) "స్వః పుత్త్రః కురుతే పితు ర్యదివచః కస్తత్ర భో విస్మయః." ప్రతిమా-I-4.

(i) "సమం బాష్పేణ పతతా తస్యోపరి మమాప్యధః
పితుర్మే క్లేదితౌ పాదౌ మమాపి క్లేదితం శిరః."  ప్రతిమా-I-5.

(j) కాష్ఠా దగ్ని ర్జాయతే మథ్యమానాత్
భూమి స్తోయం ఖన్యమానా దదాతి
సోత్సాహానాం నాస్త్యసాధ్యం నరాణాం
మార్గా రబ్ధాః సర్వయత్నాః ఫలంతి. ప్రతిమా-1-18.

(k) 'తత్ర యాస్యామి యత్రాసౌ వర్తతే లక్ష్మణప్రియః
నాయోధ్యా తం వినా యోధ్యా సా యోధ్యా యత్ర రాఘవః'-
ప్రతిమా-3-22

ఇట్టి వనేకములు గలవు. గ్రంథవిస్తరభీతిచే నిచ్చియుండలేము. అవిమారకపంచరాత్రములయందు దీర్ఘసమాసములు గానవచ్చుటచే నవి మఱియొకకవిచే రచియింపఁబడియుండు నని 'పిషరొటీ'గారు వ్రాసియున్నారు.[1] కాని మిగిలిననాటకములయందును రసానుగుణ్యముగ దీర్ఘసమాసములు వాడఁబడియున్నవి.

శ్లో. నిర్భిన్నాగ్రలలాటవాంతరుధిరో భగ్నాంసకూటద్వయః
సాంద్రై ర్నిర్గళితప్రహారరుధిరై రార్ద్రీకృతోరఃస్థలః
భీమో భాతి గదాభిఘాతరుధిరక్లిన్నావగాఢవ్రణః
శైలో మేరురి వైష ధాతుసలిలాసారోపదిగ్ధోపలః- ఊరుభంగ—18.

"అన్యోన్యశస్త్రవినిపాతనికృత్తగాత్ర
యోధాశ్వవారణరథేషు మహాహవేషు." కర్ణ-6.

"విద్యుల్లతాకపిలతుంగజటాకలాప
ముద్యత్ప్రభావలయినం పరశుం దధానం." కర్ణ-9.

'సేనానినాదపటహస్వనశంఖనాదై
శ్చండానిలాహతమహోదధినాదకల్పైః
గాంగేయమూర్ధ్నిపతితై రభిషేకతోయైః
సార్ధం పతంతు హృదయాని నరాధిపానామ్' దూతవా—5.

ఇట్టివి మిగిలిన నాటకములయందును గలవు. శ్లోకపదభావసామ్యములు ముందు చూపఁబడును.

---

1. K. R. Pisharaoti in 'The Indian Historical Quarterly Pages 330 to 340. Vol. I—Part 2.

# రాజశేఖరచరిత్రము

యస్. వీరేశ్వరదీక్షితులుగారు, ఎం. ఏ. సికిందరాబాదు.

---

(మాదయగారిమల్లన.)

విజయనగరాస్థానమున నుండిన యష్టదిగ్గజము లని పేరువడసిన కవులలో నైదుగురు కృష్ణదేవరాయల యాస్థానముననే యుండి రనుట నిర్వివాదాంశము. అల్లసాని పెద్దన మనుచరిత్రమును గృష్ణరాయునకంకిత మిచ్చెను. నంది తిమ్మనయుఁ దనపారిజాతాపహరణమును గృష్ణదేవరాయునికే కృతి యిచ్చెను. అయ్యలరాజు రామభద్రుఁడుఁ గృష్ణరాయనరపాలాఖండలునిచేఁ బ్రేరేపింపఁబడి రాజశ్రేష్ఠులవృత్తాంతమును దెలుపు సకలకథాసారసంగ్రహము ను వ్రాయమొదలిడి పిమ్మట దానిని ముగించెను. ధూర్జటినిఁ గృష్ణదేవరాయలు "స్తుతమతి యైనయాంధ్రకవిధూర్జటి పల్కులకేల గల్గెనో యతులితమాధురీమహిమ' యని భూషించినట్లు కుమారధూర్జటి కృష్ణదేవరాయవిజయము ప్రథమాశ్వాసమునఁ జెప్పెను. కుమారధూర్జటి యాగ్రంథముననే తృతీయాశ్వాసమున నిట్లు వ్రాసెను.

గీ. అటుల జయలక్ష్మిఁ గైకొని యరుల కరుల,హరుల ధనపంక్తులను దనపరముచేసి
వెలయు శ్రీకృష్ణరాయలవిభవగరిమ, గాంచి కన్నులపండువుగాఁగ నపుడు.

గీ. సరససాహిత్యరచన విస్ఫురణమెఱయ
సారమధురోక్తి మాదయగారిమల్ల
నార్యుఁ డలయల్లసాని పెద్దార్యవరుఁడు
ముక్కు తిమ్మన మొదలైనముఖ్యకవులు. ఆ. 3

దీనింబట్టి మాదయపుత్త్రుఁ డగుమల్లనకవి కృష్ణరాయునికి సమకాలికుఁడని తెలియుచున్నది. కాన నీతఁడు పదునైదవశతాబ్దాంతమునను బదునాఱవశతాబ్దాదిని జీవించియుండును.

ఇతనిజన్మప్రదేశము గుంటూరుమండలములోని కొండవీడని వీరేశలింగము పంతులుగారు కవులచరిత్రమున వ్రాసిరి. కొండవీడని చెప్పుట కేయాధారములును లేవు కాని, యితఁడు, అయ్యంకిపురాగ్రహారికుఁ డని తనగ్రంథముననే వ్రాసెను.

ఉ. శంకరపాదసేవనవశంవదమానసపంకజాత ని
శ్శంకవచోవిలాస రుచిసారవినిర్జితపూర్ణపూర్ణిమా

శాంక దురక్షరాననభయంకర శౌనకగోత్రపాత్ర య
య్యంకిపురాగ్రహారవిభవాకర మాదయమల్లసత్కవీ.

ఈ అయ్యంకిపురము ప్రస్తుతము కృష్ణామండలములో నున్నది.

ఇతఁ డయ్యంకిపురాగ్రహారికుఁ డని యుఁ దనకుఁ దానే మాదయమల్లన యనిచెప్పుకొనుటచే నాతనిగ్రామమున నిద్దఱుమల్లన లుండియుండవచ్చు ననియు నితఁడు మాదయగారి మల్లన యని వ్యవహరింపఁబడె ననియు విశదము కాఁగలదు. ఈపేరు కవులచరిత్రమున కెంతయో యుపకారిగ నున్నది. ఇతనికిఁ బూర్వమున నివసించిన రుక్మాంగదచరిత్రకర్త యగు మల్లన నుండి పిమ్మట చంద్రభాను చరిత్రము వ్రాసిన తెనాలిగొప్పుల మల్లన నుండి వేర్పఱచుటకు వీలగుచున్నది. ఇతని యింటిపేరు తెలియవచ్చుట లేదు. శౌనకగోత్రుఁడు. వీరేశలింగముగా రితనిని శైవబ్రాహ్మణుఁ డనుట కాధార మేమియు లేదు. ఈశ్వరార్చనకళాశీలుఁ డగు శ్రీనాథుఁడు శైవుఁ డైనచోఁ గదా మల్లన శైవుఁ డగుట! ఇతఁడు గద్యములో "ఇది శ్రీమదఘోరశివాచార్యగురుకరుణావిశేషలబ్ధసారస్వత మాదయామాత్య పుత్త్ర మల్లయనామధేయప్రణీతం బయినరాజశేఖరచరిత్రం బను మహాప్రబంధంబు నందు' అని వ్రాయుటచే నమాత్యశబ్దమును గ్రహించి యితనిని నియోగిబ్రాహ్మణుఁ డనుటయే యుక్తము. ఇతఁడు, అఘోరశివునికడ విద్యనైనను మంత్రమునైనను బొంది తత్సాహాయ్యముచేఁ బండితుఁడును గవియును నై యుండవచ్చును. ఇతని సమకాలికుఁ డగు నియోగివిప్రుఁడగు నంది తిమ్మనసహితము అఘోర శివుని శిష్యుఁడే. అఘోరశిష్యుఁ డైనంతమాత్రమున మల్లనకవిని శైవుఁ డనుట యుక్తము కాదు.

రాయలయుగమే ప్రబంధరచన కారంభము. ఇంతకుఁ బూర్వమే ప్రబంధబీజములు నన్నయ తిక్కనకవితలలో దాఁగియుండి శ్రీనాథునికవితలో నంకురించి తీఁగసాఁగి పెద్దనకవితలో నల్లుకొన సాఁగినవి. అల్లసాని పెద్దన మనుచరిత్ర మను ప్రబంధకావ్యము నారంభించినను మారనకవి వ్రాసిన మనువుకథనే తీసికొని పెంచి పెద్దదానిం జేసెను. సమానులలో నుత్తమశ్లోకుఁడు గావలయు నను తీవ్రవాంఛ మల్లనకుఁ గల్గుటచేతఁ గాఁబోలు రాజశేఖరచరిత్ర మనుగ్రంథమును గొండవీటియందు దండనాయకుఁ డగు నప్పామాత్యున కంకితము చేసెను. నాదిండ్ల అప్పామాత్యుఁడు మంత్రిశేఖరుఁ డగు తిమ్మరుసు మేనల్లుఁడు. కాన నీగ్రంథ మప్పామాత్యునికాలమున వ్రాయఁబడినది. ఇది రమారమి 1530 ప్రాంత మగును.

అప్పమాత్యునకుఁ గావలసినది కృతిపతిత్వమే- శివభక్తుఁ డగు మల్లన గ్రంథమున నెట్టివిషయము చెప్పినను అప్పమాత్యునకు గ్రంథావని వేంకటేశ్వర స్వామి యాశీర్వచన మున్నఁ జాలు. నాయకుని వంశకథనమును షష్ఠ్యంతములను బలికి మల్లన తనకల్పితకథకు అవంచికపురమును బ్రధానకారణమును జేసెను. ఒకతొమ్మిదిపద్యములలో నాపురమును (సానులతోఁగూడ) వర్ణించి దాని కధీశ్వరుం డగు హేమధన్వుని నాతనిరాజ్యపాలనావిధానమును బొగడును. బిడ్డలు లేమికి రాజును రాణియు నెంతయో వగచి రాజు శంభుసేవయే యాకొఱంతను బూరించు నని తలఁచి దేవాలయములనుగట్టించి యొకచోటఁ గట్టుజవ్వాదిచే నలికించి కట్టాణిముత్తెముల నిగ్గుతో ముగ్గుపెట్టించి శివపూజను జలుపును. ఒకనాఁడు రాజు కలఁగని కలయందు శివుఁ డోకఫల మిచ్చె నని భార్యకుఁ దెలుపును. పట్టపురాణి గర్భిణి యగును. కుమారోదయ మగును. వానికి రాజశేఖరుఁ డను నామ మిత్తురు. ఇట్లు మొదటియాశ్వాసము రాజశేఖరు జననమును గుఱించిన కథతో నిండియున్నది.

ద్వితీయాశ్వాస మీతనిపరాక్రమప్రసంగముతో నొప్పుచున్నది. ముష్టింపచస్వామి హేమధన్వునికడకు వచ్చి విశంకటాసురకృత్యములను దెలిపి రాజశేఖరుని నాశ్రమమునకుఁ దీసికొనిపోవును. స్వామి రాజశేఖరునికిఁ బాణవిద్యోపదేశముచేయును. యుద్ధమున విశంకటుఁడు మరణించును. రాక్షసునితోఁ బోరాడి యుత్సాహము దక్కి కాళికాలయమును జేరఁగా దేవి ప్రత్యక్షమౌను. కాళి వానికొక మణినిచ్చి కావలసినవానిని సమకూర్పఁ గలశక్తి దానికిఁ గల దని చెప్పును. ఒకయోగిని వచ్చి ముష్టింపచునికిఁ బుత్రి నీయఁగల దని కూడ చెప్పును. యోగిని యట్లే తాపసిబాలను దెచ్చి తనగృహమున కతిథిగ వచ్చినవాని కొక త్రికాలవేది యగునొకపంజరస్థకీరము నిచ్చెను. ముష్టింపచునకు బిడ్డ నిచ్చి తిరిగి వచ్చుచు నొకకాసారమున స్నానముచేయును. దేవీదత్తమణి ప్రభావముచే రాజునకు పాయససహితఘృతభోజనము ప్రాప్తించెను. భోజనానంతర మాశుకము మణివృత్తాంతమును జెప్పును. అది వసంతకాల మగుటచే సింధురాజపుత్రి చెలులతో నచటకు వచ్చి జలక్రీడ పిమ్మటఁ బుష్పాపచయమును సల్పును. రాజు చూతలతాగృహమువెడలి యువతీకోలాహలము గాంచును. రాజపుత్రియు రాజును బరస్పరము చూచెదరు. రాజు చూపు మరలించి చిలుకకడ కేగి యామెవృత్తాంత మరయును.

తృతీయాశ్వాసము రాజశేఖరుని వివాహమునకై యుద్దేశింపఁబడియెను. అరుణపురమున ముకుందుఁడును అరుణుఁడు నను నిర్ధనబ్రాహ్మణులు గలరు. ఇద్ద

ఱును బండితులే. మొదటివాఁడు ధని రెండవవాఁడు నిర్ధని. భార్యాప్రోత్సాహముచే నరుఁడు యమునానదికిం జని హరిం గుఱించి తపంబు చేయుచుండును. గంధర్వుఁడగు పుష్పవతీదేశాధిపుని కూఁతురు లత యను నామెయుఁ గనకమంజరి యనుమంత్రిపుత్రియు నచటకు వచ్చిరి. పూలవిషయమై తగవు గల్గెను. తపము చేయు బ్రాహ్మణుని వరింపఁగల్గువారు గెల్చెద రని లత కనకమంజరితో ననును. అప్రకారమే లత పోయి బ్రాహ్మణునికిఁ దపోభంగము కల్గించును. బ్రాహ్మణుఁడు మనుష్యలోకమునఁ బుట్టు మని శపించును. చెలులప్రార్థన నంగీకరించి వారాని యీమె రాజశేఖరుని బెండ్లాడు ననును. ఈవిధముగ శుకముచెప్పిన వృత్తాంతము విని రా జాబాలికను వివాహమాడఁగోరును. కాంతిమతి విరహవేదనను బొందు నపుడు శుక మామెకడకు వచ్చి తండ్రియెదుట రాజశేఖరుఁ బొగడును. పిమ్మట కాంతిమతీరాజశేఖరుల వివాహముజరుగును. ఒంటరిగఁ బోయి జంటగవచ్చిన కొడుకును గాంచి తండ్రి సంతసపడును.

శైలి:—కవి యగువాఁ డపరబ్రహ్మనాఁబడు. కవి తనభావనాశక్తిచే నూతనవస్తువులను సృజింపఁగల్గును. అందఱికన్నను గవికి వస్తుసౌందర్యపరిశీలనాజ్ఞాన మెక్కుడుగ నుండును. అందులకనియే కవి ప్రతివస్తువు ను నొక సుందరవస్తువుతోఁ బోల్చి చూచుచుండును. ఇట్టి పరిశీలనా జ్ఞానము మాత్ర మున్నంతనే కవి కాఁజాలఁడు. తాఁ జూచి యనుభవించు వస్తుసౌందర్యమును మనలను గూడ నాతనితోఁ బాల్గొనఁజేయవలయును. కావునఁ గవికి భావ మెంత గ నుండునో దానికిఁ దగిన భాషయు నుండవలయును. శైలిని బరీక్షించుటలో భావమునెట్టి భాషలోఁ జెప్పె నను విషయము జ్ఞప్తియందుంచుకొనవలయును.

మల్లనకవి చేసినపురవర్ణనము చూడుఁడు. మల్లన పెద్దన ననుసరించియే పురవర్ణనకుఁ గైకొనెను. ఇం దేమియు శిల్పము లేదు. బంగారుమేడలకుఁ గావలి యుండుట కొఱకరక్షకభటుఁ డైన లేఁడు. కవి కున్న దున్నట్లు వర్ణించుట గుణముగా దని యెఱిఁగినవాఁ డగుటచేఁ దనకుఁ గావలసినంతవఱకే యావంచికపురిని వర్ణించెను. తాను నివసించినకాలమును మఱచిపోక జనాహ్లాదకర మగుటకుఁ గాఁబోలు సానులను గూడ వర్ణించినాఁడు. ఆనగరిం గల పిన్నయేనుఁగుల-

క. అన్నగరిచిఱుతయేనుఁగు, గున్నలపై నెక్కి యెక్కి కోయఁగవచ్చున్
మిన్నేటిపసిఁడితామర, లన్నన్ మఱి యేమి చెప్ప నందలికరులన్.

అని యతిశయోక్తిగఁ జెప్పినాఁడు. రాణి గర్భిణి యయ్యె ననువిషయము-

“కౌముదోడ్డతనంబుఁ గని చింతపడుగతిఁ గుచముఖంబులు నీలరుచి వహించె
మందస్మితంబున మరగి రాదన ముద్దుఁబలుచనిచెక్కులు పలుకఁబాఱె.” అ ౧.౮౩.

అని విచిత్రముగఁ జెప్పినాఁడు. ముష్టింపచస్వామి తనకూఁతును రక్కసి గొనిపోఁగాఁ డా నెట్లు సహింపఁగల ననుసడి-

సీ. కడుపార దొండపం డిడి ముద్దుగ మేపిన రాచిల్కకొదమలఁ జూచిచూచి
పాదులలోనిండఁ బాల్వోసి పెంచిన చూతపోతంబులఁ జూచిచూచి
తోడికన్నెలుఁ దానుఁ గూడియాడిచరించు సురపొన్ననీడలఁ జూచిచూచి
బృందావనంబులు పెంచి తిన్నెలమీఁద సూటిఁబెట్టిన ముగ్గుచూచిచూచి
సంతసంబున దేవపూజలు ఘటించి, పారికాంక్షుల సేవకై పరమనియతి
లీల నడయాడుచున్న బాలికలఁ జూచి, హృదయవీథిక నెట్లు భరించువాఁడు.

ఈతనికవిత్వము హృద్యమై, మృదుమధురపదగుంభితమై సరళభావములను వెల్లడించును. దీర్ఘసమాసముల నుపయోగింపక రచనానైపుణ్యముచే స్వల్పపదముచే విశేషభావమును జూపుచుండును. ‘అల్లసురశాఖి వానింటిమల్లెచెట్టు, కామధేనువు వానింటి గాడిపసరము, ఎదురుచుక్క, పట్టుఁగొమ్మ, వేరువిత్తు, వాకట్టుమందు, తలకట్టు, పూచినతంగేడు మొదలగు జాతీయపదములిందుల కుదాహరణములు- లోకోక్తుల ననేకములను బ్రయోగించి శైలికి వన్నెఁగూర్చుచుండును. ‘కొఱవిం దలగోఁకుకొనుటకుం దలపెట్టెన్; బెబ్బులిపయిన్ జింబోతులంఘించునే’ అనునవి కొన్నియుదాహరణములు.

విషయమును హృదయంగమము చేయుటకై పద్యముల నెన్ని రీతులలోనో వ్రాయుచుండెను. బమ్మెర పోతన వ్రాసినట్లుగనే-

సీ. ఒకవేళ సింహమై యుఱుకుచు బెదరించు నొకవేళ హరిణమై యొద్దనిలుచు
సీ. జగదభినిర్మాణచాతుర్యవిఖ్యాతి మెచ్చి ధాతకు నెవ్వ రిచ్చినారు...
సీ. చదివినారలు పెక్కుసంధలఁ గించిత్తుఁ దప్పకయుండ వేదత్రయంబు...
సీ. చిగురాకులే కత్తులగునేని నింతకు దగరకోయిలనోరు తెగకయున్నె...

ఈసీసపద్యచరణములు శ్రీనాథుని సమత గలసీసపద్యములను బురుడించుచున్నవి. ఇఁక నీతని వచనరచనావిధానము పరికింతము. మల్లనవచనము సంధివాక్యముగ నుపయోగించును. దీర్ఘవచనములు శబ్దాలంకారభూయిష్ఠములై దీర్ఘసమాసభరితములై యుండును. కవి గ్రంథాదిని-

“క. చెప్పఁదగుఁ గవిత రసము, ల్చిప్పిల నప్పప్ప భళిభళీ యన లేదా
మెప్పుడు చేయకయుండుట, యొప్పఁజుమీ సుకవి యెంత యుచితజ్ఞుఁడొకో”

అని పలికెను. అట్లే కావ్యమును రసాత్మకముగఁ బరిగణించి తదనురోధము గల్పింపక తదనుగుణము లగుగుణములనే కల్పించి మనయందఱస్తోత్రములకును మల్లన పాత్త్రుఁ డగుచున్నాఁడు.

1. మల్లన తెలుఁగు సంస్కృతభవ మని తలఁచువారిలో నొకఁడని తెలియు చున్నది. దీనిని జూపెదను.

గీ. సరససంస్కృతపుష్పగుచ్ఛప్రభూత, మగుతెనుంగను నెత్తావి కఖిలదిశలఁ
దరుణపవమాన మగుకవిత్రయవిశేష,చతురవాచానిరూఢి కంజలియొనర్చి.

2. ఈడ్చుకవచ్చి. ద్వి. ౫౭. 'ఈడ్చుకొని' అని యర్థము. ఇట్టిప్రయోగ ములు ధూర్జటి, వేంకటకవి మొదలగువారు చేసిరి.

3. కొలకొల మనియెడు నొక్కరింపుకొలఁకుం గనియె. ద్వి. ౧౩౧. కొల కొల + అనియె. ధ్వన్యనుకరణమున మకారాగమము. కొలను, అనియేకవచనము న నుండవలె నని వ్యాకర్త లందురు. మహాకవిప్రయోగములకే వ్యాకరణములు లొంగవలయును గదా!

4. అందుకోన్ + అలవికాదు. ద్వి. ౧౪౩.

ఇట్టిప్రయోగములు రాయలకవు లనేకములు వాడిరి.

5. వేడుకునొత్తుకు. తృ. ౫౦. కొలఁకుకు: నకారరహితమైన షష్ఠీరూ పము. తృ. ౨౦౬. ఇదియును మహాకవిప్రయోగ మగుటచే సాధువు.

6. కూఁతుం బనుపుము. తృ. ౨౧౨. ఈకవి కూఁతుశబ్దమునకు 'రు'వర్ణా గమము రాదనువారిలో నొకఁడని యూహింపఁదగును.

ముద్దుఁగూఁతును. తృ. ౭౧౮. గేయవిశారదఁ జేసె గూఁతురన్. రామ రాయభూ. తృ. ౨౦౮.

7. పులినోఁటికండ మై. ద్వి. ౧౧౨. ఇట్టిప్రయోగములు మనుచరిత్రము లోఁగలవు.

రాజశేఖరచరిత్ర మొకప్రబంధ మని యిదివఱకే గమనించితిమి. దీనికి మూలగ్రంథ మేమియు నున్నట్లు గన్పడదు. సందర్భోచితముగఁ బురవర్ణనమును బుత్త్రోదయమును ద్వితీయాశ్వాసమున సూర్యాస్తమయవర్ణనము, సరోవరవర్ణన ము జలకేళీవర్ణనము, యుద్ధవర్ణనము, మొదలగువానిని దృతీయాశ్వాసమున య మునామాహాత్మ్యము, కాంతిమతీరాజశేఖరుల విరహమును,గిరదాత్యమును మొ దలగు ప్రబంధవర్ణములను నాతిదీర్ఘముగను, సరసముగను గథావేగము నడుపఱు

పకుండునట్లుగ నున్నవి. ఇంక, అంగనాంగవర్ణనలు గాని యసాదిత్యమునుబుట్టిం చు మతేమియును గాని గానరావు.

సమయానుకూలముగఁ గవి కొన్నిసందర్భములను సృజియించి గ్రంథస్థమగువిషయముపై నుండి మనదృష్టిని మరల్పకుండు నట్లుగఁ జేయుచున్నాఁడు. పుత్రులు లేనివారి బ్రతుకు బ్రతుకుకా దని చెప్పి శివపూజాప్రభావము నీపద్యమునఁ జెప్పెను. 'కడలేని సంసారజలధిలో మునిఁగిన జనులపాలిటినావ శంభుసేవ'. ముట్టింపచస్వామి దనబిడ్డను బొందినపిదప నచటిమునిపత్ను లాతనింబొగడుపద్యమును జూతుఁడు. (ద్వి. ౧౧౨). బీదతనమునుగూర్చి యేమి చెప్పెనో చూడుఁడు. (తృ.)౧౫. కథావేగము నడ్డుపఱుపక నడుమనిట్టివాని నుపయోగించినను నవి యందమునకులుగఁ గన్పట్టవు.

మల్లనకవి తనకవితయం దొకనూతనకళను బ్రచురముచేసెను. మొట్ట మొదట మనకు రసోచితముగ నలయునంతవఱకుఁ దెలిపి పిమ్మట వానింగూర్చి యెక్కువగను మొదటఁ జెప్పనియంశములను దెలుపుచుండును. మచ్చునకు రెండుమూఁ డుదాహరణములను మాత్రము చూపుదును. 1. హేమధన్వునిపురవర్ణనముఁ జేయుచు మల్లన యందలిసైన్యములను మొదలగువానిం గూర్చి ప్రసంగింపనంతమాత్రమున నవి యాపురమున లేవని మనము భావింపఁ గూడదు. పిమ్మట రాజనపత్యదోషము ననుభవించుచు నిట్లు వాపోవును.

మలయజగంధి యీకరిసమాజము నీహయపంక్తి యీభటా
వలియును గల్గి నాబ్రతుకు వన్నెకు నెక్కదు పుత్రహీనతన్. ప్ర. ౬౦.

2. ఒకనాఁడు హేమధన్వమహీపాలుఁడు పేరోలగం బుండుసమయంబున వచ్చిన మునిం గుఱించి కవి యాతనినామము తక్కినకవులవలె ముందుగఁ జెప్పక యెట్లుచెప్పెనో చూతము.

చ. కనుఁగవ నిప్పుకల్ చెదరఁగా నదరుల్ వెదచల్లు కెంజడల్
పెనఁగొన నక్షహారములు బిట్టుగ నిట్టటు లూఁగ నెంతయున్
గినుక వహించి యొక్కముని కేసరి గొబ్బునఁ జేరవచ్చె న
జ్జనపతియున్ సభాసదులు సాధ్వసమంది వడంకునట్లుగన్.

ఇట్లువచ్చి.

ముంపిరి రాజ్యగర్వమున ముందఱఁ గానవుగాక ధాత్రిఁ బా
లింపరొ తొంటిరాజులు దిలీపముఖు ల్మునికోటికూఁత లా

లింపరో నొంపరో మదవిలీఢకఠోరనిశాటఝూటమున్
నింపరో దిక్తటాహముల నిర్మలకీర్తి సుధాంశుచంద్రికల్.

అని ప్రారంభించును. హేమధన్వుఁడును నది విని మిమ్ముఁ గలంచిన దుర్మార్గునిఁ దుత్తునియలుగావింతుననును. అప్పుడు పూని-

ఏమనిచెప్పువాఁడ ధరణీశ్వర యే వరతంతుసంయమి
గ్రామణి శిష్యుఁడన్ జటిలకౌశికుఁడన్ బహువేదశాస్త్ర వి
ద్యామహనీయుఁడన్ బదరికాశ్రమవాసుఁడ బాలికామణిన్
గోమలపాణి భానుమతిఁ గోల్పడివచ్చినవాఁడ నక్కటా. ద్వి. ౨౩.

అనిపల్కు నీయపరదుర్వాసునిపేరు వినఁ గోరుదుము. కవి దీనిని కథామధ్యంబునం దెలుపక రాచిల్కచేఁ దుదకు హేమధన్వునకుఁ జెప్పించును. ఇంకొకవిషయమును మూఁడవయాశ్వాసమునఁ బరికింతము. గ్రంథాదిని రాజశేఖరుని జన్మమునుగూర్చి తెలుపునపు డీతఁ డొక కంబుఁ డను యక్షవరుఁ డని కవిచెప్పక బ్రాహ్మణవానిచే లతయొక్క దాసులకుఁ జెప్పించెను. పూర్వము యక్షు లయ్యు శాపమున మర్త్యలోకమున జనించిన రాజశేఖరకాంతిమతులకు వివాహముగూర్చుటలోఁ గూడ విశేషముకలదు.

ఈగ్రంథమునందు వ్యర్థపాత్ర మొకటియు లేదు. ముష్టింపచస్వామి రాజశేఖరుం గొంపోయి యాతనిదోర్వీర్యము ప్రకటింపఁ జేయును. ఘోరమాయాజాలవేది యగురక్కసుని యుద్ధమున నుత్సాహమునఁ గాళికాలయమునఁ జేరి కాళిం బ్రార్థించి రక్కసునిఁ జంపును. కాళి యాతనిసాహసమునకు మెచ్చి యొక యభీష్టసిద్ధి నొందించు రత్నము నిచ్చును. ఈరత్నమే సరోవరతీరమున భోజనాదులను గల్పించెను. తనగృహమునుదెంచిన యోగిని కీరము నొకదాని నిచ్చెను. ఈకీరము త్రికాలవేది యగుటచే గాంతిమతీపూర్వజన్మవృత్తాంతమును, పిమ్మట హేమధన్వునకుఁ బుత్రునివిషయమును దెలుపును. దాసి పంజరమును హేమధన్వునికడకుఁ గొంపోయినపుడు రాజశేఖరుని దోఃప్రతాపమును వర్ణించి కాంతిమతికిఁ దగినవరుఁ డని తెల్పును. పిమ్మటఁ జిలుక పురోహితుఁడై కాంతిమతీరాజశేఖరులవివాహము సల్పును. తృతీయాశ్వాసమున ముకుందారుణుల చరిత్రము సంగ్రహముగ వర్ణింపఁబడినది. ఇం దరుణుఁడు భార్యచేఁ బ్రోత్సహింపఁబడి తపోనిధికై జమునయొడ్డుం జేరును. అందఅమధ్యను రాజశేఖరుఁ డొకకొలికిపూసవలెఁ గానవచ్చు

చున్నాఁడు. ఇందలిపద్యములు నాల్గింటికి మూఁడువంతులు సంభాషణావైఖరి గనే యున్నవి. సింధురాజు-

మ. తనదేవేరిమొగంబు చూచి యిదె కాంతా కంటివే వింత లే
మనివర్ణింపఁగవచ్చు నిచ్చిలుక యూహాపుట్ట నిట్టాడునే
మన మాశ్చర్యపయోనిధి న్మునిఁగె నీమాహాత్మ్య మేరీతిఁ గ
ల్గెనో ము న్నేమితపంబు చేసెనొకొ యీకీరంబుపెం పెట్టిదో.

ఇట్టుదాహరణములు పెక్కులు గలవు. కవి మొత్తముమీఁదఁ దిక్కనాదులవలెఁ గథాంశమునకే ప్రాముఖ్య మిచ్చి వర్ణనాంశములను క్లుప్తపఱచును. చంద్రభానుచరిత్రమును వ్రాసిన మల్లన భారద్వాజాశ్రమమును రమారమియిరువదిపద్యములలో వర్ణించెను. మాదయగారిమల్లన యొక్కపద్యములో నెంతటినేర్పుతో వర్ణించెనో చూడుఁడు.

సీ. హోమధేనువ్రాతమొయ్యనఱ్ఱులు చాఁపఁ గొనగోళ్ళదువ్వెడుక్రోలుపులులఁ
జిగురుదర్భలు గిల్లిమృగపోతములకర్థి నందంద యిచ్చు పంచాననముల
రాచిల్కబోదలఁ బ్రోచి తెక్కలనీడఁ జల్లగాఁ బొదివెడు సాళువముల
బర్హాణసిలయంపుఁ బన్నగార్భకముల కుగ్గులువెట్టు మయూరములను
దొండముల్సాఁచి కలఁగక యుండఁ దీర్థ, వారి దరినుండి క్రోలెడు వారణములఁ
జూచి యచ్చెరువంది యస్తోకమాని, వరతపశ్శక్తి మెచ్చుచు వచ్చునపుడు.

కథానిర్మాణమునందుఁ గవి శిల్పము నేమియుఁ జూపకపోయినను బద్యములు రసవంతములై యొప్పుచుండు ననుటకు సందియము లేదు.

---

## గ్రంథస్వీకారము.

### (1) యామినీ బిల్హణీయము.

**నాటకము.** ఆఱంకములు. తూర్పుగోదావరిజిల్లా అమలాపురము తాలూకాలోని కూనవరమునివాసులు ఆకుల పెద్దయ్యగారు రచించినది. ప్రకటనకర్తలు కాకినాడలోని, నూకల వేంకట్రామయ్యగారు, వెల రు ౧.

ఈగ్రంథముపైఁ బలువురు సదభిప్రాయముల నిచ్చియున్నారు. మాకుఁదోఁచిన యభిప్రాయము మేము నిచ్చుచున్నారము. ముద్రణమునకుముం దింక నొకరిద్దఱకుఁ జూపవలసినది. మూలబిల్హణీయముకథ రసవంతమైనది. చాలగడుసుఁ దనముగలది. ఇందుబిల్హణుఁడును యామినియుఁ జాలతావులఁ బేలవముగా సంభాషిం

చిరి. వెఱ్ఱివారివలెనటించిరి. అరసికులుగాఁ గనఁబడిరి. బిల్హణయామినుల దీనాలాపము లుచితముగాఁ గనఁబడవు. తెర లేచును, తెర పడును, బిల్హణుఁ డింట నేదియో చదువుచుండఁగాఁదెరపడును. ఆవేశముగాఁ బద్యముచదువుచుఁ బ్రవేశించుచున్నాఁడు. అనుట వీథినాటకపద్ధతి.

"ము న్నెందఱో రాజు లనుసంధించిన గాంధర్వవివాహమును నీచ మనుచుఁటివి"—అని కలదు. గాంధర్వవివాహము రాజదంపతులకు మాత్రమే యుచితమేమో. లేచిగుండెలు బాదుకొనుచుఁ గథానాయకురాలు విలపించుట—(ఇటు నటుఁ జూచి) "ఆలసించిన నెవ్వరయిన వత్తురేమో" అని కథానాయకుఁ డనుట వెఱ్ఱిగాఁ గనఁబడుచున్నది.

రాజశాసనమును నెఱవేర్చుటయే తలారులపని. కాని వధ్యుని తన్నిపట్టి కరమ్మనుట నిందించుట బాగుగలేదు. వధ్యునిపైఁ దలవరులకుఁ గోప ముండరాదు. "జీతగాండ్రకు మీకింత కక్షయేల"యని యామినీపూర్ణతిలకయే యన్నది.

"మనుమేదినీశుఁ డేర్పరించిన ధర్మాధిదర్పణము స్త్రీ లవధ్య లని ఘోషించినది. కంపితజలమగ్నమగు భాస్కరప్రతిబింబము. ఆలస్యమమృతం విషం. నతు దోషస్తువస్తువర్ణనమనేన్యాయంబు. ఇట్టివి కొంచెముసంస్కరింపఁబడవలెనేమో.

అచ్చుతప్పులిందుఁ బెక్కులుగలవు. వ్యర్థముగానన్యదోషాన్వేషకులగు వైతండికులకుఁగాక తక్కినవారి కీనాటకము మనోహరముగానేయుండును. లోకము భిన్నరుచికలది. మచ్చునకుఁ బద్యము.

మ. నవనీతాకృతికాలకూటము మహాన్యాయావతారంబు దు
    ష్టవినీతిప్రథమాంక, మ్మర్కకులమున్ సౌధప్రభిత్ కారణం
    బవు సంపాతమహాశనిప్రతి త్వదీయాత్మోద్భవవ్యాజ బాం
    ధవతూలాగ్నికణంబు దీని నయశోండంబున్ వడిన్ దున్మెదన్.

## (2) లియోటాల్‌స్టాయి.

విశ్వసాహిత్యమాల- ౧ వ పుష్పము. మహీధర రామమోహనరావుగారు గ్రంథకర్త. ఈవిశ్వసాహిత్యమాలలో, "ఉత్కృష్టమైన సాహిత్యం వ్యాపకం చేయడం" ప్రధానోద్దేశ మఁట. గ్రంథమాలచందాదారులకు 100 పుటలగ్రంథము రెండణాలచొప్పున దొరకును. పోస్టేజీవేఱుగానుండును. ఇతరులకు మూఁడణాలకుదొరకును. ఈటాల్‌స్టాయి చరిత్రము ప్రపంచమంతయు నెఱుఁగునుగాని యాంధ్రదేశమెఱుఁగదఁట! ఆకారణముననే యామహాపురుషుని జీవితచరిత్రము ప్రక

టింపఁ బడినదఁట. ఎఱుఁగనివారికిఁ దెలియఁ జెప్పుట సజ్జనలక్షణమే. మహాపురుషులంగూర్చి లోకమునకుఁ దెలియఁజేయునపుడు స్వచ్ఛమైనభాషలో గ్రంథమును వ్రాసిన బాగుగనుండును గదా. నియమరహితమైన గ్రామ్యభాషలో నుండుట దీనికి గొప్పలోపము. "ప్రతిమనిషికీ, దేశంకీ, జాతికీ," యీగ్రామ్యభాష సంస్కారమెట్లు కలిగించునో తెలియదు. ఎట్టి సాహిత్యవ్యాపక మీగ్రంథమాలవారు చేయుదురో!

అంబాజీపేటపోస్టులోఁ జేరిన ముంగండలో నీప్రచురణగ్రంథములు విశ్వసాహిత్యమాలాకార్యస్థానమున దొరకును.

(3) ఉత్తమస్త్రీలు.

మొదటిభాగము- బుక్కపట్టణము రామానుజయ్యగారిచేత రచియింపఁబడిన వచనగ్రంథము- ఇందు రుక్మిణి, సావిత్రి, తపతి యను ముగ్గురుస్త్రీల యుత్తమచరిత్ర గలదు: వచనరచన జటిలముగా నిర్దుష్టముగ నున్నది- ఈకథలాంధ్రభారతభాగవతములలోని పద్యానుసారములుగ నగపడుచున్నవి. ఈగ్రంథముపైఁ బలువురు పండితులుఁ బత్రికాధిపతులును సదభిప్రాయముల నిచ్చియున్నారు.

"గ్రంథకర్త తన రచనాసామర్థ్యముచేతను నూతనవిషయ ప్రస్తావనల మూలమునను బ్రాఁతకథలకు వింత సోయగమును జేకూర్చి క్రొత్తవిగా మార్పఁ గలుగుట ప్రశంసనీయము- ఈగ్రంథములోని భాష కొన్నికొన్ని తావులందుపూర్వకవుల గద్యరచనావైఖరిని దలంపునకుఁ దెచ్చును."

రెండవభాగముం ద్వరలోఁ బ్రకటింతురుగాక. వెల రు 0-6-0, గ్రంథకర్తగారికిఁ జెన్నపురి, ఆంధ్రపత్రికాకార్యాలమునకు వ్రాయవలెను.

(4) శ్రీమదాంధ్రమాఘమాహాత్మ్యము.

ఇది పద్మపురాణాంతర్గతము. శ్రీవేదాంతం శేషాచార్య ప్రణీతము. అమూల్యము. 6 ఆశ్వాసముల పెద్దగ్రంథము. రాయల్ సైజు 258 పుటలు. పద్యకావ్యము. తొందరపడి యచ్చువేసి కాఁబోలును జివర తప్పులపట్టిక విస్తారముగఁ జేర్చినారు. వాక్యములు చరణములును మార్చివేసినారు. అమూల్యమగు గ్రంథమును దొందరపడి ముద్రించుట యేమి యవసరమో తెలియదు. ఆచార్యులవారాంధ్రగీర్వాణపదజటిలముగ నీగ్రంథమును భక్తకోటి కుపయుక్తమగునట్లు రచించిరి. సంస్కృతపదము లెక్కుడుగా నగపడును. పద్యముల నడక చాలతావుల ధారాళము గాదు. కొన్ని కొన్ని తావులఁ జక్కగా నడచుచున్నది.

ఇందు మాఘమాసములోఁ జేయు దానస్నానాది విషయములు విరివిగాఁ

దెల్పఁబడినవి. మాహాత్మ్యములు విపులముగా వివరింపఁబడినవి- ధర్మములు నాచారములు వక్కాణింపఁబడినవి- రాఁబోవునది మాఘమాసము కావున, భక్తవరులకీగ్రంథము నుచితముగా నొసంగెదరు గానఁ గవిగారి నివాసస్థానమగు నెమలిపురి నుండి తెప్పించుకొని చదివి యానందింతురుగాక. మచ్చుపద్యములు.

గీ. అనిన దూతయనె సువిషయంబు నీవు,నడిగితివి సుబుద్ధి సుహృదయమునఁ గల్గు
నన్యసేవేచ్ఛుఁడనగు నాకజ్జరయుట,యనవసర మెఱిఁగినది స్నేహమునఁజెపెద.

మ. అనలాక్షా! యిటు లప్సరోయుతవిమానాగ్రస్థితుండౌట కిం
పున నీతండను వాజపేయసవనంబుల్ రాజసూయం బొన
ర్చెనె మాఘాప్లవమాడెనా పురబహిర్నీరంబున న్నీవు దు
ర్జనులం బ్రోవఁగ నేను నిర్దయను వాండ్రుగ్రుంచుక్రూరుండనా. ఆ. 4-177.

(5) వైజయంతి.

కొల్లాపురము, స్నేహలతాకవితా సంఘమునుండి శ్రీ చేబ్రోలు సరస్వతీదేవిగారి సంపాదకత్వమున వెలువడిన మూఁడవవార్షికపత్త్రిక. వెల రు 1.

ఈతడవఁ బ్రకటింపఁబడిన వన్నియు సలక్షణ పద్యవ్యాసములే. మొదటఁ బండితాభిప్రాయములు గలవు. అవియును బద్యరూపములే. పిమ్మట విద్వాన్ సరిపల్లె విశ్వనాథశాస్త్రి ఎం. ఏ. గారి దేవ్యపరాధస్తోత్రము (మూలోపేతము)- శేషాద్రి రమణకవుల యాత్మకథ-సురవరము ప్రతాపరెడ్డి బి. ఏ, బి. ఎల్. గారి భక్తతుకారాం-శతావధాని పాగోలు సత్యనారాయణగారి భావదీపావళి- చతుర్వేది అమరేశ్వరశాస్త్రిగారి ప్రియాశ్లేషమును- భువనగిరి, విజయరామయ్య బి. ఏ. గారి స్వప్నవృత్తమును బెద్దవ్యాసములు మనోహరములుగ నున్నవి. ప్రియాశ్లేష మతిగా నున్నదేమో యనుకొనుచున్నాము.

ఉ. భావములేని కబ్బము సభాసనులెవ్వరు మెచ్చరమ్మ వా
గ్దేవి సుధామయోక్తులకుఁ గేవలముల్ గవితావిపంచికా
రావము మేళవించి మధురమ్మగు గీతికల్ రచించి సం
జీవినిగాఁ బ్రబంధకవిశేముషికిన్ మణివాదు వమ్మరో.

మ. కవితల్ వ్రాయుదునా ? పురాతనకృతుల్ కాపాడయత్నింతునా
కవిరత్నంబుల భవ్యకావ్యరచనాకల్పంబు లాలింతునా
భవబంధం బగు ఘోరసంసరణసంబంధంబు లోనుందునా
అవురా ! తోఁచదు నాదుజీవితసమస్యల్ పూర్తికానేర్చునే.

క. ఆవటముక్రిందఁ దలిరుల, నావటముగ శయ్యదీర్చి యందు సమస్త
త్త్రావరమణికోటీర,స్థావరనిజశాసనుండు శయితుం డయ్యెన్. ౬౨

వ. ఆవేళ నాతరుశాఖాంతరంబున నున్న చిరజీవి యను వృద్ధపక్షీశ్వరుండు తన చుట్టు వచ్చి యున్నపిట్టలం జూచి మీరు దిరిగిన వనంబుల నపూర్వంబు లేమి గంటి రని యడిగిన వానిలోఁ గుక్షింభరికుం డనువిహంగం బోస్వామీ నీ వెఱుంగని యపూర్వంబులు లే వట్లున్నను నొకటివింటి మవధరింపుము. ౬౩

మ. ఖగవంశోత్తమ నేఁడు గుంపుగ నుషఃకాలంబున న్వేడ్కతో
గగనాభోగము నిండ నే మెగసి పక్షశ్రేణివాతోద్ధతి
న్నగము ల్డూలఁగఁ బోయి వింధ్యముచటి న్నానాదిగంతాగతం
బగు నాత్మీయగణంబుఁ గూడి యొకపుణ్యారణ్యమధ్యంబునన్. ౬౪

క. కంకాలఖండనుం డను, కంకము విహగములు గొలువఁగా నిజమిత్రా
తంకం బగుశోకాంబుధిఁ, గ్రుంకఁగ నేఁగితిమి వానికుందుట దెలియన్. ౬౫

క. ఏఁగినఁ నాతం డశ్రులు, దోఁగిననయనములఁ జూపు దోఁపక తనలోఁ
గ్రాఁగుచునుండఁగ నేమా,పాఁ గెటేఁగినభంగినొయ్యఁ బలికితి మతనిన్. ౬౬

క. పిట్టలము మేము నీకల, చుట్టాలము మమ్ము నేల చూడవు నీకీ
పట్టున వలవనిశోకము, పుట్టెడుకత మేమి చెప్పు పొందుపడంగన్. ౬౭

ఉ. నావుడుఁ జూచి యాతఁడు మనంబు యథాస్థితి నిల్పి యి ట్లను
న్వేవురు బాంధవు ల్గలుగ వేదనఁ బొందఁగ నాకు నేల మీ
కీవిధిచొ ప్పెఱుంగఁ దగు నేని వినుం డిఁక వింధ్యకందర
గ్రావముఁ జెంది యుండె నొకరక్కసుఁ డక్కడ నిక్కువంబుగన్. ౬౮

శా. ఆమాంసాశనుఁ డుక్కు పిక్కటిలఁగా నాత్మాంతికద్వాదశ
గ్రామాంతస్థుల నెల్లవారలఁ దినంగా నందఱు న్భీతి మై
స్తోమం బై చని సాఁగి మ్రొక్కి యొకమర్త్యు న్నిత్యము న్నీ బహి
ర్భూమి న్నిల్పెద మారగింపుము నవాపూపాదియుక్తంబుగన్. ౬౯

మ. అని సంప్రార్థన చేసి యేఁగి నిజమర్యాదావిధిం బ్రాప్తుఁ డౌ
మనుజుం గమ్మనిపిండివంటలును సన్మానంబుతోఁ దెచ్చి య
ప్పనసేయం గని యార్చుచు న్వెడలి వ్యాపాదించి[1] తృప్తాస్యగాఁ
దినుచుండుం దనుజుండు యత్నమునఁ బత్నీయుక్తుఁడై నిచ్చలున్. ౭౦

---

1 యార్భాటించి.

వ. ఇట్లనుదినంబును నరబలి జరగు నెల్లిటిదినంబున. ౭౧

క. మన్నిత్రుఁ డైన యొక్కద్విజన్మకుమారకుని వరుస చనుదెంచిన దే
తన్మాలము నాశోకము, సన్మార్గికిఁ గలియుగమున సౌఖ్యము గలదే. ౭౨

మ. అనిన న్విస్మయ మంది మేము ఖగవర్యా నీకు నవ్విప్రబా
లునకుం జుట్టఱికంబు నేరుఱిన కీలుం జెప్పుమా నావుడున్
వినరయ్యా యుపకారహీనుఁడ భయావిష్టుండ నిర్భాగ్యజీ
వనుఁడం జెప్పెద దీనికారణము మీవాలాయపుంబల్కులన్. ౭౩

ఉ. ఏనును బిల్లలుం గలయ నెల్లెడఁ ద్రుళ్ళుచు నుల్లసిల్లుచుం
గానభూమిలోఁ దిరుగఁగా నొకచెంచు రలొడ్డి పోయినం
గానక తూఱుచో మెడలుఁ గాళ్లును జుట్టలుగొన్న దిక్కులన్
దీనులమై కలంగి నలుదిక్కులుఁ జూచుచునున్న యత్తఱిన్. ౭౪

క. ఫలకుసుమసమిత్పర్ణం,బుల కట చనుదెంచి మమ్ముఁ బొడఁగని కరుణా
కలితుఁడయి యక్కుమారకుఁ, డలజడిఁ బడకుండఁ ద్రెంచె నయ్యురులెల్లన్.

క. అతనికృప నిట్లు బ్రదికితి, క్షితిరాఁబులుఁగులకు నెల్ల సేవ్యుఁడనై విం
శతివర్షంబులు పెరిఁగితి, గతి సేసిన యతనికీడు గనుఁగొనవలసెన్.[1] ౭౬

క. తనకుపకారము చేసిన, మనుజునకు న్మేలు గోర మరగక[2] దుఃఖం
బున కడ్డుపడక యుండిన, జనునిబ్రదుకు మేఁకయఱితిచన్నుం బోలున్. ౭౭

క. రాక్షసిని జంపనోపను, బక్షిని దుర్బలుఁడ నన్నుఁ బ్రతినిధి గాఁగన్
భక్షింపు మనిన మాంస,ప్రక్షీణతఁ జూచి వాఁడు పైఁబడఁ డిటకున్. ౭౮

చ. అనవుడుఁ దత్ప్రతిక్రియ కుపాయము గానక చింతఁ జెంది యా
తనిఁ దగ నూఱడించి మదిఁ దాఁచుచు వచ్చితి మేము నావుడు
న్విని చిరజీవి పల్కె నరవిందభవుం డలికంబునందు వ్రా
సినయది తప్పునే పరులచేతఁ జరాచర భూతకోటికిన్. ౭౯

క. ఈక్రమమునఁ బలుకఁగ విని, విక్రమభూషణుఁడు బాలవిప్రత్రాణో
పక్రమమున నిద్రింపక, శుక్రోదయవేళ కెదురు చూచుచు నుండెన్. ౮౦

గీ. అంతభార్గవోదయం బైన వెలుఁగునఁ, దెరువు గానవచ్చు తెఱఁగెఱింగి
కదలె వింధ్యగిరికి గండభేరుండాది, ఘోర మైనయడవిఁ గొంకులేక. ౮౧

---

1 గతిగానక యతనికీడు గనుఁగొనఁబడియెన్. 2 మేలుఁజేయ మదిగానక.

చ. జలజల మంచుసీ రొలుకఁ జల్లనిగాడ్పులు వీవఁ దారక
ల్గలమల ప్రగ్గఁ జీఁకటి క్రమంబున డిగ్గ విహంగసంఘము
ల్గలకలఁ బ్లల్గఁ దూర్పున వికాసము కెంపునఁ గూడియాడఁగా
బలబలఁ దెల్లవాఱె జనపాలకుఁ డేఁగువనాంతరంబునన్. ౧౩

క. ఒకసారె యేడుతేజులు,[1]వికలాంగుఁడు సూతుఁ డనిలవీథి తెరువుగా
నొకరథమునఁ ద్రిభువనములు, నొకనాఁటనె తిరుగునాతఁ డుదయముసేసెన్.

క. ఆపర్వత మెక్కుచు గజ,రూపంబగు తిమిర మణఁచి లోహితకాంతి
వ్యాపితకరనఖరుండై, దీపించె మృగేంద్రుకరణి దినమణి కణఁకన్. ౧౪

సీ. పూర్వదిక్పతి యొద్దఁ బొలుపారు గొడుగుపై ఖచితమౌ మాణిక్యకలశమనఁగ
విబుధబాలురఁ గూడి వేడుకతోడ జయంతుఁ డాడెడి పట్టుబంతి యనఁగఁ
బ్రాచీవధూటికాఫాలభాగంబునఁ బెట్టిన కెంపులబొట్టనంగఁ
దెలివితో నాడెడి దివసఫణీంద్రుని తలమీఁద నున్న రత్నం బనంగ
రక్తకాంతి మెఱయ రచితరక్తాశోక,కింశుకాగ్రగుచ్ఛసంశయంబు
పొడుపుఁగొండమీఁదఁబొడ తెంచెఁద్రైలోక్య, మండనంబు భానుమండలంబు.

క. దల మగుదీధితి నుదయా,చల మలరఁగ రూపబోధజననచ్ఛాయా
కలితం బై యర్కునిమం,డల మప్పుడు రత్నదర్పణముగతి నొప్పెన్. ౧౬

సీ. ఎవ్వనియుదయ మీరేడులోకములకు దిక్కాలవృత్తులు దెలుపుచుండు
నెవ్వనితేజ మశ్వీంద్రవైభవముల కాధారమును దానయై వెలుంగు
నెవ్వనిమండలం బెల్లయోగీంద్రులుఁ జేరుముక్తికి మణిద్వారభూమి
యెవ్వనిమూర్తి వాణీశశంకరవిష్ణురూప మౌ వేదస్వరూప మంత్ర
ఎవ్వఁ డిష్టజనుల కిష్టదర్శనమునఁ, బాపసంచయంబుఁ బాపుచుండు
నట్టిలోకమిత్రుఁ డైన తేజోనిధి, కోకములకు విరహశోక మణఁచె. ౧౭

మ. గిరిశృంగంబుల గైరికాకృతిని శాఖిశ్రేణిపైఁ బల్లవో
త్కరలీలం గరిరాజకుంభముల మీఁద న్రక్తచూర్ణాకృతిన్
శరధిద్వీపములం బ్రవాళరుచిఁ గాసారంబుల న్శోణపు
ష్కరకాంతిం దరుణాతపం బడరె దిక్కాంతాంగకాశ్మీర మై. ౧౮

చ. కలువలవైరి జక్కవలఁ గావఁగఁ బూనిన దాత ముజ్జగం
బులకును సాక్షి యంబరవిభూషణ మానెలతాల్పువేల్పుకు

1. ఒకతేజికేడుపేరులు,

న్వలపలికన్ను ముక్తి తలవాకిలి చీఁకటిపీడుకోలు నా
వెలుఁగులతేఁడు తామరలవిందు వెలుంగుచునుండె నయ్యెడన్. ౮౯

క. సంధ్యావందనవిధి యా,వింధ్యానదిలోనఁ దీర్చి విభుఁ డనవరతా
వంధ్యారంభుం డల్లన, వింధ్యాద్రిబిలంబుఁ జేరె విప్రునిఁ గావన్. ౯౦

క. కాలుని కేళీశైలముఁ, బోలెడునచ్చోటి యస్థిపుంజముఁ గని భూ
పాలుఁడు మనమున నధికకృ,పాళుం డై వధ్యభూమి బలిమై నిలిచెన్. ౯౧

గీ. అంత నింతిఁ గూడి యసుర యార్చుచు వచ్చి, యోరి పిండివంట లుజ్జగించి
నేఁడు నీవె వచ్చినాఁడ వి దేమిరా, యనుడుఁ దెలియఁబలికె మనుజవిభుఁడు.

క. ఓరాక్షస నే నొక్కని, కాఁకిన్నై యడ్డపడితిఁ బరదేశిఁ బ్రియా
హారముగ మెసవు పక్వా,హారంబులు వెనుకవచ్చునంతకు నన్నున్. ౯౩

మ. అనినం జిత్తములోన దానవుఁడు చోద్యం బందుచు న్నీదుపూ
నినసత్కార్యము సెల్లు మెచ్చితిఁ జుమీ నీకిష్ట మెద్దేని వేఁ
డిన నే నిచ్చెద నావుడుం గరుణాదృష్టిం గల్గ నీక్షించి య
జ్జననాథుండు పరోపకారకరణోత్సాహంబుతో ని ట్లనున్. ౯౪

క. ఇప్పుడు నీ వాడినయది, తప్పకుమీ తలఁచుగాఁగ దానవులకడం
దప్పులు గల వని పెద్దలు, చెప్పుదు రొకచోట సత్యశీలము లేదే. ౯౫

చ. నయమునఁ బూర్వదేవతలు నాఁగఁ బ్రసిద్ధికి నెక్కె రాక్షసా
న్వయము జగంబులో నసురవంశవిభూషణ[1] మీవు నీవచో
నియమముఁ దప్పనేరుతువె నీకుకళత్రము సాక్షి గాఁగ నా
ప్రియమును నీవునుం బ్రియముపెంపునఁ జేయుము[2] నిన్ను వేఁడెదన్. ౯౬

క. దనుజేంద్ర నేఁడు మొదలుగ, మనుజాహారంబు గొనుట మానుము కృపతో
జనులకుఁ బ్రియ మొసఁగుచు నీ,వనమున నెలకొనుము వింధ్యవాసిని కెనవై.

గీ. అనుడునవ్వరమిచ్చెదననితలంచి,ముదితహృదయుఁడై తనయింతిమోముఁజూచి
యితనిసరిపోల్ప నెవ్వరి నెన్నవచ్చు, వనిత యీతఁడు జీమూతవాహుమీఁదె.

వ. అనిన నా రాక్షసి కుతూహలంబున ని ట్లనియె. ౯౯

—: జీమూతవాహనుచరిత్రము. :—

క. జీమూతవాహుఁ డెవ్వం, డేమి ఘనత[3] చేసి వెలసె నిక్కథఁ దెలియం
గా మనుజాంతక చెప్పుము, నా మనమున హర్షవల్లి నాటుకొనంగన్.

1. శిరోమణివీవు. 2 నీదునప్రియముపెంపును జేసెద. 3 ఏమితగవు చేసి.

వ. అనుడు న ద్దనుజుండు పుణ్యపురుషుని యొకరం[1] బుణ్యపురుష కీర్తనం బుచితం
బని యి ట్లనియె. ౧౦౧

సీ. ప్రాలేయగిరిమీఁద భానుబింబద్యుతి మణిమయప్రాకారమహిమతోడఁ
దిరమైన కాంచనపురములో జీమూతకేతుఁడు నాఁగ విఖ్యాతయశుఁడు
ఖచరవల్లభుఁ డొకకనకవతీసంజ్ఞఁ బరఁగెడుకన్యకఁ బరిణయించి
ప్రీతిసంధిల్ల జీమూతవాహుం డనఁ దగునట్టి పుత్రరత్నంబుఁ బడసి
రాజ్యలక్ష్మిచేతఁ బూజ్యుఁ డై కడపట, వార్ధకమున భోగవాంఛ వదలి
నిజపదమునఁ బుత్త్రు నిలిపి నీతులుసెప్పి, వనితఁ గూడి యేఁగె వనమునకును.

క. జీమూతవాహనుండు మ,హామహిమాఖండలుండు యాచకజనచిం
తామణి శరణాగతర,క్షామణి ఖచరేంద్రకులశిఖామణి యయ్యెన్. ౧౦౩

క. పితృదత్త మైన కల్ప,క్షితిరుహ మర్థులకు నొసఁగి చిక్కిన ధనసం
హతిఁ దనబంట్లకుఁ బ్రజలకు, హితులకుఁ దగ నిచ్చె రిపుల కెడ రిది యనఁగన్.

గీ. పురముఁ గొనఁ దలంచు నరులఁ జంపఁగఁబూని, జీవహింస కోడి చింతనొంది
తల్లిదండ్రు లున్నఁ దగుఁగాక యిదియేల, యనుచు గురులజాడ నరుగఁ దలఁచె.

వ. తలఁచి సఖుం డైన మధుకరుం గూర్చుకొని యరిగి త జ్జననీజనకులం గని సా
ష్టాంగంబుగాఁ బ్రణమిల్లిన వారలు సంతుష్టాంతరంగు లై యుండం జేరి. ౧౦౬

క. తత్పదపంకజసేవా,తత్పరమతి విమలుఁ బ్రాజ్ఞుఁ దాఁ దెచ్చుచు నా
సత్పురుషుఁడు మలయమహీ,భృత్పార్శ్వమునం జరించెఁ బితృభక్తుఁ డనన్.

మ. ఒకనాఁ డిష్టసఖుండుఁ దాను ఫలపుష్పోపార్జనాసక్తితో
వికచాంభోజసరోవరంబుల నవావిర్భూతచూతాది జా
లకజాలంబుల రాజకీరమదగోలంబాగ్రపుష్పంబులం
బ్రకటశ్రీగుణగణ్యమౌ నొక తపోరణ్యంబు సొత్తేరఁగన్. ౧౦౮

క. ముందఱ గౌరీమందిర,మందారనవారవిందమాకందలతా
కుందమకరందబిందు,స్పందానందనుఁడు మందపవనుఁడు వీచెన్. ౧౦౯

వ. అంతఁ దదాగతకుసుమామోదవాసిత మలయసమీరాప్యాయన శరీరాయా
సాపహారుం డై. ౧౧౦

క. ఎడపని కూరిమితో న,య్యెడఁ బుత్రికి నీడ యైన హిమశైలము కై
వడి బెడఁ గడరెడు పటికపు, గుడి బొడఁగని యక్కుమారకుం డటుచేరెన్.

1. పుణ్యపురుషుఁడు వినం బుణ్యపురుష.

క. అంగనమున నభ్యంతర,సంగీతాకర్ణనమునఁ జలియింపక వే
డ్కాఁ గనవు మేయుకున్నకు,రంగంబులఁ జూచె నంతరంగం బలరన్. ౧౧౨

వ. చూచి తత్సంగీతప్రసంగసాంగత్యకారణం బగు జాణం జూతము రమ్మని యిష్టసఖుం డైన మధుకరుం గూడి తద్ద్వారంబుఁ దూఱి. ౧౧౩

సీ. చిన్నిచన్నులమీఁదఁ జేర్చినవీణియ చేఁదోడుగా శ్రుతిస్థితులఁ దీర్చి
సరిగమపధను లన్సప్తస్వరంబుల గమకంబు లయవిభేదముల నెఱపి
నాదామృతంబున ననిచినక్రియఁ దంత్రిఁ బెనఁగొని నఖకాంతి గొనలుసాఁగ
రాగకదంబంబు రంజిల్లఁ జేయుచు, నాలతి వీనుల కమృత మొసఁగ
గానరసవశమునఁ గనుఁగవ మోడ్చుచు, బోటిఁగూడి వాణిబోటిఁ బోలె
గారిఁ బాడుచున్న కన్యకారత్నంబుఁ, జూచె నచట బాలఖేచరుండు. ౧౧౪

వ. అంతఁ దదీయలావణ్యమధుమత్తనయనమధుకరుం డై మధుకరునితో నిట్లనియె.

క. వనితారత్నము నవయౌ,వనయై పొదరింట నున్నవనలక్ష్మి క్రియన్
దొన నున్న మరునిబాణం, బన నున్నది యిచట మోహనాకృతితోడన్. ౧౧౫

సీ. ఇది దేవకామిని యేని నింద్రుని వేయుఁగన్నులు సఫలము ల్గాక యున్నె
యిది నాగకన్యక యేనిఁ బాతాళంబు సోముఁడు లేఁ డని శూన్య మగునె
యిది ఖేచరాంగన యేని మాజాతికిఁ బ్రభయెక్కు చెఱకునఁ బండుగాదె
యిది సిద్ధబాలిక యేని లోకంబులో సిద్ధకులంబు ప్రసిద్ధిఁ గనదె
యిది వనాంతలక్ష్మి[1] యేని వనం బెల్లఁ, బల్లవింపకున్నె యెల్లయపుడు
నిది సుధాంశురేఖ యేని యీగుడి నున్న, శిలలు చంద్రకాంతశిలలు గావె.

క. పరసతులను దల్లులఁగాఁ, బరికించెడు నాకు దీనిపైఁ జిత్తం బే
వెరవునఁ దగిలెనొ యిది కృత,పరిణయ గాకుండఁబోలుఁ బరికింపుదమా.

వ. అని యంతకుమున్న నిజదర్శనంబునఁ జంద్రావలోకనంబునం గరంగు చంద్రకాంతంబు క్రియఁ జిత్తంబు గరంగి మేన ఘర్మజలంబులు మణిగణభూషణంబులుగా లజ్జారాగనిమగ్న యై కనుబేటంబున గాటం బగునారాటంబునఁ దుంటవిల్తుండు మానంబు వేటాడ[2] బోటి పూఁబోద మాటు సొరం దలంచునెడ వసంతానుగమ్యమానుం డగు మీనకేతనుని భాతి దగ్గఱి యోలీలావతి నీ వెవ్వరిదాన వీగౌరీగేహంబున కరుగుదేరం గారణం బేమి నావుడు విని చతు

1. వసంతలక్ష్మి. 2. తుంటవిల్తుచే మానసంబు పేసెత్త. చి. సూ.

రిక యను తత్సఖి లేచి బాలలకుఁ బ్రౌఢత్వంబు గలదె యేను విన్నవించెద నవధరింపుఁడు. ౧౧౯

క. వసుమతిఁ బరఁగిన మిత్రా, వసుసోదరి సిద్ధవంశవరుఁ డగు విశ్వా
వసుసుత మలయవతి విభా, వసునిభుఁడగువరుని వేఁడవచ్చిన దిటకున్. ౧౨౦

వ. అనిన నక్కుమారుండు నామాట తప్పు దిది కన్యక యగుట వింటివే యనుడు నమ్మధుకరుండు దైవయోగమ్మున సమాన వయోరూపంబులు గలవధూవరు లిట్లు గూడుదురే యని- ౧౨౧

క. వనరుహగర్భుని నేరమి, ననురూపసువస్తుయోగ మగపడదు జగం
బున మీాబోంట్లకు నగపడుఁ, గనకము రత్నమ్ముఁ గూడుకైవడి నొకచోన్.

వ. అని చతురికం జూచి నిజసఖుని దెసం జూపి. ౧౨౩

క. జీమూతకేతుసుతుఁ డరి, జీమూతసమీరణుండు చిత్తజనిభుఁ డా
జీమూతవాహుఁ డీతఁడు, జీమూతస్థిరుఁడు ఖచరశేఖరుఁడు సుమీా. ౧౨౪

క. అనవుడు నది మలయవతిం, గనుఁగొని యిది గోరికరుణఁ గలిగెం జెలియా
మును విందు మితఁడు రూపసి, యనఘుఁడు వరియింపు మితని నతిమోదమునన్.

ఉ. నావుడుఁ గన్యకామణి మనంబునఁ గూరిమి నాటుకొల్ప నా
భావజుబాణము ల్మిగులఁ బజ్జఁ జరించినఁ దత్పరాగమో
నా పిలసిల్లి లేఁజెమట నవ్యముగాఁ గుచసీమఁ దోఁప ల
జ్జావనతాస్యయై నిజవయస్యకు నుత్తర మీాక యుండినన్. ౧౨౬

వ. చతురిక మఱియు నొత్తి పలుకునప్పుడు. ౧౨౭

సీ. జనని పుత్తెంచిన సఖి వచ్చి పిల్చిన నిఁక నుండరా దని యిచ్చఁ దలఁచి
పోయినఁ బ్రియుఁ డెట పోవునో యని నిల్చి తడసినఁ గోపించుఁ దల్లియనుచుఁ
గదలి వేదన మదిఁ బొదలఁగా నేటికి నెదురీఁదుచాట్పున నింటి కేగి
బలవంతమైన యావలవంత మఱలోన వేఁగుచు నొకచోట వెచ్చనూర్చు
చున్నఁ జూచి చెలియలొయ్యనఁజనుదెంచి, హృదయతాపమెఱిఁగిమదిఁగలంగి
చంద్రకాంతవేది శయ్యాతలంబుపైఁ, జేర్చి శిశిరవిధులు సేయునపుడు. ౧౨౮

క. పుప్పొడియుఁ బువ్వుఁ దేనెయుఁ, గప్పురమును జందనంబుఁ గలపిన పన్నీ
రప్పొలఁతుకపైఁ జిలికిన, నిప్పుపయిం జిలికినట్టి నెయ్యిం బోలెన్. ౧౨౯

సీ. కుప్పలు గొనఁజల్లుపుప్పొడియెరువుగాఁ బొరిఁబొరివిరహాగ్నిఁ బొగులఁజొచ్చె[1]
ఘనసారమిళితచందనపంక మురమునఁ దొడిఁదొడి నెఱియలు విడిచి చిటిలె

1. విరవిర విరహాగ్ని విరియఁజొచ్చె.

సెజ్జపైఁ బఱచిన చెంగల్వరేకులు స్రుక్కి మై సోఁకినఁ జూర్ణ మయ్యె
విసనకఱ్ఱలు చేసి విసరుచో నావులఁ గదలీదళంబులు గ్రాఁగి మునిఁగె
మోవికెంపు డింపె ముత్తియంబులు గందెఁ, గంకణముల లక్క కరఁగిపాఱెఁ
జలువమందు లెల్లఁ జెలువ మందఁగఁ జేయ, నెడఁదమదనతాప మినుమడించె.

క. కలకలఁ బలికెడు చిలుకల, కలకలములుఁ గోకిలముల కలరవములు నా
కులపఱుప నళికులంబులు, నులుకఁగ నయనముల జలము లొలికెం జెలికిన్.

వ. ఇట్లు పెచ్చుగిల్లిన[1] పచ్చవిల్తువెచ్చ వెచ్చు నెచ్చెలిం జూచి కలంగి ప్రబలదర్పితుం డగు నాదర్పకుని దూఱం దలంచి చతుర యైన చతురిక యి ట్లనియె.

క. వలరాజ నిన్ను రూపున, గెలిచిన జీమూతవాహు గెంటింపఁగ లే
కలఘుమతి నబల నొంచెదు, పలువురు విని రేని బంటుపంతము డిగదే. ౧౩౩

మ. అళులారా యలికుంతలం జెలిమితో నానంద మొందింపుఁడీ
చిలుకా చిల్కలకొల్కి నేపక సఖీస్నేహంబు వాటింపుమీ
వలరాజా వలవంత మాన్పుము పికద్వంద్వంబ యీద్వంద్వముం
గలయం గోరుము మారుతా మరలుమీ కన్నంత నిక్కన్నియన్. ౧౩౪

వ. అనునప్పు డక్కుమారఖేచరున కైన యత్తాపమునకుం దాప యగు నాదిఖేచరుం డాదిత్యుండు కాంతి సడలినట్లు దిరిగి చని ఘనపుష్పరాశితల్పంబునం దన మేను సేర్చిన. ౧౩౫

క. జడనిధి వెలువడి యెఱ్ఱగఁ, బొడమెడు కిరణములు శిఖలపోలికి నిగుడం
గడఁగి యుడురాజు విరహుల,బడబానల మనఁగ నుదయపర్వత మెక్కెన్.

గీ. అంత జగమునిండ నచ్చవెన్నెల పర్వ, నందులోని వేఁడిఁ గంది కుంది
కాఁగఁబెట్టినయుదకంబులోపల నున్న, మీనువోలె బాల మిడుకఁజొచ్చె.

వ. ఇ ట్లధికపరితాపంబునం బురపురం బొక్కుచున్న కన్నియం జూచి కళవళించి చెలులు మెత్తన నెత్తుకొని చని గురువెందపందిరిక్రింద నరవిందతల్పంబుపై నిడి దైవం బేమి దలంచునో యని దానిమేని కట్టావులం గ్రాఁగిన తమ్ము సవరించుకొనుచు. ౧౩౬

క. తను వంట నోడి వనజా
ననకును జేమంతిపువ్వునం గొని పన్నీ
రెనయ మొయిఁ బూయుచోఁ గ్రాఁ
గినవెనమున నొలుకు సూనె క్రియఁ జుయికొట్టెన్[2]. ౧౩౭

1. పిచ్చుగిల్లిన-పెచ్చుపెరిఁగిన. 2 చుంయనియెన్-చుఱుకంటెన్.

క. అస్తోకంబుగ నత్తా,శస్తని కుచమండలమున లలనలచే వి
న్యస్త మగు చందనము నవ, కస్తూరీలేపనంబు కైవడిఁ దోఁచెన్. ౧౪౦

వ. అవి యన్నియుం జూచి డగ్గఱి బెగ్గలి చతురిక న్యాయనిష్ఠురోక్తులఁ జంద్రు
నుద్దేశించి. ౧౪౧

క. ఉడురాజ నీవు వొడిచిన, జడనిధి యుడుకెక్కి నెక్కసంబునఁ బొంగున్
బడబాగ్ని మీఱి నావుడుఁ, బడఁతుక నీవేఁడిఁ జిమిడిపడ కెట్లుండున్. ౧౪౨

క. హరిణాక్షి చూడ్కిఁ గన్నుల, సిరిగోల్పడి యుట్టి నిన్నుఁ జేరిన నీ వీ
తరుణిఁ బెగఁజూడఁ బోలుదు, పరికింపఁగ నెపుడుఁ బక్షపాతివి గావే. ౧౪౩

మ. అమృతాంభోనిధి జన్మభూమి సురభూజైరావతశ్రీసుధా
ప్రముఖంబుల్ తగు తోఁడఁబుట్టుగు లుమాప్రాణేశుజూటంబు గే
హము బింబం బమృతం బనంగ జగదాహ్లాదంబుగా నిన్నుఁ జ్యా
తుము నీవేఁడిమి కాలకూటమునకుం దోఁబుట్టు వయ్యెంగదా.[1] ౧౪౪

గీ. నాఁడు నేఁడు నీకు నాఁడుఁదోఁబుట్టువు, లేదె కరుణ లేదు లేశ మైనఁ
బొలఁతిమొగముతోడి పొత్తైనఁ బరికించి, చల్లసేయుమయ్య చందమామ.

వ. అని వేఁడుకొని మలయవతిం జూచి. ౧౪౬

సీ. వనిత నీకన్ను లొయ్యన విచ్చి చూడవే మారుబాణము లరుదేరనోడు
సబల మావీనుల కమృతంబు చిలుకఁగాఁ బలుకవే చిలుకలు పలుకనోడుఁ
గోమలీ నీదు ముంగురులు పాటింపవే తేఁటిదాఁటులు కొంత దాఁటనోడు
ధవళాక్షి నీముఖదర్పణం బెత్తవే సోముఁడు నీదెసఁ జూడనోడుఁ
బడఁతి మమ్ముఁ దగినపనిఁ బంపఁజీరవే, కోకిలంబు లిచటఁ గూయనోడు
మగువ చల్లనూర్పు నిగిడింపవే యించు, మలయమారుతంబు మలయనోడు.

వ. అని ధైర్యంబు పట్టుకొల్పిన నమ్ముద్దియ తనవేదన దీఱుతెఱంగు చెప్పంబూని
వ్రీడావశంబున నోడి మారుప్రేరణం దవులుకొని చెలిం జూచి. ౧౪౮

క. ప్రథమముననుండి చిత్త,వ్యథ యెఱుఁగుదు ప్రాణసఖివి వలనై నమనో
రథ మొనగూర్పక యీమ, న్మథుబారికిఁ ద్రోవ నీకు నాయం బగునే. ౧౪౯

క. రతిపతికిఁ దోడుపడి యో, చతురిక వెనువెంట మందు చల్లుచు నన్నున్
బతిమాలించెద వకటా, హితులుం బగవారిఁ గూడి రే మనవచ్చున్. ౧౫౦

వ. అనిన నోయమ్మ నీ నెమ్మనంబున నింత యుమ్మలికం బేల నమ్ము మతనిం దెచ్చెద
నూఱడు మని చతురిక మనోహరిక యను సఖిం జూచి యీచేడియ గౌరి

---

1. దోఁబుట్టువాటంజుమీ–వాటంగదా.

ధామంబున జీమూతకేతు కుమారు సుకుమారుం జూచి వలచినయది యది మనరాజున కెఱింగించుట విచారం బగునే. ౧౫౧

క. చెప్పినఁ బతి గోపించును, జెప్పకయుండినను బాల చిక్కెడు మనకుం
దప్పులు దొలఁగునుపాయము, చొప్పడ నేదేని బ్రదుకుఁ[1] జూడఁగ వలయున్.

క. అని తలపోయుచు నుండఁగ
వనజంబులు వెలయఁ గుముదవనములు సొలయం
గనుకని చీఁకటి పొలియఁగఁ
దనరుచి దివిఁగలయఁ బొలయఁ దపనుఁడు పొడిచెన్.[2] ౧౫౩

సీ. ఆవేళఁ జతురిక యనువునఁ బ్రాణంబు నిలుపంగఁబూని యానెలఁత లేపి
యిష్టునిఁ గూర్చెద నేతెమ్ము గౌరినివాసమ్ముకడ కని యాసగొలిపి
కొని చని మాధవీకుంజంబులోపలఁ జల్లని పల్లవశయ్య నునిచి
వగవకు జీమూతవాహనుం దెచ్చెద నని నాలు గడుగులు నడచునంత
నెమర మదనుచేత హృదయసంతాపంబు, పొదలఁబుష్పఁబొదలమొదలఁబూని
సంగడీనిఁ గూడి యంగనఁ దలఁచుచుఁ, బలవరించు నతనిపలుకు వినియె.

వ. అది యె ట్లన్నను. ౧౫౪

ఉ. మారుని మోహనాస్త్రము, సమస్తవిలాసవిహారభూమి, శృం
గారరసంబుతేట, తొలుకారుమెఱుంగులపుట్టినిల్లు, సం
సారసుఖంబు లేమొలక, చక్కఁదనంబులప్రోక కాఁకబం
గారముచేగ, యాతరుణి కన్నులపండువ గాదె చూచినన్. ౧౫౬

క. నెఱిచెడి యింటికిఁ జనునా, తఱి మొగమున కెగయు తేఁటిదాఁటునకై తాఁ
జెఱికడఁ బెడమఱి చూచినఁ, జుఱుకుననా నెఱను నాఁటెఁజూ పెనుదూపై.[3]

వ. తన్మూలంబుగా మన్మథుండు బాణవిరహితుండయ్యె నని తదనంతరంబ.[4] ౧౫౮

క. మదనుని యేనమ్ములు నా, హృదయాగ్నిని భస్మమయ్యె నిదిమొదలుగ నీ
పదునాలుగులోకములును, బ్రదుకుఁ గదా వీనిచేతిబాధకు వెలియై. ౧౫౯

క. మధుకర తన్ముఖపంకజ, మధుకరభావమున మిగుల మత్తిల్లి సుధా
మధుర మగు నావధూమణి, యధరము చవిచూడఁ గలుగునా యిఁకనాకున్.

వ. అట్టిబోటి కూటమి లేక మదిం గంది కుంది బ్రదుకుకంటెఁ బ్రాణంబులు దొ

1. చొప్పడు నేదేని బ్రదుకు చి. సూ. తప్పదుయేపనియైనను మప్పువుమనకేమియైన మోసమువచ్చున్ 2. క. మనసిజునియేపు జాఱఁగఁ...తనరుచి దివిగలయ బాలతపనుఁడు పొడిచెన్. 3. నె, నరునాటుంజూపె మన్ననంబడమాయె. చిఱికునఁ బెడమరిచూచిన, నెఱసఖిఁజేరిననాగనె 4. తన్మూలంబుగాఁ బెడమఱిచూచిన మన్మథుండు తెగఁజూచుట లోకోపకారంబయ్యె.

అంగుట మే లనిన మధుకరుం డో కుమారకంఠీరవ యింతలో ధీరత్వంబు విడు
తురే నావుడు నభిమానించి. ౧౬౧

క. పూదినరసాలభూజముఁ, జూచితిఁ జంద్రాతపమ్ముఁ జొచ్చితి నిన్నున్
నీచేతికదళిదళముల, వీచోపులగాలినుంటి వీరుఁడ గానే. ౧౬౨

వ. అనునెడం జతురిక డగ్గఱి తనచెలి వల పెఱింగింపం బూని. ౧౬౩

క. వీరుఁడవు మేరుభూధర,ధీరుఁడ వత్యంతదానదీక్షాజితసుం
దారుఁడవు భూరికరుణో,దారుఁడ వయితేని బాల దయఁ జూడుమికన్. ౧౬౪

వ. అని మఱియును.[1] ౧౬౫

క. మలయాచలసానువుపై, మలయుచుఁ జనుదేర గాఁచె మాంచిరమున ని
ర్మలయశుఁడ వైన నిను మా, మలయవతీకన్య మూచె మానముమూలన్.

క. అది మొదలుగ మనమ్ములఁ, జెదరినధైర్యమునఁ జేయి చెక్కిట నిడి స
మ్మద ముడిగి మనము నీపైఁ, గదియించును జూడ్కి బాష్పకణములుదొరఁగన్.

క. భావజనిభుఁ డగు నాతని, భావంబునఁ గూర్చి నిలిపి పరిరంభణసం
భావన సుఖ మొనగూర్చెడు, దైవము నాపాలఁ గలుగదా యని తలఁచున్.

క. అనిమేషంబునఁ బ్రియునిం, గనుఁగొనఁగాఁగోరుకన్నుఁగవ కడ్డము వ
చ్చినఁ దనుఁ గోపించు నొకో, యని కన్నులఁ జేర నిద్ర యలుకుచునుండున్.

క. విను గడు సన్నం బగునీ, మనముఁ బ్రవేశింప నిదియ మత మగు నని డ
స్సెనొ కాక యనఁగ నంగన, తనతనువునఁ దనువు లేక తనువై యుండున్.

క. సారసములు నారసములు, హారంబులు కంటకప్రహారంబులు క
ర్పూరము విషపూరము శృం,గారము బంగార మయ్యెఁ గామినిమదికిన్.

క. నేనుం దానును న్రాకటి, గా నుండఁగ నొరునిఁ దగిలెఁగా యనుచు నుదా
సీనంబు వీడుకోలుగ, మానినికిన్ లజ్జ దలఁగె మరు బేటమునన్. ౧౭౨

క. పలికెఁ బొడసూపెఁ బ్రియుఁ డదె, పిలిచె ననుం గీరచంద్రపికములమెడ వా
గ్విలసనరవములఁ బలుకులు, మొలతేరఁగ సంభ్రమించు మ్రొక్కును లేచున్.

క. మోహమున మన్మథానల, దాహముపై లెఱుఁగలేక తనప్రాణంబుల్
దేహమునఁ గలుగుటకు సం, దేహముగాఁ జెయ్యులుడిగి దృష్టి మొగుడ్చున్.

క. సతి విడిచిన ప్రాణంబులు, పతి నిలుపఁగ నుండె నేఁగఁ బాడియె యతఁ డీ
యతివ డిగవిడిచి తలఁగిన, నతివేగమ తలఁగి పోద మని యున్న వనా. ౧౭౫

క. ఖేచరవంశవిభూషణ, యేచోట వసింపలేక యెత్తుఁబయన మై
నా చెలిప్రాణంబులునినుఁ, జూచిన తావునను మెనురుచూచుచు నుండున్.[2] ౧౭౬

1. ఈక్రిందివి దశావస్థలకందములు. 2. పది, గోచరమగు తావులేక గొంకుచునుండున్.

మ. అని చెప్పంగ లతాగృహంబుకడఁ బ్రాణాధీశుచే నేఁడు మ
న్నన లే దింకిట నెన్నిజన్మములకైనన్ భర్త జీమూతవా
హనుఁ డౌఁగాత మటంచుఁ దీఁగెయురిలో నా బాలకంఠంబుఁ దూ
ర్చిన లోకాంబిక యైన యంబిక కృపం జేపట్టి తా నిట్లనున్. ౧౭౭

క. హృద్యాకారిణి యీమర,సోద్యోగం బుడుగు బాలుఁ డుత్తముఁడు యశో
విద్యోతితుఁ డధికాయువు, విద్యాధరచక్రవర్తి విభుఁ డౌనీకున్. ౧౭౮

వ. అనిన ననుమానించునెడ నచ్చతురికయు వియచ్చరకుమారుండునుం బఱతెంచి కంఠంబున నున్న లతాపాశం బూడ్చి భుజలతాపాశంబిడి యింత తెంపు సేయుదురే యే మిదె వచ్చుచున్నవార మని బుజ్జగించిన నుజ్జీవిషు వగు నజ్జోటి లజ్జామజ్జదవనతాననాబ్జయై పులకించి గురుని యనుమతి లేమిం గొందలపడు నెడ మనోహారిణి యనుసఖి వచ్చి గౌరీప్రసాదవిభవం బిట్టిదిగదే యని. ౧౭౯

గీ. అమ్మ నీవు గోరినట్లు మీతండ్రియు, నితని కిచ్చెద నని యెఱుఁగఁ జెప్పె
మీకుఁ బెండ్లి సేయ మిత్రావసువునకు, నానతిచ్చె నటకు నరుగుదెమ్ము. ౧౮౦

గీ. అన్నమాటఁ బొంగి కన్నులఁ బ్రియునికిఁ, గన్నె మ్రొక్కి యేఁగె నన్నకడకుఁ
జిత్తముల్లసిల్ల జీమూతవాహనుం, డాత్మగురులకడకు నరుగుదెంచె. ౧౮౧

వ. తదనంతరంబున మిత్రావసుండు జీమూతకేతుం డున్నకడకు వచ్చి యవ్వధూవరుల పరస్పరానురాగం బెఱుకపడం జెప్పి ప్రార్థించి తదనుమతి వివాహవేళ నిశ్చయించి నానానగరనివాసులైన కిన్నరకింపురుష గరుడగంధర్వ సిద్ధసాధ్య విద్యాధరులం గూర్చి యుభయవర్గంబులుగా నేర్చి సకలశృంగారాభిరామంబుగా నొనర్చిన కళ్యాణమండపంబున నున్న సురేంద్రాదిసురలు వధూవరులం జూచి సదృశకులవయోరూపలావణ్యంబులు గల మిథునంబుం గూర్చుటకుం బితామహునిం గొనియాడుచుండ. ౧౮౨

సీ. అప్సరఃస్త్రీలు కళ్యాణగానంబులు తెఱఁగొప్పఁ బాడఁగా దివ్యమునులు
ప్రకటించి మంగళాష్టకములు చదువంగ రత్నములుం దలఁబ్రాలుగాఁగ[1]
నగ్నిదేవుండు ప్రత్యక్షమై సాక్షిగాఁ దగ బ్రహ్మమునులు మంత్రములు సెప్ప
నిర్జరకాంతలు నివాళులిడఁ[2] గల్పవృక్షంబు లొగిఁ బుష్పవృష్టి గురియ
సురలు పరిణమింప సురదుందుభులు మ్రోయ, నారదుండు దీవెనలుగఁ బాడ
విశ్వమెల్లఁ బొగడ విశ్వావసునికూఁతుఁ, బరిణయించె ఖచరవరసుతుండు.

1 చేతసంబ్రాలుగాఁగ 2. వాసుకిసుతులునివాళింపఁగా. నిర్జరకాంతలు నివళింపఁగా.

గీ. పరిణయోత్సవంబు జరిపి సిద్ధవిభుండు, గారవమున నెల్లవారి ననిపె
స్త్రీసమేతుఁ డైన జీమూతవాహనుఁడు, గురుపదాంబుజములు గోరి చనియె.

క. జనకుని యనుమతిఁ గతిపయ, దినములు రతితంత్రగతులఁ దేలుచు వనితా
జనతానురాగుఁడై చం,దనగిరిపై నతఁడు మనము దనియ సుఖించెన్. ౧౮౫

ఉ. అంతట నొక్కనాఁడు ప్రణయాన్వితుఁడై తమబావఁ గూడి ప
ర్యంతవనాంతభూమిఁ గలయం జరియించుచు వింతకాంతి న
త్యంతసముజ్జ్వలం బయిన యస్థిసమూహముఁ గాంచి పర్వత
ప్రాంతమున న్శరద్ఘననిభం బది యేటిది బావ నావుడున్. ౧౮౬

వ. అతం డి ట్లనియె. ౧౮౭

క. పక్షీంద్రుఁడు పక్షానిల, విక్షిప్తం బైన జలధి వేఁటాడి మహా
చక్షుఃశ్రవముల నిత్యము, భక్షించుచునుండుఁ దొంటిపగ మొదలారన్.

క. ఆగరుడికి వెఱచి మహా, నాగేంద్రుఁడు వచ్చి యనుదినము నొకపాము
న్నీగుంటికడకు నేనై, వేగమె పుత్తెంతు నింక వేఁటాడకుమీ. ౧౮౯

ఉ. దుర్భరపక్షపాతహతిఁ దోయధి పాయలుగాఁగ వచ్చు నీ
యార్భట మెల్లెడ న్విని భయంబున నంమ భుజంగమాంగనా
గర్భము లెల్ల నూఁడిపడఁగా నిది నీధరహాని[1]గావునన్
నిర్భయవృత్తినుండఁ గరుణింపుము నీకుఁ బ్రయాసమేటికిన్. ౧౯౦

మ. అని ప్రార్థించి యహీంద్రుఁ డేఁగి దినమర్యాదన్ ఫణిం బంపఁగా
వినతాపుత్త్రుఁడుఁ దించు నుండు నవి భావింప న్శతాసంఖ్యముల్
విను మా తెల్పు తదస్థికూటము జగద్విఖ్యాత మీ తార్క్ష్యవ
ర్తన మిచ్చో మనసంబున న్నిలువ యుక్తంబౌనె లోకోత్తమా. ౧౯౧

గీ. అనుచు దానశూరుఁ డగు వానిమది నొంచు, పుట్టుఁడ మరలి పోద మనుచుఁ
బిలుచునంతఁ దండ్రి పిలువఁ బుత్తెంచినఁ, బాసిపోయె సిద్ధపతిసుతుండు. ౧౯౨

గీ. అంత నక్కుమారుఁ డహిరాజు మది దూఱి, గరుడువలన నురగమరణములకు
మూల మయ్యె దాన నేలికతన మెద్ది, యేది పెద్దతన మదేటితగవు.[2] ౧౯౩

క. అకటా నాగేంద్రుఁడు స్రు, క్కక జిహ్వాలు రెండువేలు గలుగఁగ నొకనా
లుకనైనఁ దన్నుఁ దిని స, ర్పకులము రక్షింపు మనుచుఁ బలుకం దగదే ౧౯౪

సీ. అని కరుణాకరుండై యేఁగుచో నొక్క వృద్ధకామిని పుత్త్రు వెనుకఁ దగిలి
హాశంఖచూడ వంశాధార యోయన్న నీచిన్నిమో మెంటఁ జూచుదాన

1. నిర్భరహాని, 2. బ్రదుకు.

పక్షినాయకుబారిఁ బడఁద్రోచి యే నెట్లు నిలుతుఁ బ్రాణంబుతో నీవు సనఁగ
బంధువు లందఱుఁ బగఱ కొప్పించిరి యింకిట నీకు దిక్కెవ్వ రయ్య
యనుచుఁ బలవరింపఁ గనుఁగొని యది దాని, జననిఁగా నెఱింగి మనుపఁబూని
వీనిఁ గాచువాఁడ వెఱవకు మోయమ్మ, యనిన గరుఁడుఁ డనుచు నబల బెగడి.

క. పైచీరఁ గొడుకుఁ గప్పినఁ, జూచి యతం డేను వినతసుతుఁడం గానే
ఖేచరకులజుఁడ నీసుతుఁ, గాచెద బెగ డుడుగు నన్ను గరుడనికిత్తున్. ౧౯౬

వ. అనిన బెగ డుడిగి యప్పడఁతి యిమ్మాట యింక నొకమాటాడుఁ డనిన నతండు నవ్వి. ౧౯౭

క. నేలయు నుదకముఁ దేజము, గాలియు నాకసము నెఱుఁగఁ గాచితి నాకై
కో లిడె రెం డాడఁగ నా, నాలుక మాకులమువారి నాలుక లటులే? ౧౯౮

ఉ. మేరువు సంచలించిన సమీరుఁడు నిల్చిన భూమి గ్రుంగినం
దారక లెల్ల డుల్లిన సుధాకరుఁ డగ్నికణంబు లొల్కినన్
వారిధు లింకిన న్నభము వ్రాలిన భానుఁడు చల్లనైన నం
భోరుహసూతి దప్పినను బొంకుదునే మునుపాడి క్రమ్మఱన్. ౧౯౯

ఉ. నావుడు నాగకాంత కరుణాకర యోఖచరేంద్ర నాసుతుం
గావఁగఁ బూని వచ్చితివి కన్నతనూజునికంటె నీయెడన్
భావము సార్ద్రమైనయది పన్నగవైరికి నిన్ను నిచ్చి యే
త్రోవల నేఁగుదున్ బ్రదుకుత్రోవ విచారము లేదు నాకిఁకన్. ౨౦౦

గీ. అన్న నీకు నతిచిరాయువు గావుత, మన్న శంఖచూఁడుఁ డతనిఁ జూచి
కరముఁ జోద్యమంది కరములు మొగిడించి, విన్నఁదనము లేక విన్నవించె.

క. వసుధఁ గొఱగాని కపుఁబొ,లసులము పులుకాసిపుర్వులము[1] మాకై నీ
యసువులఁ బగఱకు నొసఁగుట, కసవునకై రత్న మమ్మఁ గడఁగుట గాదే.

శా. సంసారాటవిలోపలం గలవు మత్సామాన్యముల్ వ్యర్థముల్
హింసామూలము లైన జంతువు లసంఖ్యేయంబు లోఖేచరో
త్తంసా నీకెనయైనవారు గలరే ధర్మాధికుల్ వెంచలో
హంసానీకము లేదుగాక బకభేకౌఘంబు లేకుండునే. ౨౦౩

క. మావంటివారి నూర్వురఁ, గావఁగఁ జాలుదువు నీ వొకనిఁ గాచుటకున్
జీవం బిచ్చిన నార్తుల, కే వెరవున బ్రదుకవచ్చు నెడరైన యెడన్. ౨౦౪

1. కుటిలపరిచారులము.

క. మాకులమువారు విడిచిరి, నీ కీకృపసేయనేల నీచుట్టమనే
శోకమునఁ జావకుండఁగ, నీకాంతను మునలిఁ గావు మింతియ చాలున్. ౨౦౫

చ. అనవుడు ఖేచరేంద్రసుతుఁ డచ్చెరువంది ఫణీంద్రనందనా
విను మిది యేల నాపనికి విఘ్నము చేసెద వింతకాల మీ
వనమున నర్థి వేఁడమి దివానిశము ల్మదిఁ గుందుచుండు నేఁ
డనఘ పరోపకారసమయం బిటు గల్గిన నుబ్బి వచ్చితిన్. ౨౦౬

చ. తనయులు భార్య లన్నలును దమ్ములుఁ జుట్టలు సంగడీండ్రు యౌ
వనము ధనంబు నంచు మది వారక ప్రాణములైన నిచ్చి తా
ననదను నార్తు దీను శరణాగతుఁ[1] గావనివాఁ డజాగళ
స్తన మని యండ్రు వానికి యశంబును ధర్మము నెట్లు చేకుఱున్. ౨౦౭

ఉ. లావు భయార్తరక్షణము లాభము పుణ్యము దేహశుద్ధి స
ద్భావము భూషణం బెఱుక ధర్మము సత్కృప ప్రాభవంబు సం
భావన పాడి సత్యపరిపాలన మే లుపకార మెయ్యెడన్
భావన కీర్తి యాయువు శుభంబు నిజాప్తులు ధాత్రిలోపలన్.[2] ౨౦౮

క. జాణ "లనిత్యాని శరీ,రాణి" యనుచుఁ దెలిపి చెప్పరా[3] భువినాత్మ
ప్రాణంబు లిచ్చి యార్త, త్రాణం బొనరింపవలయు ధర్మజ్ఞులకున్[4]. ౨౦౯

గీ. నీవు లేవేని నొరులకుఁ గావవశమె, ధన్య నీవు బ్రదికిన నీతల్లి బ్రదుకు
నదియ కారణముగ వైరి కడ్డపడుదు, నీవు గోరిన యట్ల యీనెలఁతఁ గాతు.

గీ. అనుచు వధ్యచిహ్నమైన రక్తాంశుక, మడిగి మ్రొక్కినంత నతని నిల్పి
యేల ఖేచరేంద్ర యీదివ్యదేహంబుఁ, బాముకొఱకు విడువఁ బాడియపునె.

క. క్షోణీమండలమునఁ గల,ప్రాణుల కెడరైన నడ్డపడుచుఁ దదీయ
త్రాణం బొనరించుచు నీ,ప్రాణంబులతోడఁ గీర్తిఁ బడయందగదే. ౨౧౨

గీ. శంఖధవళ మైన శంఖపాలకులంబు, శంఖచూడు చేతఁ జాలఁ గందె
ననఁగ మీఁదఁ బుట్టు నపకీర్తి నాకది, చావు గాదె బ్రదుకుత్రోవ యేది. ౨౧౩

వ. కావున నన్ను మన్నించెదవేని నీ తెంపు మాని మరలు మని పునఃపునఃప్రణా
మంబు లాచరించి యాతని వేఁడికొని తల్లిం జూచి యోయమ్మ నెమ్మనంబున
బమ్మరింపకుము నాకెన్నిజన్మంబులనైన నీవ జననివి గ మ్మని మ్రొక్కి వీడుకొని
దేవతాప్రణామోన్ముఖుం డై చని యాపొంత. ౨౧౪

1. ననద ననాథు నార్తు శరణాగతు. 2. చా వపకీర్తి యశంబు నిజాప్తులు హీనజంతువుల్.
3. యుండరా. 4. తత్త్వజ్ఞులకున్.

క. గోకర్ణరాజకంకణు, గోకర్ణనివాసుఁ జాపగుణగోకర్ణున్
గోకర్ణశాయిమిత్త్రుని, గోకర్ణేశ్వరునిఁ జూచుకోరికి నేఁగెన్. ౨౧౫

సీ. అట ఖేచరాత్మజుఁ డార్తునిఁ గాచుట చేకూరు టెట్లని చింతనొంది
యర్ణవతీరగోకర్ణంబునకు వాఁడు చని వచ్చునంతకుఁ జనఁ దలఁచి
యత్తవా రిచ్చిన యరుణాంశుకంబులు వధ్యచిహ్నమునకు వలనుగాఁగఁ
బులకించి చని వధ్యశిలయెక్కిమదిఁ జొక్కి[1] గారుడాగమనంబుఁ గోరుచుండి
తల్లి కనకవతియుఁ దండ్రి ఖేచరపతి, కాంత మలయవతియె గాఁగ నాకు
నీపరోపకార మెల్లజన్మంబులఁ, గలుగ వలయునను మదిఁ దలఁచునపుడు. ౨౧౬

మ. గిరు లల్లాడఁగ న్నర్వుతేరు దొలఁగం గీర్ణంబులై మింటిపైఁ
దరువుల్ గ్రద్దలభంగి నాడఁగ సముద్రం బెల్ల ఘూర్ణిల్లఁగాఁ
హరిదంతంబులు పక్షకాంతి నవసంధ్యాలీలఁ గీలింపఁగా
గరుడుం డార్చుచు వచ్చె నచ్చటికి నాకారంబు ఘోరంబుగన్. ౨౧౭

ఉ. వచ్చి యతండు మస్తమున వ్రయ్యలు వారఁగఁ దన్ని ముక్కునన్
గ్రుచ్చి వియత్పథంబునకుఁ గొంచుఁ జనంగఁ గిరీటరత్నముల్
చెచ్చెర మాంసఖండముల చెల్వున భూమిఁ బడంగ నిచ్చలో
మెచ్చి కుమారకుండు ధృతిమేరువు మే లొనగూడె నా కనన్. ౨౧౮

ఉ. అంబరసీమనుండి మలయాద్రిశిలాస్థలి వ్రాలి యేకచి
త్తంబున మాంసఖండములు దర్పము గ్రమ్మఁగఁ ద్రెంచి మ్రింగఁగా
నంబరచారినందనుఁడు హర్షరసంబున మేను వొంగ వ
క్త్రాంబుజ ముల్లసిల్లఁ బులకాంకితుఁడై విహగేంద్రుఁ జూచినన్. ౨౧౯

వ. అంతఁ బక్షీంద్రుండు. ౨౨౦

ఉ. వేదన మేను స్రుక్క దరవిందముకాంతిఁ బోలుఁగ దాననం
బాదరణంబు నాయెడ మహాఘున మైనది యంతరంగ మా
మోదతరంగితంబు నిజమూర్తివిలాసము దివ్య మిట్టి కా
కోదరజాతి లేదు సుగుణోత్తమ యెవ్వఁడ వీవు నావుడున్. ౨౨౧

ఉ. ఎవ్వఁడ నైన నేమి[2] మది నిన్నివిచారము లేల నీకు నొం
డెవ్వఁడు భక్షణం బగు నహీశ్వరబంధువు[3] గాక యియ్యెడన్
మవ్వము దప్ప దంగలత మానవు గంటుల రక్తపూరముల్
గ్రొవ్విన మాంస మున్నయది కొమ్ము భుజింపు భుజంగమాంతకా. ౨౨౨

1. వడిఁబొంగి. 2. నైతి నేమి. 3. నహీంద్రులఁ దిందువు.

క. అనునెడ నాగోకర్ణేశునకుం బ్రణమిల్లి శంఖచూడుఁడు మఱియుం
జనుదెంచి వధ్యశిలమీఁద నవం బగు రక్తబిందుతతిఁ బొడఁగాంచెన్. ౨౨౩

గీ. కాంచి మున్నతండు వంచించి వచ్చుట, తెలిసి తన్నుఁ దాన తిట్టికొనుచుఁ
గులముఁ గావనైతి గురునాజ్ఞఁ దప్పితి, నన్ను డాఁచి యొకని మన్నిగొంటి.

గీ. ఇట్టి కష్టజీవ మేటికి నా కని, చాఁ గడంగి యచటి కేఁగుదెంచి[1]
ఖేచరేంద్రతనయుఁ జూచుచుఁ దలయూఁచి, భుజగవైరిఁ జూచి భుజగవరుఁడు.

మ. వినతానందన దీనరక్షణపరున్ విద్యాధరేంద్రాత్మజుం
డిన ధర్మం బగునే సహింపు మకటా దృష్టింపవే పాములం
దినవే యాఁచవి మున్నెఱుంగవె భవద్భీతాత్ముఁడౌ రాజువం
పున నే వచ్చితి నాగపుత్త్రుఁడ ననుం బోనీక భక్షింపుమా. ౨౨౬

వ. అనిన గరుడుండు పడియున్నయక్కుమారకుం జూచి నే నెఱుంగనైతి నీ కీదుష్క
రోద్యోగం బేల యనవుడు నతం డే మని చెప్పుడు నాయత్నం బంత యు
విఫలం బయ్యె. ౨౨౭

క. వికలము లగుప్రాణంబుల, నొకయుపకారంబు సేయనోపుదు నని కౌ
తుకమున నినుఁ గొలువఁగ వీఁ, డకటా యవసానవైరి యై చనుదెంచెన్.

చ. అనునెడ శంఖచూడుఁడు రయంబున డగ్గఱ వచ్చి యెత్తి యో
ఘనకరుణార్ద్రమానస యకారణబాంధవ సత్యసంధ యీ
వినతసుతుండు నీ వనువివేకము లేక యహీంద్రుఁ డంచు నీ
సునఁ దెగటార్చె నొక్కొ యనుచుం దను వంటఁగఁజేర్చి యేడ్వఁగన్. ౨౨౯

గీ. వధ్యచిహ్నమైనవసనంబుఁ జూచితి, నెఱుఁగనైతి నీతఁ డెవ్వఁ డనిన
వ్యోమచరవిభుండు జీమూతవాహనుం, డనుడు వెఱఁగుపడుచు నడలి గరుడి.

క. మందరతటమున హిమవ, త్కందరముల మలయసీమఁ గైలాసమునన్
బృందారకసుందరు లా,నందంబునఁ బాడు ఖచరనందనుఁ డితఁడే! ౨౩౧

క. కడుఁ బుణ్యుం డగు నీతని, మడియించిన శోకవహ్ని మడియుట కంటెన్
సుడిగొని జడనిధి నుడికెడు, బడబాగ్నిం బడుదుఁ గడిఁది పాపం బడఁగన్.

సీ. అనుడు నంతకమున్న తనయుకిరీటరత్నంబు కోడలియంకతలముమీఁదఁ
బడిన నాపడఁతుక పతిశేఖరం బని బెగడుచు ముందటం బెట్టె నంతఁ

---

1. పోఁ గడంగి యచటి కేఁగుదెంచి- చావఁదలఁచి యచటి క్రేవవచ్చి.

గాంతయుఁ దాను నిర్ఘాతపాతం బైన తరువుకైవడిఁ గూలి తడసి తెలిసి
ఫణిఫణామణి యని భావించి సుతునిదిగాఁ జూచి తన్మృతి గలుగు టెఱిఁగి
మూర్ఛనొందుచుశోకాగ్ని మునిఁగిమునిఁగి, యాలుఁగోడలుఁదనతోడనడలినడువ
మారుతప్రేరితం బగుపూఁబొమ్మ, భాతి నేతెంచె జీమూతకేతుఁ డటకు. ౨౩౩

వ. ఇట్లు చనుదెంచి యట గురుజనప్రాణభయాకులుం డై నెత్తుట జొత్తిల్లిన యురగ కుమారునిమీఁద నొరగిన కుమారుమ్రోల వ్రాలి. ౨౩౪

సీ. ఓయయ్య మీ బావయును నీవు నాడుచు నున్నార లని నమ్మి యుంటిఁగాక[1]
దవ్వేగనిత్తునే[2] తడసిన రానైతిఁ గులరత్న మా నిన్నుఁ గోలుపడితి
రాజ్యంబు విడిచి యరణ్యంబుఁ జేరియు నీసేవ సౌఖ్యంబు నెగడఁగంటి
సద్భక్తి సేయవే సరగున నోయన్న[3] చెడుగుఁబాముల కేల జీవమీయ
గరుడనఖముఖాగ్రఘాతంబునకుఁ జొరఁ, బూనె మెత్తనైన మేన దెట్లు
మాకు దిక్కుగలరె యోకరుణాకర, చీఁకుచేతికోల చిన్నికట్ట[4]. ౨౩౫

వ. అని పలవరించుచు మేనంటి చూచుచుండఁ గనకవతియుం గనుఁగవ నశ్రుపూరంబు తోరంబుగాఁ బెదవులు దడుపుచు మొగము వెలవెలం బుచ్చుచుఁ గోడలిం గూడి గోడాడుచు. ౨౩౬

సీ. ఓతండ్రి యందఱ నొక్క పెట్టునఁ జంపఁ గడఁగితి వొకపామఁ గావఁబూని
ధనకనకాదులు తనియ నిత్తురు గాక ప్రాణంబు లొసఁగెడు ప్రభుఁడు గలఁడె
తనతల్లికడుపు చల్లన చేసికొన నోపి శంఖచూడుఁడు నీకుఁ జావొనర్చెఁ
జీఁకుపట్టినకోల యీకుమారుం డని గరుడుని కేలొకో కరుణలేదు
దైవమేల యిట్లు దలఁచె నే నెట్లోర్తు, నేమిసేయుదాన నెందుఁ జొత్తుఁ
బాసి యేఁగఁ దగునె మూసినముత్తెమ, పంజరమ్ముచిలుక పసిఁడిబొమ్మ. ౨౩౭

క. మలయవతిమీఁది ప్రేమము, మలయించెనె దైవ మిట్లు మ మ్మెడచేసెం
బలుకొకటి బ్రాఁతి చిలుకల, కొలికి నాచందమామకూనా నీకున్. ౨౩౮

వ. అని విలాపింపంగఁ బ్రాణహానికి శంకించెద రని తన ప్రాణంబులు చిక్కఁబట్టి యుల్లన కనువిచ్చి జననీజనకులం జూచి. ౨౩౯

క. గురులార మీరు నాకై, పురపురఁ బొక్కంగవలదు భువి "ధర్మస్య
త్వరితాగతి" యను పలుకునఁ, బరహిత మొనరింపఁ గంటి బ్రదు కిది గాదే.

1. నున్నారటంచు నే నుంటిఁగాక. 2. ధర్మైకనిరత- 3. సద్భక్తిసేయ వేసరితివో యోయన్న. 4. చెఱుకుచేతికోల చిన్నికూన.

ఉ. అస్థిగృహంబు దేహము పురాశలఁ జిల్లులు వోవ స్రుక్కి రో
గస్థితిఁ జిక్కి చచ్చు టధికం బగుమోసము గాక, దానిలో
నస్థిర మైనప్రాణమున నగ్గువ[1] మిక్కిలిగా జగంబునన్
సుస్థిర మైనకీర్తిఁ గొన జూచిన లాభమునం గొఱంతయే. ౨౮౧

వ. కావున వగ పుడిగి నాగకుమారు నాకుమారునిగాఁ దలంచుకొనుం డని సాయాసకృతాంజలి యై యంత్యప్రణామం బొనరించిన సహసయానతుం డై వినతాసుతుం డోకుమారచంద్రా నాయజ్ఞాననిద్ర దొలఁగె నీధైర్యసాహసపరోపకారగుణంబులం బరిణమించితి నాకేమిహితం బానతి మ్మనిన. ౨౮౨

క. దయసేయుము పాములపై, భయభీతులఁ గావు ధర్మపథమునఁ జను ని
శ్చయ మిది దురితము దీనను, లయ మగు నుదకమునఁ బడ్డలవణముభంగిన్.

క. అని చెప్పి శంఖచూడా, వినుమా గురుజనులసేవ విడువకు మిఁక నీ
జనని కడు బెగడకుండఁగఁ, జనుమీ యని పలికి హృదయజలజములోనన్.

క. రుద్రునిఁ దలఁచుచు గీర్తిస, ముద్రుండు పరోపకారమున నలసిన యా
ముద్ర తన మేనఁ దోఁపఁగ, నిద్రించినకరణి దీర్ఘనిద్రం జెందెన్. ౨౮౫

వ. అంతం దత్సహచరీసహితు లయిన జననీజనకులు తమ యురోముఖశిరోఘాతహాహాకారమహారావంబులు మలయగహ్వరంబున నుపబృంహితంబులై దిక్కులు పిక్కటిల్ల బిట్టేడ్చుచు మూర్ఛిల్లుచు నుభయకృతోపచారంబులఁ దెలియుచు నలయుచుఁ బలవరించుచు. ౨౮౬

గీ. పురము ధనము రాజ్యభోగంబు విడిచియు, నన్నుఁ గలసి యిచట మాయనుజ్ఞ
నబలఁ గూడి పిదప నందఱఁ బాసి నేఁ, డొంటి నేఁగ నీకు నుచిత మగునె.

వ. అనవుడు ననుగమనోద్యోగ గావున మలయవతీకన్య ధైర్యం బవలంబించి.

క. ప్రాణము కొఱకై యితరుల, ప్రాణము దినుచుండు వాని ప్రాణము గావం
బ్రాణం బెడఁబాసిన నా, ప్రాణేశుం డిపుడు మనలఁ బాయుట యరుదే. ౨౮౯

క. మనకుండుట యిట్లెఱిఁగియు, మన కుండుట తగునె యితనిమార్గంబున నా
మనమరిగెడు గతిఁ దడయక, మన మరిగెడు తెఱఁగుఁ గనుఁడు మఱి వగ వేలా.

గీ. అనిన శంఖచూడుఁ డందఱిచావుల, కేను మూల మైతి నితనివెంట
నరుగువాఁడ ననిన నాదికారణ మేన, మున్ను సత్తు ననియెఁ బన్నగారి. ౨౯౧

1. అన్నువ, ఆస్థ్యత.

గీ. నావుడు మీ కిందఱకుం[1], జావం బనిలేదు సుతునిజాడనె యేఁగం
గావలయుం జెలి వేగమె, కావింపుము శంఖచూడ కడుఁ బుణ్యా మగుణ్.

గీ. అనుచు నభముఁ జూచి యమరవర్గములార, ఘనపరోపకారమునకు మెచ్చి
యమృత మైనఁ జల్లి యన్నప్రాణంబులు, గావరయ్య మమ్ముఁ బ్రోవరయ్య.

వ. అని జననీజనకులు(క్రమంబున) వేఁడినఁ దజ్జననోపాయం బెఱింగి విహగేంద్రుం డింద్రుం బ్రార్థించి యమృతంబుం దెచ్చి యిచ్చుట విపన్నంబు లగుపన్నగంబుల తోడ నిప్పన్నగకుమారరక్షకుం గాచెద నని పూని. ౨౫౪

ఉ. పోయుదుఁ బ్రాణము ల్లగుడఁ బూనిక దప్పిన మేరు వబ్ధిలోఁ
ద్రోయుదు నెల్లదేవతలఁ దోలుదు నాకముఁ బట్టి పాడుగాఁ
జేయుదు నష్టదిక్పతులఁ జెండుదు మేదినిఁ గ్రింద మీఁదుగా
వ్రేయుదు వీనిపై నమృతవృష్టి వడిం గురియింతు నింతటన్. ౨౫౫

క. అని గరుడుఁ డెగసి యేఁగినఁ, దనయునిదెసఁ జూడలేమిఁ దడయక ఫణినం
దనుచేత ఖచరసతి చం,దనచితు లొనరించు కొనియెఁ దత్పార్శ్వమునన్.

వ. అంత నత్యంతసతీమండనంబులు గైగొని మలయవతి పతిచితికిం బ్రదక్షిణంబుగాఁ దిరుగుచు గౌరి నుద్దేశించి. ౨౫౭

క. ఓయంబిక యుత్తముఁ డధి,కాయువు విద్యాధరేంద్రుఁ డగుఁ బతి యనుచు
న్నాయుద్యోగం బుడిపితి, నీయానతి దప్పె నింక ని న్నేమందున్. ౨౫౮

క. అని దూఱఁగ ముందఱఁ గాం,చనలతగతి మెఱుఁగుదీఁగ చాడ్పునఁ గాత్యా
యని వచ్చి పుత్త్రి నిలునిలు, మని తత్పతిమీఁదఁ జేతి నమృతము చల్లెన్.

క. చల్లిన సంజీవితుఁ డై, యల్లన సుఖనిద్ర దెలి యునను వున నతఁ డు
త్ఫుల్లముఖుం డై గజముఖు,తల్లికిఁ బ్రణమిల్లెఁ దల్లిదండ్రులుఁ దానున్. ౨౬౧

క. మగలను మగఁ డగుమునిం, దెగఁ జూచిన శివునిదిక్కు దృక్కుల నిడి యా
మగతనము సగముచేసిన, మగువా మాపాలఁ గలిగి మన్నించితివే. ౨౬౨

వ. అని యందఱు నానంద బున వందనం బొనర్ప మలయవతి కృతాంజలి యై.

క. గరళము మ్రింగినపతికి, న్మరణముఁ దప్పించి మెఱయు మంగళసూత్రా
భరణము గలదేవత వని, పరిచర్య యొనర్చి వట్టిఫల మిటఁ గంటిన్. ౨౬౩

క. అని మ్రొక్కఁగ దివిఁ దూర్య, ధ్వను లొలయఁగ సకలదేవతలుఁ గొనియాడ
న్నివతానందనుకతమున, ననిమిషకుసుమములతోడ నమృతము గురిసెన్.

(1) కిద్దఱకుఁ.

క. ఆయమృతంబున నస్థిని,కాయము సప్రాణ మైనకాయంబుల న
త్త్యాయతఫణమణిరుచి సము,దాయము మెఱుఁగిడఁగ నెగసె దర్వీకరముల్.

క. చెలులుం జుట్టలుఁ గలయం, జెలరేఁగి సుధాంబుపూర్తి చెలువునఁ బాముల్
చెలఁగుచు మలయాచలమున, సెలయేఱులభంగి జలధిఁ జేరఁగఁ బాఱెన్.

గీ. అంత నమరసిద్ధయక్షగంధర్వులు, గొలువ గగనతటిని జలకమార్చి
సిరులు మిగుల గౌరి జీమూతవాహను, ఖచరచక్రవర్తిగా నొనర్చె. ౧౬౭

వ. అట్టియెడ నత్యంతసంతుష్టాంతరంగుం డై గరుత్మంతుండు చనుదెంచి నీకెద్దియి
ష్టంబు వేఁడు మనిన నక్కుమారుండు దురగహరణంబు విడిగి దృఢప్రతిజ్ఞుండవుగ న్మిం
తియ చాలు నీప్రసాదంబున నాకేమియుం గొఱంత లేదు. ౧౬౮

క. అనదలఁ గాచితి నాగుల,జనముల ప్రాణములు నిలిచె సర్వేశ్వరిమ
న్నన గలిగె నీవు మెచ్చితి, విను రాజ్యం బబ్బె నేమి వేఁడెద నింకన్. ౧౬౯

చ. అని వినయోక్తిఁ బల్కి జగదంబికఁ గ్రమ్మఱఁ బ్రస్తుతించి య
జ్జననికి మ్రొక్కి యిష్టజనసంగతుఁ డై చని తొల్లి యున్నకాం
చనపురిఁ జొచ్చి రాజ్యసుఖసంపదఁ దేలుచు నేలుచుండె న
వ్వనితయుఁ దాను నాత్మగురువందననందితచిత్తవృత్తి యై. ౧౭౦

వ. కావున నట్టిపరోపకారశూరుం డెవ్వఁడు గలఁడు. ౧౭౧

గీ. వింటి మతనిఁ దొల్లి కంటి మీతని నేఁడు, విందు మిప్పు డొక్కవిక్రమార్కు
ననిన నతనివనిత దనుజేంద్ర విక్రమా,దిత్యుఁ డీతఁ డొక్కొ తెలియు మనియె.

వ. నావుడు నారక్కసుం డోనరోత్తమ నీ వడిగినవరం బిచ్చితిఁ బుణ్యపురుషుండవు
బొంకకు నీ వెవ్వండ వనిన నవ్వసుమతీవల్లభుండు పూర్వదేవుండవు నీ వెఱుం
గవే విక్రమార్కుండ నగుదు నా చరిత్రంబు జను లెఱుంగకుండఁ గృప చేసెదౌం
తుండవు గ మ్మని మ్రొక్కి తదనుజ్ఞాతుం డై యజ్ఞాతభావంబున మగిడి నిజపు
రంబగు నుజ్జయినీపురంబునకుం జనుదెంచె గావున. ౧౭౩

క. ఇట్టిగుణంబులు నీ కే,పట్టున సమకూరకుండఁ బార్థివ చను మి
ట్టట్టును బొరలకు మనవుడు, దిట్టతనం బుడిగి వసుమతీపతి మగిడెన్. ౧౭౪

—: పంద్రెండవబొమ్మకథ :—

వ. మఱియుం గొన్నిదినంబు లరిగిన. ౧౭౫

క. కంబూపమగళు మృగమద,జంబాలీకృతమహావిషద్యుతిసదృశ
స్తంబేరమచర్మాంబరు, లంబోదరగురుఁ గృపావలంబునిఁ గొలుతున్. ౧౭౬

చ. అని మదిలోఁ దలంచుచు ధరాధిపుఁ డిష్ట జనోపదిష్టమా
దినమున నెక్కఁ బూని యడుగిడఁగ నచ్చటిబొమ్మ చూచి యో
జనవర విక్రమార్కుగతి సాహసదానగుణంబు లేక నీ
కెనయఁగ దేవతాసనము నెక్కఁగవచ్చునె[1] నిల్వు నావుడున్. ౨౭౭

క. అతనికడ నట్టిసాహస, వితరణగుణ మెట్లు చెల్లె వినిపింపు మనం
బతిగుణములు పండ్రెండన, ప్రతిమ యెఱిఁగింప భోజపతి కిట్లనియెన్. ౨౭౮

మ. విను మావిక్రమభూషణుండు విమలోర్వీనాథసంతోషిత
జ్ఞనసంపన్నజయాభిరాముఁడు సదాచారప్రచారోచితా
త్మనయప్రాభవధర్మనందనుఁడు విద్వత్పాలనాకేళిసం
జనితానందుఁడు సాగరాంతముగ నీక్ష్మామండలం బేలఁగన్. ౨౭౯

గీ. అతనిపీట నర్థపతి కెనయగు భద్ర, సేనుఁ డనఁగ నొక్కసెట్టి గలఁడు
వాని కొడుకుఁడు గలిగె దానసుందరుఁడు పు,రందరుం డనంగ నందనుండు.

క. ఆకోమటి కడపటఁ బర,లోకమునకుఁ జనిన నర్థలోభ ముడిగి సు
శ్లోకుండు పురందరుఁ డీ,లోకము గొనియాడ దానలోలుం డయ్యెన్.[2]

క. అతని దగువ్యయముఁ గనుఁగొని, హితు లందఱు వచ్చి బుద్ధి యిది గాదుచిత
స్థితినడుపు మహోదార్యో, న్నతి దారిద్ర్యంబు వచ్చు నరపతి కైనన్.[3]

గీ. ధనము గలుగువాఁడెధన్యుండుమాన్యుండు, ధనముగలుగువాఁడెఘనుఁడుజగతి
ధనము గలుగువాఁడెతగవులకాధ్యుండు,ధనముగలుగువాఁడె మనుజవిభుఁడు.

గీ. ధనము గలిగె నేని ధర్మార్థకామమో, క్షముల నచట నచట జరుపవచ్చు
ధనముగలుగువేళ జను లెల్లఁ దమవారు, ధనము లేనివానిమనికి చావు.

మ. అని చెప్ప న్విని యప్పురందరుఁడు గర్వాక్రాంతుఁడై నవ్వి యి
ట్లనియెన్ దానము భోగముం దగవుఁ జేయం బాడి గాదేని యా
ధన మేలా మఱి లాభ మేల సుఖికిన్ దారిద్ర్యమే మేలు నాఁ
జనదే మర్త్యుఁడు మంటిపాలయిన నేసౌఖ్యంబు భోగించెడున్. ౨౮౫

క. మును దనకుం గానున్నది, పనివడి యగు నారికేళఫలరసముక్రియం
జనమున్నది చనుఁ గరిగ్ర, స్తున మ్రింగిన వెలఁగపండుగుంజును బోలెన్. ౨౮౬

---

1. యెత్తున నమరాసనంబు వెసఁ ద్రొక్కఁగ వచ్చునె. 2. క. ఆకాశసాగరాంతర... శ్లోకుఁడు పురందరుండీ, లోకము గొనియాడ దానలోలుం డయ్యెన్. 3. సమున్నతి ధనవ జ్జొప్పడు హీనత దారిద్ర్యమునవచ్చు.

క. తోడఁ గట్టఁ బూయఁ బెట్టం, గుడువం జెప్పనేరు గాక గొనకొని గడియుం
జెడియెడి బ్రదుకున కిడుమం, బొడివోసికొనంగఁ జెప్ప బుధులుం గలరే.[1]

చ. అనుచు ననాదరంబున నిజాప్తుల దూఱి యుదారబుద్ధిఁ జ
దనమ్ము నుపుష్పవస్త్రవనితాపరిభోగవిషక్తచిత్తుఁ డై
యనుదినముఁ ధనంబుఁ గలయ న్వెదచల్లుచు నొయ్యనొయ్య ని
ర్ధనదశ నొంది వంది యనుతాపము నంమఁ గంది కుందుచున్. ౨౮౮

క. మునిసిఁయూరనె కడపటఁ, దిరియుట యని సమ్మ టనుచు ధృతిమాలి పురం
దరుఁ డొకనెపమున దేశాం,తర మరిగెన్ మిత్రు లెల్లఁ దను నవ్వంగన్.

వ. ఇట్లరిగి. ౨౯౦

ఉ. అక్కడ నక్కడం గల నయంబుఁ బ్రియంబు సువస్తుజాతముం
జక్కనికాంతల న్రతిరసజ్ఞలఁ జూచుచు నాదరంబుతో
నొక్కొకయూరఁ గన్నయనోత్సవలీలల నిచ్చ మెచ్చుచుం
బెక్కుదినంబు లుండెఁ దనపేరు నిజాప్తు లెఱుంగకుండఁగన్. ౨౯౧

క. ఒకనాఁడు మధురలోపల, నొకచోద్యం బెఱిఁగి మగిడి యుజ్జయినీభ
ర్తకు విన్నవింతు నని[2] యిం,చుక రవణముతోడ వచ్చెఁ జుట్టలు పొగడన్.

ఉ. వచ్చినవానిఁ జూచి జనవల్లభుఁ డీవు చరించు భూమిలో
నచ్చెరు వేమి గంటి వని యానతి యిచ్చిన నప్పురందరుం
డిచ్చకు వచ్చున ట్లడిగె నీధరణీవరుఁ డంచు నాత్మలో
మెచ్చుచు విన్నవించెఁ బతిమె చ్చొచ్చెఁగూడ యథాక్రమంబునన్. ౨౯3

సీ. ఈపురి వెడలి యే నెల్లతీర్థంబులుఁ దిరుగుచుఁ గేదారధరణి కేఁగి
మగిడి వచ్చుచు హేమమణిమయప్రాకారరమ్యమౌ మధురాపురంబుఁ జూచి
చని యొప్పిదం బెల్లఁ గనుఁగొని రే యొక్క ద్విజునింటిపొంత నిద్రించునప్పు
డనద ననాథ నిరాధారఁ గావరే యనుచు వీతెంచె నార్తారవంబు[3]
దాని కుళ్లి మిగుల దయ గల్గియును లావు, లేమి యేమియు ననలేక యుండి
రేపకడన లేచి యాపురజనుల న, య్యబలవార్త దెలియ నడిగి వింటి. ౨౯౪

వ. ఎట్లనిన. ౨౯౫

క. చెల్వొనరెడు పురి చేరువ, బిల్వవనాంతమున రేయి భీమాకృతితో
నిల్వలనిభుఁ డొకదనుజుఁడు, చెల్వం బెనుకశల మొత్తి చెండుచు నుండున్.

---

1. బుద్ధులు గలవే. 2. వినిపించెదనని 3. మహార్తరవము- చి. నూ.

క. ఆపొలఁతుక శేయెల్లను, నాపోవుచునుండ నసుర వాటెంపంగా
నోపరు పరు లెవ్వరుఁ బృథ్వీపాలక యేను విన్న తెఱఁ గిది చుమ్మీ.[1] ౨౯౮

ఉ. నావుడుఁ జోద్యమంది నరనాథుఁ డనాథఁ గృశాంగి నంగనం
గావఁ గడంగి హస్తమున ఖడ్గము తోడుగ నెట్టిఁ గూడి యా
త్రోవన యేఁగి దూరగతి దోఁపఁగ నల్లన నొక్క నాఁడు ల
క్ష్మివిభవాఢ్య పూర్ మధురఁ జేరె నినుం డపరాద్రిఁ జేరఁగన్. ౨౯౯

క. మలయుచు నెయ్యెడఁ గలయుం, దెలివిపడ న్వెలిఁగి భువనదీపము చనినన్
మలినాకృతితోఁ గాటుక, మలక[2] క్రియ న్నభము తిమిరమయ మై పొలిచెన్.

గీ. అప్పు డధిపుఁ డాపురాంతికవనభూమి, యమున పగిదినున్న తమముఁ జూచి
వైశ్యతనయ వెఱవ వల దని తెలుపుచు, నచట నసురరాక యరయుచుండె.

గీ. వాలుఁగంటిమొత్తు వాలాయ మగునాన,వాలుగాఁగఁ జీకువాలు సొచ్చి
వాలుపెఱికికొనుచు వాలుమగం డేఁగె, వాలు దైత్యునుకుటి వ్రాలు దుడువ.

క. ఈరీతిఁ గాచియుండఁగ, నారాక్షసుఁ డంత నంగనామణి మొత్తం
గా రావము వినవచ్చిన, నారాజును నాలకించి యతిరభసమునన్. ౩౦౨

క. వెఱవకు వెఱవకు తరుణీ, మొఱ యాలించితి[3] నృపాలముఖ్యఁడ నీకై
పఱతెంచితిఁ బరిపరిగాఁ, గఱకు టసురఁజెండివైతుఁ[4] గాచెదనిన్నున్. ౩౦౩

వ. అని. ౩౦౪

శా. ఓరీరాక్షస వట్టిగర్వమున నీ వుప్పొంగి దీనానన
న్నారీరత్నము నేల నొంచె దిటు లన్యాయంబు గావింతువే
యేరా చెప్పఁగనైన మున్నెఱుఁగవే యే విక్రమార్కుండ నీ
క్రూరత్వంబును దర్పము న్బలిమియు న్రూపార్చెద న్నిల్వుమా. ౩౦౫

క. అనవుడు రోషంబున ని, ట్లను మాయాబలసమగ్రుఁ డగుదుందుభికి
న్ననుమఁడ నోరి నరాధమ, ఘనభుజదర్పుఁడఁ గఠోరకరుఁడం జుమ్మీ. ౩౦౬

క. ఆలమునఁ బంద[5]పగతుఱ, నాలం బొనరించినట్టు లాండెద విటు నా
పాలం బడితివి[6] నేఁడు నృపాలాధమ నిన్ను భూతబలి గావింతున్. ౩౦౭

క. నీకొలఁదివారియెముకలు, నాకోఱలసందిఁ జిక్కె నలుతునునీవే
లోకము సొచ్చిననైననుఁ, బోకార్చెద నిన్నుఁ బదరి[7] పోవక నిలుమా. ౩౦౮

---

1. బృథ్వీపాలక దీనికతము దేవర యెఱుఁగున్. 2. కాటుకమలక = మసిమూఁకుడు. 3. మొఱగకు వచ్చితి. 4. టసురనిపుడె చెండి, 5. ఆలమునఁబడిన, 6. నావాలునఁబడితివి. 7. బెదరి.

వ. అనిన వీరరసభీషణంబు లగుభాషణంబుల విక్రమభూషణుండును దోర్దండమం
డితారాతిరాజమండలదండితప్రచండభుజాగ్రమండనాయమాన మండలాగ్రధ
రుం డగుడు నద్దండిమగ లొండొరులం దలపడి. ౩౦౯

క. మదకరులకరణి సింగపుఁగొదమల క్రియఁ బులులభంగి గురుపోతుల ప్ర
ల్లదముల[1] శరభంబులగతిఁ, గడిసిరి కదనమున కవని గ్రక్కదలంగన్. ౩౧౦

ఉ. బంధురవిక్రమస్ఫురితబాహులు దైత్యుఁడుఁ బార్థివుండుఁ గ్రో
ధాంధత మీఱి పోరిరి దశాననుఁడు న్రఘునాయకుండు న
య్యంధకుఁడున్ హరుండు నరకాసురుఁడు న్నలినాక్షుఁడు న్జరా
సంధుఁడు వాయుసూనుఁడును జంభుఁడు నింద్రుఁడుఁ బోరుకైవడిన్. ౩౧౧

వ. ఇట్లు పోరునెడఁ బ్రభాతం బైనఁ దత్కాలోచితంబుగ. ౩౧౨

క. క్రందఱి తనతేజమునఁ[2] బురందరుదెసఁ దెలివిగలుగ రాత్రించరునిన్
మ్రందించె విక్రమార్కుఁడు, సుందరి ముఖపంకజమున సొంపు నటింపన్.

గీ. మండలేశ్వరుండు మండలాగ్రంబున, దండి మిగులఁ గలిగి దండిదైత్యుఁ
జెండి పాఱవైచి చండాంశువిధమున, నుండెఁ గండ లుర్విఁ గుండుకొనఁగ.[3]

గీ. దిశలఁ దెలివి గలిగె దివ్యతూర్యంబులు, చెలఁగె నారదుండు మలసి యాడె
నాకసమున నిల్చి యమరవర్గము జన,విభుని మీఁదఁ బుష్పవృష్టి గురిసె.

గీ. నృపుఁడు సంతసిల్లి నీరజాననఁ జూచి, పడఁతి యిట్లు కొల్లఁబడఁగ నీకు
నేమికతము దీని నెఱిఁగింపవచ్చునేఁ, జెప్పు మనిన వినతి చేసి పలికె. ౩౧౬

గీ. వసుమతీరమణ యవంతిదేశంబులో, ధర్మశర్మ యనఁగఁ దగినవిప్రు
భార్యఁ గాంతిమతి నకార్యంబు గావించి, కులముచెఱిచి మిగులఁగుఱుచనైతి.[4]

ఉ. భవ్యుఁడు ధర్మశర్మ తనబాంధవవర్గము చెప్పఁగా మదీ
యవ్యభిచార మట్లెఱిఁగి యాత్మఁ గలంగియు, నింతి దా నహం
తవ్య[5] యటంచుఁ దెం పుడిగి దానవుచేతికశాహతి న్శరీ
రవ్యథఁ గుందుచుండు బహురాత్రులు నీ వని శాప మిచ్చినన్. ౩౧౮

క. వడవడ వడఁకుచు మానము, సడలఁగ ధరఁ జాఁగి మ్రొక్కి శాపావధి యె
న్నఁడు నాకుఁ గలుగు ననుచుం, దడవోర్వమి విన్నవింప దయతో నతఁడున్.

క. అసహాయశూరుఁ డగునొక,వసుధాపతి వచ్చి రేలు వగఁబెట్టెడున
య్యసురఁ బోరిగొన్నయప్పుడ, వెస నీశాపమునకెల్లవీడ్కో లనియెన్.[6] ౩౨౦

శా. ఆశాపంబున వీనిబాఱిఁ బడి దేహం బెల్ల మ్రందంగ న
య్యాశాబంధము పెర్మిఁ బ్రాణములఁ బాయంజాల కే నుండఁగా

---

1. బెట్టిదమున. 2 కెందలిరుతేజమునను. 3. మెండుకొనఁగ. 4. కులముచెడితి మిగులఁ గుటిలనైతి. 5. కామినీనహంతవ్య- 6. వెసనీపాపమున కదియెవీడ్కోలరయన్.

నీ శస్త్రప్రభ నాతమం బడఁపి మన్నించెం గృపం జూడు భూ
మీశాధీశ్వర! నీకు మే లొకటి యే నిచ్చోటఁ గావించెదన్. ౩౨౧

సీ. ఇక్కడి గుడితూర్పు దిక్కునఁ బక్కి చె[1]ట్టున్నది దానికి నుత్తరమునఁ
[2]బరువేఁడు దవ్వున బరివెంక పఱమటి నెలవునఁ దొమ్మిది నిధులమీఁది
దనుజుఁడు దాఁచిన ధనము పెక్కున్నది కైకొమ్ము నామీఁదఁ గరుణసేయు
చని యెద నని మ్రొక్కి వనిత యేఁగిన రాజు వెఱఁగంది యిక్కువ వెదకి కాంచి
దీనుఁ డైనభద్రసేనతనూజున, కిచ్చి వేడ్క మగిడి వచ్చెఁ బురికి
నిట్టిగుణము లేక యిది యెక్కనచ్చునే, పొమ్ము చాలు నింక భోజరాజ. ౩౨౨

క. అనవుడు నంతకు నంతకు, విన నింపగు నతని తెంపు విని సభ యెల్లన్
మన మలరఁగ నవనూతం,బుగు[3] సిగ్గును ముడివడంగ భోజుఁడు మగిడెన్.

ఉ. అక్షీణప్రతిపక్షభావసముదగ్రాటోపజాగ్రన్మనో
రక్షోనాయకపక్షతక్షణవిహారక్షిప్రకాంక్షేయకుం
గుక్షిన్యస్తసమస్తలోకభరణక్షుణ్ణాక్షయాత్మావృతి
ప్రక్షేపోచితు వాహనీకృతమహాపక్షీశు లక్ష్మీశునిన్. ౩౨౩

శా. ఉల్లాసోద్ధతచండతాండవవిహారోత్తుంగరంగజ్జటా
వల్లీమండలమల్లికాకుసుమభావప్రాప్తబాలేందుసం
ఫుల్లేందీవరరేణుసంగకబళీభూతాభ్రకూలంకషా
కల్లోలోపరిబింబమౌక్తికమయూకల్పోత్తమాంగున్ శివున్. ౩౨౪

మాలిని. ధరణిధరవిభూషా ధర్మనిర్మాణతోషా
సరసిజభవసేవ్యా సంతతాత్మీయభావ్యా
నిరుపమనిజలీలా నిత్యకల్యాణశీలా
పురహరహరిరూపా భుక్తిముక్తిస్వరూపా. ౩౨౫

గద్యము. ఇది రాయగజగంధవారణ వైరిమండలికభేకఫణీంద్ర వీరఘోట్టవిభాళా
దిబిరుదప్రకటచారిత్ర కళింగదేశనిర్ధూమధామ త్యాగనాగార్జున కర్ణాటద్రవి
ళాంధ్రమహారాష్ట్రభూపాలరూపనూపురసుందరచరణారవింద సనదప్రోలిపుర
వరాధీశ్వర వెలనాటి పృథ్వీశ్వరరాజ్యసముద్ధరణ శ్రీకొఱవి వెన్నయామా
త్యపుత్ర హారితసగోత్రపవిత్ర సకలసుకవిమిత్ర కసవరాజతనూజ గోపరాజ
విరచితం బైనసింహాసనద్వాత్రింశిక యనుకావ్యంబునందు విక్రమార్కు మహా
దార్యంబును జీమూతవాహనోపాఖ్యానంబును సాహసాంకునిసాహసౌదార్యం
బులును నన్నది పంచమాశ్వాసము.

ప్రథమభాగము సంపూర్ణము.

---

1. పరికెచెట్టు- (బరివెంకయుఁ బక్కి నామాంతరము. పరికె వృక్షవిశేషము.) 2. పరువుదవ్వున- 3. నవురాగంబును.

# ఆంధ్రసాహిత్యపరిషత్తు—ప్రతిష్ఠాపకులు.

శ్రీరాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారావుబహద్దరువారు, పిఠాపురము మహారాజా వారు. పరిషద్వ్యవస్థాపాధ్యక్షులు.

కీ. శే. శ్రీ వేంకటగిరి మహారాజావారు.

## ఉద్ధారకులు.

శ్రీరాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు- ఉయ్యూరు జమీందారువారు.

కీ శే. శ్రీబొబ్బిలి మహారాజావారు.

## ఆంధ్రసాహిత్యపరిషత్కార్యనిర్వాహకవర్గము
## కార్యనిర్వాహకసభాధ్యక్షులు.

జయంతి రామయ్యపంతులుగారు బి. ఏ., బి. ఎల్.

## కార్యదర్శులు.

కిళాంబి రాఘవాచార్యులుగారు ఎం. ఏ., బి. ఎల్.

వింజమూరి వెంకన్నపంతులుగారు ఎం. ఏ.

## కార్యనిర్వాహకసభాసభ్యులు.

దివాన్ బహదర్ కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తి నాయఁడుగారు, (కోశాధ్యక్షులు.)

పెద్దాడ రామస్వామిగారు, ఎం. ఏ. ,,

చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు.

కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు.

శ్రీమాన్ గొడవర్తి జగన్నాథస్వామిగారు, ఎం. ఏ., ఎల్. టి.

దర్భా వేంకటశివరామరాజుగారు, బి. ఏ., బి. యల్.

అళక్కి వేంకటరామయ్యగారు.

కేశవరపు కామరాజుగారు.

కోకా వేంకటసుబ్బారావునాయఁడుగారు.

ఓలేటి వేంకటరామశాస్త్రిగారు, శతావధాని.

పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులుగారు.

పిళ్ళారిసెట్టి రంగబ్రహ్మరావునాయఁడుగారు.

| | | | |
|---|---|---|---|
| 1 విప్రనారాయణచరిత్రము-చదలువాడ మల్లయ్యకవి | రు | 0 | 8 |
| 2 జైమినిభారతము-వచనము-వేంకటకృష్ణప్పనాయకుఁడు | ... | 0 | 12 |
| 3 కవిజనాశ్రయము-వేములవాడ భీమకవి | ... | 0 | 10 |
| 4 చంపూరామాయణము-ఋగ్వేదికవి వేంకటాచలపతికవి | ... | 1 | 0 |
| 5 నీతిసీసపద్యశతకము-తాళ్ళపాక పెదతిరుమలార్యుఁడు | ... | 0 | 2 |
| 6 యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనము-జ. రామయ్యపంతులుగారు | ... | 0 | 8 |
| 7 జ్యోతిశ్శాస్త్రసారము- కపిస్థళం కృష్ణమాచార్యులుగారు | ... | 0 | 8 |
| 8 జ్ఞానప్రసూనాంబికాశతకము-శిష్టు సర్వశాస్త్రికవి | ... | 0 | 2 |
| 9 సర్వేశ్వరశతకము-యథావాక్కుల అన్నమయ్యగారు | ... | 0 | 3 |
| 10 కావ్యాలంకారచూడామణి-విన్నకోట పెద్దయకవి | ... | 0 | 8 |
| 11 అకారాద్యముద్రిత గ్రంథసూచిక | ... | 0 | 8 |
| 12 ప్రాకృతభాషోత్పత్తి-శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు | ... | 0 | 12 |
| 13 శివతత్త్వసారము-మల్లికార్జునపండితారాధ్యులు | ... | 0 | 12 |
| 14 చంద్రభానుచరిత్రము-తరిగొప్పుల మల్లన్నకవి | ... | 1 | 0 |
| 15 శివరాత్రిమాహాత్మ్యము-శ్రీనాథమహాకవి | ... | 0 | 12 |
| 16 ఆర్యభాషావిభాగము-శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు | ... | 0 | 8 |
| 17 హ్రస్వరంగములు-కొత్తపల్లి సూర్యరావుగారు | ... | 0 | 8 |
| 18 నారసింహపురాణము-ఉత్తరభాగము-హరిభట్టు | ... | 1 | 0 |
| 19 మన్నారుదాసవిలాసనాటకము-రంగాజమ్మ | ... | 0 | 8 |
| 20-21 కాళిందీకన్యాపరిణయము (రెండుభాగములు) అహోబలపతి | ... | 1 | 4 |
| 22 రెడ్డినాటి రెండుశాసనములు | ... | 0 | 4 |
| 23 ఆంధ్రధాతుమాల-చిన్నయసూరి | ... | 0 | 12 |
| 24 శాసనపద్యమంజరి | ... | 0 | 12 |
| 25 శతకసముచ్చయము (ప్రథమభాగము) | ... | 0 | 12 |
| 26 పరిషత్పుస్తకభాండాగారము. (ద్వితీయభాగము) | ... | 0 | 8 |
| 27 సూత్రాంధ్రవ్యాకరణములు-చిన్నయ్యసూరి | ... | 0 | 8 |
| 28 రసాభరణము-అనంతకవి. | ... | 0 | 8 |
| 29 ఆంధ్రశబ్దచింతామణి-బాలసరస్వతీకృతాంధ్రటీకోపేతము | ... | 0 | 8 |
| 30 షోడశకుమారచరిత్రము-వెన్నెలకంటి అన్నయ్య | ... | 0 | 8 |
| 31 హంససందేశము-కల్లూరి వేంకటరామశాస్త్రిగారు | ... | 0 | 2 |
| 32 శతకసముచ్చయము (ద్వితీయభాగము) | ... | 0 | 10 |
| 33 రాయవాచకము | ... | 0 | 8 |
| 34 సింహాసనద్వాత్రింశిక-ద్వితీయభాగము-గోపరాజకవి | ... | 0 | 12 |
| 35 నిఘంటుచరిత్రము-శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు | ... | 0 | 4 |
| 36 ఆంధ్రకౌముది-గణపవరపు వేంకటపతికవి | ... | 0 | 8 |
| 37 బాలభారతము-(అగస్త్యకృతమునకుఁ దెనుఁగు) క్రొత్తపల్లి సూర్యరావుగారు | ... | 0 | 12 |
| ౧ Dravidian Lexicography జయంతి రామయ్యపంతులుగారు | ... | 0 | 4 |
| ౨ Defence of Literary Telugu జయంతి రామయ్యపంతులుగారు | ... | 0 | 8 |
| 3 చాటుధారాచమత్కారసారః-(సంస్కృతము) | ... | 0 | 8 |
| ౪ ఉత్తరరామచరిత్రము-జయంతి రామయ్యపంతులుగారు | ... | 1 | 0 |
| ౫ అమరుకము-సాంధ్రము-జయంతి రామయ్యపంతులుగారు | ... | 1 | 0 |

శ్రీ

# ఆంధ్రసాహిత్య
# పరిషత్పత్రిక.

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

**(Journal of the Telugu Academy.)**

| | | |
|---|---|---|
| సంపుటము. ౨౪ | యువనామసంవత్సరము. మాఘఫాల్గునమాసములు. | సంచిక ౬. |




కాకినాడ:

క్రొత్తపల్లి సూర్యరావుచే బరిషత్కార్యాలయమునఁ

బ్రకటింపఁబడినది.

చందా, పోష్టువ్యయములతో సంవత్సరమునకు రు. 3-౦-౦.

విడిసంచిక రు ౦-౮-౦.

1936 ఫిబ్రవరి, మార్చి మాసములు.

# విషయసూచిక.

# ఆంధ్రసాహిత్య
# పరిషత్పత్త్రిక.

కాకినాడ.

రెండునెలలకొకసారి ప్రకటింపఁబడును.

సంపుటము ౨౮. { యువనామసంవత్సరము. మాఘఫాల్గునమాసములు. } సంచిక. ౬


## మనవి.

మహాశయులార!

భాషాభిమానులయుఁ బండితవర్యులయుఁ బాఠకులయు నభిమానముచే నీ సంచికతోఁ బరిషత్పత్త్రిక కిరువదినాలుగేండ్లు నిండినవి. ఇరువదియైదవయేఁడు ప్రారంభమగుచున్నది. ప్రారంభించిన పద్యకావ్యము సింహాసనద్వాత్రింశిక పూర్తియైనది. నూతనకావ్యము ప్రారంభింపఁబడును.

ఇరువదియైదవ సంవత్సరములోఁ బరిషత్తునకు రజతోత్సవము గావింపఁబడును. తత్కాలమును వివరములును ముందుఁ దెల్పుదుము. కావునఁ బాఠకులు సభ్యులుం దమతమ చందాలను చైత్రమాసములోఁ దప్పక పంపుటకై వేఁడుచున్నారము. అట్లు చేయుటయే వారుత్సవమునకుఁ జేయు ఘనసహాయము. తమకు మిత్రులును భాషాభిమానులు నగువారిం బ్రోత్సహించి గ్రాహకులం గావించి వారి చందాలనుగూడఁ జైత్రవైశాఖమాసములలోఁ బంపునట్లేర్పాటుచేయఁ గోరుచున్నారము.

అశ్రద్ధ చేయక యిది యొక ముఖ్యకార్యముగా నెంచికొని వారివారి చందాలను బంపుఁడని మరల నొకపరి కోరుచున్నారము.

కార్యదర్శులు.

# ఉత్తరకాశీ-శక్తిస్తంభలేఖ.

—పండిత చిదిరెమఠము వీరభద్రశర్మగారు, యాదగిరి.—

పర్వతసార్వభౌముఁ డగు హిమవంతుఁడు తనయుద్యానవనమునందు మహోత్కృష్టసౌందర్యమును రచించుకొనినాఁడు. నూతనప్రవేశమహోత్సవావసరమునఁ గాఁబోలు నిమంత్రితు లైన దేవత లచ్చోటి యలౌకికరమణీయతచే నాకృష్టమనస్కులయి నేఁటికి నాస్థలమునందే నివసించుచున్నారు. అందు వలననే యది దేవభూమి. భారతీయమహర్షులు నాపుణ్యభూమి నాశ్రయించియే యిష్టార్థములను బడసిరి. కవితాకామినీకాంతుండును మహానుభావుండును నగు కాళిదాసుఁడు స్వీయప్రథమకృతిప్రారంభమున "అస్త్యుత్తరస్యాం దిశి దేవతాత్మా హిమాలయో నామ నగాధిరాజః" అని లిఖించి హిమాలయప్రాశస్త్యభేరీధ్వానమును భూనభోంతరాళభాండంబునఁ బూరించెను. ప్రపంచవివిధభాగములనుండి వేనవేలుప్రజలు ప్రతివత్సరము నాహిమవత్పుణ్యక్షేత్రమును సందర్శించి పరిపూతు లగుచున్నారు. ప్రతిభారతీయునిహృదయమున హిమాలయసందర్శనోత్సుకత కలదు. * *

అస్మద్గురువరేణ్యులు దమ హిమాలయయాత్రానుభవమును గూర్చి నిరూపించిననాఁడు నాకును హిమాలయసందర్శనాభిలాష గాఢముగ జనించినది. అటు పిమ్మట నేను కాశి చేరినపిదప నది యింతక పెరిఁగినను శుక్లవత్సరమునఁ గాశీపట్టణములోని విపరీతగ్రీష్మము నాహిమాలయయాత్రాభిలాషను బ్రబలపఱిచినది. ఒకమిత్రునితోఁ గలిసి చైత్రకృష్ణతృతీయ మొదలు జ్యేష్ఠకృష్ణపంచమివఱకు హిమాలయయాత్రను సేవించి కృతార్థుఁడ నైతిని. దానికి సంబంధించిన విషయవైశద్యము ప్రత్యేకగ్రంథము నపేక్షించుచున్నయది. * * *

నేను గొనివచ్చిన శాసనములలో "నుత్తరకాశీశక్తిస్తంభలేఖ" ముఖ్యమయినది, కనుక, తత్సమాచారము నీక్రింద వివరించుచున్నాఁడను. హరద్వారము* నుండి యుత్తరకాశీక్షేత్రము (బారాహాటనియు నదీనికి మఱొకపేరు) 140, మైళ్ళదూరమున నున్నది. మేము నూఱుమైళ్ళుమాత్ర మామార్గముననే నడిచి 'ధరాసు' క్యాంపు(చట్టి)నుండి యుత్తరకాశిదారి నెడఁబాసి యమునోత్తరీ(యమునానదిపుట్టుక) మహాక్షేత్రమును సేవించుకొని యాత్రోవన 'గంగానీ' చట్టివఱకు

* ఈక్షేత్రము హరిహరులకు మహాద్వారముగ నున్నను మహాదేవునిప్రాధాన్యమువలన నుత్తరదేశీయులలో హరద్వార (Hardwar) మనియే దీని వ్యవహారము.

వెనుకకుమరలి "సింగోటా, చాకూరీ" చట్టీలమీఁదుగా నుత్తరకాశికిఁ (15-5-1929) జేరితిమి. ఉత్తరకాశి, కాశి, (బనారస్) యొక్క ప్రతిబింబ మనఁదగి యున్నది. లేక కాశియే యుత్తరకాశీప్రతికృతి యగుఁగాక! ఏల యన నుత్తరకాశిలో నతిప్రాచీనచిహ్నములు దృగ్గోచరము లగుచున్నవి. వానిని రెండువేలసంవత్సరములకంటె నిటీవలి వని చెప్ప వలనుపడదు. ఉత్తరకాశిలోను-శ్రీవిశ్వనాథుఁడు, అన్నపూర్ణ, దుర్గాదేవి, కాలభైరవుఁడు, ఢుంఢిరాజు మున్నగు ప్రధానదేవతలు కాశిలో వలె విరాజిల్లుచున్నారు. స్నానార్థమై గంగానదియుఁ దత్తటమున దశాశ్వమేధ మణికర్ణికాఘట్టములును బ్రత్యక్షమగుచున్నవి. ఈపుణ్యక్షేత్రము ధవళహిమావృతనగముల మధ్యను సమప్రదేశములోనుండి, చూపఱ మనోరమను జూఱగొనుచున్నయది. అచ్చోటి సలిలసమీరరాజముల వేఱుఁగా బ్రశంసింపనేల? ఇది టెహరీ (Gorhwal) రాజ్యమున మూఁడవపట్టణ మఁట! మిడిల్‌స్కూల్, పోస్టాఫీస్, మ్యునిసిపల్‌బోర్డు మున్నగునవికూడ దీనియాటపికపట్టణత్వమునకు సాక్ష్యములు. యాత్రికులకొఱకు రెండు ధర్మశాలలును గలవు. కాలీకమ్లీవారి ధర్మశాల, యౌషధశాల, సుప్రసిద్ధములు. పరిసరమునఁ గలరెండుమూఁడాశ్రమములును నుత్తరకాశీపవిత్రత నినుమడించుచున్నవి. * * *

ప్రాతఃకాలమున స్నానసంధ్యాదులను దీర్చికొని సమస్తదేవతాసందర్శన మొనర్చితిమి. భోజనానంతరము మ ఱొకమాఱు శ్రీవిశ్వనాథమందిరమున కెదురుగాఁ గలధ్వజ(స్తంభ)మండపమునకు మడిబట్టలతోడఁ బ్రవేశించితిమి. ఇందే యీవ్యాసమునకు విషయము లభించినది. విశ్వనాథాలయ ముత్తరకాశిలో నధికమహత్త్వము కల దనుట సహజమే! ఆయాలయము మూఁడునాలుగుపర్యాయములు సంస్కరింపఁ బడినటులు తోఁచుచున్నది. అయినను జీవకళ లుట్టిపడు కొన్ని విగ్రహములు శిలాఖండములు మున్నగువానివలన నీయాలయ ప్రాచీనతను సులభముగఁ గనిపట్ట వచ్చును. విశ్వనాథునకు నెదురుగా 15 అడుగులదూరమున నొకశక్తిస్తంభము కలదు. దానిని త్రిశూల మనియు జయస్తంభ మనియు నను జెప్ప వచ్చును. స్తంభముయొక్క క్రిందిభాగమున నొకమూరపొడవులో గుండ్రని రాగిదిమ్మ యొకటి కలదు. ఇట్టి వింకను నేడుదిమ్మలు (లింగమునకుఁ బానవట్టమువలె) స్తంభమూలమున నున్న వని యచటివారు చెప్పుదురు. మీఁదికి 17 అడుగుల పొడవు గలభాగ మిత్తడితోను జివరిమూఁడడుగులు నినుముతోడను స్తంభము నిర్మింపఁబడి త్రిశూలము పరశువులతోఁ దీర్చఁబడినది. అనఁగా నీస్తంభము భూ-

మతలమునుండి 21 అడుగుల పొడవు కలదు. స్తంభ మష్టకోణముగ నున్నయది, చుట్టుకొలత రెండడుగు లుండును. ఈకోణములలో మూఁడుబంతులతో నొకలేఖ చెక్కఁబడినది. దానినిగూర్చి "దేవాసురులు మహాఘోరసంగ్రామ మొనర్చినపుడు మహాదుర్గయొక్క శక్తి యాకాశమునుండి భూపతిత మయినది. ఇందలి లిపి యేరికిని దెలియద"ని యచటి పురోహితవృద్ధులు వివిధాద్భుతవిషయములను జెప్పుదురు. ఇట్టి దంతకథను సత్య మని నమ్మియే కాంబోలు నొకయమాయకపు సంస్కృత పండితుఁడు "కేదారఖండ"మను సుప్రసిద్ధస్కాందమహాపురాణభాగమునఁ గొన్ని సంస్కృతశ్లోకములఁ గూర్చెను. "నిక్షిప్తా యత్ర పూర్వం హి సంగరే దేవతాసురైః। అద్యాపి దృశ్యతే తత్ర శక్తి ర్ధాతుమయీ శుభా" కే. ఖం. అ. ౯3-౨౨. "మహాకాల్యాః కథం దేవ పతితా శక్తి రుత్తమా" ౯3-౨3. ఇందలి తాత్పర్యము, పురోహితుల వాఙ్మూలమునకు భాషాంతరీకరణ మనుటలో సందేహము లేదు. దీనియొక్క "పదునాఱుణాలయబద్ధము"ను గూర్చి యీవ్యాసము విన్నవింపఁగలదు. అసలు విషయ మే మనఁగా భారతవర్షమున నైదాఱువందలసంవత్సరములనుండి సామాన్యముగఁ బ్రాచీనలిపియొక్కపఠనపాఠనము లాఁగిపోయినవి. ఆధునికశిక్షితులు లిపివేత్తలు హిమాలయయాత్రలో నగపడరు. అందుచేతను బ్రాచీనసామగ్రిని సంగ్రహించుటకై కష్టించువా రెవరు ? ఈదుర్గమయాత్రలో రాని పోని పని నేల కల్పించుకొందురు ? యాత్రలోఁ బ్రాచీనశాసనాదికములు కలవను వార్త మొదలే వినియుండుటవలనఁ బ్రతిబింబములను దీయుటకు నవసరములగు సాధనములను వెంట నుంచికొంటిని. బరువు వెక్కు వగుటఁ జేసి వ్యయప్రయాసములకు గుఱియైన సంగతి నిక్కువమె కాని దీనిసాఫల్యముఁగూర్చి తర్వాత నందిన యానందమునకు మేర లేదు. * * * *

పల్లెటూరిలోఁ గరణాలు పెద్ద దొరలుగా నుందురు. హిమాలయయాత్రలో మాబోటివా రెవరును నావత్సరమున రానందున దొరతనమును సాగించి కొన్నిపనులను జమత్కారముగ నెక్కించికొంటిమి. ఉత్తరకాశీవిశ్వనాథమందిరమును సహజగాంభీర్యధైర్యములతోఁ బ్రవేశించి శక్తిస్తంభమునఁ గట్టిన వస్త్రమును దీసి వేసి సబ్బునీటితో "బ్రష్షు"వేసి యక్షరముల సందులలోఁ జిక్కిన మైలను సూదితోఁ దీయుచుండఁగా "పూజారి"మహానుభావుల యాగమనమయినది. వారు రక్తరంజిత నేత్రములతో "మీరీవస్తువులచే నీశక్తిస్తంభము పవిత్రతను బాడుచేసితిరి. ప్రాయశ్చిత్తసంస్కారమునకు వ్యయ మగుద్రవ్యమును జెల్లించి తీరవలయు న్నూ, లేనిచో,

కోట్టులో వ్యాజ్యము వేసెద"నని గర్జించిరి. నేను ననేకవిధముల సంభాషించి యొక నాఁడడవిభోజనమునకు సరిపోవు 'దక్షిణ'ను సమర్పించికొనినతర్వాతను మావస్తువులయొక్క స్వదేశీయతను పారిశుద్ధ్యమును నంగీకరించిరి. ఎటులో మూఁడుగంటల కాలము పరిశ్రమింపఁగా నుత్తరకాశీనాథుని కృపవలనఁ బ్రతిబింబము పరిశుభ్రముగా లభించినది. ఆమహాదేవుని కృపను సంతసించుచు వర్షములోఁ దడియుచుఁ బసకుఁ జేరితిమి. ఇచటికి సమీపమున నున్న స్వగ్రామమునకు మాకూలివాఁడు వెళ్లుటవలన నుత్తరకాశిలో మూఁడురోజు లాఁగుట కవకాశము లభించినది. ఈలోపుగ నపుడపుడు లేఖను జదివి పాఠమును బూర్తిచేసితిని. నాప్రథమప్రయత్నము సఫల మగుటచేతను మఱిచటను నీలేఖ ప్రకటితము కాలేదను నిశ్చయమువలనను దాత్కాలికముగ నానంద మనుభవించితిని. తర్వాత ననేక పర్యాయము లేతద్విషయకవ్యాసమును బ్రకటింపఁదలఁచియుఁ గారణాంతరములచే నింతవిలంబించితి నని వ్రాయ సంకోచపడుచున్నాఁడను. టిహరీరాజ్యామాత్యు లగు పం. హరికృష్ణరతూడీగారు తమ "గఢవాల్ కా ఇతిహాస్" అను సుప్రసిద్ధహిందీభాషాగ్రంథమున నొకతెల్లదొరగారి యభిప్రాయానుసార మంట యీశక్తిస్తంభలేఖను గూర్చి "ఇది ప్రాచీనపాలిలిపిలోఁ గలదు. చాలతప్పులును నున్నవి. సంవత్సరసంఖ్య యరిగిపోయినది. ఉత్తరకాశిని మాళవపుశరాజు లేలినటులు తెలియుచున్నది. రాజు పేరుదారచరితుఁడు. ఆయన స్వపుత్త్రునకు రాజ్యాభిషేకమొనర్చుసమయమున స్మారకముగ నీత్రిశూలమును స్థాపించియుండును. భాష చాలఁ దప్పులుగ నుండుటచేత రాజాస్థానమున విశుద్ధసంస్కృతమును వ్రాయుపండితుఁడు లేకుండె ననవచ్చును" మున్నగు నసంబద్ధవిషయములను బ్రకటించినారు. లేఖను జదివించుటకుఁగాను శ్రీరతూడీగారు సమ్యైక ప్రయత్నమొనర్పలేదని భావింపవలసియున్నది. కానిచో, నింతస్పష్టమైన లేఖనుగూర్చి, యేప్రాచీనలిపివేత్తయైనను దప్పులనుప్పయను శుద్ధాబద్ధమును వచింపఁజాలఁడు. పాఠకులు శ్రద్ధతోడ నగ్రిమపంక్తుల నవలోకించుచో నిజము దెలియఁగల దని నివేదించుచున్నాఁడను. శక్తిస్తంభలేఖ మూఁడుపంక్తులలో నున్న దని వెనుక వ్రాసితిని. అది చాలఁ బొడవుగా నుండుటచేత దాని ప్రతిబింబముం బత్త్రికలో ముద్రించు తలంపుతోడ నొక్కొక పంక్తిని నాలుగుచరణములుగాఁ గావించి "డ్రాయింగు" చేసితిని. మొదటిబంతిలోఁ గొంచెము చిన్నయక్షరములతో నొకశార్దూలవిక్రీడితవృత్తమును రెండవబంతిలోఁ బెద్దయక్షరములతో మఱొకశార్దూలవిక్రీడితవృత్తమును మూఁడవబంతిలో మఱియును

బెద్దపెద్దయక్షరములతో నొకస్రగ్ధరావృత్తమును వ్రాయఁబడినవి. సంపూర్ణ లేఖ శుద్ధసంస్కృతములో సుందరాక్షరములతో స్పష్టముగా స్తంభముమీఁదఁ జెక్కఁబడినది. కవిత యమకానుప్రాసభూయిష్ఠమై సుగ్రాహ్యమై ప్రాచీన ప్రబంధరచనను విజ్ఞాపించుచున్నయది. ఇందు "అ ఇ ఓం క ఖ ఘ జ చ ఛ జ ఠ ణ త థ ద ధ న ప బ భ మ య ర ల వ శ ష స హ" అను నక్షరములును "క్ష జ్ఞ క్ర శ్చ స్వ" వంటి వాడుకలో నుండు సంయుక్తాక్షరములును గలవు. ఒకటిరెండక్షరములుమాత్రము సరిగాఁ దెలియనందున నర్థక్రమమునుబట్టి పోలికతోఁ జదివినాఁడను. నా "డ్రాయింగు" ప్రతిబింబము (దిమ్మె) నిందు వెంటఁ బ్రకటించుచు మూలపాఠము నీ క్రిందవ్రాయుచున్నాఁడను.

౧ వ పంక్తి.

ఓం ఆసీ ద్యః క్షితిపో గణేశ్వర ఇతి ప్రఖ్యాత కీర్తి స్స్వరైః ।

చ కే౹ యేన భవసం వేశ హిమవద్ద్రిశ్రోచ్ఛ్రితం దీప్తిమత్ ॥

కృత్వాణు వ్వనజాధిప[ః] స్వకృపణైః సామాత్యభాగ్యశ్రియం ।
స్మృత్వా శక్ర సుహృత్వ(త్త్వ) ముత్సుకమనా యాతః సుమేర్వాలయం॥

౨ వ పంక్తి.

పుత్ర స్తస్య మహాభుజో విపులదృ క్పీనోన్నతోరస్థలః ।
రూపత్యాగనయై రనఙ్ఘనద వ్యాసా నతీతో ర్వ్యద్గతః॥
నామ్నా శ్రీగుహ ఇత్యుదారచరితః సద్ధర్మధుర్యః సతాం ।
శక్తిః(ం) శత్రుమనోరథప్రమథనీం శంభో శ్చకారా గ్రతః॥

3 వ పంక్తి.

ప్రాతః ప్రాతర్మయూఖై రురుభి రవిరలం శార్వరం ధ్వా(ధ్వా) న్తమాఘ్నన్ ।
న్నాలుంచం శ్చారుతారానికరపరికరోదారశారోదరత్వం॥
స్వం బిమ్బం చిత్ర బిమ్బామ్బరతలతిలకం యావదర్కో విధత్తే ।
తావత్కీర్తిః సుకీర్తే శ్చిర మరిమథనస్యా స్తు రాజ్ఞస్థిరేయం॥ ౪॥

వీని సంగ్రహతాత్పర్య మిది:—"ప్రజానురాగి యగు గణేశ్వరనామకరాజు హిమాచలశృంగమువలె నత్యున్నతగోపురము గలిగినట్టియును, ప్రకాశమానము నగు శివాలయమును గట్టించి, యమాత్యసమేత మగురాజ్యలక్ష్మిని అణువువలె భావించి యింద్రునిమైత్రిని దలంచి స్వర్గమునకుఁ బ్రయాణించెను." వార్ధక్యము వలననో వ్యాధివలననో రాజు గతించియుండును "శక్రసుహృత్త్వ" శబ్దము గణేశ్వరనృపాలుని పరాక్రమాధిక్యమును "వనజాధిప" విశేషణము, ఆటవికరాజ్యపరిపాలనమును బోధించుచున్నది. అనఁగా నిప్పటియుత్తరకాశీపట్టణప్రదేశము నాఁడు శుద్ధాటవికుల నివాస మనియు నాయాటవికరాజు శివాలయమును మాత్రమే (శివలింగస్థాపనఁ జేసెననుటకు బ్రమాణములేదు) నిర్మించె నని యూహింపఁ దగును. మహాకవి కాళిదాసుఁడును* రఘుమహారాజు జైత్రయాత్రను వివరించుచు "కిరాతపార్వతీయ" శబ్దములతో హిమాలయప్రాంతప్రజలయొక్క యాటవికత్వమును సూచించినాఁడు॥ ౧॥

గణేశ్వరరాజతనూభవుండు శ్రీగుహుఁ డనునామమునఁ బ్రసిద్ధికెక్కెను. ఆతఁడు దీర్ఘబాహుఁడును విశాలనేత్రుఁడును స్థూలోన్నతవక్షస్థలుండును నుదారచరితుండును ధార్మికధురీణుండును లావణ్యమున, దానశీలత, నీతికౌశలములలోఁ

* రఘువంశము ౪-౭౬ చూడుఁడు.

గ్రముగా మన్మథకుబేరవ్యాసులను* నతిక్రమించిన వాఁడును నై యుండి శివు నకు నెదురుగా శత్రుమనోరథవిధ్వంసి యనఁబడు నీశక్తిస్తంభమును బ్రతిష్ఠించెను.” తండ్రియగు గణేశ్వరుఁడు మందిరమును గట్టించునంతలో గతించినటులును దరు వాతఁ బుత్త్రుఁ డగుగుహరాజు ధ్వజస్తంభమును జేయించినటులును విషయము స్పష్టపడుచున్నది, కాని, “శక్తి” స్తంభ మనుటవలనను “శత్రుమనోరథప్రమథనీ” విశే షణమువలనను నిది గుహునివిజయచిహ్న మనియు భావించుటకు నవకాశము కలదు. ప్రస్తుతము భారతదేశమున నెల్లచోటులను లభించునట్టి యశోకచక్రవర్తి ధర్మస్తంభములను విజయ స్తంభము లని కొంద ఱనుచున్నారు. ప్రాచీనకాలమున స్తంభలేఖలలో విజయవార్తలను బ్రకటించుటఁ గూడ నాచారమైనటులు తెలి యవచ్చెడిని. కావ్యచిత్రకళాచార్యుఁ డగు కాళిదాసకవిగురుండును రఘుమహా రాజుయొక్క విజయ స్తంభమును గూర్చి చమత్కారముగఁ †“త్రికూటపర్వతాం కమున వప్రక్రీడ నొనర్చుచున్న రఘుచక్రవర్తి మదగజములు కోరలతో గీచిన రేఖలు (అక్షరములు) పరాక్రమమును బ్రశంసించుచుండ నాత్రికూటాచలము రఘుమహారాజుయొక్క జయ స్తంభముగఁ బరిణమించె” నని చిత్రించెను. ఇందువలన జయస్తంభస్థాపనాదికములు చాలఁబ్రాచీనము లనుటకు సందేహము లేదు. ఇటు లె యీశక్తిస్తంభము విశ్వనాథసామ్ముఖ్యమున ధ్వజమైనను గుహరాజు రాజ్య పరిపాలనమునఁ బదార్పణ మొనర్చిన తరువాత నుత్తరకాశిపటమును జైత్రయాత్రఁ గావించి జయస్తంభమును నెలకొలిపె నని యూహింపఁదగును. గణేశ్వరుఁడు గుహుఁడు నేవంశమువారు? ఎచట నేకాలమునఁ బాలించిరి? అను ప్రశ్నము లకు నుత్తరము లాధునికేతిహాసములలో నెక్కడను గనిపింపవు. భారతవర్షేతిహా సమున నింకను విక్రమాదిత్యునివంటి చక్రవర్తుల యితివృత్తము దృష్టిగోచరము కానపుడు గుహునిఁబోలు నడవిరాజులను గూర్చి వేఱ వ్రాయనేల?‡ లిపిపరా మర్శముచేత మాత్ర మీరాజులు క్రీ. శ. 5వ లేక 6వ శతాబ్దమున నుండియుం దు రని భావించుచున్నాఁడను. ఏది యెటు లున్నను గుహరాజుయొక్క జయ స్తంభస్థాపనకార్య మితిహాసజిజ్ఞాసువులకు నత్యంతోపకార మొనర్చినయది. కాశి

---

* దానమునఁ గర్ణునివలెఁ గుబేరుఁడును నీతిశాస్త్రమున శుక్రచాణక్యులవలె వ్యాసుఁడును నాఁడు ప్రసిద్ధు లనుకొనవలసి యున్నది.

† “మత్తేభరదనోత్కీర్ణవ్యక్తవిక్రమలక్షణం త్రికూట మేవ తత్రోచ్చై ర్జయస్తంభం చకా ర సః” రఘువంశము ౪-౫౯ చూడుఁడు.

‡ శివాలయనిర్మాణము శైవనామధారణముఁ జూడ వీరు శైవులుగఁ గన్పట్టెదరు.

(బనారస్) వంటి సుప్రసిద్ధస్థలమున నొకప్రాచీనచిహ్నమేని యగపడనపుడు నాట వికప్రదేశ మగునుత్తరకాశియం దింత పురాతనలేఖ లభించుట కౌతుకాస్పదము.౨

"భగవంతుం డగు సూర్యనారాయణుండు తనయరుణకిరణంబులచే గాఢాంధకారమును విధ్వంస మొనర్చి చారుతారానికరముల చిత్రచర్యలను బోఁదుడిచి యంబరఫలకమున స్వీయబింబరూపతిలకము నెంతకాలమువఱకు నిడఁగలఁడో యంతకాలముదనుక శత్రుభీషణుం డగు నీగుహానృపాలునియొక్క కీర్తి సుస్థిరమై వెలుఁగుఁగాక!" యను మంగళాశీర్వాదము మహాధ్రువ మనుట నిక్కువము. ౧౪-౧౫ వందలసంవత్సరములనుండి చెక్కుచెదరని యీ శక్తిస్తంభ మింకను వేల వత్సరములపర్యంతము స్థిర మగునేని యాశ్చర్యము కాదు*॥ ౩॥

ఇందలిలిపి గుప్తరాజులకాలమునాఁటి దని పొడకట్టుచున్నయది. లేఖయొక్క యాద్యంత్యములలో "ఓం" "క" అను నక్షరములు లిఖింపఁబడినవి. మఱియు ననేకలేఖలలో నిటు లగపడుచున్నది. కావున నిదియుఁ బ్రాచీనపద్ధతియే యగును. నాయభీష్టమును నెఱవేర్చి కుశలముగ స్వదేశమునకుఁ బంపినందులకు నుత్తరకాశీ విశ్వనాథుని వినుతించి విరమించుచున్నాఁడ †

---

* ప్రస్తుత మీ స్తంభమునకు నిత్యనైవేద్యదీపారాధనపూజలతో పాటు తైలగంధాదిలేపనములును జరుగుచున్నవి, కావున టిహరీరాజ్యాధికారులు చెడకుండు నటులఁ జూడవలసియున్నది.

† ముందుఁ బ్రకటింపఁబడు కేదారఖండసర్వస్వ మనుగ్రంథమున నీవ్యాస మొకయధ్యాయము.

# ప్రాచీనాంధ్రశాసనచతుష్కము.

—జయంతి రామయ్యపంతులుగారు బి. ఏ., బి. ఎల్.—

ఈ నాలుగుశాసనములును, కడపమండలములో దొరకినవి. శిలలమీఁదఁ జెక్కఁబడి యున్నవీనిమూలములకు నేను స్వయముగాఁ దీసిన కాగితపుఁ బ్రతిబింబములను బట్టి పాఠము నిర్ణయించుట యైనది. రెండవశాసనము ప్రొద్దుటూరు తాలూకాలోని అరకటవేముల గ్రామమునందును మూఁడునాలుగులు జమ్మలమడుగు తాలూకాలోని పెద్దముడియము గ్రామమందును దొరకినవి. మొదటిశాసనము దొరకిన గ్రామముపేరు నేను వ్రాయుట మఱచితిని, గాని, యదికూడ, అరకటవేములదేవాలయమునందే దొరకెనని జ్ఞప్తికలదు. మూఁడునాలుగు శాసనములకుఁ బూర్తిగను నొకటిరెండుశాసనములలోఁ గొంతభాగమునకు మాత్రమును బ్రతిబింబము లీవ్యాసమున కనుబంధముగా నీయఁబడినవి.

అక్షరములపోలికను బట్టియు మాటల వర్ణక్రమమును బట్టియు భాషాలక్షణమును బట్టియు నీశాసనము లన్నియు నన్నయభట్టుకాలముకంటెను యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనముకంటెను బూర్వమందె పుట్టినట్లు కనఁబడుచున్నది. ప్రథమద్వితీయశాసనము లించుమించుగా నేకకాలమందును వానితర్వాత మఱికొంతకాలమునకుఁ దక్కిన రెండుశాసనములు నించుమించుగా నేకకాలమునందును బుట్టిన ట్లూహింపఁ దగియున్నది. ఇంతవఱకు లభించిన తెనుఁగుశాసనములలో 1-2 శాసనములే ప్రాచీనతమములైన ట్లూహించెదను.

## —అక్షరక్రమము, పోలిక—

ప్రథమశాసనమునందు రచ్చమానమ్బున, అస్వమేదమ్బున, పల్లమ్బు, ఈ స్థలములందు బానుబదులుగా పవర్ణమే వ్రాయఁబడియున్నది. పబలకు భేదమిందుఁ జాటింపఁబడలేదు. ఈశాసనమునందు "కరువెంగళ"అనుచోటను గకారమునకుఁ బూర్వమందనునాసికాచిహ్నమైన సున్న కనఁబడుచున్నది. తక్కినయన్నిచోటులను సున్నకుబదులుగా ననునాసికాక్షరమే కనఁబడుచున్నది. ఉదా:—మానమ్బు, అస్వమేదమ్బు, పల్లమ్బు, రక్షిఞ్చె. తెలుఁగులో ననుస్వారములుగాఁ దోఁచునక్షరము లన్నియు వర్గాంత్యానునాసికములే. పూర్వమందీయనునాసికాక్షరములే వాడఁబడుచుండెను. రానురాను వానికి బదులుగా సున్న వాడుకలోనికి వచ్చినది. ఈవిషయ మంతయు నేను బరిషత్పత్రిక ౧౭ వ సంపుటము ౧ వ సంచిక 'ఁడు' అను వ్యాసములోఁ జర్చించియున్నాఁడను. ఆవ్యాసమునందలి సిద్ధాంతముల కీశా

సనములు చాలవఱకుఁ బ్రమాణము లగుచున్నవి. రాజుల్ల, పతుల్ల, ఇత్యాదిస్థల ములందు లకారద్విత్వము వ్రాతపొరపాటు కావచ్చును.

2. రెండవశాసనములో గకారమునకుఁ బూర్వమందును, వక్రంబు, అనుచోట బువర్ణమునకుఁ బూర్వమందును గూడ సున్న కనఁబడుచున్నది. తక్కి న స్థలములందు సున్నకు బదులుగా ననునాసికాక్షరమే వ్రాయఁబడినది. ఉదా-రాజ్యఞ్చేయఁ, పెణ్డెకోలు, వాణ్డు, పఞ్చ. భట్టరళ, శర్మ్మణళ, అనుశబ్దములం దు "ల"కు బదులుగా ళకారము కనఁబడుచున్నది.

3. మూఁడవశాసనములో బువర్ణమునకుఁ బూర్వమందు వచ్చుమకార స్థానమునందుమాత్రమే సున్నవచ్చుచున్నది. లఞ్చ, వాణ్డు అనుశబ్దములలో నను నాసికాక్షరమే వ్రాయఁబడినది.

నాల్గవదానిలోఁ గూడ బువర్ణమునకుఁ బూర్వమే సున్నవాడఁబడినది.

ఈశాసనము లన్నింటియందును మహదర్థకప్రథమావిభక్తిప్రత్యయ మగు "డు"వర్ణకమునకు బదులుగా 'ఱు' వాడఁబడినది. ఈరెండక్షరములకునుగల యు చ్చారణసామ్యమును "ఁడు" వ్యాసములోఁ జర్చించియుంటిని. మిక్కిలి ప్రాచీనశా సనములందు మాత్రమే యీరూపము కనఁబడుచున్నది.

—భాషాలక్షణము.—

"అన్వ మేదమ్బన పల్లమ్బు"(1)"నూటయెనుబొణ్డ ఇడ్డ"(4)ఇచ్చుటఁబ్రథమకు బదులుగా షష్ఠీవిభక్తి ప్రయోగము విశేషము. ఇట్టి ప్రయోగములు నన్నయభ ట్టారకాదులగ్రంథములందుఁ గలవు. ఈశాసనములను బట్టిచూడఁగా నాకాలము లందు సర్వసాధారణముగా వాడుకలో నున్నట్లు కనఁబడుచున్నది.

ఈశాసనములలో వ్రాఁతతప్పు లచ్చటచ్చటఁ గలవు. రచ్చకాలు, ఉరిపె నకాలు(1) వేగుళూన్లు, కచ్చుల్లు (2) ఇత్యాదిశబ్దములు కొన్నింటికర్థము లగుట లేదు. ఆశబ్దము లిటీవలభాషలోనుండి తొలఁగిపోయి యుండవచ్చును. కొన్నిశబ్ద ముల కర్థము లీక్రింద వ్రాయఁబడుచున్నవి.

పన్నశ=పన్నస=మాన్యక్షేత్రము.

మఱుతూ=మరుతు=ఇది యొక భూపరిమాణము.

రచ్చమానమ్బు=రాజమానము. రాజుచే నిర్ణయింపఁబడిన కొలగఱ్ఱ.

డచ్చు=చెఱుపు; చెడఁగొట్టు (డయ్యఁజేయు.)

కుడ్డిపివాన్రు=కుడుపువాఁడు. అనుభవింపఁజేయువాఁడు.

వక్రంబువచ్చు=అడ్డువచ్చు, విఘ్నముచేయు.

లఞ్చంబుగొను=అపహరించు.

వ్రచ్చు=వగులఁగొట్టు, చంపు.

ఆజెవి=ఆవుచెవియని తోఁచును. అత్యల్పమనిభావము.

క్రొచ్చు=శిలాదులపైఁ జెక్కు. ఈశబ్ద మిప్పుడు త్రవ్వు అనునర్థమందే వాడుకలో నున్నది.

వడ్డచి=వడ్రంగి. (వర్ధకి)

1. మొదటి శాసనము.

(ఈశాసనము శాసనాధికారవర్గమునకు లభించినట్లు తోఁపదు.)

1. స్వస్తి శ్రీ ప్రిత్తివిపతి రాజుల్ల[1] దేవుళ ... ముస్తు[2] ప్రితివిపతుల్ల

2. ఇచ్చిన్న పన్నశా[3] కరువె(ం)గ్గళనఱుచాముళకు మోరయాను ముట్టకుము ప్పది మఱుాతూ[4] క్రి[5] రచ్చమానమ్మున——

3. కులాచినట్టి[6] పొదొపుళు రచ్చకాలు (ఉ) రుపెనకాలు పుట్టనూరుల్లు మాచూరుల్లు ... రుల్లుకొణ్డపఱు[7]

4. దేని[8] లచ్చువాన్రు పఞ్చ మాహాపాతకస ... క్కురగుఁ.

రెండవప్రక్క.

1. తేని[9] రక్షిఞ్చ కుడ్డిపివాన్రు[10] అస్వమేదమ్మున పల్లమ్మ[11] కాఞ్చు అడుగు అడుగు[12].

2. రెండవశాసనము.

ఇది అరకటవేములగ్రామమునందు విష్ణ్వాలయప్రాకారమధ్యమున నున్న యొక్కరాతిస్తంభము రెండుప్రక్కలఁ జెక్కఁబడియున్నది. (476 of 1906 in the Government Epigraphist list)

---

1. రాజుల్ల అనఁగా రాజుల అని చదవవలయును: ఇతరస్థలములయందు నిట్లే చదువునది. 2. ముస్తు=ముగ్గురు. 3. పన్నశా, ఇతరశాసనములలో దీనికి పన్నస, పనస, యనురూపములు గలవు. 4. మఱుాతూ=మరుతులు. 5. క్రి, దీని కర్థము బోధపడలేదు. 6. కొలిచినట్టి యని చదువవలయు నని తోఁచుచున్నది. 7. కొణ్డపరు, కొనువారు అని యర్థమైనట్లు కనఁబడుచున్నది. 8. దీని అని చదువవలయును. 9. దీని అని చదువవలయును. 10. కుడిపినవాఁడు, అనఁగా, అనుభవింపఁ జేసినవాఁడు. 11 ఫలంబు అని చదువవలయును. 12. దీనికి అన్వయము కనఁబడదు.

మొదటిప్రక్క.

1. స్వస్తి శ్రీ వల్లభమహారాజాధిరాజ పరమమహేశ్వరభట్టరళ ప్రితివిరాజ్య
2. ఇచ్చియర్ల పెర్బణవంశభుజ(ం)గడిభూపాదిత్యుల కడార్ల వ(ం)గనూళ్లి చరు వళమ్మర్ల పుత్ర
3. విన్నశమ్మర్లళకు నిడుగటుమ్బున పన్నళ ఇచ్చిరి వేగుఖూళ్లు పెన్దృకోలు వకకోళు కచ్చుళ్లు ఇన్నల్వురు సాక్షి

రెండవప్రక్క.

1. దేనికి[1] వక్రంబు వచ్చువాన్రు పఞ్చమహాపాతక సయ్యుక్తస్స్యుర్ల
2. త్రిభిర్ద్దర్లత్త(ం) త్రిభిర్భుర్లక్త(ం) సద్భిశ్చ పరిపాలితం ఏతాని ననివర్త్త న్తై పూర్వ్వర్లరాజకృ
3. తానిచ స్వదత్తా(ం)పరదత్తా(ం) వా యో హరేతి[2] వసున్ధరా(ం) షష్టి వర్షర్ల సహస్రాణి విష్టా
4. యాఞ్జాయ తేక్రుమి

3. మూఁడవశాసనము.

ఇది పెద్దముడియముగ్రామములో శివాలయమునకుఁ బడమటఁ బడియున్న యొకరాతిపలకమీఁదఁ జెక్కఁబడియున్నది. (351 of 1905 of the Government Epigraphist list.)

1. దేవస్వంబు లఞ్చంబు
2. గొణ్ణ వాన్రు వార
3. నాశిష్ఠచ్చిన పా
4. పంబు గొణ్ణ వాన్రు

4. నాలుగవశాసనము.

ఇది మూఁడవశాసనముగల రాతిపలకమీఁదనే దానియడుగునఁ జెక్కఁబడియున్నది. రెంటికి నడుమ గీఁత కలదు. శాసనాధికారులు వీనిరెంటి నొక్క శాసనముగా భావించినారు.

1. దీన్నికి అని చదువవలయును. 2. హరేత అని చదువవలయును.

1. స్వస్తి శ్రీ సూటయెఱు
2. బొన్తొత్రు[1] ఇడ్డన
3. మయంబున (విఖ్ధు
4. పల) ఆశవి[2] యస్తయే
5. నియు ఱోగొన్నవాన్రు నిచ్చి
6. నవాన్రు చెడువాన్రు క్రొచిన[3]
7. వాన్రు వెన్ధవడ్డచి
8. కు బ్రమ్హవడ్డచి...

---

1. ఎనమండ్రు అని యర్థము. 2. ఆవుచ్ఛెనియని తోఁచుచున్నది. 3. క్రొచ్చిన=చెక్కిన, 4. వడ్డచి=వడ్రంగి.

# రెడ్డి.

—జయంతి రామయ్యపంతులుగారు. బి. ఏ., బి. ఎల్.—

---

ఈకాలమందు "రెడ్డి"శబ్దము జాతివాచకమై యున్నది. ఈరెడ్డిజాతిలోఁగూడ పాకనాటిరెడ్లు, మోటాటిరెడ్లు, పంటరెడ్లు, వెలనాటిరెడ్లు మొదలగుభేదములు గలవు. ప్రాచీన గ్రంథములందును, శాసనములందును, ఈశబ్దమునకు "రడ్డి"యను రూపము కనఁబడుచున్నది. దీనినాధారముగాఁ జేసికొని కొందఱీశబ్దము "రాట్" శబ్దభవ మని తలంచుచున్నారు. అది సరియనితోఁపదు. ఈశబ్దమునకే ప్రాచీనగ్రంథములందును శాసనములందును, "రట్టగుడి, రట్టడి, రట్టొడి, రట్టోడి" అను రూపములు కనఁబడుచున్నవి. అచ్చట నిది జాతివాచకము గాక, యధికార వాచకముగా నున్నది. దొరకినయాధారముల నన్నింటినిబట్టి యూహింపఁగా నీరూపముల కన్నిఁటికిని "రాష్ట్రకూట" అనుశబ్దము మూలరూపముగా నగపడుచున్నది. రాష్ట్రకూటుఁ డనఁగా రాష్ట్రమునకుఁ బ్రధానుఁడు, ముఖ్యుఁడు నని యర్థము. ప్రాచీనశాసనములలో, పూర్వపురాజులు దానధర్మములను జేయునపుడు రాష్ట్రకూట ప్రముఖుల నందఱను బిలిచి వారితోఁ జెప్పిచేయుచుండినట్లు కనఁబడుచున్నది. ఇందులకు రెండుదాహరణములు.

(1) శ్రీరాజరాజదేవో రెండేములనడిమివిషయనివాసినో రాష్ట్రకూటప్రముఖాన్ కుటుంబినః సమాహూయ ఇత్యాది-(నందంపూఁడిశాసనము-ఆం. సా. ప. పత్రిక. సం॥ ౧.)

(౨) శ్రీవిజయాదిత్యమహారాజః గుద్రహారవిషయే రాష్ట్రకూటప్రముఖాన్కుటుంబినః సర్వా నిత్థ మాజ్ఞాపయతి- (గుణగవిజయాదిత్యుని ఉరుటూరిశాసనము-ఆం. సా. ప. పత్రిక. సం॥ ౧.)

ఈరాష్ట్రకూటశబ్దము చెడి "రట్టగుడి" యైనది. ఈరూపమునకుఁ బూర్వశాసనములందుఁ బ్రయోగములు గలవు. కడపజిల్లాలో రామేశ్వరమునం దున్న పుణ్యకుమారరాజుశాసనములోఁ దనధర్మమునకు, "ఆజ్ఞప్తిమార్పిడుగురట్టగుడ్లు" అని యున్నది. ఇచ్చటబహువచనము గౌరవార్థము. కొంతకాలమునకీశబ్దములోని "గు" లోపించి రట్టడి, రట్టొడి, రట్టోడి, యనురూపములు వచ్చినవి. గురువిందగుంటశాసనములో "రట్టోడికి ఏనురూకలు"అనియు, "రట్లోడ్ల నెవ్వండేని రక్షిం

చువానిదధర్మము" అనియు శక్తివర్మభుబల్లుశాసనములో ఆం. సా. ప. సం. ౨. "మన్నియసామిత్వ మెల్ల రట్టోడ్లకు..." అనియుఁ గలదు.

శివతత్త్వసారమున-

క. పూజింపుఁడు పూజింపుఁడు, పూజింపుఁడు శివుని భక్తిఁ బూజింపుఁడు మీ
రోజసెడి నడవకుండుఁడు, రాజులు రట్టళ్లు నగుట రా వెల్లిటికిన్. ౨౦౦.

ద్రాక్షారామశాసనములలో* రడ్డి (౩౬౧) రట్టడికము (౩౩౮, ౪౩౪, ౪౪౮) రాష్ట్రకూటము (౪౪౬) అనురూపములు కానవచ్చుచున్నవి. ఈశాసనములం దీశబ్దములకు సీమాధికారియను నర్థము కనుపట్టుచున్నది. ఇటీవల కుల్కర్ణీలు, మజుందారులు మొదలగు నధికారు లున్నట్టులు పూర్వ మీరాష్ట్రకూటులు సీమల కధికారులుగానున్న ట్లున్నది. క్రమముగా నాయర్థము చెడి యాయధికారము చేయువారివంశస్థుల కిది జాతివాచకముగా మాఱినట్లు కనఁబడుచున్నది.

ఈక్రిందిపద్యములలో రడ్డి యనురూపము స్పష్టముగాఁ గన బడుచున్నది

1. ఎడ్డెతనపుఁగ్రై సేఁతల, రడ్డులు నడచిరి పురస్సరద్భార్యముగా
గుడ్డంబు చక్కఁగట్టం, బడ్డమహాశక్తిదివ్యభవనంబునకున్.

పాండురంగమాహాత్మ్యము. 3. ఆ.

2. రడ్డిపేఁటలుఁ దిప్పాపురంబు సిరులఁ, బాదలులింగాపురంబును బోతసాని
పల్లెయును మించఁ గట్టించె భవ్యకీర్తి, ప్రబల నూయన్న శ్రీకామిరడ్డిఘనుఁడు.

శివధర్మోత్తరము. ౧-౯౦.

కడపప్రాంతదేశమునందు రెడ్డియను శబ్దము గ్రామాధికారి (గ్రామమునకు మునసబు) అనునర్థమందు వాడుకలో నున్నది. ఆయధికారము సామాన్యముగా రెడ్డికులమువారే చేయుచుండుటచే నాశబ్దమున కీయర్థము వచ్చియుండును. ఆ యధికారము బ్రాహ్మణులు చేయుచున్నను, ఉద్యోగరీతిని వారిని రెడ్డిగా రనియే పిల్చుచుందురు.

---

* South Indian Inscriptions Vol. IV.

# భాసుఁడు.

కిళాంబి రాఘవాచార్యులుగారు ఎం. ఏ., బి. ఎల్.

---

తిరువనంతపురనాటకము లేకకర్తృకములు.

8. తిరువనంతపురనాటకములను విమర్శకదృష్టితోఁ బరికించినయెడల నందలి శ్లోక పద భావ సామ్యములవలన నవి యన్నియు నేకకర్తృకము లని నిశ్చయింపవచ్చును. శ్రీహర్షుని రత్నావళీ, ప్రియదర్శికా, నాగానందనాటకములయందు 'శ్రీహర్షో నిపుణః కవిః' యను శ్లోకము సూత్రధారుని సంభాషణమునఁ గనఁగను. భవభూతి తాను రచించిన యొకనాటకములోని శ్లోకముల మార్పు లేకయే మఱియొకనాటకమునఁ గైకొనియున్నాఁడు. తిరువనంతపురనాటకములలో నిట్టివి పెక్కులు గలవు. వీనిని విశేషపరిశ్రమ మొనరించి సేకరించిన సుక్తంకరు మున్నగు పండితులకుఁ గృతజ్ఞుఁడను.[1] ఇన్ని సామ్యములు గనఁబడినను యీనాటకము లేకకర్తృకములు గావను సుక్తంకరుగారి వాదము సహేతుకము గాదు. ఇట్టివి యాదృచ్ఛికముగ వేర్వేఱు నాటకములఁ గానవచ్చు ననుట స్వభావవిరుద్ధము. అనుకరణము, గ్రంథచౌర్యము గానిచో నవి యేకకర్తృత్వవాదమునే స్థిరపఱుచు ననుట సహృదయు లంగీకరింపక మానరు. కవిహృదయమునందలి భావము లాతనిగ్రంథములందు వ్యక్తమగుచుండును. కవి యొక్కఁడే యయినచో నట్టిభావము లొకరూపముననె వెలువడు ననుట సుప్రసిద్ధము. ఇట్టిసాదృశ్యములే గ్రంథకర్తృత్వనిర్ధారణమున నెక్కువగానుపకరించు నని పాశ్చాత్యులు కూడ సిద్ధాంతీకరించి యున్నారు.

(a) "లింప తీవ తమోఙ్గాని వర్షతీ వాఞ్జనం నభః
అసత్పురుషసే వేవ దృష్టి ర్నిష్ఫలతాం గతా-"[2]

ఈశ్లోకము బాలచరితమునందును (I-15) చారుదత్తమునందును (I-19) గలదు. కాని మృచ్ఛకటికమునందుఁ గన్పడుటచేఁ గావ్యప్రకాశికకొకవ్యాఖ్యయందు శూద్రకకవిరచిత మని నుడువఁబడినది. వల్లభదేవుఁడీశ్లోకమును విక్రమాదిత్యునిదనియు, శార్ఙ్గధరుఁడు విక్రమాదిత్యమేంఠులదనియు (3603) నుదాహరించిరి. ఈశ్లోకమునందలి ప్రథమపాదను దండికావ్యాదర్శమున (II-226 ...) విమర్శింపఁ బడినది. తరువాతి యాలంకారికులు[3] దండియభిప్రాయమునే తమగ్రంథములఁ జర్చించియున్నారు.

---

1. V. S. Sukthankar- "Annals of the Bhandarkar Institute"- Vol. iv- P 166-187. 2. ఉద్భటుని కావ్యాలంకారసారసంగ్రహము- నిర్ణయసాగరప్రతి- పు. 26.
3. చంద్రాలోకము-28

(b) 1. కథం తిష్ఠతి యా త్వితి- పంచ. II-58.
కథం తిష్ఠతు యా త్వితి- ప్రతిమా. IV-5.

2. కిం వక్ష్యతీతి హృదయం పరిశంకితం మే-స్వప్న-6-4,15;అభిషేక-IV-7.

3. చంద్రలేఖేవ శోభతే- దూతవా-7.
సంవృతా శరదభ్రేణ చంద్రలేఖేవ శోభతే—చారుదత్త-I-27.
నీలజీమూతమధ్యస్థా విద్యుల్లేఖేవ శోభతే—అభిషేక-II-7.
దుర్దినాంతర్గతా చంద్రలేఖేవ రాక్షసీగణపరివృతోపవిష్టా-,,పు-18

4. ధర్మస్నేహాంతరేన్యస్తా—ప్రతిజ్ఞా-II-7; అభిషేక-VI-23.

5. భారతానాం కులేజాతః- స్వప్నవా- VI-16; ప్రతిజ్ఞా- IV-18.

6. యది తేఽస్తి ధనుశ్శ్లాఘా—అభిషేక-III-22; ప్రతిమా-I-20.

7. సంభ్రమోత్ఫుల్లలోచనా- దూతవా-7; చారుదత్త-IV-3.

8. అతిపాతికార్య మిదం- శీఘ్రం నివేద్యతామ్. పంచరాత్రమ్. II అంక. పుట 24; అభిషేక-III అంక. పు. 27.
అతిపాతివృత్తాంతనివేదనత్వరయా...అభి. V అంక. పు. 57.

9. 'జయతు దేవః | జయతు స్వామీ | జయతు భద్రముఖః | జయతు మహారాజః | జయతు రావణాంతకః| జయత్వాయుష్మాన్.'
అభిషేక-VI అంక. పు. 73.

'జయతు భవాన్ | జయతుస్వామీ | జయతుమహారాజః | జయతుదేవః| జయతు భద్రముఖః | జయత్వార్యః | జయతురావణాంతకః'.
ప్రతిమా-VII అంక. పు. 113.

10. 'కిం తే భూయః ప్రియ ముపహరామి-
యది మే భగవాన్ ప్రసన్నః కి మతఃపర మహ మిచ్ఛామి-
అభిషేక. పు. 75.

కొలఁది మార్పులతో నిది బాలచరిత- (పు. 67) అవిమారక- పు. 110) దూతవాక్య (పు. 48) ప్రతిజ్ఞాయౌగంధరాయణములలో (పు. 73) గననగును.

11. 'కుతః ఖల్వాపః | కుతః ఖల్వాపః | భగవతి ఆకాశగఙ్గే! ఆప స్తావత్| హా,త (స్రవతి'—
దూతవాక్య—పు. 43.

'కుతః ఖల్వాపః | భోః గిరే | ఆపః తావత్ | హాంత స్రవతి'.
మధ్యమవ్యాయోగము-పు. 20.

12. 'కిం గూహసే। మమఖలు ప్రాణైఃశాపితః స్యాః యది సత్యం నబ్రూయాః'.
అభిషేక—పు. 37.
'తాత ! కిం గూహసే। స్వర్గం గతేన మహారాజపాదమూలేన శాపితః స్యాః యది సత్యం నబ్రూయాః'.
ప్రతిమా—పు. 95.

13. స్వప్నవాసవ—పు 45.
"పద్మా—అయ్య వసంతఅ ! కిం ఏదం. (ఆర్యవసంతక-కిమేతత్.)
విదూష—ఏదం ఇదం । ఇదం ఏదం. (ఏతదిదమ్ । ఇదమేతత్.)
పద్మా—భణాదు భణాదు అయ్యో భణాదు.(భణతు భణ త్వార్యో భణతు.)
ప్రతిజ్ఞా యౌగంధరాయణమ్—పు 17.
యౌగంధ—విజయే-ఏవమేతత్ ।
ప్రతీహారీ—కిం ఏదం. యౌగంధ—ఇదమ్ ।
ప్రతీహా—భణాదు భణాదు అయ్యో భణాదు.

14. "కదాచి దనృతం నోక్తపూర్వమ్.
రాజా—ఆ-అస్త్యేతత్"— పంచరాత్ర—పు. 30.
"న మహాసేనసమీపే అనృత మభిహితపూర్వమ్.
రాజా—ఆ-అస్త్యేతత్"— ప్రతిజ్ఞా—పు. 32.
అనృతం నాభిహితపూర్వం మయా. బాలచరిత—27.

15. అయం అక్రమః—అథ కః క్రమః పంచరాత్ర-పు. 7; ప్రతిమా-పు. 35.

16. స్వప్నవాసవదత్తమున—(పు. 62.)
"కాఞ్చుకీయః—క ఇహ భోః ! రత్నతోరణద్వార మశూన్యం కురుతే.
(ప్రవిశ్య)
ప్రతీహారీ—అయ్య । అహం విజఆ । కిం కరీఅదు (ఆర్య-అహం విజయా-కిం క్రియతామ్)
కాఞ్చు—భవతి నివేద్యతాం నివేద్యతాం ... ... ...
అభిషేకనాటకమున-పు. 26.
శఙ్కుకర్ణః—క ఇహ భోః । కాంచనతోరణద్వారమశూన్యం కురుతే.
ప్రతీహారీ—అయ్య । అహం విజఆ । కిం కరీఅదు. (ఆర్య అహంవిజయా-కిం క్రియతామ్)
శఙ్కు—విజయే నివేద్యతాం నివేద్యతాం ... ... ...

అందుననే (పు. 52)

'రాక్షస—క ఇహ భోః । ప్రవాళతోరణద్వార మశూన్యం కురుతే.
ఆర్య-అయమస్మి కిం క్రియతామ్.'

ప్రతిమానాటకము—పు. 90.

కాఞ్చు—క ఇహ భోః । కాంచనతోరణద్వార మశూన్యం కురుతే.

ప్రతీహారీ—అయ్య ! అహం విజఆ । కిం కరీఅదు.

కాఞ్చు—విజయే । నివేద్యతాం నివేద్యతాం ... ... ...

17. అభిషేకనాటకము. పు. 12.

"వాలీ—(ఆచమ్య) పరిత్యజంతీవ మాం ప్రాణాః । ఇమా గఙ్గా ప్రభృతయో మహానద్య ఏతా ఊర్వశ్యాదయో అప్సరసో మా మభిగతాః । ఏష సహస్రహంసప్రయుక్తో వీరవాహీ విమానః కాలేన ప్రేషితో మాం నేతుమాగతః। భవతు అయమయ మాగచ్ఛామి(స్వర్యాతః)

ఊరుభంగము—పు. 114.

రాజా— ...... పరిత్యజంతి మే ప్రాణాః ......ఇమా ఊర్వశ్యాదయో అప్సరసో మా మభిగతాః ...... ఏతా గఙ్గాప్రభృతయో మహానద్యః । ఏష సహస్రహంసప్రయుక్తో మాం నేతుః వీరవాహీ విమానః కాలేన ప్రేషితః । అయ మయ మాగచ్ఛామి । (స్వర్గం గతః)

18. రాజా—దేవి ! ప్రవిశ త్వ మభ్యంతరం పద్మావత్యాసహ.

యౌగంధ—నఖలు నఖలు ప్రవేష్టవ్యమ్ ...... స్వప్నవా-పు. 75.

రాజా—బృహన్నలే ! ప్రవిశ త్వ మభ్యంతరమ్.

భగవాన్—అర్జున ! నఖలు నఖలు ప్రవేష్టవ్యమ్...పంచరాత్ర-పు. 42.

19. సీతా—సత్తోసి.

రావణః—హాహాహ! అహో పతివ్రతాయా స్తేజః-ప్రతిమా-86 (V అంక)

సీతా—సత్తోసి.

రావణః—హాహాహ! అహో పతివ్రతాయాస్తేజః-అభిషేక-20 (II అంక)

20. వృద్ధగోపాలకః- హీహీ షుట్టు ణచ్చిదమ్ । షుట్టు గాఇదం । జావ అహంపి ణచ్చేమి(హీహీ సుష్టు నృత్తమ్, సుష్టు గీతమ్ । యావ దహమపి నృత్యామి)

పంచరాత్ర- అంక. II పు. 22

వృద్ధగోపాలకః—హీహీ షుట్టు ణదం । షుట్టు వాఇదం.

ష్టట్టు ణచ్ఛిదం । జావ అహం వి ణచ్ఛేమి. బాలచరిత-III అంక. పు. 42.

21. "అతిస్నిగ్ధ మనురూపం చాభిహితమ్ తత్రభవత్యా"
స్వప్న- అంక-VI పు. 70. పంచ- అంక. III పు. 46.

22. "అహో బలవాంశ్ఛాయ మంధకారః । సంప్రతిహి"— బాలచరిత. అంక. I పు. 7; చారుదత్త- అంక. I పు. 17.

23. "అహో పరిజణస్స పమాదో"—(అహో పరిజనస్య ప్రమాదః)అవిమారక- అంక. IV పు. 54. స్వప్న- అంక. V పు. 56.

24. "అహో హాస్య మభిధానమ్"—ప్రతిజ్ఞా- అంక. 4. పు. 67, 71; పంచరా- అంక. 3. పు 48. దూతఘటో- పు. 66.

25. "అలం దాణిం భవం అదిమత్త సంతప్పి అ. స్వప్నవా—అంక. 6. పు.68
అళం దాణి భవం అదిమత్తం సంతప్పిదుం (అల మిదానీం భవా నతిమాత్రం సంతప్తుం) చారుదత్త- అంక. I పు. 8.

26. 'ఆశ్రమపదద్వారమాత్ర మపి సంభావయిష్యామః'- మధ్యమవ్యాయోగ- పు. 25.
'ఆశ్రమపదద్వారమాత్రమపి భరత స్యానుయాత్రం భవిష్యామః'—ప్రతిమా. అంక. 4 పు. 73.

27. ఉస్సరహ ఉస్సరహ అయ్యా ! ఉస్సరహ (ఉత్సరతోత్సరత్వార్యాః । ఉత్సరత) స్వప్న- పు. 1, 2, 3. ప్రతిజ్ఞా- పు. 63,65. అంక. 4 ఊరుభంగ- పు. 99. ప్రతిమా-

28. ఏసా గచ్ఛామి మందభాఆ—(ఏషాగచ్ఛామి మందభాగా) స్వప్న- పు. 9 (అంక. I) ప్రతిజ్ఞా- పు. 17 (అంక. I) బాలచరిత-(అంక. I) పు. 6; అభిషేక- (అం. I.) పు. 6.

29. 'న శక్నోమి రోషం ధారయితుమ్'—అభిషేక- పు. 19. దూతఘటో- పు. 69; ప్రతిమా- పు. 20.

30. 'బాఢం ప్రథమః కల్పః'—పంచ- పు. 19. అవి- పు. 26. బాల- పు. 55. మధ్య- పు. 24. ఊరుభంగ- పు. 96. అభిషేక- పు. 68. ప్రతిమా- అంక. 6. పు. 90.

31. 'యావ దహ మపి మహారాజస్య ప్రత్యంతరీభవిష్యామి'—అభిషేక- అంక. 5. పు. 53.

'త దాగమ్యతాం వయమపి తావన్మహారాజస్య ప్రత్యనంతరీభవామః'-
ఊరుభంగ- పు. 96.

32. 'వక్తు కామ మివ త్వాం లక్షయే'—అభిషేక- అంక. 4. పు. 43. ప్రతి
జ్ఞా- అంక. 2. పు. 25.

33. 'స్థితో మధ్యాహ్నః' స్వప్నవాస- పు. 10. ప్రతిజ్ఞా- పు. 46.

34. 'అభ్యంతర చతుశ్శాలా'—చారుదత్త-పు. 20, 26, 53. స్వప్నవా-పు. 27

35. 'ఏకాతపత్ర'—స్వప్నవాసవ. 6—19. అవిమారక. I. 1. బాలచరిత.
5—20. దూతవాక్య. 56. ప్రతిమా. 7—1.

36. 'కనకరచిత'—ప్రతిజ్ఞా. 4. 4. అభిషేక. 2. 2, 2. 5, 6. 4, 6. 11.

37. 'సితకుసుమాల కృతోత్తరీయః' దూతవా—శ్లో. 3 'దర్భకృతోత్తరీయం'
ప్రతిజ్ఞా. 4. 3.

38. 'సముద్రగృహకమ్'—స్వప్నవా. పు. 52, 55, 56.
'సముద్రగృహకేశయానః'—ప్రతిమా. అంక. 2 పు. 27.

39. వ్యాఘ్రానుసారచకిత—చారుదత్త- I. 9. మధ్యమవ్యాయోగ- 3.

40. 'సజలజలదగాత్రః'. మధ్యమవ్యాయోగ-32 'సజలజలధరేంద్రనీలనీరో'-
అభిషేక. 4. 3 'సజలజలదసన్నిభప్రకాశః' 4. 5.

41. లలితగంభీరాకృతివిశేషః—దూతఘటో- పు. 64. బాలచరిత. 61.

42. దూతసంపాతః—స్వప్నవాసవ. VI అవిమారక. పు. 12.

43. దహిపిండపండరేసు (దధిపిండపాండరేషు)అవిమారక.28.పంచరాత్ర. 32

44. దత్తమూల్యా ఇవ మే ప్రాణాః—ఊరుభంగ. పు. 98.
ప్రత్యయదత్తమూల్యం—చారుదత్త. I. శ్లో. 4.
రాజగృహదత్తమూల్యాః—ప్రతిజ్ఞా. III. 1.

45. కాంచనస్తంభసదృశః. మధ్యమవ్యా- శ్లో. 42.
కాంచనస్తంభ సమప్రమాణః. ఊరుభంగ- శ్లో. 45.

46. హావత్స! రామ! జగతాం నయనాభిరామ. ప్రతిమా. II. 4.
హావత్స సర్వజగతాం జ్వరకృత్కృతాస్త్ర. అభిషేక- V. 13.

47. భాగ్యైశ్చలైర్విస్మితః-స్వప్నవా. I. 3. భాగ్యైశ్చలైర్మహాదవాప్య
గుణోపఘాతం. ,, VI-4. విహగవాహనమాత్రవిస్మితోదూతః-దూత-

గాంధారవిషయవిస్మితశకునే—పంచరా. విస్మితశబ్ద మిట గర్వ మను నర్థమున వాడఁబడినది

48. తపోవన మిదం గ్రామీకరో త్యాజ్ఞయా-స్వప్న. I - 3. వన మిదం నగరీకరోతి-ప్రతిమా-VII - 4.

49. వ్యపాశ్రయణా (ప్రార్థనా) స్వప్న -I పంచరా. మధ్యమవ్యాయోగ.

50. ప్రతతరుదితక్షామవదనః-స్వప్న. I. 14. ప్రతతరుదితైఃకృతాన్ధయోధ్యా. ప్రతిమా. III. 17.

51. ప్రోషితనక్షత్రచంద్ర మివ నభో రమణీయః సంవృత్తః. స్వప్న. I. దూత. 3. మధ్య. 33. ప్రతిమా. VII. 14.

52. రవి రపి చ సంక్షిప్తకిరణః. స్వప్న. I. 16. అస్తాద్రిమస్తకగతః ప్రతిసంహృతాంశుః అభి. 4. 23.

53. సముదాచారః. స్వప్న. అంక. II. (సముదాఆరో) దేవసముదాచారః ప్రతిమా. V. 74. అతిథిసముదాచారః. 78. బ్రాహ్మణసముదాచారః.79.

54. అజ్జ ఏవకిళ సోభణం నక్షత్తం. స్వప్న. అంక II. (అద్యఏవకిల శోభనం నక్షత్రం). అవి. పుట 39. అద్యైవ కిల గుణవ న్నక్షత్రం. పంచ. 98.

55. అహో అకరుణా ఖు ఇస్సరా. స్వప్న. అంక. 3,5. (అహో అకరుణా ఖలు ఈశ్వరాః) అభి. పుట 23.

56. మణిభూమిఏ-స్వప్న. అంక 3. ప్రతిజ్ఞా-పుట 37.

57. సక్కం భణిదుం సరచావహీణో కామదే వోత్తి. (శక్యమ్ భణితుం శరచాపహీనో కామదేవ ఇతి) స్వప్న. అంక. 3. అహం విచింతేమి- ససరీరో భఅవం కామదేవో ఈదిసో భవేత్తి-అవిమా. IV. 55.

58. దారుపవ్వదకం-స్వప్న. అంక. 4. (దారు పర్వతకమ్) అవి. 47.

59. శ్రుతిసుఖనినదే-స్వప్న. VI. 1. శ్రుతిసుఖ మధురే స్వభావరక్తా-ప్రతిజ్ఞా- II. 12.

60. సచ్చేణసపామి-(సత్యేనశపామి) స్వప్న. అంక 4. శపామి సత్యేనభయం నజానే-మధ్యమ వ్యా. 41. పు. 18.

61. గచ్ఛతు భవాన్ పునర్దర్శనాయ-స్వప్న. I. అవి. 67. చారు. 44. బాలచరిత. 67. మ. వ్యా. 24. దూత వా. 48.

9. దూతవాక్య దూతఘటోత్కచోరుభంగములఁ గల యుద్ధనువర్ణనమును గాంచినచో నొక కవియే వీని రచించియుండునని తప్పక తోఁచును.

దూతవాక్య - శ్లో. 32.

"కైరాతం వపు రాస్థితః పశుపతి ర్యుద్ధేన సంతోషితః
వహ్నేః ఖాండవ మశ్నతః సుమహతీ వృష్టి శ్శరై శ్ఛాదితా
దేవేంద్రార్తికరా నివాతకవచా నీతాః క్షయం లీలయా
న న్త్వేకేన తదా విరాటనగరే భీష్మాదయో నిర్జితాః."

దూతఘటోత్కచ - శ్లో. 22.

"శక్రం పృచ్ఛ పురా నివాతకవచప్రాణోపహారార్చితమ్
పృచ్ఛ త్వస్త్రైః పరితోషితం బహువిధైః కైరాతరూపమ్ హరమ్
పృచ్ఛాగ్నిం భుజగాహుతిప్రణయినం యస్తర్పితః ఖాండవే
విద్యారక్షిత మద్య యేన చ జిత స్త్వం పృచ్ఛ చిత్రాంగదమ్.

ఊరుభంగ - శ్లో. 14.

"స్పృష్ట్వా ఖాండవధూమరంజితగుణా సంశప్తకోత్సాదనమ్
స్వర్గాక్రందహరం నివాతకవచప్రాణోపహారం ధనుః
పార్థే నాద్య బలా న్మహేశ్వరరణక్షేపావశిష్టైః శరైః
దర్పో త్సిక్తయశా నృపా రణముఖే మృత్యోః ప్రతిగ్రాహితాః."

10. మఱియు నీ నాటకములయందు నీచపాత్రాభిధానములు గూడ నేక కర్తృత్వవాదమునే సూచించుచున్నవి. స్వప్నప్రతిజ్ఞానాటకములందును, రామనాటకములందును; ద్వారపాలిక 'విజయ'యే. దూతవాక్య ప్రతిజ్ఞాదులయందుఁ గంచుకి 'బాదరాయణుఁడే'. ప్రతిమాస్వప్నముల భటుఁడు సంభవ(వ) కుఁడే.

11. అవిమారకమునఁ బ్రథమాంకమునందుఁ గురంగీవాసవదత్తల వివాహములకై వారితలిదండ్రులు పడినయాందోళనము వర్ణింపఁబడినది. రెండు నాటకములనొక కవియే రచించియుండ నోపు ననియు నందు నవిమారకమే మొదటి దనియు లక్ష్మణసరూపు గారు వ్రాసియున్నారు.

12. పంచరాత్రమున (అంక. 2.)

(తతః ప్రవిశతి వృద్ధగోపాలకః).

వృషభదత్త కుంభదత్త మహిషదత్త ఆగచ్ఛ తాగచ్ఛత శీఘ్రమ్.

తతః ప్రవిశంతిసర్వే.

సర్వే - మాతుల వందామహే.

వృద్ధగోపాలకః—శాంతి ర్భవతు। శాంతి ర్భవతు। అస్మాకం గోధనస్య తావ త్తీం వేలాం గాయంతో నృత్యంతో భవామః.

బాలచరితము (అంక. 1)

తతః ప్రవిశతి వృద్ధగోపాలకః.

భో మేఘదత్త వృషభదత్త ఖలు కుమ్భదత్త...(ఉపసృత్య) మాతుల వందే.

వృద్ధగోపాలకః—శాంతి ర్భవతు అస్మాకం గోధనస్య.

దామకః—మాతుల...అద్య భర్తృదామోదరోఽస్మిన్ బృందావనే గోప కన్యకాభిస్సహ హల్లీసకం నామ ప్రక్రీడితు మాగచ్ఛతి.

వృద్ధగోపాలకః—తేనహి సర్వే గోపజనై స్సహ భర్తృదామోదరస్య హల్లీసకం ప్రేక్షామహే.

పై నాటకభాగములవలన బాలచరిత పంచరాత్రముల నొకకవియే రచియించె ననుట స్పష్టము.

13. దుర్బలులకు ఖడ్గగదాద్యాయుధములు గాని వీరులకుఁ దమబాహువులే సహజములగు నాయుధము లని కవి పలుమాఱు ప్రశంసించి యున్నాఁడు.

బాలచరితము - గిరితటకఠినాంసా వేవ బాహూ మమైతౌ
　　ప్రహరణ మపరంతు త్వాదృశాం దుర్బలానామ్
　　అథ మమభుజదండైః పీడ్యమానాశ్చ శీఘ్రం
　　యదినపతసి భూమౌ నాస్మి దామోదరోహమ్.

పంచరాత్రము - సహజౌ మే ప్రహరణం భుజౌ పీనాంసకోమలౌ
　　తావా శ్రిత్య ప్రయుధ్యేయం దుర్బలై ర్గృహ్యతేధనుః.

మధ్యమవ్యాయోగము-కాంచనస్తంభ సదృశో రిపూణాం నిగ్రహే రతః
　　అయంతు దక్షిణో బాహు రాయుధం సదృశం మమ.

14. అంధకారవర్ణనము- నగరపరిచితోహం రక్షిణో జ్ఞాతసారాః
　　తిమిరగహనభీమం వర్తతే చార్ధరాత్రమ్. అవిమా. (III-2)

దీనితో చారుదత్తమునందలి శ్లోకమును బోల్చిచూడుఁడు (1-13)

15. బాలచరితమున శంఖచక్రశార్ఙ్గనందకములను, గరుడకాత్యాయనులను, గుండోదరశూలనీలమనోజవులను గవి నాటకపాత్రములుగఁ గైకొనియెను. అట్లే దూతవాక్యమున సుదర్శనశార్ఙ్గకౌమోదకీపాంచజన్యనందకగరుడులు రంగ ప్రవేశ మొనర్పఁబడి

16. నాటకచక్రమునందు ముఖ్యముగ స్వప్నవాసవదత్తప్రతిజ్ఞాయౌగంధరాయణ పంచరాత్ర ప్రతిమానాటకములందును, దరువాత, మధ్యమవ్యాయోగ దూతవాక్యదూతఘటోత్కచాభిషేకములందును విశేషముగఁ గవి యనుష్టుప్శ్లోకములనే వాడియున్నాఁడు. ఈ క్రిందిపట్టికయం దేయేనాటకముల న్నెన్నిశ్లోకములుగలవో తెలుపఁబడినది.

| | మొత్తము. | అనుష్టుప్శ్లోకసంఖ్య. |
|---|---|---|
| 1. స్వప్నవాసవదత్తము. | 57 | 27 |
| 2. ప్రతిజ్ఞాయౌగంధరాయణము. | 66 | 28 |
| 3. పంచరాత్రము. | 152 | 73 |
| 4. ప్రతిమానాటకము. | 156 | 74 |
| 5. అభిషేకము. | 153 | 65 |
| 6. మధ్యమవ్యాయోగము. | 51 | 32 |
| 7. దూతవాక్యము. | 56 | 22 |
| 8. దూతఘటోత్కచము. | 52 | 21 |
| 9. అవిమారకము. | 97 | 15 |
| 10. బాలచరితము. | 103 | 37 |
| 11. కర్ణభారము. | 25 | 4 |
| 12. ఊరుభంగము. | 66 | 12 |
| 13. చారుదత్తము. | 55 | 17 |

ఇదియుఁ గొంతవఱకు నేకకర్తృత్వమునే సూచించుచున్నది.

పై కారణములవలనఁ ద్రివేండ్రపురనాటకముల నొకకవియే రచియించె నని మనకు విస్పష్ట మగుచున్నది. అయినను 'సుక్తంకరు'గారు ప్రతిజ్ఞాస్వప్ననాటకములు దక్క మిగిలినవాని కర్తృత్వము నిర్ణయింప వీలులే దనియు, స్థాపనయు, భరతవాక్యమును నీనాటకము లన్నింటియందును మ ఱెవరో చేర్చి రని యు నభిప్రాయపడుచున్నారు.[1] శంకరపండితులు ప్రతిమా, దూతఘటోత్కచ, మధ్యమవ్యాయోగ, కర్ణభార, ఊరుభంగనాటకములకర్త భాసుఁడు గాఁ డనియుఁ జారుదత్తము మృచ్ఛకటికనాటకమునకు సంగ్రహ మనియు, మృచ్ఛకటిక, పద్మప్రాభృతికములర

1. 'The Bhasa Problem- a proposed solution by V. S. Sukthankar. J. R. A. S. Vol. I Pages 126 to 143 (1925).

చించిన శూద్రకమహాకవియే భాసుఁ డనియు నిర్ణయ మొనర్చిరి. కాని నాటకములన నన్నిటిని విమర్శకదృష్టితోఁ జదివిన నేకకర్తృత్వమే స్థిరపడుచున్నది.

### భాసకర్తృత్వనిరూపణము.

గణపతిశాస్త్రిగారిచేఁ బ్రకటింపఁబడిన పైపదుమూఁడునాటకముల నొక కవియే రచియించె నని మన మంగీకరించినను, భాసుఁడు సుప్రసిద్ధప్రాచీననాటకకర్త యని నిరూపించినను దిరువనంతపుర నాటకములలోఁ గొన్నిటినైనను భాసుని వని నిర్ధారణ మొనర్పనిదే వానిని భాసనాటకచక్రములోని వనుట యొప్పదు. అలంకారగ్రంథములఁ గలయుదాహరణములనుఁ గైకొని, భాసునికర్తృత్వమును, గాలమును నిరూపింపవలసియున్నది.

(1) రామచంద్రగుణచంద్రుల 'నాట్యదర్పణము'నందు(బరోడాప్రతిపు. 84.)

"యథా భాసకృతే స్వప్నవాసవదత్తే శేఫాలికామండపశిలాతలా నవలోక్య వత్సరాజః——

పాదాక్రాంతాని పుష్పాణి సోష్మ చేదం శిలాతలమ్
నూనం కాచి దిహాసీనా మాం దృష్ట్వా సహసా గతా".

అని స్పష్టముగ భాసకృతస్వప్నవాసవదత్తముదాహరింపఁబడియున్నది. కాని యిందలిశ్లోకము తిరువనంతపురస్వప్నవాసవదత్తమునందుఁ గానవచ్చుట లేదు. చతుర్థాంకమున నీసంభాషణము గనుఁడు——

"విదూష——తత్తహోదీ పదుమావదీ ఇహ ఆఅచ్ఛి అ ణిగ్గదా భవే (తత్రభవతీ పద్మావతీ హాగత్య నిర్గతా భవేత్).

రాజా——కథం భవాన్ జానాతి ?

విదూ——ఇమాణి అవఇదకుసుమాణి సేఫాళిఆగుచ్ఛఆణి పేక్ఖదు దావ భవం (ఇమానవచితకుసుమాన్ శేఫాలికాగుచ్ఛకాన్ప్రేక్షతాం తావద్భవాన్).

రాజా——అహో విచిత్రతా కుసుమస్య- వసంతక !

ఇట శేఫాలికామండపశిలాతలమునకుఁ బద్మావతి వచ్చె నని వత్సరాజు గ్రహించియున్నాఁడు. నాట్యదర్పణశ్లోకముమాత్రము లేదు. ఆశ్లోకమును 'అహో విచిత్రతా కుసుమస్య' అను దానితోఁ బఠించిన శేఫాలికాంకము సంపూర్ణ మగుచున్నది. కాని మన మేల శ్లోకమును జేర్పవలయు నని సందియము కలుగక మానదు. ప్రాచీనగ్రంథముల వివిధదేశీయపుఁ బ్రతులఁ బరికించినచో నిది విశద మగును. కొన్నిస్థలముల శ్లోకాదులవదలివైచియును, నొక్కొకచోఁ జేర్చియును గ్రంథ

ములుమార్పఁబడియున్నవి. వంగదేశీయశాకుంతలపుఁబ్రతికిని మదరాసుప్రతికిని గలభేదమును బరికింపుఁడు. కేవలశ్లోకములు మాత్రమే కాక యొకయంకమున నయిదాఱుపుటల గ్రంథము హెచ్చుగ నున్నయది. దక్షిణదేశశాకుంతలప్రతియందు 'నఖలు' 'కల్యాంభోభిః' అనుశ్లోకములు ప్రథమాంకమున లేవు. సాహిత్యదర్పణ (VI-263) దశరూపకముల (III-25) గలమాళవికాగ్నిమిత్రనాటకభాగములఁ బరిశీలించినచో మననాటకము లెటుల మార్పు నొందినవో వ్యక్తమగును. పూర్ణసరస్వతివ్యాఖ్యతోఁ బ్రచురింపఁబడిన మేఘసందేశమునఁ బదిశ్లోకములు గానవచ్చుట లేదు. భవభూతి తన యుత్తరరామచరితమునందు (అంక. VI శ్లో. 31, 32, 36) రామాయణములోని వని యుదాహరించిన శ్లోకము లందుఁ గానరావు. నాట్యదర్పణమున నుదాహరింపఁబడిన గ్రంథము మనకుపలబ్ధమయిన స్వప్నవాసవదత్తమే యనియు, నది యొకవేళ శాకుంతలాదులవలె మార్పును జెందియుండు ననియు మన మూహింపవలసియున్నది.

మఱియు నీగ్రంథమున శూద్రకుని మృచ్ఛకటికప్రశంస పలుసారు లొనర్పఁబడినది. ఒకచో (పు. 53) దరిద్రచారుదత్తప్రశంసయుఁ గలదు. గ్రంథకర్తలు భాసశూద్రకుల వేఱువ్యక్తులుగ గణించి రనియు, దరిద్రచారుదత్తమును, స్వప్నవాసవదత్తమును దిరువనంతపురనాటకము లే యనియు మనకు స్పష్ట మగుచున్నది.

(2) సాగరనందని 'నాటకలక్షణరత్నకోశము'న.

"యథా స్వప్నవాసవదత్తే(నేపథ్యేసూత్రధారః ఉత్సారణాం శ్రుత్వాపఠతి) అయే కథం తపోవనే ప్యుత్సారణా(విలోక్య) కథం మంత్రీ యౌగంధరాయణో వత్సరాజస్య రాజ్యప్రత్యానయనం కర్తుకామః పద్మావతీజనే నోత్సార్యతే."

ఇదియు మనకు లభించినస్వప్ననాటకమున మార్పుఁజెందినది. ఉత్సారణముతో నాటక ముపక్రమింపఁబడుటచే సాగరనందిఁ డీనాటకమునే యుదాహరించెనని గ్రహింపఁగును. మఱియొక స్వప్నవాసవదత్త మేల యుండరా దనిన రెండును నొకపేరుతోడనే యుండుటయును నుత్సారణముతో మొదలిడుటయు నసంభవములు. రాజశేఖరునిశ్లోకమున స్వప్నవాసవదత్తము భాసుని దని యుద్ఘాటింపఁబడినది. మఱియొకగ్రంథము దొరకువఱకు మనస్వప్నవాసవదత్త మిదియే యనవలయును. స్వప్నవాసవదత్తము నింకొకకవి రచించెనని యేయాలంకారికుఁడును దెలిపియుండలేదు. ఒకకవి రచించిననాటకమునే పేరైనను మార్పక మఱియొకకవి రచించియుండుననుట యుక్తియుక్తము గాదు. శక్తిభద్రకృత మగు "ఉన్మాద

వాసవదత్తమే" "స్వప్నవాసవదత్త" మని యొకరు వ్రాసిరి గాని యది యవిశ్వసనీయము. ఉదయనునికథ ననుసరించి పెక్కు నాటకములు రచియింపఁబడియుండ, మన మేల యున్మాదవాసవదత్తమును స్వప్నవాసవదత్త మనవలయును? హీరానందశాస్త్రిగారు తమగ్రంథమున నున్మాదస్వప్నపదములు సమానార్థకము లని వ్రాసియున్నారు. అది వింతగ నున్నది!

(3) అభినవగుప్తపాదాచార్యుఁడు (1000 A. D.) తనభరతనాట్యవేదవివృతియందు (బరోడా-నాట్యశాస్త్రము-పుట 39)

'క్వచిత్క్రీడా యథా స్వప్నవాసవదత్తాయామ్' అని క్రీడ కుదాహరణముగ నీనాటకము నిచ్చియున్నాఁడు. తిరువనంతపురప్రకటిత మగుస్వప్నవాసవదత్తమున ద్వితీయాంకమునఁ గల కందుకక్రీడ నిది సూచించుచున్నది. మఱియు నాట్యవేదవివృతియందు 87 వ పుటను గూడ స్వప్నవాసవదత్త ప్రశంసయే గలదు.

'ధ్వన్యాలోకలోచనము'నందును (నిర్ణయసాగరప్రతి పు. 152), హేమచంద్రుని కావ్యానుశాసనమునందుఁ గొలఁదిమార్పులతోడను (నిర్ణ-పు. 21)

"సంచితపక్ష్మకవాటం నయనద్వారం స్వరూపతడనేన
ఉద్ఘాట్య సా ప్రవిష్టా హృదయగృహం మే నృపతనూజా".

అనుశ్లోక ముదాహరింపఁబడినది. అది తిరువనంతపుర నాటకమునఁ గానరాదు. గణపతిశాస్త్రిగారును దీనిని దాము ప్రకటించిన నాటకమునకు సంబంధించినది కా దనిరి. వీరివాదమునే 'ఘటకు' మున్నగువారును గైకొనియున్నారు. కాని వీరియభిప్రాయము సరికాదేమో? ఈశ్లోకమును షష్ఠాంకమున—

(నిశ్వస్య ఘోషవతీం విలోక్య చ)

"శ్రుతిసుఖనినదే......" యను శ్లోకమునకు ముందుగఁ జేర్చినచో సందర్భానుసారముగ నుండు నని తోఁచెడిని. గణపతిశాస్త్రి మున్నగువారి యభిప్రాయానుసార మీశ్లోకము భార్యాభర్తల ప్రథమానురాగమును సూచించుననుటయు సరికాదు. హృదయమునఁ జిత్రింపఁబడి మఱపునకు వచ్చుటలే దనియే కవి యభిప్రాయము. ఇది స్వప్నదృష్టవాసవదత్తాస్మరణము గావచ్చును. లక్షణగ్రంథప్రామాణ్యత యటుండఁ, గావ్యనాటకముల వివిధప్రతులఁ బరిశీలించినఁ గొన్నియుదాహృతశ్లోకము లందుఁ గానరావు, నిట్టివాదముల నిష్ఫలత్వము విస్పష్టము. మఱియొక స్వప్నవాసవదత్తములోని వని యంగీకరింతు మనిన, సమానకథాసం

విధానములతో రెండునాటకముల నొక్క గ్రంథనామముతోడ నిరువురుకవులురచించి రనవలయును. 'లోకో భిన్నరుచిః' అను సూక్తి కిది యత్యంతవిరుద్ధము.

దరిద్రచారుదత్తనాటక మభినవగుప్తునిచేఁ బేర్కొనఁబడినది. ఇది శూద్రకకవిరచిత మృచ్ఛకటిక మనవలయు ననిన, గ్రంథనామ మేలమార్పఁబడినది? చారుదత్తమునఁగల 'దారిద్ర్యం ఖలు నామ పురుషస్య సోచ్ఛ్వాసం మరణమ్' అను వాక్యమునుబట్టియుఁ దత్ప్రసంగవశమునఁ గన్పడు శ్లోకములను బట్టియు నభినవగుప్తుఁడు చారుదత్తమును, దరిద్రచారుదత్త మని యుదాహరించియుండు ననితోఁచును.

మఱియు నాట్యవేదవివృతియందే (Baroda Edition P. 320) యభినవగుప్తపాదులచే నొకశ్లోకము స్వప్నబంధములోని దని తెలుపఁ బడినది.

"మహాకవినా భాసే నాపి స్వప్నబంధే ఉక్తః-
త్రేతాయుగం తద్ధి న మైథిలీ సా
రామస్య రాగపదవీ మృదుచా స్యచేతః
లబ్ధ్వా జనస్య యది రావణ మస్య కాయం
ప్రోత్కృత్య త న్నతిలశో నవితృప్తగామీ"

ఇది వాసవదత్తాయుదంతమునకు సంబంధించినది కాదు. స్వప్నబంధ మని రామాయణగాథను దేనినైన భాసుఁడు కావ్యముగ రచియించియుండునా? ఇది భావివిమర్శనమువలనఁ దేలవలసినవిషయము.

(4) శారదాతనయుని (క్రీ. శ. 12 వ శతాబ్దము) భావప్రకాశనమునఁ బ్రశాంతనాటకమునకు స్వప్నవాసవదత్త ముదాహరణముగ నీయఁబడినది.[1] నాటకలక్షణముల నవలోకించి సుబంధుఁడు వాని పూర్ణ, ప్రశాంత, భాస్వర, లలిత, సమగ్రము లనునైదువిధములుగ విభజన మొనర్చె ననియుఁ దెలుపఁబడినది.

ప్రశాంతరసభూయిష్ఠం ప్రశాంతం నామనాటకమ్
... ... ... ...
స్వప్నవాసవదత్తాఖ్య ముదాహరణ మత్రతు.
ఆచ్ఛిద్య భూపాత్ సవ్యసనా దేవీ మాగధికా కరే
న్యస్తా యత స్తతోన్యాసో ముఖసంధి రయం భవేత్.
న్యాసస్య చ ప్రతిముఖం సముద్భేద ఉదాహృతః
పద్మావత్యా ముఖం వీక్ష్య విశేషకవిభూషితమ్

1. అధి-8-పు 238-139. బరోడాప్రతి.

జీవం త్యవంతికే త్రేత జ్ఞాతమ్ భూమిభుజా యథా.

ఉత్కంఠితేన సోద్వేగం బీజోక్తి ర్నామకీర్తనమ్
యేహి వాసవదత్తే క్వ క యాసీ త్యది దృశ్యతే
సహావస్థితయో రేక ప్రాప్తాన్యస్య గవేషణమ్
దర్శనస్పర్శనాలాపై రేత త్స్యాత్ బీజదర్శనమ్
చిరప్రసుప్తః కామో మే వీణయా ప్రతిబోధితః
తాంతు దేవీం న పశ్యామి యస్యా ఘోషవతీప్రియా
కింతే భూయః ప్రియం కుర్యా మితి వాగ్యత్ర నోచ్యతే
త మనుద్దిష్టసంహార మిత్యాహు ర్భరతాదయః.

ఇది మనకు లభించిన స్వప్న వాసవదత్తమును గాంచియే శారదాతనయుఁడు రచియించె ననుటకు సందియము లేదు. 'చిరప్రసుప్తః' అనుశ్లోకము వాసవదత్తము లోనిదే (అంక-VI-3 శ్లో.) కాని న్యాసనముద్భేదమున కొసఁగిన యుదాహరణము 'పద్మావత్యా ముఖంవీక్ష్య' అనునది గానరాదు. గణపతిశాస్త్రిగారాశ్లోకమున 'జ్ఞాతం భూమిభుజా యథా' అనుదానిని 'జ్ఞాతమేవపురా మయా' అని మార్చి పంచమాంకమున 'శయ్యాయా మవసుప్తం మాంబోధయిత్వా' అను శ్లోకానంతరమునఁ జేర్చినారు. కథాసరిత్సాగరమునఁ బ్రసంగవశమున వాసవదత్త తాను వత్సరాజువలనఁ గ్రహించిన యమ్లానమాలాతిలకములను బద్మావతికి రచియించె ననియు దానిం గాంచి బద్మావతి తల్లి యామెయుత్తమకులసంజాత యనిగ్రహించె ననియు వ్రాయఁబడినది. వాసవదత్తమునందలి తృతీయాంకమున వాసవదత్తమాలారచనమునందు నిపుణ యని పేర్కొనఁబడినది.

'అస్మాకం భట్టిణీ భణతి—మహాకులప్రసూతా స్నిగ్ధా నిపుణేతి ఇమాం తావత్ కౌతుకమాలాం గుంఫ త్వార్యా'—

భాసమహాకవి వాసవదత్తయొక్క మాలికారచనానైపుణ్యమును బేర్కొని తిలకరచనమును విడిచియుండఁడని తోఁచుచున్నది. అందువలన శారదాతనయుని 'పద్మావత్యా ముఖం వీక్ష్య' అనుశ్లోకము స్వప్నవాసవదత్తములోనిదే యగును. 'కింతే భూయః ప్రియం కుర్యామి' అనునది స్వప్నవాసవదత్తమున లేదు. భావప్రకాశమున నిది యనుద్దిష్టసంహారోదాహరణముగఁ గైకొనఁబడినది.

(5) భోజుని 'శృంగారప్రకాశమున' (11వ శతాబ్దము) స్వప్నవాసవదత్తములోని పంచమాంకమునందలి కథ స్పష్టముగ వివరింపఁబడినది.

'స్వప్నవాసవదత్తే పద్మావతీ మస్వస్థాం ద్రష్టుం రాజా సముద్రగృహకం గతః। పద్మావతీరహితం చ తదవలోక్య తస్యా యేవ శయనీయే సుష్వాప। వాసవదత్తాంచ స్వప్నవ దస్వప్నే దదర్శ। స్వప్నాయమానశ్చ వాసవదత్తా మాబభాషే। స్వప్నశబ్దేన చేహ స్వాపో వా స్వప్నదర్శనం వా స్వప్నాయితం వా వివక్షితమ్' 12 వ ప్రకాశము.[1]

వత్సరాజు పద్మావతిని జూడ సముద్రగృహమున కేగుటయు, నందు, పద్మావతిం గానక నిద్రం జెందుటయు వాసవదత్తతో సంభాషించుటయు వర్ణింపఁబడినవి. ఇది తిరువనంతపురస్వప్నవాసవదత్తములోని కథయే గాని మఱి యొకటి కాదు. శృంగారప్రకాశమునందే యవిమారకనాటకప్రశంసయుఁ గలదు.

(6) క్రీ. శ. 12 వ శతాబ్దమునాఁటి సర్వానందుని 'యమరటీకా సర్వస్వము'న[2]—

'త్రివిధః శృంగారో ధర్మార్థకామభిన్నః తత్రాద్యో యథానందయంత్యాం బ్రాహ్మణభోజనమ్ ద్వితీయః స్వదేశ మాత్మసాత్కర్తు ముదయనస్య పద్మావతీ పరిణయో రర్థశృంగారః। తృతీయః స్వప్నవాసవదత్తే తస్యైవవాసవదత్తాపరిణయః కామశృంగారః'— అని కలదు.

మనకు లభించిన స్వప్నవాసవదత్తమున వాసవదత్తాపరిణయము వర్ణింపఁబడమి నది భాసకృతము గాదని పూర్వపక్షము. 'స్వప్నవాసవదత్తే' అనునది 'ద్వితీయః' అనుమాట తరువాతఁ బఠింపవలయు నని కొందఱి యభిప్రాయము. త్రివిధశృంగారముల కుదాహరణమొసఁగుచు, సర్వానందుఁ డొక స్వప్నవాసవదత్తమునే యేలకైకొన వలయును? ఆతఁడుదాహరించిన మిగిలిన గ్రంథనామములు నశించియుండెనా? ఇదియు విమర్శనీయము.

1. ఈగ్రంథమునఁగొన్ని ప్రకాశములు శ్రీయదుగిరి యతిరాజసంపత్కుమారరామానుజముని చేఁ బ్రకటితములు. 2. తిరువనంతపుర గ్రంథావళి- సంఖ్య 48- పు 147.

# ఆంధ్రవాఙ్మయము—హాస్యరసము.

సాగి వేంకటనరసింహాము ఎమ్. ఏ. గారు, రాజమహేంద్రవరము.

---

సాంస్కృతికాలంకారికులచే హాస్యము నవరసములలో నొకటిగాఁ జేర్పఁబడినను, దానికి మిగిలినరసములతోపా టున్నతస్థాన మెప్పటికిని లేదు. కాలము నుమహాశక్తి యుత్తమకావ్యముల నధమకావ్యములనుండి వేఱుపఱచు శక్తి గలది. ప్రపంచవాఙ్మయమున నప్పుడప్పుడు హాస్యప్రధానము లగుకావ్యములు బయలు దేఱి యుండకపోవు. వానిని గాలము మ్రింగివైచినది. వానికి శాశ్వతముగ నిలువఁదగిన బలము గాని శక్తి గాని లేదని యర్థము. ఈలోపము భగవంతుని సృష్టిలోనిదే యని చెప్పవగును. ఆత్మాశయములలో హాస్యమునకు నుత్తమస్థానము లేదు. అందువలననే మహాకవులు దానిజోలికిఁ బోలేదు. ప్రజలుగూడ వానియందు శ్రద్ధ వహింపలేదు. జీవనమునకు హాస్య మానందదాయకమే. కాని యనివార్యావశ్యకము గాదు. ఉప్పులేనిది కూరకు రుచిలేదు; అయినను నది లేనంత మాత్రమున జీవనహాని లేదు. ఇట్లు సంస్కృతము, గ్రీకు, ల్యాటిన్, మొదలగు ప్రాచీనభాషలయం దున్న వాఙ్మయములలోను మిగిలినభాషలలో నున్నప్రాచీనగ్రంథములలోను బ్రహసనము లనుశాఖ లేకున్నది. కావ్యములలోమాత్ర మచ్చటచ్చట హాస్యముకలదు. అన్యావలంబనము లేని స్వతంత్రజీవనము దానికి లేదు.

హాస్యముకొఱకుఁ బాత్రలను భాషను గూడ నున్నతినుండి క్రిందికి దింపవలసియుండును. లేక నీచపాత్రలను విస్తారముగఁ బ్రవేశింపఁ జేయవలెను. అసలు నాటకములే రుచింపని మనపూర్వుల కావిధముగఁ బాత్రలను భాషను గ్రిందికి దించుట యెంతమాత్రము సమ్మతము కాలేదు. గోల్డుస్మిత్ కవి యభిప్రాయ మీసందర్భమునఁ బ్రశంసింపఁదగి యున్నది.

"To expect exalted humour is contradiction in terms. The poet must therefore place the object he would have, the subject of humour in a state of inferiority; in otherwords, the subject of humour must below."

"హాస్య ముత్కృష్ట మనఁబూనుట విరుద్ధము. హాస్యవిషయ మెప్పుడును నీచస్థానమునందే కవిచే నుంపఁబడవలెను." అని పై వాక్యమునందలిసారాంశము.

ఉదాహరణము:—మనవాఁడు సస్యపరీక్షలో గట్టివాఁడు. వానికి ముక్కో క శే లోటు. ప్రతాపరుద్రీయనాటకములోని యుగంధరమంత్రిపాత్రము హాస్యజ

నకముగుటకు నీచపాత్ర మగుపిచ్చివాఁడుగా మాఱినది. అనఁగాఁ బిచ్చివాఁడుగా మాఱుటచేతనే యంతటిహాస్యమున కవకాశము గలిగినది. ఇట్లయ్యు హాస్యమును మనము తేలికగాఁ ద్రోసివేయుట తప్పు. పైన చెప్పినయుదాహరణమును మరల గ్రహించి హాస్యరసప్రాశస్త్యమును నుడివెదను. జీవనమునకు హాస్యము మనయాంధ్రదేశస్థుల భోజనములోని యుప్పువంటిది. రుచిలేనిపాకము సర్వథా త్యాజ్యము. "అంగనమంగ్గనా అయ్యగారిరామనాపప్పులోకి ఉప్పులేదు వట్టికూడు మ్రింగనా" అను పరిహాసగీత మెల్లరు వినినదే. అట్లే హాస్యము లేనిప్రసంగము శోభిల్లదు. పామరులనుండి పండితులవఱకును, పేదవానినుండి మహారాజువఱకును నందఱునెల్లపుడు నేదో యొకహాస్యప్రసంగ మున్ననేకాని తృప్తి నందరు. జీవితములోని కష్టములను మఱపించి మానవునికాయుర్దాయము పెంపొందించునది హాస్యము. ఈవిషయమై నిత్యానుభవముగలవారి కింతకంటె నెక్కువగఁ జెప్పుట యనావశ్యకము. మిగిలిన రసము లన్నిటికంటె నిది ప్రజలచే నెక్కువసారు లుపయోగింపఁబడును.

పూర్వకాలమున రాజాస్థానములయందు హాస్యగానికి నొకవిధముగా నగ్రస్థాన ముండెడిది. అతఁ డెన్నితప్పులు గావించినను శిక్షలేదు. భోజరాజాదినృపుల యాస్థానములందలి హాస్యగాండ్ర కథలు మన కనుశ్రుతముగా వచ్చుచున్నవి. అక్బరునాస్థానమున రాజాబీర్బలను మంత్రి గొప్పహాస్యగాఁడు. ఈ కారణముననే సంస్కృతనాటకములందు విదూషకునిపాత్ర మనివార్యమైనది. హాస్యమును గలిగించుటలో విటుఁడు, చేటుఁడు, నటి, మారిషుఁడు మొదలగువారును దోడ్పడుచుందురు. మనవీథినాటకములలో రసభంగమునకైన నొప్పికొందురుగాని హాఁస్యగాఁడు లేనిది యొక్కక్షణము గడువను. ఇట్లే తోలుబొమ్మలాటలలోఁ గూడ కేతిగాఁడు, జుట్టుపోలిగాఁడు, బంగారక్క పాత్రలు సర్వజనాహ్లాదము లైనవి. మన కనుశ్రుతముగా వచ్చుకథలలోఁ దెనాలి రామలింగనికథ లత్యంతవ్యాప్తి గలవి. అతఁడు నిజముగ, కృష్ణదేవరాయల యాస్థానమున నుండెనో లేదో యెఱుంగము ఆకథలలోఁ గొన్నికల్పితము లనుటయు స్పష్టమే. కాని యట్టివ్యక్తియొకఁడు కలడనియు, నతఁడు తనసమకాలికులను బొట్ట చెక్కలగునట్లు నవ్వించె ననియు- నాతనికథ లిప్పటికిని మనకు నాహ్లాదము గలిగించుచున్నవనియు ననుట స్పష్టము. ఇట్టివే పరమానందయశిష్యుల కథలును. గురువుగారు సూదిని దెమ్మని శిష్యులకుఁ జెప్పఁగా నందఱు నాపని నాచరించి గురువుగారిమన్ననఁ బొందఁదలఁచి

యొకదూలమునకు సూదిని గ్రుచ్చి యందఱు నాదూలమును మోసికొని వచ్చి గురువుగారికి సూదిని సమర్పించినమహానుభావు లీ పరమానందాయశిష్యులే.

ఇఁక హాస్యమునకు నిర్వచనమునుఁ జేయఁ బ్రయత్నింతము. హాస్యనిర్వచనముం జేయఁ బ్రయత్నించువాఁడు హాస్యపాత్రుఁ డగు ననుసామెత యొకటి కలదు. ఈసందర్భమున ఆంగ్లవిశ్వకోశము(Encyclopoedia Britannica) యొక్కసహాయమును గ్రహించి నాయూహను జతచేసి గట్టునఁబడదలఁచినాను. హ్యూమరు, విట్టు(Humour, wit) అను, నాంగ్లపదములకు సరియైన యాంధ్రపర్యాయపదములు లేవు. శ్రీ పానుగంటిలక్ష్మీనరసింహారావుగారి సాక్షి ప్రథమ సంపుటమునకుఁ బీఠిక వ్రాయుచు, బ్ర॥ కూచి నరసింహముగారిట్లు వ్రాసిరి. "విట్టనఁ గేవలము శ్లేష కాదు. నర్మాలాప మనినను సరిపడదు. ప్రశ్న—చూడమ్మ యెక్కడండి...ప్రత్యుత్తరము నీవే చూడమ్మ...ఇది సరసపరిహాసవాక్యమే? మనసున కొక విలక్షణమైన యానందమును నవ్వును గలిగించుటయే దానిప్రయోజనము.

ఒకమనుజుని వర్ణించునప్పు డాతనియాకారము గాని మాటలు గాని చర్యలు గాని లోకవిపరీతములై యున్న ట్లొకటి రెండుమాటలతోఁ గాక కొంతదూరము మృదువుగఁ జమత్కారముగఁ జెప్పినను జనువరులకు నవ్వువచ్చును. ఇట్టిదానిని హ్యూమ రందురు; సాక్షిసంఘములోని బొజ్జయ్యసెట్టి, కాలాచార్యులు, వాణీదాసుఁడు మొదలగువారి వర్ణనములలో నీలక్షణము స్ఫుటముగఁ గలదు."

... ... ...మాటల విఱుపులచేతను ధ్వనిగర్భితము లగుపదముల కూర్పుచేతను సూక్ష్మభేదములుగలయీరెండు నుత్పాదిల్లి రసప్రదములై కావ్యములందుఁ గన్పట్టును"

నేను విట్టనఁ జమత్కార మనియు, హ్యూమ రన హాస్య మనియు సంకేతముల నుంచుకొనుచున్నాను. ఇవి నాకు నూతనములు గాన వీనిసార్థకతను గూర్చి నాకంతవిచారణ యావశ్యకము లేదు. వ్యవహారము నిర్వహించుట ప్రధానము

### చమత్కారము (విట్టు) నిర్వచనము.

సామాన్యముగ సంబంధము లేనిరెండుపదములను గాని, రెండుభావములను గాని యుద్ఘాటించి నవ్వుతోఁ గూడినయాశ్చర్యమును గలిగించుట చమత్కార మనవచ్చును. అనఁగా నూతనము లగుపదములను మన మనుకొననివిధముగ సంఘటించుట.

హాస్యము (హ్యూమరు) నిర్వచనము.

నవ్వును గల్గించునట్లు విషయములను గూర్చి గాని, పరిస్థితులను గూర్చి కాని, పాత్రములను గూర్చి కాని చతురముగా మాటలాడుట లేక వ్రాయుట, అనఁగా విషయములలో నున్నహాసజనకకావ్యమును, కథను గుర్తించి లేక కల్పించి ప్రకటించుట.

చమత్కారము కేవలము మాటపొందికకును, ప్రాస్తావికబుద్ధిచాతుర్యమునకు సంబంధించిన, హాస్య మాలోచనతోఁ జేసినపని. పాత్రసన్నివేశమును వస్తు (Plot) సన్నివేశమును హ్యూమరున కావశ్యకకార్యములు. చమత్కారములు వేగముగఁ గనుపడును. వేగముగ నుపయోగింపఁబడును. వేగముగ ననుభవింపఁబడును. హాస్య మన్నివిధముల దీర్ఘ మగుటవలన నాలస్యముగ జరుగును. చమత్కారముకంటె హాస్యమునం దెక్కువ మానవస్వభావగ్రహణమును వస్తుస్వభావగ్రహణమును గలదు.

మనభాషయందుఁ గావలసినంతచమత్కారము కలదు. కావున, ప్రస్తుతము దానిని నిలిపి యుంచెదము. హాస్యరసోత్పాదకము లైనపరిస్థితులు భారతాదిగ్రంథములలోఁ గలవు. అసమము లగు పరిస్థితులను గాని పాత్రములను గాని తగువిధముగ నెచ్చట వర్ణించినను హాస్యమున కవకాశము కలుగును. భారతమున మయసభ యిట్టిది. అందు దుర్యోధనుఁడు సభావిభవంబును జూచు వేడుక నందుఁ గ్రుమ్మఱువాఁడు హరినీలబద్ధ స్నిగ్ధమణిస్థలంబునందు జలబుద్ధిం జేసి పరిధానోత్కర్షణము చేసియు, విమలశిలాతలబుద్ధి నుదకపూర్ణం బయినవాపి సొచ్చి కట్టినపుట్టంబు దడియం ద్రెళ్లినం జూచి వృకోదరుం డి ట్లనియె.

ఇట్లే యుత్తరకుమారప్రజ్ఞలు హాస్యాస్పదములు. ఉత్తరుని మొదటిప్రగల్భములు, యుద్ధసమయమున బాఱిపోవుటలు తద్విపరీతచర్యలు గల యర్జునుని సమీపమున జరుగుటవలన నత్యంతహాసజనకము లగును.

సౌగంధికాపహరణసమయమున భీముఁడు ముసలికోఁతిరూపమున నున్న హనుమంతుని తోఁకను గదల్ప లేక గర్వభంగము నందును.

శ్రీమద్రామాయణమున స్వయంవరఘట్టమున రాజులభంగపాటు నిట్టిదే. శ్రీమద్భాగవతమున విష్ణుభక్తుఁ డగునంబరీషునిఁ జెఱుపఁబోయి హాస్యాస్పదుం డైన దూర్వాసునిస్థితి హాస్యజనకము. ఇ ట్లెన్ని యేనిం జెప్పవచ్చును.

ఈచమత్కారహాస్యములు గాక యాక్షేప మని (Satire) మఱి యొక శాఖ గలదు. ఇదియు నిత్యవ్యవహారములలో గోచరించునదే. ఈయాక్షేపమునఁ

జనుత్తారము బాగుగ నుపయోగించును. హాస్యముగూడ కొన్నిచోట్ల వినియో గింపఁబడును.

ఒకరియందలి లోపములనుగాని, ద్వేషపరిస్థితులను గాని హాసజనకముగఁ దగురీతిగ వర్ణించుట యాక్షేప మనఁబడును. గ్రాంథికరూపమును దాల్పని యాక్షేపము గాలికిఁ బోవును. కావునఁ దగురీతిగ నని పై వివరమున జెప్పినాము. ఎగతాళి, పరియాచకము, వేళాకోళము మొదలగునవి యాక్షేపమునకు మొరటి రూపములు. ఇఁక వీనిశాఖలు-

1. సాంఘికము-ఆచారముల నాక్షేపించుట-బాల్యవైధవ్యము-వరశుల్కము, త్రాగుఁబోతుఁదనము-మొదలగునవి. కన్యాశుల్కవరశుల్కములను సేవాదినాటకములం దధిక్షేపింపఁబడినవి. దేశస్థితికి శ్రీనాథునియాక్షేపణాలు కలవు.

చిన్నచిన్నగుళ్లు చిల్లరదేవుళ్లు, నాగులేటినీళ్లు నాపరాళ్లు
సజ్జజొన్నకూళ్లు సర్పంబులును దేళ్లు, పల్లెనాటిసీమ పల్లెటూళ్లు.

ఇంక నిట్టిపద్యములు పెక్కు గలవు. మొగసరాజ్యమును గూర్చి-
"మొరసరాజ్యముకాఁపుర మెంతరోతరా"యనెను-

"వంకరపాగలున్ నడుమువంగినకత్తులు మైలకోకలున్
సంకటిముద్దలున్ జనుపశాకములున్ బలుశప్పుడంబులున్
దెంకగువారచూపులును దేఁకువదప్పిన యేసబాసలున్
రంకులబ్రహ్మ యీమొగసరాజ్యము నెట్లుసృజించె నక్కటా."

యని శ్రీనాథుఁడనెను.

2. వ్యక్తిగతాక్షేపము-ముందు నేను వివరింపఁబోవు చంద్రరేఖావిలాపమును, శ్రీకందుకూరి వీరేశలింగంపంతులుగారు మొదలగునాధునికుల ప్రహసనాదికములును వ్యక్తిగతాక్షేపముల కుదాహరణములు.

3. సారస్వతము-గ్రామ్యగ్రాంథికవాదములు భావకవిత్వ ప్రబంధకవిత్వములు. తిరుపతివేంకటేశ్వరుల కవిత్వపుపద్దెములు నీశాఖలోఁ జేర్పవచ్చును.

శాస్త్రము-వైద్యాదిశాస్త్రములయందుఁ బరస్పరాక్షేపములు గలవు.

సంస్థ-ఆంగ్లమున "నైట్" "Knighthood" సంస్థ నాక్షేపించుటకు డాన్‌క్విగ్జాట్ (Don-Quixote)" అనుగ్రంథము గలదు. అట్లే యాంధ్రమునఁ గూడఁ గలవు. "సత్యరాజాపూర్వదేశయాత్రలు" మొదలగునవి.

డ్రమెటిక్ ఐరనీ—అనఁగా-పాత్రలు తమగతి ముందు తాముతెలియక మాటలాడుచుండ నది యెఱిఁగిన ప్రేక్షకు లానందించుట,

జాతి—"ద్రావిడప్రాణాయామము" అను మొదలగు జాతికి సంబంధించిన యాక్షేపణములు.

మనవాఙ్మయమునందుఁ బదచమత్కారమే యున్నదానిలోనధికము. భారతాదిగ్రంథములు కేవల భాషాంతరీకరణము లగుటచే వానిలో నెక్కువగ మూలమందు లేనిహాస్యములఁ జూపించుట దుర్ఘటమైనది. అందువలన నీక్రిందియుదాహరణములు గూడ నరుదుగ నున్నవి.

నన్నయ—అర్జునుఁడు ద్రుపదుని కట్టి తెచ్చినపుడు ద్రోణుని వాక్యము.

"వీరెవ్వరయ్య ద్రుపదమ, హారాజులె యిట్లు కృపణులై పట్టువడన్
వీరికి వలసెనె యహహమ, హారాజ్యమదాంధకార మడివాసె నొకో."
ఇంకనైన మమ్ము నెఱుఁగంగనగునొక్కో."

తిక్కన కీచకునితో మాయాద్రౌపది వేషమున నున్న భీముని వాక్యము.

"నామొడలు సేర్చినప్పుడు, నీమొడ లెట్లగునొ దాన నీవెఱుఁగుదు న
న్నేయబలలతోడిదిగాఁ, జేయఁదలంచితివి తప్పుసేసితి కంటే.
"ననుముట్టి నీవు వెండియు, వనితలసంగతికిఁ బోవువాఁడవె యైనం,
దనువేఁ బడసినఫలమే, కనియెద విదె చిత్తభవవికారము లెల్లన్.

నవ్వుపుట్టించుటగదా హాస్యమునకు ఫలితము. అట్టి నవ్వుంబుట్టించుటను గూర్చి కడు జాగ్రత్తతో నుండవలయు ననియు నుత్తమపాత్రల నెక్కువగా నవ్వింపరాదనియు సాంస్కృతికాలంకారికులు నొక్కి చెప్పుచున్నారు.

"జ్యేష్ఠానాం స్మితహసితే మధ్యానాం హసితావహసితే చ
నీచానా మపహసితం తథాతిహసితం చ షడ్భేదాః
ఈషద్వికాసనయనం స్మితం స్యాత్ స్పందితాధరం
కించి దలక్ష్యద్విజం తత్రహసితం కథితం బుధైః.
మధురస్వరం విహసిత మాస్యశిరఃకంప మవహసితం
అపహసితం సాస్రాక్షం విక్షిప్తాంగం భవ త్యతిహసితం."

మనప్రాచీనులకు హాస్యరసముపైఁ గల యేవగింపును గూర్చి మొల్లరామాయణములో యథార్థము చెప్పబడినది.

"శుభపవిత్రోజ్జ్వలసూత్రధారులు గాని టక్కరిహాస్యనాటకులు గారు" మానవుఁడు సత్యవాక్యమునకై పాటుపడవలసియుండ హాస్యమాతని నసత్యములలోనికి దింపును. నాయభిప్రాయమున హాస్యనిరాకరణమున కిది యొక బలకారణము. ప్రబంధకవులకుఁ గావలసినంత స్వాతంత్ర్య మున్నను వారు హాస్యరసోచి

తపాత్రములను గాని, వస్తువులను గాని నిర్మింపరైరి. పుష్పలావికానర్ణనలలోఁ గొంత బువ్వపుబంతులలోను, విటసమాగమములందును మాత్రముకొంచెము చమత్కారమును వారు ప్రదర్శింతురు. కేవలపదచమత్కారముకంటె నిదికొంచెము నయమనవచ్చును.

శ్రీనాథుఁడు :—

"కలికి వరాటరాజపుడు కప్పురపీడెము వెట్టి నవ్వుచుకా
నలునడపంబువానికి ఫణాధరవల్లిదళాంతరంబుఁకా
బలితపుఁదేలు మైనమునఁ బన్ని యతండడి సూచి భీతిఁ ద
మ్ముల మిలవైచిన న్నగిరి మూఁగినరాజకుమారు లందఱుఁ."

పరియాచకములు.

"నీముఖంబునమాకు నెఱయంగసుఖమబ్బుఁగాంచుఁగావుతనిచ్చుఁగమలయోని
విద్వజ్జనులు నిన్ను విషయించి వత్తురు కలమధురములు నీగళరవంబు"
'ఓమె యేమెయిదే మేమె లేమ యేమె, మేఘుపువ్వుంబుఁ దేవంచు మేలమాడ
మేమెమే మెలుతఱచయ్యె మేలుమేలు, మేఁక వీఁడంచు సభవారుమిగులనగిరి."

భాగవతమునందు శ్రీకృష్ణుని బాల్యక్రీడలు హాస్యమునకుఁ దావులుగనున్నయవి.

ఆడంజని వీరలపెరుఁ' గోడక నీసుతుఁడు ద్రావి యొకయించుక తాఁ
గోడలిమూతిం జరిమినఁ, గోడలు మ్రుచ్చనుచు న్నత్త గొట్టె లతాంగీ.
నమ్మి నిదురవోవ నాపట్టిచుంచు మా, లేఁగతోఁకతోడ లీలఁగట్టి
వీథులందుఁదోలె వెలఁది నీకొమరుఁడు, రాచబిడ్డఁడైన రవ్వమేలె.

ఆంధ్రీకృతమైన ప్రబోధచంద్రోదయమునందును, పింగళి సూరన రచించిన కళాపూర్ణోదయమునందును గొన్ని హాస్యరసపుపట్టులు గలవు. పింగళి సూరన ప్రతిభ యన్నివిధములఁ నసమానమైనది. షేక్సుపియర్ మహాకవి వ్రాసిన "కామెడీ ఆఫ్ ఎరర్స్" వంటిది. అతఁడు సవతులపోట్లాట గల్పించి యందపూర్వప్రజ్ఞను వెల్వఱిచినాఁడు. ప్రబంధములందరుదుగమాత్రమే హాస్యరసపుపట్టులుండుటచేతను, అవి యంతగఁ బేర్కొనఁదగినవి కాకపోవుటచేతను వానిని వదలివేయుచున్నాను.

ఆంధ్రమున శతకవాఙ్మయము విరివిగా నున్నది. శతకములలో భక్తిప్రతిపాదకములు, నీతిప్రతిపాదకములు, హాస్యప్రతిపాదకములు నని మూఁడుతెఱఁగులుగలవు. అందు నీతిప్రతిపాదకము లగువానియందుఁగూడ హాస్యము గాన్పించుచున్న

ది. కేవలహాస్యప్రతిపాదకములు మిక్కిలి కొలఁదిగఁ గలవు. అందుఁ బ్రకృతము ప్రసిద్ధముగనున్నది. చంద్రశేఖరశతకము, ఇంక చంద్రశేఖరా! యను మకుటముతో మూర్ఖపామర భాషితములు పేర్కొనఁ బడినవి. అట్టిపద్యములలో నొకటి-

"ఉ. నల్లనిదేంది బేరి మృగనాభిర గొల్లఁడ! దాన్ని తింకురా!
అల్లటుగాదు స్త్రీలచనులంటుదుఁ బూతురు, పూసినంతనే
జల్లునఁ జేపువచ్చి తెగఁజారున? కాదుసుగంధమబ్బుమా
పిల్లకు కాస్త బెట్టుమన బేరియుఁ గస్తురిమూసెఁ గ్రక్కునన్."

చాటుపద్యరత్నాకరమునుండి.

ఈశతకములలో భక్తిప్రతిపాదకము లైనదాశరథిశతకము, శ్రీకాళహస్తీశ్వర శతకము వంటివానిని మనము ప్రస్తుతము వదలివేయవచ్చును. బూతుశతకములు గూడ నెంతటిప్రతిభావంతము లైనను నంతగాఁ బ్రశంసనీయములు గావు. ఈతెగలోని కవిచౌడప్పశతకము, గువ్వలచెన్నశతకము మొదలగునవి నవ్వుపుట్టించు ననుటకు సందియము లేదు. కాని "పదిబూతులు" "పదినీతులు" కలిసి యుండుటచేతను "బూతాడక దొరకు నవ్వుపుట్ట"దను నభిప్రాయముతో వ్రాయఁబడినవైనందునను హాస్యవాఙ్మయములో నున్నతస్థానముం బడయఁ జాలవు. కేవలనీచహాస్యము గర్హ్యము గదా!

ఇఁక నీతిప్రతిపాదికములలోఁ గటువైనవయ్యు మిక్కిలి ప్రశంసింపఁ దగినవై హాస్యమునకు నిలయ మగునవి వేమనపద్యములు కొన్ని వేలున్నను విషయవిభాగమునం దివి శతకములలోనే చేర్పవలసియుండును. వేమన తన యనుభవమును మోమోటము లేకుండ లోకకళ్యాణముకొఱకు లోకమునకుఁ జాటునిచ్చకలవాఁడు. అతనిహాస్యము వ్యక్తిద్వేషము కలది కాదు, గావున, మిక్కిలి ప్రశంసనీయమైనది. ఒక్కయుదాహరణము.

"గొడ్డుటావుఁ బిండ కుండఁ గొంపోయినఁ, బండ్లురాలఁదన్నుఁ బాలనీదు
లోభివానినడుగ లాభంబు లేదయా, విశ్వదాభిరామ వినురవేమ."

ఇటీవలి రఘునాథరాయలకాలమునాఁటి తంజావూరివాఙ్మయ మింకను మనకు ముద్రణమున లభింపనందున దానిలోని చమత్కారమును గూర్చి యెక్కువగఁ జర్చింపవీలులేదు. చేమకూరవాని చమత్కార మపారమైనది. శృంగారహాస్యముల నాతనితో సమముగ మఱియొకరు మిశ్రమము చేయఁజాలరు. అతనిదైనను పదచమత్కారము, శ్లేషచమత్కారమేగాని, పాత్రహాస్యముగాని వస్తుహాస్యముగాని కాదు.

ఇంతవఱకు మనము చూచినదానినిబట్టి మనకుఁ బూర్వవాఙ్మయమునందు హాస్యమునకు నెక్కువగ స్థానము గన్పించుటలేదు. ఇటీవలి చాటుపద్యమణిమంజరియందును, చాటుపద్యరత్నాకరమునందును బ్రోవుచేయఁబడిన పద్యములను శ్రీనాథునివీథినాటకమును జూచినయెడలఁ గొన్నిహాస్యరసప్రధానములైనపద్యములు మనకు గోచరించును. ఇందు రామలింగనిగూర్చిన కథలును పద్యములును బేర్కొనదగియున్నవి యొండు రెండు పేర్కొందును.

చాటుపద్యరత్నాకరమునుండి

తురగా వెంకంరాజు:—తాళ్లూరు నర్సాపేరయ్య తనయింటవివాహమున "ఈకవులయేడుపే నాకుఁ బట్టినది. చాలు చాలువెళ్లు"మనెను. అనఁగాఁ గవి యీక్రిందిపద్యము చెప్పెను.

సీ. పెండ్లిపేరంట్రాండ్రు పెదరంకులకు నేడ్వ బాజాబజంత్రీలు పప్పుకేడ్వ
రాజబంధువులంత రంకుముండల కేడ్వ బాజారువెలఁదులు పసుపుకేడ్వ
వచ్చిపోయెడువారు వక్కలాకుల కేడ్వ గుగ్గిళ్లకై పెండ్లిగుట్ట మేడ్వ.
... ... ... ... ... ...

ఉ. అన్నటు లీయఁడేని సభ నాతఁడెపో పెనులోభి దున్న యీ
దున్నకు రెండుకొమ్ములును దోఁకయు లేమిని మొండిదున్న యీ
దున్నతో దున్న రెవ్వరును దున్నదుగా మఱి గంగలమ్మకో
దున్నెడువారియిండ్ల పడదున్నెడు దున్నర యెంచిచూడఁగన్.

ఉ. కొందఱు భైరవాశ్వములు కొందఱు పార్థునితేరిటెక్కెముల్
కొందఱు ప్రాక్కిటీశ్వరులు కొందఱు కాలునియెక్కిరింతలున్
కొందఱు కృష్ణజన్మమునఁ గూసినవారలు నీసదస్సులో
నందఱు నందఱే మఱియు నందఱు నందఱె యంద ఱందఱే.

శ్రీనాథుడు—సమస్య

కొంచెము బూతాడినను ఆంధ్రవాఙ్మయమునఁ గేవలహాస్యప్రబంధములు లేవను లోటును దీర్పఁగలిగినవాఁడు జగ్గకవి. అతనిప్రభ యద్వితీయము. "ఈకవితికి సమముగా కృతి నే కవులునుఁ జెప్పజాలరిది..."అనిపూర్ణమైన యాత్మవిశ్వాసముతోడనే యాతఁడు గ్రంథమును రచించినాఁడు. గ్రాంథికాంధ్రమున హాస్యకావ్యము రచించుశక్తి యాతని కొక్కనికే గోచరించుచున్నది. అతనితరువాత నొక్క పానుగంటివారికే యాప్రతిష్ఠ దక్కినది. వీనినాక్షేపకావ్యము లని (Satires చెప్పవచ్చును.

చంద్రరేఖావిలాపము.

సంకరశర్మ యనుబ్రాహ్మణోత్తముఁడు కొంకిరిసాని యనువేశ్యయందుఁ గన్న చీపిరికన్నుల చంద్రి కథానాయిక. చిడుముపొక్కుల సింగరాజు కథానాయకుఁడు. సంకరశర్మ యజ్ఞముతోఁ గథ ప్రారంభమగును. మాలవాఁడు ద్రవ్వించినచెఱువు యజ్ఞభూమి. ఇఁకభోజనమో-

"కొందఱు కొకింత కూడిడి కొందఱకుం గూరలొసఁగి కొందఱ కిడకేతం దన సేయుచుఁ గెంటుచుఁ గొందఱఁదిట్టుచును వెళ్లఁగొట్టుచు నుండెన్." బ్రహ్మసృష్టికిఁ బ్రతిసృష్టి సంకరశర్మ కార్పణ్యపరమావధి. బ్రాహ్మణుఁ లాఁకటలేచుచు శపించుచుఁ బోయిరి.

"జవ్వనంబునఁ గొంకిరిసానియధర, మధువుఁ గ్రోలినకోత వో మదిఁదలంచి
వృద్ధదశ సోమపాన మివ్విధ మొనర్చెఁగాని స్వర్గాపవర్గేచ్ఛఁ గాదు సుండు."

మరియు-

"యాగముపేరుచెప్పి యర్థము భూప్రజవేఁడి తెచ్చినన్
భోగము సేయవచ్చు నిజపుత్రసహోదరబంధుమిత్రసం
యోగము గాఁగ."

ఇఁక చంద్రితో సింగనిసమావేశపఱచుట యను జామాతృకామేష్టి. ఇఁక రాజు- భోగముమిడిమేళంబులు, భాగవతులు, వేఁటకాండ్రు, భిషక్చయంబుల్ మూఁగి తనవెంట గొలువఁగా రాజువచ్చినాఁడు.

ఇఁకనాయిక.

పారగారపండ్లు, పేఁడకుప్పలోఁ దెల్లనిపురుగులవలెఁగొప్పులోపూలు, పుసులచీపికన్నులు, దృష్టిపిడుతలవలెఁ జెవులు, బొఱకట్లల చేతులు, లలాటము మీఁదబొమ్మకలది

నాయకుఁడు నాయికను వర్ణించుట.

"నిక్కు పొగపిడుతగదరా। ముక్కు మొగంబెన్న గోతిముఖమున కెనయా। పొక్కిలితామర భళిరా। యక్కజపుంబిడుకదిమ్మ లౌరకరంబుల్."నాయికనాయకునివర్ణించుట."ఆఁడుభాగవతునిజాడ గడ్డముమూతి నున్నగా గొఱిగించుకొన్నవాఁడు."

విరహము:-వలఁబడ్డమీనుకైవడి, నిప్పుద్రొక్కినకోఁతిభాతిని, వెఱ్ఱిగొన్న కుక్కపద్ధతి, కుడితిలోఁబడిన మూషికమట్లు, శ్లేష్మంబులో నీఁగలీల, సన్నిపాతిచందంబున, వాతంపుగొడ్డువిధంబున, లాహిరీదళముమెసులఁదినినపాశ్చాత్యునితీరున, నురిఁబడ్డ పక్షికైవడి, పెనుబాముపగిది కిళవళించుచుండె.

నాయిక వేశ్యవృత్తిమాని సింగనికులాంగనగాఁ దలంచినది.

శిశిరోపచారములు—జిల్లేడుపాలు, జెముడుపాలు, వేఁడినూనె, ఆవముద్ద, ఉప్పుపొడి, కొండనల్లేరు, పట్టించి తలగొఱిగించి లోపలికి నేపాళమిచ్చి చల్ల అన్నముఁబెట్టి నల్లమందులోపలి కిప్పించిరి.

అతఁడును, ఆముప్పదియాఱేండ్లబాలనుదలఁచి విరహమున గుల్లత్రిప్పుచు, పండ్లుకొఱుకుచు, మూలుచునీల్గుచు, జోరీఁగలు, కాకులు, గ్రద్దగూబలు మొదలగునవి చేయురొదలకుఁ దాళఁజాలఁడయ్యె.

ఇఁకవారిసంసారము.

అది భోజనముఁజేసి వదలినకూడు దాఁగుడిచి కంచముతోమి కడిగి తుడుచు
అది తములముసేయ నాకు చుట్టియొసంగి తమ్మగైకొని నోరు గ్రమ్మనములు
అది మదిరగొనంగ నదిమంచిదే యని తచ్ఛేషహాల మోదమునఁ ద్రావు
అది నిదురించు చోఁ బదములదరి జేరివద్దువద్దను కొద్ది గ్రుద్దిపిసుకుఁ
గాలుచాచుక కూర్చుండి పేలుగ్రుక్కు, వీఁపుపైఁ జెమటకాయలు వెదకిగోకు
నలసిమంచంబు జేరి నల్లులను జంపు వలపుగులుకంగ సింహేంద్రమలహరుండు.

ఇఁక నవయుగము నందలిహాస్యరసవిజృంభణమునకు వత్తము. ఆంగ్లభాషా సహకారమువలన మనవాఙ్మయములో వివిధము లగుకావ్యములు బయలుదేఱినవి. వానిలోఁ బ్రహసనములుగూడ నున్నవి. మొట్టమొదట నాటకాదులను బేర్కొని పిదపఁ గేవలహాస్యరసప్రధానము లగుప్రహసనములకు వత్తము.

## నాటకములు.

తోలుబొమ్మలాటలోని కేతిగాఁడు జుట్టుపోలిగాఁడును బంగారక్కయు మనవారికిఁ గావలసినంత హాస్యము ననాదినుండి ప్రసాదించుచున్నారు. వీథినాటకములలో సహిత మెంతటికరుణతో నిండినపట్టుననైనను హాస్యగాఁ డుండకతప్పదు. ఈహాస్యగాఁడు సంస్కృతనాటకములలోని విదూషకునివంటివాఁ డని చెప్పఁదగును. ఈపైఁజెప్పిన వారిహాస్యము గాక సంస్కృతనాటకములందును దెనుఁగునాటకములందునచ్చటచ్చట హాస్యరసపుపట్టులు గలవు. అవి కరుణాదిరసములకు మెఱుఁగుపెట్టు ననుటకు సందియములేదు. హరిశ్చంద్రలోని నక్షత్రకుఁడు, కలహకంఠి, రోషనారలోని త్రాగుఁబోతుమహమ్మదీయులు, ప్రతాపరుద్రీయములోని పేరిగాఁడును, పానుగంటివారినాటకములలోను, తదితరులనాటకములలోను నిట్టియితరపాత్రలును హాసజనకము లగును. నాటకమను గౌరవమునుబొంది హాస్యరసప్రధానము లని జయమందిన కొన్నిగ్రంథములు మనయాంధ్రవాఙ్మయమునందుఁ

గలవు. అందుమొదటిది గురుజాడ అప్పారావుగారి కన్యాశుల్కము, పానుగంటిలక్ష్మీనరసింహారావుగారి కంఠాభరణము. వీనిలోని కథలు లోకప్రసిద్ధములు గావున విచ్చుట వాని నిచ్చుటలేదు. వీనిలో నొక్కముఖ్యభేదము గలదు. కన్యాశుల్కము గ్రామ్యమున వ్రాయఁబడినది. కంఠాభరణము గ్రాంథికభాషను వ్రాయఁబడినది. కన్యాశుల్కమునఁ గేవలగ్రామ్యమే గాక మిశ్రభాషగూడ విస్తారముగఁ గలదు, దీనికి ఫలితము సమకాలికులలోఁగూడఁ బెక్కుమంది కర్థముగాకుండుట యొకటి కాలక్రమమున ఛాయామూలమున జరుపుకొనవలసినదే కాని మూలమును జరుపుకొనుటకుఁ బ్రజల కవకాశము లేకపోవుట రెండవది. ఇట్టికావ్యములు మహామ్మదీయ భాషలతో మిశ్రమైనవి మహామ్మదీయులకాలమున లేకపోలేదు. అవి యిప్పుడు నామమాత్రమైన వినఁబడకపోయినవి. అట్టియవస్థ యీయుత్కృష్టప్రహసనమునకుఁ గూడ నీభాషాసాంకర్యమువలనఁ దటస్థించునని నాభయము.

ఒకయుదాహరణము.

“ఇది బేస్ ఇన్‌గ్రాటిట్యూడ్ నాతో మాట్లాడడవేఁ ఒకయెడ్యుకేషన్, ఆమాట కొస్తే నీకున్నలాంగ్వేజి మీమాష్టరుకుంది. విడోమారియేజివిషయమై నాచ్చికొశ్చన్ విషయమై నీకు ఎన్ని లెక్చర్లిచ్చారు. ఎలివన్ కాజెస్ ఆఫ్ ది డిజన్రేషన్ ఆఫ్ యిండియాను గూర్చి మూడుగంటలు లెక్చర్లిచ్చే సరికి ప్రొఫెసర్లు డంగయిపోయినారు.”

ఇది పాత్రోచితభాష కావచ్చును. కాని యిది నాశోచితపాత్రోచితభాష యని నాయభిప్రాయము.

ఈవిధముగా ననుమతించినచో నైజామాంధ్రులకుఁ గన్యాశుల్క మీ క్రిందిభాషగా నుండవలయును.

“జరా వినండి ఆనేకెంత జానేకెంత ఇవ్వాళ పానీజాదాపడిందండీ”

ఇట్లే తమిళాదిమిశ్రము లుండును.

ఈప్రబలలోపమే లేనిచో కన్యాశుల్కమునకు వాఙ్మయమున నుత్తమస్థానము నీయవచ్చును. ద్వేషభావములేని నిర్మలమైన హాస్య మిందుఁగలదు. గిరీశం, రామప్పంతులు, మధురవాణి, లుబ్ధావధాన్లు మొదలగువారి పాత్రము లపూర్వములు.

కంఠాభరణముకూడ నిట్లే హాస్యకావ్యము. ఇందు ఛాందసుఁడైన సోమావధాన్లు వెఱ్ఱివాఁడు ననదృశులు. సోమావధానులు స్వర్గసును తిరకాసనను,

తర్కమును తత్రకముచేయును. సిద్ధాంతపూర్వపక్షములను శ్రాద్ధాంతపూర్వభాష్యము లనుజేయును. వెఱ్ఱివాని వాక్యులు నిట్టివే చూడుఁడు.

"కవులూరివారికవిత్వము మాకవిత్వము ఒక్కటూకి. వారికి యతిలేదు. మాకు మతిలేదు. వారికి ప్రాసలేదు. మాకు ధ్యాసలేదు. వారికి గణములేదు, మాకు గుణములేదు."

పాత్రోచితమైన వ్యావహారికమును వాడకుండ హాస్యరసమును నిర్వహించుట దుర్ఘటమైనపని. పాత్రోచితభాష కాలప్రవాహమున శీఘ్రముగఁ గొట్టుకొనుపోవు స్వభావముకలది. సంస్కృతనాటకములలోని ప్రాకృతమునకు ఛాయాగతి పట్టలేదా? ముప్పాతికమూఁడుపాళ్లు హాస్యగ్రంథములు వ్యావహారికములోనే యుండును. అది యెంత రమ్యమైనను, కావ్యమున కెంతశోభగలిగించినను మూలచ్ఛేదనమునకుఁ గారణమగును. నవకవులలో గుడిపాటివారు, భమిడిపాటివారు మొదలగు నుత్తమహాస్యకవుల గ్రంథముల కీముప్పు తప్పునుకదా యని నేనెప్పుడు విచారించుచుందును.

### ప్ర హ స న ము లు.

హాస్యరసమైన యీశాఖ యిటీవల మనభాషలో విజృంభించినది. శ్రీకందుకూరి వీరేశలింగముపంతులుగారును, చిలకమర్తి లక్ష్మీనరసింహముగారును పెక్కు ప్రహసనముల రచియించిరి. ఇటీవలి వారిలో భమిడిపాటి కామేశ్వరరావుగారు ప్రహసనముల వ్రాయుటలో నగ్రగణ్యు లనవచ్చును. ఈసందర్భమున హాస్యరసమును గూర్చి యొక్కమాట ముఖ్యముగఁజెప్పవలసి యున్నది. "Follow Nature" "ప్రకృతి ననుసరింపుము" అనుగోల్డుస్మిత్ కవివాక్యముల నెవరు విస్మరింతురు. వారికావ్యముల కేశాఖలోనివాని కైనను ముప్పుతప్పదు. సమకాలికవ్యక్తులను దూషించుట ప్రధానోద్దేశముగాఁగలిగి ఏవో కొన్ని సమకాలికకావ్యముల నుద్దేశించి రచించినవాఙ్మయము వానిపని తీరిపోవఁగనే నశించును. హాసజనకముగ సామాన్యపరిస్థితులను వర్ణించి సర్వకాలసర్వావస్థలయందును ప్రజల నాకర్షించునట్లు చేయుట యుత్తమకవిలక్షణము. వ్యక్తిదూషణములతో నాడిన శ్రీవీరేశలింగముగారి హాస్యమును, చిలకమర్తి లక్ష్మీనరసింహముగారి హాస్యమును అప్పుడే పనితీరి పతనోన్ముఖము లైనవని చెప్పుటకు వగచుచున్నాను. వారిమేధాశక్తు లీప్రహసనరచనములలో నిషిద్ధమార్గములలోఁ బ్రవర్తించినవి. ఇట్లే వీరేశలింగముగారి హాస్యములు గూడనున్నవి.

ఉదాహరణములు.

అపూర్వబ్రహ్మచర్యప్రహసనము.

విచిత్రవివాహప్రహసనము.

మహామహోపాధ్యాయప్రహసనము మొదలగునవి.

కం. వీ. గారివి.

హిందూవివాహము-హిందువులు తమపెళ్లిళ్లలో బిడ్డలను కోతులలాగు చతుష్పాదజంతువులలాగు చూస్తారు. ఇదంతా బ్రాహ్మణులు డబ్బులాగడానికి ప్రజలను మూఢులను చేసి పన్నినయంత్రము. ఇల్లాగంటిపాడువివాహాలు హిందువులలో చాలవున్నవి.

పుష్కరమాహాత్మ్యం— గోదావరిజిడ్డు, బ్రాహ్మణులకు కాసులులాభం మ్యునిసిపల్ వారికి పెంట బజారువస్తువులు ప్రియం.

పాపము కవిభావములు వివాహములు పుష్కరములు మొదలగువాని యున్నతిలో బ్రవేశింపక చతుష్పాదజంతువులమీఁదికి మ్యునిసిపల్ పెంటలమీఁదికిఁ బ్రసరించినవి. ఇట్లే వారినవలలోఁ గూడ యరసికత (bad taste) పొడగట్టుచున్నది.

శ్రీభమిడిపాటి కామేశ్వరరావుగారి కచటతపలు, ఎప్పుడూ ఇంతే— మొదలగుప్రహసనములు పైదోషములను బాసి రసపూర్ణములుగ నున్నవి. కన్యాశుల్కమునందుఁగూడ వీరేశలింగముగారి యసభ్యత యించుకయైనను లేదు కావున దానిని మఱల నుత్తమప్రహసనముగ నిటఁ బేర్కొనుచున్నాను.

న వ ల లు.

సామాన్యముగ నవలలో హాస్యములు గలఘట్టము లుండును. శ్రీవేంకట పార్వతీశ్వరకవుల భాషాంతరీకరణముల నట్లుంచినను స్వతంత్రములైన నవలలు బాషలోఁ జాలఁగలవు. వానివివరముల కిచ్చట తావులేదు. బారిష్టరుపార్వతీశ మువంటివి హాస్యప్రధానమైన వని మాత్రము చెప్పుచున్నాను.

ప్రబంధములు.

నవయుగములోఁగూడఁ బూర్వమువలెనే ప్రబంధములు కలవు. వానిలో హాసజనకము లగుపట్టులు కలవు. ఇప్పటిప్రబంధరచయితలలో నగ్రగణ్యులు శ్రీ తిరుపతి వెంకటేశ్వరులు. వారిపాణిగృహీతాదిగ్రంథములలో నచ్చటచ్చట హాస్యము కలదు. ఖండకావ్యములలో "శుక్లపక్షము" ఈవిషయమున నుత్తమమైనది,

ఆక్షేపకావ్యములు.

వీనినిగూర్చి ముందేవిపులవాఖ్యచేసినాను. ఇప్పుడు కొలఁదిగ నుదాహరింతును. వీనినాంగ్లమున satires సెటైర్లందురు. శ్రీతిరుపతివెంకటేశ్వరుల గీరతము, గుంటూరుసీమ, శనిగ్రహము మొదలగుకావ్యము లీతెగకుఁ జేరినవి. శ్రీపానుగంటి లక్ష్మీనరసింహారావుగారివ్యాసములు పెక్కు లీశాఖకుఁ జేరినవని చెప్పవచ్చును. ఆంగ్లవాఙ్మయము ననుసరించి వ్యాసరచనము మనభాషలో నారంభమైనది. చిన్నకథలుకూడ బయలుదేరినవి. వీనిలో గావలసినంత హాస్య మున్నది. వీనియన్నిటికి నగ్రస్థానము శ్రీపానుగంటి లక్ష్మీనరసింహారావుగారి "సాక్షి" కీయఁదగును. అవి స్థిరభాషలో వ్రాయఁబడి యుండుటవలన మిగిలినవానికంటె వానికెక్కువ స్థైర్యముండును. నిజమునకు వ్యావహారికభాషలో నెక్కువమాధుర్యముండుననుటకు సందియము లేదు. కొన్నిమధురపదార్థములనైనను త్యజించి జీవించుట ప్రధానముగదా! భమిడిపాటి కామేశ్వరరావుగారి అద్దెకొంప, కాఫీదేవాలయము మొదలగువ్యాసములు, గుడిపాటి వెంకటచలంగారి అట్లపిండి మొదలగువ్యాసములును లోకప్రసిద్ధములే.

పానుగంటివారిహాస్యమును గొంచె ముదాహరింతును.

నాటకములనుగూర్చి—Cf. Thackeray, Hazlitt, Lamb, Steele, Dequincey, Goldsmith.

ఇంతలోఁ దలపగిలిన ధ్వనియు మొఱ్ఱోయను కేకలును వినఁబడుటచే నేను తహతహపడితిని కాని కొబ్బెరకాయ గొట్టినటకులు దేవిని ప్రార్థించుచున్నారని దెలిసి నిమ్మళపడితిని.

నాటకగానము.

మనమెపుడైన వంటయింటిలోనికిఁ బోయి కూరవండమని పాటలు పాడుచుమా

బీరకాయవే, కూరజేయవే॥ బీర॥
రవపులుసువేసి॥ బీర॥

అనిసంగీతములో వెల్లడించియుంటిమా? అట్లేచేసియుండినయెడల మనయిరుగుపొరుగువారు మనచేతులుకాళ్లు కట్టి తలలు నున్నగ గొఱిగించి నిమ్మకాయపులుసుతో రుద్ది, బెత్తముతో మోది యున్మత్తశాలకుఁ బంపించియుండరా?

తేలుకుట్టినస్త్రీ మొఱ్ఱోయని యేడ్చును గాని ముఖారిరాగమున నేడ్చు

నా ? అట్లు చేసినయెడల తేలుమాట యటుంచి దయ్యపుబాధ యని చీపురు కట్టలతో వీపుతట్టుదేర కొట్టియుండరా.

ఈతాండవములేమి, ఈపాటలేమి, ఈయాటలేమి, ఈయడుకులదంపులేమి.

ఇంత అసమగ్రముగను సంగ్రహముగను హాస్యమును గూర్చి వ్రాసినందులకు మన్నింపగోరుచున్నాను. ఇంకను నెక్కువగా వ్రాయఁదలఁచినవారీపద్ధతిని వ్రాసిన బాగుండునని నాయభిప్రాయము. ఇంకొకటి రెండుమాటలతో ముగించెదను.

మనదేశమునందు వక్తృత్వమునందుఁ గూడ సుప్రసిద్ధముగ హాస్యమును గుఱిపించువారు కలరు. మద్గురువులగు శ్రీకాశీకృష్ణాచార్యవర్యులీవిషయమున సురసజ్ఞులు. కీ॥ శే॥ దుగ్గిరాల గోపాలకృష్ణయ్యకీర్తి యీవిషయమున జగద్విదితము. ఇంచుమించు వీరితోఁ దుల్యులు శ్రీకట్టమంచి రామలింగారెడ్డిగారు. వీరాంగ్లాంధ్రముల రెంటియందును నేటికిని హాస్యమును వర్షించుచున్నారు. నెల్లూరులో నొకసారి తిక్కనజయంతికి మాటలాడుచు "మీరు నెల్లూరునెఱజాణలైన మేము చిత్తూరుచిఱుజాణలము సుమా" అనిరి. నెల్లూరిజిల్లానివాసులు హాస్యమునకు బుట్టినిండ్లు.

ప్రస్తుతకాలమునఁ బత్త్రికలలో నీశ్శృంగారముతోఁ గూడిన హాస్యము విస్తారముగఁ గలదు. అది కేవలము సామాన్యులమనము లుద్రేకింపఁజేసి డబ్బుసంపాదించుటలో నుపకరించును. భాషయందును భావమునందు నట్టినీచస్థానము నాక్రమించినవానికి నేనిందు దావీయఁజాలను. ఆపత్త్రికల పేర్లుచ్చరించుటయుఁ దగదు. "కుళ్లుకుండలోన గుంటెడత్తరువును గుమ్మరింప నద్ది గుమ్ముమనునె" అని వసురాయకవిగారు చెప్పినట్లు మంచికవులు గూడ తమ ప్రతిభను నీచశ్శృంగారకథలతో వ్యర్థము చేయుచుండుట విషాదకారణము. అప్పటికప్పు డుపయోగించి కాలక్షేపముల కనుకూలించు చమత్కారసూక్ష్మసంభాషణలును బత్త్రికలలో విరివిగా నున్నవి. అట్టే తాము రచించినవి కొన్ని గూర్చి శ్రీభమిడిపాటి కామేశ్వరరావుగారు కాలక్షేప మని యొకగ్రంథమునఁ బ్రకటించిరి,

మొత్తముమీఁద నిప్పటికాలమున, ఆంధ్రభాషలో హాస్యవాఙ్మయము మిగిలినవానితోపాటు వృద్ధినందుచున్నది. అందేది శాశ్వతమో యేది నిలువనిదో నిర్ణయింపఁ గాలమే సమర్థము. ఆనందప్రతిపాదక మగుహాస్యము లోకమును రసపూర్ణమును జేయునుగాక.

శ్రీగురవే నమః.

# సింహాసనద్వాత్రింశిక పీఠిక.

---

సింహాసనద్వాత్రింశిక యను నీకావ్యము ద్వాత్రింశత్సాలభంజికలు భోజరాజునకుం జెప్పిన విక్రమార్కుని కథలు. అయ్యవి ముప్పదిరెండు. ఆకథలసముచ్చయమే యీకావ్యము. దీనికిమూలము కథాసరిత్సాగరము* ఆసాగరమునుండి యీరత్నము నెత్తి చక్కగా సానఁబట్టి యాంధ్రసరస్వతిని బూజ సొనరించిన మహాకవి కొఱవి గోపరాజు. ఇట్టిమహారత్న మింతకాలముదాఁకను మఱుఁగుపడి యుండుట యత్యద్భుత మనక తీఱదు. కవికాలమునుబట్టి చూడఁ బురాణయుగమునకుఁ గడపటను బుట్టిన మొదటిప్రబంధ మయ్యును దీనినిఁ దరువాతఁ బ్రబంధకవు లెవ్వరును స్మరియింపకుండుట యేకారణముననో యూహింపఁజాలకున్నారము. ఇట్టికావ్యరత్నమును దిరుగ సముద్ధరించిన శ్రీయాంధ్రసాహిత్యపరిషత్తువారికి నాంధ్రదేశ మెంతయుఁ గృతజ్ఞమై యుండకతప్పదు. చిన్నచిన్నమాటలతోఁ దేనెలు గురియునట్లు, లేకాకారముగా నుండి విపుల మయ్యు విసువు పుట్టనట్లు తత్తదుచితస్థలములందే వర్ణనలతో నిండి పాండితీశక్తి యటుండఁ గవితాశక్తికే ప్రాధాన్య మీయఁబడిన యిట్టికావ్యము లాంధ్రమునం దరుదు. ఇట్టికథాసముచ్చయరూపము లగు కావ్యములు బేతాళపంచవింశతి, హంసవింశతి, శుకసప్తతి మున్నగునవి యున్నను నిట్లు సర్వావయవపరిపోషణము గాంచిన వన వీలులేదు. కడపటి దగు శుకసప్తతి జీవకళ గలకావ్యములలో మిన్నయే కాని కథావస్తువు ననుసరించి విలువ తగ్గక మానదు. హంసవింశతి యొకనిఘంటు వనినను దప్పు కానేరదు. బేతాళపంచవింశతికవిత యించుమించుగా నంతయు సంస్కారాపేక్ష గలది యనవచ్చును. ఇట్టికావ్యముల దృష్టినే కాక కేవలకల్పనాకథలు, నాద్యసత్కథలు, సత్కవికల్పనా విభూషావహపూర్వవృత్తములు ననుమూఁడువిధము లగు కావ్యములదృష్టి యందును నీకావ్య ముత్తమము కాకపోవదు.

ఇయ్యది స్వతంత్రకావ్యము కాదనియు, నాంధ్రీకరణమే యనియు, నాంధ్రీకరణమే మహాకష్ట మనియు నీకవియే యవతారికయందు సుకుమారమగుఫణితిని వివరించి తనభావనాశక్తిని వెల్లడించినాఁడు.

---

* అచ్చుపడిన సంస్కృతమూల మొక్కటి విక్రమార్కచరిత్రము (గద్యపద్యాత్మకము) కలదుగాని యందుఁగల కథలవరుస యిందుఁ గానరాదు. విషయములును భేదముగానున్నవి.

ఉ. ఈసరసోక్తికావ్య మొకఁ డిమ్ముల సంస్కృతభాష నచ్చుగాఁ
జేసిన నట్ల వీఁడు మఱిచేయుట యేటికి యంచుఁ జెప్పఁగాఁ
జేసి యనాదరం బురక చేయకుఁడీ విలుకాఁడు తూఁటుగా
నేసిన నందె పాఱ మఱి యేసినవ నిద సూటి గావునన్. ౧-౩౫

ఈపద్య మెంత యు స్వానుభవమునఁ జెప్పిన దనుటకు సందియము లేదు. కాని యారీతి 'మక్కికి మక్కి'గాఁ జెప్పినవాఁడు కాకున్నను నాంధ్రీకరణమునఁ గల ప్రయాసము వెల్లడించెను. ఇఁక నెట్టిభాష నుపయోగింపఁబూనె ననువిషయమున-

చ. తెనుఁగునఁ దేటగాఁ గథలు చెప్పినఁ గావ్యము పొంకు లేదు మొ
త్తన పస చాల దండ్రు విశదంబుగ సంస్కృతశబ్ద మూఁదఁ జె
ప్పిన నవి దర్భముఖ్య డనుచుఁ బెట్టరు వీనులఁ గావునన్ రుచుల్
దనరఁ దెనుంగు దేశియును దద్భవముం గలయంగఁ జెప్పెదన్. ౧-౩౭

అని చెప్పి యనువగుతావులం దెల్ల లలితము లగుజాతీయములతో నింపి నాఁడు. ఈతనికవితను గూర్చి యేదియు విశేషించి వ్రాయం బనిలేకుండ నవతారికయందుఁ దానే యద్దమువలె నిలిపి యున్నాఁడు.

కావ్యమునకుఁ బదునెనిమిదివర్ణనము లుండవలె నను నియమము పాటింపఁ దలఁచియు వాని నుచితస్థలములయందుఁ జూపెద నని చెప్పి యుండుటయే కాక యాయాయి ప్రసంగములం దాయావిద్యల సంపూర్ణస్వభావమును బ్రదర్శింపని నాఁడు సర్వజ్ఞతకు భంగ మనియు దానికేని యుచితజ్ఞత ముఖ్య మనియు

"క. ఎప్పటి కే యది ప్రస్తుత, మప్పటి కా విద్యమహిమ మచ్చుపడంగాఁ
జెప్పక సర్వజ్ఞత్వము, చొప్పడునే కావ్య మంతసులభమె ధాత్రిన్. ౧-౨౧.

అని చెప్పుటమాత్రమే కాక యట్లే చూపియున్నాఁడు.

ప్రథమాశ్వాసమునఁ బద్మిన్యాదిస్త్రీలక్షణములు, ద్వితీయాశ్వాసమునఁ జతుర్విధప్రాకృతములతోను జిత్రరీతులతోను గవితాకౌశలమును, తృతీయాశ్వాసమునఁ బౌరోహిత్యదారిద్ర్యాదిదూషణములను, నాల్గవయాశ్వాసమున నాంధ్రచ్ఛందశ్శాస్త్రమున విశేషించియున్న యతులవిచారమును, బంచమాశ్వాసమున జీమూతవాహనచరిత్రమును, మఱొకతావున మల్లవిద్యయు, మఱొకసందర్భమునఁ జోరవిద్యయు, నింకొక ప్రసంగమున నఱువదినాలుగువిద్యల నామములును, స్వప్నములు, శకునములు మున్నగువానిని విశేషముగానో సామాన్యముగానో ప్రదర్శించెనే కాని విడిచిపెట్టిన యంశ మొక్కటియుఁ గానరాదు. ఈకావ్యమున

నచ్చుటచ్చుట సందర్భములననుసరించి సార్వకాలికములును సార్వజనీనములు నగు నట్లు చెప్పఁబడి చెదరి యున్న నీతిపద్యము లన్నియు నేర్చి కూర్చినయెడ నొక చిన్న నీతిశాస్త్ర మగును. గ్రంథవిస్తరభీతిచే మానవలసివచ్చినది. కాని యెత్తిచూపవలసిన వెన్నో విచిత్రకల్పనము లింకఁ గలవు వివాదగ్రస్తమై యున్న యొంటిమిట్ట వారంగలువాదము నీకవి మున్నే తీర్చియున్నాఁడు. ధర్మపురి, భువనగిరి, శ్రీశైలము మున్నగు వానిం దెల్పుచు-

త్రిలోకమాత మహాపాతక సంఘాతవిఘాతానుయాతఁగనియెన్ గంగన్.

క. ఆనదికిమ్రొక్కి ముఖ్య,స్నానం బొనరింప డిగ్గి చని యుదకం బా
లోనం దెకతెక నుడుకం, గా నద్భుతమైన మడుఁగుఁ గని వెరఁగందెన్.

అని గంగయే గోదావరి యని తెల్పుట కుష్ణగుండమును వర్ణించినాఁడు.

ఉ. ఆకడ నీతిశాస్త్రవిదుఁ డైగురువిష్ణుని యేఁగి వేడ్కతోఁ
గాకతిమూలశక్తి గనిగా నొనరించిన పైఁడిచట్టునా
నేకశిలాభిధానమున నెన్నిక కెక్కి ధరిత్రిలోన నే
పోకలఁబోని యట్టి సిరిపుట్టినయింటికి నోరుగంటికిన్. ౮ ఆ. ౧౫౬

అని యేకశిలానగర మోరుగల్లే గాని యొంటిమిట్ట కానట్లు తెలియఁజేసినాఁడు.

ప్రత్యేకత:—ప్రతికవికిని గల్పనాపాటవముననో, యలంకారముననో, వ్యాకరణముననో, ఛందస్సుననో, భాషయందో కొంత ప్రత్యేకత యుండక మానదు. కల్పనాంశములమాట యటుండ భాషయం దీతఁడు చూపినప్రత్యేకత యనుపమానము. తరువాతికవులయందుఁ గాని పూర్వులయందుఁ గాని లేని యెన్నియో నూత్నశబ్దముల నీకవి వాడియున్నాఁడు. బొనగిలు=బలాత్కృతమగు; కాసించు=కాసెవోయు; ముక్తాశేషలు=ముత్యాలసేసలు, వెంచ=మడుఁగు; పాఁగు=(తమిళపదము) రహస్యము, వృత్తాంతము; భజనకెక్కు=స్తుతికెక్కు; పరిణయించి=పెండ్లాడి; నెలగ=ధనము; వెట్టము=విరోధి; వితండము=విరోధము; పరిమాళించుట; (పరిఘూర్ణించుట అని ప్రానుపాఠము)=మల్లవిద్యాక్రియావిశేషము; వయ్యంది=కొలిమి; ఇట్టియపూర్వపదప్రయోగమున నీకవియొక్క ప్రత్యేకత స్పష్టపడుచున్నది.

వ్యాకరణము:—వ్యాకరణము విషయమయి యారయఁ గ్త్వార్థకమునకు వికల్పసంధియును, నావుడు, మున్నగు నానంతర్యార్థకములసంధియు, నచ్చటచ్చటఁ గలవు. క్త్వార్థకేకారసంధివిషయమున నీతనితోపాటు పెక్కండ్రు కవులుగలరు. కాని య్యానంతర్యార్థక మగు-డున్ (౬. ౬౩; ౮. ౧౧౫)తోఁ (ప్రాచీనకవితయం

దు 'డు' వర్ణకము భావార్థకము. సముచ్చయసహిత మయి యానంతర్యార్థము నిచ్చును. అనుటయున్ వంటిది). పరపదాద్యచ్చునకు సంధిచేసిన కవులు కానరారు. ఈవిషయమున నితఁడు యథేచ్ఛముగా వర్తించెను. ఇట్టి నెఱసులు వెదకుట రసాస్వాదనమున కడ్డమే కాని వాస్తవము తెల్పవలసివచ్చినప్పుడు మఱుఁగు పెట్టుట ధర్మము కాదు. ఇట్టిస్వల్పప్రమాదము లున్నమాత్రమున నీతని కవితకు నాలేశములు కళంకదాయులు కానేరవు.

ఇఁక నీకవి సంస్కృతశబ్దములయెడ జాగరూకతతో మెలంగినవాఁడే కాని ప్రమత్తుఁడు కాఁడు. ఎచ్చటనేని యొకటిరెం డున్నను బ్రమాద మనుకొన నగునే కాని మఱొండు కానేరదు. "ఏకోనవింశతిమ" ౮-౨. "షడ్వింశతితమ" ౧౦-౩౧. ఇట్టి వొకటిరెండున్నను నవి పొరపాటులు కాని యజ్ఞానమునఁ బ్రయోగించిన వనుట యన్యాయము. సంస్కృతపాండితీస్ఫోరకము లగుప్రయోగము లనేకము లిందుఁ గలవు. కాని గ్రంథవిస్తరభీతి నుదాహరింపఁబడలేదు.

కవి, కాలనిర్ణయము:—గోపరా జను నీతఁడు నియోగిబ్రాహ్మణుఁ డనియును, ఇంటిపేరు కోవెలవా రనియును బదునేడవశతాబ్దములోనివాఁ డనియుఁ గవులచరిత్రమున నున్నది. ఈతని కేడవపురుషుఁడు పెన్నయామాత్యుఁడు. పెన్నయామాత్యుఁ డనియు నందుఁ గలదు, కాని, పెన్నయామాత్యుఁ డనుట ప్రమాదము. వెలనాఁటిచోడుల దాక్షారామశాసనములందును వెన్నయామాత్యుఁ డనియే యున్నది. ఇఁకఁ గోవెలవా రనుటయు నట్టిదే. ఈకవి తాతతండ్రులనాఁడు పల్లెకొండను బరిపాలించుచున్న 'రాణామల్లనృపాలుని' 'రాణన్' అని పదచ్ఛేదముచేసి యెవరో మల్లనృపాలుఁ డని స్థూలముగాఁ గవులచరిత్రము వ్రాసినది.

'కొఱవియన్నామాత్యకుంజరుండు'

కొఱవియన్నయయెపుడుఁ!'

మున్నగు ముప్పదియిద్దఱమంత్రులచరిత్రమునందలి ప్రయోగములవలనను, చెన్నపురిప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమునందలి తాళపత్రప్రతియందలి యాశ్వాసాంతగద్యమువలనను, 'కొఱవి'వారే కాని కోవెలవారు కారని తెలియుచున్నది. (శబ్దరత్నాకరకారుఁడు కొండముఁడివా రనియెను) ఏదియేని లేఖకప్రమాదమున, కోవెలవా రని యున్న తాళపత్రప్రతి యాధారమునఁ గవులచరిత్రమున నచ్చెక్కి యుండును. ఈగోపరాజున కేడవపురుషుఁ డగు వెన్నామాత్యుఁడు వెలనాఁటిపృథ్వీశ్వరుని రాజ్యభారధురంధరుఁ డనియు, నవక్రవిక్రమశాలి యనియు సనదవోలు

(చందవోలు) నెలవుగాఁ గలవాఁ డనియుఁ బ్రథమాశ్వాసమున ౪౧ వ పద్యమున వర్ణింపఁబడినది. "కలుషమండలిక"... ...ఇత్యాది.

ఇందలి బిరుదములు వెలనాఁటిపృథ్వీశ్వరునివి కావు. వెలనాఁటిపృథ్వీశ్వరరాజ్యభారధుర్యుఁ డనునది యు నాబిరుదావళిలో నొకటి యని యాశ్వాసాంత గద్యమునందలి 'వెలనాఁటిపృథ్వీశ్వరరాజ్యసముద్ధరణ' అనునది చెప్పుచున్నది. కావున నీవెలనాఁటి పృథ్వీశ్వరుని కాలమునుబట్టి వెన్నయకాలము నిర్ణయింపనగును.

శైవమతాచార్యుఁ డగుపండితారాధ్యుని కాలనిర్ణయమునకై శివతత్త్వసారపీఠికయందుఁ గొమర్రాజు వేంకటలక్ష్మణరావుగారు పై వెలనాఁటిపృథ్వీశ్వరుని కాలము నిట్లు నిర్ణయించినారు. పండితుఁడు, చందవోలు వెళ్ళునప్పటికి వెలనాఁటిచోడుఁడు పాలించుచున్నాఁ డనియును, నాతనికి మనుమఁడు పృథ్వీశ్వరుఁ డనియుఁ,జోడుని కాలము క్రీ. శ. ౧౧౧౭సం. మొదలు ౧౧౫౦సం. వఱకు ననియు వివరించిరి. 'పృథ్వీశ్వరుఁడు ౧౧౫౫ గి వఱకే రాజ్యమునకు వచ్చినట్లు తోఁచుచున్నది' అని మఱొకవాక్యము. ౧౧౫౫ గి నాఁటికే యని యర్థము కావలయును. వెన్నామాత్యుఁడు పృథ్వీశ్వరునితండ్రి యగుగొంకరాజునాఁడే మంత్రి యయ్యెను. గొంకరాజు బహుస్వల్పకాలముననే మరణింప బాలుఁ డగుపృథ్వీశ్వరునిఁ బెంచి పెద్దవానిని జేసి రాజ్య మభివృద్ధిలోనికిఁ దెచ్చి యుండవలెను. అప్పుడే పృథ్వీశ్వరరాజ్యసముద్ధరణబిరుదము సార్థకము కాఁగలదు.

వెన్నామాత్యుఁడు గొంకనృపాలునిమంత్రిగా నున్న క్రింది చోడరాజుల దాక్షారామశాసనములవలనఁ దెలియఁగును.

Vol. IV No. 1204 -"(స్వస్తి)శ్రీ వెలనాంటిచోడ(ధ)రాధిపతేః సూనుర్మహీమండనః శ్రీమాఁ(న్గొం) కమహీపతి..." No. 1205... స్మంత్రిశిఖామణి ర్బుద్ధినిధిః శ్రీ(వె)వెన్న(నామాసు)ధీః"...అని యుండుటవలన నాగొంకనృపాలుని కాలముననే మంత్రిత్వము వహియించి, యాతనిపిమ్మటఁ బృథ్వీశ్వరుని రాజ్యమును సంరక్షించియుండును. గొంకనృపాలునినాఁటికి వెన్నయ్యయును యువకుండై యుండును. పృథ్వీశ్వరునికాలమునందును జాలభాగ ముండి యుండును. కాన ౧౨౪౦ దాఁక వెన్నామాత్యునికాలము; అధమపక్షము ౧౨౨౦ దాఁక నేనియు నై యుండును. ఈవెన్నయ్యకుఁ బౌత్రుఁడు, అమరేశ్వరుఁ డని యే గాని పుత్రుఁ డెవ్వఁడో యీగ్రంథమునఁ గవి చెప్పలేదు. అతఁడు లేఁబ్రాయమున మరణించెనో లేక యప్రసిద్ధుఁడై యుండెనో కారణ మూహింపఁజాలను. మనుమఁ డగునమ

రేశ్వరునకు, అన్నయ, సింగయ యనునిద్దఱు కుమారులు. ఇందలియన్నయ ము ప్పదియిద్దఱుమంత్రులచరిత్రమున వర్ణింపఁబడియున్నాఁడు.

సీ. ఘనదానకర్ణుఁడై గండపెండెము దాల్చెఁ గొఱవియన్నామాత్యకుంజరుండు

క. హరి సిరిని వలచు సిరియును, నరుమగ హరిఁగోరుఁగొఱవియన్నయయెప్రుడున్
వరకీర్తిసతినివలచును, వరుసన్ వరకీర్తి యతని వలచు సతతమున్.

మున్నగుపద్యములం బట్టి యీయన్నయమంత్రి మహోదాత్తుఁడైన ట్లున్నది. అట్లున్నను గవి తననాఁటికి దూర మగుట యుఁ దాను, అన్నయ్యతమ్ముఁ డగుసింగయశాఖలోనివాఁ డగుటయుఁ గాఁబోలు నాతనిని గూర్చి, యీకావ్యమున విశేషముగాఁబ్రశంసింపలేదు. కాని యాతనిపుత్త్రుఁ డగు పెద్దిరాజునుగూర్చి పల్లెకొండ జనపాలుఁ డగుమల్లనదేవరాజుచేఁ గుంచెలు, నందలములు, నెల్లియుఁ గైకొన్నవాఁ డని ప్రశంసించెను. గోపరాజున కితఁడు పెద్దముత్తాత.

ఇఁకఁ దనముత్తాత యగుసింగయను గూర్చి విశేషించి చెప్పలేదు. ఈసింగనకు అబ్బయ, గోపయ, సత్తెనారన, యనుముగ్గురు కొడుకులు గల రనియుఁ, దనతాత యగుగోపరాజునకు నన్న యగు అబ్బయకొమాళ్లు రామరాజు, కేసన, బాచిరాజు- అనువారలు ముగ్గురును- అనపోతకుమారసింగయకు మంత్రులుగా నుండిరనియుఁ జెప్పెను. (చూ. ౧-౪౮) వెన్నామాత్యునికి నాఱవతరములోనివా రగుటచే వీరు ముగ్గురును నించుమించుగా ౧౪౦౦ దాఁక నుండి యుందురు.

వెన్నయ... ... ... ...౧౨౨౦ దాఁకను
ఆపై ౨౦ ఏండ్లే యతనిపుత్త్రునికాలము చూచుకొన్నను ౧౨౪౦ దాఁకను,
తరువాతఁ బౌత్త్రుఁ డగు నమరేశ్వరునికాలము- ౧౨౮౦ దాఁకను,
నాల్గవతరములోని యన్నయసింగయలకాలము- ౧౩౨౦ దాఁకను,
అయిదవ తరమగు పెద్దిరాజు, అబ్బయ, గోపనార్యుఁడు, సత్యనారనయు- ౧౩౬౦ దాఁకను,

ఉండియుందురు. ఇవలిపెద్దిరాజు కొడుకు లగు రామరాజు, కేసన, బాచిరాజులు ౧౩౬౦ మొదలు ౧౪౦౦ దాఁక నుండు రనుటకు సందియము లేదుగదా! ఏకశిలానగరాధిపతి యగురేచర్లసింగమ నాయనిపుత్త్రుఁడు 'అనపోతనాయుఁ డనియు, నతనిపుత్త్రుఁడు రెండవసింగమనాయుఁడు (౧౩౮౦—౧౪౦౦) దాఁక నున్నాఁడనియునాంధ్రవాఙ్మయసంగ్రహకారునిసిద్ధాంతము! ఈయనపోతసింగయకే రామరాజాదులుమంత్రులైయుందు రని సమకాలికత్వమును బట్టి నిశ్చయించుటసుసాధము.

ఆరామరాజాదులకు సమానతరములోనివాఁడగుకసువరాజును నించుమించుగా ౧౨౩౦ సంవత్సరముల ప్రాంతములోనివాఁడు కావలసివచ్చును. (ఈకసువరాజు మనకవికిఁదండ్రియనియు 'రాణామల్లనరేంద్రునకుఁబరమగురుఁడై శైవాచారప్రథమసింహాసనాసీను లైనబ్రహ్మదేవయొడయల కూఁతుఁ గామాంబికయను కామినీరత్నంబుఁ బరిగ్రహించి వేముగల్లునివాసియై యుండె ననియు నిందుఁ జెప్పఁబడియె.)

కావున నీకవి ౧౨౮౦ దాఁటియే జీవించియున్నాఁడనవచ్చును. ఏమనఁ బూర్వకవిస్తుతియందు, 'అనఘు హుళక్కిభాస్కరు మహామతిఁ బిల్లలమఱ్ఱి వీరరాజును......అనుటవలనఁ బిల్లలమఱ్ఱి వీరభద్రునికిఁ దరువాతివాఁడని యనుమానము కల్గవచ్చును. కాని సమకాలికుఁడనినను సరిపడును. క్రీ. శ. ౧౨౩౦ లోని వెన్నామాత్యుని కేడవతరమువాఁడగునీగోపరాజు ౧౨౮౦ ప్రాంతముదాఁక నుండవచ్చును గదా! ఒకతరమున హెచ్చినను, నొకతరమునఁ దగ్గినను దరమునకు ౨౦ సంవత్సరముల చొప్పునఁ గదా చరిత్రకారులు కాలనిర్ణయము చేయుచున్నారు. కావునఁ బిల్లలమఱ్ఱి వీరనకు సమకాలికుఁడు కావుట నిశ్చయ మనవచ్చును. ఇఁకఁ, గవులచరిత్రములోని పదియేడవశతాబ్దమనుసిద్ధాంతము స్థూలదృష్టితోఁ జేసినదేమో యనిపించుచున్నది. రాణామల్లనను గూర్చియును, వెన్నామాత్యుని గూర్చియు, వ్రాసినట్లే యీకాలనిర్ణయమును, నట్లే యందుఁ జేయఁబడినది.

ఈతఁడు ప్రసంగవశమున నాల్గవయాశ్వాసములోఁ జెప్పిన ఛందస్సందర్భమునఁ బనుమూఁడువళ్లు తెల్పినాఁడు. భీమునకాలమునాఁటికిఁ బదియే కలవు; అనంతునినాఁటి కిరువదియైనవి. ఈతఁడు భీమునపద్యభాగములనే వాఁడినాఁడు. ఇదియు నాలోచింపవలసినదే.

నవమాశ్వాసమున 69 వ పుటలో ౧౦౫ వ పద్యముతరువాత రెండు పద్యము లర్థముకానివి కలవు. ఈరెండుపద్యములకు రెండువిధము లగుపాఠములు దొరకినవి. వాని నీక్రిందవ్రాయుచున్నాఁడను. ఎచ్చట నైన సరియైన పాఠము దొరకినయెడఁ బ్రచురించి యీకొఱంత దీర్తురుగాక యని విద్వల్లోకమును గోరుచున్నాఁడను.

ఆ. తొలుపుతీరములు మెరుపులు వంకమోళ్లు, తిలలు జవ్వడీలు తీపివేళ్లు
తెక్కములుచమనుచు లిక్కొట్టిపుడుకుచు, గొందినిడక తెంపు లెందుఁగలవు.

క. పుడుగులలోఁ జట్టుముగా, నడవలు గ్రామములు తవులు నాదంబులు నం
గడపుగ నెరయఁగఁ బాలే, ర్పడ...అయ్యె లిట్టి వడనివి నిలిపెఁ.

అనికొన్ని ప్రతులు. వీనికేపాఠాంతరము లిట్లు గలవు.

ఆ. తెలుపు విరము మేరుపులు వంకమోరలు, తిలలు జప్పటీలు తీపివేళ్లు
లెక్క మలుచమునుచు దిక్కొటి యుడుగుచు, గొంది నిడక కెంపు లెందుగమ్మె

క. పుడువులలోఁ జట్టుముగా, నడవలుగామములు నాతంబులు నం
గడవు నెఱుంగం బా లే,ర్పడ సిద్ధి గలవయ్యె వృద్ధి పాడనివిప్పే.

వేఱొకవ్రాఁతప్రతిలో—

గీ. తొలుపుతిరములువంకమోరలుపరపులు, తెల్లలును చప్పటాలును తీవెవేళ్లు
లెక్కమలుచమ్మనుచును దాపెక్కుపుఱుగు, గొందువిడువక వేగెంపులెందుగొమ్మ

క. పుడుగులలో బుట్టముగా, నడవలు గామములు దపులు నాంతంబులునం
గడము నెరయంగ బాకీ, ర్పడ సిద్ధికయయ్యె విద్య వడసివినిలిపెఁ.

ఈపద్యము లెవ్వరును నేనిఘంటువునను వాడియు నుండలేదు.

కృతిసమర్పణము:—ఈకవిశిఖామణి తనకావ్యమునకు శివకేశవుల నుభయులను గృతిపతులనొనర్చినాఁడు. తిక్కనసోమయాజి నాచనసోమనలవలెహరిహరులనుభయులనుసమానభక్తితో సేవించినయద్వైతి. అందునను 'తథాపిభక్తి స్తరణేందుశేఖరే' అనినట్లు తొలుత శివస్తుతితో నారంభించినాఁడు. మఱియునాశ్వాసాంతపద్యములందొకపద్యము హరసంబోధనములతోను, నొకటి హరిసంబోధనములతోను, వేఱొకటి హరిహరసంబోధనములతోను ముగించుచువచ్చెను.

భోజుఁడు సింహాసన మెక్కుటకై ముప్పదిరెండుమాఱులు వచ్చునప్పుడను హరినో హరునో ధ్యానించుచు వచ్చినట్లు ప్రతికథమొదటను ద్వితీయాం[illegible]ములతో లలితమగునచ్చతెలుఁగుపదములతో నొక్కొక్కపద్యము నెలకొల్పెను

హరిహరులను సమానముగా ధ్యానించుట తిక్కన కవీంద్రునిమార్గమే యయ్యెను, భిన్నభిన్నముగా వర్ణించి హరిహరుల నేక మొనర్చి ముగించుచ వచ్చురీతి నాచనసోమనార్యుని యుత్తరహరివంశద్వితీయాశ్వాసమునందలి హ[illegible] హరస్తవమును స్మరణమునకుఁ దేకమానదు. కథలయందు సందర్భానుసారముగ అంబికను, సూర్యునిగూడ సరసముగా స్తుతించియున్నాఁడు. కేవలము భక్తితత్త్[illegible]రుఁడై శివకేశవాత్మక మగుభగవంతునే కృతిపతి నొనర్చి యీకవి తాను ధన్యు[illegible]డగుటయే కాక లోకమునుగూడ ధన్య మొనర్చిన మహానుభావుఁడు. మఱియ

నాశివకేశవుల వర్ణించుపట్ల మృదువైన వ్యంగ్యముతో భావనాపటిష్ఠత వెల్లడించెను. అదియే కదా కావ్యమునకు జీవము ! చూడుఁడు.

చ. పులుఁగులపెద్దవారువము పోటరిబిడ్డఁడు ఱాఁగరౌతు పా
ములగమికాఁడు సెజ్జ నలుమోములవాఁ డిలుదీర్చుపట్టి వే
ల్పులు బలుబంటు లాకమలపొల్తుక తెల్లనితల్లి పెద్దకో
డ లనుచు నెల్లవారుఁ బొగడం దగునల్లనివేల్పుఁ గొల్చెదన్. ౧. ౨.

క. వెలిపట్టును బలితోలును, మలయజమును బూదిపూఁత మణులున్ ఫణులున్
దిలకము నెఱగన్నుంగల, వెలఁదియు మగవాఁడు నైనవేల్పుం దలఁతున్. ౭. ౧౧౫.

ఇఁక విక్రమార్కచరిత్రమును రచించినజక్కనకవి యీతనిని గాని యీగోపరాజు జక్కనను గాని స్మరియింపకపోవుటవలన నొకరిగ్రంథము లొక రెఱుఁగరని యనుకొనవలసి యున్నది. జక్కన ౧౪౧౦—౨౦ సం. లలో విక్రమార్కచరిత్రము రచియించినాఁ డని కవులచరిత్రము తెల్పుచున్నది. జక్కన యీకవికంటెఁ గొలఁదిపాటి ముందుకాలమువాఁడే కావలెను. ఆతనికంటె మిన్నగాఁ జెప్పఁ దలంచినట్లు ను నిందుఁ గానరాదు. కవిత్వతారతమ్యములు చూచిన యెడల నీకవి జక్కనకుఁ గొంచెపాటి వెనుకవాఁడే యగును. ఆతనివలె నిమిడికగఁ జెప్పఁగలకవి యరుదు. ఆకవిత్వమునుం దీకావ్యము కొంచెము వన్నె తగ్గి యిమిడిక లేనట్లుండకమానదు. అంతమాత్రమున నియ్యది గౌరవపాత్రము కాకపోదు—మెలిచిన రత్నములహార మొకటి, విరిసినమల్లెపూవులచెండ యొకటి. దాని తేజస్సు, దీనిపరిమళమును మనోహరములే ! సహజమైన శైలితో లలితము లగు జాతీయములతో మనోహరము లగువర్ణనలతో నీకావ్యము ప్రాచీనకావ్యములలోఁ బ్రశస్తి గాంచి మించినదే. జక్కనగోపరాజుల కవితాశైలుల భేదము విచరింపఁ బూనినచో గ్రంథవిస్తర మగు నని విరమించుచున్నాను. అయ్యది ప్రత్యేక మొకవ్యాసముగా వ్రాసి ముందుప్రకటింతును.

వెంపరాల సూర్యనారాయణశాస్త్రి.

---

# విజ్ఞాపనము.

---

పాఠకమహాశయులయాదరమున భాషాభిమానులకృపవలన సింహాసనద్వాత్రింశిక ప్రథమభాగము (మొదటియైదాశ్వాసములు) పూర్తియైనది. ఇప్పటికిఁ బంరెండాశ్వాసములును సమగ్రముగాఁ బ్రకటింపఁగలిగితిమి. అనేక ప్రతు లుపలబ్ధములైనను దప్పు లన్నిటిలోను సాధారణ్యమును వహించినవి. సందేహము లన్నిటిలో సందేహము లే యైనవి. అనర్థకపాఠభేదములు మెండుగాఁ గలవు. అన్నిటిని జూచి యవసరమైన పాఠములను, భేదములను మూలముననుబుటల క్రిందనను జేర్చినారము. సందర్భశూన్య మైనవానిని బొత్తిగా విడిచిపెట్టితిమి. కొన్ని చెప్పవలసినముఖ్యవిషయములు రెండవభాగము మొదటఁ జెప్పియున్నాము. కావున విశేషించి యిచటమరలఁజెప్ప లేదు.

ఈగ్రంథమును మేము ప్రచురించుటలో సాయపడిన పలువురుపండితులకును దమవ్రాఁతప్రతి నెరవిచ్చిన మ. రా. శ్రీ పోతాప్రెగడ బ్రహ్మానందరావుపంతులుగారికిని సమగ్రగ్రంథమునకు యథామతిం బీఠికరచియించి యొసంగిన బ్ర. వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారికిని మే మెంతయుం గృతజ్ఞులమై వందనశతంబు లర్పించుచున్నారము.

ఇట్లు,
ఆంధ్రసాహిత్యపరిషత్కార్యదర్శులు.

---

## ఆంధ్రసాహిత్యపరిషత్తు—ప్రతిష్ఠాపకులు.

శ్రీరాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారావుబహద్దరువారు, పిఠాపురము మహారాజా వారు. పరిషద్వ్యవస్థాపకాధ్యక్షులు.

కీ. శే. శ్రీ వేంకటగిరి మహారాజావారు.

## ఉద్ధారకులు.

శ్రీరాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు- ఉయ్యూరు జమీందారువారు.

కీ శే. శ్రీబొబ్బిలి మహారాజావారు.

## ఆంధ్రసాహిత్యపరిషత్కార్యనిర్వాహకవర్గము.

## కార్యనిర్వాహకసభాధ్యక్షులు.

జయంతి రామయ్యపంతులుగారు బి. ఏ., బి. ఎల్.

## కార్యదర్శులు.

కిళాంబి రాఘవాచార్యులుగారు ఎం. ఏ., బి. ఎల్.

వింజమూరి వెంకన్న పంతులుగారు ఎం. ఏ.

## కార్యనిర్వాహకసభాసభ్యులు.

దివాన్ బహదర్ కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తి నాయఁడుగారు, (కోశాధ్యక్షులు.)

పెద్దాడ రామస్వామిగారు, ఎం. ఏ.

చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు.

కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రి గారు.

శ్రీమాన్ గొడవర్తి జగన్నాథస్వామిగారు, ఎం. ఏ., ఎల్. టి.

దర్భా వేంకటశివరామసరాసుగారు, బి. ఏ., బి. యల్.

అళిక్కి వేంకట్రామయ్యగారు.

కేశవరపు కామరాజుగారు.

కోశా వేంకటసుబ్బారావునాయఁడుగారు.

ఓలేటి వేంకటరామశాస్త్రిగారు, శతావధాని.

పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులుగారు.

పిళ్ళారిసెట్టి రంగబ్రహ్మరావునాయఁడుగారు.

